# ఆంధ్ర వాఙ్మయారంభ దశ

నన్నయ భారతము

By

వేంకటావధాని దివాకర్ల

# అంకితము

ఎవరి యార్ద్రిత నన్ను మానవునిఁ జేసె
నెవరి యెడఁదలు గుణములకెల్ల నెల్ల
లా మదుత్తమ పితరుల కంకిత మిది
అనఘ వేంకాంబికా సుందరాభిధులకు.



# తొలిపలుకు

పి. హెచ్. డి. పట్టమునకై నే నుస్మానియా విశ్వవిద్యాలయమునకు సమర్పించిన పరిశోధన వ్యాసము నందలి రెండవ భాగ మీ "నన్నయ భారతము." మొదటి భాగము 'ప్రాఙ్నన్నయయుగ' మను పేర వేఱుగా ముద్రింపఁబడినది. నన్నయ భట్టారకుని భారత రచనకు సంబంధించిన విషయములును, అందలి కవితా వ్యాకరణ చ్ఛందో విశేషములును ఇందు వివరింపబడినవి.

నన్నయ తెనిఁగించిన సంస్కృత భారత ప్రతి యేదో నిర్ణయించుటకై చాల శ్రమపడి యుంటిని. పూనా భండార్కరు ప్రాచ్యపరిశోధన సంస్థ వారు ప్రచురించిన భారతమునుబట్టి, ప్రతి భేదములందలి పాఠములను గుర్తించి, యా నిర్ణయము చేయ యత్నించితిని. ఆ సంస్థవారు సేకరించిన ప్రతులలోఁ గూడ నన్ని ప్రతులను జేరినట్లు లేదు. అందుచే, నన్నయ యే సంస్కృత భారత ప్రతి ననుసరించి యుండెనో యిదమిత్థ మని చెప్పుట కవకాశము లేక పోయినది. కాని యా గ్రహించినస్క భారతమునకు సన్నిహితముగా నున్నవానిని మాత్రము గుర్తింపఁజాలితిని. భిన్నములైన యాప్రతులను అందలి పాఠభేదములను బరిశీలించుటకే సుమారు రెండేండ్లు పట్టినది.

నన్నయ భారతము నే పరిస్థితులలో వ్రాసియుండెనో తెలియుటకై యా నాఁటి సాంఘిక మత రాజకీయ పరిస్థితులను గూర్చి యొక ప్రకరణము వ్రాసితిని. అందుకు శాసనములకును నన్నయ భారతమునకును తోడా కాలమును గూర్చి చరిత్రజ్ఞులచే వ్రాయఁబడిన గ్రంథములను గూడ నాధారముగా గ్రహించితిని.

నే నీ వ్యాసము వ్రాయు సందర్భమున సర్వవిధముల మార్గదర్శకులైన ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము గారికిని, తోడ్పడిన బహుగ్రంథముల రచయితలకును నా కృతజ్ఞతా వందనములు. వ్రాఁత ప్రతి వ్రాయుటలో సాయ మొనరించిన చిరంజీవులు గూడ వేంకటసుబ్రహ్మణ్యము, తిరుపతయ్య, సుప్రసన్న, శివరామకృష్ణ శాస్త్రి, అరిపిరాల విశ్వనాధము గార్లకు నా ఆశీర్వచనములు.

ఏతద్గ్రంథముద్రణమునకై యుదారముగఁ దోడ్పడిన ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వము వారికిని, మంత్రి వర్గము వారికిని, అధికారులకును, ఈ సందర్భమున నత్యంత సహకారమొనరించిన శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికిని, శ్రీ పుల్లాభట్ల వేంకటరామశర్మ గారికిని నా హృదయ పూర్వక వందనములు. శ్రద్ధాభిమానములతో గ్రంథమును ముద్రించి యిచ్చిన శ్రీ అమరావతి ప్రెస్సు వారికి నా కృతజ్ఞతలు.

—దివాకర్ల వేంకటావధాని.

## ఏతద్గ్రంథ రచనమునఁ దోడ్పడిన గ్రంథములు

1. భండార్కరు సంస్థవారు ప్రకటించిన సంస్కృతభారత పర్వములందలి యుపోద్ఘాతములు.

2. నన్నయగారి ప్రసన్న కథా కలితార్థయుక్తి - కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు.

3. కవిత్రయకవితా విమర్శనము - శ్రీ గుట్టం వేంకట సుబ్బారామయ్య గారు.

4. ఆంధ్ర భారత కవితా విమర్శనము - శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు.

5. దేశీ-దక్షిణ దేశభాషా సారస్వతము — ,,

6. ఆంధ్రభాషా చరిత్రము - కీ. శే. చిలుకూరి నారాయణరావు గారు.

7. ఆంధ్ర భాషావికాసము - ఆచార్య శ్రీ గంటి జోగి సోమయాజి గారు.

8. ఆంధ్ర మహాభారతోపోద్ఘాతము.
9. ఆంధ్ర భాషానుశాసనము
   } అభినవ వాగనుశాసన శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు.

10. ఆంధ్ర వ్యాకరణసంహితా సర్వస్వము
11. చింతామణి విషయ పరిశోధనము
   } కళాప్రపూర్ణ వజ్ఝల చిన సీతా రామస్వామిశాస్త్రి గారు.

12. ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలు

13. Eastern Chalukyas of Vengi - శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్య గారు.

14. మహాభారతోపన్యాసములు - ఆంధ్ర సారస్వత పరిషత్తు

15. శాసన పద్యమంజరి-ఆంధ్ర సాహిత్య పరిషత్తు.

16. రాజరాజనరేంద్రుఁడు - కీ. శే. భావరాజు వేంకటకృష్ణారావు గారు.

ఇతర గ్రంథములు, వ్యాసములు ఆ యా సందర్భములం దధోదీపికలలోఁ బేర్కొనఁ బడినవి.

# విషయ సూచిక

# నన్నయ భట్టు.

వేదనిగూఢతత్త్వము భువిం బ్రచురించిన పంచమాగమం
బాదిమభాషలో రచిత మౌటఁ దదర్థవిచారమూఢులై
యే దెవ రెట్టు లాడిన గ్రహించెడి యాంధ్రుల నుద్ధరింప నా
శ్రీదము వేదముం దెనుఁగు చేసిన నన్నయభట్టుఁ గొల్చెదన్.

వ్యాకృతి రూపసంపద పదాదికవిస్తృతి ఛంద మేమియున్
లేక యసంస్కృతమ్మును ననిశ్చితరూపము నౌ తెనుంగుకున్
శ్రీకలితమ్ము మంజుపదచిహ్నిత మర్థగభీర మైన ర
మ్యాకృతి తీర్చి కర్కశశిలావళిఁ గట్టితి రత్నసౌధమున్

వివిధామ్నాయపురాణశాస్త్రగతసంవిన్మూర్తి వౌ నీవు స
త్కవితాసక్తుఁడ వౌట వేదమతరక్షాబద్ధ తాత్పర్యుఁ డై
యవనీపాలశిరోవతంసము చళుక్యక్షోణిపాలుండు నీ
కవలంబం బిడియుంట యాంధ్రజనభాగ్యం బై ఫలించెం గదా

సురగీరబ్ధి చిరత్నరత్నములు మాంజుల్యోజ్జ్వలాచ్ఛాంధ్రభా
స్వరవాఙ్మౌక్తిక పుంజముల్ శ్రుతి హరచ్ఛందంపు సూత్రాన సుం
దర మౌ రీతిని గ్రుచ్చి భారత కథానవ్యస్రజం బజ్జ భూ
తరుణీకంఠ మలంకరించితివి వింతల్ నేఁటికిం దత్ప్రభల్

రస మమృతంబు గాఁగ మధురంబులు వాక్యపదాళు లూర్మికా
విసరముగాఁ గథాప్రతతి ద్వీపసముచ్చయమై రహింపఁగా
నసదృశ భావముల్ ప్రసరదాంతర వేణులు గాఁగ భారతో
ల్లసిత మహాసుధాపగ వెలార్చితి వాంధ్రవసుంధరాస్థలిన్.

ఆంధ్ర భూభృజ్జైత్రయాత్రా ప్రధానాంగ భద్రదంతావళ ప్రభుల
నడలు
గోదావరీ మహాకూలంకషోచ్చలత్కల్లోల ఘట్టనోద్గతరవములు
త్రైలింగ భూతలోద్యానవాటీ లతా ప్రసవవిర్గత మరుత్పరిమళములు
విద్విషత్కంధరా విచ్ఛేదన ప్రవీణాంధ్ర సైనిక కృపాణాంచలములు
నొక్క టొక్కటిగా విల్చి యుండు నెదుట
గరువతనమును మాధుర్య గౌరవమ్ము
హృదయహారిత్వ మౌజ్జ్వల్య మీవు కావ్య
మందు నెల్లెడఁ గూర్చెదు నట్టి వేళ.

ఒక చింతామణి నీవు వ్రాసితివా లేదో యంచు విద్వాంసు లూ
రక వాదంబులపైని వాదము లొనర్పం జింతయౌ నాంధ్రమం
దకలంకంబుగ నీవు వ్రాసిన కృతిన్ సార్ధత్రి పర్వంబునన్
బ్రకటత్వంబు వహింపవే శతసహస్ర ప్రాజ్యచింతామణుల్

మతిమంతుల్ కవిపండితుల్ సుకవితా మాధుర్యముం గ్రోలఁగా
వితరుల్ వీనులవిందు లక్షరములం దేపారు రమ్యత్వమున్
స్తుతియింపన్ రచియింతు భారతము నంచుం దొల్తఁ జేకొన్న యా
ప్రతినం దీర్చితి వక్షరాల రుచిరార్థ శ్రీలసద్ది నిధీ!

పాత్రల చిత్తవృత్తుల స్వభావ మెఱింగి రసాకరమ్ము లై
యాత్రము గొల్పు సంఘటన లద్భుతరీతి సృజించి దృశ్యముల్
నేత్రపురః ప్రదేశమున నిల్పుచు వ్యర్థపదాలు వాడకే
చిత్రముగాఁ గథారచన చేయుట నీ దగు సొమ్ము ధీమణీ

శ్రవణానంద కరధ్వని ప్రచితముల్ సంస్కార సంపూర్ణముల్
నవనీతాభము లైన శబ్దముల విన్యాసమ్ముచే నొప్పు నీ
కవనం బా తొలిపల్కు బుక్కులవలెన్ గమ్రమ్ముగా మ్రోయు నౌ
నవగాథత్రయి పైన నీ నుడులయం దాశ్చర్యమే తద్ధ్వనుల్.

యౌవనమందు మత్తగజయానము కన్నెల కబ్బు నంచు సం
భావన చేయు చంద్రు కవివర్యులు నీ మహనీయ శిక్షణ
శ్రీవిభవమ్ముచే సుకవిశేఖర పుట్టియుఁ బుట్టకుండనే
యావిలసద్గతి క్రమము లబ్బిన వాంధ్ర కవిత్వ కన్యకున్.

ఆదర మొప్ప నీ రచన మంత పదింబదిగాఁ బఠించి త
త్స్వాదు కవిత్వమాధురు లెదం గదియించిన తిక్కయజ్వ వి
ద్యాదయితుండ వంచు మహితాత్ముఁడ వంచు నిను న్నుతింపఁగా
మూదలగా గ్రహింపరు ప్రబుద్ధులె కొందఱు నీకుఁ బొచ్చెమే?

ఎట్టెటులో శ్రమంపడి యహీనమతిప్రభఁ దెల్గుకైతకున్
బట్టగు కావ్యసౌధము పునాదులు తీర్చితి సుస్థిరంబుగాఁ
గట్టిరి దానిపై సొగసుఁ గట్టడముల్ కవిరాజు లంత నీ
పెట్టిన భిక్ష గాదె సుకవి ప్రకర ప్రణుతోక్తి వైభవా!

---

# 7. నన్నయ అనువదించిన సంస్కృత భారత ప్రతి

నన్నయ రాజరాజనరేంద్రు నానతిచేఁ గృష్ణ ద్వైపాయన ముని వృష భాభిహితమైన మహాభారతము నందలి యర్థ మేర్పడునట్లుగా భారతమును దెనుఁగున రచియించెను. ఈ కృష్ణద్వైపాయనుఁడు సత్యవతీ పరాశరులకు జన్మించిన పుత్త్రుఁడు. చిత్రాంగద విచిత్రవీర్యు లనపత్యులై మరణించుట చేతను, భీష్ముఁడు తండ్రి నిమిత్తమై పెండ్లి యాడనని ప్రతిన చేయుట చేతను, గురు వంశ మవసన్నమై పోవుచుండఁగా సత్యవతీ భీష్ముల ప్రార్థన ననుసరించి అంబి కాంబాలికల యందు ధృతరాష్ట్ర పాండురాజుల నుత్పాదించి, తద్వంశ వివృద్ధి కవకాశ మేర్పఱిచిన మహానుభావుఁడు. ఆతఁడు తొల్లి యేకీభూతములై యేర్పడకున్న వేదములను ఋగ్యజుస్సామాథర్వములుగా విభాగించి, తన శిష్యు లైన పైల వైశంపాయన సుమంతు జైమినులచేఁ గ్రమముగాఁ జతుర్వేద సూత్రములఁ జేయించి, వేద వ్యాసుఁడని ప్రఖ్యాతి గాంచెను. తరువాత బ్రహ్మచే ననుజ్ఞాతుఁడై యతఁడు పంచమ వేదమని ప్రసిద్ధి నొందిన మహా భారతేతిహాస మును నిర్మించెను. అష్టాదశ పురాణములను బ్రహ్మ సూత్రములను గూడ రచించినవాఁ డితఁడే యని ప్రతీతి. ఇందలి యాథార్థ్యమును గాని, యాతఁడు భారతము నెప్పుడు రచించెనను విషయమును గాని నిశ్చయించుట సులభ సాధ్యము కాదు. శ్రీ సి. వి. వైద్యగారు తమ సంస్కృత వాఙ్మయ చరిత్రమున (పుట 1-13) వ్యాసుఁడు భారత యుద్ధానంతరము క్రీ. పూ. 3102 లో మహా భారతమును రచించెననియు, వైశంపాయనుఁడు దానిని క్రీ. పూ. 1400—1200 మధ్యకాలమున జనమేజయునకు వివరించి యుండు ననియు, క్రీ. పూ. 250 ప్రాంతమున సూతుఁడు నైమిశారణ్యమున శౌనకాదులకుఁ జెప్పి యుండుననియు, సూత వైశంపాయను లిరువురును గ్రంథ ప్రాధాన్యమును గుర్తాకరించుటకై కల్పింపఁబడిన వ్యక్తులనియు వ్రాసియున్నారు. కాని మహాభారతముననే ఆరంభ మున లభించుచున్న వృత్తాంతమును బట్టి చూడ నీ కాలనిర్ణయ మసంబద్ధముగా గోచరించుచున్నది. ఏలయన దానిని బట్టి వ్యాస వైశంపాయన సూతులు మువ్వు రును సమకాలికులని స్పష్ట మగుచున్నది. వ్యాసుఁడు ధృతరాష్ట్ర పాండు విదు

రుల నుత్పాదించి తపశ్చరణమునకై తిరిగి యాశ్రమమున కరిగెనవియు, వారు వృద్ధులై పరమపదించిన పిదప, మనుష్య లోకమున మహాభారతమును జెప్పె ననియు, సర్పయాగ సందర్భమున జనమేజయుని చేతను బ్రాహ్మణుల చేతను బ్రార్థితుఁడై యంతికాసీనుఁడైన వైశంపాయనుని వారికి భారతము నెఱింగింప నాజ్ఞాపించెననియు, నతఁడు సదస్యులతోఁ గూర్చుండి యజ్ఞ కర్మాంతరము లందుఁ బునః పునశ్చోద్యమానుఁడై భారతమును వారికి వినిపించె ననియుఁ బ్రథమాధ్యాయమునఁ జెప్పఁబడి యున్నది.[1] అచ్చట వైశంపాయి నోక్తము లైన విచిత్రార్థములును మహాభారత సంశ్రితములు నైన కథలు విని, పిమ్మట బహు తీర్థములు సేవించి, కౌరవ పాండవులకు యుద్ధము జరిగిన సమంత పంచకక్షేత్రమును దర్శించి రోమహర్షణుని పుత్త్రుఁడును ఉగ్రశ్రవోఽభిధానుఁడు నైన సౌతి నైమిశారణ్యమునందలి ఋషుల దర్శించుటకై యరుదెంచెను. వారతని కుశలమడిగి, యాతనివలన నతఁడు విన్న కన్న విశేషముల నెఱింగి, ద్వైపాయనాజ్ఞచే వైశంపాయనుఁడు జనమేజయునికిఁ దెల్పిన భారత సంహి

1. ఉత్పాద్య ధృతరాష్ట్రం చ పాండుం విదుర మేవ చ
జగామ తపసే ధీమాన్ పున రే వాశ్రమం ప్రతి
తేషు జాతేషు వృద్ధేషు గతేషు పరమాం గతిమ్
అబ్రవీ ద్భారతం లోకే మానుషే ఽస్మిన్ మహా నృషిః
జనమేజయేన పృష్ట స్సన్ బ్రాహ్మణై శ్చ సహస్రశః
శశాస శిష్య మాసీనం వైశంపాయన మంతికే
స సదస్యై స్సహాసీనః శ్రావయామాస భారతమ్
కర్మాన్త రేషు యజ్ఞస్య చోద్యమానః పునః పునః I-I-54-58
జనమేజయస్య రాజర్షేః సర్పసత్రే మహాత్మనః
సమీపే పార్థివేంద్రస్య సమ్యక్పారిక్షితస్య చ
కృష్ణద్వైపాయన ప్రోక్తాః సుపుణ్యా వివిధాః కథాః
కథితా శ్చాపి విధివ ద్యా వైశంపాయనేన వై
శ్రుత్వాహం తా విచిత్రార్థా మహాభారత సంశ్రితాః
బహూని సంపరిక్రమ్య తీర్థా న్యాయతనాని చ
సమంత పంచకం నామ పుణ్యం ద్విజనిషేవితమ్
గతవా నస్మి తం దేశం యుద్ధం యత్రాభవ త్పురా
పాండవానాం కురూణాం చ సర్వేషాం చ మహీక్షితామ్
దిదృక్షు రాగత స్తస్మా త్సమీపం భవతా మిహ I-I-8-12

తను దెల్పుమని యడిగిరి. వారి కోరిక ననుసరించి యతఁ డా కథను వారికెఱిం గింప నారంభించెను. దీనినిబట్టి వ్యాసవైశంపాయన సౌతు లేకకాలమున జీవించియుండిరనియే తెలుచున్నది. వ్యాసుఁడు వేదములను విభజించి మహా భారతమును నిర్మించి యా యైదు వేదములను సుమంతు జైమిని పైల వైశంపా యనులను తన శిష్యులకును గుమారుఁడైన శుకునకును బోధించెను. వారంత భారత సంహితను వేఱువేఱుగాఁ బ్రకాశింపఁజేసిరి.[1] వారేకాక యుగ్రశ్రవసుని తండ్రియైన రోమహర్షణుఁడుకూడ వ్యాసునికి శిష్యుఁడే. అతఁడును వ్యాసమహర్షి వలన భారతమును సమగ్రముగా నెఱింగియుండెను. ఆదిపర్వ పంచమాధ్యాయ మున శౌనకుఁడు సౌతిని భృగువంశ చరిత్రమును జెప్పుమనియడుగుటకు ముం దాతని తండ్రియైన రోమహర్షణునిఁగూర్చి [2] "మీ తండ్రి పురాణములన్నియుఁ బఠించియుండెను. వానియందు దివ్యములైన కథలును ఆదివంశములును జెప్పఁ బడియున్నవి. వానిని మీ తండ్రివలన మేము వినియుంటిమి. ఇప్పుడు మొదట భృగువంశమును గూర్చి వినఁగోరు చున్నా"నని పలికెను. అప్పుడు సూతుఁడు "మహాత్ములైన వైశంపాయనాదులచే నధీతమై యేది మున్ను చెప్పఁబడెనో, యేది నా తండ్రిచే లెస్సగా నధీతమయ్యెనో, దేని నాతనినుండి నే నెఱింగితినో, దానిని జెప్పెద విను"మని పల్కి భృగువంశ చరిత్రము చెప్ప నారంభించెను. ఈ విషయముకూడ వ్యాస వైశంపాయనాదులయు రోమహర్షణోగ్ర శ్రవులయు సమకాలికత్వమును నిరూపించుచున్నది. అందుచే వ్యాసుఁడు భారతమును రచించుటకును, అది వైశంపాయనునిచే సర్పయాగ సందర్భము నను, సర్పయాగానంతరము సౌతిచే నైమిశారణ్యమున శౌనకాదుల

---

1. వేదా నధ్యాపయామాస మహాభారత పంచమాన్
సుమన్తుం జైమినిం పైలం శుకం చైవ స్వ మాత్మజం
ప్రభు ర్వరిష్ఠో వరదో వైశంపాయన మేవ చ
సంహితా సైః పృథక్త్వేన భారతస్య ప్రకాశితాః 1-57-73-75.

2. పురాణ మఖిలం తాత పితా తే ఽ ధీతవా న్పురా
కచ్చి త్త్వమపి తత్సర్వ మధీషే లోమహర్షణే
పురాణే హి కథా దివ్యా ఆదివంశా శ్చ ధీమతాం
కథ్యన్తే తాః పురాస్మాభిః శ్రుతాః పూర్వం పితు స్తవ
తత్ర వంశ మహం పూర్వం శ్రోతు మిచ్ఛామి భార్గవమ్. 1-5-1-8.

సమక్షమునను, బ్రకటింపఁ బడుటకును వ్యవధాన మెక్కువగా నున్నట్లు కనిపింపదు. ఆ కార్యము లొండొంటి తరువాత నవ్యవహితముగా జరిగినట్లే తోఁచుచున్నది.

వ్యాస విరచితమైన మహాభారతమునఁ బాండవుల స్వర్గారోహణము కూడ వర్ణింపఁ బడి యుండుటచే నాతఁ డా గ్రంథమును బాండవుల యనంతరమే వ్రాయ నారంభించిన ట్లూహింపవచ్చును. ఆతఁడు పాండవులకు రెండు తరములు ముందటి వాఁడైనను దపశ్శాలియుఁ జిరంజీవియు నగుటచే వారు పరమపదించిన పిమ్మటఁ గూడఁ జాలకాలము జీవించెనని విశ్వసింప వలసి యున్నది. పాండవుల స్వర్గారోహణమునకు ముందే యభిమన్యు కుమారుఁడైన పరీక్షిత్తు పట్టాభిషిక్తుఁడయ్యెను. ఆతఁడు ముప్పదియాఱేండ్లు మాత్రము పాలించి తన యఱువదవయేట దివంగతుఁ డయ్యెను. అప్పటికి జనమేజయుఁ డల్ప వయస్కుఁ డౌటచే నమాత్యులే రాజ్య వ్యవహారములను నిర్వహించుచుండిరి. తరువాత నుదంకుని వలనఁ దన తండ్రి తక్షక విషాగ్ని హతుఁడై మరణించెనని యెఱింగి జనమేజయుఁడు సర్పసత్రమునకు సమకట్టెను. ఆ సందర్భమున వైశంపాయనుఁడు భారతకథను జెప్పుచుండఁగా వ్యాసుఁడు కూడ సన్నిహితుఁడై యే యుండెను. అసలు జనమేజయుఁడు మొదట భారత కథను జెప్పుమని వ్యాస మహర్షినే అడిగి యుండెను.1 వ్యాసుఁడు తన చెంతఁ గూర్చుండిన వైశంపాయను నాకథఁ జెప్పుమని యాజ్ఞాపించెను. వైశంపాయనుఁ డచ్చట నా యితిహాసమును దెల్పుచుండఁగా నుగ్రశ్రవసుఁడు కూడ విని యుండెను. సర్పయాగము ముగిసిన వెంటనే యాతఁడు తీర్థాటనము గావించి,

---

1. శ్రుత్వా తు సర్పసత్రాయ దీక్షితం జనమేజయం
అభ్యాగచ్ఛ దృషి ర్విద్వా న్కృష్ణద్వైపాయన స్తదా
జనమేజయ స్తు రాజర్షి ర్దృష్ట్వా త మృషి మాగతమ్
ఆసనం కల్పయామాస యథా శక్రో బృహస్పతేః
తత స్తం సత్కృతం సర్వై స్సదస్యై ర్జనమేజయః
ఇదం పశ్చా ద్ద్విజ శ్రేష్ఠం పర్యపృచ్ఛ త్కృతాంజలిః
కురూణాం పాండవానాం చ భవాన్ ప్రత్యక్ష దర్శివాన్
తేషాం చరిత మిచ్ఛామి కథ్యమానం త్వయా ద్విజ

నై మిశారణ్యమున కరిగి, శౌనకాదులచేఁ బ్రార్థితుఁడై వారి కా కథ నెఱింగించెను. ఈ విధముగా భారతేతిహాసము వ్యాసుని జీవిత కాలముననే మూఁడుసార్లు వేఱు వేఱుగాఁ బ్రకటితమైనది. మొదట వ్యాసుఁడు వై శంపాయనాదులకుఁ జెప్పెను. తరువాత వైశంపాయనుఁడు సర్పయాగ సందర్భమున సదస్యులకు నివేదించెను. పిమ్మట సౌతి నై మిశారణ్యమున శౌనకాది మహర్షుల కెఱింగించెను.

ప్రస్తుతము మహాభారతమున లభించుచున్న సాక్ష్యమును బట్టి చూచినచో వ్యాసుఁడు చిరజీవియై జనమేజయుని సర్పసత్త్రము జరిగిన కాలము వఱకును దరువాతను గూడ జీవించెననియే నమ్మవలసి వచ్చును. కాని యాధునికులు మానవుని చిరజీవిత్వమును విశ్వసింపఁజాలమిచే మహాభారత కథనమును యథాక్షరముగాఁ గై కొనక వ్యాసుఁడు మొదట భారత సంహితను జతుర్వింశతి సాహస్రిగనో యంతకంటెను సంగ్రహ రూపముగనో రచియించి యుండు ననియుఁ, దరువాతి నా యా కాలములం దది యుపాఖ్యానాదుల చేర్పుచేఁ బెరిఁగె ననియు, వై శంపాయనుఁడు చెప్పిన భారతమును సౌతి చెప్పిన భారతమును ఆ పరిణామ దశలను సూచించు ననియుఁ జెప్పుదురు. సౌతి "గతవా నస్మి తం దేశం యుద్ధం యత్రాభవ త్పురా" యని పురాశబ్దము నుపయోగించుటయు, "గురో ర్వచన మాజ్ఞాయ, స తు విప్రర్షభ స్తదా, ఆచచక్షే తత స్సర్వ మితి హాసం పురాతన" మ్మని పురాతన శబ్దమును వాడుటయు, నీ యభిప్రాయమునే బలపఱుచు చున్నవి. సౌతి వ్యాసునికి సమకాలికుఁడే యైనచో పురా పురాతన శబ్దములను వాడియుండఁడు. కాని భారతమునందు స్పష్టముగా వ్రాయఁబడి యున్న విషయమును విశ్వసింప కుండుట కింతకంటె బలవత్తరమైన కారణ మేదియుఁ గానఁబడదు.

మహాభారతము శతపర్వ సమన్విత మనియు, శత సహస్ర శ్లోక పరిమిత మనియుఁ బ్రతీతి. కాని యీ విషయమున విద్వాంసులలో భిన్నములైన యభి

---

తస్య తద్వచనం శ్రుత్వా కృష్ణద్వైపాయన స్తదా
శశాస శిష్య మాసీనం వైశంపాయన మంతికే
కురూణాం పాండవానాం చ యథా భేదో ఽభవ త్పురా
తదస్మై సర్వ మాచక్ష్వ యన్మత్తః శ్రుతవా నసి
గురో ర్వచన మాజ్ఞాయ స తు విప్రర్షభ స్తదా
ఆచచక్షే తతః సర్వ మితిహాసం పురాతనమ్ I ౧౫.

ప్రాయములు ప్రబలి యున్నవి. మన కిప్పుడు లభ్యమగుచున్న భారతము పెక్కు ప్రక్షేపములతోఁ గూడి యనేక విధములఁ బెంపు చేయఁబడి నదియు, వ్యాసుఁడు వ్రాసిన మూల భారతము తప్పక యింతకంటె సంక్షిప్తమై యుండుననియు వారి యభిప్రాయము. శ్రీ సి. వి. వైద్యగారం దే విధముగఁ జూచినను ఇరువది నాలుగువేల శ్లోకముల కంటె నెక్కువ యుండి యుండదనియు, మాక్డొనెల్ మున్నగువా రందలి శ్లోకముల సంఖ్య యెనుబది వేల యెనిమిది వందలు మాత్రమే యనియు నభిప్రాయపడి యుండిరి.[1] ఇట్లు వారూహించుటకుఁ దావొసంగినశ్లోకము లీక్రింద నొసంగఁబడుచున్నవి.

1. గ్రంథగ్రంథిం తదా చక్రే ముని ర్గూఢం కుతూహలాత్
యస్మిన్ ప్రతిజ్ఞయా ప్రాహ ముని ర్ద్వైపాయన స్త్విదమ్
అష్టౌ శ్లోక సహస్రాణి అష్టౌ శ్లోక శతాని చ
అహం వేద్మి శుకో వేత్తి సంజయో వేత్తి వా న వా.
*(ఆది. అధ్యా 1. 80-81, 1929 చిత్రశాలా ముద్రణాలయ ప్రతి)*

2. చతుర్వింశతి సాహస్రీం చక్రే భారత సంహితామ్
ఉపాఖ్యానై ర్వినా తావ ద్భారతం ప్రోచ్యతే బుధైః 1. 1. 61.

ఇందు మొదటిది బ్రహ్మగణేశ వృత్తాంతము నందలిది. ఇది ఉత్తర ప్రతులలోఁ గొన్నింటియందు మాత్రమే (K4, 6, Dr) కానవచ్చుచున్నది. దక్షిణ ప్రతులలోను, గొన్ని దేవనాగరీ ప్రతులలోను బ్రహ్మప్రవేశమున్నది కాని గణేశ ప్రసక్తి గోచరించుటలేదు. ఈ విధముగా దక్షిణదేశ ప్రతులందు మృగ్యములై యుండుట చేతను, ఉత్తర ప్రతులలోఁ బెక్కింటఁ (Ko-3, VI, B, Da, DI,) గానరాకుండుట చేతను గణేశ వృత్తాంతమునందలి యీ శ్లోకములు తరువాత నెవ్వరి చేతనో కల్పింపఁ బడినవని చెప్పుటకు సందేహింప నవసరములేదు. 2 అందుచేఁ గల్పితములైన వీనిని బట్టి వ్యాసుఁడు భారతమున వ్రాసిన

---

1. Mahabharata Southern recension Vol. II Intro - Xi.

2. The naive Brahma Ganesa episode the longest as well as the most obvious interpolation in the text of the vulgate, has been relegated to the Appendix. Its spuriousness has now been placed beyond the domain of sane criticism through its absence in Ko-3, VI, B, Da,

శ్లోకముల సంఖ్య యెనుబదివేల యెనుబదియే యనుట సమంజసము గాదు.[1]

ఇంక "చతుర్వింశతి సాహస్రీ" మిత్యాదిగాఁగల శ్లోకము నంతకుఁ బూర్వము గల శ్లోకముతో నన్వయించి చూచినచో భారతమున నుపాఖ్యానములతోఁ గూడ లెక్కించిన శత సహస్రశ్లోకము లుండుననియు, నుపాఖ్యానములను విడిచి లెక్కించిన నిరువది నాలుగువేల శ్లోకము లుండుననియు, నర్థమే వచ్చును గాని మొదట వ్యాసుఁడు వ్రాసిన శ్లోకము లిరువది నాలుగు వేలేయను నర్థము మాత్రము కలుగనేరదు. అట్లర్థము చేసికొనువారి మతమును బట్టి వ్యాసుఁడు మొదట నుపాఖ్యానవిరహితమైన, చతుర్వింశతి సహస్రశ్లోక పరిమితమైన, భారత భాగమునే వ్రాసెననియు, దెబ్బది యాఱువేల శ్లోకములతోఁ గూడిన యుపాఖ్యాన భాగములు తరువాత నందుఁ జేర్పఁబడిన వనియుఁ దలంపవలయును. కాని యుపాఖ్యాన రహితముగా భారత మూర్తిని భావించుట దాని యితిహాసత్వమునకే లోపముకలిగించుట యగును. అందుచేఁ బై శ్లోకము భారతమునందలి శ్లోకముల సంఖ్యను లెక్కించు రెండు పద్ధతులలో నొక పద్ధతిని సూచించు చున్నదేకాని యుపాఖ్యాన రహితముగా భారతమొకప్పు డుండెనను నభిప్రాయమును సూచించుటలేదు.[1] భారతమున రెండు మూఁడుచోట్ల

---

DI, MI. In the Southern Ms. and in some conflated Devanagari Ms. Brahma alone is introduced. In these there is no talk of Ganesa who is unquestionably a late Northern intruder. (Bhandarkar Oriental Research Institute Vol. I. Foreword, Page. VI).

1. Hence the Ganesa episode is indeed a later interpolation which has been fruitful only in misleading even able orientalists into the conjec ure that the original Mahabharata consisted of only 8800 verses and that it had three beginnings, the second beginning being at the stage when it is supposed to have contained only 24000 verses. M. Bh. South. Rec. Vol. 1. Intro. X.

వైశంపాయనుఁడును సౌతియుఁగూడ వ్యాసరచిత భారతము శత సహస్ర శ్లోక పరిమిత మనియే స్పష్టముగాఁ దెల్పియున్నారు.

వైశం : ఇదం శత సహస్రం హి శ్లోకానాం పుణ్యకర్మణాం
సత్యవత్యాత్మజే నేహ వ్యాఖ్యాత మమితౌజసా. 1. 56-13.

సౌతి : ఇదం శత సహస్రాఖ్యం (గ్రం) శ్లోకానాం పుణ్యకర్మణః
ఉపాఖ్యానైః స్సహ జ్ఞేయం శ్రావ్యం భారత ముత్తమమ్
ఆది. అధ్యా. 1. 65

వీనిని బట్టి శతసహస్రశ్లోక పరిమితమైనదియు, నుపాఖ్యాన సహితమైనదియు నగు భారతమునే వ్యాసుఁడు రచించి యుండెనని భావింపవచ్చును.

భారతమునకు జయమనియు, భారతమనియు, మహా భారతమనియు మూఁడు పేర్లు వినవచ్చుచున్నవి. ఈ నామములు భారతమునందలి శ్లోకముల సంఖ్యనుబట్టి యా యా కాలములందుఁ గలిగెననియు, నెనుబదివేల యెనిమిది వందల శ్లోకములతోఁ గూడిన మొదటి రూపమునకు జయమనియు, నిరువది నాలుగువేల శ్లోకములతోఁ గూడిన దానికి భారతమనియు, శతసహస్ర శ్లోక సహితమైన దానికి మహాభారతమనియు నామము లుండెననియుఁ దెల్పు పండిత సంప్రదాయ మొకటి కలదు. కాని యిదియు నిరాధారమైనదే. ఏలయన సౌతి వైశంపాయనుల కాలమునందుఁ గూడ దానికి మహా భారత మనియే పే రున్నట్లు భారతముననే ప్రమాణము గోచరించు చున్నది.

వైశం : భరతానాం మహ జ్జన్మ మహాభారత ముచ్యతే
నిరుక్త మస్య యో వేద సర్వపాపైః ప్రముచ్యతే 1. 56. 31.

---

1. For to think of the Mahabharata without its Upakhyanas is to rob the epic of all its value as an epic. The stanza in question refers only to the two kinds of computation of the bulk of the M. Bh. by dividing it into the story proper and not to the plausibility of the kernel ever having existed as a separate entity without the upakhyanas at all.

South - Rec. - Vol. II. Intro. XX.

సౌతి : మహత్త్వా ద్భారవత్త్వా చ్చ మహాభారత ముచ్యతే
నిరుక్త మస్య యో వేద సర్వపాపైః ప్రముచ్యతే 1. 1. 109.
య ఇమం శుచి రధ్యాయం పఠే త్పర్వణి పర్వణి
అధీతం భారతం తేన కృత్స్నం స్స్యా దితి మే మతిః 1. 1. 106.

సౌతి వైశంపాయను లిరువురును మహా భారతమున కా పేరెట్లు వచ్చెనో పై శ్లోకములలో నిర్వచించి యున్నారు. మఱియు నా కాలముననే దానికి భారతమని కూడఁ బేరుండి నట్లు " య ఇమ " మిత్యాది శ్లోకముల వలనఁ దెలియు చున్నది. అప్పటి కింకను వ్యాసమహర్షి జీవించియే యుండెను. ఆతని జీవిత కాలముననే మహాభారత శ్లోక సంఖ్య తొమ్మిదివేలనుండి శత సహస్రములదాఁకఁ బెరిఁగిపోయె ననుట యుచితము కాదు.

కొంచె మించు మించుగా నన్ని ఉత్తరదేశ ప్రతులయందును దాక్షిణాత్య ప్రతులలో T, G 7 అను వాని యందును వ్యాసుఁడు మొదట నఱువది లక్షల శ్లోకములతోఁ గూడిన భారత సంహితను నిర్మించెననియు, నందు ముప్పది లక్షలు దేవలోకమునందును, బదేను లక్షలు పితృలోకమునందును, బదునాల్గు లక్షలు రక్షోయక్ష లోకము లందును, మిగిలిన యొక లక్షయు మానుషలోకము నందును బ్రతిష్ఠితము లయ్యెననియుఁ దెల్పు కొన్ని శ్లోకములు కనఁబడు చున్నవి. [1] ఈ శ్లోకములు కూడఁ బైని పేర్కొనఁబడిన బ్రహ్మగణేశవృత్తాంతము వంటివే. ఇవి యన్ని ప్రతులలోఁ గానరాకుండుట చేతను, లోకాంతరములకు సంబంధించిన విషయము విశ్వసనీయము కామిచేతను ఈ శ్లోకములు కూడ బ్రహ్మగణేశ వృత్తాంతము వలెనే తరువాత నెవ్వరిచేతనో కల్పింపఁబడినట్టివే యని భావింప వచ్చును.

ఆదిపర్వ ప్రథమాధ్యాయమున సూతుఁడు భారతమును గొందఱు మన్వాదిగను, గొంద ఱాస్తీకాదిగను, గొంద ఱుపరిచరాదిగను బఠించు

1 షష్టిం శతసహస్రాణి చకా రాన్యాం స సంహితాం
త్రింశ చ్ఛత సహస్రం చ దేవలోకే ప్రతిష్ఠితమ్
పిత్ర్యే పంచదశ ప్రోక్తం రక్షోయక్షే చతుర్దశ
ఏకం శతసహస్రం తు మానుషేషు ప్రతిష్ఠితమ్.
B. O. R. I. Vol. I. P. 12 Fn.

చున్నారని భారతమునకు మూఁ డారంభములను సూచించెను.[1] దీనిని బట్టి సౌతి శౌనకాదులకు భారతమును జెప్పనాఁటికే దానికి మూఁ డుపక్రమము లున్నట్లు స్పష్టమగు చున్నది. అవైదికములైన గ్రంథముల సందర్భమున వస్తు సమానత్వ ముండుచో నారంభ భేదమున్నను అంత విప్రతిపత్తి లేదు. నీలకంఠుఁడు తన వ్యాఖ్యానమున వర్ణానుపూర్వియందు భేదమున్నను అర్థములకు సమాన నామరూప క్రమత్వ ముండుటచే భారతారంభమున మత భేదము కనఁబడుచున్నదని తెల్పియున్నాఁడు.[2] ఇచ్చట మన్వాది యనఁగా నీలకంఠుఁడు రెండు విధములైన యర్థములను వివరించి యున్నాఁడు. "మన్వాదీతి మనుర్మంత్రః - నారాయణం నమస్కృత్యేతి - ఓం నమో భగవతే వాసుదేవాయేతివా - తదాది ఇతి ప్రాఞ్చః. దివఃపుత్రో వైవస్వతమహ్యా సంజ్ఞో మనుః తదాదీతి తత్త్వమ్". ఇందు రెండవదే యుక్తముగా నున్నది. సౌతి శౌనకాదులకు భారతకథ చెప్ప నారంభించి ముందు సృష్ట్యారంభమును వివరించెను. అందు దివః పుత్రాదులైన పంద్రెండుగురు వివస్వంతులలో మహ్యుఁడు (సహ్యుఁడని పాఠాంతరము) కనిష్ఠుఁడనియు, నతనికి దేవభ్రాణ్ణాముఁడును, నతనికి సుభ్రా డభిధానుఁడును జనించిరనియు, నా సుభ్రాట్టునకు దశజ్యోతి, శతజ్యోతి, సహస్రజ్యోతి యను ముగ్గురు పుత్త్రు లుదయించిరనియు, వారి కనేకు లాత్మజులు కలిగిరనియు, వారివలననే కురువంశాదు లుత్పన్నము లయ్యెననియుఁ జెప్పఁబడియున్నది. (1-1-40-44). ఇందలి మహ్యుఁడే మనువు. ఈ వృత్తాంతముతో భారత మారంభించు చున్నదని మన్వాది శబ్దమున కర్థము చెప్పవచ్చును. సౌతి శౌనకాదులకుఁ జెప్పునప్పుడు గ్రహించిన యారంభ మిదియే. మహాభారతమునం దనుక్రమణీపర్వసంగ్రహ పర్వములు రెండును మొదట నున్నవి. వీని తరువాతఁ బౌష్యపర్వ మున్నది. ఇది మహాభారతమునందలి యాస్తీక పర్వమున కుపోద్ఘాత ప్రాయ మైనది. ఇందు మొదట నుదంకుఁడు జనమేజయునకు సర్ప యాగాచరణమున బుద్ధి పుట్టించుట వివరింపఁబడినది. 4-12 వఱకుఁగల యెనిమి దధ్యాయములతోఁగూడిన పౌలోమ పర్వమున భృగు

---

1. మన్వాది భారతం కేచి దాస్తీకాది తథాపరే
తథోపరిచరా ద్యన్యే విప్రా స్సమ్య గధీయతే 1 1. 50.

2. వర్ణానుపూర్వీ భేదేఽపి ప్రతికల్ప మర్థానాం సమాననామ రూపక్రమిత్వా ద్భారతారంభే మతభేద మాహ. చిత్రశాల; పు. 12.

వంశ కథనము చెప్పఁబడినది. మరల 13వ అధ్యాయము నారంభమున శౌనకుఁడు సౌతిని జూచి

"కి మర్థం రాజశార్దూల స్స రాజా జనమేజయః
సర్పసత్రేణ సర్పాణాం గతోన్త ంత ద్వదస్వ మే
ఆస్తీక శ్చ ద్విజశ్రేష్ఠః కిమర్థం వదతాం వరః
మోక్షయామాస భుజగా న్దీప్తా త్తస్మా ద్ధుతాశనాత్. 1. 13-1, 2.

అని ప్రశ్నించెను. భృగువంశ కథనముచే వ్యవహితమైన మూఁడవ అధ్యాయము నందలి కథ యాస్తీకపర్వము మొదట 13వ అధ్యాయమున నిట్లు పునరుపక్రాంతమైనది. ఇచ్చటనుండి 56వ అధ్యాయము వఱకు నీ కథయే యవిచ్ఛిన్నముగా సాగిపోయినది. ఆస్తీకాదిగా భారతమును బఠించు సంప్రదాయమున కారంభ మిదియే ఏఁబది యేడవ యధ్యాయమున సత్యవతీ జన్మహేతుభూతుఁడైన యుపరిచరవసువు చరిత్ర మారంభ మగుచున్నది. భారతమునందుఁ బ్రధానపాత్రలైన కురుపాండవుల చరిత్రకు బీజ మిచ్చటఁ గనఁబడుచున్నది. అంతకు ముందున్నది యీకథ కుపోద్ఘాతరూపమైనది. ఉపరిచరాది సంప్రదాయము ననుసరించి భారతారంభ మీ యేఁబది యేడవ అధ్యాయమే.

మహాభారతమును రచించి వ్యాసుఁడు మొదట వైశంపాయనాదులకుఁ జెప్పెననియు, వైశంపాయనుఁడు గుర్వాజ్ఞచేఁ దరువాత దానిని సర్ప సత్రమునఁ జెప్పెననియు, సౌతి యచ్చట నా కథవిని పిమ్మట శౌనకాదుల కెఱింగించెననియు, నిట్లు మహాభారతము మున్ను మువ్వురిచే మూఁడు సందర్భములందుఁ జెప్పఁబడెననియు నిదివఱకుఁ దెల్పఁబడినది. సర్పయాగారంభమునకు ముందే వ్యాసుఁడు మహాభారత రచనమును ముగించి యుండెను. అందుచే ఆస్తీకపర్వ వృత్తాంతము వ్యాసరచిత మూల భారతములో నుండుట కవకాశములేదు. సౌతి శౌనకాదులకు భారత కథ నెఱింగించునప్పుడు శౌనక ప్రార్థితుఁడై యా కథ నందుఁ జొప్పించి యుండవచ్చును. పౌష్య పర్వ వృత్తాంతము సర్పయాగ వృత్తాంతముతో సంబంధించి యున్నది. పౌలోమ పర్వము నందలి కథ భృగు వంశ కథనము. శౌనకుఁడు భృగువంశ సంజాతుఁడు. స్వవంశ వృత్తాంత శుశ్రూషచే నాతఁడు మొదట దానిని జెప్పుమని యడిగి చెప్పించుకొనెను. ఈవిధముగాఁ బౌష్యపౌలోమ పర్వ వృత్తాంతములుకూడ సౌతి కల్పితములే

యని యూహింప వచ్చును. ఏఁబది నాల్గవ అధ్యాయముతో నాది వంశావతరణ మారంభించుచున్నది. ఇందలి మొదటి మూఁడధ్యాయములు (54, 55, 56) వైశంపాయనుఁడు సర్ప సత్త్రమున భారతేతిహాసము నారంభించినప్పు డుపోద్ఘాతపూర్వకముగాఁ జెప్పినవివలెఁ గానఁబడుచున్నవి. ఏఁబది నాల్గవ అధ్యాయమున వ్యాసుఁడు సర్పయాగము చూచుటకై యరుగఁగా జనమేజయుఁ డాతని సత్కరించి భారతకథ నెఱింగింపుమని యడుగుటయు, నాతఁడు జనమేజయు నా కార్యమునకు వియోగించుటయు, నేఁబది యైదవ యధ్యాయమున వైశంపాయనుఁడు గురు నమస్కారాదు లొనరించి భారత కథను సంగ్రహముగా నెఱింగించుటయు, నేఁబది యాఱవ యధ్యాయమున జనమేజయుఁడు

> కథాం త్వనఘ చిత్రార్థా మిమాం కథయతి త్వయి
> విస్తరశ్రవణే జాతం కౌతూహల మతీవ మే
> స భవాన్ విస్తరే ణేమాం పున రాఖ్యాతు మర్హతి 1. 56. 2.

అని వైశంపాయను నడుగ నాతఁడు విస్తర కథనమున కుపక్రమించి భారత గుణ మహత్త్వములను బ్రశంసించుటయుఁ దెల్పఁబడియున్నవి. ఏఁబది యేఁడవ యధ్యాయమునందలి యుపరిచర వసు వృత్తాంతముతో వ్యాసప్రోక్త మైన భారత భాగ మారంభించుచున్నది. ఈ అధ్యాయమునుండి కథయంతయు జనమేజయుఁ డడుగఁగా వైశంపాయనుఁడు చెప్పుచున్నట్లే సాగిపోవును. సౌతి శౌనకాదుల కం దింకఁ బ్రసక్తియే లేదు. దీనిని బట్టి వ్యాస రచితమైన భారత మేఁబది యేడవ అధ్యాయముతో మొదలిడుచున్న దనియు, 54, 55, 56, అధ్యాయ ములు వైశంపాయనుఁ డుపోద్ఘాతముగాఁ జెప్పినవనియు, 'నంతకు ముందున్న 53 అధ్యాయములను సౌతి ఉపోద్ఘాతముగాఁ జేర్చినవనియుఁ దోఁచుచున్నది.1

---

1. It would thus be clear that from the Uparicharavasu's Upakhyana to the end of the Swargarohana Parvan, the text that we have is unmistakably the Composition of Vyasa himself, Chapters 50-52 (54-56 of the B. O. R. I. Edition) being the link supplied by Vaisampayana and Chapters 1-49 (1-54 of the B. O. R. I. Edition) being the first links supplied by Suta himself.

వ్యాసుఁ డుపరిచరవసు వృత్తాంతముతోనే భారతము నారంభించినను, అద్భుత సన్నివేశముల తోడను ఆత్మ మాతాపితరుల శృంగారము తోడను గూడిన తన జన్మ వృత్తాంతమును గూడఁ దానే వ్రాసెనా యను సందేహము కలుగ వచ్చును. అది ప్రథమ పురుషలోఁ జెప్పఁబడిన విధానము చూడ దాని నెవ్వరో చెప్పినట్లు తోఁచుచున్నది. ఇంతమాత్రముచే నది యాతఁడు వ్రాసినది కాదని నిర్ణయింపఁ గూడదు కాని యాత్మ మాతాపితరుల శృంగారమును వర్ణించు నా ఘట్టము నాతఁడు వ్రాసెననుట కంటెఁ దన్మహత్త్వము నెఱింగిన శిష్యులు తరువాత రచించి భారతమునఁ జేర్చిరనుట సముచితముగా నుండును. ఇట్లనుట వలన భారతము యొక్క యొక యారంభ ముపరిచరాది యను సంప్రదాయమునకుఁ గూడ భంగపాటు వాటిల్లదు.

ఆదిపర్వ ప్రథమాధ్యాయమున సౌతి శౌనకాదులకు వ్యాసుఁడు భారతమును రచించెనని తెల్పిన పిమ్మట, నాతఁడు నూట యేఁబది శ్లోకములలో సర్వపర్వములకు సంక్షేప రూపమని చెప్పఁదగిన అనుక్రమణీ-అధ్యాయము నొనరించి దానిని మొదటఁ దన పుత్త్రుఁడైన శుకునకును, దరువాత ననురూపులైన శిష్యులకును బోధించెనని చెప్పియుండెను.1 ప్రథమాధ్యాయమున 65వ శ్లోకము నుండి 190వ శ్లోకము వఱకును భారతకథ సంక్షేప రూపమునఁ జెప్పఁబడినది. సూతుఁడు పైని చెప్పిన సంక్షేప మిదియే కావచ్చును. కొన్ని ప్రతులలో బ్రహ్మ వ్యాసునికిఁ బ్రత్యక్షమై భారతమును బ్రశంసించిన సందర్భమున భారతద్రుమము సంగ్రహాధ్యాయ బీజ మనియుఁ, బౌలోమాస్తీక మూల మనియుఁ, జెప్పినట్లు కలదు. దీనిని బట్టి భారతము పర్వసంగ్రహాధ్యాయముతో నారంభించు చున్నట్లు వ్యక్తమగు చున్నదనియు, నందుచే నిప్పుడు భారతమున మొదటఁ గానవచ్చుచున్న రెండు పర్వములను (అనుక్రమణీ – పర్వ సంగ్రహ పర్వములు) వ్యాస రచితములైన వనియే చెప్పవలయు ననియు, వైశంపాయనుఁడును సౌతియుఁ గూడ భారత

1. తతో ధ్యర్ధశతం భూయః సంక్షేపం కృతవా నృషిః
అనుక్రమణి మధ్యాయం వృత్తాంతానాం స పర్వణామ్
ఇదం ద్వైపాయనః పూర్వం పుత్త్ర మధ్యాపయ చ్ఛుకం
తతో ఒన్యేభ్యో ఒనురూపేభ్యః శిష్యేభ్యః ప్రదదౌ ప్రభుః 1-1, 62, 63.

కథను జెప్పఁదొడంగి నప్పుడు వీని తోడనే యారంభించి యుందు[2] రనియు శ్రీ పి. పి. యస్. శాస్త్రిగా రభిప్రాయ పడుచున్నారు.

కాని యే గ్రంథకర్తయుఁ దన గ్రంథమునకు ముందు దాని సంగ్రహ శ్లోక కథనము చెప్పఁడు. ఆ గ్రంథమును జదివినవారు కాలాంతరమున దాని సంరక్షణమునకై యందలి శ్లోకముల సంఖ్యను, అక్షరముల సంఖ్యను లెక్కించి యట్టి సంగ్రహములను జెప్పుచుండుట సంప్రదాయము. వేదము లేర్పడుటకు ముందు వేద విభాగ మేర్పడి యుండదు కదా! వ్యాసుఁడు వేద విభజనము చేసిన పిమ్మట నా విధానమునే యవలంబించి బహుకాలమునకుఁ దరువాతఆతనిశిష్యులో లేక పండితులో భారత విభజనమును జేసి యుందురు. పర్వ సంగ్రహ పర్వ సంఖ్యాపనము లట్లు తరువాతి కాలమున జరిగి యుండువనుట విశ్వసింపఁ దగి యున్నది.

ఈ విధముగా భారతారంభమును గూర్చి కొన్ని భిన్నాభిప్రాయములు కానవచ్చుచున్నను దాని యంతమును గూర్చి మాత్రము మత భేదము లేవియు గోచరించుట లేదు. స్వర్గారోహణ పర్వమే యందలి తుది పర్వమని యెల్లరు నంగీకరించు చున్నారు. పర్వ సంగ్రహ పర్వమున విది తొంబది యెనిమిదవ పర్వముగాఁ బేర్కొనఁ బడినది. తరువాత హరివంశమును భవిష్యత్పర్వమును గూడి వంద సంఖ్యను బూర్తి చేయుచున్నవి. వ్యాసుఁ డిట్లు భారతమును శత పర్వ సమన్వితముగా రచించి తరువాత నా వంద పర్వములను పదునెనిమిది పర్వములుగా సంగ్రహించినట్లు S, D3, D4 ప్రతు లందున్న "తతోఽష్టాదశభిః పర్వైః సంగృహీతం మహర్షిణా" అను వాక్యము వలనఁ దెలియుచున్నది. ఈ అష్టాదశ పర్వ విభజనమును సౌతి కావించె నేమో యని యనుమానించుటకుఁ బర్వ సంగ్రహ పర్వము నందలి యీ క్రింది శ్లోకము తార్కాణముగా నున్నది.

---

1. Indeed the genesis of the M. Bh., how Vyasa came to compose it and how he accomplished the same, are all referred to in great detail by Suta in the first and second chapters which should naturally have been the nucleus of the M. Bh., for Vaisampayana too who could have learnt it only from Vyasa's lips.

South, Rec. Vol, II - Intro. P, XIX,

ఏతత్పర్వశతం పూర్ణం వ్యాసే నోక్తం మహాత్మనా
యథావ త్సూతపుత్త్రేణ లోమ హర్షణినా పునః
కథితం నైమిశారణ్యే పర్వా ణ్యష్టాదశైవ చ 1-2-70.

వ్యాస రచితమైన భారత మప్పటినుండి నేఁటివఱకు నొక్క మాదిరిగానే యుండి పోలేదు. అది కాలక్రమమునఁ బెక్కు మార్పుల నొందినది. అది మొదటనే లిఖిత రూపము నొందక పాఠకులయుఁ గథకులయు ముఖముల ద్వారా వ్యాప్తి నొందుటయు, వేదము నందలి మంత్రములకు వలె నందలి శ్లోకములకు స్వరాది నియమములు లేకపోవుటయు, నొక్కసారి విన్నంత మాత్రమున నంత పెద్దగ్రంథమును యథాశ్రుతముగా మరలఁ జెప్పుటకుఁ జాలిన జ్ఞాపక శక్తి మానవుల కుండుట యసంభవ మగుటయు నా మార్పులకుఁ గారణములు. వ్యాసుఁడు చెప్పుచుండఁగా భారతమును విఘ్నేశ్వరుఁడు వ్రాసెనను కథ యొకటి యున్నది. కాని యది యంత విశ్వసనీయమైనది కాదు.1 జనమేజయుని సర్పయాగమున గుర్వాజ్ఞచే దానిని వైశంపాయనుఁడు మొదటిసారి ప్రకటించి యుండెనని భారతము వలనఁ దెలియుచున్నది. వైశంపాయనుఁ డా కథను దద్రచయితయైన వ్యాసమహర్షి వలననే వినియుండినను, సర్పయాగమున సదస్యులకుఁ జెప్పునప్పుడు తు చ తప్పకుండ దానిని యథాతథముగాఁ జెప్పియుండెనని తలంచుట కవకాశము లేదు. కథాక్రమము నందును సన్నివేశ సందర్భములందును విశేషమైన భేదము లేకపోయినను వ్యాసుని వలన నతఁడు విన్నదానికిని అప్పుడు చెప్పిన దానికిని శాబ్దికమైన వ్యత్యాస మధికముగనే యుండి యుండును. అట్లే యాతఁడు చెప్పుచుండఁగా విని సౌతి శౌనకాదుల కెఱింగించిన క్రమములో మఱికొన్ని వ్యత్యాసములు దొరలి యుండుట కవకాశ మున్నది. ఈ విధముగా వ్యాసుని జీవితకాలముననే మహాభారతము నందలి కథావిన్యాసమునఁ గాకపోయినను శబ్ద విన్యాసమునఁ బెక్కుమార్పు లుప్పతిల్లి యుండునని నిరాక్షేపముగాఁ జెప్పవచ్చును. వ్యాసుని శిష్యులలో జైమిని కూడ నొకఁడు. అతఁడు కూడ వైశంపాయనాదులవలెనే భారత కథను

1. Only a very late interpolation in some inferior Devanagari Ms. speaks of the text as having been written down by Ganesa to the dictation of Vyasa, a fantastic story that we may ignore with an easy conscience. B. O. R. I. Edition.

Vol I. Pro 75 p.

వ్యాస ముఖము నుండియే యెఱింగెను. అతఁడు వ్యాప్తికిఁ దెచ్చిన భారతము నందలి అశ్వమేధ పర్వభాగ మిప్పటికిని లభించుచున్నది. దానికిని మహా భారతమునందలి అశ్వమేధ పర్వమునకును శబ్దక్రమముననేకాక కథాక్రమమునఁ గూడ సంబంధ మంతగాఁ గానిపింపదు. అది నిజముగా జైమిని ప్రపంచించిన భారత భాగమే యైనచో నోటి ద్వారా వ్యాప్తినొందు గ్రంథము కాలక్రమమున నెంత వ్యత్యాసమునకుఁ దావొసంగునో తార్కాణము కాఁజాలును.

ఆదికాలమునఁ బాఠకులును గథకులును భారతమును వల్లెవేసి జ్ఞాపకము ననుసరించి దానిని బలుచోట్లఁ బఠించు చుండిరనియు, దానిని విన్నవారు మరల నట్లే జ్ఞప్తియందుంచుకొని వేఱుచోట్ల వినిపించు చుండిరనియు, నీ విధముగా భారతము లిఖితరూపము నొందు వఱకు దేశకాల వ్యక్తిభేదముల ననుసరించి శబ్ద విన్యాసమునందే కాక వస్తు విన్యాసమునందును వించించుక మార్పు చెందుట తటస్థించు చుండెననియు [1] శ్రీ సుక్తన్కరుగారు చెప్పుచున్నారు. లిఖిత స్థితి నొందిన పిమ్మటఁ గూడ నందుఁ బలు రకములైన మార్పులు చొచ్చుచునే యుండెనన వంతకుముం దట్టి మార్పులు విరివిగాఁ బ్రవేశించి యుండు ననుటలో నచ్చెరువు లేదు. పాఠకులును గథకులును గూడఁ బండితులై యంతో యింతో కవిత్వము చెప్పనేర్చినవారై యుండుటచేఁ దమ యభిరుచి కనుగుణమైన విషయము వచ్చినప్పుడు మూల గ్రంథమును బెంచి చెప్పుటయు విరుద్ధమైన విషయము వచ్చినప్పుడు కుంచించి చెప్పుటయు సహజము. వారి వలన నా విషయముల విన్నవా రదియే మూలపాఠ మనుకొని దానినట్లే వల్లించి మరలఁ దాము చెప్పునప్పుడు తమ యభిరుచి విశేషముల ననుసరించి మార్పు చేర్పులు చేసి చెప్పుచుందురు. ఈ విధముగాఁ గాలము గడచిన కొలంది మూల గ్రంథము మొదటి రూపములకును దరువాతి రూపములకును జాల వ్యత్యాస మేర్పడుట సంభవించును.

---

1. As a matter of fact from generation to generation, from place to place, from bard to bard, the wording, even the contents would vary a little until the text is committed to writing, which is the beginning of a different phase in its history. (B. O. R. I. Edition, Pro. LXXVI.

పై సుక్తన్కరు గారి యభిప్రాయమునుబట్టి భారతము కొంత కాలము లిఖిత స్వరూపమును బొందక కేవలము మౌఖికముగానే ప్రచారము నొంది యుండెనని తెలియుచున్నది. అది యట్లుండిపోవుట కప్పుడు భారతదేశమున లేఖన పద్ధతి లేకపోవుటయో, జనులకు భారతమునం దధికమైన యాదరము లేకపోవుటయో, వారు దాని నలేఖ్యముగా భావించుటయో కారణముగాఁ జెప్పవలయును. కాని యీ మూఁడు కారణములును సరియైనవిగాఁ దోఁపవు. భారతీయులకుఁ జాలకాలము వఱకు లిపి జ్ఞానమును, లేఖనపద్ధతియుఁ దెలియ కుండెనను పాశ్చాత్యుల సిద్ధాంతములు విశ్వసనీయములు కావు. భారత రామాయణాదులగు నతి విస్తృతములైన లౌకిక గ్రంథములు కేవలము మౌఖిక ప్రచారము మూలముననే నిల్చియుండుట యసంభవము. ప్రజలకు వేదప్రాయమైన యాయుద్గ్రంథమునెడ నాదరము మృగ్యమై యుండెననుటయు నుచితము కాదు. ఆదరము లేనిచో దానిని నోట వల్లించుట మాత్ర మెట్లు జరుగును? వ్రాసికొనుట కంటెను వల్లించుట కష్టతరము కదా! భారతము పంచమవేదమను ప్రసిద్ధి వహించినను వేదమువలె దానిని గూడ వ్రాయఁ గూడదను నియమము పూర్వకాలమున నుండినట్లు తోఁపదు. తిక్కన దానిని లేఖ్యంబైన యామ్నాయమని వక్కాణించి యున్నాడు. అందుచే భారతము చిరకాలము క్రిందనే లిఖిత స్థితి నొందెననుట యసమంజసముకాదు.

గ్రంథము లిఖిత రూపము నొందిన పిమ్మటఁ గూడ మార్పు చేర్పులు, సంకోచ వ్యాకోచములు కలుగుట కవకాశములు లేకపోలేదు. లేఖకులు తామున్న ప్రదేశమున నుండు పాఠకుల నుండియుఁ గథకుల నుండియు విని గ్రంథమును వ్రాసికొందురు. మొదట నవి లిఖిత రూపము నొందునప్పటికే వివిధ ప్రదేశము లందలి ప్రతులలో నచ్చటచ్చటి కథక పాఠకావళులకుఁ బరిచితములైన పాఠ భేదముల ననుసరించి కొన్ని వ్యత్యాసము లేర్పడియుండును. తరువాత భిన్న ప్రదేశములందలి ప్రతు లేవైన లభించినప్పుడు వారు తమ దగ్గఱనున్న ప్రతులనే వానితోఁ బోల్చి యధికముగాఁ గనిపించిన శ్లోకములను బ్రక్కలందుఁ జేర్చుచుందురు. ఒక్కొక్కప్పు డధిక పాఠము దీర్ఘ తరముగా నుండుచో దానిని వేఱు తాళపత్రములపై లిఖించి యది చేర్పవలసిన చోటు ప్రత్యేక చిహ్నముతో సూచింతురు. దానిని జూచి ప్రత్యంతరము వ్రాసి కొను లేఖకుఁడు ప్రక్కలనున్న శ్లోకములను, వేఱు తాళపత్రముపై లిఖితమైన

భాగముమ మూలగ్రంథమువందలివే యమకొని వానిని జేర్పవలసిన చోటఁ జేర్చి శుద్ధప్రతి వ్రాసికొనుమ. దానిని జూచినవారికి మూలగ్రంథభాగ మేదో, యధికముగాఁ జేర్పఁబడిన భాగమేదో తెలియనే తెలియదు. వారికది యంతయు మూలభాగము వలెనే కానిపించును. ఈ విధముగా నొకే ప్రదేశము నందలి ప్రతులు భిన్నరూపములు దాల్చుట సంభవించును.

భారత దేశమునఁ బురాతన కాలము నుండియుఁ బ్రజలకుఁ బవిత్రము లైన తీర్థములను క్షేత్రములను దర్శించుటయందు శ్రద్ధ హెచ్చు. అట్టి తీర్థ యాత్రాపరులలో భారత భాగములను వల్లించినవారు కూడఁ గొంద ఱుండుటలో వింతలేదు. వారు వానిని బఠించునప్పు డచ్చటివారును, అచ్చటికి యాత్రార్థమై వచ్చిన యితర యాత్రికులను దమకుఁ దెలియనివికాని, తమ ప్రతులలో లేనివి కాని భాగము లేవైన గోచరించినచో వానిని వారినుండి గ్రహించి తమ ప్రతులలోఁ జేర్చుకొనుచుండిరి. ఈ విధముగాఁ దీర్థయాత్రలవలన నొక్కొ-క్కప్పుడు దూరదేశములందుఁ బ్రచారమునందున్న పాఠములు కూడ స్థలాంతరములందలి ప్రతులలోఁ జొచ్చుట కవకాశ మేర్పడుచుండెను.

సాధారణముగా భారతదేశమున నొక్కొ-క్క ప్రాంతమువారి కొక్కొ-క్కలిపియే పరిచితమై యుండును. అందుచే లిపు లెన్నియుండునో భారతప్రతి భేదములు కూడ నన్ని యుండునని స్థూలముగాఁ జెప్పవచ్చును. దీనినిబట్టి యొక లిపిలో వ్రాయఁబడిన ప్రతులలో భేదము లుండవని యర్థము జేసికొనరాదు. అట్టివానిలో భేదము లున్నను అవి యంత యెన్నఁదగినవిగా నుండవు. కాని దేవనాగరీ లిపిలో వ్రాయఁబడిన ప్రతులవలన నట్టివానిలోఁ గూడ విశేష వ్యత్యాసములు ప్రవేశింప వచ్చును. దేవనాగరీలిపి భారతదేశము నందలియన్ని ప్రాంతముల వారికిని సామాన్యమైన లిపి. అది వచ్చినవా రన్ని ప్రాంతములందు నుందురు. అట్టివారు తమ దగ్గఱనున్న ప్రతులను దేవ నాగరీప్రతులతోఁ బోల్చి యం దధికముగా గోచరించిన వానిని దమవానిలోఁ జేర్చుకోవచ్చును. అప్పు డొకే లిపిలో వ్రాయఁబడిన ప్రతులందే విశేష వ్యత్యాసము గోచరించుట కవకాశ మేర్పడును. ఇట్లే, భిన్న భాషలు, భిన్న లిపులు వాడఁబడు ప్రదేశములకు సరిహద్దులందు నివసించు వారిలో నా రెండు ప్రదేశముల భాషలను లిపులను నేర్చినవారు కొంద ఱుందురు. వారు భిన్న

లిపులలో వ్రాయఁబడిన ప్రతులను బోల్చి గొంత భాగమును గలుపుటయో తొలఁగించుటయో చేయవచ్చును. అట్టియెడ నైత మొకేలిపిలో వ్రాయఁబడిన ప్రతులలో విశేష వ్యత్యాస మేర్పడుట కవకాశమున్నది. ఇట్టి భిన్న పాఠ సమ్మేళన మసంభవము కాకపోయినను అరుదని చెప్పవచ్చును. అనఁగాఁ గాశ్మీరమునందలి శారదా ప్రతిలోని పాఠములు మలయాళ లిపిలో వ్రాయఁ బడిన గ్రంథములోఁ గాని గ్రంథప్రతిలోని పాఠములు నేపాలి లిపిలో వ్రాయఁ బడిన గ్రంథములోఁగాని చొచ్చుట యెప్పుడోకాని సంభవింపదు.

పరిణామ పరివర్తనముల విషయమున భారత ప్రతులను దేశభాషలతోఁ బోల్పవచ్చును. ఒకేదేశమునందుఁ గాని రాష్ట్రమునందుఁ గాని వ్యవహార మందున్న భాష భిన్న భిన్న ప్రాంతములందలి జనుల యుచ్చారణ సౌకర్య మును బట్టియు వారి కితరభాషలు మాటాడువారితోఁ గల సంపర్క సంబంధము లను బట్టియుఁ గొన్నిపదముల ప్రయోగ బాహుళ్య వైరళ్యములను బట్టియు భిన్న ప్రదేశములందు భిన్న పరిణామ వికాసములను బొంది యించించుక మార్పులతో గోచరించుచుండుట మనము చూచుచున్నాము. ఒకభాష మాటాడు జను లేదైన కారణమున భిన్న భాష మాటాడఁబడు దేశమునకుఁ గాని రాష్ట్రమునకుఁగాని యేగి నివసింపవలసి వచ్చుచో వారి భాషలోఁ గాల క్రమమున విశేషమైన మార్పుచేర్పులు కానిపించు చుండును. అట్లేయొకే ప్రదేశమున నొకే మాతృకనుండి పుట్టిన పుత్త్రికలందే కాలక్రమమున వివిధ హేతువులచే వివిధములైన మార్పు చేర్పు లొదవుట కవకాశము లెన్నియేని కలవు. ఒక ప్రాంతమునందలి ప్రతులలోనే యిట్టి మార్పులు కలుగుట కవకాశ మున్నప్పుడు భిన్నదేశములందుఁ గల భిన్నప్రతుల కంతకంటెను విశేషము లైన వ్యత్యాసములు గోచరించుటలో నచ్చెరువులేదు.

సాధారణముగా వివిధ ప్రతులలోఁ గానవచ్చు వ్యత్యాసముల నీ క్రింది విధముగా వర్గీకరింప వచ్చును.

i. వర్ణక్రమ భేదములు : నైమిశ, నైమిష; రోమహర్షణ, లోమ హర్షణ; హస్తినపుర, హాస్తినపుర ; ఆస్తీక, అస్తీక ; ఉచథ్య, ఉతథ్య ; ....

ii. పాదపూరకములైన : చ ; తు ; వై ; హి ; తతః ; తదా ; ప్రతి ; పరి ; మున్నగువానియందు భేదములు.

iii. పదవ్యత్యయములు : ప్రతీపస్తు తతోరాజా ; తతఃప్రతీపోరాజా స....

iv. గణభేదము కాని అర్థభేదముకాని కలిగింపని పర్యాయ పదములు : రోష, క్రోధ, కోప ; ప్రభు, విభు ; ఋషి, ముని ; రాజ్య, రాష్ట్ర ; నరేశ్వర, నరోత్తమ, నరాధిప, నరర్షభ ; సమరదుర్మద, సమర దుర్జయ ; కీర్తయిష్యామి, సంప్రవక్ష్యామి ; చారుదర్శనా, చారుహాసినీ ; అసంశయమ్, నసంశయమ్ ; ..

v అర్థభేదము కలిగింపని చిన్న వాక్యములు : ఉవాచ తదనన్తరం, పున రేవాభ్యభాషత ; విశ్వసన్తం యథానాగం, శ్వసన్తమివ పన్నగమ్ ; ....

vi. అధ్యాయ పర్వవిభజనము నందలి భేదములు.

vii. సంఖ్యల యందలి భేదములు ( పర్వసంగ్రహ పర్వము )

viii. ధృతరాష్ట్రుని కుమారులు, కద్రువకు జనించిన నాగములు, ద్రౌపదీ స్వయంవరమునకు వచ్చిన రాజులు మున్నగువారి నామముల పట్టిక లందలి భేదములు.

ix. వంశక్రమమును జెప్పునప్పటి భేదములు.

x. కథావస్తువున మార్పు కలిగింపని కూర్పులు : ఉదా : స్తోత్రములు, వనాదుల వర్ణనము లందలి వృక్షలతాదుల పేర్లు, నీతులు, కానుకలు మున్నగువాని వివరణము.

xi. కథాపునరుక్తులు ; యుద్ధాది వర్ణనములందలి సంకోచవ్యాకోచములు.

xii. శృంగార రసమయ సన్నివేశ వర్ణనములందలి భేదములు ; ఆధ్యాత్మిక విషయ విస్తరణ సంగ్రహీకరణములు ; ....

xiii. కొన్ని విషయములను జేర్చుట, కొన్నిటిని దొలఁగించుట :

XIV. కథావస్తు విపర్యయము : అనఁగా నొకే వృత్తాంత మొక ప్రతిలో నొక విధముగా నుండఁగా నింకొక ప్రతిలో నింకొక విధముగా నుండుట. కాని యిట్టి విపర్యయముల సంఖ్య యత్యల్పముగా నుండును.

ఇట్టి భేదములు విస్తారముగాఁ గానవచ్చుచుండుటచే విమర్శదృష్టితో భారతమును జదువ నారంభించువారి కేప్రతి ననుసరింపవలెనో, యే ప్రతి మూల గ్రంథమునకు సన్నిహితమైనదో నిర్ణయింపవలసిన గట్టి చిక్కేర్పడు చుండును. అట్టియెడ వారు లభించిన ప్రతు లన్నియుఁ బోల్చి చూచి గ్రంథమునకు వన్నె చేకూర్చు నుద్దేశముతో నన్ని ప్రతులలోని యధిక పాఠములను జేర్చి యొక క్రొత్త ప్రతిని దయారు చేసికొందురు. మూలగ్రంథమును దృష్టియం దుంచుకొని చూచినచో నట్లేర్పడిన గ్రంథము వృద్ధి పొందినదే యగును గాని వన్నె పొందినది కాఁజాలదు. ఏలయనఁ గొన్ని యెడల నది యితర ప్రతుల కంటెఁ గూడ మూలమున కత్యంత భిన్నముగా, దవీయముగా నుండుట సంభవించు చుండును.

క్రి. శ. 17 వ శతాబ్దిలో నివసించిన నీలకంఠుఁ డను వ్యాఖ్యాత పాఠ నిర్ణయమునఁ బొందిన క్లేశ మాతఁడు వ్యాఖ్యానము చేయుచు నచ్చటచ్చట చేసిన సూచనలను బట్టి తెలిసికొన వచ్చును. ఆదిపర్వము నందలి యిరువది రెండవ అధ్యాయమునకు వ్యాఖ్యానము చేయుచు మొదట నాతఁడు "నాగాశ్చ సంవిదం కృత్వేతి ద్వాదశ శ్లోక మధ్యాయం కేచి న్న పఠన్తి కాంశ్చి దత్రత్యాన్ శ్లోకాన్ పూర్వత్రైవ చ పఠన్తి. అన్యే తు పంచషాన్ పఠ న్త్యపీత్యత్ర కోశశుద్ధిం న ప్రతీమః" అని వ్రాసి యుండెను. ఇట్లే యాతఁ డాదిపర్వము నందలి నూట తొంబది యాఱవ యధ్యాయమునకు వ్యాఖ్యానము గావించి చివర "అత్ర యత్త ద్దేవా దదు రిత్యాదినా త్రిపథగాం నదీ మిత్యన్తో నారాయ ణ్యుపాఖ్యాన గ్రంథో ఒధ్యాయ ద్వయాత్మకః క్వచి త్పుస్తకే పఠ్యతే" అని తెల్పియుండెను. "క్వచి త్పుస్తకే" యని యాతఁడు సామాన్యముగాఁ జెప్పినప్పటికి అది దాక్షిణాత్య ప్రతి యని స్పష్ట మగుచునే యున్నది. ఏలయన, నా యధ్యాయములందలి నాలాయనీ భౌమాశ్వుల కథలు దాక్షిణాత్య ప్రతులందేకాని యుత్తరప్రతులం దెచ్చటను గానవచ్చుటలేదు. వ్యాఖ్యాన సందర్భములం దిట్లే యాతఁడు కొన్ని చోట్ల గౌడ ప్రతులను, దనకుఁ బూర్వులైన వ్యాఖ్యాతలను గూడ సూచించి

యుండెను.[1] ఇట్లెన్నో ప్రతులను, వ్యాఖ్యానములను బరిశీలించి యాతఁ డతి కష్టముపైఁ బాఠ నిర్ణయము కావించుకొన్నను అతని పాఠములు పెక్కు మూల పాఠములకు భిన్నములనియు, నిస్సారములనియు విమర్శకు లభి ప్రాయ పడుచున్నారు[2]. నీలకంఠుఁ డుత్తమ పాఠ నిర్ణయమునకై తాను భారత దేశమునందలి వివిధప్రాంతముల ప్రతులనే కాక పూర్వులైన పెద్దల పాఠము లను గూడఁ బరిశీలించి యున్నట్లు భారత వ్యాఖ్యా నావతారికలోఁ జెప్పి యున్నాఁడు.

బహూన్ సమాహృత్య విభిన్నదేశ్యాన్ కోశాన్ వినిశ్చిత్య చ పాఠ మగ్ర్యం

ప్రాచీం గురూణా మనుసృత్య వాచ మారభ్యతే భారత భావదీపః.

ఉద్యోగ పర్వమునందలి (42వ అధ్యా.) సనత్సుజాతీయమునకు వ్యాఖ్యానము చేయుచు నాఁతడు "ఉద్యోగపర్వణి సనత్సుజాతీయే భాష్యకారాదిభి ర్వ్యాఖ్యా తాన్ సంప్రతితన పుస్తకేషు చ స్థితాన్ పాఠాన్ చ గుణోపసంహారన్యాయే నైకీకృత్య వ్యాఖ్యాయతే" అని యాతఁడు కావించిన సూచనయొక్క సనత్సు జాతీయ విషయముననే కాక యితర భాగముల విషయమునఁగూడ నను వర్తించును. దీనిని బట్టిచూడఁగా నాతఁడు భారతమునందలి భాగములను బెంపు చేయుటకే ప్రయత్నించె నని స్పష్టపడుచున్నది అతఁ డొక్కఁడే కాదు సాధా రణముగా భారత విషయమునఁ బూర్వుల దృష్టి యంతయు నట్టిదే. వారు వీలైనప్పుడెల్ల లభ్యమైన యధిక పాఠముల నన్నిటిని జేర్చి తాము సంపాదించిన ప్రతిని బారక కామధేనువుగాఁ జేయుటకే యత్నించియుండిరి. యధిక పాఠము

1. అత్రోత్తరార్ధం గౌడపాఠ ఇవ దృశ్యతే. 1 145.20
గీతాసు గీతా కర్తవ్యా ఇత్యాదయః సార్ధాః పంచ శ్లోకాః గౌడై
ర్న పఠ్యన్తే 6.43.1
ఇతి ప్రాచీనః పాఠో దేవబోధాదిభి ర్వ్యాఖ్యాతత్వాత్. I.170.15.

2. The readings of Nilakantha's own text are as a rule inferior The text used or prepared by Nilakantha is a smooth and eclectic but inferior text of an inclusive rather than exclusive type, with an inconsiderable amount of Southern element.

Sukthankar. Pro. 66.

లెన్ని యెక్కువగా లభించిన వారి కంత సంతోషము.[1] మహా భారత మునకు సంబంధించిన శ్లోకములు గాని, పాఠములు గాని యేవియు నష్టము లై పోఁగూడదని వారి భావము.[2] అందుచే వారు సంతరించిన ప్రతులన్నియు నధిక పాఠములతోడను క్రమ విరహితమైన కూర్పు చేర్పులతోడను గూడి చదువువారి కెంతో కలఁత గలిగించు చుండును. సాధ్యమైనన్ని యధిక పాఠ ములను జేర్పఁగలిగితిమి గదాయని వారు సంతోషింపఁగాఁ బెక్కుచోట్ల మూల గ్రంథమున లేని యనవసరపాఠము లెన్నో యందుఁజేరినవి గదాయని మనము విచారింపవలసివచ్చును.

వేదమువలె భారతేతిహాసముకూడ భారతదేశస్థుల కెల్లఁ బూజనీయమైన గ్రంథమగుటచే దాని ప్రతు లాసేతుహిమాచలము వివిధ రాష్ట్రములలో వివిధలిపు లలో వివిధరూపములతోఁగానవచ్చుచున్నవి. ఈ ప్రతులన్నిటిని ప్రధానముగా దాక్షిణాత్యవర్గము, ఔత్తరాహవర్గము అను రెండువర్గములుగా విభజింప వచ్చును. ఒక్కొక్క వర్గమునందు మరల భిన్న భిన్న పాఠము లుండవచ్చును. కొన్నిచోట్ల నుత్తర దక్షిణ పాఠముల సమ్మేళనముతోఁ గూడిన ప్రతులుండ వచ్చును. ఈ ప్రతులలోఁగాని యీ వర్గములలోఁగాని యేది వ్యాసరచిత భారతమునకు సన్నిహితమైనదో చెప్పఁజాలము. భారత దాక్షిణాత్య ప్రతికి సంపాదకులైన శ్రీ పి. పి. యస్. శాస్త్రిగారు సూతుని కాలము తరువాత మహా భారతమును ప్రయత్నపూర్వకముగాఁ బరిష్కరింపఁ బూనినవా రెవ్వ రును లేరనియు, సూతుఁడు శౌనకాదులకుఁ జెప్పినట్లుగా మనకిప్పుడు లభ్యమగు చున్న దాక్షిణాత్య పాఠమే విశ్వసనీయమైన మూలపాఠమనియు, నన్నయ భారత మును జావా భారత ప్రతియు దీనినే బలపఱచు చున్నవనియు, సూతుని కాలము నకే మహాభారతము ద్విసహస్రాధ్యాయమును, శతసహస్ర శ్లోక పరిమితమునై వంద ఉపపర్వములుగను బదునెనిమిది ప్రధాన పర్వములుగను విభజింపఁ బడి

---

1 None in the past found the epic text too long. Far from it. It was perhaps not long enough. Pr. 52.

2. Here one notices above all, the anxiety that nothing that was by any chance found in the M. Bh. Ms. should be lost. Every thing was carefully preserved, assembled in a picturesque disarray. Pro. 81.

యుండెననియుఁ జెప్పుచున్నారు.[1] కాని యీ విషయము నింత నిశ్చయముగాఁ జెప్పుటకు వీలులేదు. ఏలయన ఉత్తర దక్షిణ వర్గములు రెండింటను గూడఁ బెక్కు ప్రక్షేపములు, అధిక పాఠములు, మార్పు చేర్పులు, అపపాఠములు కలవని నిరూపించుట కవకాశము లున్నవి. దక్షిణ వర్గమునకుఁ జెందిన కొన్ని ప్రతులలోఁ గానవచ్చు భాగము లుత్తరవర్గమునకుఁ జెందిన కొన్ని ప్రతులలోఁ గానరానట్లే ఉత్తర ప్రతులలోని కొన్ని భాగములు దక్షిణ ప్రతులు కొన్నింటిలో గోచరించుటలేదు. ఇట్టి భాగములు మూల భారతమున నుండెనా లేదా యను విషయము నిశ్చితముగా నిర్ణయించుట కాధారములులేవు. కాని యుత్తర దక్షిణ ప్రతులన్నిటిలో సమానముగాఁ గనవచ్చు భాగములు మాత్రము మూలభారతమున నున్నట్టివే యని నిస్సందేహముగాఁ దలపోయవచ్చును. నన్నదు భారతమును జావా భారత ప్రతియు దాక్షిణాత్య పాఠమునకు సమీపముగా నున్నంత మాత్రమున దాక్షిణాత్య పాఠమే మూల భారత రూపమని నిర్ణయించుటకూడ సమంజసము కాఁజాలదు. ఏలయన నుత్తర దక్షిణ భేదములు క్రి. శ. 10 వ శతాబ్ది నాటికే యేర్పడియున్న కారణమున నా భారతములే దాక్షిణాత్య పాఠము ననుసరించి వ్రాయఁబడినవని చెప్పవలసి వచ్చును.

నన్నయ రచించినంత వఱకు సంస్కృత భారతమున నుత్తర దాక్షిణాత్య వర్గముల నడుమఁ గనవచ్చు ప్రధాన భేదములు కొన్ని యీ క్రిందఁ జూపఁబడుఁ చున్నవి. వీనిని బట్టి యుత్తర దక్షిణ వర్గమునకుఁ జెందిన ప్రతుల కుండు వ్యత్యాసముల స్వరూపము నూహింపవచ్చును.

భారతమును బర్వములుగా విభజించుటలోనే ఉత్తర దక్షిణ ప్రతులందు భేదము కానవచ్చుచున్నది. దక్షిణ ప్రతులు పెక్కు సాధారణముగా మనకుఁ గానిపించు పదునెనిమిది పర్వములుగాఁ గాక యిరువది నాలుగు పర్వములుగా విభజింపఁబడి యున్నవి.[2] ఒక్క ఆదిపర్వమే ఆది, ఆస్తీక, సంభవ పర్వములను మూఁడు ప్రధాన పర్వములుగా విభక్తమై యున్నది.

---

1. M. Bh. South. Rec. Vol II. Inro. Page 22.

2. A classified Index to the Sanskrit Mss. in the palace at Tanjore. Burnell's remarks. Page 180. Pro. 33.

ఉత్తర ప్రతులలో మాత్రమే అధ్యాయాంత గద్యలలో నుప పర్వముల పేర్లును, అధ్యాయ సంఖ్యాది వివరములును గానఁబడుచుండును. దక్షిణ ప్రతులలో గద్యలం దుపపర్వములఁ బేర్కొనుట చాల నరుదు. అందు సాధారణముగా నుపాఖ్యాన నామములును, అధ్యాయ సంఖ్యయును మాత్రమే పేర్కొనఁబడుచుండును. ఇది యైనను సక్రమముగా నన్ని అధ్యాయముల చివరను గోచరింపదు. అందుచే దక్షిణ ప్రతులలో నుప పర్వముల సంఖ్యను బరిమాణములను గనుఁగొనుటకుఁ గూడ నాధారములేదు. పర్వ సంగ్రహ పర్వమువలన నది యెఱుంగుద మన్న నందుపపర్వముల నామములును ప్రధాన పర్వము లందలి విషయములును సూచింపఁబడునే కాని యే యుపపర్వ మెచ్చటినుండి యారంభించునో తెలిసికొనుట కవకాశ ముండదు.

ఉత్తర దక్షిణ ప్రతులందుఁ గొన్నిచోట్ల నధ్యాయములయు నుపాఖ్యానములయుఁ గ్రమమునందు వ్యత్యాసము గోచరించు చున్నది. యయాతి చరిత్రయు శకుంతలోపాఖ్యానమును ఇందు కుదాహరణములు. ఉత్తర ప్రతులలో 62 వ అధ్యాయమునుండి శకుంతలోపాఖ్యానమును దాని దరువాత యయాతి చరిత్రయుఁ గాననగును. దక్షిణ ప్రతులం దట్లుకాక ముందు యయాతి చరిత్రయుఁ దదనంతరము శకుంతలోపాఖ్యానమును జేర్పఁబడియున్నవి. ఇట్లే 106 - 114 అధ్యాయములందలి విషయమును వివరించు క్రమములోఁ గూడ నా రెండు వర్గములకుఁ జెందిన ప్రతులలో విశేష వ్యత్యాసము కానఁబడు చున్నది.

ఉత్తర ప్రతులలోఁగంటె దక్షిణ ప్రతులలోఁ బెక్కధిక పాఠములు కానవచ్చు చున్నవి. వీని పరిమాణమొక్క పాదమునుండి వందల కొలఁది పాదముల వఱకును బ్రాకుచున్నది. కొన్ని సందర్భములం దీ యధిక పాఠము లతి దీర్ఘము లగుటచేఁ గథా విన్యాసమునందే మార్పొదవి నట్లు తోఁచుచుండును. దీనికి సుభద్రాహరణ వృత్తాంతము చక్కని విదర్శనము. అర్జునుఁడు సన్న్యాసి వేషమున వచ్చుట, తరువాత విపృథునాయకులైన యాదవ సేనలతో సుభద్రైకసహాయుఁడై పోరి వారి నోడించుట, మున్నగు క్రొత్త విషయములును దదితర వివరములును దక్షిణ ప్రతులలో నతి విస్తరముగాఁ గానఁబడుచున్నవి.

సభాపర్వమున దక్షిణ ప్రతులలో శిశుపాలవధ ఘట్టమున 1612 పాదములతోఁ గూడిన యతి దీర్ఘమైన యధిక పాఠమున్నది. భీష్ముఁడు శ్రీకృష్ణుని మహత్త్వమును వర్ణించుట యిందలి విషయము. ఇది దాక్షిణాత్య (పి.పి. యస్. శాస్త్రిగారి) ప్రతిలో (34-40) నే దధ్యాయములుగా విభజింపఁ బడియున్నది. ఈ భాగ ముత్తరప్రతులలో దేనియందును గానవచ్చుటలేదు.

ఇట్టి భేదములు పెక్కు చొచ్చియుండుటయే యుత్తర దక్షిణ ప్రతులందలి పర్వములలోని శ్లోకముల సంఖ్యలో విశేష వ్యత్యాసము గోచరించుటకు హేతువైనది. ఆది సభాపర్వముల విషయమున దక్షిణపాఠమున నుత్తర పాఠముకంటె నొకటి రెండువేల శ్లోకము లధికముగాఁ జూపట్టు చున్నవి. ఆరణ్యపర్వ విషయమున నీభేదము తారుమారైనది. దక్షిణ ప్రతులలోఁ గంటె నుత్తర ప్రతులలోనే యాపర్వ మించుక దీర్ఘతరముగా నుండుట తటస్థించినది.

| పర్వ | దక్షిణప్రతి (పి. పి. యస్. శాస్త్రి) | ఉత్తరప్రతి | కలకత్తా |
|---|---|---|---|
| ఆది | 9984 | 8884 | |
| సభా | 4511 | 2511 | |
| ఆరణ్య | 11138 | 12002 | 12848 |

శ్లోక సంఖ్యలో నింత యధికమైన వ్యత్యాసముండుట వస్తువిషయమునఁగూడ నుత్తర దక్షిణ ప్రతుల కుండు వ్యత్యాసమును జెప్పక చెప్పుచున్నది. ఈ వ్యత్యాస మొకటి రెండు చోట్ల నున్న యధిక పాఠములచేమాత్ర మేర్పడి నట్టిదికాదు. దానికిఁ గారణములైన యధిక పాఠములు అల్పములు, దీర్ఘములు, దీర్ఘతరములు నైనవి గ్రంథమందంతట నావరించి యున్నవి.

ఉత్తర ప్రతులలోఁగంటె దక్షిణ ప్రతులలో శ్లోక సంఖ్య యధికముగా నుండుటయే కాక కథావస్తు వివరములు కూడ విస్తృతతరముగాఁ గానవచ్చును. అందింక వారకుఁ దూహించి కూర్చుకోవలసిన యవసరమేమియు లేకుండ పర్వమును వివరింపఁబడి యుండును. వ్యాసుని తల్లియైన సత్యవతి తండ్రి పేరేదియో యుత్తర ప్రతులం దెక్కడను జెప్పఁబడి యుండలేదు. అతఁడు యమునానదీ తీరమునందలి జాలరులకు రాజై యా నదియందుఁ జేపలు పట్టు

కొనుచు జీవనము సాగించుచుండె ననుటకంటె నం దాతనిఁగూర్చి మనకేదియు దెలియదు. ఇది యంత సంతృప్తికరముగా లేకపోవుటచే దాక్షిణాత్యప్రతు లాతని కొక చక్కనిపేరు కల్పించినవి. ఉచ్చైశ్శ్రవసుఁడని యా పేరు. అమృతమథన సమయమునఁ గలశాంబుధినుండి పుట్టిన వెల్లగుఱ్ఱము ననుస రించి యానామము కల్పింపఁ బడినది.

ఇట్లే పాండురాజు కుంతీ మాద్రులతో హిమవత్ప్రాంతమున నున్నప్పుడు యాదవు లొక పురోహితు నచ్చటికిఁ బంపి రనియు,నాతఁడు కాశ్యపుఁడనియుఁ, బాండవులకు బాల్య సంస్కారములన్నియు నతఁడే జరిపించెననియు దక్షిణ ప్రతిలోఁ జెప్పఁబడినది. ఉత్తరప్రతులలో వసుదేవుఁడు పురోహితునిఁ బంపిన ప్రసంగమే లేదు. కావున నాతని పే రే మను ప్రశ్నయే యుదయింపదు.

దక్షిణ ప్రతులలో నొకచోట (App 67 పంక్తులు 47—62) పాండవుల వయస్సులను వారెచ్చటెచ్చట నెంతెంతకాలము గడపినదియు సూక్ష్మవివర ములతోఁ జెప్పఁబడి యున్నది. ఉత్తరప్రతి చదువునప్పు డా విషయములను గూర్చి పాఠకులకుఁ గలుగు సందేహములన్నియు నిచ్చటఁ బరిహరింపఁ బడినవి. పాండురాజ మరణానంతరము పాఁడవులు వనమునుండి హస్తినా పురమున కరుదెంచు నరికి యుధిష్ఠిరునకుఁ బదునాఱేండ్లును, భీమునకుఁ బదు నై దేండ్లును, అర్జునునకుఁ బదునాలుగేండ్లును, గవలకుఁ బదుమూఁ డేండ్లును వయస్సుండెఁ నటః వారు తరువాత నచ్చట ధార్తరాష్ట్రులతోఁ గలసి పదుమూఁ డేండ్లు నివసించిరి. పిమ్మట జతుగృహమున నాఱు నెలలును, ఏకచక్రపురమున నాఱునెలలును, బాంచాలదేశమున నొక్క సంవత్సరమును గాలము పుచ్చిరి. అనంతరము మరల ధార్తరాష్ట్రులతో నై దేండ్లు వసించి యటనుండి యింద్ర ప్రస్థమున కరిగి యచ్చట నిరువది మూఁడేండ్లు పాలించిరి. తరువాతఁ బదు మూఁడేండ్లు వనవాసాజ్ఞాతవాసములను, ముప్పది యాఱేండ్లు రాజ్యపాలనమును నిర్వహించిరి. యుధిష్ఠిరుఁడు నూటయెనిమిదేండ్లు జీవించెను. అర్జునుఁడు కృష్ణుని కన్న మూఁడునెలలు చిన్న. బలరాముఁడు కృష్ణునికంటె మూఁడు మాసములు పెద్ద. ఈరీతిగా దక్షిణ ప్రతులలో నుత్తరప్రతులలో లేని వివరము లెన్నో చెప్పఁబడి యున్నవి. మొత్తముమీఁద దక్షిణ ప్రతులలోని కథ సక్రమమును వ్యవహార సిద్ధమునై యతుకులు లేకుండ నడచిపోవును. ఉత్తర

ప్రతులలోఁ గొన్నిచోట్ల నది క్రమరహితమై యస్పష్టమై, యం దదుకులుగా నిర్మింపఁబడినట్లు కానిపించును.

ఉత్తర ప్రతులలో లేక దక్షిణ ప్రతులలోమాత్ర మున్న ముఖ్యములైన కథాభాగములు కొన్ని యిచ్చట నొసంగఁ బడుచున్నవి.

1. దేవాసురు లమృతమునకై సముద్రమును మథించు తఱి వాసుకిముఖో ద్వాంతమైన హాలాహలమును శివుఁడు త్రాగివేయుట.

2. సూర్యుఁడు కుంతిని సంగమమునకై ప్రేరేచుట.

3. పాండవులు లాక్షాగృహమున దగ్ధులైరని విని ద్రుపదుఁడు విచారించు చుండఁగాఁ బురోహితుఁ డాతని నోదార్చుట. పిమ్మటఁ బురోహితోపదేశాను సారముగా ద్రుపదుఁడు స్వయంవరమును జాటించుట.

4. పాండవు లైదుగురు ద్రౌపదిని వివాహమాడుటను సమర్థించుటకై వ్యాసుఁడు ద్రుపదునకు నాలాయన్యుపాఖ్యానము చెప్పుట.

5. పై సందర్భముననే భౌమాశ్వి వృత్తాంతము చెప్పుట.

6. పాండవుల నింద్రప్రస్థమునకుఁ బంపుటకు ముందు ధృతరాష్ట్రుఁడు ధర్మజుని రాజ్యాభిషిక్తు నొనరించుట.

7. యుధిష్ఠిరునిఁ జూచుటకు వచ్చిన నారదుని వర్ణనము.

(సభాపర్వము)

8. జరాసంధుఁడు కృష్ణు నధిక్షేపించుట (2-20-24 తరువాత)

9. కృష్ణ మాగధులకు వైర మెట్లు కలిగెనని జనమేజయుఁ డడుగఁగా వైశంపాయనుఁడు కృష్ణు జననమును, అతఁడు కంసునిఁ జంపి యుగ్రసేనుని రాజ్యమునఁ బ్రతిష్ఠించుటయు నెఱింగించుట (2-20-34 తరువాత)

10. జరాసంధుని కుమారుఁడైన సహదేవుఁడు కృష్ణుని శరణుచొచ్చి ధర్మరాజున కొసంగుటకై రత్నములను అజావిగోమహిషాదులను సమర్పించుట (2-22-42 తరువాత)

11. సహదేవుఁడు దక్షిణ దిగ్విజయమున కరిగి ఘటోత్కచుని లంకా నగరమునకుఁ బంపిన వృత్తాంతము. (2-28-53 తరువాత)

12. శిశుపాలుఁడు భీష్మునకు హంసపక్షి సంవాదమునే నెఱింగించుట (2-38-31 తరువాత.)

13. దుశ్శాసనుఁడు ద్రౌపదిని సభ కీడ్చుకొని వచ్చు సందర్భమున ద్రౌపది భీష్మ ద్రోణాదులను గూర్చి మొఱపెట్టుట - విదురుఁ డిచ్చిన సమాధానము-భీమాదులు కావించిన శపథములు - ధర్మరాజ ప్రబోధితుఁడై యర్జునుఁడు కోపము నాపు కొనుట(2-63-21 తరువాత)

14. అరణ్య పర్వ విషయమున దక్షిణ ప్రతులలో లేని పెక్కు భాగము లుత్తర ప్రతులలోఁ గనవచ్చుచున్నవి. అట్టి వానిలో ధర్మరాజు సూర్యస్తోత్రమును బఠించుటయు (33-14 తరువాత); దాని ఫలశ్రుతియు నాగమన క్రమమును జెప్పుటయు (3-4-3 తరువాత); లోమశుఁడు యుధిష్ఠిరునకు భృగు తీర్థమును గూర్చి చెప్పుటయు ( 3-97-27 తరువాత ); సర్పాకారమున నుండిన నహుషుఁడు ధర్మరాజును ధర్మవిషయకములైన ప్రశ్న లడిగి వానికి సమాధాన ములను బొందుటయు (3-177-14 తరువాత); ముఖ్యములైనవి.

పూనా యందలి భండార్కరు పరిశోధన సంస్థ వారి యాజమాన్యమున భారతమునకు విమర్శాత్మకమైన సంపుట మొకటి (Critical edition) ముద్రింపఁ బడినది. ఆ సంపుటమును గూర్చు సందర్భమున భారత దేశము నందలి వివిధ ప్రదేశములలోని తాళపత్ర ప్రతులు పరిశీలింపఁ బడినవి. కాశ్మీరమున లభించిన శారదా ప్రతి యందుఁ బ్రధాన పాఠముగా గ్రహింపఁ బడినది. లభించిన ప్రతు లన్నిటిలోఁ బరిమాణమునఁ జిన్నదిగా నుండుటయు, అందున్న భాగము లన్నియుఁ గొంచె మించుగా నుత్తర దక్షిణ ప్రతు లన్నిటి యందును గానవచ్చు చుండుటయు, బ్రక్షేపములును గల్పిత భాగములును అందు మిక్కిలి తక్కువగా నున్నట్లు తోఁచుటయు దానిని బ్రధాన పాఠముగా గ్రహించుటకు హేతువులు.1 అందుఁ బ్రతి శ్లోకమునకును ముఖ్యములైన యితర ప్రతులలోఁ గల పాఠాంత

1. While it is the shortest extant version it is a demonstrable fact that it contains relatively little matter that is not found, at the same time, in all other versions of both recensions. It is clear, therefore, that it must contain, relatively less spurious matter than any other known version. That is precisely the main reason why it is taken as the norm for this edition, B.O.R.I Ed, Pro. Page 47.

రములును, మార్పు చేర్పులును, దీర్ఘములైన అధిక పాఠములును సూచింపఁబడియున్నవి. దాని సాయమున నన్నయ యనువదించిన సంస్కృత భారత ప్రతి యేదో కనుఁగొనుట కిచ్చటఁ బ్రయత్నము చేయఁబడినది.

ఇట్టి ప్రయత్నము వలన నైనను నన్నయ గ్రహించిన ప్రతియేదో తెలిసికొనుట కవకాశము లేకపోవచ్చును. ఏలయన భండార్కరు పరిశోధన సంస్థవారు దేశము నందలి పెక్కు ప్రతులను బరిశీలించిన మాట సత్యమే యైనను అన్ని ప్రతులను జూచి యుండుట అసంభవము. వారి సంస్థకుఁ జేరక దేశమున వివిధ ప్రదేశములలో నే మూలనో యే గృహము నందో యడఁగి యుండిన ప్రతులు మఱికొన్ని యుండవచ్చును. వానిలో నన్నయ గ్రహించిన ప్రతి కూడ నుండి పోయినచోఁ బై ప్రయత్నము వ్యర్థమైనదే యని చెప్పవలసి వచ్చును. తాళపత్ర ప్రతుల జీవితము మూఁడు నాలుగు వందల యేండ్ల కంటె నధికముగా నుండఁజాలదు. శిథిలమై పోనున్న ప్రతి మాతృకకును దప్పక పుత్త్రిక వ్రాయఁబడి యుండెనని చెప్పఁజాలము. అట్టి యెడఁ గొన్ని ప్రతులు పూర్తిగా నశించి పోయి యుండుటలో నచ్చెరువు లేదు. నన్నయ గ్రహించిన మాతృక కూడ నట్టి గతికిఁ బాల్పడి యుండినచోఁ బై ప్రయత్నము వ్యర్థమే యనవలసి వచ్చును. నన్నయ కాలమునకును, వర్తమాన కాలమునకును, నడుమ సుమా రొక వేయి యేండ్లు గడచి పోయినవి. నన్నయ గ్రహించిన ప్రతికిఁ దప్పక పుత్త్రికలు వ్రాయఁబడియే యుండెనని మనము తలంచినను, అది యీ దీర్ఘ కాలమున నధమము రెండు మూఁడు మాఱులైన రూపాంతరములను బొంది యుండ వల యును. అట్లు రూపాంతరములఁ బొందునప్పు డందులో మార్పు చేర్పు లేవేని జరిగి యుండిన నన్నయ భారతమును దానితోఁ బోల్చి చూచునప్పుడు వ్యత్యాసము గోచరింప వచ్చును. ఇవి యన్నియు నిట్లుండ నన్నయయే తన నాఁటికి లభ్యము లగుచున్న కొన్ని ప్రతులను బరిశీలించి యందుఁ దనకు నచ్చిన భాగముల నెల్ల ననుసరించి యుండవచ్చును. అప్పుడాతఁ డనుసరించినప్రతి యిదియే యని చెప్పుట కవకాశ ముండదు. కావి నన్నయ యాదిపర్వారంభమునఁ దాను జూచిన సంస్కృత భారతమున నే పర్వమున నెన్ని యెన్ని శ్లోకము లుండెనో లెక్క యిచ్చి యున్నాఁడు. దానిని బట్టి యాతఁ డన్ని శ్లోకములు గల యేదో యొక ప్రతి ననుసరించి యుండె నని చెప్పవచ్చును. కాని యా ప్రతి యాతని నాఁటికిఁ బ్రచారము నందుండిన యనేక

ప్రతులలో నొక్కటియో లేక యాతఁ డా ప్రతుల నన్నిటిని బరిశీలించి తాను స్వయముగా ననువాదమునకై కూర్చుకొన్న ప్రతియో చెప్పఁజాలము. ఆ ప్రతి పుత్త్రిక యిప్పటికి శేషించి యున్నదో లేదో, శేషించియున్నను పై భండార్కరు సంస్థవారి సంకలనమునఁ జేరియుండెనో లేదో కూడఁ జెప్పుట కష్టము. ఒకవేళ సరిగా నన్ని శ్లోకములే కల ప్రతి యేదైన లభించినయెడల నన్నయ దానినే గ్రహించి యుండెనని చెప్పవచ్చును గాని యందు శ్లోక సంఖ్య కాకతాళీయముగా సరిపోవుటయుఁ గథావస్తు విన్యాసమునందు మిక్కిలి వ్యత్యాసముండుటయు సంభవింప వచ్చును. మఱియు భారతము నందలి శ్లోకము లిన్నియని లెక్క పెట్టుటలోఁ గొన్ని చిక్కులున్నవి. అందలి శ్లోకములన్నియు ననుష్టుప్పులు కావు. కొన్ని త్రిష్టుప్పులుకూడ నున్నవి. అది గాక యచ్చటచ్చట దీర్ఘములైన గద్య భాగములున్నవి. వీనిని లెక్క పెట్టుటలోఁ బూర్వు లే పద్ధతి ననుసరించిరో నిశ్చితముగాఁ జెప్పఁజాలము. ఆధునికులు శ్లోకముల సంఖ్యకు గద్య భాగముల సంఖ్యను గలపి మొత్త మన్నియు శ్లోకములని చెప్పుచుందురు.[1] శ్రీ పి. పి. యస్. శాస్త్రిగారు గద్య భాగములను బూర్తిగా విడిచిపైచి శ్లోకములను మాత్రమే లెక్కించి యుండిరి. గద్యభాగ విరహితమై యాద్యంత మనుష్టుమ్మయమైన పర్వము నందలి శ్లోకములను మాత్రమే యొక విధముగా లెక్కపెట్ట వచ్చును. కొన్ని పూర్వ ప్రతులలో రెండు పాదములలో నర్థము పూర్తికాని యెడల నింకొక యర్ధశ్లోకమును గూడఁ గలిపి యొక శ్లోకము క్రింద లెక్కించు నభ్యాసము కలదు. ఇట్లు లెక్కించినచో నిజముగాఁ గొన్ని యర్ధ శ్లోకములు లెక్కలోనికి రాకుండఁబోయినట్లే యగును. అందుచేఁ బర్వ సంగ్రహము నందలి శ్లోక ముల సంఖ్యనుబట్టి ప్రతుల సామ్యమును నిర్ణయించుట తప్పుపద్ధతి యగును. సంఖ్యానమున నొకే పద్ధతి యవలంబింపఁ బడినప్పుడు తప్ప నీ సామాన్య నిర్ణయమున నర్థ ముండదు. మహా మహోపాధ్యాయ హరప్రసాద శాస్త్రిగారు భారత శ్లోక సంఖ్యను నిర్ణయించుట కొక క్రొత్త మార్గమును సూచించిరి. (Pro. Page 99), దానిని బట్టి ద్వాత్రింశ దక్షర పరిమితమైన

---

1. Most of the modern Computors add the no. of stanzas to the no. of their respective prose sections and arrive at the length of the Adi in slokas. B, O. R. I. Ed. Pro. 98.

భాగము నొక శ్లోకముగాఁ బరిగణింపవలయును. ఈపద్ధతి నవలంబించినచో నేగ్రంథము నంచైన శ్రీమొదలు సంపూర్ణము వఱకు నిన్నిశ్లోకములు కలవని చెప్పవచ్చును. అందనుష్టుప్పులున్నను, త్రిష్టుప్పులున్నను, గద్యభాగము లున్నను జిక్కులేదు. కాని యీపద్ధతిని బూర్వు లనుసరించి రనుట కాధార ములు లేవు. ఈకారణముచే నన్నయ పర్వ సంగ్రహ పర్వమున నొసంగిన శ్లోక సంఖ్యనుబట్టి యాతఁడు గ్రహించిన భారత ప్రతిని నిర్ణయింపఁ జాలము. అట్లు శ్లోకసంఖ్యా సామ్యమున్న ప్రతు లొండు రెండున్నవి. (పి.పి.యస్. శాస్త్రి గారి దాక్షిణాత్యప్రతి; K6, మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగా రము D. No, 1916 ) ఇంతమాత్రముచే నన్నయ యనుసరించిన ప్రతు లవియే లేక వాని మాతృకలే - యని చెప్పఁజాలము. ఏలయన వానిలో నొండొంటికి భేదము లుండుటయేకాక నన్నయ భారతమునకును వానికిని గూడ వ్యత్యాస ములు కానిపించుచున్నవి. మఱియు శ్రీ సుక్తన్కర్‌గారు చెప్పిన ట్లేప్రతి యందలి శ్లోకముల సంఖ్యయైన పర్వసంగ్రహ శ్లోకముల సంఖ్యతో సరిపోయి నంత మాత్రమున నాప్రతియంతయు (అనఁగా నందలి శ్లోకములు, పంక్తులు, పదములు అన్నియు) సరియైనదేయని భావింపరాదు. ఏలయనఁ గల్పితములా, మూల భారతమున వ్యాసునిచే రచింపఁబడినవా యను విషయమున సంశ యమునకు గుఱియైయున్న కొన్ని శ్లోకములను దగ్గించుటచేతనో చేర్చుట చేతనో పర్వసంగ్రహ శ్లోక సంఖ్యను గిట్టింపవచ్చును. అందుచే శ్లోక సంఖ్యా సామ్యమునుబట్టి ప్రతిసామ్యమును నిర్ణయింపఁ జాలము 1

నన్నయ గ్రహించిన సంస్కృత భారత ప్రతిని నిర్ణయించుపట్లఁ గలఁతఁ గలిగించు విషయము మఱియొకటున్నది. నన్నయ సంస్కృత భారతమును యథాతథముగా ననువదించి యుండలేదు. అతఁ డందలి కథను మాత్రము గ్రహించి కొన్నిచోట్ల హెచ్చించుచుఁ గొన్నిచోట్లఁ దగ్గించుచు యథేచ్ఛముగా

---

1. It should further be carefully borne in mind that even if there be exact agreement as to extent between the Parvasangraha and any constituted text, this fact alone is no guarantee of the absolute correctness of the entire text, line for line, because the same number of stanzas could be made up in innumerable different ways by accepting and rejecting stanzas of doubtful authenticity and uncertain documentation of which there is always a plenty of supply in every parvan. B. O, R, I. Ed, Pro. Page 99.

నా రచనను సాగించెను. అందుచే నేదైన భాగమో, భావమో యాతవి భారత మున లేనప్పుడు దాని నాతఁడు మనః పూర్వకముగాఁ దగ్గించెనో యాతఁడు చూచిన ప్రతిలో నది లేకుండెనో చెప్పుట కష్టము. అట్లే యాతఁడు రచించిన పద్యమునందలి భావ మొక సంస్కృత ప్రతిలోఁ గాన రానప్పు డది యాతఁడు కల్పించినదో లేక యాతఁడు గ్రహించిన ప్రతి యది కాదో చెప్పఁజాలము. అయినను లభ్యములైయున్న యాధారములను బట్టి యాతఁడు గ్రహించిన సంస్కృత భారత ప్రతి యేదో నిర్ణయించుటకు యత్నించెదను.

భండార్కరు పరిశోధన సంస్థవారి భారతమునకు మొదటి సంవత్సర ములలో సంపాదకులై యుండిన శ్రీ సుక్తన్కరు గారాది పర్వారంభమునఁ బ్రకటించిన విపులమైన పీఠికలోఁ దాము పరిశీలించిన ప్రతుల నన్నిటిని వర్గీక రించియున్నారు.




ఇందు మరల నొక్కొక్క పాఠమునకు సంబంధించిన ప్రతు లనేకము లున్నవి. అందులోఁ బ్రస్తుత మాది పర్వమునకు సంబంధించిన కొన్నిటివిగూర్చి తెల్పెదము

S1 :- పూనా. బొంబాయి ప్రభుత్వము సేకరించిన భూర్జ పత్ర ప్రతి. ఇం దాది సభారణ్య పర్వములు మూఁడు నున్నవి. కాని ఆది పర్వారంభమునఁ గొంతయు నరణ్య పర్వాంతమునఁ గొంతయు శిథిలమై పోయినది. భండార్కరు సంస్థవారు గ్రహించిన ప్రధాన పాఠమిదే. శారదాక్షరములు. (క్రీ. శ. 16, 17 శతాబ్దులలో వ్రాయఁబడి యుండును).

K1 :- లండను. ఇండియా ఆఫీసు గ్రంథాలయము No. 3226 క్రీ. శ.1783. దేవనాగరి అక్షరములు. శారదా ప్రతికి పుత్త్రిక. ఆది పర్వారంభమున శారదా ప్రతి కొంత వఱకు శిథిలమై పోవుటచే నచ్చట నిది ముఖ్యపాఠముగా గ్రహింపఁ బడినది.

Dn :- నీలకంఠుని.వ్యాఖ్యానముతోఁ గూడిన దేవనాగరీ భారత ప్రతులు.

D :- దేవనాగరి అక్షరములతో వ్రాయఁబడిన భారత ప్రతులు. వీని సంఖ్య చాల నధికము.

D4 :- సరస్వతీ మహల్ గ్రంథాలయము నందలి 1126 నెంబరు గల ప్రతి. ఇది కాగితము మీఁదనే వ్రాయఁబడినది ఇందుఁ గొట్టివేఁతలు, చేర్పులు చాల చోట్లఁ గలవు. దీని నెవ్వరో దాక్షిణాత్య వర్గముతోఁ బోల్చిచూచి యిందు లేని వానిని ప్రక్కలందును వేఱు పత్రముల మీఁదను వ్రాసియున్నారు.

D5 :- లాహోరు. దయానంద ఆంగ్లో వేదిక్ కళాశాలా గ్రంథాలయము నెంబరు. 4. దేవనాగరి అక్షరములు. క్రీ. శ. 1802.

T1 :- యదుగిరి. యతిరాజ మఠ గ్రంథాలయము - మేల్కోటె (Melkote) తెలుఁగక్షరములు. అధ్యాయ సంఖ్య కలదు గాని శ్లోక సంఖ్య లేదు. ఇందు నారాయణం నమస్కృత్యేత్యాది నమస్క్రియా శ్లోక మున్నది. ఇది సాధారణ ముగా నుత్తర ప్రతులందే కాన నగును.

T2 :- తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయము. నెంబరు 11865. తాళపత్ర లిఖితము. తెలుఁగక్షరములు. ఆది పర్వము నందలి 181వ అధ్యాయము చివర వఱకు వ్రాయఁబడినది.

T3 :- తంజావూరు. సరస్వతీ మహల్ గ్రంథాలయము. నెంబరు 11809. తాళపత్ర లిఖితము. మొదటి యైదు పర్వములు నున్నవి.

తెలుఁగు దేశ ముత్తర దక్షిణ భారతములకు నడుమ నుండుటచేఁ దెలుఁగు ప్రతులలోని కుత్తర పాఠములు చాలఁ బ్రవేశించినవి. అందుచే వీని యం దుత్తర దక్షిణ పాఠముల కలగలుపు కానవచ్చును. T1 కంటె T2 దక్షిణ వర్గమున కెక్కువగా సన్నిహితమై గ్రంథప్రతులకుఁ జేరువగా నున్నది.

G :- గ్రంథ లిపిలో వ్రాయఁబడిన ప్రతులు. ఆది పర్వమునకు సంబంధించిన వివి యే దున్నవి.

M :- మలయాళ లిపిలో వ్రాయఁబడిన ప్రతులు.

ఇన్ని ప్రతి భేదములలో దేని మాతృకను నన్నయ యనుసరించెనో యెఱుంగవలసి యున్నది. అతఁ డనుసరించిన ప్రతి పుత్త్రిక, పైవానిలో లేని యెడల నది వీనిలో దేనికి సన్నిహితముగా నుండియుండునో పరిశీలింప వలయును. నన్నయ యాంధ్రదేశమున నివసించిన వాఁడగుటచే బహుశః దాక్షిణాత్య పాఠమును, అందును దెలుఁగు లిపిలో వ్రాయఁబడిన దానిని అనుసరించి యుండునని యూహింప వచ్చును. శ్రీ సుక్తన్కరుగారు కూడ విట్లే భావించి యున్నారు.[1] అది సత్యమే యైనను అతఁడేదో యొక్క ప్రతిని మాత్రమే చూచి యుండునని చెప్పుటకు వీలులేదు. తాను రాజు నానతిపై నొన రించు చుండిన కార్యము మహోత్కృష్టమై యనవద్యమై యుండవలెనని యాతఁడు ప్రయత్నించుట సహజము. అందుచేఁ బాఠముల విషయమునను, సంవర్భముల విషయమునను, అర్థ విషయమునను సందేహ ముదయించినప్పు డాతఁ డితర దాక్షిణాత్య ప్రతులను, ఉత్తర ప్రతులను గూడఁ దెప్పించి

1. Nannaya's version is valuable for the light it throws on the condition of the Southern recension—or, strictly speaking, of the Telugu version in the eleventh century of the Christian era especially in view of the fact that Nannaya has included in his poem an accurate rendering of the Parvasamgraha, giving the number of Slokas in each of the Parvans of his Mahabharata (B. O. R. I. Ed. Pro. Page 29)



చూచి యుండు ననుటలో విప్రతిపత్తి యుండదు. అట్టి యెడ నాతఁడొకొక్కప్పుడు తానుజూచిన ప్రతులలో నత్యుత్తమముగాఁదోఁచిన పాఠమును గ్రహించి యుండవచ్చును. ఇట్లాతఁడు చేసె ననుటకు నిదర్శనము లనేకము లున్నవి. అతఁడు ప్రధానముగా నొక ప్రతిని (దక్షిణ వర్గమునకుఁ జెందిన తెలుఁగు లిపిలోని ప్రతిని) ముందుంచుకొని, సందేహ ముదయించి నప్పుడెల్ల నప్పుడు తనకు లభించిన కొన్ని యితర ప్రతులను గూడఁ బరిశీలించినట్లు కానఁబడు చున్నది.

1. పర్వానుక్రమణికలో నన్నయ భారతమున ఘోషయాత్రా పర్వము తరువాతఁ బ్రాయోపవేశ పర్వమున్నది. T ప్రతులన్నిటిలోఁగూడ నట్లే కానఁబడుచున్నది. " ఘోషయాత్రా తతః పర్వ తతః ప్రాయోపవేశనమ్ " 1. 2. 46. మిగిలిన పెక్కు ప్రతులలో ఘోషయాత్రా పర్వము తరువాత మృగ స్వప్న భయమున్నది.

2. ఆది పర్వ తృతీయాధ్యాయమున (19 – 94) ధౌమ్యుని శిష్యులైన ఉపమన్యువు, అరుణి, వేదుఁడు అనువారి కథలు చెప్పఁబడియున్నవి. నన్నయ వీనిని విడిచివైచెను. $T_1$ ప్రతిలో 19 మొదలు 46 వఱకు వితర ప్రతులలోఁ గల శ్లోకములు లేవు.

3. ఉదంకుఁడు పౌష్య మహాదేవి కుండలములు గొని గురు పత్ని కడకు వచ్చి వాని నామె కీయఁగా నామె " ఉత్తంక ! దేశే కాలే ఽభ్యాగతః. స్వాగతం తే వత్స. మనాగపి మయా న శప్తః శ్రేయ స్తవోపస్థితమ్. సిద్ధి మవాప్నుహి " అని పల్కినట్లు కలదు. ( 1. 3. 164 ). నన్నయ శాప వృత్తాంతమును విడిచివైచెను. ( 1. 115 ). $T_3$ ప్రతిలోఁ గూడఁ బై భాగము లేదు.

4. పులోముఁ డగ్నిగృహమున నున్న భృగు భార్యను జూచి ఈమె యెవ్వరని యగ్ని నడుగఁగా నగ్ని "...భీతో ఽనృతాచ్చ శాపాచ్చ భృగో రిత్యబ్రవీ చ్ఛనైః. ( 1. 5. 26 ) " అని చెప్పినట్లు సంస్కృత ప్రతిలోఁ గలదు. నన్నయ " అగ్నిదేవుఁ డనృతంబునకు విప్రశాపమునకు వెఱచి శాప భయము దీర్చుకొనఁగఁ బోలుఁ దీర్పరా దనృతాభిభాషణమున నైన శాప భయ"

మని విచారించి యప్పరమ పతివ్రత భృగు పత్నియని కల రూపుఁజెప్పిన " (1. 130) అని రచించెను. అనృత శాప భయముల తారతమ్యము సంస్కృతములో లేదు. $T_1$ ప్రతిలో

" సత్యం వదామి యది మే శాప స్స్యాత్ బ్రహ్మ విత్తమాత్
అసత్యం చే దహం బ్రూవే పతిష్యే నరకాన్ క్రమాత్
నానృతం హి సదా లోకే పూజ్యతే దానవో త్తమ " (పుట 97)

అని అగ్ని పులోమునితోఁ జెప్పిన ట్లున్నది.

ఈ సందర్భముననే పులోమ చ్యవనునిఁ గన్న పిమ్మట సంస్కృతములో

" తాం దదర్శ స్వయం బ్రహ్మ సర్వలోక పితామహః
రుదతీం బాష్ప పూర్ణాక్షీం భృగో ర్భార్యా మనిందితాం
సాంత్వయామాస భగవాన్ వధూం బ్రహ్మ పితామహః " (1. 6. 5)

అని కలదు. నన్నయ బ్రహ్మవచ్చి భృగు పత్ని నోదార్చిన విషయము వ్రాయ లేదు. అది T ప్రతు లన్నిటిలోఁగూడఁ గానరాదు.

5. ప్రమద్వర సర్పదష్టయై మరణించిన వార్త నెఱింగి స్థూలకేశాశ్రమమునకు వచ్చిన మునులలో

ఉద్దాలకః కఠశ్చైవ శ్వేతకేతు స్తథైవ చ (పు. 104)

ఉద్దాలక శ్వేత కేతువులు కలరవి S ప్రతులన్నియుఁ జెప్పుచున్నవి. నన్నయయు వారి పేరులు పేర్కొనెను. మూలమున [1]

" .... ... కుశిక శ్శంఖ మేఖలః
భరద్వాజః కౌణ కుత్స ఆర్ష్టిషేణో ఽథ గౌతమః
ప్రమతిః సహ పుత్రేణ తథాన్యే వనవాసినః" (1. 8. 21)

అని కలదు.

---

1. భండార్కరు పరిశోధన సంస్థవారు ముద్రించిన ప్రతి నే నెల్లయెడల మూలముగా గ్రహించితిని.

6. దేవాసురు లమృతమునకై యంబుధిని మథించు సమయమున "విషముద్భవిల్లి నల్గడలను విస్ఫులింగములు గప్పఁగఁ బర్విన దానిఁజెచ్చెరన్ మృడుఁడు గడంగి పట్టుకొని మ్రింగి గళంబున నిల్పెఁ బొల్పుగన్". మఱియు నమృతంబును జ్యేష్ఠయుఁ జంద్రుండును .... .... నుద్భవిల్లిన " అని నన్నయ భారతమునఁ గలదు. ( 2. 15. 16 )

మూలమున నీ విషయము ప్రసంగమే లేదు. దాక్షిణాత్య ప్రతు లన్నిటిలోను (S) D4 లోఁ బ్రక్కను

" తత్ర పూర్వం విషం జాతం తద్బ్రహ్మవచనా చ్ఛివః
ప్రాగ్రసత్ లోకరక్షార్థం తతో జ్యేష్ఠా సముత్థితా " ( పుట 124 )

అను శ్లోక మున్నది. ఇందున్న జ్యేష్ఠాదేవి సంగతి గూడ మూలమునఁ గానరాదు.

7. కద్రువ జనమేజయుఁ డొనరించిన సర్పయాగమునఁ బాములన్నియుఁ బంచత్వము నొందునట్లు శపించినప్పుడు శాపానుభవ భీత చిత్తుఁడై కర్కోటకుఁ డనువాఁడు తల్లి పంచిన రూపంబున నుచ్చైఃశ్రవంబు వాలంబు నీలంబుగాఁ బట్టి వ్రేలుచుండెనని నన్నయ భారతమునఁ గలదు. (2. 37) ఇది మూలమున లేదు. D4, S ప్రతులలో

" ఏవం శప్తేషు నాగేషు కద్ర్వా చ ద్విజ సత్తమ
ఉద్విగ్న శ్శాపత స్తస్యాః కద్రూం కర్కోటకో ఽ బ్రవీత్
ఆవిశ్య వాజినం ముఖ్యం వాలో భూ త్వాంజన ప్రభః
దర్శయిష్యామి తత్రాహ మాత్మానం కామ మాశ్వస " (పుట 130)

అని కర్కోటక వృత్తాంతము వ్రాయఁబడి యున్నది.

8. గరుడుఁడు గజ కచ్ఛపములను గ్రహించి యేగు నప్పుడు మూలమున " నఖేన గజ మేకేన కూర్మ మేకేన చాక్షిపత్ " (1. 25. 26) అని యున్నది. నన్నయ "చఱచి యొక చేతఁ గూర్మముఁ బెఱచేత గజంబుఁ బట్టి " (2. 69)

అని చేయి శబ్దము వాడెను. $T_1$ ప్రతిలో " కరేణ గజ మేకేన కూర్మ మేకేన చాక్షిపత్ " అని యున్నది.

9. ఆది పర్వము నందలి యఱువది యొకటవ యధ్యాయమున దేవ దానవాంశములచే భూమి యందుఁ బుట్టిన వారి క్రమమును జెప్పు సందర్భమున నన్నయ పేర్కొన్న పేర్లకును మూలము నందలి వానికిని వ్యత్యాసము గోచరించుచున్నది.

(a) మూలము :

| | |
|---|---|
| ధూమ్రాయా స్తు ధరః పుత్రో బ్రహ్మ విద్యో ధ్రువ స్తదా. 1. 60. 18<br>నన్నయ : బ్రహ్మ విద్యకు ధ్రువుండును | బ్రహ్మ విద్యా సుతో ధ్రువః<br>T; G, పుట 267. |
| (b) మూలము : సూక్ష్ముఁడు బృహన్తుఁ డయ్యెను. 1. 61. 19<br>నన్నయ : సూక్ష్ముఁడు బృహద్రథుఁడై పుట్టె. 3. 80. | బృహద్రథ ఇతి ఖ్యాతః క్షితా వాసీ త్స పార్థివః<br>T. $M_3$; పుట 274. |
| (c మూలము: సువాస్తు రితి విఖ్యాతః 1. 61. 24<br>నన్నయ : సుబాహు బాహ్లికులై పుట్టిరి. 3. 8 | సుబాహు రితి<br>$T_2$; $G_1$; పుట 274. |
| (d) మూలము : చంద్రస్తు దితిజశ్రేష్ఠః లోకే తారాధిపోపమః ఋషికో నామ రాజర్షి ర్బభూవ నృపస త్తమః 1. 61. 30<br>నన్నయ: చంద్రుఁడు చంద్రవర్మయై పుట్టె నర్కుఁడు ఋషికుండై పుట్టె 3. 80. | చంద్రస్తు దితిజశ్రేష్ఠో లోకే తారాధిపోపమః - - చంద్రవ ర్మేతి విఖ్యాతః -- కాంభోజానాం నరాధిపః అర్క - ఇత్యభి విఖ్యాతో య స్తు దానవపుంగవః ఋషికో నామ రాజర్షి ర్బభూవ నృప స త్తమః.<br>T. G. పుట. 275. |
| (e) మూలము: సుపర్ణుఁడు కాలకీర్తి యయ్యెను 1. 61. 34.<br>నన్నయ: సుపర్ణుఁడు క్రోధకీర్తియై పుట్టె | క్రోధకీర్తిరితిఖ్యాతః<br>S. పుట 275. |
| (f) మూలము: రాహువుక్రాథుడై పుట్టెను 1. 61. 38<br>నన్నయ:రాహువుక్రోధుఁడై పుట్టె 3. 80 | క్రోధః<br>T. G పుట 276. |

నన్నయపేర్లు దాక్షిణాత్య ప్రతులందలి పేర్లతో నేకీభవించు చున్నవి.

10. శుక్రుఁడు సురాపానము మహాపాతకముగా శపించిన పిమ్మటఁ దన యుదరంబున నున్న కచుని సంజీవితునిఁ జేయఁగాఁ గచుఁడు "తనువును జీవంబును సత్త్వంబును బడసితి నీప్రసాదమున నీయుదరం బనఘా। వెలువడు మార్గం బొనరింపుము నాకు భూసురోత్తమ దయతోన్" 3.123 అని పలికినట్లు నన్నయ భారతములో నున్నది. ఈ విషయము మూలమునఁ గానరాదు. అందు సంజీవితుఁడు కాకముందే యాతఁడు శుక్రునితో సంభాషించి నట్లున్నది.

$T_2$ ప్రతిలో : "కచోఽపి రాజన్ సుమహానుభావో
విద్యాబలా ల్లబ్ధమతి ర్మహాత్మా"
యను శ్లోకభాగము చేర్పఁబడినది.

11. యయాతి దేవయానిని నూతినుండి వెల్వరించి వెడలిపోయిన పిమ్మట మూలమున దేవయాని ఘూర్ణికతో వేగమే యేగి తన తండ్రి కంతయుఁ జెప్పుమని పంపెను. (1.73.23). ఈ ఘూర్ణిక యచ్చటి కెట్లు వచ్చెనో మూలమున లేదు. నన్నయ "తమ్మరోయుచు వచ్చు దాని ఘూర్ణిక యను పరిచారికం గని" యని ఘూర్ణిక యామెను వెదకుచు వచ్చు చుండెనని వ్రాసెను. దాక్షిణాత్య ప్రతు లన్నిటిలో (S) శుక్రుఁడు ధాత్రినేగి వేగమే దేవయానిని కని కొని రమ్మని పంపినట్లు తెల్పు కొన్ని శ్లోకము లున్నవి. (పుట 336)

12. ఉత్తర ప్రతులలో శకుంతలోపాఖ్యానము తరువాత యయాతి చరిత్ర కనఁబడుచున్నది. దాక్షిణాత్య ప్రతులలో నట్లుగాక యయాతి చరిత్ర ముందును దాని తరువాత శకుంతలోపాఖ్యానమును జెప్పఁబడినవి, (62 అధ్యా. శకుంత. 70 అధ్యా. యయాతి) నన్నయ దాక్షిణాత్య క్రమమునే యనుసరించెను.

13. మూలమున విదూరథునకు మాగధి యైన సంప్రియయందుఁ బుట్టిన వాఁ డరుగ్వంతుఁడని కలదు.(అరుగ్వాన్నామ. 1.90.42) T G 4-6 ప్రతులలో "అనశ్వాన్" అనియున్నది. (పుట 403). నన్నయ భారతమునఁగూడ ననశ్వం దనియే యున్నది.

14. సహదేవునికి ద్రౌపదియందు జనించిన కుమారుఁడు శ్రుత కర్ముఁ డని (శ్రుత కర్మాణం 1.90.82) మూలము. నన్నయ శ్రుతసేనుఁడని వ్రాసెను. $T_2$ G ప్రతులలో శ్రుతసేనుఁడనియే యున్నది.

15. దీర్ఘతముఁడు ప్రద్వేషిని వివాహమాడిన వృత్తాంతము మూలములో లేదు. $D_4$ S ప్రతులలో

"జాత్యంధో౽వేదవి త్ప్రాజ్ఞః పత్నీం లేభే స్వవిద్యయా
తరుణీం రూపసంపన్నాం ప్రద్వేషీం నామ బ్రాహ్మణీమ్."

అను శ్లోకము కలదు (పుట 447). నన్నయ భారతమున సరిగా దీనికి ననువాద మని చెప్పఁదగిన వాక్యమున్నది. (4.226)

16. దీర్ఘతముఁడు ప్రద్వేషి యందుఁ గన్న పుత్త్రులు, గౌతమాదులు, లోభమోహాభి భూతులై తండ్రిని బెప్పలోఁబెట్టి గంగలో విడిచి రని, మూలమున నున్నది. దీర్ఘతమునికిని బ్రద్వేషికిని జరిగిన సంభాషణ మందు లేదు. నన్నయ యీ సందర్భమున "ప్రద్వేషిణి యను నొక్క బ్రాహ్మణి వివాహం బయి గౌత మాదులైన కొడుకులం బెక్కండ్రం బడసిన నది లబ్ధ పుత్త్రయై తన్ను మెచ్చకున్న విప్లేల నన్ను మెచ్చవని దీర్ఘతముండు ప్రద్వేషిణి నడిగిన నది యిట్లనియె.

"పతియు భరియించుఁగావున భర్తయయ్యె
భామ భరియింపఁబడుఁగావ భార్యయయ్యెఁ
బరఁగ నవి మనయందు వీద్వడియె విన్ను
నేన యెల్లకాలము భరియింతుఁగావ

ఎంతకాలమైన విప్పాట భరియింప
నోపవింక నరుగు మొందు గడకు
ననిన విర్దయాత్మలవి దీర్ఘతముఁ డల్గి
సతులకెల్ల నపుడు శాప మిచ్చె." 4 226. 227.

అని వ్రాసెను. ఈ భాగ మంతయు దాక్షిణాత్య ప్రతులం దింకను గొంచెము విస్తారముగా మన్నది. పుట 906. APP. 56.

17. ధృతరాష్ట్ర పాండురాజుల జనన సందర్భమున మూలములో నంబిక యందు ధృతరాష్ట్రుఁడు జనించిన పిమ్మటనే యంబాలిక యందుఁ గూడ నొక్కకొడుకును బడయుమని సత్యవతి నియోగించిన ట్లున్నది. (1-100). దాక్షిణాత్య ప్రతులలో (S) వ్యాసుఁ డంబి కాంబాలికలకుఁ బుత్త్రదాన మొనరించి

యరిగిన పిమ్మటనే ధృతరాష్ట్ర పాండురాజుల జననము వర్ణింపఁబడినది. నన్నయ రచనా క్రమము సరిగా దీనినే యనుసరించు చున్నది. 4. 254.

18. మూలమున 101వ అధ్యాయము మొదట మాండవ్యునిఁ గూర్చి

"స ఆశ్రమపదద్వారి వృక్షమూలే మహాతపాః
ఊర్ధ్వబాహు ర్మహాయోగీ తస్థౌ మౌనవ్రతాన్వితః" 101. 1

అని కలదు అతఁడు తీర్థముల నెల్ల సేవించి న ట్లందుఁ గానరాదు. D4, S లలో

"స తీర్థయాత్రాం విచరన్ జగామ చ యదృచ్ఛయా
సన్నికృష్టాని తీర్థాని గ్రామాణాం యాని కానిచిత్
తత్రాశ్రమ పదం కృత్వా వసతిస్మ మహామునిః" (పుట 459)

అని తీర్థయాత్రా ప్రశంస కావింపఁబడినది. నన్నయ కూడ నీ సందర్భమున "మాండవ్యుం డను మహర్షి తొల్లి మహీవలయంబునం గల తీర్థంబు లెల్ల నేకచారి యయి సేవించి యొక్క నగరంబున కెడ గలుగు నడవిలో నాశ్రమంబు గావించి"యని వ్రాసియున్నాఁడు.

19. ధృతరాష్ట్ర పాండు కుమారులు భీష్మాభిరక్షితులై పెరుఁగుచుండిన సమయమునఁ గురుజాంగల మంతయు వృద్ధి నొందె నని మూలమున 102వ అధ్యాయములో నా వృద్ధిక్రమ మంతయు వర్ణింపఁబడినది. ఈ సందర్భమున బ్రాహ్మణావసథములను వర్ణించుచు దాక్షిణాత్య ప్రతులు (S)

"స్వాహాకారైః స్వధాభి శ్చ సంనివాసః కురూషితః" (పుట 463)

అను వాక్యమును జేర్చి యున్నవి. దీనినే నన్నయ

"అమలాచార పవిత్ర భూసుర వరేణ్యా గార పుణ్య ప్రదే
శములం దధ్యయనారవంబు విధివత్స్వాహాస్వధా స్వస్తి శ
బ్దములున్ మంగళతూర్యఘోషములు నుద్యత్కౌతుకాశీర్నినా
దములున్ రమ్యతరంబులయ్యె" 5. 4.

నని కొంచెము పెంపు చేసి వర్ణించెను.

20. ధృతరాష్ట్రుఁడు గాంధారిని వివాహమైన పిమ్మట నామె తోఁ బుట్టువులను బదుండ్రను, గాంగేయుఁడు తెచ్చిన యాభిజాత్య సంపన్నమగు దేవీ శత

మును గూడ గ్రహించెనని నన్నయ భారతమునం దున్నది. ( 5-12-13.) ఈ వృత్తాంతము మూలములో లేదు. కాని D4, S ప్రతులలో,

" తస్యాః సహోదరాః కన్యాః పున రేవ దదౌ దశ
గాంధారరాజ స్సుబలో భీష్మేణ వరిత స్తదా
సత్యవ్రతాం సత్యసేనాం సుదేష్ణాం చ సుసంహితాం
ఏకాహ్న ప్రతిజగ్రాహ ధృతరాష్ట్రో జనేశ్వరః
తతః శాంతనవో భీష్మో ధనుష్క్రీతా స్తత స్తతః
అదదా ద్ధృతరాష్ట్రాయ రాజపుత్రీః పరం శతమ్ " ( పుట 467 )

అని యీ విషయము స్పష్టముగాఁ జెప్పఁబడినది.

21. సూర్యుఁడు కుంతి భయమును దొలఁగించుటకై
" వ్యపయాతు భయం తే ఒద్య కుమారం ప్రసమీక్ష్యసే
మయా త్వం చా ప్యను జ్ఞా తా పునః కన్యా భవిష్యసి" ( పుట 908 )

అని చెప్పినట్లు దాక్షిణాత్యప్రతులలో మాత్రమున్నది. (D4, S). నన్నయ కూడ నీ సందర్భమున సూర్యుఁడు కుంతితో " నీకు సద్యో గర్భంబునఁ బుత్త్రుఁ డుద్భవిల్లు నీకుఁ గన్యాత్వంబును దూషితంబు గాదని వరం బిచ్చినట్లు వ్రాసి యుండెను. ఉత్తరప్రతులలో నీ విషయము కానవచ్చుటలేదు. " మత్ప్రసాదా న్న తే రాజ్ఞి భవితా దోష ఇత్యుత " ( పుట 908 ) అని మాత్రము సూర్యుఁడు చెప్పిన ట్లున్నది.

22. మూలమున 106 మొదలు 114 వ అధ్యాయము వఱకుఁ గల 9 అధ్యాయములలోని విషయ ముత్తర దక్షిణ ప్రతులలోఁ జాల వ్యత్యస్తముగా నున్నది. సంగమ కాలమున మృగము నేసి పాండురాజు శాపమును బొందుట, దుర్యోధనాదుల జననము, పాండవుల జననము అను విషయము లిందలి ప్రధాన కథాభాగములు. ఉత్తర ప్రతులలో మొదట నగ్రజుఁడైన ధృతరాష్ట్రుని పుత్త్రుల జననమును దరువాతఁ బాండురాజు కుమారుల జననమును వర్ణింపఁబడియున్నది. దక్షిణ ప్రతు లట్లుగాక యుధిష్ఠిరుని జననముతో నారంభించి వయః క్రమానుసారముగాఁ గౌరవ పాండవుల

జననమును వర్ణించు చున్నవి.[1] నన్నయ భారతక్రమము సరిగా దాక్షిణాత్య క్రమమునే యనుసరించు చున్నది.

| S (దాక్షిణాత్య వర్గము) | నన్నయ | N (ఉత్తర వర్గము) |
|---|---|---|
| (a) పాండురాజు కుంతీ మాద్రులతో హిమవత్ప్రాంతమునకరుగుట. 106. 1. 11 | = 5-46-47 | = |
| (b) — | — | విదురుని వివాహము 106. 12-14 |
| (c) పాండురాజు సంగపు కాలమున మృగము నేయుట-పాండురాజునకును, మృగ రూప ధరుఁడైన ఋషికిని జరిగిన సంభాషణము - ఋషి పాండురాజును శపించుట 109-5- చివర | 5-48-57 | వైశంపాయన జనమేజయుల సంభాషణ (h) |
| (d) పాండురాజు నిర్వేదము - భార్యలను హస్తినాపురమున కరుగు మనగా వారు నిరాకరించుట - పరివారమును బంపి వేయుట 1-110 | 5-58-62 | గాంధారి ఉదరము బాదుకొనుట-వ్యాసాగమనము(p) దుర్యోధను జననము-దుర్నిమిత్తములఁ గాంచి బ్రాహ్మణులును విదురుఁడును జెప్పిన మాటలు (r) |
| (e) పాండురాజు తపస్సు - అమావాస్య నాఁడు ఋషులు బ్రహ్మను జూడఁ బోవుచుండఁ బాండురాజు కూడ వారి వెంటఁ బోనెంచుట - వారు నివారించుట 111- 1-11 | 5-63-69 | కౌరవుల పేర్లు (t) పాండురాజు మృగము నేయుట, శాపము మొదలైన వృత్తాంతము (c, d, e) |

1. N. narrates first the birth of all the sons of Dhritarashtra, the elder brother, and then that of all the sons of Pandu, the younger brother. S. narrates the incidents as a correlated sequence, beginning with the birth of Yudhishthira, following the chronological order of the births of the hundred and five sons of Pandu and Dhritarashtra together (B. O. R. I. Ed; Page 475).

| | | | |
|---|---|---|---|
| (f) ఋషులు దివ్యదృష్టితోఁ జూచి పాండురాజున కపత్యలాభము కలుగు నని చెప్పుట 111. 18-21 | = | 5. 70 | పుత్త్రులులేని స్థితినిగూర్చి పాండురాజు విచారించుట(i) |
| (g) విదురుని వివాహము. 106.12-చివర | | | ఋషులు పాండురాజున కపత్యలాభము కలుగునని చెప్పుట (f) |
| (h) వైశంపాయనుఁడు గాంధారికి నూర్గురు పుత్త్రులును కుంతీమాద్రుల కైదుగురు పుత్త్రులును జనించిరని చెప్ప జనమేజయుఁడు వివరించి చెప్పుమని అడుగుట 107. 1-8. | | | శారదండాయని కథ (j)<br>వ్యుషితాశ్వుని కథ (k) |
| (i) పుత్త్రులు లేని స్థితినిగూర్చి పాండురాజు విచారించుట. 111. 12-17; తరువాత కుంతీమాద్రులతో నాలోచించుట (Foot Note 1181) | = | 5. 72-73 | శ్వేతకేతువు స్త్రీల విషయమునఁ జేసిన మర్యాద (l) |
| (j) పాండురాజు పుత్త్రలాభమును గూర్చి కుంతితో సంభాషించుట - శారదండాయని కథ. 111-22- చివర | = | 5. 74-75 | కుంతి ధర్మరాజును గాంచుట (o) |
| (k) కుంతి వ్యుషితాశ్వుని కథ చెప్పుట - 112 | = | 5. 77-84 | |
| (l) శ్వేతకేతువు స్త్రీల విషయమునఁ జేసిన మర్యాద - 113-1-37 | = | 5. 84-90 | |
| (m) కుంతి దుర్వాసుని వృత్తాంతము చెప్పుట | = | 5. 90 | కుంతి భీమునిఁగనుట(p) |
| (n) పాండురాజు ధర్మరాజు నారాధించు మనుట 113. 38 - చివర | = | 5. 91 | |

| | | |
|---|---|---|
| (o) కుంతి ధర్మరాజును గాంచుట | = | |
| | 114-1-7 | 5. 94-97 |
| (p) ధర్మరాజ జననమును విని గాంధారి గర్భము బాదుకొనుట- వ్యాసాగమనము- దుర్యోధన జననము 107. 9-24 | = | 5. 98-101 |
| (q) వాయువు నారాధించి కుంతి భీము విఁగనుట 114. 8-14 | | 5. 102-104 |
| (r) దుర్నిమిత్తముల నారసి విదురుఁడును బ్రాహ్మణులును ధృతరాష్ట్రునితోఁ జెప్పినమాటలు | దుర్యోధన జననము | 5. 110-112 |
| (s) App. 63 దుస్సలోత్పత్తి | | 5. 108 |
| (t) కౌరవుల పేర్లు 108 | | 5. 107 |
| (u) అర్జునోత్పత్తి | | 5. 116-127 |

---

23. శారదండాయని స్త్రీ యనియు సిద్ధ బ్రాహ్మణుని వలన దుర్జయాదులైన ముువ్వురు పుత్త్రులను - బడపెననియు మూలము నం దున్నది (1. 113-33-35). దాక్షిణాత్య ప్రతులందును, $D_4$ ప్రతియందును శారదండాయని కైకయుఁడనియు, నాతఁడు కుంతి భగినియైన శ్రుతసేనను బెండ్లియాడెననియు, నామె పుత్త్రులను బై విధమునఁ బడపెననియుఁ జెప్పఁబడినది.

"యా హి తే భగినీ సాధ్వీ శ్రుతసేనా యశస్వినీ
ఉవాహ యాం తు కైకేయః శారదండాయని ర్మహాన్." (పుట 496)

నన్నయ "కేకయ రాజయిన శారదండాయని పుత్త్రోత్పాదనంబునం దశక్తుఁడయి తన ధర్మపత్ని నీ చెలియలి శ్రుతసేనం బుత్త్రార్థంబు నియోగించిన నది పుష్ప

స్నాతయై బ్రాహ్మణ వరణంబునం బుంసవనహోమంబు చేయించి ఋత్విజుల వలన దుర్దమాదులైన కొడుకుల మువ్వురం బడసె" 5. 75 నని వ్రాసెను.

24. భీముఁడు పర్వతముపైఁబడఁగా శిలలు చూర్ణములయ్యె నను వృత్తాంతము మూలమున నున్నది. కాని కుంతి దేవతల నర్చించుచు నాశ్రమము బైటి కరుదెంచుటయు, నప్పు డొక పెద్దపులి యామెపై నుఱుకఁ బోవుటయుఁ, బాండురా జా పులిని మూఁడు బాణములచే నిహతము కావించుటయు నందుఁ గానరావు. $D_4$ S ప్రతులలో నిదంతయు వివరముగాఁ జెప్పఁబడినది. (పుట 506). నన్నయ దానినే యనువదించెను (5. 112-114).

25. $D_4$ S ప్రతులలో నర్జునుఁడు

"ఉత్తరాభ్యాం తు పూర్వాభ్యాం ఫల్గునీన్యాం తతో దివా

జాతస్తు ఫాల్గునే మాసి తే నాసౌ ఫల్గునః స్మృతః" (పుట 508).

అని చెప్పఁబడినది. మూలమున "అథాజగామ దేవేంద్రో జనయామాస చార్జున"మ్మని మాత్రము కలదు. నన్నయ యర్జునుఁ డుత్తర ఫల్గునీ ప్రథమ పాదమున జనించెనని వ్రాసియున్నాఁడు. 5-122.

26. పాండవ జననానంతరము వసుదేవుఁడు తన పురోహితుఁడైన కాశ్యపునిఁ బాండురాజాదులను జూచివచ్చుటకై పంపెననియు, నతఁడు శత శృంగ పర్వతమున కరిగి పాండవులకుఁ గ్రమమునఁ జౌలోపనయనము లొనరించి వేదాధ్యయనము చేయించు చుండెననియు నన్నయ భారతమునఁ గలదు. దాక్షిణాత్య ప్రతులలో నీ విషయమును విపులముగ వర్ణించు 62 పంక్తులతోఁ గూడిన యధిక పాఠమున్నది. ఈవిషయ ముత్తర ప్రతులలోఁ గానరాదు.

27. పాండురాజు మాద్రితోఁ గూడుటకు ముం దొకనాఁడు కుంతి బ్రాహ్మణ భోజనము చేయించుచు మాద్రీరక్షణము నందే మఱి మఱచి యుండెనని నన్నయ భారతములోఁ గలదు. మూలమున నీ విషయములేదు. S, $D_5$ ప్రతులలో "రక్షణే విస్మృతా కుంతీ వ్యగ్రా బ్రాహ్మణ భోజనే" అని చెప్పఁ బడినది.

28. భరద్వాజుఁడు గంగా ద్వారమునఁ దప మొనరించు చుండెనను విషయము $T_2$, $G_5$ లలోఁ దప్ప మిగిలిన దాక్షిణాత్య ప్రతులన్నింట నున్నది. (పుట 537). మూలమున లేదు. నన్నయ

"సద్వినుత చరిత్రుండు భరద్వాజుండను మునీశ్వర ప్రవరుఁడు గంగాద్వారమునఁ దపంబు జగద్వంద్యుఁడు సేయుచుండె గత కల్మషుఁడై" (5. 194) అని వ్రాసియుండెను.

29. ద్రోణుఁడు పరశురాముని సప్రయోగ రహస్యములైన యస్త్రము లడిగిన పిమ్మట $D_4$S ప్రతులలో "ఏత ద్వసు వసూనాం హి సర్వేషాం విప్ర సత్తమ" (పుట 541) అను వాక్యమున్నది. నన్నయ దీనిని "ధనములలో నత్యుత్తమ ధనములు శస్త్రాస్త్రము"లని తెనిఁగించెను. (5. 200) మూలమున నిది లేదు.

30. కౌరవ పాండవులు పుర బహిరంగణమునఁ గందుక క్రీడ సల్పుచుండ నా బంతి యొక నూతిలోఁబడి "నీరిలోనఁ దోఁచు తారక ప్రతిబింబ మొక్కొ-యనఁగ వెలుఁగు చుండె" నని నన్నయ వర్ణించెను. ఈ సందర్భమున $D_5$S ప్రతులలో

"తత్త్వంబునా ప్రతిచ్ఛన్నం తారారూప మి వాంబరే

దృష్ట్వా తే వై కుమారా శ్చతం యత్నా త్పర్యవారయన్" (పుట 543) అను శ్లోకమున్నది. మూలమున నా యుపమానములేదు. ఊరక

"పపాత కూపే సా వీటా తేషాం వై క్రీడతాం తదా" 1. 222-13 అని మాత్రము కలదు.

31. మొసలి ద్రోణుని చిఱుతొడ పట్టుకొన్నప్పు డర్జునుఁడు దాని నేసి చేసిన సాయమునకు మెచ్చి ద్రోణుఁడతని కనేక దివ్యబాణము లిచ్చెనని నన్నయ వ్రాసెను. బ్రహ్మాస్త్రదాన ప్రసంగ మచ్చటలేదు. మూలమున నప్పుడు ద్రోణుఁ డతనికి సప్రయోగ వివర్తనమైన బ్రహ్మాస్త్ర మొసంగెనని చెప్పఁబడినది. (1.123-64-65) ఈవిషయము $T_2$ $G_{4,5}$ ప్రతులలోఁగూడ లోపించి యున్నది.

32. అర్జునుఁడు రంగమున నస్త్ర కౌశలమును బ్రదర్శించు సమయమున మూలములో "పార్వతే నాసృజ ద్గిరీన్" (1.125-20) అని కలదు. నన్నయ "భూరి ఘోరశైల బాణంబున శైలరూపము దాల్చె"నని వ్రాసియుండెను. Dn,D1,T2,G4 M5 ప్రతులలో "అభవద్గిరిః" అను పాఠమున్నది.

33 దుర్యోధనుఁడు కర్ణునంగరాజ్యమునకుఁ బట్టాభిషిక్తు నొనరించిన సందర్భమున మూలములో

"తత స్తస్మిన్ క్షణే కర్ణః సలాజకుసుమై ర్ఘటైః
కాంచనైః కాంచనే పీఠే మంత్రవిద్భి ర్మహారథః
అభిషిక్తో ఽఙ్గరాజ్యే స శ్రియా యుక్తో మహాబలః"(1.126.36)

అని మాత్రము కలదు. T,G,M5, D2,4 ప్రతులలో

"తతో రాజాన మామంత్ర్య గాంగేయం చ పితామహం
అభిషేకస్య సంభారా న్సమానీయ ద్విజాతిభిః
గోసహస్రాయుతం దత్వా యుక్తానాం పుణ్యకర్మణాం
అర్హోఽయ మంగరాజ్యస్య ఇతి వాచ్య ద్విజాతిభిః." (పుట 567)

అను శ్లోకము లున్నవి. నన్నయ వాని కనుగుణముగా "అని యప్పుడ భీష్మ ధృతరాష్ట్రులకుఁ జెప్పి వారి యనుమతంబున మహామహీసుర సహస్రంబు నకు గోసహస్రాయుతంబు దానంబు సేసి యంగరాజ్యంబున కర్హుం డయ్యెడుమని బ్రాహ్మణ వచనంబు వడసి" యని వ్రాసెను (6. 48).

34. దుర్యోధనుఁడు కర్ణుని మహత్త్వమునుగూర్చి చెప్పుచుఁ గుమార కృప ద్రోణుల జన్మముల నుదాహరించి "విప్రుల వలనఁ బుట్టరె రె సత్క్షత్రియ ప్రభువు లవని మీఁద" నని తెల్పినట్లు నన్నయ భారతములో నున్నది. (6.59) ఈ సందర్భమున మూలమున "క్షత్రియాభ్యశ్చ యే జాతాః బ్రాహ్మ ణాస్తే చ విశ్రుతాః" అను వాక్యము కనఁబడుచున్నది. (1. 127-14). T2, G1,2,4,5 ప్రతులలో నన్నయ రచనకు మూలమైన "జాతానాహః క్షత్రి యాసు బ్రాహ్మణైః క్షత్త్రిసంక్షయే" అను వాక్యమున్నది.

35. ద్రోణుఁడు ద్రుపదుని యుద్ధమున నోడించి కట్టి తీసికొని వచ్చు టయే తనకు గురు దక్షిణగాఁగోరఁ బాండవ కౌరవ కుమారు లందఱు నొక్క-

మాతే యరిగి ద్రుపదుని బంధించుకొని వచ్చిరని మూలమున చెప్పఁబడినది. ( 1-128- 2-7 ). నన్నయ ముందు దుర్యోధనాదు లరిగి పరాభూతులై పాఱి వచ్చిరనియుఁ దరువాత నర్జునుడు సోదరులతో నరిగి ద్రుపదుని బంధించికొని వచ్చెననియు వర్ణించెను ( 6.75-87 ). దాక్షిణాత్య ప్రతులందును $D_{a1}$ $D_5$ $D_4$ $D_2$ $K_4$ $D_n$ ప్రతులందును నన్నయ రచనకు మూలమని చెప్పఁదగిన సుమారేఁబది యెనిమిది శ్లోకములతోఁ గూడిన భాగమున్నది.

36. అర్జునుఁడు బంధించి తెచ్చిన ద్రుపదుని ద్రోణుఁడు విడిచిపుచ్చిన యనంతరము ద్రుపదుఁడు కోపపాశబద్ధుఁడై యా పరిభవమునకుఁ బ్రతీకారము సేయ సమకట్టి బ్రాహ్మణోపాస్తిచేయ సమకట్టెనని నన్నయ భారతములోఁ గలదు. $K_4$ $D_{45}S$ ప్రతులలో నీ సందర్భమున యాజోపయాజుల వృత్తాంతమును, ద్రౌపదీ ధృష్టద్యుమ్నుల జననమును వర్ణించు 194 పంక్తుల యధిక పాఠమున్నది. దీనినే నన్నయ బ్రాహ్మణోపాస్తి యను నొక్కమాటతో సంగ్రహించెను. మూలభారతమున నిచ్చట దీని ప్రసక్తియే లేదు.

37. 129 వ అధ్యాయమునఁ బాండవులను గూర్చి పౌరు లనుకొను మాటలలో $T_1$, M ప్రతులందు మాత్రము

"స హి వృద్ధా నమాత్యాం శ్చ జ్ఞాతీం శ్చాపి మహాయశాః
సత్కృత్య నిత్యం పూజార్హా న్పాండవః పూజయిష్యతి" (పుట 575)

అను శ్లోకమున్నది. నన్నయ భారతమునందుఁగల "గుణ వృద్ధుఁడు, ధర్మశీలుండు, పరాక్రమవంతులైన తమ్ములు గలవాఁడు, రాజ్యప్రతిష్ఠితుఁడయి వృద్ధుల నమాత్యుల బంధుమిత్రులను దొల్లిటికంటె మిక్కిలిగాఁ బూజార్హుల నెల్లం బూజించు" (6. 21) అనుభాగము పైశ్లోకమున కనువాదముగాఁ గనఁబడుచున్నది.

38. నన్నయ భారతమున ప్రకృతులు పాండవులను గూర్చి యాడుకొను వాక్యములు విని విషణ్ణహృదయుఁడై దుర్యోధనుఁడు తండ్రి కడ కరుదెంచి పాండవుల నెట్లయినఁ బురమువలనఁ బాయునట్లుగాఁ జేయవలెనని కోరినప్పుడు ధృతరాష్ట్రుఁడు వెల్వరించిన భావములు (6. 122-124) S, $D_4$ ప్రతులలో మాత్రము కానఁబడుచున్నవి.

39. "పురోచను పంపిన విషాదవనిత సపుత్త్రయై బహువిధ వన్యఫల మూలంబులు తెచ్చి యిచ్చుచుఁ గుంతీదేవింబాయక సేవించి" యను నన్నయ భారతమునందలి వాక్యమునకు (6-159) మూలమైన శ్లోకము S ప్రతులలో మాత్రమే గోచరించు చున్నది.

"పురాభ్యాసకృతస్నేహా సఖీ కున్త్యాః సమా సుతైః
ఆనీయ మధుమూలాని ఫలాని వివిధాని చ" (పుట 593)

40. పాండవులు లాక్షాగృహమునుండి తప్పించుకొని యరణ్యమార్గమున నరుగుచుండ భీముఁడొక వట వృక్షమునెక్కి నీటికై వెదకి యొక సరోవరమును గాంచి యాక్షణంబ యట కరిగి యా కొలని యందుఁ గృతావగాహనుఁడై కడుపునిండ నీళ్లు త్రావి యచ్ఛిద్ర కమల పత్రపుటికల నీళ్లు గొని క్రమ్మఱి వచ్చెనని నన్నయ వ్రాసి యుండెను. ఈ సందర్భమున మూలమునందు

"స తత్ర పీత్వా పానీయం స్నాత్వా చ భరతర్షభ
ఉత్తరీయేణ పానీయ మాజహార తదా నృప" ( 1. 138. 13 )

అను శ్లోకము కలదు. $T_1$, $T_2$, G ప్రతులందు నన్నయ వ్రాఁత కనుగుణముగా :

"తేషా మర్థే చ జగ్రాహ భ్రాతౄణాం భ్రాతృవత్సలః
పంకజానా మనేకైశ్చ పత్రైర్బద్ధ్వా జలాశయాత్."

(Foot Notes : 1507, 1508)

అను శ్లోకము కనఁబడుచున్నది.

41. హిడింబ కుంతితో "నాయిష్టంబు మీరు గావింపని నాఁ డప్పుడ ప్రాణంబులు విడుతు"నని తెల్పి కొంత యనాగతం బెఱింగించెనని నన్నయ భారతమునఁగల విషయము (6. 219) మూలమునఁ గానరాదు. శాలి హోత్రు నాశ్రమమును గూర్చియు, వ్యాసాగమనమును గూర్చియు నామె యెఱింగించుటయే యా యనాగతము. ఈ విషయము S ప్రతులలో విపుల ముగా వర్ణింపఁ బడియున్నది. (పుట 941)

42. భీముఁడు పుత్త్ర జన్మం బగునంతకు హిడింబను బరిగ్రహింతునని సమయము చేయుట (6.224) మూలమున లేదు. $T_1$, $T_2$, ప్రతులలో

"శ్రుణు రాక్షసి సత్యేన సమయం తే వదా మ్యహమ్
యావత్కాలేన భవతి పుత్త్రస్యోత్పాదనం శుభే
తావత్కాలం గమిష్యామి త్వయా సహ సుమధ్యమే." (పుట 618)

అను భాగము కలదు. నన్నయ రచన దీని ననుసరించుచున్నది.

43. ఘటోత్కచ జనన సందర్భమున నుత్తర దక్షిణ ప్రతులందుఁ గథాక్రమములోఁ జాల వ్యత్యాసము కలదు. నన్నయ యిచ్చట దాక్షిణాత్య క్రమమునే యనుసరించెను.

| 'S' ప్రతులందలి క్రమము | నన్నయ భారత క్రమము | మూల కథా క్రమము |
|---|---|---|
| హిడింబపగలు భీమునితో విహరించి రాత్రులాతనిఁ దల్లి కడకుఁగొని వచ్చుచుండెను. | శాలిహోత్రునిచేఁ బూజితులై చెట్టుక్రింద సుఖముగా నున్న పాండవుల కడకు వ్యాసుఁడరుదెంచి, హితోపదేశము చేయుట. | ఘటోత్కచుని జననము. ఆతఁడు పాండవుల వీడ్కొని యరుగుట. |
| వ్యాసుఁడువచ్చి సాంత్వన వాక్యములు పల్కి ధర్మజుని భవిష్య దభ్యుదయమును గూర్చి తెలుపుట. | " ఇది శాలిహోత్రు నాశ్రమము. ఇందుఁ గొన్ని దినములుండి పిమ్మట నేక చక్రపురమున కరిగి యట నా కై వేచి యుండు"ఁడని వ్యాసుఁడు పల్కుట. | వ్యాసా గమనము. |
| వ్యాసుఁడు మరల వచ్చెదనని చెప్పి వెళ్లుట. | వ్యాసుఁడు కుంతి నోదార్చుట - ధర్మజుని భవిష్య దభ్యుదయము. | శాలిహోత్రుని ప్రసక్తియే యిందులేదు. |
| పాండవులు వట వృక్షము క్రింద నాలు మాసము లుండుట. | వ్యాసుఁ డరుగుట | వ్యాసుఁడు కుంతి నోదార్చి మరల వచ్చెదనని చెప్పి వెడలుట. |
| హిడింబ ఘటోత్కచునిఁ గాంచుట - ఘటోత్కచుఁడు కుంతీ పాండవుల వీడ్కొని యుత్తర దేశమున కరుగుట | హిడింబ భీమునితో. విష్ట సుఖము లనుభ వించి ఘటోత్కచునిఁ గాంచుట. | |
| హిడింబ పాండవుల | | |

| | |
|---|---|
| వీడ్కొనుట | ఘటోత్కచుండు పాండ |
| పాండవులు శాలిహోత్రు | వుల వీడ్కొని యుత్తరాభి |
| నిచేఁ బూజితులై యతని | ముఖుండై చనుట. |
| వీడ్కొని యరుగుట. | పాండవులుమత్స్యత్రిగర్త |
| వ్యాసాగమనము – ఏక | కీచక విషయంబులుగడచి |
| చక్ర పురమునఁ గుంతి | యేక చక్ర పురమున |
| నోదార్చుట. | కరుగుట |
| మరల వచ్చెదనని తెల్పి | |
| వ్యాసుఁడరుగుట. | |

"స్నుషా కమలపత్రాక్షీ నామ్నా కమల పాలికా
వశవర్తినీ తు భీమస్య పుత్రమేషా జనిష్యతి
తేన పుత్రేణ కృచ్ఛ్రేషు భవిష్యథ చ తారితాః" (పుట 623)

అను నీభాగము $D_5$. T. G. M ప్రతులలో మాత్ర మున్నది. దీనిని నన్నయ "దీనిపేరు కమలపాలిక. ఇది భీమునకు వశవర్తిని యయి పరిచరించి మహా సత్త్వుండైన కొడుకుం గాంచు నాతండు మిమ్ముందఱ నాప ద్విషయంబున నుద్ధరించు"నని యనువదించెను. (6 228) ఈ భాగము మూలములో లేదు.

వ్యాసుఁడు పాండవులకు హితోపదేశము చేయు సందర్భమున నన్నయ భారతమున "నిఖిల ధర్మ విదులరయి వినీతులరయిన మీకు బాంధవ వియోజనంబైన యీ కర్మంబు పురాకృతంబు. దీనికి శోకింపవలదు. కొండొక కాలంబునకు మీరును బాంధవులును గలసి యెప్పటి యట్ల రాజ్యంబు సేయుదు" (6.228) రని చెప్పినట్లున్నది. దీనికి మూలము $T_2$. G. $D_5$ ప్రతులలో మాత్రమున్నది.

"సుహృద్వియోగజం కర్మ పురా కృత మరిందమాః
తస్య సిద్ధి రియం ప్రాప్తా మా శోచత పరంతపాః
సమాప్తే దుష్కృతే చైవ యూయం చైవ న సంశయః
స్వరాష్ట్రే విహరిష్యన్తో భవిష్యథ సబాంధవాః" (పుట 622)

మూలమున నీ విషయము కానరాదు.

44. T, G, M, ప్రతులందు బ్రాహ్మణుఁడు కుమారునిఁ గూర్చి

"దయితం మే కథం బాల మహం త్యక్తు మిహోత్సహే
యస్య జాతస్య పితరో ముఖం దృష్ట్వా దివం గతాః
పితౄణా మృణనిర్ముక్తో యస్య జాతస్య తేజసా
తమహం జ్యేష్ఠపుత్త్రం మే కులవిస్తారకం భువి
మమ పిండోదకవిధిం కథం త్యక్ష్యామి పుత్త్రకమ్." (పుట 629)

అని పల్కినట్లు కలదు. నన్నయ భారతములో దీనికి సరియైన యనువాద మున్నది. (6.248) మూలములో నీ భావము లేదు.

45. పాండవులు లక్కయింట దగ్ధులైరని విని ద్రుపదుఁడు విచారించు చుండఁగాఁ దత్పురోహితుఁ డతని నోదార్చి పాండవులు జీవించియే యున్నారని పల్కి ద్రౌపదికి స్వయంవరము చాటింపుమని యుపదేశించి నట్లు నన్నయ భారతములోఁ గలదు. ఈ విషయము మూలములోలేదు. $D_4$, S ప్రతులలో సమగ్రముగా వర్ణింపఁబడి యున్నది. (పుట 94)

46. అర్జునుఁ డంగార పర్ణునితోఁ జెప్పిన యనలాస్త్రాగమన క్రమ ముత్తర దక్షిణ ప్రతులలో వ్యత్యస్తముగా నున్నది. నన్నయ దక్షిణ ప్రతు లందలి క్రమమునే యనుసరించెను.

| మూలము | 'S' ప్రతులు | నన్నయ |
|---|---|---|
| బృహస్పతి | అగ్ని | అగ్ని |
| భరద్వాజుఁడు | బృహస్పతి | బృహస్పతి |
| అగ్నివేశ్యుఁడు | భరద్వాజుఁడు | భరద్వాజుఁడు |
| ద్రోణుఁడు | భార్గవుఁడు | భార్గవుఁడు |
| అర్జునుఁడు | ద్రోణుఁడు | ద్రోణుఁడు |
| — | అర్జునుఁడు | అర్జునుఁడు |

47. తపతీ సంవరణో పాఖ్యానమున మూలములో వసిష్ఠుఁడు సూర్యునిఁ జూచుటకై యాకసమున కరిగె నని మాత్రమున్నది.

S ప్రతులలో "యోజనానాం తు నియుతం క్షణా ద్గత్వా తపోధనః (పుట680) అను పాదము కనఁబడుచున్నది. నన్నయ యీపాదము ననుసరించియే

" జగదభి వంద్యుఁడా క్షణమ సమ్మతి సంవరణ ప్రయోజనం
బొగి నొనరింపఁగా నయుత యోజనముల్ సని లోక లోచనుం
డగు దిననాథు నాతత సహస్ర కరుం గని సంస్తుతించె " (7. 84)

అని వ్రాసియుండెను.

48. కల్మాష పాదుఁడు దారిలోనున్న శక్తినిఁ దొలఁగు మని పల్కి-నప్పు డాతఁడు తొలఁగలేదని మాత్రము మూలములో నున్నది. (166_6)

S ప్రతులలోను గొన్ని యుత్తర ప్రతులలోను

''మమ పన్థా మహారాజ ధర్మ ఏష పనాతనః
రాజ్ఞా సర్వేషు ధర్మేషు దేయః పన్థా ద్విజాతయే."

అని శక్తి రాజుతోఁ బల్కినట్లు వ్రాయఁబడినది. నన్నయ పై శ్లోకమును

" ఎట్టి రాజులును మహీసురోత్తము లెదు
రరుగు దెంచునప్పు డధిక భక్తి
నెరఁగి ప్రియము వలికి తెరువిత్తు రిట్టిద
ధర్మ మీవుదీనిఁ దలఁప వెట్టు " (7-111).

అని తెనిఁగించెను.

49. పితృదేవత లౌర్వునితో ''మేము ధన లుబ్ధులమయి ధనంబు దాచిన వారము కాము. ధనము వలసినం గుబేరుండు తాన మాకుఁదెచ్చి యిచ్చు"నని పల్కినట్లు నన్నయ భారతమునఁగలదు. (7-140). కుబేర ప్రసక్తి మూలములో లేదు. $T_1$, $G_{1,3}$ ప్రతులలో

''యదస్మాకం ధనాధ్యక్షః ప్రభూతం ధన మాహరత్" అను పాదము చేర్పఁబడినది.

50. వ్యాసుఁడు ద్రుపదునికి నాలాయని యైన యింద్రసేన చరిత్ర చెప్పుట మూలమునఁ గానరాదు. $D_4$, S, $K_4$, లలో నీకథ షష్టి శ్లోక పరిమితమై కానవచ్చు చున్నది. నన్నయ కూడ వ్యాసుఁ డీ కథను ద్రుపదునికిఁ జెప్పినట్లు వ్రాసి యుండెను (7_చివర). ఇట్లే భౌమాశ్వి నితంతు కుమారుల నేవుర వివాహమాడిన వృత్తాంతము కూడ మూలమున లేక పోయినను $D_4$, S ప్రతులలోఁ జెప్పఁ బడియున్నది. దానిని గూడ నన్నయ వ్రాసి యుండెను. కాని భౌమాశ్వియను పేరున కాతని రచనలో నజిత యనుపేరు కనవచ్చుచున్నది. (7-276_278).

51. వ్యాసుఁడు ద్రౌపది నైదుగురిని వివాహ మాడుట ధర్మసమ్మతమే యని ద్రుపదునికి నచ్చఁజెప్పి పాండవులున్న చోటికివచ్చి ధర్మరాజుతో

" నేఁడుపుణ్యదివము నెమ్మితో రోహిణీ
యుక్తుఁడయి శశాంకుఁ డున్నవాఁడు,
మంత్రవంతముగఁ గ్రమంబున నేవురుఁ
బెండ్లియగుఁడు కృష్ణఁ బ్రీతితోడ"

నని పల్కినట్లు నన్నయ భారతములో మన్నది. $D_4$, S ప్రతులలో పరిగా

" తతో ద్వైపాయనః కృష్ణో యుధిష్ఠిర మథాబ్రవీత్
అద్య పుణ్య మహ శ్చన్ద్రో రోహిణ్యా చ సమేష్యతి
క్రమేణ మనుజవ్యాఘ్రాః పాణిం గృహ్ణన్తు పాండవాః " (పుట 765)

అను శ్లోకములు కాన వచ్చుచున్నవి. మూలమున నీ పట్టున

" తతో ఽబ్రవీ ద్భగవా న్ధర్మరాజ 'మద్య పుణ్యాహ ముత పాండవేయ
అద్య పౌష్యం యోగ ముపైతి చంద్రమాః' పాణిం కృష్ణాయా స్త్వం
( - - ) గృహా ణాద్య పూర్వమ్ " (190.5).

అను శ్లోకము వ్రాయఁబడి యున్నది.

52. ద్రౌపదీ వివాహానంతరము దుర్యోధనుని చారులు పాండవుల వృత్తాంతము వెలింగించుచు

" అని మొనసట్లు దాఁకిన మహారథులన్ ధృతరాష్ట్ర రాజ నం
దనుల బలాఢ్యులన్ దళిత దర్పులఁ జేసినవారు ధర్మనం
దనయము లుగ్రవీర్యులని తద్విధమంతయు నేర్పడంగఁ జె
ప్పిన విని కౌరవప్రభుఁడు పెల్కుఱి తద్దయు దుఃఖితాత్ముఁడై (8.11)

అని చెప్పినట్లు నన్నయ భారతములో నున్నది. ఈ విషయము మూలములో లేదు. $D_4$, S ప్రతులలో నిట్లున్నది.

" యో ఽసౌ వత్యక్రమీ ద్యుద్ధే యుధ్య న్దుర్యోధనం తదా
స రాజా పాండవశ్రేష్ఠః శ్రేష్ఠభా గ్వృద్ధివర్ధనః
దుర్యోధనా దవరజై ర్యౌ యుధ్యేతాం ప్రతీతవత్
తౌ యమౌ వృత్త సంపన్నౌ సంపన్న బలవిక్రమౌ " (పుట 770).

53. ధృతరాష్ట్రుఁడు పాండవుల కర్ధ రాజ్యమిచ్చి ఖాండవప్రస్థమునకుఁ బంపినట్లు మూలములో నున్నది. (1-199-25). అభిషేక ప్రస్తావ మందు

లేశమైనఁ గానరాదు. D4 S ప్రతులలో నభిషేకమును వర్ణించు 68 పంక్తుల భాగమున్నది. నన్నయ దీనినంతము "అవి ధర్మరాజు నభిషిక్తుఁజేసి" (8-66) అను మాటలతో నతి సంగ్రహముగా సూచించెను.

54. పాండవు లింద్ర ప్రస్థమున కరిగిన పిమ్మట హరి యింద్రునిఁ దలఁచెననియు నింద్రుఁడు సురపుర సదృశమగు పురము నిర్మింప విశ్వకర్మను బంపెననియు నన్నయ భారతములో నున్నది. ఈ విషయము మూలములో లేదు. D4 S ప్రతులలో

"వాసుదేవో జగన్నాథ శ్చిన్తయామాస వాసవమ్
మహేన్ద్రి శ్చిన్తితో రాజ న్విశ్వకర్మాణ మావిశత్" (పుట 790).

ఇత్యాదిగాఁ గొన్ని శ్లోకము లున్నవి.

55. పాండవులు నారదు నెదుట సమయము చేసిన సందర్భమున మూలమున

"సమయం చక్రిరే రాజం స్తే ఒన్యోన్యేన సమాగతాః
సమక్షం తస్య దేవర్షే ర్నారద స్యామితౌజసః
ద్రౌపద్యా నః సహాసీన మన్యోన్యం యోఽ భిదర్శయేత్
స నో ద్వాదశ వర్షాణి బ్రహ్మచారీ వనే వసేత్" (1,204, 27-28).

అని యున్నది. ద్రౌపది యొక్కొక్కరి యింటఁ దానొక్కొక్క యేఁడే క్రమముగ నుండునను విషయ మందు లేనేలేదు. D4 S ప్రతులలో

"ఏకైకస్య గృహే కృష్ణా వసే ద్వర్ష మకల్మషా" (పుట 806)

అను వాక్యము కనఁబడుచున్నది. నన్నయ భారతమునఁగూడ నిది యున్నది. "ద్వాదశ వర్షాణి" యనుటకు బదులు నన్నయ భారతములోఁ బండ్రెండు నెలలని వ్రాయఁబడియున్నది. T, G2 4,6 G1, M6,8,3,5 మున్నగు ప్రతులలో మాసము లను పాఠమే యున్నది, ఇవన్నియు దాక్షిణాత్యప్రతులే. అట్లే యర్జునుఁడు ధర్మరాజుతో "నాకు ద్వాదశ మాసిక వ్రతంబు సలుప వలయు" నని పలికెనని నన్నయ భారతములోఁ గనఁబడు చున్నది. (8-120) ఈ పట్టున మూలములో "వనే ద్వాదశ వర్షాణి వాసా యోపజగామ హ" (1.205.30). ద్వాదశ వర్షము లనియే యున్నది. T, G2,6, G1, M ప్రతులలో మాసములనియే వ్రాయఁబడియున్నది. (పుట 809)

56. అర్జునుఁడు నాగకన్యక యందిరావంతుఁడను కొడుకును గనెనను వృత్తాంతము మూల భారతమునఁ గానవచ్చుట లేదు. నన్నయ భారతములో నున్నది. (8-134). S ప్రతులలో

"పుత్రి ముత్పాదయామాస తస్యాం స సుమనోహరమ్
ఇరావన్తం మహాభాగం మహాబలపరాక్రమమ్"

అను శ్లోకము కనవచ్చుచున్నది (పుట 812).

57. అర్జునుఁడు తీర్థయాత్రలు చేయు సందర్భమునఁ గళింగము నతిక్రమించి తపస్వులచే నుపశోభితమైన మహేన్ద్రి పర్వతమును జూచి సముద్ర తీరము వెంట మణలూరపురమున కరిగెనని మూలమున నున్నది. ఈ సందర్భమున D4, S ప్రతులలో

"గోదావర్యాం తతః స్నాత్వా తా మతీత్య మహాబలః
కావేరీం తాం సమాసాద్య సంగమే సాగరస్య హ
స్నాత్వా సంపూజ్య దేవాంశ్చ పితౄంశ్చ ఋషిభిః సహ"(పుట 814)

అని గోదావరీ కావేరులలో స్నాన మొనరించెననియు సాగర సంగమమున దేవర్షి పితృదేవతలను బూజించె ననియుఁ జెప్పఁబడి యున్నది. నన్నయ భారతమున నీ విషయము తోపాటు మఱికొన్ని ప్రదేశములు కూడఁ జేర్పఁబడి యున్నవి (8-139).

58. అర్జునుఁడు మణిపూరు పురంబు వీడ్కొని ప్రభాస తీర్థమున కరిగి యచ్చట నుండి ద్వారకానగరమునకు వెళ్ళ నిశ్చయించె ననియు, నచట నన్యులు తన్నెఱుఁగకుండఁ గృతక యతివేష ధరుఁడై కృష్ణుని హృదయమునఁ దలఁచు చుండెననియు, నరుఁడచ్చట నుండు పెఱింగి కృష్ణుఁడాతనిఁ జూడ నరుదెంచెననియు నన్నయ భారతములో నున్నది. (8-161-165-166). మూలమున నర్జునుఁడు ప్రభాస తీర్థమున కరిగిన పిమ్మట నాతఁడట్లు తీర్థయాత్ర చేయుచుండెనని విని కృష్ణుఁ డజ్ఞాతుఁడై యాతని కడ కరిగెనని మాత్రమున్నది. (210, 3, 4). సుభద్ర తిలోత్తమ కంటెఁ గూడ రూపవతి యని యర్జునుఁడు గదుఁ డనువానిచే విని యుండుటయు, నతఁడామెను జూచుటకై ద్వారకాపురి కరుగ నిశ్చయించి కృతక యతివేషము ధరించుటయు, శ్రీకృష్ణుని హృదయమునఁ దలంచుటయు నందుఁ గానరావు. D4, S ప్రతులలో నీ విషయ మంతయుఁ గలదు.

ఇట్లే బలదేవాది యాదవు లర్జునుని యతియే యని తలంచి యాతని వలన సర్వతీర్థములను దత్సేవాఫలములను విని సంతసించి వర్షాకాలము తమయందే యుండి చాతుర్మాస్యము చేసి తమ్ముఁ గృతార్థుల నొనరింప వలెనని ప్రార్థించిన వృత్తాంతము కూడ మూలమునఁ గాన రాకున్నది. అది D4, S ప్రతులలోఁ జాల వివరముగా నున్నది. నన్నయ దానిని సంగ్రహించి వ్రాసియుండెను.

పై యుదాహరణములను బట్టి నన్నయ భారత ముత్తర దక్షిణ వర్గములలో దక్షిణ వర్గమునకును, దక్షిణ వర్గమునందలి ప్రతులలో T1, T2 ప్రతులకును సన్నిహితముగా నున్నదని చెప్పవచ్చును. నన్నయ తెలుఁగు లిపిలో వ్రాయఁబడిన ప్రతులనే ప్రధానముగా ననుసరించి యుండుటలో వింతలేదు. ఏలయన తెలుఁగు దేశమునకు నడుమనుండిన రాజమహేంద్రవరములో నివసించిన యాతనికి తెలుఁగు లిపిలో వ్రాయఁబడిన ప్రతులే యెక్కువగా నందుపాటులో నుండియుండును. పెక్కుచోట్ల దాక్షిణాత్య ప్రతులలోని పాఠము లుత్తర వర్గమునకుఁ జెందిన D4 ప్రతిలోఁగూడఁ గానఁబడుచున్నవి. ఈ D4 ప్రతిలోఁ బెక్కు సవరింపులను జేర్పులను గనఁబడు చున్నవనియు, నిది దాక్షిణాత్య ప్రతులతో సరిచూడఁబడి యుండుటచే నందలి భాగములు కొన్ని యిందుఁ బ్రక్కలందును వేఱుపత్రములందును వ్రాయఁబడి యున్నవనియు శ్రీ సుక్తన్కరు గారు చెప్పుచున్నారు (పుట 18). అందుచే నన్నయ భారతమునందలి కొన్ని భాగములు S ప్రతితో వలె D4, ప్రతితోఁ గూడ సంవదించు చున్నను అతఁడు దానిని జూడలేదని చెప్పుటలో దోష ముండదు. నన్నయ కాలమునకుఁ దరువాతనే దాక్షిణాత్య ప్రతులలోని (S) పాఠము లా ప్రతిలోని కెక్కియుండును.

పై యుదాహరణములను బట్టి నన్నయ దాక్షిణాత్య వర్గమునకుఁ జెందిన T1, T2, ప్రతులనే ప్రధానముగా ననుసరించెనని చెప్పవచ్చునుగాని అతఁడుత్తర ప్రతులను గూడ సంప్రదించి యుండె ననుటకుఁ గొన్ని నిదర్శనములు కానవచ్చు చున్నవి. దాక్షిణాత్య ప్రతులం దెచ్చటను గానరాక యొక్క యుత్తర వర్గమునకు మాత్రము చెందిన ప్రతులలో మాత్రమే కనఁబడు కొన్ని భాగము లాతని భారతమున గోచరించు చున్నవి. అందు ముఖ్యములైన వీ క్రింద సూచింపఁ బడుచున్నవి.

1. అరుణుఁడు తల్లిని శపించిన పిమ్మట సూర్యరథ సూతుఁడై యరిగెనని నన్నయ భారతము. ఈ విషయము మూలమున లేదు. దాక్షిణాత్య

ప్రతులలో లేదు. ఔత్తరాహ వర్గమునకుఁ జెందిన K2-4,N1-2VI, B, D, (D8) ప్రతులలో మాత్రము కనవచ్చు చున్నది.

“ఆదిత్యరథ మధ్యాస్తే సారథ్యం సమకల్పయత్” (పుట 119)

2. సర్పయాగ సందర్భమున హోమ కుండమునఁ బడిన సర్పముల పేర్లు పేర్కొనఁ బడినవి. నన్నయ పేర్కొన్న పేర్లు పెక్కుత్తర ప్రతులందలి పేర్లతో సరిపోవుచున్నవి.

| మూలము | ఉత్తర ప్రతి | నన్నయ |
|---|---|---|
| సహః | శల (Da, Dn, D1-4-6-7) | శల |
| పైలః | పాల (- - Do - - ) | పాల |
| హలీసకః | హలీమక | హలీమక |
| కోణవేగః | [K2-4N, , V, B3-5, D, (D2-5) కాలవేగః (B3-5) D (D2-5) | కాలవేగ |
| హిరణ్యవాహః | హిరణ్యబాహు [K3, N3. V1, B4-8 D(D2)] | హిరణ్యబాహు |
| పిణ్డభేత్తా | పిండపేక్తా (Da, Dn, D . . .) | పిండసేక్తృ |
| సరసః | శరభ (D) | శరభ |
| ద్రంగః | భంగ (D) | భంగ |
| బలహేడః | బిల్వతేజ (D1 4-7, N1, B8, Da, Dn) | |
| శశరోమా చ సుమనా | సురోమాచ మహాహనుః [D, (D5)] | సురోమ మహాహను |
| సంహతాంగదః | సంహతాపనః(N2, B1-8, Dn, D7) | సంహతాపన |
| ఐణ్డలః కుండలోముణ్డః | ఏరకవేణి (D) | ఏరక, వేణి |
| శృంగవేగః | శృంగవేర (D1-4-7) | శృంగవే (బే)ర |
| ముఖమేచకః | ముఖసేచకః (Da. Dn, D1, D4, N, B,) | (సు) ముఖసేచక |
| కోమఠకః | కామఠక (D2-4-6-7) | కామఠక |
| పాటరాక్షసౌ | పటవాసకౌ (D1-3-4-6-7) | పఠవాసక |

3 వసూత్పత్తిని జెప్పు సందర్భమున నన్నయ భారతములో పైతామహుండైన దేవుండను మనువునకుఁ బ్రజాపతి పుట్టె నని యున్నది. దీనికి మూలమున "పితామహో మునిర్దేవః తస్య పుత్రః ప్రజాపతిః" అను పాఠము కలదు. (1.60.16). N, V, B, D, లలో "పైతామహో మనుర్దేవ" అను పాఠము గోచరించు చున్నది. నన్నయ రచన దీనినే యనుసరించు చున్నది.

4. భరతునికిఁ గైకేయియైన సునందకు భుమన్యుండు పుట్టె వానికి దాశార్హ పుత్రియైన విజయకు సుహోంత్రుడు పుట్టె. ఇటమూలమున జయ యను పేరున్నది. N, B1-4, Ds, Dn, D ,ప్రతులలో విజయ యను పేరే యున్నది. ఇట్లే కొన్ని యితర నామముల విషయమునఁ గూడ నన్నయ ఉత్తర ప్రతులనే అనుసరించినట్లు కనఁబడు చున్నది.

| మూలము | ఉత్తర ప్రతులు | నన్నయ |
|---|---|---|
| కైకేయీ ముపయేమే సుకుమారీం నామ 1.90.45. | కుమారీం N2-3, B,Dn D1-2, | కైకేయియైన కుమారికిని 4.113. |
| యమాహుః ప్రతీపం నామ 1.90.48 (పర్యశ్రవుఁడే ప్రతీపుఁడని భావము) | ప్రతి శ్రవునికి ప్రతీపుఁడు N3-2, B, D ప్రతిశ్రవసః ప్రతీపః | వానికిఁ బ్రతీపుఁడు పుట్టె 4.113. |
| జనమేజయస్య వపుష్టమాయాం ద్వౌ పుత్రే శతానీకః శంకుశ్చ 1.90.94. | శంకుకర్ణః Ko-3-4, Dn,D1-2 | శతానీక. శంకుకర్ణులు పుట్టిరి. |

5. కుంతి దుర్వాసుఁడు తనకిచ్చిన మంత్ర శక్తి నెఱుంగఁ గోరి సూర్యు నాహ్వానించిన పిమ్మట వా రిరువురికిని జరిగిన సంభాషణ ముత్తర దక్షిణప్రతులు రెంటింటను గలదు. (పుట. 8. 8). నన్నయ రచన ఉత్తర ప్రతులందలి క్రమమునే అనుసరించు చున్నది. (5. 21-25). సంస్కృత మూలమున నీ భాగము మిక్కిలి సంగ్రహింపఁ బడినది.

"సా దదర్శ త మాయాన్తం భాస్కరం లోకభావనమ్
విస్మితా చానవద్యాంగీ దృష్ట్వా తన్మహ దద్భుతమ్
ప్రకాశకర్మా తపనః తస్యాం గర్భం దధౌ తతః" (1.104. 9, 10).

VI. నేపాలు. దర్బారు లైబ్రరి నెం. 1364. మైథిలి అక్షరములు

6. శ్వేతకేతుఁడు స్త్రీల విషయమునఁ జేసిన మర్యాదను వివరించు సందర్భమున నన్నయ సంస్కృత మూలము ననుసరించి యున్నాఁడు. ఈ ప్రతి S, (ఉత్తర ప్రతి). దక్షిణ ప్రతులలో నీ కథ చాల విస్తృతముగా నున్నది. (పుట. 911) నన్నయ భారతములో నా వివరములు మృగ్యము.

7. నూర్గురు కౌరవుల పేర్లు పేర్కొను సందర్భమున నన్నయ యుత్తర ప్రతులనే యనుసరించెను.

| మూలము | ఉత్తర ప్రతి | నన్నయ |
|---|---|---|
| దుష్టగ్రాహ | దుర్విగ్రాహ Da, Dn D | దుర్విగ్రాహ |
| వికటస్సమః | వికటానన N,D,B | వికటానన |
| కుండోదర | కుండధార Dn, D | కుండధార |
| అశ్వసేన | ఉగ్రసేన | ఉగ్రసేన |
| పండితకః | కుండశాయి | కుండశాయి |
| దురావరః | దురాధర (Ko-3, N,B1-5-6,Da, Dn, D, | దురాధర |
| ఉగ్రయాయి | అగ్రయాయి (N) | అగ్రయాయి |
| | కుండ (Ko-4, Dn, D1) | కుండ |
| దృఢరథాశ్రయః (108-12) | దృఢరథాశ్రయః (B3, Dn, D1,) | దృఢరథాశ్రయ |
| | ప్రథమ - ప్రమాధి (N) | ప్రథమ - ప్రమాధి |

8. జనమేజయునకు వైశంపాయనుఁడు శ్వేతకి యను రాజర్షి వృత్తాంత మును జెప్పుట నన్నయ భారతములో నుత్తర ప్రతులందున్నచోటనే యున్నది ఆ కథ T1,G1-5-6, M ప్రతులలో లేనేలేదు. మఱికొన్ని దక్షిణ ప్రతులలో. నున్నదికాని యది స్థలాంతరమున మిక్కలి సంగ్రహముగా నున్నది. (T3, G2 4) అందారాజు పేరు శ్వేతుఁడని యున్నది. ఈ కథ జావా ప్రతిలోఁ గూడఁగానరాదు. నన్నయ రచన ఉత్తర ప్రతులందలి క్రమము ననుసరించుచు నతఁడుత్తర ప్రతినిగూడ నిశ్చయముగాఁజూచి యుండునని నిరూపించుచున్నది.

పై యుదాహరణములను బట్టి నన్నయ ప్రధానముగా దాక్షిణాత్య ప్రతు లనే యనుసరించినను గొన్ని యుత్తర ప్రతులనుగూడఁ దెప్పించి వానిని గూడఁ

దటుచుగాఁ బరిశీలించు చుండెననియు, నందుఁ దన కుచితములని తోఁచిన భాగములను, నామములను, గథలను గూడ గ్రహించి తన భారతమునఁ జొప్పించి యుండెననియు స్పష్టమగుచున్నది. లేదా, నన్నయ భారతమునందు వలెనే యుత్తర దక్షిణ ప్రతులందలి కథాక్రమముల మేళనముతోఁ గూడిన యొక సంకీర్ణప్రతి యాతని కాలమున నుండెననియు, నది గాని దాని పుత్త్రిక కాని యిప్పుడు మనకు లభ్యమగుట లేదనియు గ్రహింపవలెను. అందలి శ్లోకముల సంఖ్యనే నన్నయ పర్వసంగ్రహమున నొసంగి యుండును. ఈ విషయమున మన మింకొక విధముగా నూహించుటకుఁగూడ నవకాశమున్నది. నీలకంఠుఁడు తాను వ్యాఖ్యానము వ్రాయ నారంభించుటకు ముందు బహు ప్రాంతములందలి ప్రతులు చూచి పాఠ నిర్ణయము చేసికొనెనని యిదివఱకుఁ జెప్పియుంటిని. అట్లే నన్నయయుఁ దన నాఁటికి లభ్యము లగుచుండిన వివిధ ప్రాంతములందలి భారత ప్రతులను దెప్పించి చదివి నారాయణభట్టు వంటి మిత్రుల సాయమునఁ గొన్ని ప్రతులందు మాత్రమే కానవచ్చు నధిక పాఠముల యౌచిత్యానౌచిత్యములఁ జర్చించి యుచితమైన వానిని గ్రహించియు ననుచితము లని తోఁచిన వానిని బరిహరించియు నొక సమగ్రమైన భారతమును దానే కూర్చుకొనెననియు, నందలి శ్లోకముల సంఖ్యనే పర్వ సంగ్రహమున నొసంగె ననియుఁ జెప్పవచ్చును. నన్నయ కాలమునకును మన కాలమునకును నడుమ వ్యవధానము బహు శతాబ్దము లుండుటచే నాతఁడు ప్రత్యేకముగాఁ గూర్చు కొన్న యాప్రతిలోఁ గొన్ని మార్పులు చేరుట కవకాశముండిన కతమున సరిగా నాతని భారతమునకు మాతృకయని చెప్పఁదగిన ప్రతి నిప్పుడు కనుఁ గొనుట దుర్లభమగు చున్న దని తోఁచుచున్నది.

సభా పర్వము :

నన్నయ ఆది పర్వము ననువదించు నప్పు డుపయోగించిన మాతృకనే సభారణ్య పర్వముల ననువదించు నప్పుడు సైత ముపయోగించెనని నిశ్చయముగాఁ జెప్పుటకు వీలులేదు. ఏలయన మహాభారత మతి విస్తృతమైన బృహద్గ్రంథమగుటచే గ్రంథమంతయు నామూలాగ్రముగ వ్రాయఁబడిన యొకే ప్రతి లభించుట చాల కష్టము. అట్టిదొకవేళ యెక్కడనైన నున్నను దానిని సంపాదించుట దుష్కరము. అదిగాక పూర్వకాలము నుండియు మహాభారత మందలి ప్రధాన పర్వముల నొక్కొక్క దాని నొక్కొక్క గ్రంథముగా (unit)

గ్రహించు నాధారము కానఁబడుచున్నది. తిక్కన సోమయాజి విరాట పర్వారంభమున తాను రచించిన భారత భాగమును ప్రబంధమండలి యని పేర్కొని యుండెను. దీనిని బట్టి యాతఁ డందలి యొక్కొక్క పర్వము నొక్కొక్క ప్రబంధముగా భావించెనని తెలియుచున్నది. లభించిన తాళ పత్ర ప్రతులలోఁ గల పర్వముల సంఖ్యయందుఁగవవచ్చు వైవిధ్యముకూడ నీ విషయమును బల పఱుచుచున్నది. కొన్ని ప్రతులలో రెండు మూఁడు పర్వములో నాలుగైదు పర్వములో యున్నను బెక్కు ప్రతులలో నొక్కొక్క పర్వము మాత్రమే గోచరించు చున్నది. సభా పర్వ సంపాదనమునఁ దాము పరిశీలించిన పలు తాళపత్ర ప్రతులలో నొక్క సభా పర్వము మాత్రమే యున్నదని శ్రీ యస్. కె. బెల్వాల్కరుగారు మడువుచున్నారు.[1] అందుచే నన్నయ సభాపర్వానువాదమునకై గ్రహించిన ప్రతి యాతని యాది పర్వ మాతృకకు సంబంధించినదే యగుటకు వీలు లేకపోలేదు కాని యది యట్టిదే యై యుండవలెనని మాత్రము నిశ్చయముగాఁ జెప్పఁ జాలము.

సభా పర్వము నందలి శ్లోకముల సంఖ్య విషయమున నుత్తర దక్షిణ ప్రతులకు సుమారు రెండువేల శ్లోకముల వ్యత్యాసము కానవచ్చుచున్నది. శ్రీ పి.పి.యస్. శాస్త్రిగారి ప్రతిలో మొత్తము సంఖ్య 4511 గా నీయఁబడినది. సంస్కృత మూలమున (B O.R.I.Ed.) పర్వ సంగ్రహములో సభా పర్వము నందు 2511 శ్లోకములున్నట్లు చెప్పఁబడి యున్నది. నాలుగేసి పాదము లొక్కొక్క శ్లోకముగా గణించినచో నందున్న శ్లోకముల సంఖ్య 2432అనియు, అది పర్వ సంగ్రహ సంఖ్య కించుక సమీపముగనే యున్నదనియు శ్రీ బెల్వాల్కరుగారు చెప్పుచున్నారు. (పుట. 27). ఇంత చిన్న పర్వమున నుత్తర దక్షిణ ప్రతులందుఁ గల శ్లోకముల సంఖ్యలో నింత అధిక వ్యత్యాస ముండుటకు దక్షిణ ప్రతులలో నతి దీర్ఘములైన మూఁడు నాలుగధిక పాఠము లుండుటయుఁ, గొన్ని పునరుక్తు లుండుటయుఁ గారణము. అధిక పాఠములలోఁ బ్రధానమైనది శిశుపాలవధ ఘట్టమున, 35, 36 అధ్యాయముల నడుమ నున్నది.

1. The Mahabharata is so enormous that each of its larger books has commonly been treated as a separate unit by scribes and redactors. There are very few Mss. of the entire work A larger number contain several books. But very many contain only single books. Fully two thirds of those used for this edition contain this book alone. (B O R I.Ed , Vol II Introduction. Page XXXVII)

ఇది శ్రీ పి. పి. యస్. శాస్త్రిగారి ప్రతిలో నే డధ్యాయములు (34-40) గా విభజింపఁబడి యున్నది. భండార్కరు పరిశోధన సంస్థవారి ప్రతి ననుసరించి యిందు 806 శ్లోకము లున్నవి. భీష్ముఁడు శ్రీకృష్ణుని మహత్త్వమును శిశుపాలుని కెఱింగించుట యిందలి విషయము. ఇది దక్షిణ ప్రతులలోనే కాని యుత్తర ప్రతులలోఁ గానరాదు. ఇట్లే 20 వ అధ్యాయమున 10 శ్లోకములతోఁ గూడిన దొకటియు 39 శ్లోకములతోఁ గూడిన దింకొకటియు రెండధిక పాఠము లున్నవి. ఇందు మొదటి దానిలో జరాసంధుఁడు కృష్ణుని భీమార్జునులను నిరసించి తాను వారిని జంపెద ననుటయు, రెండవదానిలోఁ గృష్ణ బలరాములు పుట్టి కంసుని సంహరించుటయు వర్ణింపఁ బడియున్నవి. ఈ విషయ ముత్తర ప్రతులలో లేదు. 28వ అధ్యాయమున 53వ శ్లోకము తరువాత సహదేవుఁడు దక్షిణ దిగ్జైత్రయాత్ర యొనరించుచు ఘటోత్కచుని లంక కరిగి విభీషణునుండి కప్పము తెమ్మని పంచుటయు, నాతఁడరిగి విభీషణ సత్కృతుఁడై యాతఁ డిచ్చిన కానుకలు తెచ్చుటయు, మున్నగు విషయములతోఁ గూడిన 135 శ్లోకములుగల అధిక పాఠమున్నది. ఈ వృత్తాంతము కూడ నుత్తర ప్రతులలోఁ గానరాదు.

దాక్షిణాత్య ప్రతులలో నధిక పాఠము లట్లే పునరుక్తులుకూడఁ బెక్కు కాననగుచున్నవి.

| | భండార్కరు ప్రతి | పి. పి. యస్. శాస్త్రిగారి ప్రతి |
|---|---|---|
| సహదేవుని మందలింపు | 2-36-1 | 2.33 - 33-37 |
| | | 2.41 - 1-7 |
| ధృతరాష్ట్రుఁడు ధర్మరాజుతోఁ | | 2-66 - 7-12 |
| జెప్పిన పలుకులు | 2-67-7-12 | 2-67 - 83-88 |
| ధర్మరాజు సహదేవుని, మంత్రు | | |
| లను యజ్ఞ సంభారములను | 2-30-27 | 2-29-33 |
| గూర్ప నియోగించుట | | 2-30-47 |
| ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుని | 2-46-13-18 | 2-51-17-23 |
| విచారమునకుఁ గారణ మడుగుట | | 2-52-13-19 |

ఈ పునరుక్తులనుబట్టి చూచినచో దాక్షిణాత్య ప్రతులలో నెవరో కొన్ని మార్పు చేర్పులు చేయ యత్నించినట్లు స్పష్టమగుచున్నది. పైని చూపఁబడిన యధిక పాఠములను బునరుక్తులను దొలఁగించి నప్పుడు కథాక్రమము భంగపాటు లేక సహజముగా సాగిపోవుచున్నది. నిజముగా దాక్షిణాత్య ప్రతియే ప్రాచీనమై యందలి కొన్ని భాగములను దొలఁగించుటచే నుత్తర ప్రతి యేర్పడి యుండు నని తలంచినచో నట్లు చేసినవారి నేర్పునన్య సామాన్యమని చెప్పవలసివచ్చును. ఏలయన నాయా భాగములు తొలంగింపఁ బడిన యెడ నేదో కొంత లోపము కల్గినదను సందేహముదయింపక పోవుటయే కాక యక్కడ నింకేమియు నుండి యుండదను నిశ్చయము కూడఁ గల్గునంత రమ్యముగా నా భాగములు చూపట్టు చున్నవి.1

నన్నయ పర్వ సంగ్రహమునఁ దానుపయోగించిన సభా పర్వములో 4311 శ్లోకము లున్నవని చెప్పియుండెను. ఈ సంఖ్య యది తప్పక దాక్షిణాత్య ప్రతియేయని చెప్పక చెప్పుచున్నది. "చతుస్సహస్రం శ్లోకానాం పంచశ్లోక శతాని చ శ్లోకా శ్చైకాదశ జ్ఞేయాః"అనునది దాక్షిణాత్య ప్రతులందలి పాఠము. G ప్రతిలో పంచశ్లోక శతాని యనుటకు బదులు త్రీణిశ్లోక శతాని యను పాఠాంతరమున్నది. నన్నయకు లభించిన పాఠము కూడ నిదియే యై యుండ వలయును. కాని లోపలి కథాక్రమమును బట్టి చూడ నాతఁడౌత్తరాహ ప్రతినే ప్రధానముగా గ్రహించెనని తోఁపక మానదు. ఏలయన దాక్షిణాత్య ప్రతులలో మాత్రమే కానవచ్చునవియు, నుత్తర ప్రతులలో లేనివియు, నగు పైని పేర్కొనఁ బడిన యధిక పాఠములు కాని పునరుక్తులు కాని యాతని సభా పర్వ భాగమున గోచరించుట లేదు.

1. నారదుఁడు బ్రహ్మసభను వర్ణించు సందర్భమున "నాకడకు సూర్యుఁడు వచ్చి పితామహు సభ వర్ణించినఁ దద్దర్శన కుతూహ లుండనయి యాదిత్యు తోడన యరిగి యక్కమల గర్భు సభం జూచితి" నని చెప్పినట్లు నన్నయ

1. The briefer text reads consecutively in a perfectly sensible way, leaving out the plus part of S. When that plus part is very long, as it often is, it is hard to conceive how these conditions could exist, if the plus was part of the original. (B O.R I Ed , Vol II, Introduction, Page XXX).

భారతములో నున్నది. (1 78). మూలమున "తతస్స భగవాన్ సూర్యః మా ముపాదాయ వీర్యవాన్. అగచ్ఛత్తాం సభాం బ్రాహ్మీం విపాపాం విగత క్లమామ్" అను శ్లోకము కనఁబడుచున్నది. V1, B, D, S ప్రతులలో సూర్యుఁడు నారదునిఁ బ్రియతమైన యంతరాత్మతో వర్షసహస్రికమైన వ్రత మాచరింపుమని చెప్పెననియు నంత నారదుఁడు హిమవత్పృష్ఠమున మహావ్రతము నారంభించె ననియుఁ జెప్పఁబడి యున్నది. (పుట. 55). నన్నయ భారతములో నీ వృత్తాంత మేదియుఁ గానరాదు. దీనిని బట్టి యాతఁడిచ్చట V1, B, D ప్రతులకుభిన్నమైన యుత్తర ప్రతులలోని పాఠము ననుసరించినట్లు స్పష్టమగుచున్నది.

2. కృష్ణుడు ధర్మరాజుతో జరాసంధుని దుష్కృత్యము లన్నియు వర్ణించి యాతనిఁ జంపినచో నురుతర సామ్రాజ్య విభవము చేకూరుననియు రాజ సూయము చేయ నలవడుననియుఁ దెల్పి "రక్షణంబున భగీరథుఁడు జయంబున న య్యౌవనాశ్వుండు నత్యుగ్ర బాహుబలంబున భరతుండు. .. అఖిల సామ్రాజ్యం బుఁబడసి"రని కొన్ని యుదాహరణములు సూచించెను, ఈ సందర్భమున మూలమున "హిత్వాకరాన్ యౌవనాశ్వః పాలనాచ్చ భగీరథః"అని యున్నది. Cn1 ప్రతిలో జిత్వా జయ్యాన్ యౌవనాశ్వః అను పాఠమున్నది. నన్నయ రచన దీని కనుగుణముగా నున్నది.

3. పై సందర్భముననే కృష్ణుఁడు భగీరథాదుల యుదాహరణములు చెప్పిన పిమ్మటఁ దెలుఁగు భారతములో "భూపాల! యిప్పుడిన్ని గుణంబులు నెన్నంగఁ గలవు నీ"కని తెల్పినట్లు కలదు. N1, V1, B, D ప్రతులలో దీనికి మూలమని చెప్పఁదగిన "సామ్రాజ్య మిచ్ఛతస్తేతు సర్వాకారం యుధిష్ఠిర" (పుట. 83) అను పాదము కనఁబడుచున్నది.

4. చండ కౌశికుఁడు బృహద్రథునితో జరాసంధుని మహత్త్వమును గూర్చి చెప్పుచు "గరుడుని గతి నన్య విహగంబు లనుగమింప నోపని యట్ల మానవులు వీని వీర్యంబు ననుగమింప నోప" రని తెల్పినట్లు నన్నయ భారతములోఁగలదు. S1, K, B1-2-4, Dn, D1-2-4-6 ప్రతులలో దీనికి మూలమైన "పతతో వైనతేయస్య గతి మన్యే యథా ఖగాః" (పుట. 76) అను పాదము కనఁబడుచున్నది.

---

Cn1 నీలకంఠుని వ్యాఖ్యానముతోఁ గూడిన బొంబాయి ప్రతి

5. కృష్ణుఁడు గిరివ్రజము చుట్టునున్న పర్వతములను బేర్కొనుచు నందొక్కటి వృషభమని చెప్పినట్లు మూలమునఁ గలదు. నన్నయ భారతమున దీనికి బదులు ఋషభమను పేరున్నది. S, K, $N_1$, $V_1$ ప్రతులలో "ఋషభ స్తథా" అను పాఠమున్నది.

6. జరాసంధ మరణానంతరము సహదేవుఁడు (జరాసంధ తనయుఁడు) పురోహితామాత్యాదులతోఁ గృష్ణుని కడ కరుదెంచి "మా తంత్రి చేసిన పనులు హృదయమున నిల్పకుము. ప్రపన్నుఁడనైన నాయెడ ననుగ్రహము చూపుము. ఇంక నేను మీ యనుమతిఁ బడసి తండ్రికి దహన సంస్కార మాచరింపఁ గోరుచున్నా"నని పలికెను. జనార్దనుఁ డందు కంగీకరించెను. సహదేవుఁడు నగరము ప్రవేశించి దహన సంస్కారము నెరవేర్చెను. పిమ్మట నాతఁడు మరల జనార్దనుని కడ కరుదెంచి రత్నములను 'అజావిగోమహిషాదులను' గొనివచ్చి ధర్మరాజున కిమ్మని ప్రార్థించెను. ఈ వృత్తాంతము (11 శ్లోకములు) దాక్షిణాత్య ప్రతులలో నున్నది. (పుట. 373). నన్నయ భారతములోఁ గాని ఉత్తర ప్రతులలోఁ గాని కానరాదు.

7. జరాసంధ వధానంతరము ధర్మరాజు (22-48 తరువాత) కృష్ణునిఁ బ్రశంసించుచు నాతని దయ వలననే భీముఁడు జరాసంధు సంహరింపఁ జాలె ననియు, జరాసంధ వధచేఁ దనకు సంపదలు చేకూరెననియుఁ బలికి రథవరము నాతని కొసంగెను. కృష్ణుఁడు రథమును బ్రతిగ్రహించి సంతోషించెను. ఈ విషయము S ప్రతులలో (పుట 373) 5 1/2శ్లోకములలో నున్నది. నన్నయ భారతములోఁ గానరాదు.

8. కృష్ణుఁడు ద్వారకానగరమున కరిగిన పిదప నర్జునుఁడు ధర్మరాజుతో "దివ్యములైన ధనురస్త్రములు లభించినవి. ఇంకఁ గోశ వివర్ధన మాచరింప వలెను. రాజులందఱును ధర్మజునకు కప్పము కట్టు నట్లొనరించెద"నని పలికెను. ధర్మరాజును వ్యాసధౌమ్యాదులును ఆ మాటలు విని సంతోషించిరి. అప్పుడు వ్యాసుఁడు ధర్మజునిఁ బ్రశంసించి యాతని సోదరు లెవరెవరే దిక్కునకు జైత్ర యాత్ర కరుగవలెనో సూచించెను. ఈ విషయము 23-3 తరువాత దాక్షిణాత్య ప్రతులలో 10 శ్లోకములలో నున్నది. నన్నయ భారతములోఁ గానరాదు.

9. నకులుఁడు జయించిన రాజులను పేర్కొనుచు నన్నయ "శైలీషక దాశారదేశంబుల రాజుల జయించి" అని దాశారదేశ రాజునుగూడ నా పట్టికలోఁ జేర్చెను. V1, B2-3-6, D, ( D6 ) ప్రతులలో మాత్రము,

"తాన్ దశార్ణాన్ స జిత్వా చ ప్రతస్థే పాండునందనః" (పుట 152) అను పాదము కనఁబడుచున్నది. దాశారదేశంబుల రాజులనుటకు బదులు కొన్ని తెలుఁగు వ్రాఁత ప్రతులలో "కర్ణాట హాటక దేశంబుల రాజుల"నని యున్నట్లు తెలియుచున్నది.

10. మూలమునందలి 33వ అధ్యాయములోని 21వ శ్లోకము తరువాత 18 1/2 శ్లోకములతోఁ గూడిన యధిక పాఠమొకటి, దాక్షిణాత్య ప్రతులలోఁ గనవచ్చుచున్నది. (పుట. 385). శ్రీ కృష్ణుని రాకయు, నాతని మహత్త్వ మును నిందు వర్ణింపఁబడి యున్నవి. నన్నయ భారతములో నీ విషయ మేమియుఁ గానరాదు.

11. శిశుపాలుఁడు భీష్ముని నిందించుచు నుదాహరణముగాఁ బక్షుల నను శాసించిన హంస కథ చెప్పెను. ఈ సందర్భమున దాక్షిణాత్య ప్రతులలో పక్షులకును హంసకును జరిగిన ధర్మవిషయ సంవాదము వింశతి శ్లోక పరిమిత మైనది కలదు. (పుట 423) నన్నయ భారతములో హంస కథ యున్నది కాని యా సంవాదము కానరాదు.

12. కృష్ణుఁడు శిశుపాలుని సంహరించుటకు ముందు దాక్షిణాత్య ప్రతు లలో 107 శ్లోకములతోఁ గూడిన యొక దీర్ఘమైన యధిక పాఠమున్నది. (పుట. 425). ఇందు ధర్మరాజడుగఁగా రాజ వినాశ సూచకములైన భౌమాంత రిక్ష నిమిత్తములను నారదుఁడు వివరించుట మున్నగు విషయము లున్నవి. ఈ వృత్తాంతము నన్నయ భారతములో గోచరించుటలేదు.

శిశుపాల వధానంతరము రాజసూయ వైభవమును వర్ణించు 47 శ్లోక ములతోఁ గూడిన యధిక పాఠ మింకొకటి దాక్షిణాత్య ప్రతులలో గోచరించు చున్నది. (పుట. 430). ఇదియును నన్నయ భారతమునఁ గానరాదు.

13. దుర్యోధనుఁడు ధృతరాష్ట్రునకుఁ బాండవుల వైభవమును వర్ణించి చెప్పు సందర్భమున నుత్తర ప్రతులలో నీ క్రింది శ్లోకము లధికముగాఁ గానఁబడు చున్నవి.

"వాసుదేవో ఽపి వార్ష్ణేయో మానం కుర్వ న్కిరీటినః
అదద ద్గజముఖ్యానాం సహస్రాణి చతుర్దశ
ఆత్మా హి పార్థః కృష్ణస్య కృష్ణో హ్యాత్మా కిరీటినః
య ద్బ్రూయా దర్జునః కృష్ణం సర్వం కుర్యా దసంశయమ్
కృష్ణో ధనంజయ స్యార్థం స్వర్గలోక మపి త్యజేత్
తథైవ పార్థః కృష్ణార్థే ప్రాణా నపి పరిత్యజేత్
సురభీం శ్చన్దనరసా న్హైమకుమ్భ సమాస్థితాన్
సహ్యజా న్దర్దురరుహాం శ్చన్దనాగురు సంచయాన్
మణిరత్నాని భాస్వన్తి కాంచనం సూక్ష్మవస్త్రకమ్
చోళ పాండ్యా వపి ద్వారం న లేభాతే హ్యుపస్థితౌ" (పుట 241).

ఈ శ్లోకములు నన్నయ భారతమునఁ జక్కఁగా ననువదింపఁబడి యున్నవి.

"మందిత సూర్యరశ్మి రుచి మన్మణిహార చయంబుతోఁ గట
స్యంది సుగంధి దానజల సంపదనొప్పెడి వాని దేవకీ
నందనుఁడిచ్చెఁ బ్రీతిఁ బదునాలుగువేలు గజంబులన్ జనా
నందన కీర్తియైన యమనాథ తనూజున కిష్ట మిత్రుఁడై 2.111

హరియును గిరీటియును నొండొరుల కభీష్టములు సలుపు చుండుదురంద
ఱ్ఱిరువురు నేకాత్ములు జనశరణ్యు లుత్తములు నిత్య సాంగత్యమునన్. 2.112

సాగర సారవారి రుహ శౌక్తిక మౌక్తిక విద్రుమ ద్రుమై
లా గురు చందనంబులు ప్రియంబున నిచ్చిరి తెచ్చి యున్నత
శ్రీగుణ యుక్తమైఁ బరఁగు సింహళ కేరళ చోళ పాండ్య దే
శాగత రాజపుత్త్రిలు మహాగుణశాలి కజాత వైరికిన్" 2.110.

14. రాజసూయ యాగ సందర్భమున ధర్మరాజునకు వివిధ దేశ భూపాలు రిచ్చిన కానుకలను దుర్యోధనుఁడు తండ్రికి వర్ణించి చెప్పు నప్పుడు

47 వ అధ్యాయములో 6వ శ్లోకము తరువాతను, 18వ శ్లోకము తరువాతను, 31వ శ్లోకము తరువాతను దాక్షిణాత్య ప్రతులలోఁ గ్రమముగా 29, 7, 10 శ్లోకములతోఁ గూడిన అధిక పాఠములు కనఁబడుచున్నవి. వీనిని నన్నయ యనువదించి యుండలేదు.

15. జూదమునకుఁ బోవునపుడు ధర్మరాజు రాజార్హమును షష్టిహాయనమునైన గజేంద్రము నెక్కి హస్తినా పురమున కరిగెనని 10 శ్లోకములతోఁగూడిన భాగము దాక్షిణాత్య ప్రతులలోనున్నది. నన్నయ భారతమున ''అనుజులు ద్రుప దాత్మజయును ననుచర ముఖ్యులును ధౌమ్యుఁడాదిగ విద్వజ్జనులును దోఁడను దేరఁగ నిన సన్నిభతేజుఁడరిగె నిభపురమునకున్"(2.158) అని మాత్రము వ్రాసి యుండెను.

16. ధర్మరాజు మాయా ద్యూతమున జయించుట మహాపాతకమనియు ధర్మ ద్యూతమున జయించుట ధర్మయుద్ధమున జయించు నంతియ పుణ్యంబనియు దేవలుఁడు చెప్పెనని శకుని కెఱింగింపఁగా నతఁడు సత్క్షత్రియుఁడు ద్యూతమును నిందింప రాదని పల్కి

''శ్రోత్రియో ఽ శ్రోత్రియ ముత నికృత్యైవ యుధిష్ఠిర
విద్వా నవిదుషో ఽభ్యేతి నాహుస్తాం నికృతిం జనాః" 53.11

అని చెప్పినట్లు మూలమున నున్నది. దాక్షిణాత్య ప్రతులలోఁ గూడనట్లే యున్నది. కాని కొన్ని యుత్తర ప్రతులలో

అకృతాస్త్రం కృతాస్త్రా శ్చ దుర్బలం బలవత్తరః
ఏవం కర్మసు సర్వేషు నికృత్యైవ యుధిష్ఠిర

అను పాదములు కనఁబడుచున్నవి. నన్నయ వ్రాసిన యీక్రింది పద్యము వీని కనుగుణముగనే యున్నది.

''బలహీనులయిన వారలు బలవంతుల నోడుచునపుడు బహు మాయల న చ్ఛలమునఁ జేయుట యెందును గలయదియ జయంబ కాదె కర్తవ్యమిలన్"(2.171)

---

Kɪ, B , $B_6$

Kɪ,Vɪ,$B_2$,Dn,$D_{5-6}$,$\bar{S}_1$

17. భీముఁడు దుర్యోధనుని తొడలు విఱుగ నడఁచెదనని పలికి యా యుధములున్న చోటికి దృష్టులు ప్రసరింపఁ జేయుచుండ భీష్మ విదుర ద్రోణాదు లది కోపమున కవసరము కాదని యతనిఁ బ్రశాంత చిత్తు నొనరించిరి. పిమ్మట ధృతరాష్ట్రు నగ్ని హోత్రాయతనమున వఱఱు లఱచుట మున్నగాఁ గల మహోత్పాతములు పుట్టెను. ఈరెండు విషయములకును నడుమ 63వ అధ్యాయము నందలి 21వ శ్లోకము తరువాత దాక్షిణాత్య ప్రతులలో 75 శ్లోకములతోఁ గూడిన అధిక పాఠమున్నది. కర్ణుని యుపదేశము ననుసరించి దుశ్శాసనుఁడు ద్రౌపదిని బలాత్కారముగా లోని కాకర్షింపఁబోవ ద్రౌపది యేడ్చుచు భీష్మ ద్రోణ విదురాదులను సంబోధించి రక్షింపుఁడని మొఱ పెట్టుటయు, విదురుఁడు ధృతరాష్ట్రుని దుర్యోధనుని మందలించుటయు, వారేమియు సమాధానమీయ కుండుటయు, దుర్యోధనుఁడు ద్రౌపదికి మాటి మాటికిఁ దన తొడలు సూపుటయు, భీమార్జున నకుల సహ దేవులు శపథములు పల్కుటయు, నర్జునుఁడు క్రుద్ధుఁడై ధనురస్త్రములు గ్రహించి దుర్యోధనాదు లందఱిని సంహరించెదనని విజృంభించుటయు, ధర్మ రాజాతని నుప శమింపఁ జేయుటయు నిందలి విషయములు. ఇవియేవియుఁ దెలుఁగు భారతములోఁ గానరావు.

18. ధృతరాష్ట్రుఁడు ద్రౌపదికి వరము లొసఁగిన పిమ్మట ధర్మరాజు తమ్ములును దానును గాంచన రథారూఢుఁడై యింద్రప్రస్థ పురమున కరిగెనని నన్నయ భారతములో నున్నది. (2,270) మూలమున "తేరథాన్ మేఘ పంకాశానాస్థాయ సహ కృష్ణయా" (65.17) యని మేఘ సంకాశములైన రథముల నధిష్ఠించిరని చెప్పఁబడినది. దాక్షిణాత్య ప్రతులలో సూర్య సంకాశములని యున్నది. $S_{I} \cdot K_{I-3}$. ప్రతులలో మాత్రము "హేమ సంకాశాన్"అను పాఠము కనఁబడుచున్నది. నన్నయ రచన దీనికనుగుణముగా నున్నది.

19. 70వ అధ్యాయము మొదట దాక్షిణాత్య ప్రతులలోఁ బాండవులు వనమున కరుగుచుండఁగా జనులు ప్రాసాద శిఖరములను, వృక్షాగ్రములను, గోపురములను అధిరోహించి వారిని జూచుచుఁ బల్కిన విచార వాక్యములు 35 శ్లోకములలో చెప్పఁబడినవి. నన్నయ భారతములో నవి యేవియుఁ గానరావు.

20. పాండవు లరణ్యమున కేగుటకు ముందు తల్లికడ కరుదెంచి గురు వృద్ధాను మతమున నామె చరణములకు మ్రొక్కిరి. అప్పుడామె మిక్కిలి

విలపించెను. తరువాత నామె దుఃఖావేశ పరవశయై కృష్ణునిఁ దలంచి మొఱ వెట్టినట్లు నన్నయ భారతమున రెండు పద్యములున్నవి (286. 287) వీనికి మూలములని చెప్పఁదగిన శ్లోకములు ఉత్తర ప్రతులలోఁ గనబడుచున్నవి. (పుట 450).

నన్నయ పర్వసంగ్రహమున నొసంగిన సభాపర్వ శ్లోక సంఖ్యను జూచినచో నాతఁడు తప్పక దాక్షిణాత్య పాఠమునే యనుసరించి యుండునని తోఁచును. కాని యాతని సభాపర్వ రచనాక్రమము పరిశీలించినప్పు డాయభిప్రాయము మార్చుకొనక తప్పదు. ఏలయన దాక్షిణాత్య ప్రతులందు మాత్రము కనఁబడు నధిక పాఠముల నన్నింటిని-సుమారు రెండువేల శ్లోకముల పరిమితి గలవానిని- ఆతఁడు పూర్తిగా నుజ్జగించి వైచెను. ఆ భాగము లందలి కథాంశముల నాతఁడించుకయైన స్పృశించి యుండలేదు. భీష్ముఁడు కృష్ణుని మాహాత్మ్యమును శిశుపాలుని కెఱింగించు సందర్భమునఁ గలయతి దీర్ఘమైన యధిక పాఠము నందాధ్యాత్మిక విషయ మెక్కువగా నుండుటచే నాతఁడు దానిని విడిచి వైచెనని చెప్పవచ్చును గాని మిగిలిన వాని విషయమున నట్లు చెప్పుటకు వీలు లేదు. అందుచే నాతఁడు సభా పర్వానువాద సందర్భమున ననుసరించినది దాక్షిణాత్య పాఠము కాదని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును.

ఐనచో నాతఁడు సభాపర్వమున నాలుగువేల మూఁడు వందల పదొకండు శ్లోకము లుండెనని చెప్పనేల యను ప్రశ్నవచ్చును. దాక్షిణాత్య ప్రతులలోఁ దప్ప నుత్తర వర్గమునకుఁ జెందిన యేప్రతిలోఁగాని యన్ని శ్లోకములు గానరావు. పైని పేర్కొనఁబడిన యతి దీర్ఘమైన యా యధిక పాఠమున్నప్పుడుకాని శ్లోకముల సంఖ్య మూఁడువేలకు మించదు. అదియొక్క దాక్షిణాత్య వర్గమునకుఁ జెందిన ప్రతులలో మాత్రమే కనఁబడుచున్నది. దీనివిబట్టి నన్నయ పర్వ సంగ్రహ పర్వమున రెండువేల మున్నూట పదునొకండు శ్లోకములే కలవని వ్రాసినను దాక్షిణాత్య ప్రతులందలి సంఖ్య నెఱింగిన వారెవ్వరో రెండును నాలుగుగా మార్చి క్రొత్త పాఠమును గల్పించి యుందురని తోఁచు చున్నది. లేనియెడల నన్నయ పర్వ సంగ్రహమున దాక్షిణాత్య ప్రతులందలి శ్లోక సంఖ్యనుజెప్పి యనువాదము చేయునప్పు డుత్తరప్రతి ననుసరించెనని చెప్పవలసి వచ్చును.

మూలము నందలి పర్వ సంగ్రహ పర్వములో దాక్షిణాత్య ప్రతులందు సభా పర్వ శ్లోక సంఖ్యను జెప్పు సందర్భమున "చతుస్సహస్రం శ్లోకానాం పంచశ్లోక శతాని చ" (పుట 44) అను పాఠమున్నది. $G_7$ ప్రతిలో "త్రీణి శ్లోక శతాని చ" అను మఱియొక పాఠమున్నది. నన్నయ యాది పర్వము ననువదించు నప్పుడు ప్రధానముగా దాక్షిణాత్య పాఠమునే యనుసరించెనని యిదివఱకుఁ జెప్పఁబడియున్నది. అందుచేఁ బర్వ సంగ్రహము ననువదించు నప్పుడతఁడు దాక్షిణాత్య ప్రతులందలి పాఠమునే యనువదించి సభాపర్వము నారంభించు నప్పుడు తనకు నచ్చిన వేఱొక ప్రతి నాధారముగాఁ గొని యుండె నని యొక విధముగా సమాధానము చెప్పవచ్చును గాని యప్పుడాతఁడు పర్వ సంగ్రహమున నొసంగఁబడిన శ్లోక సంఖ్య విషయమున నంత శ్రద్ధ వహింప లేదని చెప్ప వలసివచ్చును. నన్నయ సుమారు రెండున్నఱవేల శ్లోకములతోఁ గూడిన యుత్తర ప్రతినే యనువదించి పర్వసంగ్రహమున నంధముగా నాలుగు వేల మూఁడు వందల పదునొకండు శ్లోకములున్నవని యెట్లు చెప్పును? ఒకవేళ ముందట్లు వ్రాసియుండినను దరువాత సభాపర్వ విషయమునఁ దా ననువదించిన ప్రతి ననుసరించి యాసంఖ్యను సవరింప కుండునా? అందుచేఁ దెలుఁగు భార తమునందలి పర్వ సంగ్రహములోని సభాపర్వ శ్లోక సంఖ్య నన్నయ యిచ్చినది కాదనియు దాక్షిణాత్య ప్రతులందలి సంఖ్య బాగుగా నెఱింగిన వారెవ్వరో దాని నట్లు మార్చి యుందురనియుఁ జెప్పక తప్పదు.

సభాపర్వానువాద సందర్భమున నన్నయ యుత్తర పాఠమునే ప్రధాన ముగా ననువదించి యుండునని యెఱింగిన పిమ్మట నందలి యేప్రతి నాతఁ డనుసరించి యుండుననునది కూడఁ బరిశీలింపవలయును. నన్నయ కేయే లిపులతోఁ బరిచయ ముండెనో చెప్పుట కాధారములు లేవుకాని యాతని కప్పటి తెలుఁగు లిపియు దేవనాగరి లిపియుఁదప్పక తెలిసియుండునని మాత్రము చెప్పవచ్చును. ఆతఁడుత్తర ప్రతులను జూడఁదలంచినప్పుడు దేవనాగరీ ప్రతు లనే చూచియుండుననుట యసమంజసముగా నుండదు. శ్రీ బెల్వాల్కరుగారు సభాపర్వమునకు ముందు వ్రాసిన యుపోద్ఘాతములో నీ క్రింది దేవనాగరీప్రతులను బేర్కొని యున్నారు.

$K_1$ : పూనా, బొంబాయి ప్రభుత్వము సేకరించినది. No. 56 of 1882-83

$K_2$ : —Do— No. 192 of విశ్రామ్‌బాగ్ II

$K_3$ : అడయారు లైబ్రరీ. No. xxxv B 131

$K_4$ · పూనా, బొంబాయి ప్రభుత్వము సేకరించినది. No. 29 of A 1879-80

ఈ పై నాలుగు ప్రతులును కాశ్మీర పాఠము ననుసరించి దేవనాగరీ లిపిలో వ్రాయఁబడినట్టి ప్రతులు. అవికాక దేవనాగరీ లిపిలో వ్రాయఁబడిన ప్రతులును మఱికొన్ని యున్నవి.

$D_{n1}$ : పూనా, బొంబాయి ప్రభుత్వము సేకరించినది. No. 511 of విశ్రామ్‌బాగ్ I

$D_{n2}$ : —Do— No. 235 of 1895-1902

ఈ రెండు ప్రతులును నీలకంఠుని వ్యాఖ్యతోఁగూడినవి.

$D_1$ : పూనా, బొంబాయి ప్రభుత్వము సేకరించినది No. 167 of 1884-87

$D_2$ —Do— No. 74 of 1902-1907

$D_3$ —Do— No. 469 of విశ్రాంబాగ్ I

$D_4$ —Do— No. 210 of 1887-91

$D_5$ —Do— . No. 510 of విశ్రాంబాగ్ I

$D_6$ బరోడా, Oriental Institute Library. No 827.

దేవనాగరీలిపిలో వ్రాయఁబడిన పై ప్రతులలో నన్నయ కాశ్మీరప్రతి ననుసరించి వ్రాయఁబడిన ( K సంజ్ఞగల ) ప్రతుల మాతృకనే యనుసరించి యుండునని తోఁచుచున్నది. దానికిఁ గారణము లీ క్రిందఁ జూపఁబడుచున్నవి.

1. నారదుఁడు సూర్యుని యుపదేశము ననుసరించి హిమవత్పృష్ఠమునఁ దపమాచరించిన వృత్తాంతము నన్నయ భారతమునను లేదు. K ప్రతులందును లేదు. ( పైని పేర్కొనఁబడిన దృష్టాంతములలో 1 వ సంఖ్య కలది ).

2. 5 వ అధ్యాయము నందలి మొదటి శ్లోకము తరువాత పెక్కు ప్రతులలో నారదుని వర్ణించు శ్లోకము లెనిమిదియున్నవి. నన్నయ వాని ననువదించి యుండలేదు. ఆ శ్లోకములు $\bar{S}_1$,$K_{1-3}$,$N_1$ ప్రతులలోఁ గానవచ్చుటలెదు.

3. $\bar{S}_1$,$K_1$, ప్రతులలో "జిత్వా" అను పాఠమున్నది. (పై యుదాహరణము లందు 2 వ సంఖ్య కలది.)

4. పైని పేర్కొనఁబడిన 4 వ సంఖ్యగల యుదాహరణములోని

"పతతో వైనతేయస్య గతిమన్వే యథాఖగాః"

అను పాదము K ప్రతులన్నిటిలో నున్నది.

5. గిరివ్రజము చుట్టునున్న పర్వతములలో వృషభమనునది K ప్రతులన్నిటిలో ఋషభమనియే పేర్కొనఁబడియున్నది. (5 వ సంఖ్యగల యుదాహరణము)

6. "అతుల చతురంగసేనాయుతుఁ డంతర్గిరి బహిర్గిరోపగిరుల భూపతులనని నోర్చి శౌర్యోన్నతిఁ గొవియెను వారిచేత నానాధనముల్"
సభా - ౧ - 234

"బహిర్గిరం" అను పాఠము $K_3$ ప్రతులలో నున్నది.

7. "తిత్తిరి కల్మాష మండూకాఖ్యమయూర హంస శుక సవర్ణంబులైన హయంబుల" (సభా. ౧ - 235) సంస్కృతమునందలి యితర ప్రతులలో మండూకాక్షన్ అని యుండఁగా $K_{3-4}$,B,D,$G_4$ ప్రతులలో "మండూకాఖ్యాన్" అను పాఠమున్నది. తెలుఁగు వ్రాఁతప్రతులలోఁగూడఁ గొన్నింట "మండూకాక్ష" అను పాఠ మున్నదఁట.

8. "దత్తక మయూరకాది శూద్రులతో" సభా. ౧-266. $K_4$ ప్రతిలో మత్త యనుటకు దత్త యను పాఠమే కావవచ్చుచున్నది. $\bar{S}$, ప్రతిలో "శూద్రైః" అనుటకు బదులు "శూద్రైః" అను పాఠము వ్రాయఁబడి యున్నది.

9. "ఉత్తమ జ్ఞాన వృద్ధునా నుండెనేని, బాలుఁడయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు
క్షత్త్రియుఁడు పూజ్యుఁ డమిత విక్రమ సమృద్ధి, నుర్వీపతులలో నధికుఁడై యుండెనేని". (సభా. ౨-25)

దీనికి మూలమున :

"జ్ఞాన వృద్ధో ద్విజాతీనాం క్షత్త్రియాణాం బలాధికః" (2-35-16) అను పాదమున్నది. పై రెంటింటను గూడ బ్రాహ్మణ క్షత్త్రియుల విషయమే కాని వైశ్య శూద్రుల విషయము చెప్పఁబడలేదు. K4, V1, B, D ప్రతులలో

"వైశ్యానాం ధాన్యధనవాన్ శూద్రాణా మేవ జన్మతః" (పుట. 177) అను పాదము కూడఁ జేర్పఁబడి యున్నది. $K_4$లోఁ దప్ప మిగిలిన K ప్రతులలో నీ పాదము లేదు. నన్నయయు దీనిని దెనిఁగింప లేదు.

10. రాజసూయ యాగ సందర్భమునఁ బాండవుల వైభవమును జూచి యీర్ష్యాగ్రస్తుఁడై కృశించిన దుర్యోధనుని శకుని నీతులు చెప్పి యోదార్చెనవి 44 వ అధ్యాయములోఁ జెప్పఁబడి యున్నది. ఈ యధ్యాయ మంతయు నా నీతి బోధయే. ఇది శకుని సహజ స్వభావమునకు విరుద్ధముగా నుండుటచే నన్నయ విడిచి వైచెను. అందలి కొన్ని శ్లోకములు K 2-3 ప్రతులలోఁ గానవచ్చుటలేదు.

11. పైని పేర్కొనఁబడిన 16 వ సంఖ్య గల యుదాహరణము లోని

"అకృతాస్త్రం కృతాస్త్ర శ్చ దుర్బలం బలవత్తరః
ఏవం కర్మసు సర్వేషు విక్రుత్యైవ యుధిష్ఠిర"

అను భాగమును నన్నయ యనువదించెను. ఇందలి మొదటి పాదము K 1-3 ప్రతులలోను రెండవ పాదము $K_1$ ప్రతిలోను గానవచ్చుచున్నవి.

12. భీముఁడు ధర్మరాజుపైఁ గోపించి "పాప ద్యూతంబునఁ బ్రవర్తించి యధర్మ ప్రవృత్తుండ వయితి కావున భవద్బాహు దాహంబు సేయవలయు నని" పలుక నర్జునుఁడు ధార్మికుఁడును జ్యేష్ఠుఁడునైన ధర్మజునట్లు విందింప రాదనియుఁ, బరులచే నాహూతుఁడై క్షత్త్ర ధర్మమున కనుగుణముగా నాతఁడు జూదమాడి యుండెననియుఁ జెప్పి యాతని నుపశమింపఁ జేసెను. అప్పుడు భీముఁడు

" ఏవ మస్మి కృతం విద్యాం య ద్య స్యాహం ధనంజయ
దీప్తే ఒగ్నౌ సహితౌ బాహూ నిర్దహేయం బలా దివ " 2-61-10.

అని పల్కినట్లు పెక్కు ప్రతులలో నున్నది. నన్నయ దానిని దెనిఁగింప లేదు. $K_3$ ప్రతిలోఁ గూడ నీ శ్లోకము కానవచ్చుట లేదు.

13. దుశ్శాసనుఁడు ద్రౌపది కట్టిన వలువ లొల్చుచుండఁగా నామె " గోవింద ద్వారకావాస – కృష్ణ గోపీ జన ప్రియ " ఇత్యాదిగాఁ గృష్ణునిఁ బ్రార్థించెనని $K_1$, ప్రతిలో నున్నది. (పుట. 304). నన్నయ భారతములో నిట కృష్ణ స్మరణము లేదు. ఇతరములైన K ప్రతుల లోను శారదా ప్రతుల లోను (భండార్కరు పరిశోధన సంస్థ వారి ప్రతులలోను) గూడ నా ప్రార్థన కన వచ్చుట లేదు.

14. ద్రౌపది మొదటి వర మడిగిన పిమ్మట ధృతరాష్ట్రుఁడు " ఇచ్చితి నింక రెండవ వరంబు వేఁడు " మనియు, రెండ వరమడిగిన పిమ్మట "నీ కోరిన వరం బిచ్చితి నింక మూఁడవ వరంబు వేఁడు " మనియుఁ బలికెనని నన్నయ భారతమున నున్నది. $K_4$ ప్రతిలో మొదటి దానికి

" ఏవం భవతు కల్యాణి। యథా త్వ మభి భాషసే " అనియు, రెండవ దానికి " తథాస్తు తే మహాభాగే। యథా త్వం నంది చీచ్ఛసి " అనియు మూల ములు కనఁబడుచున్నవి. (పుట 320)

15. ధృతరాష్ట్రుఁడు మూఁడవ వరము వేఁడు కొమ్మనఁగా ద్రౌపది
" వైశ్య సతికి నొక్క వరము సత్క్షత్త్రియ సతికి రెండు శూద్ర సతికి మూఁడు
విప్ర సతికి నూఱు వేఁడఁ జన్వరములు " (సభా. ౨-268)

అని పల్కినట్లు నన్నయ భారతము. దీనికి మూలమున

" ఏక మాహు ర్వైశ్యవరం ద్వౌ తు క్షత్త్రస్త్రియా వరౌ
త్రయ స్తు రాజ్ఞో రాజేంద్ర – బ్రాహ్మణస్య శతం వరాః " (2.6.3-35)

అను శ్లోకము కనఁబడుచున్నది. $K_1$ ప్రతిలో "బ్రాహ్మణస్య" అనుదానికి "బ్రాహ్మ ణ్యాశ్చ " అను పాఠ మున్నది. శూద్రస్త్రీ ప్రసక్తి మూల శ్లోకమున లేనేలేదు.

16. పైని పేర్కొనఁ బడిన 18 వ సంఖ్య గల యుదాహరణమున S, K1-3 ప్రతులలో " హేమ సంకాశాన్ " అను పాఠ మున్నట్లు చెప్పఁబడినది. నన్నయ యనువాదము దాని కనుగుణము గానే యున్నది.

పై యుదాహరణములను బట్టి నన్నయ దేవనాగరీ లిపిలో వ్రాయఁబడిన K ప్రతుల మాతృక ననుసరించెనని చెప్పుటకు వీలగుచున్నది. ఆతని రచన పెక్కు విధముల భండార్కారు సంస్థవారు ప్రధానముగా గ్రహించిన శారదా ప్రతికిఁ గూడ సన్నిహితముగనే యున్నది. శారదా ప్రతి సంప్రదాయమే K సంజ్ఞ గల ప్రతులలో ననుసరింపఁబడుట యిందుకుఁ గారణము. K సంజ్ఞ కల నాలుగు ప్రతులలో మరల నన్నయ దేని ననుసరించెనో నిర్ణయించి చెప్పుటకుఁ దగిన యాధారములు లభించుట లేదు.

నన్నయ సభాపర్వము తెనిఁగించునెడ ప్రధానముగా నుత్తర ప్రతులనే యనుసరించిన మాట సత్యమే యైనను దక్షిణ ప్రతుల నసలు చూచి యుండక పోలేదు. దక్షిణ దేశములో నుండి యాతఁడు దాక్షిణాత్య పాఠము చూచియుండ లేదనుట హాస్యాస్పదముగా నుండును. దక్షిణ ప్రతులలో నధిక పాఠములును, బునరుక్తులును హెచ్చుగా నుండుట చేతను, ఉత్తర ప్రతులందలి రచన సంక్షిప్తమయ్యు లోపము లేవియు లేక సక్రమముగా సాగిపోవుచుండుట చేతను ఆతఁడు దానినే ప్రధానముగా గ్రహించి యుండును. అతఁడు దక్షిణ ప్రతులను గూడఁ జూచి యందలి పాఠములను గూడఁ గొన్నింటి నవలంబించెననుట కీ క్రింది యుదాహరణములు తార్కాణములు కాఁజాలును.

1. చండకౌశికుఁడు బృహద్రథుని భక్తికి మెచ్చి నీకేది యిష్టమో చెప్పు మిచ్చెదనని పలుక నాతఁడు

" సంతతమైన సర్వసుఖసంపద గల్గియు దానికిం దగన్
సంతతి లేమిఁజేసి యది సర్వము హేయమ కాఁదలంచి ని
శ్చింతుఁడనై ధృతిం దపము సేయఁగ వచ్చితిఁ బుత్త్రిజన్మమై
నంతన యేను మీ దయఁ గృతార్థతఁ బొందుదు సన్మునీశ్వరా" (౧-140)

అని వచించినట్లు నన్నయ భారతములోఁ గలదు. దీనికి మూలమైన భాగము దాక్షిణాత్య ప్రతులలో మాత్ర మున్నది.

2. కృష్ణుఁడు భీమార్జునులతో భేరులను గూర్చి చెప్పుచు " ఇవి యిప్పు రంబు వింతవారు చొచ్చునప్పు డమ్మని శక్తిం జేసి మ్రోయు " నని తెల్పినట్లు నన్నయ భారతములో నున్నది. (సభా. ౧-175)

" ఘోర నాదం నదం త్యేతే పరచక్రాగమే సదా " అను పాదము T ప్రతిలో మాత్రమే కలదు.

కృష్ణ భీమార్జునులు భేరులు మూటిని వ్రచ్చిన విషయము మూలమున లేదు.అదియును T I ప్రతిలో నున్నది.

" భంక్త్వా భేరీత్రయం తే ఽపి చైత్య ప్రాకార మాద్రవన్'' (పుట 105) ఈ సందర్భమున మూలములో వారు

" యత్రతాః ప్రాణదన్ భేర్యః దివ్య పుష్పావ చూర్ణితాః " (2-19-16) అని భేరులను మ్రోయించిరని మాత్ర మున్నది.

3. చతుర్దశి నాఁటి రాత్రి జరాసంధుఁ డలసి యుండుట చూచి కృష్ణుఁ డాతనిఁ జంపివేయ భీముని హెచ్చరించెను. అప్పుడు " అనిల తనయుం డనిల దేవునిం దలంచి తత్ప్రసాదంబున నధిక సత్త్వ సమేతుండయ్యె " నని నన్నయ భారతము (సభా. ౧. 208). దీనికి దాక్షిణాత్య ప్రతులలో

" ఏవ ముక్త స్తదా భీమః మనసా చిన్త్య మారుతమ్

జనార్దనం నమస్యైవ పరిష్వజ్య చ ఫల్గునమ్" (పుట. 119) అను శ్లోకమున్నది.

4 సహదేవుని దిగ్విజయ యాత్ర సందర్భమున నన్నయ భారతములో నాతఁడు లంక కెవరో దూతలను బంపెనని మాత్రము వ్రాయఁబడియున్నది. కాని యొక్క ప్రతిలో నతఁడు ఘటోత్కచునిఁ దలంచె ననియు, నాతఁడు ప్రత్యక్షము కాఁగా లంకకు దూతగాఁ బంపెననియు, విభీషణుఁ డాతని వలన వృత్తాంతమంతయు విని కానుక లంపెననియుఁ గనఁబడుచున్నది (పుట. 272 సభా ౧. 261 తరువాత) ఈ విషయ ముత్తర ప్రతులలో నెక్కడను గాన రాదు. Tɪ, ప్రతిలోనిది సవిస్తరముగా వర్ణితమైయుండుట గాంచి తరువాత

నెవ్వరైన దానిని సంగ్రహముగాఁ దెలుఁగు భారతమునఁ జొప్పించి యుండవచ్చును.

5. సభా పర్వ ప్రథమాశ్వాసము నందలి 281 వచనమున నర్జునుని సారథి పేరు "రుక్మ" యని నన్నయ వ్రాసియున్నాఁడు. మూలమున నిచ్చట "పూరుశ్చార్జున సారథిః" అని యున్నది. (2. 30-30). దాక్షిణాత్య ప్రతులలో "రుక్మశ్చార్జున సారథిః" (పుట 158) అను పాఠమున్నది.

6. శిశుపాలుఁడు కృష్ణు నధిక్షేపించు సందర్భమున నన్నయ భారతమున

"పూతనా ఘాతంబు చేతనేతరమైన
  శకటంబు త్రోపును జరణ నిహతి
వీఁకతోఁ గదుఁ బూచు మ్రాకుల విఱుపును
  వల్మీక మాత్ర పర్వతము నెత్తి." (స. ౨-41)

అను పద్యమున్నది. మూలమున "పూచు మ్రాకుల విఱుపును" అనుదానికి సరియైన వాక్యము లేదు. దాక్షిణాత్య ప్రతులలో మాత్రము పూచు మ్రాకు లని లేక పోయినను

"అశ్వ ప్రమాణౌ తౌ వృక్షౌ యద్యనేన నిపాతితౌ"

అను పాఠము కనఁబడు చున్నది.

7 దుర్యోధనుని సభాప్రలంభంబు గాంచి పాంచాలియుఁ బాండు కుమారులును నగిరని తెలుఁగు భారతము (స. ౨-86). మూలమున నిచ్చట

"తథాగతం తు తం దృష్ట్వా భీమసేనో మహాబలః
అర్జున శ్చ యమౌ చోభౌ సర్వే తే ప్రాహసం స్తదా" (2-43-7)

అని యున్నది. ద్రౌపది కూడ నవ్వుట లేదు. దాక్షిణాత్య ప్రతులలోఁ బై శ్లోకములోని మొదటి పాదమునకు

"తథైవ ద్రౌపదీ రాజన్ భీమసేనో మహాబలః" (పుట 210)

అను పాఠము కనఁ బడు చున్నది.

8. దుశ్శాసనుఁడు ద్రౌపదిని రజస్వల నని చెప్పు చున్నను వినక బలాత్కారమున సభలోని కీడ్చుకొని పోవు సమయమున నామె

" గోవింద ద్వారకావాస కృష్ణ గోపీజన ప్రియ "

ఇత్యాదిగాఁ గృష్ణునిఁ బ్రార్థించినట్లు K -2-3 ప్రతులలో నున్నది. నన్నయ భారతములోఁగాని దాక్షిణాత్య ప్రతులలోఁ గాని కృష్ణ స్మరణ మిచ్చటఁ గాన రాదు. " కోమలి కృష్ణుఁ దలంచె భీతయై" (౨-219) అను వాక్యమును నన్నయ సభలోని వారిని గూర్చి మొఱయిడిన పిమ్మట వ్రాసెను. అచ్చటఁ గృష్ణ స్మరణ మే ప్రతిలోను గానరాదు.

౨9. పాండవు లరణ్యమున కేగునప్పుడు మూలమున ముందు సహదేవుని సంగతియుఁ బిమ్మట నకులుని సంగతియుఁ జెప్పఁబడినది తెలుఁగు భారతమున 3)1 వ పద్యములో " ధూరేణు లిప్త శరీరుఁడగుచు నకులుండు సనియె మానక లజ్జఁజేసి యధోవక్త్రుఁడై సహదేవుఁ డరిగె"నని వ్రాయఁబడియున్నది.T ,G3,M1 ప్రతులలో నీ క్రమమే పాటింపఁబడినది. . ...... . ఇట్లే పాండవు లా విధముగా నరుగుటకుఁ గారణ మేమని ధృతరాష్ట్రుఁడు విదురు నడుగ నతఁడు సమాధానము చెప్పునప్పుడు కూడ నన్నయ పాటించిన క్రమము మూలమునకు భిన్నముగా నున్నది. (౨-306) T 1, G 3,5 ప్రతులలో నన్నయ వ్రాసినట్లే యున్నది

ఈ విధముగా నన్నయ దాక్షిణాత్య ప్రతులను గూడఁ జూచి తనకు నచ్చిన కొన్ని పాఠముల నందుండి కూడ గ్రహించె నని తెలియుచున్నది. కాని యాతఁడు ప్రధానముగా గ్రహించినది ఉత్తర ప్రతియే యనుటకు మాత్రము సందేహము లేదు. లేనిచో దాక్షిణాత్య ప్రతులలో నిప్పుడు కనవచ్చు చున్న అధిక పాఠము లన్నియు నాతని కాలమునకుఁ దరువాతఁ జేరిన వని చెప్పవలసి వచ్చును.

అరణ్య పర్వము :-

పర్వ సంగ్రహమున నన్నయ యరణ్య పర్వములోఁ గల శ్లోకముల సంఖ్య 13 664 అని చెప్పి యుండెను. సంస్కృతమున నుత్తర ప్రతిలోఁ గాని దక్షిణ ప్రతులలోఁ గాని యిన్ని శ్లోకములు లేవు. కలకత్తా ప్రతిలో 12,848 శ్లోకములును, శ్రీపి. పి. యస్. శాస్త్రిగారి ప్రతిలో 11,138 శ్లోకములును ఉన్నట్లు తెలియు చున్నది. ఆది సభా పర్వముల విషయమున నుత్తర ప్రతుల కంటె దక్షిణ ప్రతులే విస్తృత తరములై యెక్కువ శ్లోకములను గలిగియున్నట్లు

చూచి యుంటిమి. అరణ్య పర్వమున మాత్ర మా పరిపాటి వ్యత్యస్తమైనది. దక్షిణ ప్రతులలో కంటె నుత్తర ప్రతులలోనే సుమారు రెండువేల శ్లోకము లధికముగాఁ గనవచ్చు చున్నవి. నన్నయ పర్వ సంగ్రహమున పేర్కొన్న సంఖ్య దక్షిణ ప్రతుల సంఖ్య కంటె నుత్తర ప్రతుల సంఖ్యకే సన్నిహితముగా నున్నదని వేఱుగాఁ జెప్ప నవసరము లేదు. అందుచే నాతఁ డరణ్య పర్వాను వాదము విషయమునఁ గూడ నుత్తరప్రతులనే ప్రధానముగా గ్రహించెనని తోఁచు చున్నది. ఆంతరమైన సాక్ష్యము నైతమీ విషయమునే బలపఱుచు చున్నది.

1. శౌనకుఁడు ధర్మరాజునకు జనక గీతలు చెప్పిన పిమ్మట "విషయాభి లాష విశిఖ విద్ధులై దేహాలు తేజో లుబ్ధంబులైన శలభంబులంబోలె శోకాన లంబునం బడి తమ్మెఱుంగక యవిద్యాకర్మ తృష్ణలం జేసి సంసార చక్రంబు నందుఁ బ్రవర్తిల్లుదు" రని తెల్పినట్లు నన్నయ భారతములో నున్నది. (అర.౧-33) మూలమున నిచ్చట శోకాగ్ని యనుటకు బదులు "లోభాగ్నౌ" అని వ్రాయఁబడి యున్నది. $K_3$ ప్రతిలో శోకాగ్నౌ అను పాఠమే కనఁబడు చున్నది. (పుట. 12)

2. ద్రౌపదీ ధర్మరాజుల సంవాదము నందలి అరణ్య ౧-215 పద్యములో ద్రౌపది భీమార్జునుల పూర్వస్థితిని వర్తమాన స్థితివి బోల్చి విచారించిన పిమ్మట "సుఖోచితాత్ములైన కవలు దీనులై యున్నఁ జూచియు నుపశమంబుఁ దాల్చి యుండ నగునె" యని ధర్మజునితోఁ బల్కినట్లు నన్నయ భారతము నందున్నది. మూలమున నకుల సహదేవులను గూర్చియు ద్రౌపదిని గూర్చియుఁ గూడ వేఱు వేఱు శ్లోకములు చెప్పఁబడినవి (3. 28-30, 31, 32). ఉత్తర ప్రతులలో

"కస్మాత్క్షమసి పార్థివ
నకులం సహదేవం చ దృష్ట్వా తౌ దుఃఖితావుభౌ
అదుఃఖార్హౌ మనుష్యేన్ద్ర" (పుట. 87)

అను పాఠము కనఁబడుచున్నది. నన్నయ రచన దీని కనుగుణముగానే యున్నది. అతఁడు పై శ్లోకముల ననువదింపక యీ పాఠమునే యనుసరించెను.

3. యాదవ పాంచాలాదు లడవిలో నున్న పాండవులను జూచుటకరుదెంచి నప్పుడు ద్రౌపది కృష్ణునితోఁ దాను బడిన పాట్లన్నియుఁ జెప్పి విలపించెను.

కృష్ణుఁ డామె మాటలు విని యర్జున బాణ ఛిన్న దేహులై కౌరవులు తప్పక మరణింతురనియు, నామె రాణి కాఁగలదనియుఁ బల్కి యామె నోదార్చెను. అప్పు ధర్జుమఁడు ద్రౌపదిని జూచి,

" ఈ పురుషోత్తముండు మన కందఱకుం గుశలంబు సేయుచుం,
బాప కలంక పంకములఁ బాయఁగఁ జేయుటఁజేసి దుర్మదో,
ద్దీపిత శత్రు సంహతి హతిం బరమార్థమ పొందు నేల సం
తాపము నీకుఁ జేయఁగఁ ద్రిధామ జయోన్నతి గల్గి యుండఁగన్ "

(అర. ౧-143)

అని పల్కినట్లు నన్నయ భారతమున నున్నది. దాక్షిణాత్య ప్రతులలో నిక్కడ నర్జునుఁ డేమియుఁ బల్కినట్లే లేదు. ఉత్తర ప్రతులలో నీ సందర్భమున ద్రౌపది కృష్ణుని యనునయ వాక్యము లాలించిన పిమ్మట నర్జునుని వంకఁ జూచె ననియు, నప్పు డర్జునుఁడు

" మా రోదీః శుభ తామ్రాక్షి ! య థాహ మధుసూదనః
తథా తద్భవితా దేవి! నాన్యథా వరవర్ణిని " (పుట. 50)

అని పల్కినట్లును గలదు. నన్నయ వ్రాసిన పద్య మీ శ్లోకమున కనువాదము కాదు కాని రెంటింటను గల భావము మాత్రము సమానమే

4. పాశుపతాస్త్ర సంపాదనమునకై యర్జునుఁడు పాండవుల వీడి యరుగుటకు ముందు ద్రౌపది యాత నికి సర్వవిధముల శుభము జరుగవలె నని యాకాంక్షించెను. ఇచ్చట K2, B, Dc, Dn, $D_{4,6}$ ప్రతులలో

" ఏవ ముక్త్వాశిషః కృష్ణా విరరామ యశస్వినీ " (పుట. 127)

అను పాదము గలదు. నన్నయ భారతమున నిచ్చట " అని దీవించి పాంచాల రాజపుత్రి . ...తద్వియోగ తరళంబైన హృదయం బెట్టకేనియు నొక్కింత పేపికొని యుండె" నని యున్నది, (అర. ౧-286) ద్రౌపది దీవించి నట్లు దాక్షిణాత్య ప్రతులం దెచ్చటను గానరాదు.

5. తప స్సొనరించు నర్జునుని కడకు శివుఁడు కిరాత వేషమున వచ్చు సమయమున మూకుఁడను రాక్షసుఁ డీశ్వర చోదితుఁడై సూకరరూపము దాల్చి భీకరాకారమున బీభత్సు వధింప సమకట్టె నని నన్నయ భారతమున నున్నది. (అర. ౧-302): K4, D2 ప్రతులలోఁ దప్ప నితరము లందు మూకుఁ డీశ్వర చోదితుఁడైన వృత్తాంతము కానరాదు,

6. అర్జునుఁడు శివునిఁ బాశుపతాస్త్ర మిమ్మని వేఁడి "నీకారుణ్యమ్మున దీవింబడసి దైత్యదానవ యక్షరాక్షస పిశాచోరగమ్ముల నతివీరులైన భీష్మద్రోణాదులను జయింతు సహజకవచకుండలుండైన కర్ణుని వధియింతు"నని పల్కినట్లు నన్నయ భారతములో నున్నది. (అర-౧-౩౩౦). K1,4,B,D ప్రతులలో

"కర్ణభీష్మకృపద్రోణై ర్భవితా తు మహాహవః
త్వత్ప్రసాదా న్మహాదేవ జయేయం తా న్యథాయుధి" (పుట139)

అను శ్లోకము కనవచ్చు చున్నది. పై వచన మీ శ్లోకమున కనువాదమే. ఇది దాక్షిణాత్య ప్రతులలోలేదు.

7. ఊర్వశి యర్జును నపుంసకుఁడవు కమ్మని శపించిన వృత్తాంతము దాక్షిణాత్య ప్రతు లన్నింట నున్నది. తెలుగు భారతము నందుఁగూడ నా వృత్తాంతము కనఁబడుచున్నది. కాని యది ప్రాఁతప్రతులన్నిటిలో గోచరింపని హేతువునఁ బ్రక్షిప్తమై యుండునని తోఁచుచున్నది. ఈ కథ యుత్తర వర్గమునకుఁ జెందిన పెక్కు ప్రతులలోఁ గూడ (K2,K4 D2,3, 1,4,6,B,Dc,Dn) నున్నను K1 K3 ప్రతులలో మాత్రము గోచరించుట లేదు. క్షేమేంద్రుని భారత మంజరిలోఁగూడ నీ విషయము దిఙ్మాత్రముగ నైన సూచింపఁబడి యుండలేదు.

8. కలిపురుషుఁడు వృషుఁ డను పేరఁ బుష్కరునితో నలుని కడ కరిగి నీవు మాతోఁ జూదమాడు మని కోర నలుఁడు :

"ద్యూతార్థము తత్కృత వాహూతుఁడనై జూదమాడకుండుట ధర్మాపేతంబని యభిముఖుఁడై యాతనితో" జూదమాడుట కారంభించెనని నన్నయ భారతము. (అర-౨-59) ఈ కారణము దాక్షిణాత్య ప్రతులలోఁగాని పెక్కు ఉత్తర ప్రతులలోఁగాని కానవచ్చుట లేదు K3 ప్రతిలో మాత్రము పై పద్యమునకు మూల మనఁదగిన యీ పాదము కనఁబడు చున్నది.

"ఆహూతో న నివర్తేత
ద్యూతా దపి [illegible]

9. దమయంతి చేదిపుర[illegible] రాజమార్గమున దఱియ వచ్చు చుండఁ బ్రాసాదగత యైన రాజమాత యామెను [illegible] చూచి. దాదితో

"జీర్ణమై కడు మాసిన చీరగట్టి ధూళిధూసరాలకములు తూలుచుండ
వడల యున్మత్త వేషిణి యైన లచ్చి కరణి నిట వచ్చుచున్నది కంటె దాని"
(అర-౨-115)

అని పల్కినట్లు నన్నయ భారతమున నున్నది. రాజమాత దాదితో నిట్లు పల్కుట దాక్షిణాత్య ప్రతులం దెచ్చటను గానరాదు. K1-3,D,B ప్రతులలో రాజమాత దాదితోఁ బల్కుచు దమయంతిని:

"ఉన్మత్తవేష ప్రచ్ఛన్నా శ్రీరివాయతలోచనా" (పుట.208)
అని వర్ణించి నట్లొక పాదము కనవచ్చు చున్నది.

10. ధర్మజునకు నలోపాఖ్యానము నెఱింగించి బృహదశ్వుఁడు వెడలి పోయిన తరువాత మూలమున 79వ అధ్యాయములో ధర్మరాజాదులును ద్రౌపదియు నర్జునుని గూర్చి విచారించిన తెఱంగు వర్ణింపఁబడియున్నది. నన్నయ "పాండవులు గాండీవి రాకయ కోరుచుఁ దదాలోకన ప్రీతి నుండిరని" యొక్క వాక్యమును మాత్రము వ్రాసి యూరకుండెను. K3 ప్రతికూడ నీ 79వ అధ్యాయమును విడిచివైచినది.

11. శమరుఁడను ఋషి ధర్మజునకు గయుని యజ్ఞాచరణ విధానమును గూర్చి చెప్పుచు "తత్కృతక్రతు బహు దక్షిణాసంఖ్యయు మరుసికతా సంఖ్యయును నెఱుఁగఁగాదు జనుల" కని (అర-౨-315) తెల్పినట్లు నన్నయ భారతమున నున్నది. ఈ వాక్యము దాక్షిణాత్య ప్రతులలో లేదు. ఉత్తరప్రతులలో

"సికతా వా యథాలోక యథా వా దివి తారకాః
యథా వా వర్షతో ధారా అసంఖ్యేయాశ్చ కేనచిత్
తథా గణయితుం శక్యా గయ యజ్ఞేన దక్షిణాః" (పుట.332)
అను శ్లోకములు కనవచ్చుచున్నవి.

12. గయుని తండ్రి పేరు "అమూర్తరయుఁడని" మూలములో నున్నది. (3-93-17-3-121-3). (అమూర్తరయ పశ్చైహః) ఉత్తరప్రతులు పెక్కింటిలో "అమూర్తరయసః" అను పాఠమే కనఁబడుచున్నది. T,G ప్రతులలో మాత్రము 'అమూర్తరజసశ్చైహ' అని 'రయసః' అనుటకు బదులు 'రజసః' అను పాఠము

చూపట్టు చున్నది. నన్నయ భారతమున నిది (అర.౨-౩1౬)ఐ పద్యములో యతి స్థానమున వాడఁబడినది.

" అనఘుం డమూర్తరయః ప్రియపుత్త్రిందు"
నన్నయ " రయసః " అను పాఠమునే చూచె ననుట నిర్వివాదము.

13. లోపాముద్ర కోరిక ననుసరించి అగస్త్యుఁడు వసు భిక్షార్థియై మొదట శ్రుతర్వుండను రాజు కడ కరిగె ననియు, నతని కడ ధన మేమియు మిగిలి యుండ మిచేఁ దరువాత నతనితోఁగూడి బ్రధ్నశ్వుఁడను రాజు పాలికేగె ననియు, నన్నయ భారతము (అర.౨-33౬). పెక్కు ప్రతులలో నీరెండవ రాజు పేరు వధ్ర్యశ్వుఁడని యున్నది. $K_1, B_{1,2,4}, D_c, D_n, D_4$ ప్రతులలో బ్రధ్నశ్వుఁడనియే యున్నది. (పుట.337)

14. విశ్వకర్మ కశ్యపునకు దక్షిణ భూభాగ మంతయును యజ్ఞ దక్షిణగా నిచ్చె నని నన్నయ భారతము (అర.౩-121). మూలమున

యస్మిన్ యజ్ఞే హి భూ ర్దత్తా కశ్యపాయ మహాత్మనే
స పర్వత వనోద్దేశా దక్షిణా వై స్వయంభువా " (114-18)

అని భూమిని దక్షిణగా నిచ్చెనని చెప్పఁబడినది. S,K4,D5 ప్రతులలో

" స పర్వత వనోద్దేశా దక్షిణా భూ స్స్వయంభువా " యను పాఠాంతర మున్నది. (పుట.383).

15. ఋత్విజుఁడు సోమకునితో " రాజా! ఈ జంతువును బలువుగాఁజేసి యజ్ఞమొనరింపుము.నీ కప్పుడు నూర్గురు పుత్త్రులుదయింతురు.వారిలో జంతుఁడు కూడ నుండును. అతని యుత్తర పార్శ్వమున సువర్ణ లక్ష్మ ముండు"నని చెప్పి నట్లు మూలము నన్నయ యం దగ్రజుఁడైన జంతుఁడు"సౌవర్ణలక్షణ లక్షిత సవ్య పార్శ్వుఁడై యుదయించు" నని వ్రాసెను. K3 ప్రతిలో " సవ్యేచాస్య సౌవర్ణం లక్ష్మ పార్శ్వే భవిష్యతి " అను పాఠ మున్నది ఇది నన్నయ రచన కనుగుణ ముగా నున్నది.

16. సోమకుఁడు తన తపోయజ్ఞఫలంబున ఋత్విక్కును నరక విముక్తుఁ జేసిన పిమ్మట నన్నయ భారతములో "తొల్లి ప్రజాపతి సహస్ర వార్షిక

మైన యిష్టాకృతంబను సత్రయాగంబు చేసె"నని కలదు.(అర.3-221) మూల మున నా సత్రము పే రిష్టీకృత మని యున్నది. K4 ప్రతిలో నన్నయ భారత మందు వలెనే ఇష్టాకృత మను పాఠము కనఁబడుచున్నది.

17. 129 వ అధ్యాయమున ధర్మరాజు సోదరులతోఁ గూడఁ బ్రహ్మావతరణ మున స్నానముచేసి రోమశునితో "నే నన్ని లోకములను జూచుచున్నాను.ఇక్కడ నుండియే యర్జునుని గాంచుచున్నా" నని చెప్పినట్లును, రోమశుఁడు ప్రజాపతి యజ్ఞవేదిని వర్ణించి నట్లును చెప్పఁబడియున్నది. పిమ్మట 130 వ అధ్యాయ మున రోమశుఁడు సరస్వతీ నదిని, చమసోద్భేదమును, ప్రభాసమును, విష్ణుపద తీర్థమును, విపాశానదిని, కాశ్మీరమండలమును, మానసద్వారమును వర్ణించి చెప్పియుండెను. ఈ భాగమంతయు నన్నయ భారతములో సంగ్రహముగా నున్నది. (అర-3-221-226) T1,G1 ప్రతులలో నీ భాగము లేకపోవుటచే నన్నయ యచ్చట వాని ననుసరించి యుండలేదని తెలియుచున్నది.

పై వర్ణన లయిన తరువాత రోమశుఁడు ధర్మరాజునకు శిబి యను రాజర్షి చరిత్రము చెప్ప నారంభించుటకు ముందు మానస సరోవరమును గూర్చి "ఇక్కొ లనం జైత్రమాసంబునందు మహామునులచేతఁ బూజితుఁడై, యుమాసహితుఁ డీశ్వరుఁడు వారికిం బ్రత్యక్షంబయ్యె" నని తెల్పియుండెను. ఈ విషయము మూలమునఁ గానరాదు, కాని ఉత్తర ప్రతు లన్నిటిలో నీ సందర్భమున

"క్షీణే యుగేఽపి కౌంతేయ శర్వస్య సహ పార్షదైః
సహోమయా చ భవతి దర్శనం కామరూపిణః
అస్మిన్ సరసి రమ్యే పై చైత్రే మాసి పినాకినమ్
యజన్తి యాజకా స్సమ్య క్పరివారం శుభార్థినః" (పుట. 425)

అను పాఠము గోచరించు చున్నది

18. పాండవు లర్జున దర్శనార్థమై గంధమాదనమున కరుగుచు ముందు పుళిందాధిపతి యైన సుబాహు పురంబు గాంచిరని తెలుఁగు భారతములో నున్నది. ఇచ్చట మూలమున 'పుళిందాధిపతి' యనుటకు "కుళిందాధిపతేః"(141-29)అని యున్నది. K1, D3 ప్రతులలోఁ దెలుఁగులో వలె "పులిందాధిపతేః" అనియే యున్నది.

19. భీముఁడు సౌగంధిక సరోవరమున స్నానము చేసి శంఖధ్వాన మొనరింపఁగా హనుమంతుఁడదివిని మనఃప్రియమైన యా ధ్వని తిన యనుజునిదే యై యుండునని యెఱిఁగి "భీమునప మార్గ నిరోధంబుగా మహావృక్షంబు లురలం ద్రోచి యేకాయన పథంబున కడ్డంబ శయనించి లాంగూల లీలాచాల నంబు చేసె" నని (అర- 3-316) నన్నయ భారతములో నున్నది. ఇచ్చట మూలమున

"తం తు నాదం తతః శ్రుత్వా సుప్తో వానరపుంగవః
ప్రాజృంభత మహాకాయో హనుమాన్నామ వానరః." (146-59)

అని మాత్రమున్నది. ఉత్తరప్రతులలో,

"భ్రాతరం భీమసేనం తు విజ్ఞాయ హనుమా న్కపిః
దివంగమం పరో ధాథ మార్గం భీమస్య కారణాత్

అస్త ఏకాయనే మార్గే కదళీషండమండితే" (పుట. 447).

అను పాఠమున్నది.

20. జటాసురుఁడు పాండవులతో "ఏను వేదవిదుండ.ధనుర్వేద విదుఁడైన పరశురామ శిష్యుఁడ" నని చెప్పినట్లు తెలుఁగు భారతము. "బ్రాహ్మణో మంత్ర కుశలః సర్వాస్త్రేష్వస్త్ర విత్తమః, ఇతి బ్రువన్ పాండవేయాన్ పర్యుపాస్తేస్మ నిత్యదా" (153-3) అని మూలము చెప్పుచున్నది "జామదగ్న్యస్య శిష్యోహం-రామస్యాక్లిష్ట కర్మణః" (పుట 504) అను పాదము $S_1$ $K_{1-3}$, $D_{1-3}$, $D_5$ ప్రతులలో మాత్రము కనపచ్చు చున్నది.

21. 155 వ అధ్యాయమున 37 వ శ్లోకములోఁ బాండవులు గంధ మాదన పర్వతారణ్యమును బ్రవేశించిరని చెప్పఁబడినది అచ్చటినుండి అరణ్యము వర్ణనము కలదు. ఈ వర్ణనము 38 నుండి 60 వ శ్లోకము వఱకు $K_4$ ప్రతి విడిచిపైచినది. నన్నయ భారతమునఁగూడ నీ వర్ణనము కానరాదు

22. అగస్త్యుఁడు శాప మొనంగుటకు హేతు వేమని ధర్మరాజుడుగఁ గుబేరుఁడది యెఱిఁగించుచు "తొల్లి కుశవతి యను పుణ్యనదీ తీరంబున నమదు లెల్ల సత్త్రియాగంబు చేయు చుండి నమ్ము రావించిన" అని దేవతలు సత్త్రి

యాగ మొనరించు చుండి రని చెప్పినట్లు తెలుఁగు భారతము (అర-४-30) ఈ సందర్భమున మూలములో "దేవతా నా మభూ న్మంత్రః" అని (158-51). సత్త్రమునకు బదులు మంత్రమని యున్నది. $S_1$, K, $D_{1-3}$ $G_4$ ప్రతులలో "దేవతానా మభూ త్సత్రం కుశవత్యాం నరేశ్వర" (పుట 538) అను పాఠము కనవచ్చు చున్నది.

23 ఆర్ష్టిషేనాశ్రమమున నున్న తఱి నొక్కనాఁడు ధౌమ్యుఁడు ధర్మజునకు మేరువును జూపి

"కనకగిరిం బ్రదక్షిణముగా శశి భాస్కర తారకాగణం
బనవరతంబుఁ ద్రిమ్మరు" (అర-४-38).

అని చెప్పినట్లు తెలుఁగు భారతము. దీనికి మూల ము త్తర ప్రతులలో మాత్ర మిట్లున్నది. (పుట. 544)

"ఏనం త్వహరహ ర్మేరుం సూర్యాచన్ద్రమసౌ ధ్రువం
ప్రదక్షిణ ముపావృత్తౌ కురుతః కురుసత్తమ
జ్యోతీంషి చా ప్యశేషేణ సర్వా ణ్యనఘ సర్వతః
పరియాన్తి మహారాజ గిరి రాజం ప్రదక్షిణమ్"

24 160 వ అధ్యాయము చివర అర్జునుఁడు సోదరులకు స్వర్గ ప్రవేశ వృత్తాంతమును సంక్షేపముగాఁ జెప్పి మాద్రీసుతులతోఁ గూడి యచ్చటఁబరుండె నని చెప్పఁబడినది. 161 వ అధ్యాయము "ఏతస్మిన్నేవ కాలే తు సర్వవాదిత్ర నిస్వనః" అను దానితో నారంభించు చున్నది. దీనిని బట్టి యర్జునుఁడు నిద్రించు చుండఁగనే యింద్రుఁడు వచ్చెనని తెలియు చున్నది. ఇచ్చట నుత్తర ప్రతులలో

"తతో రజన్యాం వ్యుష్టాయాం ధర్మరాజం యుధిష్ఠిరం
భ్రాతృభి స్సహిత స్సర్వై రవన్దత ధనంజయః" (పుట 550).

అను శ్లోక మధికముగాఁ గన వచ్చుచున్నది. పిమ్మట $K_4$ ప్రతిలో "ఏతస్మిన్నేవ కాలే" అనుటకు బదులు "తతః ప్రభాత సమయే" అను పాఠము చేర్పఁబడి యున్నది. నన్నయ "శయనించె. అంతఁ బ్రభాతంబ.. .. ధర్మతనయుఁడు సుఖోపవిష్టుఁడై యున్నంత" అని వ్రాసి యుండెను. (అర-४-43)

25. అర్జునుఁడు మాతలితోఁ గూడ రథమెక్కి నివాత కవచు లను రాక్షసులపై కరుగునపుడు ముందు సముద్రమును గని పిమ్మట దానవాకీర్ణమైన దైత్యపురమును గాంచె నని చెప్పఁబడి యున్నది. ఇచ్చట మూలమున "తప తీత్య మహావేగం సర్వాంభోనిధి ముత్తమం" (166-6) అను శ్లోకమున "అతీత్య" అను పద మున్నది. దీనిని బట్టి వారు సముద్రమును దాఁటి రని యర్థ మగును. నన్నయ

"మహా నీరధిఁ గంటి నేను నమ్మాతలియున్" (అర-४-59)

ఆ సముద్రోదరంబున విశాలాట్టాలక ప్రతోళికాలంకృతంబైన పురంబుఁగని" యని వ్రాసియుండెను. అతని వ్రాఁతలో సముద్రమును జూచి రనియే కాని యర్జున మాతలులు దాని నతిక్రమించి రని లేదు. అతీత్య కు బదులు $S_1$, $K_2$, $D_{1,2}$, లలో సముదీక్ష్య యనియు $K_1$ లో సముద్వీక్ష్య యనియు, B, $D_c$, $D_n$, $D_{4-6}$ ప్రతులలో తముద్వీక్ష్య యనియుఁ బాఠాంతరములు చూపట్టుచున్నవి

పై యుదాహరణములను బట్టి నన్నయ యరణ్య పర్వానువాద విషయమున నుత్తర వర్గమునకుఁ జెందిన K ప్రతుల మాతృకలను ప్రధానాధారముగా గ్రహించి యుండునని తెలియుచున్నది. అతఁడుత్తర వర్గమునకుఁ జెందిన D ప్రతులను గూడఁ జూచి యుండి నట్లీ క్రింది యుదాహరణములు వ్యక్తము చేయఁ జాలును.

26. నలోపాఖ్యానము చివర ఫలశ్రుతిలో నన్నయ భారతమున సీసమైన పిమ్మట

"కడుఁ బ్రసిద్ధ మిదియుఁ గర్కోటకుని దమయంతిఁ బుణ్యమూర్తి యైన నలుని నుత చరిత్రుఁడైన ఋతుపర్ణుఁ గీర్తింపఁ గలి భయంబులెల్లఁ గ్రాలు నధిప"
(అర-౨-230)

అను గీతమున్నది. ఇది మూలమున లేదు $D_1$ ప్రతిలో మాత్రము దీనికి మూలమైన శ్లోకమున్నది

"కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనమ్ కలినాశనమ్" (పుట. 211)

27. ఇల్వలుఁ డగస్త్యునితో నరిగిన శ్రుతర్వబ్రధ్నశ్వాదుల కిచ్చిన సౌవర్ణ రథమునకుఁ బూన్చిన గుఱ్ఱముల పేర్లు విరావ సురావములని తెలుఁగు భారతమున నున్నది. మూలమున

"వివాజ శ్చ సువాజ శ్చ తస్మిన్ యుక్తౌ రథే హయౌ" (3-97-15) అని యున్నది. $D_2$, $D_1$, $D_6$ ప్రతులలో "విరావశ్చ సురావశ్చ" అను పేర్లు కానఁ బడుచున్నవి.

28. సోమకునికిఁ జిరకాలమునకు జంతు వను కుమారుఁ డుదయించె ననియు నాతని భార్యలు నూర్వురు నతని తమ తమ పుత్త్రుఁడ కాఁ జిత్తములం జేకొని దయఁ బృథగ్భావము లేక ముదంబునఁ బెంచిర" నియు (అర-3-209) నన్నయ వ్రాసి యుండెను. ఈ భావము మూలములో లేదు. $D_{1-2}$ ప్రతులలో మాత్రము

"మమాయ మితి మన్వానా మనోభిఃపుత్త్రి మౌరసమ్" (పుట 418) అను శ్లోక పాదము కనఁబడు చున్నది.

29. హనుమంతుఁడంతర్హితుఁడగుటకు ముందు భీముఁ గౌఁగిలించు కొని యాతనికి సౌగంధిక సరోవర మార్గము చూపెనని తెలుఁగు భారతము (అర. 3-354). $D_5$ ప్రతిలో మాత్రమిచ్చట

ఏవ మాభాష్య హనుమాన్ తదా పాండవనందనమ్
మార్గ మాఖ్యాయ భీమాయ" (పుట 495).

అను శ్లోకము కనఁబడుచున్నది.

ఇట్లు నన్నయ అరణ్య పర్వానువాద సందర్భమునఁ బ్రధానముగా నుత్తర ప్రతులనే (అందును దేవనాగరీ లిపిలో వ్రాయబడిన $K_1$ D ప్రతులనే) యాధారముగా గ్రహించినట్లు కనఁబడు చున్నను అతఁడు దాక్షిణాత్య ప్రతులను గూడఁ జూచియుండక పోలేదు. ఆతని రచనలో నుత్తర ప్రతులలో నసలు కానరాక దక్షిణ ప్రతులలో మాత్రమే కనఁబడుచున్న కొన్ని భావములు చూపట్టు చున్నవి. కాని యిట్టివి చాల తక్కువ.

(a) "భుక్త వత్సు చ విప్రేషు భోజయి త్వానుజా నపి
శేషం విఘ సే సంజ్ఞంతు పాశ్చాత్త్యం క్తే యుధిష్ఠిరః" (4-7)

అని మూలపాఠము. పై శ్లోకమునందలి మూఁడు పాదములను $T_1$ ప్రతి విడిచి వేయుచున్నది. నన్నయయు "ఇట్లనేక సహస్ర మహీసురవరుల ననువినం బున నభిమత భోజనంబులం దనిపి విఘసామృత భోజనంబులం దృప్తులైన తన పతుల భుక్తశేషంబు ద్రుపద పుత్రిక యుపయోగించు చుండె" నని వ్రాసి (అర-౧-45) అనుజులు కూడ భుజించిన పిమ్మట ధర్మరాజు భుజించు చుండె నను మాట విడిచివైచెను.

(b) సాల్వు చేత వసుదేవుఁడు పట్టువడుట మాయ యని యెఱిఁగి కృష్ణుఁడు శబ్దభేది బాణములచే రాక్షసుల గతాసుల నొనరింప సాల్వుండు "తన సౌంభకంబు ప్రాగ్జ్యోతిషంబు చేసి తానును మానవుండయి పర్వత వర్షంబు" కురిసె నని (అర-౧- 84) నన్నయ భారతములోఁ గలదు. మూలమున

"తతో లోకాస్త కరణో దానవో వానరాకృతిః
శిలావర్షేణ సహసా మహతా మాం సమావృణోత్" (23-10)

అను శ్లోకమున నతఁడు వానరాకృతి ధరించెనని యున్నది. T, G ప్రతులలో "దానవోఽథ నరాకృతిః" అను పాఠము కానవచ్చు చున్నది. (పుట.72)

(c) వ్యాసుఁడు ధర్మరాజునకుఁ బ్రతి స్మృతి యను విద్య నుపదేశించిన పిమ్మట "యీ వనము భవచ్చిర నివాసంబునం జేసి విరళఫల కుసుమ పాదపంబై మృగకులోపరోధియై యొప్పు చున్నది కావున నొండు వనంబున కరుగు నది" యని చెప్పెను. (అర-౧-276) మూలమున నీ సందర్భమున "మృగాణా ముపయోగశ్చ వీరు దోషధి సంక్షయః" (32-33) అను పాఠమున్నది. దాక్షి ణాత్య ప్రతులన్నిటిలో "మృగాణా ముపరోధశ్చ" (పుట 23) అను పాఠాంతర మున్నది.

(d) దమయంతి సుబాహు పురమున

"అలయక పుణ్యవ్రతములు నలుపుచు సైరంధ్రి యనఁగఁ జైద్యేశుపురిన్
వలుదేవి యుండె నెదఁ బతిఁ దలఁచుచు దుస్సహ వియోగ తాపార్దితయై"
(అర-౨-121)

అని నన్నయ వ్రాసియుండెను. మూలమున నీ ప్రసంగమే లేదు. దాక్షిణాత్య ప్రతులలో మాత్రము

"సహసా న్యవసన్ రాజన్ రాజపుత్ర్యా సునందయా
చింతయన్తీ నలం వీర మనిశం వామలోచనా" (పుట. 210)

అను శ్లోకమున్నది.

(e) నన్నయ అరణ్యపర్వ తృతీయాశ్వాసమునందలి 158 వ వచనములో శూర్పాకార మను తీర్థమును బేర్కొనెను. (118-8). మూలమున నిది శూర్పారక మను పేరుతో నున్నది. $T_1$ ప్రతిలో మాత్రము శూర్పాకార మను రూపమే కానవచ్చు చున్నది.

(f) అరణ్యపర్వ చతుర్థాశ్వాసారంభమునఁ బాండవులు మాల్యవంతమున విహరించు చుండఁగా మారుతానీతములై పంచవర్ణ సురభి కుసుమంబులు వారి ముందు పడె ననియు, నప్పుడు ద్రౌపది భీమునిఁజూచి " ఇవి తొల్లింటి సౌగంధిక కమలముల కంటెను బరిమళవంతములై సుకుమార తరములుగా నున్నవి. ఇట్టి వానిని నేఁ జూచి యెఱుఁగను. ఇక్కుసుమంబులు నాకుఁ దెచ్చియిచ్చి మనః ప్రియంబు చేయు " మని యడిగె ననియు నన్నయ భారతములో నున్నది. ఈ విషయము మూలమునలేదు. T, G ప్రతులలో మాత్రము

" ఇదం తు పురుషవ్యాఘ్ర విశేషేణాంబుజం శుభం
గంధసంస్థానసంపన్నం మమ మానసవర్ధనమ్
ఇచ్ఛామి చ నరవ్యాఘ్ర పుష్పం ప్రత్యక్ష మీదృశం
ఆనీయమానం క్షిప్రం వై త్వయా భరత సత్తమ " (పుట. 529)

అను శ్లోకములు కనవచ్చు చున్నవి.

(g) అర్జునుఁడు నివాతకవచుల వధించుట కరిగిన సందర్భమున రాక్షసులు ప్రచండ కాండ ప్రకరంబున రోదోంతరమును గప్పఁగా మాతలి కడు భయమునఁ జేష్టడి రథచోదనమునం దపాటవుఁడయ్యె నని నన్నయ భారత మున వ్రాయఁబడి యున్నది. (అర. ४-63). ఇచ్చట మూలమున

" తతోహం మాతలే ర్వీర్య మపశ్యం పరమాద్భుతమ్
అశ్వాం స్తథా వేగవతో యదయత్నా దధారయత్. " (167-12).

అని మాతలి రథచోదన ప్రశంస కలదు. $T_1$, G, ప్రతులలో మాత్రమీ శ్లోకము నందలి చివరి పాదమునకు " యద్రథం నావధారయత్ " అను పాఠాంతరము చూపట్టు చున్నది.

## నన్నయ యనుసరించిన ప్రతుల వివర మిప్పటి నొసంగఁ బడుచున్నది :—

శారదా పాఠము ననుసరించి దేవనాగరీ లిపిలో వ్రాయఁబడిన ప్రతులు. K సంజ్ఞ గలవి.

$K_1$ :- పూనా. బొంబాయి ప్రభుత్వము సేకరించినది. No 471 of విశ్రాంబాగ్ I.

$K_2$ :- పూనా. B O R. I. Mbh Collect on No. 15. ఇది యొకే చేతితో వ్రాయఁబడిన సంపూర్ణ భారత ప్రతి యందలి భాగము

$K_3$ :- పూనా. బొంబాయి ప్రభుత్వము సేకరించినది. No 184 of 1891-95.
$K_4$ :- „ „ „ No 57 of 1882-83.

## దేవనాగరీ లిపిలో వ్రాయఁబడిన యితర ప్రతులు :—

Dc :- చతుర్భుజమిశ్రుని వ్యాఖ్యానముతోఁ గూడిన ప్రతి.
Dn :- నీలకంఠుని వ్యాఖ్యానముతోఁ గూడిన ప్రతి.
$D_1$ :- పూనా. బొంబాయి ప్రభుత్వము సేకరించినది. No 269 of విశ్రాంబాగ్ II.
$D_2$ :- „ „ „ No 229 of 1895-1902.

(ఇందు మొదటి మూఁడు పర్వములు నున్నవి. ఇదియే ఆది పర్వమున Ko గా వర్ణితమైనది.)

$D_3$ :- „ „ No 168 of 1887-91.
$D_4$ :- బరోడా, Oriental Institute Library, No 767.
$D_5$ :- పుదుక్కోట State Library Ms
$D_6$ :- మదరాసు అడయారు Library No. 36. G 15.

## తెలుఁగు లిపిలో వ్రాయఁబడిన ప్రతులు :—

$T_1$ :- లాహోరు D A. V College Library No. 3908
$T_2$ :- తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరి. No 11809. (ఆదిపర్వ వంద

ర్భమున విదే T3 గా వర్ణింపఁబడినది. ఇందు మొదటి యైదు పర్వము లున్నవి).

కవిసార్వభౌమ బిరుదాంకితులును బహుకావ్య ప్రణేతలు నగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు మహా భారతమునందలి పదునెన్మిది పర్వములను బూర్తిగా ననువదించి యుండిరి ప్రస్తుతము లభ్యము లగుచున్న యే సంస్కృత ప్రతిలోఁగాని లేని కొన్ని భాగములును భావములును నన్నయ భారతములోఁ గానఁబడు చున్నవి. వానిలోఁ బెక్కావిధముగనే యా చోట్లనే శ్రీకృష్ణ భారతములోఁగూడఁ జూపట్టుచున్నవి. దీనిని బట్టి నన్నయ యనుసరించిన ప్రతి పుత్రికనే శ్రీ శాస్త్రులవారు కూడఁ జూచియుండిరని చెప్పుట కవకాశ మున్నది. వా రే ప్రతిని జూచి భారతము ననువదించిరో తెలిసికొనఁగోరి వ్రాయఁగా వారీ క్రింది సమాధానము నొసంగిరి.

" . నేను భిన్నదేశ ప్రతులు బొంబాయిప్రతి కలకత్తాప్రతి దక్షిణదేశపు ప్రతి మఱియొక విదేశపుప్రతి ఇవి అచ్చుపడినవి. ఇందు 2 పుస్తకములు తెలుఁగు లిపి. తక్కినవి దేవనాగరము. ఇవి గాక 3,4 వందల యేండ్ల నాడు వ్రాయఁబడిన తాటియాకు ప్రతులు రెండు. అందొకటి సాము సాము మాత్రము మఱియొకటి పూర్తిగాఉన్నది. గాని శ్లోకములు చదువ శక్యము గా ? టున్నది. ఇవి అన్నియు కొంచెమో గొప్పో చూచి నా రచన సాగించితిని. నన్నయాదుల గ్రంథము కూడఁ జూచుచునే వ్రాసితిని .... .... తాళ పత్రప్రతులు నాటినాడే చూచినంత వఱకు పిండి యగుచు వచ్చినవి. తక్కిన ప్రతులు సామాన్యముగా అన్నియుఁ జూచితిని గాని దేని ననుసరించితినో ఏ ప్రతి నేను ప్రమాణీకరించు కొంటినో ఇప్పుడు నేను చెప్పలేను. అన్నిటిలోను నాకు విరుద్ధమైనది దాక్షిణాత్యప్రతి. అది శుద్ధముకాదు. కొన్ని చోట్ల తెలుఁగు చూచి సంస్కరించెనని కూడ నున్నది. ఇంతకంటె మీకిపుడు సమాధానము వ్రాయఁజాలను ...... . "

శ్రీ శాస్త్రులుగారు నన్నయ రచనను సంస్కృత ప్రతులలోని క్రమ మును గూడఁ జూచుచు ననువాదము సాగించిన వారగుటచే మూలమునలేని కొన్ని భావములు నన్నయ రచనలో గోచరించినప్పు డాతనినే ప్రమాణముగా గ్రహించి యా భావము లాతఁడు చూచిన యే ప్రతిలోనో యుండి యుండు నని తామును కూడఁ దదనుసారముగా వానిని జేర్చిఁ యుండినవో వారు చూచిన

ప్రతులన్నియు నిప్పుడు లభ్యము లగుచున్న ప్రతులలోఁ జేరియే యున్నవని చెప్పవచ్చును. అట్లుకాక యట్టి చోట్లఁగూడ వారేదో యొక సంస్కృత ప్రతినే యనుసరించి యుండినచో నా ప్రతికి మాతృక యైన ప్రతినే నన్నయ కూడ ననుసరించి యుండునని విశ్వసింప వచ్చును. వారియొద్ద నుండిన తాళ పత్రప్రతు లప్పటికే శిథిలప్రాయములై యుండుటచే నిప్పు డే విషయము కాని నిర్ణయించుట కవకాశము లేకున్నది.

నన్నయ సంస్కృత ప్రతులలో దేని ననుసరించినను దానిని యథా మూలముగాఁగాక స్వతంత్రముగా ననువదించిన వాఁడగుటచే నతని రచనలో నమూలకములైన కల్పనలు పెక్కుండవచ్చును. అవి సాధారణముగా వర్ణ నాదులలోనే యుండును గాని కథాక్రమములో నుండవు. అతఁడెచ్చటనైనఁ గథను సంగ్రహింపవచ్చును గాని క్రొత్త కథను గల్పింపఁడు. అతఁడు కావిం చిన పెంపకము తఱుచుగా వర్ణనాత్మకముగానే యుండును. అందుచే నట్టి వర్ణన లలో నమూలక భాగము లేవైన నున్నచో నవి యాతఁడు కల్పించిన వని చెప్ప వచ్చును. కాని కథాక్రమములో నట్టి యమూలక భాగములు గోచరించినప్పు డాతఁడు వానిఁ గల్పించె ననుకొనుట కంటె నాతఁ డనుసరించిన ప్రతి మనకు లభ్యము కాలేదని తలఁచుటయే యుక్తముగా నుండును. సంస్కృత భారత ప్రతులలో నెందును లేకుండ నన్నయ రచనలో మాత్రము కనవచ్చు కొన్ని భాగముల నిచ్చట నుదాహరించు చున్నాను :-

1. ఉదంకుఁడు జనమేజయునకు సర్పయాగాచరణబుద్ధి కల్పించు సందర్భమున నన్నయ భారతములో

" ప్రల్లదుఁడైన యొక్క కుల పాంసను చేసినదానఁ దక్కఁగలం
బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము " (ఆది-౧-125)

అను పద్య భాగ మున్నది. దీనికి సంస్కృత భారత ప్రతులలో నెచ్చటఁగాని యాధారము కానరాదు. శ్రీకృష్ణ భారతములో

" చెఱకున వెన్నువుట్టి చెఱచెన్ సిరులెల్ల విరక్తమయ్యె న
త్తెఱఁగున నీచు చేసిన గతిం గులమెల్లను జెట్టకాన"... (ఆది-౨-106)

అని నన్నయ పద్య భాగమునకుఁ బ్రతిబింబము కనఁబడు చున్నది.

2 భృగు శప్తుఁడైన అగ్ని ఆతనితో "శక్తోహ మపి శప్తుం త్వాం మాన్యాస్తు బ్రాహ్మణా మమ" (1-7-5) అని మూలము. "మాన్యాస్తు బ్రాహ్మణా మమ" అను నభిప్రాయమును నన్నయ

" అడిచినఁ దిట్టినన్ మఱి మహా పరుషంబులు పల్కి యల్కతోఁ
బొడిచిన నుత్తమ ద్విజులు పూజ్యులు వారల కెగ్గు చేసినన్
జెడు విహముం బరంబు విది సిద్ధము గావునఁ బెంఱింగి భక్తినె
ప్పుడు ధరణీసురోత్తములఁ బూజలఁదన్పుదు నల్గ నోడుదున్ "

(ఆది. ౧-138)

అని పెంచెను. శ్రీ కృ భా. లో నీ పట్టునఁ బై పద్యము ననుసరించి :

" కొట్టినఁదిట్టినన్ మఱియుఁ గోపము సూపినఁ బాపకర్మముం
గట్టినఁగల్ల లాసినను గన్నము పెట్టినఁ జిత్తశుద్ధుఁడౌ
నట్టి మహీసురవ్వుఁడు మహామహుఁ డాతని కెగ్గు చేసినం
జెట్టగు విందునందు నని చేయుదు రిష్టము వారి కెట్టిరున్ "

(ఆది-౨-130)

అను పద్యము వ్రాయఁబడినది.

3. వ్యాసావతార వర్ణన మైన పిమ్మట మూలమున (58 వ అధ్యాయము చివర) నెవ రెవ రే యంశములఁబుట్టిరో 30 శ్లోకములలోఁ జెప్పఁబడినది. చివర

" న శక్యం పరిసంఖ్యాతుం వర్షాణా మయుతై రపి
ఏతే తు కీర్తితా ముఖ్యా యై రాఖ్యాన మిదం తతమ్ " (1-58-103).

అను శ్లోక మున్నది నన్నయ పై 30 శ్లోకములను విడిచి "మఱియు దైత్య దానవ ముని యక్ష పక్షి గంధర్వాదుల యంశంబులు ధాల్చి భీష్మాది వీరులు భారతయుద్ధంబుసేయ ననేకులు పుట్టిరి వారల్ల కొలంది యెఱింగి చెప్ప ననేక కాలం బనేక సహస్ర ముఖంబుల వారికైన నలవి కా"దని చెప్పి యూరకుండెను. శ్రీ.కృ. భా. లోఁ గూడ నిచ్చట నన్నయ భారతములో వలెనే

"ఆదిని దేవదానవ నరాంశములం గొని మర్త్యమందు భీ
ష్మాదు లనేకు లుప్పతిలి రందఱఁ జేర్కొన బ్రహ్మశక్యముంగాదు"

(ఆది-౪-101).

అని చెప్పఁబడినది.

4. ప్రజాభార పీడిత యైన భూదేవి బ్రహ్మాదుల కడ కరిగి మొఱపెట్టు కొనఁగా బ్రహ్మ యనుమతమున విష్ణువు వాసవాదులగు వేల్పులను భూమిపైఁ బుట్టించిన పిమ్మట నన్నయ భారతములో

"అతుల బలాఢ్యులైన యమరాంశ సముద్భవు లెల్లఁ బాండు భూ
పతి సుత పక్షమై సురవిపక్ష గుణాంశజులెల్లఁ దుర్మదో
ద్ధత కురురాజ పక్షమయి ధారుణి భారము వాయ ఘోర భా
రత రణభూమి నీల్గిరి పరస్పర యుద్ధము చేసి వీరులై" (ఆది.-3-56)

అను పద్య మున్నది. దీనికి సంస్కృత భారత ప్రతులలో నాధారము లేదు. శ్రీ. కృ. భా. లో

"వరసురాంశజు లెల్లరు పాండవేయ పక్ష మసురాంశజు లధర్మపరులు ధార్త
రాష్ట్రి పక్షము నై పోరి ప్రధనమందు నీల్గ ధరభార ముడివోయె నెంతయేని"
(ఆది. ४-106).

అను పద్యము కనఁబడుచున్నది.

5. శకుంతల దౌష్యంతిఁ దోడ్కొని దుష్యంతు పాలికి వచ్చి మంత్రి పురోహితాది పరివృతుఁడైన యాతనిఁగని చెప్పిన వాక్యములు (ఆది-४-67, 68, 69, 70, 71). సంస్కృత ప్రతులలోఁ గనవచ్చుటలేదు. శ్రీ. కృ భా.న నా భావములే ఆది (౫-105-106) పద్యములలోఁ జెప్పఁబడినవి.

6. కిందముఁడు పాండురాజ శరవిద్ధుఁడై తన చరిత్ర మాతని కెఱిం గించిన పిమ్మట

"పఱవ నోపకయున్న మై మఱచి పెంటిఁ
బెనఁగి యున్నను బ్రసవింప మొనసి యున్నఁ
దెవులు గొనియున్న మృగములఁ దివిరి యేయ
రెఱచి యాహారముగ మను నెఱుకులయిన" (ఆది-౫-53)

అని చెప్పినట్లు నన్నయ భారతములో నున్నది. ఇది యమూలకము. శ్రీ. కృ. భా. లోని

"కుంటిం దెవులుంగొంటుం బెంటిని బెనఁగొన్నదాని వెఱఁబడు దానిం
గంటకు మొనసిన దానిం గంటకుఁడై మృగము నేయఁ గాదనరె బుధుల్"
(ఆది- ౬-85)

అను పద్యము సరిగా నన్నయ పద్యము నందలి భావమునే యనువదించు చున్నది.

7. ధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరు రాజ్యభార ధురంధరునిగా నెఱింగి భీష్మ విదురులతో విచారించి యౌవరాజ్యాభిషిక్తునిఁ జేసిన పిమ్మట నన్నయ భారతములో

"నలువురు దమ్ములన్ బలిమి నాలుగు దిక్కులు నోర్చి సర్వ భూ
తలమున రాజనందనుల దర్ప మడంచుచు భూరివస్తు ధా
నలు గొనివచ్చి యాఁగొని విశుద్ధ యశోనిధి యొప్పె ధర్మజుం
డలఘుఁడు యౌవరాజ్య యుతుఁడయ్యుమ బెంపున సార్వభౌముఁడై"
(ఆది-ఉ-92)

అను పద్యమున్నది. ఇది మూలములో లేదు. శ్రీ. కృ. భా. లోఁ బై పద్యమును బోలిన యొక పద్యమున్నది. (ఆది-2-173)

8. అంగారపర్ణుఁ డర్జునునిచేఁ బరాజితుఁడైన పిదప నతనితో
"జితో ఽహం పూర్వకం నామ ముంచా మ్యంగార పర్ణతామ్
న చ శ్లాఘే బలే నాద్య న నామ్నా జన సంసది
అస్త్రాగ్నినా విచిత్రోఽ యం దగ్ధో మే రథ ఉత్తమః
సో ఽహం చిత్రరథో భూత్వా నామ్నా దగ్ధరథోఽభవమ్". [1]
(1-158-36-37)

అని చెప్పినట్లు మూలములో నున్నది. నన్నయ భారతములో "నీ యాగ్నేయాస్త్రంబున దగ్ధరథుండ నయ్యును గంధర్వమాయ ననేక రత్నవిచిత్రం బైన రథంబు వడసి యది మొదలుగాఁ జిత్రరథుండ నయ్యెద" (ఆది-2-50) నని వ్రాయఁబడియున్నది. అది పై మూలమునకు విరుద్ధముగా నున్నది. శ్రీ. కృ. భా కూడ నన్నయ మార్గమునే యనుసరించినది.

"ఏఁ బరాజితుఁడ వింక నంగార పర్ణతను దాల్పఁ జిత్రరథుండ నగుదు"
(అర-ఉ-50)

9. కామ్యక వనమునుండి మైత్రేయుఁడు ధృతరాష్ట్రు నొద్దకు రాఁగా ధృతరాష్ట్రుఁ డాతనిఁ బూజించి "భట్టారకా! ఎందుండి వచ్చితి" రని యడిగె ననియు నతనికి మైత్రేయుఁడు.

---

1. దీని అర్థమిది :- I have been Vanquished by thee. I shall therefore abandon my former name Angaraparna (the blazing Vehicled) ....my excellent and variegated chariot hath been burnt by means of thy fiery weapon. I, who had been formerly called after my excellent chariot should now be called after my burnt chariot. (Page 489—M N Dutt's Translation)

"అలఘు తపోభరంబున జటాజినముల్ ధరియించి రూక్షవ
ల్కలములు గట్టి కూరలును గాయలుఁ బండులు భోజనంబుగా
నలయక కామ్యకం బను మహావిపినంబున నున్న పాండవే
యులకడనుండి వచ్చితిఁ గురూత్తమ నీ సుతు నిన్నుఁ జూడఁగన్"
(అర-౧-93, 94)

అని బదులు చెప్పె ననియు నన్నయ భారతములో నున్నది. ఇది సంస్కృత ప్రతులలో నెచ్చటను గానరాదు. శ్రీ. కృ. భారతములో నీ సందర్భమున "మాకు మీరాక రాక. లోకైకవంద్య! మీర లెందుండి విచ్చేసినారొ యిందు సౌఖ్యదంబయి పయనంబు సన్నుతింపఁ బడియెనో నాకు నానతి యిడుఁడి కరుణ"

అని ధృతరాష్ట్రుఁ డడుగఁగా మైత్రేయుఁడు :

"ఇలఁగల యెల్ల తీర్థముల నేఁగన నెంచి పరిభ్రమించుచున్
లలిఁ గురుజాంగలంబుల కలంగముగా నయి కామ్యకంబు నా
నలరు తపోవనంబున జటాజిన వల్కల ధారులై మునీ
శుల జతనున్న పాండవులఁజూచి యిట న్నినుఁ జూడవచ్చితిన్"
(అర-౧-164-166)

అని చెప్పె నని వ్రాయఁబడియున్నది.

10. ఋష్యశృంగుఁడు రోమపాదుని దేశము చేరిన సందర్భమున మూలములో

"అన్తఃపురే తం తు నివేశ్య రాజా
విభాండకస్యాత్మజ మేకపుత్రిం
దదర్శ దేవం సహసా ప్రవృష్ట
మాపూర్యమాణం చ జగజ్జలేన" (3-113-10)

అను శ్లోకమున్నది. నన్నయ భారతములో

"అమ్మునీశు నివాసశక్తిఁ దదంగ దేశమునందు మే
ఘమ్ము లెల్ల నలంకులం గడుఁగ్రమ్మి సర్వజన ప్రమో
దమ్ముగాఁ బ్రభవద్బృహజ్జలధార లొప్పఁగ వృష్టిఁ జే
సెమ్మహానది దీర్ఘికా సరసీ నదంబులు నిండఁగాన్" (అర- 3-113)

అను పద్యమున మేఘములు వర్షించిన విధము వర్ణింపఁబడి యున్నది. శ్రీ. కృ. భా. లోఁ గూడ దీని ననుసరించి

"ఘనుఁడగు ఋష్యశృంగుఁడు జగన్నుతుఁ డవ్విషయంబు సేరి నం
తన జలదంబు లెల్లెడలఁ దద్దయుఁ గ్రమ్మి మహాంబుధారలన్
ఘనతర వర్షముం గురిసెఁ గాలువలై నదులై సరస్సులై
ఘన రస మంతయుం ధరణిఁగప్పి తమింపఁగఁజేసె నెంతయున్"
(అర. 4-328)

అను పద్యము వ్రాయఁబడినది

ఈ విధముగా సంస్కృత ప్రతులలో నెక్కడను ఆధారము లేని రచన కొంత నన్నయ భారతమున నుండ దానివి సరిగా శ్రీ. కృ. భా అనువదించిన దని చెప్పుటకు వీలైన భాగము లింకను జాలఁగలవు. విస్తరభీతిచేఁ బది మాత్ర మొసంగితిని. ఆ భాగములు శ్రీ శాస్త్రిలుగారు చూచిన ప్రతులలో నెక్కడనైన నుండెనేమో తెలిసికొనుట కిప్పు డవకాశము లేకున్నది. అట్లుండి నచో నన్నయ కూడ నా ప్రతి మాతృకనే యనుసరించె నని చెప్పవచ్చును. కాని నన్నయ యందలి గౌరవము చేతను, భ్రమాణబుద్ధి చేతను శ్రీ శాస్త్రిలు గా రతని రచనలో నమూలకము లైన కొన్ని భాగములు కనఁబడఁగాఁ దామును వాని నట్లే గ్రహించిరేమో యను సందేహమునకును దావు లేకపోలేదు.

శ్రీకృష్ణ భారతములోఁ గాని, లభ్యము లగుచున్న యే సంస్కృత భారత ప్రతులలోఁగాని లేని భాగములును గొన్ని నన్నయ రచనలోఁ గానఁబడు చున్నవి. అట్టివాని సంఖ్య చాలఁ దక్కువ. మూఁడుపర్వముల నుండియు మూఁడుదాహరణములు మాత్ర మొసంగెదను.

(a) శక్తి మహాముని కల్మాష పాదుని శపించిన సందర్భమున విశ్వామిత్రుఁడు కింకరుఁడను నొక్క రక్కసునిఁ బంప నాతఁడు కల్మాష పాదు నంతరాత్మ నావేశించి యుండె నని చెప్పిన పిమ్మట:

"రాక్షసావిష్టుఁడై నప్డు రాజ్యలీల. విడిచి తన్నెఱుంగక తదావేశరహితుఁ
డైన యప్పుడు రాజ్యకార్యంబులందు, బద్ధ బుద్ధియై కల్మాష పాదుఁడుండె.
(ఆది. 7-113)

అని నన్నయ వ్రాసిన పద్యములోని భావ మే ప్రతిలోను గానరాదు.

(b) భీమార్జున నకుల సహదేవులు నాలుగు దిక్కులను జయించి వచ్చిన పిమ్మట నాప్తమంత్రులు ధర్మరాజును రాజసూయ మొనరింపు మని ప్రోత్సహించుచు నాతని గుణములను, ప్రజల సంతృప్తిని, రాజ్యాభ్యుదయమును వర్ణించి,

"మఱియు నపరిమిత పరార్ధ్య రత్న రజత సువర్ణ పరిపూర్ణంబయి మహామేరు శైలంబు సన్నిహితం బైనయట్లు యక్షేశ్వరు నక్షయనిధులు ప్రత్యక్షంబైన యట్లు భాండాగారంబు సమృద్ధంబైన యది. ఘృతలవణతైల తండులధాన్యాది సమస్త వస్తు విస్తృతం బయి కోష్ఠాగారంబు సకల సంకల్ప సిద్ధికరంబై కల్పద్రుమంబు ననుకరించు చున్నయది. వేదంబులన్నియు మూర్తిమంతంబు లయిన యట్లు మహాయాజ్ఞికు లయిన మహీసురవరులు నీ యభ్యుదయంబు గోరుచున్నవారు గావున రాజసూయాధ్వరం బెడసేయక చేయు మని పలుకు చున్న యవసరంబున"

(సభా- ౧-272)

అని చెప్పినట్లు నన్నయ భారతములో నమూలకమైన రచన యున్నది.

(c) అర్జునుఁడు తాను నివాతకవచులను వధించిన వృత్తాంతము సోదరులకుఁ జెప్పిన పిమ్మట వారు దివ్యబాణములును దదీయ ప్రయోగములును దమకుఁ జూపు మని యడుగ నర్జునుఁడు వేలుపు లిచ్చిన యస్త్ర శస్త్రములు చూపి తత్ప్రయోగములు చూపఁదొడంగ ముల్లోకము లందును బెద్ద యలజడి జరిగెను. అప్పుడు సురగణచోదితుఁడై నారదుం డరుదెంచి యర్జును నా ప్రయత్నము నుండి వారించి వెడలిపోయెను. పిమ్మట నొక్కనాఁ డమర కన్యకలు వచ్చి యర్జునునితో:

"వనములందును బండ్రెండు వత్సరమ్ము, లలయ కజ్ఞాతవాస మేకాబ్దకంబు
పూని నిర్విఘ్నవృత్తిఁ జల్పుదురు మీరు. పగఱ నిర్జింతు రాహవాభ్యంతరమున
నీ పరాక్రమబలమున నిఖిల ధరణి, రాజ్యభారంబు నీ ధర్మరాజు దాల్చు
రఘుకులాధీశ్వరుండైన రాముకీర్తి. యట్ల నీ కీర్తి త్రిజగంబు లందుఁబర్వు"

(అర-4-98, 99)

నని చెప్పి యరిగి రని నన్నయ భారతమున నున్నది. అమర కన్యకలు వచ్చుట కాని యర్జునునితో నీ వాక్యములు పల్కుట కాని సంస్కృత భారత ప్రతులలో నెచ్చటను గానరాదు.

నన్నయ భారతమున వాడిన కొన్ని పేరులు సంస్కృత భారత ప్రతులలో నెచ్చటను జూపట్టుటలేదు. ఆ ప్రతులన్నిటిలో నవి భిన్నరూపములై కనవచ్చు చున్నవి:

(a) ధౌమ్యుని ముప్వురు శిష్యులలో మూఁడవవాని పేరు వేదుఁడని సంస్కృత ప్రతులలోఁ గలదు. ఇతఁడే యుదంకుని గురువు. నన్నయ యుదంకుని పైల శిష్యుఁడని వర్ణించెను. (ఆది- ౧-91)

(b) ఆస్తీకుని గురువు చ్యవన సుతుఁడైన సుమతి యని నన్నయ వ్రాసెను. (ఆది- ౨- 162)

అతని పేరు ప్రమతి యని తత్పూర్వము చెప్పఁబడినది. "వేదాంశ్చాధిగమే సాంగాన్ భార్గవాచ్చ్యవనాత్మజాత్" అనిమూలము (1- 44-18)

(c) ఇంద్రుని వరమున నుపరిచరునికిఁ బుట్టిన యేవురు సుతులలో మూఁడవవాని పేరు "సౌబలుఁ"డని నన్నయ (ఆది-౩-26). సంస్కృత ప్రతులలో నాతని పేరు "మచ్ఛిల్లుఁ"డని యున్నది.

(d) దక్షుఁడు కశ్యపునికిచ్చిన పదుమువ్వురు కూఁతులలో నొకతె పే "ఠరిష్ట" అని మూలము. నన్నయ ఆమెపేరు "క్రూర" యని వ్రాసెను. (ఆది-౩-61).

(e) నితంతు కుమారులు పెండ్లాడిన యుశీనర కన్యకపేరు "అజిత" యని నన్నయ. (ఆది-౨-277) "భౌమశ్రీ" యని సంస్కృత ప్రతులు.

(f) అరణ్య పర్వ ద్వితీయాశ్వాసమునందలి 252 వ వచనములో నన్నయ వసు ద్వారమను తీర్థమును బేర్కొనెను. మూలములో దానిపేరు "వసుధార" యని యున్నది.

(g) మాల్యవంతమునఁ బాండవులు విహరించు చుండఁగా మారుతానీతములై "శ్వేతకి" యను నదినుండి పంచవర్ణ సురభి కుసుమములు వచ్చి వారిముంను పడెనని నన్నయ వ్రాసెను. (అర-౪-7). ఆ నది పే"ఠశ్వరథ" యని సంస్కృత ప్రతులు.

(h) కౌరవుల పేర్లు, నాగులపేర్లు, తీర్థములపేర్లు మున్నగువానిలోఁ గూడ నన్నయ పేర్కొన్న వానికిని సంస్కృత ప్రతులలో నున్నవానికిని గొంత వ్యత్యాసము గోచరించు చున్నది.

అమూలకములైన పై యుదాహరణములనుబట్టి చూడ నన్నయ చూచిన ప్రతి యిపు డుపలభ్యమానములైన ప్రతులన్నిటి కంటెను భిన్నమైన దని తోఁచుట సహజము. పైవానిలోఁ గొన్ని నన్నయ కల్పించుటకు వీలు లేనట్టివిగా నుండుట యిందుకుఁ గారణము. ఆ భాగముల నాతఁడెచ్చటనో యొకచోటఁ దప్పక చూచియే యుండును. లభ్యము లగుచున్న ప్రతులలో నొక్కదానిలోఁ గూడ నవి లేకుండుట యాతఁడు చూచిన ప్రతి కాని, దాని పుత్త్రిక కాని రక్షితము కాలేదనియో రక్షితమై యెచ్చటనో యున్నను లభ్యము కాలేదనియో చెప్పవలసి వచ్చును. శ్రీ కృష్ణమూర్తిశాస్త్రుల వారి భారతమునఁ గూడ నన్నయ రచనలోని కొన్ని భాగములు చూపట్టకపోవుటచే నతఁ డనుసరించిన ప్రతి వారు చూచిన ప్రతి కంటెఁ గూడ వేఱైనదే యని స్పష్టమగు చున్నది. ఈ విధముగా లభ్యము లగు చున్న సాధనములను ఆధారములను బట్టి నన్నయ యనుసరించిన భారతప్రతి యందు లేదనియే నిర్ణయము చేయవలయును. ఆతఁడు తన నాఁటికి లభ్యము లగుచున్న ముఖ్యపాఠముల నన్నిటిని జూచి తన ప్రతిని దాను నిర్మించుకొనెనని కాని, యన్నిటి నుండియు నుచితములని తోఁచిన భాగములను భావములను గ్రహించె నని కాని యూహించుట కంటె వేఱు మార్గము త్రొక్కుట కవకాశము లేకున్నను ఒక్క విషయము మాత్రము గట్టిగాఁ జెప్పవచ్చును. ఆతఁడేదో యొక ప్రతిని ప్రధానముగా గ్రహించి ప్రత్యంతర సాహాయ్యమున దానికిఁ గొన్ని. చేర్పుమార్పులు చేసికొని యుండును. మూఁడు పర్వముల విషయమున నాతఁ డనుసరించి యుండు నవి నేను సూచించిన ప్రతు లాతఁడు ప్రధానముగా గ్రహించిన ప్రతులకుఁ బుత్త్రికలనుటలో సందేహము లేదు. నన్నయ రచన పెక్కుచోట్ల వానికి సన్నిహితమై యుండుట యిందుకు నిదర్శనము. నన్నయ బహుప్రతులు చూచి యన్నిటి నుండియు నుచితములైన భాగములను గ్రహించియుండుట చేతను, ఆతని కాలమునకును మనకాలమునకును నడుమ వేయియేండ్ల వ్యవధాన ముండుటచే నీ కాలమున సంస్కృత ప్రతులలో మార్పుచేర్పులు కలిగియుండుట కవకాశ ముండుట చేతను ఆతఁడు గ్రహించిన ప్రతి యిదే యని నిశ్చితముగాఁ జెప్పుటకు వీలులే కున్నది. ఆతఁడు గ్రహించిన ప్రతికి మిక్కిలి సన్నిహితములైన వానిని ప్రయత్నించి చూపవచ్చును. నేను గావించిన దట్టి ప్రయత్నమే.

---

# 8. నన్నయ అనువాద పద్ధతి

ఏదైన నొక గ్రంథము నన్య భాషనుండి యనువదించునప్పుడు ప్రధానముగా మూఁడు పద్ధతుల నవలంబింపవచ్చును. అందొకటి కథానువాద పద్ధతి. ఇందు భాషాంతరీ కర్త మూల గ్రంథము నందలి కథను గ్రహించి, యందలి వివిధ సన్నివేశములను విడువకుండ, వివిధపాత్రలు నిర్వహించు కార్యసులను ఉజ్జగింపకుండ, వర్ణనాదులను రసపోషణమును దన యిచ్చ వచ్చిన ట్లొనరించుచు రచన సాగించును. ఇందు మూలమునకును అనువాదమునకును గథావిధానమున మాత్రమే సన్నిహితమైన సంబంధము కావిపించును. మిగిలిన రసభావ వర్ణనాదు లందిందు మూలకర్త యాత్మీయత కంటె ననువాదకర్త యాత్మీయతయే యధికముగా గోచరించును అందుచే నిది నామమున కనువాద మయ్యును స్వభావమున స్వతంత్ర గ్రంథము వలెనే కావచ్చును. రెండవది భావానువాద పద్ధతి. ఇందు భాషాంతరీకర్త మూలము నందలి కథనే కాక భావములను గూడ సన్నిహితముగా ననుసరించును. ఇందు మూలకర్త వెలువరించిన భావముల నుచితమైన భాషలో సుందరమైన శైలిలో స్పష్టముగా వ్యక్తము చేయుటయందే యనువాదకర్త నైపుణ్యము గోచరించును. ఈ పద్ధతి యందుఁ గథా ఘట్టములు కాక భావములు లేక వానిని వెలువరించు వివిధ శ్లోకాదులు ప్రమాణముగా (Unit) స్వీకరింపఁబడును. ఇది యంత యతి స్వతంత్రమును అతి విధేయమును గావి మధ్యస్థ పద్ధతి. ఇందు మూలకర్త భావము లన్నియు సమగ్రముగా వ్యక్తము చేయఁబడినను అతఁడు వాడిన పదము లన్నిటికిని బర్యాయ పదములు కనఁబడక పోవచ్చును. మూఁడవది పదానువాద పద్ధతి. ఇందు మూలమునందలి కథా భావములే కాక పదములు కూడఁ బ్రమాణములుగా గ్రహింపఁ బడును. మూలస్థ పదము లన్నియు నిందనువదింపఁ బడును. ఇది మూలమున కతి విధేయమైన పద్ధతి. ఇందు మూలము నందలి పదమునకుఁబదము వేయుట కంటె భాషాంతరీకర్త స్వతంత్రత యేమియు గోచరింపదు.

ఆంధ్ర వాఙ్మయమునఁ బై మూఁడు పద్ధతులకును ఉదాహరణములు గోచరించుచున్నవి. కవిత్రయమువారి పద్ధతి కథానువాదమునకును, శ్రీనాథాదులది భావానువాదమునకును, ఆధునిక నాట కానువాదకులది పదానువాదమునకును నిదర్శనము లని చెప్పవచ్చును ఈ మూఁడింటియందును గుణములును దోషము

లును లేకపోలేదు కాని కర్త ప్రత్యేకతను స్వాతంత్ర్యమును దృష్టియందిడుకొని చూచినచో మొదటి పద్ధతి విశిష్టముగా గోచరించును. ఈ పద్ధతికి మార్గదర్శకుఁడు నన్నయభట్టు. పురాణయుగమునందలి కవులు పలువు రనువాద విషయమున నాతని యడుగు జాడలనే యనుసరించిరి

కవిత్రయము వారి యనువాద పద్ధతిని గూర్చి చెప్పునప్పుడు వారు పెక్కువిధముల మూల భారతమునకు మెఱుఁగు వెట్టిరని చెప్పుచుండుట విమర్శకులకుఁ బరిపాటి. తమకు దొరకిన యే సంస్కృత భారతప్రతినో పురస్కరించుకొని వారట్లు సాధారణముగాఁ జెప్పివేయు చుందురు. కాని యట్లు చెప్పుటకు ముందు కవిత్రయము వా రనుసరించిన భారతప్రతి యేదో నిర్ణయించుట మిక్కిలి యావశ్యకము. అట్లు చేయనిచో వారి యభిప్రాయముల కంతగా విలువ యీ నక్కఱలేదు. ఏల యన సంస్కృతమునఁగల భారతప్రతులలో వైవిధ్య వ్యత్యాసములు విశేషముగా నున్నవి. అందేదో యొక ప్రతిని గ్రహించి కవిత్రయము వారి యనువాద పద్ధతిని బ్రశంసింపఁ దొరకొనుట భగవంతుఁడైన వ్యాసమహర్షి యెడ నపరాధ మొనరించినట్లే. అతఁడు చెప్పిన భారత మాతఁడు చెప్పినట్లే మన వఱకును సాగి రాలేదు. మధ్య నందెన్నియో మార్పుచేర్పు లుప్పతిల్లినవి. వాని కన్నిటికిని ఆతని బాధ్యునిఁ గావించుట పాడిగాదు. ఉదాహరణమున కొక్క విషయమును మాత్రము చెప్పెదను. ఆంధ్ర భారతమున యయాతి చరిత్ర ముందును దరువాత దుష్యంతోపాఖ్యానమును జెప్పఁబడినవి. నిజమున కా కథల క్రమ మట్లే యుండవలయును. కొన్ని సంస్కృత ప్రతులలో (ఉత్తర ప్రతులలో) ముందు శకుంత లోపాఖ్యానమును దరువాత యయాతి చరిత్రమును గానఁబడు చున్నవి. వీనిని మాత్రమే చూచినచో భారతము ననువదించు నప్పుడు నన్నయ క్రమమును సవరించి యెంతో మెఱుఁగు చేకూర్చె నని తోఁపక మానదు. కాని దాక్షిణాత్య ప్రతు లన్నింటిలో నా క్రమ మాంధ్ర భారతములో నున్నట్లే యున్నది. వీనిలో దేనినైన నన్నయ యనుసరించియుండి నచో నా విషయమున నాతఁడు చేసిన మార్పుకాని కలిగించిన వన్నెకాని యేమియు లేనట్లే తోఁచును. అందుచే నన్నయాదుల యనువాదమును గూర్చి యేదైనఁ జెప్పుటకు ముందు వా రనుసరించిన భారతప్రతి యేదో లేదా అధమ ముత్తర దక్షిణ పాఠములలో వారనుసరించిన ప్రతి దేనికి సంబంధించినదో తెలిసికొనుటకుఁ బ్రయత్నము చేయవలసియున్నది.

అట్లు చేసిన పిమ్మటఁ గూడ నన్నయాదులు బుద్ధి పూర్వకముగాఁ గలిగించిన వన్నెచిన్నె లెన్నో గోచరింపవచ్చును. అట్టివానిని బురస్కరించుకొని వారి యనువాద పద్ధతిని గొందాడవచ్చును. మూలానువాదములకుఁ బెక్కు విషయములఁ గొంత భేదము కానవచ్చుటకు ఆ గ్రంథమును రచించు పట్లఁ దత్కర్తలు వహించిన దృష్టు లందలి భేదమే ముఖ్య కారణము. సంస్కృతమున భారతమును నిర్మించుటలో వ్యాస మహర్షిది ప్రధానముగాఁ బౌరాణిక నైతికదృష్టి. అప్పటి దేశకాల పరిస్థితుల ననుసరించి వైదిక సిద్ధాంతానుగుణములైన నీతి ధర్మములను గథోపాఖ్యానముల ద్వారా ప్రజలకు బోధించుటయే యాతఁడు తన యాదర్శముగాఁ బెట్టుకొనెను. వైదికభాష క్రమక్రమముగా జన సామాన్యమునకు దుర్బోధమై పోవుచుండిన రోజులలో నందలి నీతి ధర్మములను దత్త్వ సిద్ధాంతములను వారికి బోధపడు భాషలో వెల్లడించుటకై యాతఁడు చేసిన ప్రయత్నమది. అందుచే భారతము నొక కళాసంపన్నమైన మహాకావ్యముగా నిర్మింపవలె ననునుద్దేశమే యాతనికి లేదు. ఆ విషయమున నాతఁడు బుద్ధి పూర్వకముగాఁ గావించిన యత్నమును లేదు. నన్నయాదులకుఁ గూడ నీతి ధర్మములం దాస్థ లేకపోలేదు కాని వా రా గ్రంథము ననువదించునప్పుడు ధార్మిక దృష్టికిఁ గళాదృష్టిని గూడ జతచేసి యుండిరి. అందుచేఁ గళా దృష్టితోఁ బరిశీలించినప్పుడు వారి రచనలోఁ గొన్ని మెఱుఁగులు గోచరించు చుండును. వానిని బురస్కరించుకొని వ్యాసు నీసడించుటలో మాత్రము న్యాయములేదు.

వ్యాసుని కాలమునకును నన్నయ కాలమునకును నడుమఁ బెక్కువందల సంవత్సరములు గడచినవి. ఇట్లు కాలములోనే కాక వారు నివసించిన దేశమునందుఁగూడ భేదమున్నది. దేశకాల భేదముచే సాంఘికాది సంప్రదాయములందును, ఆచార వ్యవహారములందును ఆహారవిహారములందును వ్యత్యాసము లేర్పడు చుండుట సహజము. అందుచే వ్యాసుఁడు నివసించిన కాలమునకును దేశమునకును అనుగుణములైన కొన్ని విషయములు నన్నయాదుల నాఁటికి విరుద్ధములుగను, ఆక్షేపణీయములుగను బరిణమింపవచ్చును. అప్పుడు వారు వానిని దమ దేశకాలముల కనుగుణముగా మార్పుచేయ యత్నించుటలో వింతలేదు. ఇట్టి ప్రయత్నము వలనఁ గూడ నొక్కొక్కప్పుడు మూలానువాదములకు సుంత వ్యత్యాస మేర్పడవచ్చును. నన్నయాదు లనువాదము చేయు చున్నప్పుడు మూల

మును యథాస్థితముగానే యనువదించి యుండినను నెవ్వరును వారి నాక్షేపింపఁ గలవా రుండరు. అట్లుంధానువాదము చేయక వారు దేశ కాలానుగుణముగాఁ గొన్ని మార్పులను జేయుట వారి వివేకమునకును ఔచిత్య దృష్టికిని దార్కాణములు. వానిని మనము గ్రహించి మెచ్చుకోవచ్చును. కాని యా హేతువున వ్యాసుని మహనీయతను లఘూకరించుట మాత్ర ముచితముగా నుండదు.

కవిత్రయము వారు వ్యాసునికి సుమారు రెండువేల సంవత్సరములు తరువాత నివసించిన వారు. ఒకే కావ్యమును భిన్నకాలము లందలి వా రాచరించి నప్పుడు ముందుకాలము వారు చేసిన లోపములను తరువాతి వారు సవరించు కొనుట సహజము. అట్లే వ్యాసుని రచనలో నౌచిత్యాదుల విషయమున నేవేని లోపములు కానఁబడినచో నన్నయాదులు తొలఁగింప యత్నించియుందురు. వా రట్లు తొలఁగింప కుండుట వింతపడవలసిన విషయము కాని, తొలఁగించుట కాదు. ఈ విధముగాఁ గూడ వ్యాసభారతము కవిత్రయము వారి చేతులలో నెక్కువ రసవంతమును ఔచిత్య భాసురమునునై వెలసి యుండుట కవకాశ మున్నది.

నన్నయది కథానువాద పద్ధతి యని యిదివఱకే చెప్పఁబడినది. మూలము నందలి కథను మాత్రము గ్రహించి భావవర్ణనాదులం దిచ్చవచ్చిన మార్పులు చేయుచు నాతఁడనువాదమును సాగించెను. పదమునకుఁ బదముగాఁ గాని శ్లోకమునకుఁ బద్యముగాఁగాని భారతము ననువదింపవలె నను నభిప్రాయమే యాతనికి లేదు. రాజరాజు కూడ నతని

"జననుత! కృష్ణద్వైపా
యన ముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూ పితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్"

అని మహాభారతము నందలి యర్థమునే తెనుఁగున వెల్లడింపఁగోరెను గాని దానిని యథామూలముగా ననువదింపు మని కోరియుండలేదు. నన్నయ్యయుఁ బ్రభు నభీష్టము నెఱింగి తదనుగుణముగా వ్యాసుఁడు నిరూపించిన యర్థమునకు వేఱుపాటు రాకుండ భారతాంధ్రీకరణమునకుఁ బూనుకొనెను. ఒక్క నన్నయ్యయే కాదు. తిక్కన యెఱ్ఱనలు కూడ భారతము నందలి యర్థమును

వెల్లడించుటకే ప్రయత్నించి యుండిరి. తిక్కన "అమ్మహా కావ్యంబు నర్థంబు సంగతంబు సేసెద" ననుటయు, నెఱ్ఱన "నన్నయభట్ట మహాకవీంద్రు సరస సారస్వతాంశ ప్రశస్తి తన్నుఁజెందుటయుఁ దద్రచనయ కా నారణ్య పర్వశేష మును" బూరించితినని చెప్పుకొనుటయు నిందుకు నిదర్శనములు. అందుచే సంస్కృత భారతమును ముందుంచుకొని యందలి యొక్కొక్క శ్లోకమునే గ్రహించి దానిని నన్నయ యెట్లనువదించెనని పరిశీలింపఁ దొడఁగితిమేని మనము నిరాశ పొందవలసిన వార మగుదుము. నన్నయ యా పద్ధతి పొంతకే పోలేదు. అతఁడు వ్యాసుఁడు నిర్మించిన కథను మాత్ర మనుసరించి యథేచ్ఛముగా రచన సాగించుచు నాతఁడు భారతమున నిబంధించిన యర్థము నంతను గొంచెమేని చెదకుండఁ దెలుఁగు వారికిఁ జూఱలిచ్చుటకు యత్నించెను. అతని రచన సంస్కృత భారతమునకు 'మక్కికి మక్కి' యనువాదమును గాదు, దానిని బూర్తిగాఁ బరిహరించి యథేష్టముగా సాగించిన యతి స్వతంత్ర రచనమును గాదు అది స్వతంత్రమైన యనువాదము. అనువాద మయ్యు స్వతంత్రతా గుణశోభితము కాఁజాలుటయే యందలి వైశిష్ట్యము.

(A) సంస్కృత భారతముతోఁ బోల్చి చూచినచోఁ దెలుఁగు భారతము మిక్కిలి సంగ్రహింపఁబడినట్లు తోఁచును నన్నయ లెక్కప్రకార మాదిపర్వము నఁగల శ్లోకముల సంఖ్య 9,984. తెలుఁగునఁగల గద్య పద్యముల సంఖ్య 2,091. కేవల మీ సంఖ్యను మాత్రమే పురస్కరించుకొని చూచినచోఁ దెలుఁగు భారతము నాల్గవ వంతునకుఁ దగ్గింపఁబడినదని చెప్పవచ్చును. కాని సంస్కృతము నందలి శ్లోకముల పరిమితికిని దెలుఁగు నందలి గద్య పద్యముల పరిమితికిని జాల వ్యత్యాస మున్నది. సంస్కృతము నందలి శ్లోకములు పెక్కనుష్టుప్పులే. తెలుఁగున వృత్తములు, సీసములు, దీర్ఘములైన గద్యములు కూడ నున్నవి. వీనిలో నొక్కొక్క దానియందు మూఁడు నాలుగు శ్లోకముల భావ మిముడుట కవకాశ మున్నది కావునఁ బరిమాణము నందలి న్యూనాధిక్యములఁ దెలిసికొను టకు శ్లోకములయుఁ బద్యములయు సంఖ్యను మాత్రమే ప్రమాణముగా గ్రహింప కూడదు తెలుఁగునందలి కందములను గీతములను గొంచె మించుమించుగా ననుష్టుప్పులకు సమానములుగాఁ గన్పట్టును. ఇవి కూడ తెలుఁగు భారతమున నధికముగా నుండుటచే సరాసరిని రెండేసి శ్లోకముల కొక్కొక్క పద్యమో గద్యమో వ్రాయఁబడిన దని భావింపవచ్చును. ఈ విధముగాఁ జూచినను దెలుఁగు

భారతము సగమునకుఁ బైఁగాఁ దగ్గింపఁబడినట్లే కానిపించును. మూలము నందలి వర్ణనలను, సంభాషణములను, ప్రశ్నోత్తరములను నన్నయ చాలవఱకు సంక్షేపించుటయే యీ తగ్గుదలకుఁ గారణములు అతఁడట్లు సంక్షేపించిన భాగములు కొన్ని యిచ్చట సూచించెదను.

ఆదిపర్వము:-

1 ఉదంకుఁడు విద్యాభ్యాస మాచరించుచు గురుకులమున వసించు చుండఁగా నొకప్పుడు గురువైన వేదుఁడు (పైలుఁడని నన్నయ) ప్రవాసమున కరిగెను. అప్పు డుపాధ్యాయునికి సంబంధించిన స్త్రీలు కొందఱు వచ్చి ఋతు మతి యైన యుపాధ్యాయిని ఋతువు వంధ్యము కాకుండు నట్లొనరింపఁ బ్రార్థిం చిరి. అది యకార్య మని తోఁచుటచే నుదంకుఁడు దాని నొనరింప నంగీకరింప లేదు గురువు ప్రవాసము నుండి తిరిగి వచ్చి యీ వృత్తాంత మంతయు నెఱింగి ప్రీతుఁడై యాతని కన్ని సిద్ధులు కలుగు నట్లాశీర్వదించి గురుకులమును వీడి యేగుట కనుజ్ఞ యిచ్చెను. ఉదంకుఁడు గురుదక్షిణగా నేమి యీవలయునో చెప్పు మని గురువును వేఁడెను. గురువు ముందేమియుఁ జెప్పక యూరకుండెను. ఉదంకుఁడు మరల మరల నడుగుటచే నాతఁడు "వత్స! మీ యుపాధ్యాయిని కడకేగి యడిగి యామె యేది చెప్పునో యది చేయు" మని పలికెను. ఉదంకుఁ డామె కడకేగి యడిగెను. ఆమె పౌష్యుని కడకేగి యాతని దేవి ధరించు కుండలమ్ము లడిగి తెమ్మని నియోగించెను. ఉదంకుఁడంత గుర్వర్థము సమ కూర్చుటకై బయలు దేఱెను. 1-3- (85-100). దీని నంతను నన్నయ "అయ్యుదంకుఁడు గురుహిత కార్య ధురంధరుఁడయి గురుపత్నీ నియోగంబునఁ బౌష్యుఁడను రాజు దేవి కుండలంబులు తేరంబూని" యని (ఆది-౧-82) సంగ్రహించెను.

2. ఉదంకుఁడు నాగలోకమున సితాసితతంతు సంతాన పటంబు వనువ యించు చున్న యిరువురు స్త్రీలను ద్వాదశార చక్రంబు పరివర్తింపించు చున్న వారి నార్వురు కుమారులను ఒక్క దివ్య పురుషునిఁ గని పిమ్మట మూలమున "స తాన్ సర్వాన్ తుష్టావ ఏభి ర్మన్త్రవాద శ్లోకైః" అని నాలుగు శ్లోకములు వ్రాయఁ బడినవి. (1-3-149-153). నన్నయ యిచ్చట "విపులార్థవంతంబు లైన మంత్రంబుల నతి భక్తియుక్తుఁడై స్తుతియించిన" (ఆది. ౧-108) అని మాత్రము వ్రాసి యూరకుండెను.

3. పన్నుదష్టమైన ప్రమద్వరను బ్రదికించు సందర్భమున గాంధర్వ రాజును దేవమాతయు యమున కథ కరుగుటయు వారికి జరిగిన సంభాషణ మును నన్నయ తగ్గించెను (1-9-12, 13, 14)

4. మార్తాండ చండ కిరణంబులవేఁడిమి దాఁకి మాడి మూర్ఛిల్లిన కొడుకులను గాంచి కద్రువ గావించిన యింద్రస్తుతి మూలమున విస్తృతము 1-21- (7-17). నన్నయ యొక్క పద్యమును మాత్రము వ్రాసెను. (ఆది-౨-46)

5. గరుడుఁడు విషాదుల భక్షించిన విధము 1-24(12, 13, 14) విభావసుఁడు సుప్రతీకునితోఁ జెప్పిన విభాగము వలని నష్టములు 1-25(11, 12, 13, 14, 15) గజ కచ్ఛపముల యుద్ధము 1-25 (20-25) నన్నయ సంగ్రహించెను. ఉపకథలలోని అనవసర వివరములను నన్నయ చాల చోట్ల విడ్లే సంక్షేపించు చుండును.

6. జరత్కారువు సర్ప యాగము నుడిగింపు మని యాస్తీకునిఁ బంపు టకు ముం దాతఁ డదుగఁగా వాసుకి తన్ను జరత్కారున కొసంగిన వృత్తాంత మును వివరించెను. ఆస్తీకుఁడు వాసుకి నోదార్చెను. (1-49). ఇందలి చాల భాగము జరత్కారు చరిత్రమున నంతకు ముఁదే చెప్పఁబడి యుండుటచే నన్నయ పునరుక్తి యేల యని దాని నంతను" జరత్కారువు కొడుకు మొగంబు చూచి భపన్మాతుల వియోగంబు చేయు మని" అను మాటలతో సంగ్రహించెను. (ఆది-౨-220)

7. వ్యాసావతరణమైన పిమ్మట 1-57 అధ్యాయములలో నెవ రెవ రే యంశములఁ బుట్టిరో చెప్పఁబడినది. (75-103). ఇది తరువాత వివరముగా నెట్లును జెప్పవలసి యుండుటచే నన్నయ యా విషయమును "మఱియు దేవ దైత్య దానవ ముని యక్ష పక్షి గంధర్వుల యంశంబులు తాల్చి భీష్మాది వీరులు భారత యుద్ధంబు చేయ ననేకులు పుట్టిరి వారల కొలంది యెఱింగి చెప్ప ననేకకాలం బనేకముఖంబుల వారికైన నలవి కా" దని (ఆది-3-48) సంగ్రహించెను.

8. మూలము నందలి కచదేవయానుల సంభాషణమును 1-72 (9-17) నన్నయ చాల సంగ్రహించెను (ఆది. 3-129-131).

9. 1-74 అధ్యాయములలో శుక్ర దేవయానులకు క్రోధము తద్వర్జనము అను విషయముపై జరిగిన సంవాదము కలదు. దానిని నన్నయ సంగ్రహించెను. ఆది. 3 (147-148).

శర్మిష్ఠ తన్ను నూతిలోఁ ద్రోయించుటచే వవమానితయై దేవయాని పురము ప్రవేశింప నొల్లక యుండ శుక్రుఁడు వృషపర్వుని కడ కరిగి యా వృత్తాంత మంతయు నెఱింగించి "స్థాతుం త్వద్విషయే రాజ న్న శక్ష్యామి త్వయా సహ" అని పలికె ననియు, వృషపర్వుఁ డది విని మీరు నన్ను విడిచి వెళ్లినచో సముద్రమునఁ బడెద నని పల్కి తన సర్వస్వమును శుక్రునిదే యని తెలిపె ననియు, నట్లైనచో దేవయానిని బ్రసన్ను రాలినిఁ జేయవలె నని శుక్రుఁడు కోరె ననియు, దేవయాని వృషపర్వుఁడే తనతో నర్వమును జెప్పవలె నని పట్టు పట్ట వృషపర్వుఁడట్లే యొనరించె ననియు మూల మందున్నది. (1.75.) నన్నయ దీని నంతను "శుక్రుండు, నాకు నీవ గతివి. నీతోఁడ నేనును వత్తు ననుచుఁ గూఁతుం బట్టు వఱచు చున్నంత నంతయుఁ జారుల వలన నెఱింగి వృష పర్వుండు శుక్రు నొద్దకు వచ్చి నమస్కరించి యిట్లనియె" (ఆది-3-141) అని యౌచిత్య శోభితముగా సంగ్రహించెను.

10. 1-79 వ అధ్యాయమున యయాతి కొడుకు లొక్కొక్కరితోఁ దన ముదిమి గైకొని యౌవన మొసంగవలె నని పల్కుటయు, వా రంగీకరింపమికిఁ గినిసి శపించుటయు వేఱు వేఱుగాఁ జెప్పఁబడినది. నన్నయ యయాతి కొడుకుల నెల్ల రావించి యొకే మాఱు చెప్పినట్లును యదుతుర్వసు ద్రుహ్యాను లందఱు నొకే సమాధాన మిచ్చినట్లును వ్రాసి సంగ్రహించెను. (ఆది-తృతీ-193,194). ఇట్లు పలువు రెవ్వరితో నైన నొకే విషయము చెప్పవలసి వచ్చినప్పుడు మూలమున వారు వేఱు వేఱుగాఁ జెప్పి నట్లుండ, నన్నయ యది యొకేమాఱు చెప్పి సంగ్రహించు చుండుట పెక్కు చోట్లఁ గానవచ్చు చుండును. తమకుఁ బుణ్యలోకము లున్నవా యని యష్ట కాదులు యయాతి నడిగిన సందర్భ మిందుకు మఱియొక దృష్టాంతము. (ఆది-తృతీ-225).

11. 1-84 వ అధ్యాయమున నష్టకుఁ డడిగిన ప్రశ్నలను నన్నయ మిక్కిలి సంగ్రహించెను. (ఆది-తృతీ-218). అతఁడు ప్రశ్న లన్నియు విడిచి

వాని సమాధానములను మాత్రము యయాతిచే నుపన్యసింపఁ జేసెను.(ఆది-తృతీ-221). ఇచ్చట నన్నయ తాను బుద్ధి పూర్వకముగా సంగ్రహించిన విధమును (223) వచనములో "అని యయాతి యష్ట కాదు లడిగిన వాని నెల్ల సంక్షేప రూపంబునం జెప్పుటయు వార లిట్లనిరి". అని సూచించెను. సంక్షేప రూపంబునఁ జెప్పుటయు ననునది యమూలకము.

12. దుష్యంతుఁడు రాజ్యము పాలించిన విధము మూలమున 1-62 వ అధ్యాయమునఁ బంద్రెండు శ్లోకములలో వర్ణింపఁబడినది. నన్నయ దాని నంతను

" ఆతని రాజ్యంబున నుర్వీతలము ప్రజాసమృద్ధి వెలసి రుజాశో
కాతంక క్షయ శంకాపేతం బై ధర్మచరితఁ బెరుఁగుచు నుండెన్."

(ఆది-4-9)

అను పద్యముతో సంగ్రహించెను.

13. మూలమున నింద్రుఁడు విశ్వామిత్రుని తపము భంగము చేయుటకై యచ్చరలను బంపు సందర్భమున మేనక కావించిన విశ్వామిత్ర వర్ణనము దీర్ఘమై యున్నది. (1-65 27-40). నన్నయ యా భాగమును రెండు పద్యములలో సంక్షేపించెను. (ఆది-4-37-38)

14. 1-94 వ అధ్యాయమున శంతనుని యొక్కయుఁ దత్పాలనము యొక్కయు వర్ణనము 20 శ్లోకములలోఁ గావింపఁ బడినది. (1-20). నన్నయ దాని నంతను సంగ్రహించి యీ క్రింది పద్య మొక్కటే వ్రాసెను.

" తన కాజ్ఞావశవర్తులై మహి సమస్త క్షత్త్రియవంశేశు లె
ల్లను భక్తిం బనిసేయు చుండఁగ విశాలం బైన సత్కీర్తి ది
గ్వనితా మౌక్తిక దామలీల వెలుఁగన్ వారాశి పర్యంత భూ
జన రక్షాపరుఁడయ్యె శంతనుఁడు రాజద్రాజ ధర్మ స్థితిన్" (ఆది-4-162)

15. బృహస్పతి దీర్ఘతముని శపించుటకుఁ గారణమైన వృత్తాంతము మూలమున నేడు శ్లోకములలోఁ జెప్పఁబడినది. ఇది యసభ్యమైన శృంగారముతోఁ గూడి యసహ్యముగా నున్నది. (1-98 - 7-15). నన్నయ దానిని మిక్కిలి యౌచిత్య పూర్ణముగా సంగ్రహించెను. (ఆది-4-227).

16. పుత్త్రులు లే రని దుఃఖించు పాండురాజునకుఁ గుంతి మూలమున దుర్వాసుఁడు తన కిచ్చిన మంత్రము సంగతి సవిస్తరముగాఁ దెల్పెను. 1-111-3 (31-38). ఈ వృత్తాంత మంతకు ముందే విపులముగాఁ జెప్పఁబడినది.

అందుచే నీ పునరుక్తినిఁ దొలఁగించి నన్నయ " కుంతి భోజునింటఁ దన కొం దుకనాఁడు దుర్వాసుఁ డిచ్చిన మంత్రంబు తెఱంగు పతి కెఱింగించి " (ఆది-౫-91) అని చక్కఁగా సంక్షేపించెను.

17. పాండు మరణానంతరము కుంతీ పాండవు లడవి నుండి హస్తినా పురమునకు వచ్చినప్పుడు వృద్ధ తపస్వి ధృతరాష్ట్రాదులకుఁ బాండవుల జనన వృత్తాంతమును వివరించి చెప్పెను. (1-117-21-27). నన్నయ యందలి భావమును

" భాను విభుండు పాండు జనపాలుఁడు ఘోరతపంబు సేసి ధ
ర్మానిల వాస వాశ్వినులదైన వరంబున శక్తి పేర్మితో
నీ వరనాథ నందనుల నేవుర వంశ వివృద్ధి పొంచెఁ బం
డానన సత్త్వులం బడసె నా శతశృంగ మహానగంబునన్. '' (ఆది-౫-153) అను పద్యమున వ్యంగ్య రీతిని జక్కఁగా వెల్లడించెను.

18. అర్జునుఁడు ద్రుపదునిఁ గట్టి తీసికొని వచ్చినప్పు డతనికిని ద్రోణున కును జరిగిన సంభాషణమును ( 1-128-7-11) నన్నయ సంగ్రహించుటయే కాక " వీరెవ్వరయ్య ! ద్రుపద మహారాజులె " అను నమూలకమైన పద్యమును వ్రాసి యచ్చటఁ జాల వన్నె చేకూర్చెను. (ఆది-౬-89)

19. ధృష్టద్యుమ్నుఁడు పాండవుల వృత్తాంతము రహస్యముగాఁ జూచి వచ్చి తండ్రి కెఱింగించుట మూలమున మిక్కిలి విస్తృతముగా నున్నది. (1-185). నన్నయ దానిని ఆది (౭-226) వ పద్యమున సంగ్రహించి వ్రాసెను.

20. పాండవులను ద్రుపద పురము నుండి హస్తినాపురమునకుఁ దోడ్తె చ్చుట యుచిత మని భీష్మ ద్రోణులు ధృతరాష్ట్రుని కెఱింగింపఁ గర్ణుఁడు వారి పలుకు లహితంబు లని యాక్షేపించెను. ద్రోణుఁ డప్పు డాతని నిందించెను. విదు రుఁడు వారి విరువుర వారించి ధృతరాష్ట్రునకుఁ జేసిన కర్తవ్యోపదేశము 1-196వ అధ్యాయమున విస్తృతముగా నున్నది. నన్నయ దాని నైదాఱు పద్యములలో రసవంతముగా సంగ్రహించెను. (ఆది. ౮-43-48).

21. ఖాండవ వన దహ నోద్యుక్తుఁడై వచ్చు నగ్నిభట్టారకునిఁ గూర్చి మందపాలుఁడు కావించిన స్తుతి మూలమున నేడు శ్లోకములలో నున్నది. 1. 220- (22-29). తెలుఁగున నన్నయ

> " నీవఖిల ధర్మమూర్తివి, నా వీర్య ప్రభవు లయిన నలువురు సుతులన్
> లావుకలఁ గరుణఁ గావుము, పావక భువనోపకార పర్యాప్త మతీ! "
> (ఆది-౮-300)

అని యొక్క పద్యమును మాత్రము వ్రాసెను.

సభా పర్వము :-

22. మయుఁ డుండఁగనే కృష్ణుఁడు ధర్మరా జాదులను వీడ్కొని ద్వారక కరిగె నని మూలము నందలి 2 వ యధ్యాయము వర్ణించు చున్నది. నన్నయ యీ యధ్యాయము నంతను " అంత నారాయణుండును బాండవుల వీడ్కొని పితృదర్శన లాలసుండై ద్వారవతీ పురంబున కరిగె " నని (సభా ౧-8) యొక్క వాక్యములో సంగ్రహించెను. ఇక్కడఁ గృష్ణుఁ డరుగుటలో నంత విశేష మేదియు లేదు. అది గాక, రాజసూయ యాగానంతరము కృష్ణుఁడు పాండవులను వీడ్కొని యేగు వృత్తాంతము మరల వచ్చును. అక్కడఁ బాండవులు కృష్ణుని సాగనంపుటను నన్నయ రెండు మూఁడు పద్యములలో వర్ణించెను. (సభా. ౨-82-84).

23. మయుఁడు నిర్మించిన సభ మూలమున నాలు శ్లోకములలో వర్ణింపఁబడినది. (2-3-18-24). నన్నయ భారతమున మయ సభను వర్ణించు పద్య మొక్కటే యున్నది.

> "విమల మణి మయములగు దూలములం గంబముల గోడలను వేదులఁ గుట్టిమములఁ జుట్టిన ప్రాకారములను గర మొప్పుచుండ రచియించె సభన్".
> (సభా-౧-11)

24. మూలమున 4 వ అధ్యాయము నందలి 18 వ శ్లోకము నుండి 27 వ శ్లోకము వఱకు నే యే రాజులు వచ్చి ధర్మజుని సేవించిరో చెప్పఁబడినది. నన్నయ ఆ పేర్లన్నియు విడిచి " అయ్యుదయాస్తాచల సేతు శీతనగ మధ్యోర్వీపతుల్ " (సభా-౧- 8) అని చక్కఁగా సంగ్రహించెను. అట్లనుటలో ధర్మజునిఁ గొల్చిన రాజుల యపరిమితత్వము కూడ వెల్లడి యగు చున్నది. వేఱు వేఱుగా వెందఱి పేర్లు చెప్పినను అంత గాంభీర్యము చేకూరదు,

25. సభాసీనులై యుండిన పాండవులను జూడ వచ్చిన నారదుఁడు వారిచే నర్చితుఁడై (2-5) ధర్మార్థ కామ సంయుక్తముగా యుధిష్ఠిరు నడిగిన ప్రశ్నలు సుమారు 100 శ్లోకముల నాక్రమించి యున్నవి. నన్నయ యిందలి పెక్కు శ్లోకములను విడిచి వైచెను. (11-14; 20-28; 34. 35. 37. 41. 43. 46. 48. 59. 52-57. 59. 62. 63. 70-78; 89-95; 103-107; 109-112). కొన్నిటిని బెంచెను. కొన్ని పద్యములను స్వయముగాఁ గల్పించెను.

26. నారదుఁడు సభావర్ణనలు కావించిన పిమ్మట ధర్మరాజు మరల వాని నన్నిటిని సింహావలోకనము చేసి(2-11-43-48)హరిశ్చంద్రుని మహిమాతిశయ మును గూర్చి యడిగినట్లు మూలమున నున్నది. నన్నయ యీ సింహావలోకన మును దగ్గించి సూటిగా హరిశ్చంద్రుని గూర్చి యడిగినట్లు రచించెను. (సభా. ౧-81).

27. అర్జునుఁడు ధర్మరాజునకు రాజసూయాచరణము నం దుత్సాహము కలిగించుచు (2-15) వ అధ్యాయములోఁ బరాక్రమ గుణమును విస్తృతముగా వర్ణించెను (11-16). నన్నయ

" ఫలరూప గుణ ద్రవ్యంబులు విక్రమ వంతు నందు భూవిదితములై
నిలుచు నవిక్రమునకు నవి గలిగియు లేవి క్రియ నప్రకాశంబు లగున్."
(సభా ౧-128)

అవి యొక్క పద్యమును మాత్రము వ్రాసెను.

28. జరాసంధ వధానంతరము కృష్ణుఁడు ధర్మరాజాదులను వీడి ద్వారక కరుగుట మూలమున (2-22-52-57) 6 శ్లోకములలో వర్ణింపఁబడినది. నన్నయ " నారాయణుండును ధర్మరాజు వీడ్కొని తద్దివ్య రథారూఢుఁడయి ద్వారవతీ పురంబున కరిగె " (సభా-౧-223) అని చిన్న వాక్యము వ్రాసెను.

29. 54 వ అధ్యాయమున ధర్మరా జొక్కొక్క వస్తువునే యొడ్డి దాపిని వర్ణించి " తేన దీవ్యామ్యహం త్వయా " అను చుండుటయు, శకుని " జయించితి నని" ("జిత మిత్యేవ శకుని ర్యుధిష్ఠిర మభాషత") పలుకుచుండుటయుఁ బెక్కు సార్లు కాన నగును. నన్నయ ధర్మరా జొడ్డిన వస్తువు లన్నింటిని సభా-౨-17 వ

వచనమున సంగ్రహముగా వర్ణించి " ఒక్కొక్క యెద్దునన యెద్ది యోటు వడిన '' నని మూలము నందలి పునరుక్తిని దగ్గించెను.

30. శకునితో జూదమాడి ధర్మరాజు ఒక్కొక్క యెద్దునే యోడుచుండుట గాంచి విదురుఁడు ధృతరాష్ట్రునితో దుర్యోధనుని బహిష్కరించి కౌరవాన్వయమును గాపాడు మని ప్రబోధించెను. ఇ దంతయు మూలమున 55 వ అధ్యాయములో నున్నది. 56 వ అధ్యాయమునఁ గూడ విదురుఁ డా యుపన్యాసమును సాగించుచు "నీ వీ ద్యూతమున కంగీకరించుచు వంశమును వినాశమునఁ ద్రోయుచున్నావు శకునిని వాని రాజ్యమునకుఁ బంపివేయు" మని ధృతరాష్ట్రునకుఁ జెప్పియుండెను. నన్నయ యీ యధ్యాయము నంత " ఇంక నైన నుపేక్షింపక యీ దుష్టద్యూతము వారింపు" మను వాక్యములతో సభా. ౨. 184లో సంగ్రహించెను.

31. " మాయా ద్యూతమునఁ బాండవుల శ్రీ హరించిన విన్ను జనులు ఛీ యని నిందింపరా " యని విదురుఁడు దుర్యోధను మందలించినప్పుడు దుర్యోధనుఁ డతని ననేక విధంబుల దూషించెను. " మార్జారవత్పోషకం చోపహంసి, తస్మాత్త త్తః కిం న బిభేషి పాపాత్, మా వ్యాపృతః పరకార్యేషు భూస్త్వం, స యత్రేచ్ఛసి విదుర తత్ర గచ్ఛ సుసాన్త్వితాపి హ్యా సతీ స్త్రీ జహాతి " ఇత్యాదిగా నం దనౌచిత్య జుష్టములైన వాక్యము లెన్నో యున్నవి. నన్నయ వావి నన్నిటిని విడిచి దుర్యోధనుఁడు మూలమున నన్న వాక్యముల సారాంశము మాత్ర మొక్క సీసములో (188) వ్రాసెను. అట్లే తరువాత విదురుఁ డిచ్చిన సమాధానమును గూడ నతఁడు సంగ్రహించెను.

32. సభవారు పాంచాలీ ప్రశ్నము నర్థము విచారింప వలె నని హెచ్చరించు సందర్భమున మూలములో విదురుఁడు సభాధర్మములను విస్తరించి చెప్పెను. నన్నయ వానిని సంగ్రహించి యొక్క పద్యము మాత్రము వ్రాసెను. (సభా. ౨-235)

33. నారదుఁడు దిక్పాలుర సభ వర్ణించు సందర్భమున యముని సేవించు రాజుల పేర్లును, వరుణుని సేవించు నదీ తీర్థాదుల పేర్లును, కుబేర సభ యందలి యక్ష కిన్న రాదుల పేర్లును సవిస్తరముగాఁ చేర్కొనెను. నన్నయ వానినిఁ జాలవఱకుఁ దగ్గించెను.

అరణ్య పర్వము:-

34. పాండవు లడవి కరుగు చుండఁగాఁ బౌరు దుఃఖితులై ప్రజ లన్న వాక్యములు మూలమున 18 శ్లోకములలోఁ జెప్పఁబడినవి. (అర.౧-12-30). నన్నయ భావము చెడకుండ వాని నన్నిటిని జక్కఁగాఁ సంగ్రహించెను. (అర. ౧-3-7).

35. మూలమున ధౌమ్యుఁడు ధర్మజునకుఁ జెప్పె నని వైశంపాయనుఁడు జనమేజయునకు అష్టోత్తర శత సూర్య నామములను దెల్పి యుండెను. (3-3-16-28.) నన్నయ వాని నన్నిటినిఁ జెప్పక "అని ధౌమ్యుఁడు విశుద్ధాత్ముఁడైన ధర్మరాజునకు సూర్యుం డర్యముండు · భగుండను వివి మొదలుగాఁ గల నామంబుల యష్టోత్తర శతంబు.... విధియుక్తంబుగా నుపదేశించి" (అర. ౧-41) అని సంగ్రహించెను.

36. దారుక తనయుఁడు రథమును రణభూమి నుండి తొలఁగించి నప్పుడు ప్రద్యుమ్నుఁడు "గదాగ్రజో దురాధర్షః కిం మాం వక్ష్యతి మాధవః" ఇత్యాదిగా పేరుపేరు పెట్టి యాదవుల నందఱిని బేర్కొన్నట్లు మూలములో నున్నది. (అర 20-17-25). ఈ పున రుక్తి తగ్గించి నన్నయ

"విక్రమము విడిచి సమ రాపక్రాంతుఁడ నయిన నన్ను బలదేవుఁడునుం జక్రధర సుతులు ననుజులు నక్రూరాదులును నేమి యని నగరె సభన్." (అర. ౧-171).

అను పద్యములో నా భావము నంతయు నిమిడ్చెను.

37. మూలమున ద్రౌపది ధర్మజునికిఁ జెప్పిన ప్రహ్లాద బలీంద్ర సంవాదములో క్షమాతేజము లతిగా నుండుచోఁ గలుగు దోషములను వాని నుప యోగింప వలసిన సమయములను వివరింపఁ బడినవి. (అర-3-6-35). నన్నయ భావము చెడకుండ నా శ్లోకముల నన్నిటిని (అర. ౧-218) జక్కఁగా సంగ్రహించెను. ఇట్లే ధర్మజుఁడు చెప్పిన క్రోధ దోషములు (అర-30). ధర్మ కర్మములు (అర-32) తెలుఁగున మిక్కిలి సంగ్రహింపఁబడినవి.

38. ధర్మరాజు క్షమాగుణమును బొగడి క్షమావంతులకు సర్వ పుణ్య గతులును గల్గు నని నుడువ ద్రౌపది శత్రువులందు క్షమాగుణము చూపుట తగ

దనుచుఁ గావించిన దీర్ఘోపన్యాసమును (ఆర-31) నన్నయ యనవసర విషయ ములఁ దొలఁగించి తెలుఁగున మూఁడు పద్యములలో (అర. ౧-225-227) సంక్షేపించెను. అట్లే ద్రౌపది దైవ పౌరుషములను గూర్చియు (3-33). భీముఁడు క్షత్రియ ధర్మమును గూర్చియుఁ (3-34) గావించిన దీర్ఘోపన్యాసము లను నన్నయ మిక్కిలి మెలఁకువతో సంక్షేపించెను.

39. 49 వ అధ్యాయమున బృహదశ్వుఁడు తమ్ముఁ జూచుటకు రాఁగా ధర్మరా జతనిఁ బూజించి తాము పడు విడుమ లాతని కెఱింగించెను. 3-49 (30-34). నన్నయ "ధర్మతనయుఁ డధర్మపరు లైన పరులచేతఁ దమ పడిన వికార ప్రకారం బంతయు నెఱింగించి" (అర. ౨-2) అని సంగ్రహించెను.

40. మూలమున దమయంతి రూపము 4 శ్లోకములలో వర్ణింపఁ బడినది :-

"దమయన్తీ తు రూపేణ తేజసా యశసా శ్రియా
సౌభాగ్యేన చ లోకేషు యశః ప్రాప సుమధ్యమా
అథ తాం వయసి ప్రాప్తే దాసీనాం సమలంకృతమ్
శతం సఖీనాం చ తథా పర్యుపాస్తే శచీ మివ
తత్ర స్మ భ్రాజతే భైమీ సర్వాభరణభూషితా
సఖీమధ్యే ఽనవద్యాంగీ విద్యుత్సౌదామినీ యథా.
అతీవ రూపసంపన్నా శ్రీ రివాయతలోచనా
న దేవేషు న యక్షేషు తాదృగ్రూపవతీ క్వచిత్.
మానుషేష్వపి చాన్యేషు దృష్టపూర్వా న చ శ్రుతా
చిత్తప్రమాథినీ బాలా దేవానా మపి సున్దరీ. (అర-3-50-10-13).

నన్నయ యీ శ్లోకముల నందలి యతిశయోక్తుల ననౌచిత్యములఁ దొలఁగించి, రూపముతోపాటు గుణ సమృద్ధినిఁ గూడ వర్ణించుచు నీ క్రింది విధమున సంగ్రహించెను.

... ...." దమయంతి యత్యంత కాంతి రూపాభిజాత్య
విమల గుణ సమృద్ధి వెలుఁగుచు సుర సిద్ధ సాధ్య కన్యలట్టి సఖులు నూర్వు
రొలసితన్నుఁగొలుచుచుండంగ మహినొప్పుచుండె నధికవిభవయుక్తిఁ జేసి."
(అర. ౨-9).

41. నలుఁడు దమయంతి కడ కరిగి దౌత్యము నెఱపి వచ్చిన పిమ్మట సుర లడుగఁగాఁ దా నంతిపురముఁ జొచ్చు టాదిగాఁ గల వృత్తాంత మంతయు నెఱింగించెను. (అర-53-15-20). నన్నయ యదంతయు విడిచి "ఇంద్రాదులు నా స్వయంవరమునకు వచ్చెద రేని వారి సన్నిధిన నిన్ను వరియించెద. అట్లయిన నీకు నిర్దోషత్వంబగు" నని దమయంతి యన్న మాటలు మాత్రము తెల్పెను. (అర. ౨-51).

42. వసుదేవుఁడు చేది పురమున కరిగి పుణ్యాహము చేయింపఁ బోవు విప్రులతో రాజగృహము సొచ్చి దమయంతిని జూచి నప్పుడు మూలమున నామె వర్ణనము విస్తృతముగా నున్నది. (3-65-10-17) అందు

"పూర్ణచన్ద్రాననాం శ్యామాం చారువృత్తపయోధరామ్
కుర్వన్తీం ప్రభయా దేవీం సర్వా వితిమిరా దిశః
చారుపద్మపలాశాక్షీం మన్మథస్య రతీ మివ
ఇష్టాం సర్వస్య జగతః పూర్ణచన్ద్రప్రభా మివ.

మొదలైన శ్లోకము లప్పటి యామె స్థితికిఁ దగినట్లు లేవు. నన్నయ వాని నన్నిటిని విడుచుటయే కాక తరువాత వాడఁబడిన యుపమానములు పెక్కింటిని దగ్గించి వైచెను. (అర. ౨-141)

43. "బ్రాహ్మణానుమతా న్పుణ్యా నాశ్రమా న్భరతర్షభ
దిశ స్తీర్థాని శైలాంశ్చ శ్రుణు మే గదతో నృప."
(అర. 3-85-2).

అని ధౌమ్యుఁడు ధర్మరాజునకు నాలుగు దిక్కుల నున్న తీర్థాదులను నాలు గధ్యాయములలో (85-88) వర్ణించి చెప్పెను. ఈ యధ్యాయము లందు సుమారు నంద శ్లోకము లుండును. ఇందుఁ గథా భాగ మేదియు లేకపోవుట చేతను, ఇట్టి దీర్ఘ వర్ణనములు విసువు గొల్పునట్టివిగా నుండును గావునను నన్నయ యా నాలు గధ్యాయము లందలి విషయమును

"నాలుగు దిక్కులందును వివన్ విదితంబగు చున్న పుణ్య తీ
ర్థాలి తెఱం గెఱుంగఁగ మహాత్ముఁడు ధౌమ్యుఁ డజాత వైరి కం
దోలిన చెప్పు చున్న తఱి నొప్పఁగ రోమశుఁ డేఁగు దెంచె".

(అర. ౨.289)

నవి యొక్క పద్యార్థములోఁ జెప్పివైచెను. నన్నయ సంగ్రహీకరణమున కిది చక్కని నిదర్శనము.

44. తీర్థసేవార్థమై కృతప్రస్థానుఁడైన ధర్మరాజును జూచి బ్రాహ్మణులు తాము గూడ వారితో వచ్చుట కనుమతింప వలసిన దని కోరు సందర్భమున మూలమున 15 శ్లోకములు వ్రాయఁబడినవి. (3-91- 1-15). నన్నయ వా రన్న వాక్యము లన్నియు నొక్క పద్యములో సంగ్రహించెను. (అర. ౨.302).

45. ఇంద్రుఁడు వృత్రుని వధించిన కథ మూలమున (అర.99-¯-14) నెనిమిది శ్లోకములలోఁ జెప్పఁబడినది నన్నయ యా వృత్తాంతమును "అవ్వజ్రంబున నింద్రుఁడు వృత్రు వధియించె నంత" (అర.తృతీ-8) అని మిక్కిలి సంక్షేపముగాఁ జెప్పివైచెను

46. వేశ్యాపుత్రి ఋష్యశృంగునిఁ బ్రలోభింపఁ జేసిన విధము మూలమున 4 శ్లోకములలో నున్నది. (3-111-13-17). నన్నయ యా విషయము ననౌచిత్యము చొరకుండ

"ముని ముందటఁ గందుక నర్తన మృదు గీతముల యందుఁ దన కౌశలమె
ల్లను జూపి విరచి తాలింగనయై ముని పతికి ముదము గావించె మదిన్."

(అర.తృతీ-101)

అని యొక్క పద్యమున సంగ్రహముగా వర్ణించెను.

47. ధర్మరాజు ప్రభాస తీర్థమునఁ బండ్రెండు దినములు తప మొనరింప దాని నెఱిఁగి కృష్ణ బలరాము లాతనిఁ జూడ వచ్చి యోదార్చిన సమయమున ధర్మరాజు వారికిఁ దమ వనవాస తీర్థగమ నాయాసము తెలియఁ జెప్పెను. అప్పుడు కుపితుఁడై బలరాముఁడు చెప్పిన వాక్యములు మూలమున 119- (4-22) మిక్కిలి విపులముగా నున్నవి. అందాతఁడు ధార్తరాష్ట్రులు పాండవుల

కాచరించిన యపకార మంతయు నుగ్గడించి వారిని నిర్మూల మొనరింపవలె నని తలంచెను. నన్నయ యీ భాగమును (అర-తృతీ-162-163) రెండు పద్యములలో సంక్షేపించెను. ఈ సందర్భముననే సాత్యకి చేసిన ప్రసంగము కూడ మూలమున మిక్కిలి విస్తృతమై యాత్మ శ్లాఘతోఁ గూడి యున్నది. అం దాతఁడు యాదవ వీరుల నందఱిని బేరుపేరఁ జెప్పి వా రెవ్వ రెవ్వరు కౌరవులలో నెవ్వ రెవ్వరిని సంహరింతురో తెల్పియుండెను. (3-121). నన్నయ యదంతయు సంగ్రహించి యా ప్రసంగము నందలి సారాంశమును మాత్రము చక్కఁగా వ్యక్తము చేసెను. (అర-3-164-168) తెలుఁగులో సాత్యకి తన్నుఁ గూర్చి చెప్పుకొన్న విషయ మేమియు లేదు. "మదీయా స్త్రౌఘమున్ ధార్తరాష్ట్ర నికాయోత్తమ కాయ ఖండన పటిష్ఠం బయ్యెఁడుం బోరిలోన్" అను మాట మాత్రము చేర్పఁబడి యున్నది. (అర-3-167).

48. మూలమున 133 వ అధ్యాయములో జనకుఁ డడిగిన ప్రశ్నల కష్టావక్రుఁడు సమాధానము లిచ్చినట్లు వర్ణింపఁ బడినది. (అర- 33-20-27). నన్నయ యీ ప్రశ్నలును దత్సమాధానములును విడిచి" "జనక భూపాలుని సంప్రశ్నముల కెల్ల నేర్పడ నుత్తరం బిచ్చి" (అర-3-250) అని మాత్రము వ్రాసి యుండెను.

49. అష్టావక్రుఁడు వంది నోడించిన విధము మూలమున 134 వ అధ్యాయములో విపులముగా వర్ణింపఁ బడినది వా రిరువురును ఒకరిని మించి యొకరు పదుమూఁడు వఱకును గల యంకెల మీఁద శ్లోకములను జెప్పిరి. వంది పదుమూఁడు మీఁద సగము శ్లోకమే చెప్పఁ గల్గెను అష్టావక్రుఁడు మిగిలిన సగమును బూరించెను. ఈ విధముగా నతఁడు వంది నోడించి తద్విజితు లైన విప్రులను దన తండ్రిని విముక్తులఁ గావించెను. నన్నయ యీ క్రమము నంతను (అర-3-250) వ పద్యములోని

"... ... వరుణ పుత్త్రుండైన వంది తోడ
వాదంబు చేసి గర్వంబున నాతని నొడిచి తద్విజితులై యొదిఁగి యున్న
ధరణీసురులఁ దన తండ్రితో విగ్రహముక్తులఁజేసి " .. .....

యనునొక్క వాక్యముతో నించుక సూచించి విడిచినైచెను.

50. ధర్మరా జర్జునుఁడు చెంత లేకపోపుటచేఁదాను బొందు చున్న సంతాపమును దెల్పుచు అర-192 వ అధ్యాయములో నా మహావీరుని పరాక్రమ

మును గుణగణములను వర్ణించెను. ఈ యధ్యాయమున 28 శ్లోకము లున్నవి. నన్నయ యా శ్లోకముల నన్నింటిని

" అలిగి వజ్రాయుధు నైనను బోరిలో నోర్వంగ నోపు నత్యుగ్రవీరు" నిత్యాదిగాఁ గల సీస పద్యమున (అర-తృతీ-290) చక్కగా సంగ్రహించెను.

51. ఘటోత్కచుఁడును రాక్షసులును పాండవులను బ్రాహ్మణులను ఎత్తుకొని బదరీవనమునకుఁ గొనిపోయిరి. అప్పుడు నన్నయ బదరీ వనమును వర్ణించుచు నొక్కటే పద్యము వ్రాసెను. (అర- తృతీ-308). మూలమున బదరీ వర్ణనము సుదీర్ఘముగా నున్నది. (అర- 145-17-30). ఇట్లే మూల మున విపులముగా నున్న గంధ మాదన పర్వత వర్ణనమును నన్నయ చాల సంక్షేపించెను.

52. మూలము నందలి 160 వ అధ్యాయమున మేరు పర్వత వర్ణన మును, సూర్యుఁడు వసంతాది ఋతువులఁ గల్పించు విధానమును వివరింపఁ బడినవి. నన్నయ (అర. చతుర్థ-38) రెండవ దానిని పూర్తిగా విడిచి మేరు పర్వతము నొక్క పద్యములో మాత్రము వర్ణించెను.

53. 163 వ అధ్యాయమున ధర్మజుఁ డడుగఁ గా నర్జునుఁడు తా నొనర్చిన తపశ్చర్యను, శివునితో యుద్ధము కావించిన విధమును సోదరులకు విపులముగా వర్ణించి చెప్పిన ట్లున్నది. ఇందలి పునరుక్తివి. అర్జునుని ఆత్మ శ్లాఘను దొలఁగించుటకై నన్నయ పై వర్ణనమును జాలఁ దగ్గించెను. (అర- చతుర్థ-52). ఇట్లే యర్జునుఁడు నివాత కవచులతోఁ జేసిన యుద్ధమును గూడ నన్నయ మిక్కిలి సంక్షేపించెను. (అర. చతుర్థ-73).

54. తన సోదరులకు దివ్యాస్త్ర ప్రయోగము చూప యత్నించు చున్న యర్జునుని వారించి నారదుఁ డరిగిన పిమ్మటఁ బాండవు లే యే తావులు చూచిరో మూలమున 174వ అధ్యాయమున విస్తృతముగా వర్ణింపఁబడినది. నన్నయ యా విషయము నంతను (అర- చతుర్థ-100) వచనములోఁ జక్కగా సంగ్ర హించెను.

55. సర్పముచేఁ బట్టువడిన పిమ్మట భీముఁడు తన సోదరులను వేఱు వేఱుగాఁ దలంచి మిక్కిలి విలపించెనని 176వ అధ్యాయమున వివరముగాఁ

జెప్పఁ బడినది. నన్నయ యది విడిచి "దుర్గమం బైన యిప్పర్వతంబునం గ్రుమ్మరు చున్నవారు నన్నుఁ గానక యెంత దుఃఖింతురో యని వగచెద" నని మాత్రము (అర-చతుర్థ-115) భీముఁ డన్నట్లు సంగ్రహించెను.

56. ధర్మరాజు నహుష ప్రశ్నలకు సమాధానము చెప్పిన పిమ్మటఁ దా నాతనిఁ గొన్ని ప్రశ్న లడిగి సమాధానములు వడసినట్లు మూలమం దున్నది. (అర- 178) ఆధ్యాత్మికములైన యా ప్రశ్నోత్తరములు విడిచి నన్నయ "ధర్మ తనయుం డతని వలన నధ్యాత్మ రహస్యంబు లిమ్ముగా నెఱింగి వృకోదరుం దోడ్కొని నిజాశ్రమమునకు" వచ్చె నని (అర-చతుర్థ-133) యా విషయమును దిఙ్మాత్రము సూచించి విడిచివైచెను.

ఈ విధముగా నన్నయ పెక్కుచోట్ల మూలభాగములను సంగ్రహించెను. ఇందుఁ బెక్కు ప్రధాన కథకుఁగాక ప్రసక్తానుప్రసక్తముగా వచ్చిన యుప కథలకు సంబంధించినవే. పుర నదీ యుద్ధ రాజ గుణ రాజ్యపాలనములును, ధర్మ తత్త్వ నీతి విషయకోపన్యాసములును, పునరుక్తులును, వ్యక్తి వస్తు నామముల పట్టికలను అతఁడు సంక్షేపించిన యంశములలో ముఖ్యము లైనవి. ఇట్టి సంక్షేపముల వలనఁ బ్రధాన కథా గమనమున కెచ్చటను అంతరాయము కలుగ కుండుటయే కాక యప్రసక్త విషయ విస్తరణము తగ్గుటచే దానికిఁ బ్రసన్నత యేర్పడిన దని కూడఁ జెప్పవచ్చును. నన్నయ సంగ్రహీకరణమున కీయఁబడిన పై యుదాహరణము లన్నియు దశాధిక శ్లోక పరిమితములై దీర్ఘములై నట్టివే. ఇవి గాక యొకటి రెండు శ్లోకముల నాతఁడు ఒక్క మాటలో సంక్షేపించిన పట్టు లనేకము లున్నవి. విస్తర భీతిచే వాని నిచ్చట నిచ్చియుండలేదు. ఇట్లు పెక్కుచోట్ల సంక్షేపించినను నన్నయ మూలము నందలి ప్రధాన భావముల కెచ్చటను లోపము రాకుండ నెక్కువ శ్రద్ధ వహించెను.

మూలమున సుమా రిరువది ముప్పది శ్లోకముల కొకసారి యధ్యాయము మాఱుచుండును. అట్టిచోట్ల సాధారణముగా జనమేజయుఁ డేదో ప్రశ్న వేయు చుండుటయు వైశంపాయనుఁ డా ప్రశ్నకు సమాధానము చెప్పఁ బూను చుండు టయుఁ గానఁబడు చుండును. ఈ ప్రశ్నయు, "రాజా! వినుము. నీ వడిగిన దానికి సమాధానము చెప్పెద"నని వైశంపాయనుఁ డనుటయు నాలు గైదు

శ్లోకముల మేర నాక్రమించు చుండును. విజమున కిట్టి ప్రశ్నలు మధ్య మధ్య చొప్పింప కుండఁ గవియే కథను వక్రమముగా సాగింప వచ్చును. నన్నయ జనమేజయుఁడో లేక మఱి యెవ్వరో వేయుచుండు నిట్టి ప్రశ్నలను బెక్కు-చోట్లఁ దొలంగించి వైచెను. సౌతి అమృత మథన సమయమునఁ బుట్టిన యశ్వరాజమును గద్రూవినతలు చూచి రని చెప్పఁగా ఋషులు

"కథం త దమృతం దేవై ర్మథితం క్వచ శంస మే
యత్ర జజ్ఞే మహావీర్యః సోశ్వరాజో మహాద్యుతిః." (1-15-4)

అని ప్రశ్నించిరి. నన్నయ యీ ప్రశ్నను విడిచివైచెను. (ఆది- ౨-8)

81వ అధ్యాయము మొదట వైశంపాయనుఁడు యయాతి పూరు నభిషిక్తు నొనరించిన తరువాతి వృత్తాంతము నంతను 5 శ్లోకములలో సంగ్రహముగాఁ జెప్పఁగా జనమేజయుఁడు :

"కర్మణా కేన స దివం పునః ప్రాప్తో మహీపతిః
సర్వ మేత దశేషేణ శ్రోతు మిచ్ఛామి తత్త్వతః
తస్య వి స్తీర్ణయశసః సత్యకీర్తే ర్మహాత్మనః
చరితం శ్రోతు మిచ్ఛామి దివి చేహ చ సర్వశః."

అని ప్రశ్నించెను. వైశంపాయనుఁడు:

"హన్త తే కథయిష్యామి యయాతే రుత్తరాం కథాం
దివి చేహ చ పుణ్యార్థాం సర్వపాపప్రణాశినీం." (1-81-9)

అని యీ వృత్తాంతమును జెప్ప మొదలిడెను. నన్నయ యీ ప్రశ్నోత్తరములను విడిచి కథనే నిరంతరాయముగాఁ జెప్పివైచెను. (ఆది-తృతీ-201)

ఆరణ్య పర్వమున 119 అధ్యాయము మొదట జనమేజయుఁడు "ప్రభాస తీర్థం సంప్రాప్య వృష్ణయః పాండవా స్తథా, కి మకుర్వన్ కథాశ్చైషాం కా స్తత్రాసం స్తపోధన" ఇత్యాదిగాఁ బ్రశ్నించినట్లును, వైశంపాయనుఁడు:

"ప్రభాసతీర్థం సంప్రాప్య పుణ్యం తీర్థం మహోదధేః
వృష్ణయః పాండవాన్ వీరాన్ పరివా ర్యో పతస్థిరే." (117-3)

అని చెప్ప మొదలిడినట్లును మున్నది. నన్నయ యీ ప్రశ్నోత్తరములను విడిచి వైచెను. (అర-తృతీ-159). ఇట్టి సంక్షేప మింకను బెక్కుచోట్లఁ గలదు.

ఇట్లే పెక్కు పేర్లు చెప్పవలసి నప్పుడు మూలమున నా పేర్లను జెప్పుటకే ప్రశ్నోత్తర రూపమునఁ బ్రత్యేకముగా నధ్యాయములు వ్రాయఁ బడు చుండును. నన్నయ యట్టి ప్రశ్నోత్తరములను విడిచి వానిని ముందు చెప్పవలసిన చోట్లనే చెప్పివేయు చుండును. ఆది- 14వ అధ్యాయము నందలి 14వ శ్లోకమున "తతః పంచశతే కాలే కద్రూపుత్రాః వినిస్సృతాః" అని మాత్రము కలదు. వారి పేర్లచ్చటఁ జెప్పఁ బడి యుండలేదు. కాని గరుడోపాఖ్యాన మంతయు నైపోయిన పిమ్మట 31వ అధ్యాయమున శౌనకుఁడు:

"నామనీ చైవ తే ప్రోక్తే పక్షిణో ర్వైనతేయయోః
పన్నగానాం తు నామాని న కీర్తయసి సూతజ ।
ప్రాధాన్యే నాపి నామాని శ్రోతు మిచ్ఛామహే వయమ్"

అని ప్రశ్నింపఁగా సూతుఁడు

"బహుత్వాన్నామధేయాని భుజంగానాం తపోధన
న కీర్తయిష్యే సర్వేషాం ప్రాధాన్యేన తు మే శృణు" (1-31-4).

అని యా పేర్లు చెప్ప మొదలిడెను. నన్నయ ద్వితీయాశ్వా సారంభమునందే "వి నూతేంద్లకుఁ గద్రూగర్భాండంబులు తర తరంబ యవిసిన నందు శేషవాసుక్యైరా వతా" దులు పుట్టి రని యా పేర్లన్నియు నక్కడనే చెప్పివైచెను.

ఆది- 48వ అధ్యాయమున సర్పయాగమునకు సంబంధించిన సదస్యులు మున్నగు వారి పేర్లు ప్రశ్నోత్తర పూర్వకముగాఁ జెప్పఁబడినవి.

52వ. అధ్యాయమున విట్లే యగ్నిలోఁబడిన సర్పముల పేర్లు ప్రత్యేక ముగాఁ జెప్పఁబడినవి.

మూలమునఁ గొన్ని కథలును విషయములును రెండేసిమార్లు చెప్పఁ బడి యున్నవి. అందొకటి సంగ్రహ పాఠమును మఱొకటి విస్తృత పాఠమును నై యుండుటయుఁగలదు నన్నయ యట్టి సందర్భములం దా యా కథ లెచ్చట నుండుట యుచితముగా నుండునో యచట నొక్కమాఱే చెప్పు చుండును. కొన్ని యెడల మూలమునందలి రెండు పాఠములను జదివి యందలి కథాంశములను మిశ్రము చేసి సమగ్ర రూపముతో నుచిత స్థానమునఁ జొప్పించు చుండును. ఇట్టివి యాది పర్వమునందే మూఁడు నాలు గున్నవి.

(a) "లోమహర్షణ పుత్ర ఉగ్రశ్రవాః సూతః పౌరాణికో నైమిశారణ్యే శౌనకస్య కులపతే ర్ద్వాదశ వార్షికే సత్రే ఋషీ నభ్యాగతా నుపతస్థే" అను నారంభము మూలమునఁ బ్రథమ చతుర్థాధ్యాయములు రెండింటి మొదటను గానఁబడు చున్నది. నన్నయ యిందలి రెండవ దానిని విడిచి వైచెను. (ఆది-౧-128).

(b) ఆస్తీక జననమునకు హేతువైన జరత్కారు వృత్తాంతము మూలమున రెండు సారులు చెప్పఁ బడినది. అందు 13 వ అధ్యాయములోనిది సంగ్రహము. 41-14 అధ్యాయములలో నున్నది విపులము. నిజమున కిది గరుడోపాఖ్యానము తరువాతఁ జెప్పఁ దగినట్టి కథయే. ఏల యన గరుడోపాఖ్యానమునందే కద్రువ నాగులను "జనమేజయుఁడు చేయు సర్ప యాగమున మరణింపుఁ"డని శపించెను. నన్నయ యీ కథను గరుడోపాఖ్యానము తరువాతనే రచించెను. (ఆది. ౨-138). అతఁడు మూలమునఁగూడ నట్లే యున్న ద్వితీయ కథాక్రమమునే యనుసరించెను.

(c) ఇట్లే పరీక్షిద్వృత్తాంతము కూడ మూలమున రెండు మాఱులు చెప్పఁబడినది. మొదటిది 36-40 అధ్యాయములలో విపులముగా నున్నది. దానిని సౌతి శౌన కాదులకుఁ జెప్పెను. రెండవది 45, 46 అధ్యాయములలోఁ గొంచెము సంక్షేపముగా నున్నది. దీనిని మంత్రులు జనమేజయుని కెఱింగించిరి. నన్నయ యీ కథను రెండుమాఱులు చెప్ప నవసరము లేకుండ రెండింటి యందలి ముఖ్య కథాంశములను గలిపి మంత్రులు జనమేజయునికిఁ జెప్పినట్లు రచించెను. అతఁడు మొదటి కథ యందలి క్రమమునే యెక్కువగా ననుసరించెను.

మూలమున నేదైనఁ గథ చెప్పఁబడుటకు ముందు దాని సంగ్రహ స్వరూపము కూడఁ దెల్పఁబడు చుండును. వినువారు విస్తరముగాఁ జెప్పు మని యడుగఁగాఁ గథకుఁడు దానినే తరువాత విపులతరముగా వర్ణించు చుండును. ఇట్టి చోట్ల ముందు సంగ్రహ వృత్తాంతము చెప్పుట యనవసరముగాఁ గనఁబడును. నన్నయ యీ సంగ్రహ వృత్తాంతములను బూర్తిగా విడిచివేయుటయో నత్యల్పముగా సూచించుటయో చేయు చుండును. (ఆది- 1.81-1-9) యయాతి కథ: (అర-110) ఋశ్యశృంగుని కథ.

'B' అనువాదము చేయునప్పుడు నన్నయ పూర్తిగా విడిచివేసిన భాగములు కూడఁ గొన్ని యున్నవి. ప్రధాన కథతో నంతగా సంబంధము లేని హేతువున ననవసరము అని తోఁచుట చేతనో, యనౌచిత్యమయములుగాఁ గన వచ్చుట చేతనో, తత్త్వవిషయ బాహుళ్యముతోఁ గూడిన వై యుండుట చేతనో నన్నయ వానిని విడిచి యుండు నని తోఁచు చున్నది. అందుఁగొన్ని యాతఁడు చూచిన ప్రతిలో లేకయుండుటకుఁ గూడ నవకాశ మున్నది. కావున నుత్తర దక్షిణ ప్రతు లన్నిటిలో నుండియు నాతనిచే విడువఁబడిన వానిని మాత్రమే యుదాహరణములుగా నిచ్చెదను.

1. మూలమునఁ బ్రథమాధ్యాయమున సౌతి మహాభారత కథ నంతను సంగ్రహముగాఁ జెప్పుచు యుద్ధమునఁ బాండుపుత్త్రులు జయించు చుండఁగా ధృతరాష్ట్రుఁడు సంజయునిఁ బిల్చి దుర్యోధనుని దుశ్చేష్టలను గూర్చి విచారించి "యదాశ్రౌష" మను పదము లాదిగాఁగల యేఁబదియైదు శ్లోకములలోఁ గౌరవ పాండవోదంతమునందలి యొక్కొక్క ఘట్టమునే తెల్పుచు నప్పుడే తనకు జయముపై నాశపోయె నని తెల్పి విచారించిన వృత్తాంతము వర్ణించినట్లున్నది. ఈ సంగ్రహ కథా కథనము నంతను నన్నయ విడిచివైచెను. ఇది కూడఁ బ్రక్షిప్తమే యై యుండు ననియుఁ జాలకాలము క్రిందటనే యందలి శ్లోకములు పెక్కు భారత ప్రతులలోఁ జొచ్చి యుండు ననియు, మహా భారతము నందలి ప్రధానాంశముల నొకదాని తరువాత నొకటి చెప్పుటయే యందలి ముఖ్యోద్దేశ మగుటచే నా కథా క్రమమును సమగ్ర మొనర్చుటకై తరువాతివారు లోపమున్న దని తోఁచిన చోట్లనెల్ల నా యా కాలములందు మఱికొన్ని శ్లోకములను జేర్చి యుందు రనియు శ్రీ సుక్తన్కరుగారు సూచించి యున్నారు.[1] ఈ ప్రక్షేపము ప్రాచీనమై యుండునని వా రూహించుట కది యుత్తర దక్షిణ ప్రతులన్నిట నిప్పుడు కానఁబడు చుండుటయే కారణము. భారతమునకు ముందీ సంగ్రహ కథన మనవసర మని తోఁచుటచే నన్నయ దానిని విసర్జించి యుండును. లేదా ఈ

1. The Yadasrausam section is also evidently an interpolation, but a considerably older one. Being merely a string of stanzas summarizing some of the most important incidents and episodes of epic, it lent itself easily to being further interpolated by revisers who wanted to supply the omissions and thus make the summary as complete as possible. (B.O R.I.Ed,Foreword VI). Vol 1. Pt 1.

ప్రక్షేపము ప్రాచీనమే యయ్యు నాతని కాలమున కింకను భారతమునఁ జొచ్చి యుండక పోవలయును.

2. మూలమున మూఁడవ యధ్యాయములో ఉపమన్యువు, ఆరుణి, వేదుఁడు అను ధౌమ్యుని ముప్వురు శిష్యుల వృత్తాంతము చెప్పఁబడినది. ఇందలి వేదునే నన్నయ పైలుఁడని పేర్కొనెను. ఉదంకుఁ డీతని శిష్యుడు. జనమేజయునికి సర్పయాగ బుద్ధి పుట్టించిన వాఁ డుదంకుఁ డగుటచే నతని కథకు భారతములోఁ బ్రసక్తి యున్నది. అతనిని బట్టి యాతనికి గురువైన వేదుని (పైలుని)కథనుగూడ నందతనితో సంబంధించి యున్నంతవఱకుఁ జెప్పవచ్చును. ఆతఁడు గురువునొద్ద విద్యనభ్యసించుటకుఁగాని యాతని సహపాఠుల వృత్తాంతమునకుఁగాని భారత కథలో సంబంధమే లేదు. అందుచేతనే నన్నయ 3వ అధ్యాయము నందలి వారి వృత్తాంతములను విసర్జించి వైచెను.

3. దేవతలు నారాయణునితోఁ గూడ సముద్రము కడ కరిగి " అమృతమునకై విన్ను మథింతు "మని చెప్పఁగా సముద్రము " మ మాప్యంశో భవేత్తతః" అని పలికినట్లు మూలమునం దున్నది. (1. 16. 9.) సముద్రుఁ డమృతమున భాగస్వామి యైనట్లు తరువాత నెక్కడను జెప్పఁబడని హేతువున నన్నయ యా విషయమును విడిచి వైచెను. దేవాసురు లమృతమునకై సముద్రమును మథించు చుండఁగా సముద్రము నందలి జల జంతువులు చచ్చుట మున్నగాఁ గల సంక్షోభము మూలమున వర్ణింపఁ బడినది. (1-16-18-24). నన్నయ యీ వర్ణనము విడిచివైచెను. ఉప కథలలో సూక్ష్మ వివరములను విడిచివేయుట యాతని యనువాదమునఁ బెక్కుచోట్లఁ గానిపించును.

4. 35వ అధ్యాయమున నమృత మథ నానంతరము దేవతలు వాసుకితోఁ గూడ బ్రహ్మకడ కరిగి ''ఈ వాసుకి శాప భీతుఁడై మిక్కిలి తపించు చున్నాడు. జననీ శాప జన్యమైన యీతని భయమును దొలఁగింప వలయును. ఈతఁడు మాకు మేలొనరించినాఁ" డని పలికి రనియు బ్రహ్మ "పాపులే కాని ధర్మచారులైన నాగులు మరణింపరు. జరత్కారు వను ఋషి జనించి యున్నవాఁడు. అతని కీతని సోదరి యైన జరత్కారువు నిత్తురు గాక। తన్మూలమునఁ బాములకు హితమావహిల్లు" నని చెప్పె ననియు వర్ణింపఁ బడినది. అమృత మథనమునఁ బుట్టిన యుచ్చైశ్శ్రవము తోఁకను నల్లఁగాఁ జేయు విషయమునఁ గొడుకులు తన

కోర్కె నెఱవేర్పక పోవుటచేఁ గద్రువ వారికి శాప మొసంగెను. దీనిని బట్టి అమృత మథ నానంతరము కొంతకాలమునకు శాప వృత్తాంతము జరిగి యుండు నని తెల్లమగు చున్నది. అందుచే నమృత మథన సమయమున వాసుకి జననీ శాప భయ గ్రస్తుఁడై యుండె ననుట యసందర్భము. నన్నయ యీ హేతువు చేతనే కాఁబోలు నీ గాథను విడిచిపైచి వాసుకి తల్లి శాపమునకు వగచు సందర్భమున "అమృతమథనంబునాఁడు మంథరమహానగంబునకు వేత్రంబ నయిన నా క్లేశంబునకు మెచ్చి యమరు లెల్లఁ బితామహుం బ్రార్థించి నాకు నవ్యయత్వంబును సకల భయమోక్షణంబునుం గా వరం బిచ్చి" రని మార్చి యా మాట నాతని చేతనే చెప్పించెను. ఇంక వాసుకి విచారించుట కాతఁడు చెప్పిన హేతు వురగ కుల ప్రళయము దాపించుటయే. తన కేమియు భయము లేకున్నను దోడివారికై వాసుకి యంతగాఁ దపించుట యాతని యౌదార్యమును వ్యక్తము చేయు చున్నది.

5. సూర్యాస్తమయ మగు చుండుట చూచి సంధ్యావిధుల ననుష్ఠింపనిచో దోష మొదవు నని జరత్కారువు నిద్రించు చున్న భర్తను మేల్కొల్ప నాతఁడు లేచి "నీవు నా కవమాన మొనరించితివి కావున నే నింక నీ సమీపమున నుండను. యథేచ్ఛముగాఁ బోయెద" నని యామెతోఁ జెప్పెను. ఆమె తన తప్పేమియు లేదని తెల్పి తుదకు:

> "ప్రదానే కారణం యచ్చ మమ తుభ్యం ద్విజోత్తమ
> త దలబ్ధవతీం మందాం కిం మాం వక్ష్యతి వాసుకిః
> మాతృశాపాభిభూతానాం జ్ఞాతీనాం మమ సత్తమ
> అపత్య మీప్సితం త్వత్తః తచ్చ తావ న్న దృశ్యతే" (1-43-34).

అని విన్నవించెను. అంత జరత్కారుఁడు "అస్త్యేవ గర్భః సుభగే తవ వైశ్వానరోపమః" (1-43-37) అని చెప్పి వెడలిపోయె నని మూలమునం దున్నది. అనౌచిత్యమును దొలఁగించుటకై నన్నయ యీ సంభాషణమును విడిచి జరత్కారుఁడు తనంతఁ దానే భార్యతో "నీ గర్భంబున నున్నవాఁడు సూర్యానల సమ ప్రభుండైన పుత్త్రుం డుభయ కుల దుఃఖోద్ధరణ సమర్థుండు సుమ్ము. నీవు వగవక నీ యగ్రజు నొద్ద నుండు" మని పల్కి యామె నోదార్చి చనె నని వ్రాసియుండెను. (ఆది.౨-160)

6. జనమేజయుఁడు సర్పయాగ ముడిగించుటకై వచ్చిన యాస్తీకునిఁ జూచి యాతనికి వర మీ వచ్చునా యని ఋత్విజుల నడిగెను. వారు వరమున కాతఁ డర్హుఁడని నుడివిరి. జనమేజయుఁ డాస్తీకుని వరము కోరుకొ మ్మనెను. అతఁడు "సత్రంతే విరమ త్వేత న్న పతేయు రిహోరగాః" అని వరము కోరు కొనెను. జనమేజయుఁ డంత "వెండి, బంగారము, గోవులను నీ కొసంగెదను. నా క్రతువు నివర్తిల్ల కుండఁ జూడు" మని యాతనిఁ బ్రార్థించెను. అతఁడు మాతృ కుల రక్షణమునకై యా వరమునే కోరుకొనెను. "ఇంకొక వరమేదైన వేఁడుకొమ్మ"ని జనమేజయుఁ డాతనిఁ బ్రార్థించెను. ఆస్తీకుఁ డందు కంగీకరింప లేదు. అప్పుడు సదస్యు లా బ్రాహ్మణునకు వరము నొసంగ వలసిన దని రాజు తోఁజెప్పిరి. (అది. 51 అధ్యా.) ఈ భాగ మంతయు నన్నయ విడిచివైచెను. వర మిచ్చెద నని ముందు వాగ్దానము చేసి తరువాత సందేహించుట లేక యింకొక వరమును గోరుకొ మ్మనుట జనమేజయుని శీలమునకు భంగము నాపాదించు చున్నది. అందుచే నన్నయ యా భాగమును విడిచి "అనిన సర్వజ నానుమతం బుగా జనమేజయుఁ డాస్తీక ప్రార్థనఁజేసి సర్పయాగం బుడిగించె" నని (అది ౨-232) వ్రాసి జనమేజయుని సత్యవాక్పరిపాలనమును, అర్థిజన సత్కా రమును జక్కఁగాఁ బ్రదర్శించెను.

7. దుష్యంతుఁడు శకుంతలను దిరస్కరించు సందర్భమున మేనకా విశ్వామిత్రులను గూడ దూషించినట్లు మూలమున నున్నది. (1-68-72-80)

"మేనకా నిరనుక్రోశా బంధకీ జననీ తవ
... ... . ..
న చాపి నిరనుక్రోశః క్షత్రయోనిః పితా తవ
విశ్వామిత్రో బ్రాహ్మణత్వే లుబ్ధః కామ పరాయణః
.... .... .... ....
సునికృష్టా చ యోని స్తే పుంశ్చలీ ప్రతిభాసి మే
యదృచ్ఛయా కామరాగా జ్జాతా మేనకయా హ్యసి".

మున్నగునవి యీ దూషణము నందలి కొన్ని వాక్యములు. ఇట్లు మేనకా విశ్వామిత్రులను దూషించుట దుష్యంతుని శీలమునకు లాఘవము నాపాదించును. మఱియు "సునికృష్టా" ఇత్యాది వాక్యము మిక్కిలి యసభ్యమై యున్నది. అందుచే నన్నయ యీ దూషణమును విడిచి వైచెను.

8. మూలమున ద్రౌపదీ ధృష్టద్యుమ్నుల జననము వర్ణితమైన పిమ్మట
" ధృష్టద్యుమ్నం చ పాంచాల్య మానీయ స్వం నివేశనం
ఉపాకరో దస్త్రహేతోః భారద్వాజః ప్రతాపవాన్
అమోక్షణీయం దైవం హి భావి మత్వా మహా మతిః
తథా తత్కృతవాన్ ద్రోణ ఆత్మకీర్త్యను రక్షణాత్ ". (1-155-51, 52)

అని ద్రోణుఁడు ధృష్టద్యుమ్ను నస్త్రవిద్య నేర్పుటకై తన యింటికిఁ దెచ్చె నని వర్ణింపఁ బడియున్నది. ద్రోణ ద్రుపదుల కున్న సంబంధమును బురస్కరించుకొని చూచినచో నిది చాల అసహజముగా నుండును. అందుచే నన్నయ "అట్లు ద్రుపదుండు లబ్ధ సంతానుండయి సంతసిల్లి యాజునకు యథోక్త దక్షిణ లిచ్చి బ్రాహ్మణులం బూజించి ధృష్టద్యుమ్నుని ధనుర్వేద పారగుం జేయించి యున్నంత"అని ద్రోణుఁడే ధృష్టద్యుమ్నుని ధనుర్వేదము నభ్యసింపఁ జేయుటకై తన యింటికిఁ గొనిపోయె నను విషయమును విడిచివైచెను.

సభాపర్వము :-

9. మూలమున బ్రహ్మసభను వర్ణించు పట్ల నందు " దేవో నారాయణ స్తస్యాం తథా దేవర్షయ శ్చయే( 2-11.32). అని నారాయణుఁడు కూడ బ్రహ్మ సభ యం దున్నట్లు వర్ణింపఁ బడినది. ఇది యుచితము కాకపోవుటచే నన్నయ విడిచివైచెను.

10. ధర్మరాజు (సభా) 14 వ అధ్యాయము మొదటఁ గల 6 శ్లోకములలో
" శమమేవ పరం మన్యే నతు మోక్షా ద్భవేచ్ఛమః
ఆరంభే పారమేష్ఠ్యం తు న ప్రాప్య మితి మే మనః" (2.14.5)

అను నభిప్రాయమును, 15 వ అధ్యాయము మొదట
" సన్న్యాసం రోచయే సాధు కార్య స్యాన్య జనార్దన
ప్రతిహన్తి మనో మే ఽ ద్య రాజసూయో దురాసదః ". (2.15.5)

అను నభిప్రాయమును వెల్లడించినట్లు మూలమున నున్నది. నన్నయ యీ వాక్యముల నన్నిటిని విడిచి వేసెను. వీని వలనఁ దనకు రాజసూయ యాగ మొనరించు సామర్థ్యమే లేనట్లు ధర్మరాజు భావించు చుండె నని తెలియు చున్నది. తెలుఁగున ధర్మరాజు క్రతువునఁ బ్రజా సంహృతి యగునని విచారించెనేకాని తన కట్టి శక్తి లే దని తలంచి యుండలేదు. పైఁగా నారదుఁడు తన్ను " నెయ్యమునన్, నా కట్టి బలము సామర్థ్యంబు గలుగు నెఱిఁగియో " రాజసూయ యాగా

చరణమునకుఁ బంచె ననియుఁ దా నందు కొఁదంబడితి ననియు (ఆది-౧-107) నతఁడు వ్యక్తము చేసెను. రాజసూయ యాగము తనకు దురాసద మను నభిప్రాయమే నిజముగా నతని కుండినచో దాని నతఁడు చేయకయే యుండును.

11. సహదేవుఁడు జయించిన రాజులను పేర్కొను సందర్భమున మూలములో 

"పాండ్యాం శ్చ ద్రవిడాం శ్చైవ సహితాం శ్చోడ్ర కేరళైః
అన్ధ్రాం స్తలవనాం శ్చైవ కలింగా నోష్ట్రకర్ణికా న్."

"అన్ధాం స్తాల" అని పాఠం. (2-28-47)

అని ఆంధ్రులు కూడఁ బేర్కొనఁబడి యున్నారు. నన్నయ

"తాళవన పాండ్య కేరళ కాళింగ ద్రవిడ యవన కరహాటక భూ
పాలకుల నొడిచి దక్షిణ వేలా వన భూము లందు విడిసి కడంకన్."

(సభా. ౧-261).

అని యం దాంధ్రులను విడిచివైచెను. ఇట్లాతఁడు విడిచి వేయుట కాంధ్రాభిమానము కారణ మని చెప్పవచ్చును. కాని యాతఁడు విడిచినవారు "త్రైపుర పౌతనేశ్వర తిమింగల పిచ్ఛండా" దు లింకను బలువు రున్నారు. అదియును గాక కొన్ని (K1, K2, K4 ) ప్రతులలో ఆంధ్ర శబ్దము విడువఁబడి యున్నది. "తాఁశ్చంద్రకేరళైః, తాంశ్చేద్రకేరళైః, తాంశ్చోండకేరళైః" అని యందలి పాఠాంతరములు (పుట. 149).

12. మూలమున శిశుపాలుఁడు భీష్ముని రెండు చోట్ల భూలింగ పక్షితోఁ బోల్చెను. "ప్రకృతిక యాన్తి భూతాని భూలింగ శకునిర్యథా" (38.17). "మయైవ కథితం పూర్వం భూలింగ శకునిర్యథా" (41-18-22). రెండు చోట్లను నన్నయ యీ యుపమానమును విడిచివైచెను. ఆ పక్షి "మా సాహస" మని యెల్లప్పుడు పలుకుచుఁ దాను మాత్రము సాహస మాచరించు చుండును. అది సింహము యొక్క దంతాంతర విలగ్నమైన మాంసార్గలమును దిని బ్రతుకు చుండును. ఈ యుపమానము భీష్ముని యెడ పరిపోక షోవుటయు నతి నీచముగా నుండుటయు నన్నయ విడిచి వేయుటకు హేతువులు. ఇట్లే శిశుపాలుఁ డన్న "యుక్త మేత త్తృతీయాయాం ప్రకృతౌ వర్తతా త్వయా" అను వాక్యము కూడ నసభ్యముగా నుండుటచే నన్నయ విడిచిపెట్టెను.

13. దుర్యోధనుఁడు పాండవ సభావైభవమును జూచి యీర్ష్య వహించి కృశించి నప్పుడు శకునియాతని విచారమునకుఁ గారణము తెలుపు మని యడుగఁగా నతఁడు " పాండు నరనాథ తనూజుల లక్ష్మి నా కనమ్మత మయి సూ పెలింగె " నని తెల్పి " పాండవుల లక్ష్మి యెవ్విధంబున మనకు హరించికొన నగు " నని యడిగెను. శకుని యంత నాతనికి " వత్సా ! నీవు యుధిష్ఠిరునిఁ గూర్చి యీర్ష్య వహించుట తగదు. పాండవులు తమ భాగధేయములనుదా మనుభవించుచున్నారు. వారు పైతృకమైన యంశమును బొంది తేజస్సుచే నభివృద్ధి నొందించినారు. ఈ విషయమున నీకుఁ బరిదేవన యేల ? నీకును మహావీరులైన సోదరు లనేకులు సహాయులై యున్నారు. ద్రోణాదులు నీ పక్షమున నున్నారు. వీరందఱి బాసటచే నీవు సర్వ వసుంధరను జయింపు" మని సహజమైన ధర్మానుగతమైన నీతి నుపదేశించె నని మూలమం దున్నది. అట్లు నీతి నుపదేశించుట శకుని సహజ ప్రకృతికి విరుద్ధ మగుటచే నన్నయ దానిని విడిచి పెట్టి

" దీనికి ధృతరాష్ట్రి ననుజ్ఞానము వడయుదును మనకు సమకూరు ధరిత్రీనాథ ! భవ దభిప్రాయానుగుణైశ్వర్య మతిశయంబుగఁ బ్రీతిన్."
(సభా. ౨. 100)

అని శకునిచే ననిపించెను.

14. మూలమున దుర్యోధనుఁడు తన మనో దుఃఖమును దండ్రి కెఱింగించుట (46, 47, 48, 49) నాలు గధ్యాయములలో విస్తరింపఁ బడినది. అందుఁ బునరుక్తు లు, పాండవులకు రాజులు తెచ్చియిచ్చిన కానుకల వివరములు చాల నున్నవి. నన్నయ యా భాగము నంతను బునరుక్తులు, అనావశ్యక వివరములు లేకుండఁ బరిష్కరించి యాతని మానసి కావేదనను జక్కఁగా వెల్లడించెను.

15. ద్యూతార్థమై ధర్మరాజు హస్తినా పురమున కరిగి నప్పుడు ధృతరాష్ట్రుని దర్శించె నని మూలమున రెండు సారులు చెప్పఁబడినది.

" స హాస్తినపురం గత్వా ధృతరాష్ట్రి గృహం యయౌ
సమియాయ చ ధర్మాత్మా ధృతరాష్ట్రేణ పాండవః" (2-52-22)
" దదర్శ [illegible] వృద్ధం ప్రజ్ఞాచక్షుషమీశ్వరం" (52-28).

నన్నయ యీ పునరుక్తిని విడిచి ధర్మరాజు ధృతరాష్ట్రునకు మ్రొక్కె నని యొక్క మాట తెల్పియుండెను. (సభా. ౨. 159.)



16. ద్యూతమున ధర్మజుఁ డోడి పోవుచుండఁగా విదురుఁడు ధృతరాష్ట్రునితో "త్యజేత్కులార్థే పురుష" మిత్యాదిగాఁగల శుక్ర నీతిని జెప్పి పిమ్మట సువర్ణష్ఠీవులగు పక్షుల వృత్తాంతమును జెప్పెను(2-152-11-14). ఒక రాజడవిలో సువర్ణము నీను పక్షులఁ జూచి ధనాశచే వానినిఁ బట్టి తన గృహమునకుఁ గొని వచ్చెను. పిమ్మట నతి లోభముచే వానిని జంపి వచ్చుచున్న లాభమును గూడఁ బోఁగొట్టుకొనెను. రాజు పక్షులను జంపినట్లు పై కథలో నున్నది. ఈ యుపమానమును జెప్పినచో ధృతరాష్ట్రునకుఁ గూడఁ బాండవులను జంపవలె నను నుద్దేశ మున్నట్లు ధ్వనించును. అందుచే నన్నయ యీ పక్షుల కథ విడిచిపెట్టెను. పై సందర్భము నందే విదురుని మాటలకుఁ గినిసి దుర్యోధనుఁ డతని బహు భంగుల నిందించెను. అందు

"భర్తృఘ్నత్వా న్న హి పాపీయ ఆహుః
తస్మాత్ క్షత్తః కిం న బిభేషి పాపాత్" (2-57-3)
"మార్జారవ త్పోషకం చోప హంసి" (2-57-3)
"సుసాన్త్వితాపి హ్య సతీ స్త్రీ జహాతి" (57-12)

మున్నగు వాక్యములు కొన్ని సభ్యతా దూరములై యున్నవి. దుర్యోధను నట్టి వాఁడు కూడ ధర్మమూర్తియైన విదురు న ట్లనరాదు. అందుచే నా వాక్యములను నన్నయ విడిచి వైచెను. అరణ్య పర్వము నందలి 5 వ అధ్యాయములో ధృతరాష్ట్రుఁడు కూడ విదురునిఁ గూర్చి

"యథేచ్ఛకం గచ్ఛ వా తిష్ఠ వా త్వం
సుసాన్త్వ్యమానా ప్యసతీ స్త్రీ జహాతి". (19)

అని పలికెను. నన్నయ దీనిని గూడఁ బరిహరించెను.

17. పాండవు లడవి కరుగుచుండఁగా దుశ్శాసనుఁడు వారినిఁ దూలనాడుటయే కాక "క్లీబాః పార్థాః పతయో యాజ్ఞసేన్యాః" (68-10). అని నిందించి ద్రౌపదిని తమలో నెవ్వరి నైన భర్తగాఁ గోరుకొమ్మని చెప్పినట్లు (68-10.11) మూలమున వ్రాయఁబడి యున్నది. ఆ మాటలు సహింపలేక భీముఁడు పరుషోక్తులు పలుకఁగా దుశ్శాసనుఁడు ముక్తలజ్జుఁడై "గౌర్గౌః" అని యధిక్షేపించుచు నాతని చుట్టు నాట్యము చేయ మొదలిడెను. దుర్యోధనుఁడు కూడ భీమసేనుని గమన విధమును స్వగతిచే ననుకరించుట కారంభించెను. (68.23)

ఇవి యీ సందర్భమున మిక్కిలి బాలోచితముగా నున్నవి గాని (childish) దుర్యోధన దుశ్శాసనుల గరువతనమునకుఁ దగినట్లు లేవు. అందుచే నన్నయ వానిని విడిచి పై చెను.

18. పాండవు లడవి కరిగిన పిమ్మట కర్ణ శకుని దుర్యోధనాదులు ద్రోణునే తమ కాశ్రయముగా భావించి రాజ్యము నంతను నతనికి నివేదించిరి. ద్రోణుఁడు ధృష్టద్యుమ్నుని వలనఁ దనకుఁ గల్గు మరణమును దెల్పి వారికి యజ్ఞాదు లొనరింపుఁడని యుపదేశించినట్లు మూలమున నున్నది. (2-71-చివర) దుర్యోధనాదులకు ద్రోణునెడ నంత ప్రత్యయము లేకపోవుటచే నన్నయ యీ వృత్తాంతమును విడిచిపై చెను.

అరణ్యపర్వము :-

19. కృష్ణుఁడు సాల్వవధ వృత్తాంత మెఱింగించి పాండవులను వీడ్కొని యరిగిన పిమ్మటఁ బాండవులు కామ్యక వనము నుండి ద్వైత వనమునకుఁ బ్రయాణమైరి. అప్పు డచ్చటి బ్రాహ్మణులును పౌరులును దుఃఖించిన తెఱంగు మూలమున 25 వ అధ్యాయములో విపులముగా వర్ణింపఁబడినది. ఈ వాక్యములు పాండవు లరణ్యమున కేగునప్పుడు హస్తినాపురము నందలి జనులు చెప్పిన వాక్యముల వలెనే యున్నవి. ఈ పునరుక్తి యేల యని నన్నయ విడిచి వై చెను. (అర. ౧-198)

20. ధృతరాష్ట్రుఁడు వ్యాసుని వలన నర్జునుని పాశుపతాస్త్ర ప్రాప్తి విని తన సుతుల కింకఁ జావు తప్పదని విచారింపఁగా సంజయుఁడు 46 వ అధ్యాయమున నర్జునుఁడు దివ్యాస్త్రములు పొందిన కథ యంతయు సంగ్రహముగా నెఱింగించెను. (19-31). ఇది కేవలము పునరుక్తి యగుటచే నన్నయ విడిచివై చెను.

21. పై సందర్భముననే సంజయుఁడు చెప్పిన యర్జున దివ్యాస్త్ర లాభమును విని ధృతరాష్ట్రుఁడు మరల విచారించెను. (3. 46). 48 వ అధ్యాయములో నతఁడు నకుల సహదేవులయు భీమార్జునులయు రణ విహరణమును దలంచి మిక్కిలి విలపించెను. మూలమున 46, 48 అధ్యాయములకు నడుమ చిన్న యధ్యాయ మొకటి యున్నది. (3. 47). ఇందు జనమేజయుఁడు :

" కి మాసీ త్పాండు పుత్రాణాం వనే భోజన ముచ్యతాం
వానేయ మథవా కృష్ట మేత దాఖ్యాతు మే భవాన్ " (47-3).

అని వైశంపాయనునిఁ బ్రశ్నించెను. వైశంపాయనుఁడు పాండవులు వనములో నే మేమి తిని యెట్లు కాలము పుచ్చిరో యాతని కెఱింగించెను. ఇందు

" వానేయం చ మృగాంశ్చైవ శుద్ధై ర్బాణై ర్నిపాతితాన్
బ్రాహ్మణానాం నివే ద్యాగ్ర మభుంజన్ పురుషర్షభాః" (4-71)
" రురూన్ కృష్ణమృగాం శ్చైవ మేధ్యాం శ్చాన్యా న్వనే చరాన్
బాణై రున్మథ్య విధివ ద్బ్రాహ్మణేభ్యో న్యవేదయత్ " (యుధిష్ఠిరః)
(3-47-7)

అని బాణ పాతితములైన మృగాదులను పాండవులు బ్రాహ్మణులకు ముందు నివేదించి రని చెప్పఁబడినది. సంస్కృత భారత రచనా కాలమున బ్రాహ్మణులు కూడ మాంస భక్షకులై యుండిరి కాఁబోలును కాని నన్నయ కాలమున మాంస భోజనము బ్రాహ్మణులకు నిషిద్ధమై పోవుటచేఁ గాఁబోలు నతఁడీ విష యము వ్రాయనొల్లక విడిచి వైచెను. మఱియు నీ యధ్యాయ మా సందర్భమున మిక్కిలి యప్రసక్తముగా నున్నది. 46, 48 వ అధ్యాయములలోని కథా సంద ర్భము చక్కఁగాఁ గలసి పోవు చున్నది. ఈ యధ్యాయ మా కథ కంతరాయము కలిగించు చున్నది. నన్నయ దానిని విడిచి వేయుట కదియు నొక కారణమై యుండును.

సభా పర్వము నందు మయసభా ప్రవేశ సందర్భమున ధర్మరాజు బ్రాహ్మణులకు భోజనమున వారాహ హారిణ మాంసములు పెట్టె నని కొన్ని ప్రతులలో నున్నది.
(V1, B. D.)

"భక్ష్యైర్మూలైః ఫలై శ్చైవ మాంసై ర్వారాహ హారిణైః" (పుట 15).

మరల నా ప్రతులందే :

"కృసరే ణాథ జీవంత్యా హవిష్యేణ చ సర్వశః ,
మాంసప్రకారై ర్వివిధైః ఖాద్యై శ్చాపి తథా నృప" (పుట 15).

అను శ్లోకముకూడ నున్నది. T ప్రతిలోఁ బై దానియందలి రెండవ పంక్తి కాన వచ్చుటలేదు. అప్పటఁగూడ నన్నయ మాంస ప్రసక్తి విడిచివైచెను

22. కలి సమావిష్టుఁడైన నలుఁడు చలమునఁ బుష్కరునితో జూద మాడుచుండఁ బౌరు లతని వారింప నేగిరి. సూతుఁడా విషయము దమయంతితోఁ జెప్పెను. దమయంతి పౌరాగమనము నలుని కెఱింగించెను. నలుఁడు

కల్యావిష్టుఁడై యుండుటచే నామెతోఁ బలుకఁడాయెను. నలుఁడట్లే జూదమాడు చుండఁగా దమయంతి బృహత్సేనను బిల్చి యింక నెంత ద్రవ్యము మిగిలి యున్నదో యెఱింగింపుఁ డని మంత్రులకుఁ గబురు పంపెను. మంత్రులు వచ్చి ధనమేదియు లేదని చెప్పిచనిరి. ప్రకృతులు మరల వచ్చిరని దమయంతి నలునికి నివేదించెను. అతఁడదియు వినిపించుకొన లేదు. ఈ విషయము మూలమున 56, 57 అధ్యాయములలోఁ జెప్పఁబడినది. పౌరజన ప్రియుఁడగు నలుఁడు వారు వచ్చిరని దమయంతి రెండుసారులు చెప్పినను వినిపించుకొన కుండుట యుచితముగా లేదని కాఁబోలు నన్నయ యీ విషయము నంతను విడిచి వైచెను.

నలుఁడు సర్వస్వము నోడిన పిమ్మటఁ బుష్కరుఁడు దమయంతి నొడ్డుమని పల్కె ననియును, ఆ మాట హృదయమును భేదించినను నలుఁడేమియు మాటాడలేదనియు 58వ అధ్యాయము మొదట (1-5) చెప్పఁబడినది. నన్నయ దీనిని గూడఁ దొలంగించి వైచెను.

23. ఇంద్ర వియోగమున రోమశుఁ డరణ్యమున నున్న ధర్మజుఁ జూడవచ్చి యర్జునుఁడు స్వర్గమున వైభవోపేతుఁడై యున్న వృత్తాంతమును శివుఁడాదిగాఁ గల దేవతలాతని కనేక దివ్యాస్త్రము లిచ్చిన వృత్తాంతమును నెఱింగించెను. తరువాత నాతఁడు ధర్మరాజుచేఁ దీర్థయాత్రలు చేయింపు మనియు, నతని రక్షోభయము నుండి రక్షింపు మనియు నర్జునుఁడు తనతోఁ జెప్పె నట్లాతని కెఱింగించెను. మూలమున నిట్లుండఁగా నన్నయ "ధర్మజుఁ దీర్థసేవ సేయింపు మొగిన్" (అర-తృతీ-295) అని రోమశునితో నింద్రుఁడు చెప్పెనని వ్రాసి రక్షోభయమునుండి ధర్మజు నతఁడు రక్షింపవలె నని యర్జునుఁడు చెప్పిన విషయమును విసర్జించెను. ధర్మజుని వెంట భీమ నకుల సహదేవులు కూడ నుండిరి. ఏదైన రక్షోభయ మావహిల్లిన వారు స్వపరాక్రమము చేతనే తమ్ము రక్షించు కొనఁజాలుదురు. అట్టియెడ రోమశుఁడు వారిని రక్షింపవలెనని యర్జునుఁడు కోరుట ధర్మజ భీమాదుల పరాక్రమమును లఘూకరించుట యగుననియు, నొకవేళ అర్జునుఁడు రోమశునితో నట్లు చెప్పినను రోమశుఁడాతఁ డట్లు చెప్పెనని ధర్మజుని కెఱింగించుట యుచితముగా నుండ దనియు నన్నయ దానిని విడిచివేసి యుండును.

24. ధర్మజుఁడు రోమశునితోఁ దీర్థయాత్ర కరుగునపుడు కొందఱు బ్రాహ్మణులును యతులును రాజభక్తిపరులగు పౌరులును ధృతరాష్ట్రునికడ కరుగవలెననియు, నాతఁడు వారికి యథోచితమైన వృత్తి నొసంగనిచోఁ దనకుఁ బ్రీతి కలుగుటకై పాంచాల్యుఁడు తప్పక యొసంగు ననియుఁ జెప్పినట్లు మూలమున నున్నది. (3-90-19-21). ఇందు ధర్మజుఁడు ధృతరాష్ట్రుని సౌజన్యమును శంకించుట ప్రకటిత మగుచున్నది. అందుచే నన్నయ యీ భాగమును విడిచిపైచెను.

25. కళింగ దేశమునందలి వైతరణీనది కుత్తరపు భాగమున ఋషులు మున్ను యజ్ఞము లొనరించిరనియు, యజ్ఞము నందలి యన్ని భాగములకన్న మిన్నయైన భాగమును దేవతలచ్చట రుద్రునికిఁ గల్పించిరనియు రోమశుఁడు ధర్మరాజాదుల కెఱింగించెను. (3-114-6-10). నన్నయ "సకల యజ్ఞములందును బ్రశస్తంబయిన పశుభాగంబు పశుపతికి దేవతలును ఋషులు నిందుఁ గల్పించి"రని సంగ్రహముగాఁ జెప్పి దేవతలు రుద్రుని కేల భాగమును గల్పించిరో తెల్పు గాథను విడిచిపైచెను. అంత రుద్రుఁడు పశువు నిది నా భాగమని కొనిపోయె ననియు, దేవతలు "పరస్వము నపహరించి ధర్మమును నశింపఁజేయకు" మని వేఁడి యాతని స్తుతించిరనియు, నపుడాతఁడు పశువును విడిచి దేవయానమున కరిగెననియు, నప్పటినుండియు భయముచే దేవతలు శాశ్వతముగా రుద్రునికి భాగము కల్పించి రనియు మూలమునఁ జెప్పఁబడి యున్నది.

26. పయోష్ణీనదీ ప్రభావమును దెల్పు సందర్భమున రోమశుఁడు ధర్మజునకు సౌకన్యాఖ్యానము నెఱింగించెను. అందు విహరించుచున్న సుకన్య సౌందర్యమును జూచి చ్యవనుఁడు ప్రీతుఁడై యామెను బల్కరించెననియు, నామె వినిపించుకొనలేదనియు మూలమునఁ జెప్పఁబడినది. (122-7-11) నన్నయ యామె సౌందర్య వర్ణనమును, చ్యవనుఁడామెను జూచి ప్రీతుఁడైన విధమును (తాంపశ్యమానో విజనే న రేమే పరమద్యుతిః) విడిచిపైచెను. ఈ విడుచుట చ్యవనుని శీలమునకు మూలమునఁ గలిగిన లోపమును సవరించుచున్నది.

27. అశ్వినుల సోమార్హతను గూర్చి మూలమున నింద్రచ్యవనులకు జరిగిన సంభాషణమును నన్నయ విడిచిపైచెను. (3-124). ఇంద్రుఁ డందాశ్వినులు "చికిత్సకులు, కర్మకరులు, మర్త్యులలో సంచరించువారు" నగుటచే సోమమున కర్హులు కారని యూసడించెను.

28. మూలమున భీమసేనుఁడు హనుమంతుని
"యుగసంఖ్యాం సమాచక్ష్వ ఆచారం చ యుగే యుగే
ధర్మకామార్థ భావాం శ్చ వర్ష్మ వీర్యం భవాభవే" (148-9).
అని యడిగినట్లున్నది. కాని యడిగిన విషయము లన్నిటిని గూర్చి సమాధానము మాత్రము కానరాదు. అందుచే నన్నయ యడుగునపుడే "అయ్యె యుగంబులయాచార వర్తనంబులు మాత్రమే" యేర్పడం జెప్పుమని భీముఁడడిగినట్లు వ్రాసియుండెను. వర్ష్మ వీర్య భవాభవములను గూర్చి తెలుఁగున భీముఁడడుగను లేదు హనుమంతుఁడు చెప్పను లేదు.

29. మూలమున హనుమంతుఁడు భీమునికిఁ ద్రయీ వార్తాదండనీతులను గుఱించియు నాలుగు వర్ణములవారి ధర్మములను గూర్చియుఁ జెప్పినట్లు కలదు. 149 (31-40). కథ కనవసరమైన యీ భాగమును నన్నయ విడిచిపైచెను.

30. ధర్మరాజార్ష్టిషేను నాశ్రమమున కరుగ నాతఁడు ధర్మజునిఁ గుశల ప్రశ్నకావించి, కొన్ని నీతులు బోధించి, యచ్చటి శైలశృంగములను వర్ణించి, యవి మనుష్యుల కగమ్యములనియు నచ్చటికిఁ బోరాదనియు హితోపదేశము కావించి, యర్జునుఁడు తిరిగివచ్చు వఱకు నచ్చట నుండుమని చెప్పినట్లు మూలమున 156 వ అధ్యాయమున వర్ణింపఁబడినది నన్నయ యీ విషయము నంతను విడిచెను.

31. 173 వ అధ్యాయమున భీమ నకుల సహదేవులు విజృంభించి దుర్యోధనునిఁ జంపుటకై యేగుదుమని ధర్మజునితోఁ జెప్పుదురు. అప్పటికింకను బండ్రెండేండ్లు కాలేదు. అందుచే నా యసమయ విజృంభణమును వర్ణింపనేలయని నన్నయ విడిచిపైచెను.

C. భారతము ననువదించునప్పుడు నన్నయ సంగ్రహించినవో లేక పూర్తిగా విసర్జించినవో చాల భాగము లున్నను, అతఁడచ్చటచ్చట మూల

మునకుఁ బెంపు గలిగించిన స్థలములు కూడఁ గొన్ని లేక పోలేదు అతఁడు కలిగించిన పెంపు నైదు విధములుగా విభజింప వచ్చును. (I) మూలమున లేని వర్ణనములను జొప్పించుట : ఈ వర్ణనము లొక్కొక్కచోట మూఁడు నాలుగు పద్యములతోఁగూడి యించుక దీర్ఘముగా నుండును. (II) అమూలకము లైన భావములను వెల్లడించుట : ఇట్టివి సాధారణముగా నేక పద్య పరిమితము లై యుండును. (III) మూలమున నున్న యొక్క పదమునో పద సమూహమునో యాధారముగా గ్రహించి యందలి భావమునే విపులీకరించుట (IV) ఆలంకారికమైన పెంపు, అర్థాంతరన్యాస కల్పనము : (V) వ్యక్తులను గాని వస్తువులనుగాని వర్ణించు పట్ల విశేషణముల నధికముగా వాడుట : ఈ యైదు రకము లైన విపులీ కరణమునకును నన్నయ భారతమున బహు సంఖ్యాకము లైన నిదర్శనము లున్నవి. అందు ముఖ్యము లైన వానిని మాత్రము సూచించెదను :-

మూలమున లేని వర్ణనములను జొప్పించుట :-

1. ఉదంకుఁడు నాగరాజులను స్తుతించునప్పుడు మూలమున నైరావత రాజుల యొక్కయుఁ, దక్షకుని యొక్కయు స్తోత్రములు మాత్రమే కానవచ్చు చున్నవి. (1.3-139-145). నన్నయ యనంత వాసుకి స్తోత్రములను గూడఁ జేర్చెను. (ఆ-౧-104,105) అనంతవాసుకులు నాగరాజులలో శ్రేష్ఠులు. నిజ మునకు వారిని విడిచి యితరులను మాత్రము స్తుతించుట యుచితముగాదు. అందుచే నన్నయ వారిని గూడ నుదంకుఁడు స్తుతించినట్లు వర్ణించెను.

2. దేవయాని శర్మిష్ఠ మున్నగు సఖులతో వనమున కరిగిన పిమ్మట నొనరించిన వినోదములును, అప్పుడు వీచిన మారుతము వర్ణనమును, గాంతలు వచ్చిన రాజును బూజించిన విధమును నన్నయ కల్పించి వ్రాసెను. (ఆది-తృతీ-155-157). ఈ వర్ణన మద్భుతమై యా సందర్భమున కెంతయో రామణీయకము నాపాదించు చున్నది.

3. కద్రూవినతలు వినోదార్థమై యరిగి యుచ్చైశ్శ్రవమును జూచుటకు ముందు నన్నయ కావించిన సముద్ర వర్ణనము (ఆది-౧-27-30) గంభీరమై మనోహరముగా నున్నది. మూలమునఁగూడ సముద్ర వర్ణన మున్నది.(1-19).

కాని యందలి భావములకును నన్నయ భావములకును సంబంధము లేదు పైఁగా నది మఱునాఁ డా సవతు లశ్వవాలమును బరీక్షించుటకై యరిగి నప్పు డున్నది. సముద్ర తీరమున వా రుచ్చైశ్శ్రవమును గాంచినప్పుడే యా వర్ణనము కావించుట యౌచిత్య శోభితము.

4. ధృతరాష్ట్రుఁడు ధర్మజు నభిషిక్తుఁజేసి ఖాండవ ప్రస్థమున కేగి యందు సుఖముగా నివసింపు మని పలుకఁగా నతఁడు సోదరుల తోడను గృష్ణుని తోడను ఖాండవ ప్రస్థమున కరుదెంచెను. అచ్చట వారికై విశ్వకర్మ రమణీయమైన పురము నిర్మించెను. నన్నయ దీనిని బది పద్యములలో విశద ముగా వర్ణించెను. (ఆది-౮-71-79). మూలముననఁగూడ నిందలి భావము లొండు రెండు లేకపోలేదు. కాని మొత్తము మీఁద నీ వర్ణన మంతయు నన్నయ కల్పితమే యని చెప్పవచ్చును. ఈ వర్ణనము తరువాతి ప్రబంధము లలో మొదటఁ గానవచ్చు చుండు పురవర్ణనముల కాదర్శమై మిక్కిలి గంభీర ముగా నున్నది. పాండవులకు రాజధానియు, సురపురమున కెనగా విశ్వకర్మ నిర్మించినదియు నగు నీ పురమును నన్నయ యిచ్చట విపులముగా వర్ణించుట యుచితముగానే యున్నది.

5. పాండురాజు మరణించుటకు ముందు నన్నయ కావించిన వసంత వర్ణన మమూలకమైనదే. ఈ రెండు లయగ్రాహులును వసంత శోభను సాక్షాత్కరింపఁ జేయుచుఁ దనకుఁ గిందముఁ డిచ్చిన శాపము నెఱింగియుఁ బాండురాజు " మదన సమ్మోహన మార్గణ బందీకృత మానసుఁ " డగుటకుఁ బూర్వరంగమును సిద్ధము చేయు చున్నవి.

6. కుంతి కర్ణుని నదిలో విడిచి పెట్టుటకు ముం దాతనిఁ జూచి విల పించిన విధము మూలమునఁ గానరాదు. నన్నయ యిక్కడఁ బుత్త్రునిఁ జేతులార విడిచివేయ వలసి వచ్చిన కుంతి మాతృ హృదయమును జక్కఁగా వర్ణించెను.

సభా పర్వము :-

7. రాజసూయ యాగ మొనరింపు మని నారదుఁడు ప్రబోధించిన పిమ్మట ధర్మరాజు కృష్ణునికై కబురు పంపెను. కృష్ణుఁడు ద్వారకమండి యరుదెంచెను. ఈ సందర్భమున మూలములో ;

" తం విక్రాంతం శుభే దేశే క్షేమేనం కల్య మచ్యుతం
ధర్మరాజ స్సమాగమ్య జ్ఞాపయ త్స్వం ప్రయోజనమ్ ". (2- 2-34)

అను శ్లోక మున్నది. నన్నయ ధర్మరాజు శ్రీకృష్ణునిఁ బూజించి యుపచరించిన విధము విచ్చట మూఁడు పద్యములలో వర్ణించి (ఆది-౧-103-105) " జ్ఞాప యత్స్వ ప్రయోజనమ్ " అన్న మూలమునందలి ప్రయోజనమును 107 వ పద్య మునఁ జక్కఁగా వివరించెను.

8. కృష్ణుఁడు భీమార్జునులతో మగధ దేశమును జేరిన పిమ్మట మూలమున దాని చుట్టు నున్న యైదు పర్వతములను వనములను వర్ణించి నట్లున్నది. నన్నయ దానికి ముందు :

" ఉరుతర హర్మ్య మాలికల నొప్పు గిరివ్రజ మన్పురంబుఁ గాం
చిరి నవసౌరభ ప్రసవ చిత్ర వనావళి గల్గు దాని నె
వ్వరికి దురాపదంబులగు వజ్ర మయోన్నత వప్రచారు గో
పురముల దాని నయ్యలకఁ బోలెడు దాని మహార్ఘ సంపదన్ " (౧-172)

అని గిరివ్రజమును రమ్యముగా వర్ణించెను.

9. జరాసంధ వధానంతరము గరుడారూఢుఁడై కృష్ణుఁడు భీమార్జును లతో నింద్రప్రస్థపురమున కరుదెంచెను. అప్పుడు నన్నయ ప్రజలు సంతో షించుచు వారిఁ గూర్చి యనుకొన్న వాక్యములను మూఁడు పద్యములలో (ఆది-౧-218-220) వర్ణించెను. మూలమున నిక్కడఁ బ్రజల సంగతియే లేదు. కృష్ణుఁడు వచ్చి ధర్మరాజాదుల వీడ్కొని యరిగె నని మాత్ర మున్నది. లోక కంటకుఁడైన జరాసంధుని వధించి వచ్చిన యా వీరత్రయము నప్పుడు ప్రజ లభినందన పూర్వకముగాఁ బ్రశంసించుట మిక్కిలి యుచితముగా నున్నది.

10. భీమార్జున నకుల సహదేవులు నాలుగు దిక్కులను జయించి వచ్చిన పిమ్మట నాప్తమంత్రులు రాజసూయ మొనరింపు మని ధర్మజునిఁ బ్రోత్సహించిరి. ఆ సందర్భమున :

" స్వకోశస్య పరీమాణం కోష్ఠస్య చ మహీపతిః
విజ్ఞాయ రాజా కౌంతేయో యజ్ఞాయైవ మనో దధే "

అని ధర్మజుఁడు యజ్ఞము చేయుట కిచ్చగించె నని వ్రాయఁబడినది. నన్నయ యాప్త మంత్రులు చెప్పిన సమృద్ధిని (సభా. ౧-272) వ వచనమున మనోహరముగా వర్ణించెను.

అరణ్యపర్వము :-

11. కిరాతవేషము విడిచి శివుఁడు నిజరూపమును గైకొన్నంతనే యర్జునుఁ డాతనిఁ దన వ్యతిక్రమము క్షమింపవలె నని వేఁడుకొన్నట్లు మూలమున నాలుగు శ్లోకము లున్నవి. (3-40-57-60). నన్నయ యిచ్చట నా ప్రార్థనతో పా టర్జునుఁ డీశ్వరుని స్తుతించిన దండక మొకటి కల్పించెను. (అర-తృతీ-325).

12. దమయంతి మదన తాప వివర్ణ వదనయై నొగులుచున్న తఱి సఖీ జనులు భీతలై యామె వృత్తాంతము నెల్ల భీముని కెఱింగించుచుఁ జెప్పిన "కలహంస పలికిన పలుకులు గణియించు" నిత్యాదిగాఁ గల సీస పద్యము చాల వఱకు నన్నయ కల్పించినదే. ఈ విరహ వర్ణనము మనోహరమై తరువాతి ప్రబంధము లందలి యట్టి వర్ణనలకు దారి చూపినది.

13. అర్జునుఁ డింద్ర లోకమునుండి మాతలి రథముపై నరుదెంచి వనమున నున్న సోదరులఁ గలసి కొనెను. వారిచేఁ బూజితుఁడై మాతలి తన రథముతోఁ గూడ స్వర్గమున కరిగెను. మఱునాఁ డుదయమున నింద్రుఁడు వారినిఁ జూడ నేతెంచెను. ఆ రాత్రి యర్జునుఁ డనుజుల నందఱ నొద్దఁబెట్టుకొని యిష్ట పూర్వ కథలు చెప్పుచు శయనించెను. అర్జున దేవేం ద్రాగమనములకు నడుమఁ గలిగిన రాత్రి రాకను నన్నయ :

కం. " దిననాథుఁ డస్తగిరిఁ బొందినఁ జీఁకటిఁ బాచి యాత్మ తేజమున దిగం
గనల విభూషించుచు రజని నాథ కలహంస గగన నిమ్నగ నొప్పెన్".
(అర-౪-42)

అని వర్ణించెను. అమూలక మైన యీ వర్ణన యీ కాల వ్యవధానమును సూచించుచు నెంతో యౌచిత్య భాసుర మై యున్నది. అర్జునుఁడు తమ చెంతలేని కాల మంతయుఁ బాండవులకుఁ దమోమయము. అతని రాక వారికి రాకా ప్రాయము. ఈ యభిప్రాయమును గూడ నీ పద్యము వ్యంగ్యముగా సూచించుచున్నది.

14. ధర్మజుఁడు నహుష ప్రశ్నలకు సమాధానము చెప్పి భీమునిఁ దోడ్కొని నిజాశ్రమమునకు వచ్చిన పిమ్మట ముందు వర్షాకాలమును పిమ్మట శరత్కాలమును వర్ణింపఁబడినవి. నన్నయ వర్ణించిన వర్షావర్ణనమునందలి కొన్ని భావములను (ఆది-౪-136), శరత్కాలవర్ణనమందలి చాల భాగమును (138, 139, 141, 142) స్వకపోల కల్పితము లైనట్టివే.

II భావ కల్పనము :-

మూలమున లేని భావములను వ్యక్తము చేయుటకై నన్నయ యా యా సందర్భములందుఁ గల్పించి వ్రాసిన పద్యము లనేకము లున్నవి. ఇవి సమయోచితములును, రసవంతములు నై యాతని స్వతంత్ర కవితా పాటవమునకుఁ దార్కాణములుగా నున్నవి.

1. జరత్కారుఁడు వీరణస్తంబంబు నవలంబించి తలక్రిందుగా వ్రేలాడుచున్న పితృదేవతలను జూచి

"కడు నుగ్రము దలక్రిందుగఁ బడి వ్రేలుట యిదియు నొక తపం బొకొ నా
కేర్పడఁ జెప్పుఁడీ తపంబేఁ దొడఁగెద ననవుడును నయ్యధోముఖవిప్రుల్.
అనఘ! యిది యేటి తపమే మనుపమ దుష్కృతుల మగుట నాధారములే
కను సంతాన చ్ఛేదనమున ............ "(ఆది-౨-141-142)

వ్రేలుచుంద మని చెప్పుట నన్నయ కల్పించినదే. ఆ పితృదేవతలు చేయుచుండిన దూర్ధ్వగతి కారణమైన తపోవిశేషము కాదు. సంతానచ్ఛేదము కలుగనుండుటచే మంద భాగ్యులైన వా రథఃపాతమునకు సిద్ధముగా నుండిరి. వా రట్టి స్థితిలో నుండుటకు జరత్కారుఁడే కారణము. అతఁడే యది యేదో తపోవిశేషమనుకొని దానిని దన కేర్పడఁ జెప్పుఁడని వారినిఁ గోరుటలో నొక విధమైన వ్యంగ్యచిత్రము (Irony), న్నది. ఈ పద్యములలో నన్నయ దానిని జక్కఁగా వ్యక్తము చేసి యుండెను.

2. తృతీయాశ్వాసము నందలి

" ఆ నారాయణ పాండవేయగుణ మాహాత్మ్యమల జ్యోత్స్నఁ జి
త్తానందం బొనరించుచున్ ఐమల కర్ణాంబు ప్రకాశంబుతో

మానై సాత్యవతేయ ధీవనధి జన్మ శ్రీమహాభారతా
ఖ్యానాఖ్యామృత సూతి యొప్పు నిఖిలాఘ ధ్వాంత విధ్వంసియై". (21

అని రూపకాలంకార శోభితమై భారతాఖ్యానమును వర్ణించు పద్యము నన్నయ కల్పించి నద్దిదే.

3. శంతనుఁడు యోజన గంధిని జూచి "మనోజబాణ సంతాన హతాత్ముఁ" డైన తఱి నన్నయ యాతఁ డట్లగుటకుఁ గారణమైన యామె సౌందర్యము క్రింది పద్యములో వర్ణించెను :

"దాని శరీర సౌరభము దాని విలోల విలోకనంబులున్
దాని మనోహ రాకృతియు దాని శుచిస్మిత వక్త్రకాంతియున్
దాని విలాసముం గను ముదంబునఁ జూచి .... ... "(ఆది-४-171).

ఈ వర్ణన మమూలక మైనది. మూలమున నీ సందర్భమున :

"స దదర్శ తదా కన్యాం దాశానాం దేవరూపిణీమ్
తా మపృచ్ఛ త్స దృష్ట్వైవ కన్యా మసితలోచనామ్. (1-94-42)

అని మాత్ర మున్నది.

పాండవులను వారణావతమునకుఁ బంపుటకు ముందు దుర్యోధనుఁడు నేర్పరు లైన మంత్రులను బిల్చి పాండవుల ముందు వారణావతమును బొగడుఁడని చెప్పి పంపెను. ఆ పొగడ్తవిని పాండవులు వారణావత గమనమునం దాసక్తులు కావలె నని (వారు విని తగుల నెరన్) దుర్యోధనుని యభిప్రాయము. ఆ మంత్రు లాతని నియోగము ననుసరించి పాండవుల ముందు వారణావతమును వర్ణించిరి (ఆది-౬-132). ఈ వర్ణనము నిట్లు నన్నయ కల్పించుట యెంతయు నుచితముగా నున్నది.

5. లక్కయిల్లు దగ్ధమైపోయిన తరువాత నుదయమున జనులు వచ్చి దానిని జూచుటయు (ఆది. ౬-164), పాండవులు మృతి నొంది రని భ్రాంతి పడి విచారించుటయు (166) నన్నయ చక్కఁగా వర్ణించెను. ఇవి మూలమునందు లేవు. ప్రజలు గుణమహితు లైన పాండవేయులు "నిష్కారణ మిట్లు వచ్చి ధృతరాష్ట్రోపాయ మాయోత్థిత జ్వలన జ్వాలలఁ గ్రాగిరే" యని సంజాతార్తు లైరని నన్నయ రచన. ఈ పద్యము లాక్షాగృహ దహనమైన పిమ్మట లోకము దానిని గూర్చి యే మనుకొను చుండెనో చక్కఁగా సూచించుచున్నది.

6. అర్జునుఁడు సుభద్రను వివాహ మాడిన యనంతరము పాండుసుతులు జగజ్జన విశ్రుతులై రాజ్యమును బ్రజానురంజనముగఁ బాలించుచు సుఖముగాఁ గాలము పుచ్చుచుండిరి. అప్పు డొకనాఁ డర్జునుఁడు కృష్ణునికి రమ్యగిరి సానువు లందు విహరించుటయందుఁ దనకుఁగల యభిలాష నెఱింగించెను. అర్జునునకు విహారాభిలాష కల్గుటకు హేతువైన ఘర్మ సమయమును నన్నయ యిచ్చట నీ క్రిందివిధమున వర్ణించెను:

"ఉరుతర దావపావక శిఖోత్కలిత శ్వసనంబులన్ సితే
తరగతి తీవ్ర తిగ్మకరధామ సహస్రములన్ బహు ప్రవా
హంహిత విమ్నగాతతులు నై కడు దీర్ఘములై నిదాఘ వా
సరములు సర్వజీవుల కసహ్యము లయ్యెను దారుణంబులై."

(ఆది-౮-230)

అమూలక మైన యీ వర్ణన మిచ్చట సమయోచితమై కృష్ణార్జునులఁ గలియ వచ్చు నగ్నిహోత్రుని ప్రవేశమును దత్ప్రేరణమున నర్జునుఁడు కావింపఁబోవు ఖాండవవన దహనమును రమ్యముగా సూచించు చున్నది.

సభాపర్వము :-

7. నారదుఁడు ధర్మరాజునకు హరిశ్చంద్రుని మహిమాతిశయమును వర్ణించు సందర్భమున నన్నయ :

"దీపిత సత్యసంధుఁడు ధృతిస్మృతిధర్మపరాయణుం డయో
ధ్యాపుర నాయకుండు జలజాప్తకులైక విభూషణుండు వి
ద్యా పరమార్థవేది శరదభ్ర సముజ్జ్వల కీర్తి చంద్రికా
ప్లావిత సర్వలోకుఁడు త్రిశంకు నరేంద్ర సుపుత్త్రుఁడున్నతిన్."

(౧-83)

అను నమూలక మైన పద్యమును వ్రాసెను. ఇది పెద్దన గారి మను చరిత్ర యందలి "అ పురిఁబాయకుండు" అను ప్రవరాఖ్య వర్ణనమునకుఁ బ్రేరక మైనదిగాఁ గన్పట్టు చున్నది.

8. నారదుఁ డింద్రసభను వర్ణించిచెప్పు సందర్భమున "సురరాజు నొలసి కొలుచు" వారి నందఱిని "వదలక యేలిన వాని ప్రస్తవమునఁ బోరిలో పీల్గిన

వీరభటులు" ఇత్యాదిగాఁ గల సీసపద్యమునఁ జేర్కొనెను. ఈ విషయము మూలమునందుఁ గానరాదు. మఱియొకచోట మాత్రము :

"యే చాపి నిధనం ప్రాప్తాః సంగ్రామే ష్వపలాయినః". (2-11-63)

అను వాక్యము మాత్ర మున్నది. ఇది యైనను సంగ్రామములఁ బాఱి పోక పోరి మరణించిన వారిని గూర్చియే చెప్పు చున్నది కాని 'యేలినవాని ప్రస్తవమునఁ' బోరిలో నీల్గు రాజభక్తులను గూర్చి చెప్పునట్టిది కాదు.

9. ధర్మరాజు కృష్ణుని కర్ఘ్యము నొసంగిన సందర్భమున శిశుపాలుఁ డాతని నాక్షేపించుచుఁ జెప్పిన వాక్యములలో నన్నయ :

"ఇతనికిఁ గూర్తురేని ధన మిత్తు రభీష్టము లైన కార్యముల్
మతి నొనరింతు రిష్టుఁడని మంతురు గాక మహాత్ము లైన భూ
పతులయు విప్రముఖ్యుల సభన్ విధి దృష్ట విశిష్ట పూజనా
యతికి ననర్హు నర్హుఁడని యచ్యుతు నర్చితుఁ జేయఁ బాడియే."

అను పద్యమును గూడఁ జేర్చెను. ఇందలి భావ మమూలకమైనది.

10. భీష్ముఁడు కృష్ణుని యర్ఘ్య గ్రహణార్హతను సమర్థించుచు :
"వృద్ధ లోక లక్ష యున్నను బుద్ధియె యెవ్వరికి వారిఁ బూజింపంగా
విద్ధరణీశులలో గుణవృద్ధని పూజించితిమి త్రివిక్రము భక్తిన్.
పూజితులై తృప్తులగుదురు భూజను లోరు లచ్యుతుండు పూజితుఁ డగుడుం
దేజమున జగత్త్రితయముఁ బూజిత మయి తృప్తి పొందుఁ బుణ్య
సమృద్ధిన్". (సభా-౨-27, 28).

అని చెప్పిన కారణములు నన్నయ కల్పితము లైనవే. ఇందు రెండవ పద్యము నందలి భావము కృష్ణుని జగత్త్రితయాత్మకత్వమును సూచించుచు మిక్కిలి గంభీరమై యున్నది.

అరణ్యా పర్వము .-

11. కృష్ణుఁడు సాళ్వునితో యుద్ధముచేయు సందర్భమునఁ దచ్ఛార్ఙ్గ ముక్త నారాచ నికాయములచే ఖండితు లై పలువురు దైత్య దానవులు సముద్ర గర్భమునఁ బడిరి. అప్పు డుప్పతిల్లిన ధ్వనిని నన్నయ యీ క్రింది పద్యమున వర్ణించెను. ఈ భావము మూలమున లేదు.

6. అర్జునుఁడు సుభద్రను వివాహ మాడిన యనంతరము పాండుసుతులు జగజ్జన విశ్రుతులై రాజ్యమును బ్రజానురంజనముగఁ బాలించుచు సుఖముగాఁ గాలము పుచ్చుచుండిరి. అప్పు డొకనాఁ డర్జునుఁడు కృష్ణునికి రమ్యగిరి సానువు లందు విహరించుటయందుఁ దనకుఁగల యభిలాష నెఱింగించెను. అర్జునునకు విహారాభిలాష కల్గుటకు హేతువైన ఘర్మ సమయమును నన్నయ యిచ్చట నీ క్రిందివిధమున వర్ణించెను:

"ఉరుతర దావపావక శిఖోత్కలిత శ్వసనంబులున్ సితే
తరగతి తీవ్ర తిగ్మకరధామ సహస్రములున్ బహు ప్రవా
హహిత నిమ్నగాతతులు నై కడు దీర్ఘములై నిదాఘ వా
సరములు సర్వజీవుల కసహ్యము లయ్యెను దారుణంబులై."

(ఆది-౮-230)

అమూలక మైన యీ వర్ణన మిచ్చట సమయోచితమై కృష్ణార్జునులఁ గలియ వచ్చు నగ్నిహోత్రుని ప్రవేశమును దత్ప్రేరణమున నర్జునుఁడు కావింపఁబోవు ఖాండవవన దహనమును రమ్యముగా సూచించు చున్నది.

సభాపర్వము :-

7. నారదుఁడు ధర్మరాజునకు హరిశ్చంద్రుని మహిమాతిశయమును వర్ణించు సందర్భమున నన్నయ :

"దీపిత సత్యసంధుఁడు ధృతిస్మృతిధర్మపరాయణుం డయో
ధ్యాపుర నాయకుండు జలజాప్తకులైక విభూషణుండు వి
ద్యా పరమార్థవేది శరదభ్ర సముజ్జ్వల కీ ర్తి చంద్రికా
ప్లాపిత సర్వలోకుఁడు త్రిశంకు నరేంద్ర సుపుత్త్రుఁ డున్నతిన్."

(౧-83)

అను నమూలక మైన పద్యమును వ్రాసెను. ఇది పెద్దన గారి మను చరిత్ర యందలి "ఆ పురిఁబాయకుండు" అను ప్రవరాఖ్య వర్ణనమునకుఁ బ్రేరక మైనదిగాఁ గన్పట్టు చున్నది.

8. నారదుఁ డింద్రసభను వర్ణించిచెప్పు సందర్భమున "సురరాజు నొలపి కొలుచు" వారి నందఱిని "వదలక యేలిన వాని ప్రస్తవముఁ, బోరిలో పిల్గిన

వీరభటులు" ఇత్యాదిగాఁ గల సీసపద్యమునఁ జేర్చెను. ఈ విషయము మూలమునందుఁ గానరాదు. మఱియొకచోట మాత్రము :

"యే చాపి నిధనం ప్రాప్తాః సంగ్రామే ష్వపలాయినః". (2-11-63)

అను వాక్యము మాత్ర మున్నది. ఇది యైనను సంగ్రామములఁ బాఱి పోక పోరి మరణించిన వారిని గూర్చియే చెప్పు చున్నది కాని 'యేలినవాని ప్రస్తవమునఁ' బోరిలో నీల్గు రాజభక్తులను గూర్చి చెప్పునట్టిది కాదు.

9. ధర్మరాజు కృష్ణుని కర్ఘ్యము నొసంగిన సందర్భమున శిశుపాలుఁ డాతని నాక్షేపించుచుఁ జెప్పిన వాక్యములలో నన్నయ :

"ఇతనికిఁ గూర్తురేని ధన మిత్తు రభీష్టము లైన కార్యముల్
మతి నొనరింతు రిష్టుఁడని మంతురు గాక మహాత్మ లైన భూ
పతులయు విప్రముఖ్యుల సభన్ విధి దృష్ట విశిష్ట పూజనా
యతికి ననర్హు నర్హుఁడని యచ్యుతు నర్చితుఁ జేయఁ బాడియే."

అను పద్యమును గూడఁ జేర్చెను. ఇందలి భావ మమూలకమైనది.

10. భీష్ముఁడు కృష్ణుని యర్ఘ్య గ్రహణార్హతను సమర్థించుచు .

"వృద్ధు లొక లక్ష యున్నను బుద్ధియె యెవ్వరికి వారిఁ బూజింపంగా
విద్ధరణీశులలో గుణవృ ద్ధని పూజించితిమి త్రివిక్రము భక్తిన్.
పూజితులై తృప్తులగుదురు భూజను లొరు లచ్యుతుండు పూజితుఁ డగుడుం
దేజమున జగత్త్రితయముఁ బూజిత మయి తృప్తి పొందుఁ బుణ్య
సమృద్ధిన్". (సభా--౨-27, 28).

అని చెప్పిన కారణములు నన్నయ కల్పితము లైనవే. ఇందు రెండవ పద్యము నందలి భావము కృష్ణుని జగత్త్రితయాత్మకత్వమును సూచించుచు మిక్కిలి గంభీరమై యున్నది.

అరణ్య పర్వము .-

11. కృష్ణుఁడు సాళ్వునితో యుద్ధముచేయు సందర్భమునఁ దచ్ఛార్ఙ్గ ముక్త నారాచ నికాయములచే ఖండితు లై పలువురు దైత్య దానవులు సముద్ర గర్భమునఁ బడిరి. అప్పు డుప్పతిల్లిన ధ్వనిని నన్నయ యీ క్రింది పద్యమున వర్ణించెను. ఈ భావము మూలమున లేదు.

"ఘనతర దైత్య దానవ నికాయ కళేబర పాత ఘట్టనం
బనరి యుగాంత్యకాల చలితంబును బోలెఁ బయోధి మ్రోసె న
వ్వసధి రవంబు కంటె ననివారితమై చెలఁగెన్ మదీయ వా
హిని భట సింహనాద హయ హేషిత సింధుర బృంహిత ధ్వనుల్."
(అర-౧-186)

12. అర్జునుఁడు పరమేశ్వరు వలనఁ బాశుపతాస్త్రమును బడసిన పిమ్మట నింద్రుఁడు దేవగణములతో నర్జునునకుఁ బ్రత్యక్ష మయ్యెను. పిమ్మట నాతఁ డర్జునుని దేవకార్యము తీర్చుటకై స్వర్గమునకు రమ్మని యాహ్వానించెను. అంతకు ముం దాతఁ డీశ్వరునుండి వరము లొంది శోభిల్లు చుండిన కుమారునిఁ బ్రేమ మీఱఁ జూచిన విధమును నన్నయ :

"ఇందుధర ప్రసాదమున నిష్టవరంబులు గాంచి బాంధవా
నంద విధాయి యైన నిజనందను మర్దితశత్రు నద్భుతా
నందితుఁ జూచి యప్డు నయనంబులు వేయును గన్న తత్ఫలం
బందెఁ బురందరుండు పరమాద్భుత సమ్మద పూరితాత్ముఁడై."
(అర-౧-343)

అని వర్ణించెను. ఇచ్చట నింద్రుఁ డంత యానందము నొందుటకుఁ గుమారుని యందలి కూర్మియు నాతఁ డమర కార్య నిర్వహణ సామర్థ్యముతో వెలుంగు టయుఁ గారణములు.

13. హంస వలన నన్యోన్య గుణ రూపము లెఱింగి మనః ప్రభవానల బాధ్యమాను లైన నల దమయంతులను వర్ణించు

"నల దమయంతు లిద్దఱు మనఃప్రభవానల బాధ్యమానులై
వలిపిరి దీర్ఘవాసర నిశల్ విలసన్నవ నందనంబులన్
సలిన దళంబులన్ మృదు మృణాలములన్ ఘనసారపాంసులన్
జలిరుల శయ్యలన్ సలిల ధారలఁ జందన చారు చర్చలన్."
(అర.౨-24)

అను పద్యము నన్నయ కల్పించినదే. మూలమున నిచ్చట :
"దమయంతీ తు త చ్ఛ్రుత్వా వచో హంసస్య భారత,
తదా ప్రభృతి న స్వస్థా నలం ప్రతి బభూవ సా." (3-51-1)

అని మాత్ర మున్నది. విరహావస్థను వర్ణించు సందర్భమునఁ బ్రబంధ కవులు పై నన్నయ పద్యము నందలి భావములనే విచిత్రములైన కల్పనలతో వర్ణించు చుందురు.

14. వింధ్యపర్వతము సురాద్రి స్పర్ధచే సుత్తుంగమై జలధర పథ మెల్లను గప్పిన తఱి మూలమున :

"ఏవ ముక్త స్తతః క్రోధా త్ప్రవృద్ధ స్సహ సాచలః
సూర్యాచంద్రమసో ర్మార్గం రోద్ధు మిచ్ఛన్ పరంతప." (102-5)

అని యున్నది. నన్నయ వింధ్యపర్వతము పెరుఁగుటవలన లోకములు పొందిన యలజడి నీ విధముగా వర్ణించెను.

"రవి శశిగతు లుడుగుడు నిది, దివమిది రాత్రియని వసుమతీజనులకు న
ద్దివిజ మునివరుల కెఱుఁగఁగ నవగాఢంబయ్యె నంధ మయ్యె జగంబుల్.
(అర-తృతీ-25)

15. ఏకపాదుని భార్య యైన సుజాత తనకుఁ బ్రసవకాలము సమీపింపఁగా భర్తతో :

"ధరణిఁ గడుఁ బేదవారును బురిటికి ఘృతతైల ధాన్యములు చె
చ్చెర సంగ్రహింతు రవి మన కరుదుగ నతి దుర్లభంబు లర్థములేమిన్".
(అర-3-241)

అనిన భావము మూలమున లేదు. ప్రసవ సమయమునఁ బేదరాలైన స్త్రీ మానసమునఁ బొందు వేదన యిచ్చట సహజముగా వర్ణింపఁ బడినది.

16. ధర్మరాజు నహుషుఁ డడిగిన ప్రశ్నకు సమాధానముగా వృత్తము ప్రాశస్త్యమును దెల్పు సందర్భమున నన్నయ వృత్త విత్తములకుఁ గల భేదములు దెల్పుచు వ్రాసిన పద్య మమూలక మైనది :

"విత్తహీనుఁడు వెండియు వివిధ విధుల విత్తవంతుఁడు గానేర్చు.
వృత్తహీనుఁ
డైనవాఁడు విహీనుండ యండ్రు గాన విత్తరక్షకుఁ గడుమేలు
వృత్తరక్ష. (అర ४-130)

III. మూలమునందున్న పదమునో పదసమూహమునో యాధారముగా గ్రహించి యందలి భావమునే విపులీకరించుట :

1. కుండలములను గొనివచ్చిన యుదంకునిఁ జూచి యుపాధ్యాయుఁడు "వత్సోత్తంక ః స్వాగతం తే. కిం చిరం కృత మితి" యని యడిగినట్లు మూలమునం దున్నది. (1.3-165) నన్నయ యీ భావమునే

"ఈయున్న పౌష్యప్రోలికిఁ బోయి కడుం బెద్ద దవ్వు పోయిన యట్ల
త్యాయ తివిమల తపోమహిమా! యిన్ని దినములేల మసలితి చెపుమా".
(ఆ. ౧-116)

అను పద్యమున మిక్కిలి సహజముగాఁ బెంచి రచించెను.

2. శుక్ర శాప వశంబున జరాక్రాంతుఁ డైన యయాతిని నన్నయ వర్ణించిన పద్యము స్వభావోక్తితోఁ గూడి మిక్కిలి రమ్యముగా నున్నది.

"తల వడఁకఁ దొడఁగె, నింద్రియముల గర్వ మడంగె, నంగములు
వదలె, వళీ
పలితంబు లయ్యె, వగరును దలయేరును నుక్కసయును
దలకొను దెంచెన్". (ఆది-తృతీ-191)

ఈ భావము మూలమునం దా సందర్భమునఁ గానరాదు. కాని యదువు తండ్రి ముదిమి గ్రహింప నొల్లక తిరస్కరించు నప్పు డందలి ఛాయ కొంత గోచరించు చున్నది.

"సిత శ్మశ్రు శిరా దీనో జరయా శిథిలీకృతః
వలీ సంతతగాత్ర శ్చ దుర్దర్శో దుర్బలః కృశః." (1-79-5)

3. మేనక విశ్వామిత్రుని యాశ్రమమున కరుగు సందర్భమున మూలములో :

"ఏవ ముక్త స్తయా శక్రః సందిదేశ సదాగతిమ్
ప్రాతిష్ఠత తదా కాలే మేనకా వాయునా సహ."

అని చెప్పఁబడి యున్నది. దాని నాధారముగాఁ జేసికొని నన్నయ :

"చల్లని దక్షిణ మారుత మల్లన వీతెంచెఁ దగిలి యా లలనా థ
మ్మిల్ల కుసుమాంగరాగ సముల్లసనసుగంధి యగుచు మునివరు మీఁదన్".
(ఆది. ౪-40)

అని మలయ మారుత ప్రసారమును చక్కఁగా వర్ణించెను. ఈ మారుతమే యా మునివరుని మానసక్షేత్రమున మొదట వికార బీజమును నాఁటియుండెను. పిమ్మట మూలమున :

"అ థాపశ్య ద్వారారోహా తపసా వీతకిల్బిషం
విశ్వామిత్రం తపస్యన్తం మేనకా భీరు రాశ్రమే
అభివాద్య తతస్సా తం ప్రాక్రీడదృషి సన్నిధౌ". (66-2)

అని వ్రాయఁబడి యున్నది. నన్నయ యిందలి భావమునే సరసముగాఁ బెంచి వ్రాసెను. "ప్రాక్రీడత్" అను క్రియ కామె "అనురాగము తోడం బుష్పాపచయ వ్యాజంబున విహరించు చుండె సఖులున్ దానున్" అనునది నన్నయ కావించిన పెంపు. తరువాత గాలి యామె వస్త్రమును దొలఁగించె ననియు, నప్పు "డనిర్దిశ్యవయో రూప"యు, వివృతయునైన యామెను విశ్వామిత్రుఁడు చూచె ననియు మూలమునఁ జెప్పఁబడినది ఇందలి యనౌచిత్యమును దొలఁగించి నన్నయ "అనిర్దిశ్యవయోరూపా" మ్మను పదమును జక్కఁగా వివరించెను.

"అలసత యొప్పఁగాఁ దరుణి యమ్మొని వల్లభు మ్రోల నున్న నా
మిళిత సుగంధ బంధుర సమీర వశంబునఁ దూలి బాల పై
వలు వెడలెన్ బయల్పడియె వర్ధపచంబులు కక్షయుగ్మమున్
లలిత కృశోదరంబు తరళత్రివళీయుత రోమరాజియున్". (43)

నన్నయ యీ పద్యమున నామె పై వలువ మాత్రమే యెడలె నని చెప్పి యది యెడలుటచే దృశ్యము లగు నవయవముల వర్ణించెను. విశ్వామిత్రుఁడు వివృతయైన మేనకను జూచె ననుట కంటె నిట్లు వర్ణించుట యెంతయు నుచితముగా నున్నది. విశ్వామిత్రుని మనస్సున వికార ముత్పాదించుటకై యమూలక మైన యీ యవయవ వర్ణనము కావింపఁబడినది. తరువాత నా యవయవము లందు ముని దృష్టి నాఁటుటయు, నతఁడు కందర్ప నిశాత సాయకహతుఁడై ధృతి చెడి యామెను గవయఁ దివురుటయు నొక్కమాఱు సంభవించెను.

4. పాండవులు వారణావతమున కరిగినపుడు మూలమున :

"తతః సర్వాః ప్రకృతయః నగరా ద్వారణావతాత్
సర్వమంగళసంయుక్తా యథాశాస్త్ర మతంద్రితాః
శ్రుత్వా గతాన్ పాండుపుత్రా న్నానాయానైః సహస్రశః
అభిజగ్ము ర్నరశ్రేష్ఠాన్ శ్రుత్వైవ పరయా ముదా". (1-134-1-2)

అని ప్రకృతులు సంతోషమున వారి కభ్యుత్థాన మొనరించినట్లు మాత్రము చెప్పఁ

బడినది. నన్నయ సంతోషమున వా రొనరించిన గృహాలంకరణాములు కూడ వర్ణించెను.

"వారణావతమున వారెల్లఁ బాండవాగమనంబు విని సంతసమునఁ బెఱిఁగి
కర మొప్పఁ గరి రథ తురగ బలాఢ్యులై యెదురు వచ్చిరి మహాముదము తోడఁ
గలయంగ గృహములఁ గలువడములు గడు విలసిల్లె నంబర తలము గప్పి
మలయజమృగమదావిల సలిలంబుల నిమ్మగా నార్ద్రీకృతము లైన
యంగణముల నొప్పెఁగర్పూర రంగవల్లు లంగనలు గయిసేసి యున్నతంగ హర్మ్య
తలము లెక్కిరి తత్పురీవిలసనంబుఁ జూచు పాండుకుమారులఁ జూచు వేడ్క."
(ఆది. ౬-148)

5. పాండవులు లక్కయింటినుండి తప్పించుకొని దక్షిణాభిముఖముగాఁ బ్రయాణ మొనరించి అల్పమూలఫలోదకమైన యొక యడవిఁ జేరిరి. అప్పుడు సాయంకాల మయ్యెను. మూలమున నా సాయంకాలము :

"ఘోరా సమభవ త్సంధ్యా, దారుణా మృగపక్షిణః
అప్రకాశా దిశ స్సర్వా వాతై రాస న్ననార్తవైః". (138-7)

అని వర్ణింపఁబడినది. నన్నయ భీముఁడు వటాగ్ర మెక్కి సరోవర మున్న చోటుఁగని యచ్చటి కరిగి తా నందుఁ గృతావగాహుఁడై నీళ్లు గొనివచ్చునంతలో సూర్యుఁ డస్తమించె నని చెప్పి యా యస్తమయమును గథాసంబంధిగాఁ జేసి మనోజ్ఞముగా వర్ణించెను.

"ధరణీదిశాప్రసారిత గురుకర నికరంబు లుడిచికొని దీర్ఘ నిరం
తర ఖిన్నుఁడ పోలెను హరిదశ్వుఁడు విశ్రమించె నస్తాద్రి దరిన్."
(ఆది. ౬-174)

"అంబురుహాప్తుఁ డస్త శిఖరాంతరితుం డగుడున్ సమస్త జీ
వంబులు నెల్లచో విజనివాసముఁ బొందు నెడం దమిస్ర పుం
జంబుల పోలె వెల్వడియె శైల విశాల గుహాలి నుండి నా
గంబుల యూథముల్ సరసఘాస పరిగ్రహణోత్సుకంబులై". (175)

కుంతీ పాండవుల ప్రయాణ ఖేదమును, వారు లక్కయింటినుండి తప్పుకొని సురక్షిత స్థలము నన్వేషించుచుఁ బోవు చుండుటయుఁ దలంచి చూచినచో నిచ్చటి వర్ణనము నందలి యౌచిత్య గాంభీర్యములు వెల్లడి యగును.

6 అగ్ని భృగుశప్తుఁడై తాను బ్రతిశాప మీఁ గల్గియు నట్లు చేయక "మాన్యా స్తు బ్రాహ్మణా మమ" (1-7-4) యని యందుకు హేతువు చెప్పి యుండెను. నన్నయ యీ చిన్న వాక్యమును :

"అడిచినఁ దిట్టినన్ మఱి మహాపరుషంబులు పల్కి యల్కతోఁ
బొడిచిన నుత్తమ ద్విజులు పూజ్యులు వారల కెగ్గుసేసినం
జెడు నిహముం బరంబు నిది సిద్ధము గావు తెఱంగి భక్తినె
ప్పుడు ధరణీసురోత్తములఁ బూజలఁ దన్పుదు నల్గ నోడుదున్."
(ఆది ౧-138)

అని సముచితముగా వివరించెను. పై సందర్భమునందే యగ్ని తన తేజో మూర్తి నుపసంహరింపఁగాఁ గలిగిన క్రియా నివృత్తిని మూల మీ క్రింది విధమున వర్ణించినది :

" నిరోంకారా వషట్కారాః స్వధా స్వాహా వివర్జితాః
వి నాగ్నినా ప్రజా స్సర్వా స్తత ఆస న్సుదుఃఖితాః ". ( 1.7.13 )

కర్మిష్ఠుఁడైన నన్నయ యగ్ని తేజరిల్లమిచే వైదిక కర్మలకుఁ గలిగిన యంతరాయము నిచ్చట నెంతో విశదముగా వర్ణించెను.

"త్రేతాగ్ను లెల్లను తేజరిల్లమిఁజేసి క్రతు కృత్యములు విసర్గతము లయ్యె
వగ్నిహోత్రములందు నౌపాసనాది సాయంప్రాత రాహుతు లంత నడిగె
దేవతార్చనలందు ధూపదీపాది సద్విధులు వర్తిలక విరతిఁ బొంది
పితృకార్యములఁ బితృపితృయజ్ఞక్రియ లడఁగె విచ్ఛిన్నంబులై ధరిత్రి
నంత జనులు సంభ్రమాక్రాంతులై మహామునుల కడకుఁ జనిరి.
మునులు నమర

వరుల కడకుఁ జనిరి, వారును వారును బ్రహ్మకడకుఁ జనిరి, భయము
నొంది". (ఆది-౧-141)

చివరి గీత పద్యమునఁగల 'చనిరి' యను క్రియయొక్క యావృత్తి జనాదులు పొందిన సంభ్రమక్రాంతిని జక్కఁగా వెల్లడించు చున్నది.

7. గరుత్మంతుఁడు దేవలోకమున కరుగునపుడు మూలమున:

"గరుత్మాన్ పక్షిరా ట్తూర్ణం సంప్రాప్తో విబుధాన్ ప్రతి
తం దృ ష్ట్వాతి బలం చైవ ప్రాకంపన్త సమ న్తతః". (1-27-1)

అను శ్లోకము కానవచ్చు చున్నది. నన్నయ "గరుడుఁడు విబుధలోకమున కరిగె" నను సామాన్య వాక్యము నుచిత రీతిఁ బెంచి, యతని తేజమును, వేగమును, తెక్కలి శక్తియు స్పష్టమగునట్లుగా నీ క్రింది పద్యమును వ్రాసెను

"వితతోల్కానికర పుంజ మొక్కొ యనఁగా విస్వీథి విక్షిప్త ప
క్షతి వాతాహతిఁ దూలి తూల శకలాకారంబులై వారిద
ప్రతతుల్ సాల్పడి నల్గడం జెదరఁగాఁ బాఱెన్ మనోవేగుఁడై
పతగేంద్రుం డమృతాంతికంబు నకుఁ దత్పాలుర్ భయం బందఁగన్".

8 ఉపరిచరవసు వృత్తాంతమున నతఁడు వేఁట కేగి గిరికనే స్మరించు చుండె నను సందర్భమందు గిరిక యిట్లు వర్ణింపఁ బడినది.

"చచార మృగయాం కామీ గిరికా మేవ సంస్మరన్
అతీవ రూప సంపన్నాం సాక్షాచ్ఛ్రియ మివాపరామ్". (1-57-38)

ఇందలి "అతీవ రూప సంపన్నాం" అను మాటను నన్నయ "పలుకుల ముద్దును, గలికి క్రాల్గన్నుల తెలివును, వలుద చన్నుల బెడంగు" అను సీస పద్యమున (ఆది-3-27) చక్కఁగా విపులీకరించెను.

ఇట్లే పరాశరుఁడు సత్యవతిని జూచినప్పుడు మూలమున:

"అతీవరూపసంపన్నాం సిద్ధానా మపి కాంక్షితామ్
దృష్ట్వైవ చ స తాం ధీమాన్ చకమే చారుదర్శనామ్". (1-57-57)

అను శ్లోక ముండగా నిందలి "చకమే" అను దానిని నన్నయ "చపలాక్షి చూపుల వాడ్పున కెద మెచ్చుఁ జక్కని చనుఁగవఁ జీఱఁగోరు" (ఆది-కృతీ-38). అను సీసపద్యమునఁ జక్కగా విస్తరించి యామె సౌందర్యమును దదాకృష్టుఁడైన యాతని మనోభావములను విశదముగా వర్ణించెను.

9. శుక్రుఁడు కచుని శిష్యునిగా గ్రహించిన పిమ్మట మూలమున నాతఁడు "గురుని, దేవయానిని ఆరాధించె" నను పొడిమాట లున్నవి. "ఆరాధయ దుపాధ్యాయం దేవయానీం చ భారత"(1-71-21.). నన్నయ యా యారాధన క్రమము నంతను జక్కగాఁ వర్ణించి గురుకులమున శిష్యుఁడు మెలఁగ వలసిన క్రమమును విశదముగా వర్ణించెను.

"పనియేమి పంచినఁ బదపడి చేసెద ననక" మొద. (ఆది-తృతీ-110)

10. దేవయాని పుత్త్రినిఁ గాంచిన పిమ్మట సంప్రాప్తయౌవనయు ఋతుమతియునైన శర్మిష్ఠ :

"ఋతుకాల శ్చ సంప్రాప్తో న చ మే స్తి పతి ర్వృతః
కిం ప్రాప్తం కిం ను కర్తవ్యం కిం వా కృత్వా కృతం భవేత్
" దేవయానీ ప్రజాతాసౌ వృథాహం ప్రాప్త యౌవనా". (1.77-6.7)

అని విచారించినట్లు మూలమున నున్నది. నన్నయ పై భావమును బెంచి యామె యింగితమును రసవంతముగా వ్యక్తము చేసెను.

" అసదృశ యౌవనం బిది యనన్య ధనంబగు నాక్కా నాకు ని
క్కుసుమ సముద్గమంబును వగోచర దుర్గమ దుర్గవల్లరీ
కుసుమ సముద్గమంబగు నాకో పతి లాభము లేమిఁ జేసి యొ
ప్పెసఁగఁగ దేవయాని పతి నేమి తపం బొనరించి కాంచెనో".

(ఆది 3-170)

ఇందలి యుపమాన మామె మానసిక వ్యథను గన్నులకుఁ గట్టుచున్నది.

11. శకుంతల దుష్యంతునికి భార్య యొక్క గుణ గణములను వర్ణించి చెప్పు సందర్భమున మూలమునందు :

" అర్థం భార్యా మనుష్యస్య భార్యా శ్రేష్ఠతమ స్సఖా
భార్యా మూలం త్రివర్గస్య భార్యా మిత్రం మనుష్యతః".
"భార్యా మూలం తరిష్యతః" అని పాఠాంతరము.
కాన్తారే ష్వపి విశ్రామో నర స్యాధ్వనికస్య వై
య స్సదార స్స విశ్వాస్య స్తస్మా ద్దారాః పరా గతిః". ( -68-40,43)

అను శ్లోకము లున్నవి. నన్నయ యిందలి భావములకు మఱి కొన్ని చేర్చి " ధర్మార్థ కామ సాధన కుపకరణం " బిత్యాదిగాఁ గల సీస పద్యమును వ్రాసెను. ఇందు భార్య గుణములు విశదముగా వర్ణింపఁ బడినవి.

12. ప్రతీపుఁడు గంగా తీరమునఁ దప మాచరించు చుండఁగా గంగ వనితాకారమున వచ్చి యాతని దక్షిణోత్సంగము నధిష్ఠించెను. అప్పుడు మూలమున .

"తస్య రూపగుణోపేతా గంగా శ్రీరివరూపిణీ
ఉత్తీర్య సలిలా త్తస్మా ల్లోభనీయ తమాకృతిః
అధీయానస్య రాజర్షే ర్దివ్యరూపా మనస్వినీ
దక్షిణం శాలసంకాశ మూరుం భేజే శుభాననా". (92-2 3)

అని చెప్పఁబడినది. నన్నయ పై శ్లోకము నందలి "లోభనీయ తమాకృతిః".
అను పదమును :

"గంగ విలాంగ దీప్తు లెసఁగం జనుదెంచి లతాఁగి సంత తో
త్తుంగ పయోధర ద్వితయ, తోయరుహాయత చారునేత్ర, ది
వ్యాంగనయై ప్రతీప వసుధాధిపు శాల విశాల దక్షిణో
త్సంగము నందు మన్మథ వశంబున నుండెఁ గరంబు లీలతోన్".
(ఆది. ४-134)

అను పద్యము నందలి మొదటి రెండు పంక్తులలో వివరించెను.

13. వసువులు వశిష్ఠునిచే శప్తులైన పిమ్మట నాతని సమీపించి ప్రసన్నునిఁ గావించి రని మూలమునఁ జెప్పఁబడినది.

"ప్రసాదయన్త స్త మృషిం వసవః పార్థివర్షభ
న లేభిరే చ తస్మా త్తే ప్రసాద మృషిస త్తమాత్". (1-93-95)

ఇందు వా రాతని నెట్లు ప్రసన్నునిఁ గావించిరో తెలుపఁబడి యుండలేదు. నన్నయ "నీవు ధర్మమూర్తివి మాచేసిన యజ్ఞానంబు సహించి మర్త్యంబునం బెద్ద కాలం బుండ కుండ మా కనుగ్రహింపవలె"నని వా రాతనిఁ బార్థించి రని చెప్పి యా ప్రసాదన క్రమమును వివరించెను.

14. మునులు పక్షి రూపులై రాత్రి వచ్చి మాండవ్యుని నీవు చేసిన పాప మే మని యడుగ నతఁడు

"దోషతః కం గమిష్యామి న హి మేఽ న్యోఽ పరాధ్యతి" 101-16

అని చెప్పినట్లు మూలమునం దున్నది. నన్నయ దీనిని

"ఎఱిఁగి యెఱిఁగి వ న్నడుగంగ నేల దీని.
సుఖము దుఃఖము ప్రాప్తించు చోట నరుఁడు
తగిలి తన కర్మవశమునఁ దనకుఁ దాన
కర్త గా కన్యులకునేమి కారణంబు".

అని విస్తరించి చెప్పెను. ( అర. ४-266 )

15. మాండవ్యుఁడు యముని శపించుటకు ముందు అతనితో "అల్పేఽపరాధే విపులో మమ దండస్త్వయా కృతః" ( 101-25 ) అని శాపమునకుఁ గారణము తెల్పెను "అల్పేఽపరాధే" అను కారణము చాలినంతగా లేకపోవుటచే నన్నయ "బాల్యంబున" అను పదముకూడఁ జేర్చెను. మఱియు "బ్రాహ్మణోచితంబు గాని క్రూర దండం" బని "విపులో మమ దండః" అనుదాని యందలి "విపుల" శబ్దమును వివరించెను.

16. అస్త్ర విద్యాప్రదర్శన సందర్భమున దుర్యోధనుఁడు కర్ణు నంగరాజ్యమున కభిషిక్తునిఁ గావించెను. అప్పుడు కర్ణుఁ డాతనిఁ జూచి మూలమున "అస్య రాజ్య ప్రదానస్య సదృశం కిం దదాని తే" (1-126-38) అని పల్కియుండెను. నన్నయ "అస్యరాజ్య ప్రదానస్య" అను మాట లందలి భావమును :

"బృహదద్రి మేఖ లాఖిల మహీతల క్షత్రవర సమక్షమున మహా
మహిమాన్వితుఁగా నన్నును మహీశుఁగాఁ జేసి తతి సమర్థత
వెలయన్". (ఆది ౬-49)

అని యాతఁడు చేసిన సమ్మానము నందలి గౌరవమును గృతజ్ఞతా పూర్వకముగా విశదీకరించెను.

17. ద్వాదశ మాసిక వ్రతము నల్పు సందర్భమున నర్జునుఁడు బ్రాహ్మణులతోఁ గూడఁ గళింగదేశమున కరిగి పిమ్మటఁ దాప సోపశోభితమైన మహేంద్రపర్వతమును గాంచి, తరువాత సముద్రతీరము ననుసరించి మణలూరు పురమున కరిగె నని మూల మందున్నది. దాక్షిణాత్య ప్రతులలో మణలూరు పురమున కరుగుటకు ముందు ;

"గోదావర్యాం తతః స్నాత్వా తా మతీత్య మహాబలః
కావేరీం తాం సమాసాద్య సంగమే సాగరస్య హ
స్నాత్వా సంపూజ్య దేవాం శ్చ పితౄం శ్చ ఋషిభి స్సహ".
(పుట 814)

అని యాతఁడు గోదావరీ కావేరీ నదులందుఁ గూడ స్నానము చేసె నని తెల్పు శ్లోకము వ్రాయఁబడి యున్నది. నన్నయ యిచ్చట

"దక్షిణ గంగనాఁ దద్దయు నొప్పిన, గోదావరియు జగదాది యైన
భీమేశ్వరంబును బెడఁగగు చున్న శ్రీ. పర్వతంబును జూచి
యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై, ధరణీ సురోత్తమాధ్వర వితాన
పుణ్య సమృద్ధమై పొలుచు వేఁగిదేశ. విభవంబుఁ జూచుచు
విభుఁడు దక్షి

ణాంబు రాశి తీరంబున కరిగి..........." (ఆది. అష్టమ-139)

అని భీమేశ్వరమును, ఉనకు నివాసమును దన ప్రభువైన రాజరాజనరేంద్రునిచేఁ బాలింపఁ బడు నదియు నగు వేఁగి దేశమును గూడ వర్ణించి దేశాభిమానమును బ్రకటించెను.

18 వరుణునిఁ గొల్చు నదులను బేర్కొను సందర్భమున మూలములోఁ గొన్ని నదుల పేర్లు చెప్పఁబడిన తరువాత "ఏతాశ్చాన్యాశ్చ సరితః తీర్థాని చ రాంసి చ" అను శ్లోకార్ధ మున్నది నన్నయ "అన్యాశ్చ" అనుదానిలో నాంధ్ర దేశము నందలి పెన్నను జేర్చి తన యాంధ్రాభిమానమును వెల్లడించెను.[1] ఈ సందర్భముననే "సర్వేజలచరాః" అను పదముల నతఁడు "మకర శింశుమార సింహ శరభ సామజాది జలచర స్థలచర తతుల తోడ" నని వివరించి యుండెను.

19. నారదుఁడు ధర్మరాజును రాజసూయ యాగాచరణమునకుఁ బ్రేరేచు సందర్భమున మూలములో :

"పితా చ త్వాహ కౌంతేయ పాండుః కౌరవనందనః
హరిశ్చంద్రే శ్రియం దృష్ట్వా నృపతౌ జాతవిస్మయః
సమర్థో ఽసౌ మహీం జేతుం భ్రాతర స్తే వశే స్థితాః
రాజసూయం క్రతుశ్రేష్ఠ మాహర స్వేతి భారత". (2-11-65, 66)

అని చెప్పియుండెను. నన్నయ యీ శ్లోకములందలి భావమును స. ౧-88-89-90 పద్యములలోఁ బెంచి వ్రాసెను. ఇట్లు పాండురా జన్న వాక్యములను బెంచి చెప్పుట పితృభక్తి తత్పరుఁడైన ధర్మజుని హృదయమును సత్వరముగా

1. కృష్ణవేణి సరస్వతి పెన్న యైరావతి యనఁగఁ బ్రసిద్ధంబులైన నదులు. (స.౧-71)

ద్రవింపఁజేసి యాగాచరణోన్ముఖమును గావించుట కెంతయో తోడ్పడు చున్నది.

20. జర పుత్త్రశకలములు రెండింటిని గూర్చి బృహద్రథుని కర్పించిన సమయమున మూలములో :

"అపృచ్ఛ న్నవహేమాభాం రాక్షసీం తా మరాక్షసీం
కా త్వం కమలగర్భాభే మమ పుత్త్రప్రదాయినీ
కా మయా బ్రూహి కల్యాణి దేవతా ప్రతిభాసి మే". (2-16-51)

అని యడిగిన ట్లున్నది. నన్నయ యిందలి భావమును గ్రహించి :

"ఇచ్చుకు వచ్చు పూజనల నెంతయు సంతస మొంది తొల్లి నా
కిచ్చె మునీశ్వరుండు దయ నిత్తనయున్ మఱి యిప్డు నెమ్మితో
విచ్చితి వీవు రాక్షసివె యిక్కల మెల్లను నుద్ధరింపఁగా
వచ్చిన పుణ్యదేవతవు వారిరుహాయతచారులోచనా!" (సభా. ౧-152)

అని కృతజ్ఞతను గ్రుమ్మరించు నట్లుగాఁ బెంచి యుండెను.

21. కృష్ణుఁడు జరాసంధునితో ననవసరముగాఁ జావు చేతులారఁ దెచ్చుకొనక నిగ్రహించిన రాజుల నందఱ విడిచి పుచ్చు మని చెప్పఁగా విని జరాసంధుఁడు "సటాసముత్పాటన కుపిత కుంజర వైరియుం బోలె నలిగి పటు కుటిల భ్రుకుటి ఘటిత విటలుఁ డగుచుఁ బురుషోత్తమున కిట్లనియె" నని నన్నయ భారతమున నున్నది. టకార వృత్త్యనుప్రాసముతోఁ గూడిన యీ వచనము పండ్లు పటపటలాడించుచు నాగ్రహోదగ్రుఁడైన జరాసంధుని బారకులకుఁ బ్రత్యక్షము చేయుచున్నది. ఇది మూలమున లేదు. కాని దాక్షిణాత్య ప్రతులలో "ఏతత్ శ్రుత్వా జరాసంధో క్రుద్ధో వచన మబ్రవీత్" అను వాక్యము మాత్ర మున్నది.

22. ధర్మరాజు తన్ను రాజసూయాధ్వర విధానమున నియోగించి యనుగ్రహింపు మని ప్రార్థింపఁ గృష్ణుఁడాతని గుణ విస్తరమును వివరించి యిట్లు చెప్పెనని మూలమునం దున్నది.

"తం కృష్ణః ప్రత్యువా చేదం బహూక్త్వా గుణవిస్తరమ్" (2-30-23)
నన్నయ యీ గుణ విస్తరము నీ క్రింది విధముగా స్పష్టీకరించెను.

"పూజ్యుఁడ వెల్ల వంశముల భూపతు లందును ధర్మ నిర్మల
ప్రాజ్య విభూతి నద్దివిజ పాలకు నట్టిఁడ నీక యొప్పె సా
మ్రాజ్యము దైవసంపదయు మానుష సంపద పేర్మి కావునన్
యాజ్యుఁడ విప్రు నీవ భరతాన్వయభూషణ ధర్మనందనా." (స. ౧-278)

23. ధర్మరాజు రాజసూయ యాగమున కుపక్రమించి సహదేవునిఁ జేయ వలసిన పనులన్ని సమకూర్ప నియోగించెను. అప్పుడు మూలమున:

"తద్వాక్య సమకాలం తు కృతం సర్వ మవేదయత్
సహదేవో యుధాం శ్రేష్ఠో ధర్మరాజే మహాత్మని." (2.30-32)

అను శ్లోకము వ్రాయఁబడినది. నన్నయ (సభా ౧-282) సీస పద్యమున సహదేవుఁడు చేయించిన యేర్పాటు లన్నియు వివరించెను.

24. అర్ఘ్యమున కర్హుఁడైన వానిఁ జెప్పు మని ధర్మరా జడుగఁగా భీష్ముఁడు కృష్ణునిఁ జేర్కొని

"మధ్యే తప న్నివా భాతి జ్యోతిషా మివ భాస్కరః
అసూర్య మివ సూర్యేణ నివాత మివ వాయునా
భాసితం హ్లాదితం చైవ కృష్ణేనేయం సదో హి నః." (2-33-28, 29)

అని యాతని మహిమానుభావములను వర్ణించెను. నన్నయ యీ భావమునే క్రింది సీస పద్యమున మనోజ్ఞముగాఁ బెంచి వ్రాసెను.

"రోదసీ కుహరంబు రుచిరాంశుతతిఁ జేసి, యర్కుండు వెలిఁగించునట్టు లమృత సందోహ నిష్యంద చంద్రికఁజేసి శీ, తాంశుఁ డానందించునట్లు సకల జనులకుఁ దనదైన సదమల ద్యుతిఁ జేసి, తనరంగఁ దేజంబుఁ దనుపుఁ దాన చేయుచు నున్న సత్సేవ్యుండు పుండరీ, కాక్షుండు కృష్ణుఁ డనాది నిధను, డబ్జనాభుఁ డుండ నర్ఘ్యంబునకు నిందు, నర్హు లొరులు గలరె యజ్ఞ పురుషు నఖిల లోక పూజ్యు నచ్యుతుఁ బూజింపు, మధిప యదియ చూవె యజ్ఞ ఫలము."
(సభా. ౨-6)

25. శిశుపాలుఁ డల్కతో సపుత్త్రబలుఁడై సభ వీడి యరుగు నప్పుడు ధర్మజుఁ డాతని వెంటఁ జని ప్రియ వచనముల ననునయించు తఱి

"వేద తత్త్వేన కృష్ణం హి భీష్మ శ్చేది పతే భృశమ్" (2-35.5)

అని పలికినట్లు మూలమున నున్నది. నన్నయ భీష్ముఁడు కృష్ణుని యందలి యే యే గుణము లెఱింగి యాతఁ డర్ఘ్యార్హుఁ డని చెప్పెనో వివరించెను.

"ఆదిజుఁడైన బ్రహ్మ యుదయంబున కాస్పద మైన వాఁడు వే
దాది సమస్త వాఙ్మయము లందుఁ బ్రశంసితుఁ డైనవాఁడు లో
కాది త్రిలోక పూజ్యుఁ డని యాత్మ నెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁ డని యుక్తమ కా కిది యేమి దోసమే."
(సభా. ౨-18)

ఇందలి పెంపు కృష్ణుని మహానుభావమును వేయి విధముల వ్యక్తము చేయుచు ధర్మజ భీష్ముల కృష్ణ తత్త్వ గ్రహణ పాటవమును దేటతెల్ల మొనరించు చున్నది.

26. కృష్ణుని కర్ఘ్య మొసంగుట కంగీకరింపని వారి మస్తకములపై నిడెద నని సహదేవుఁడు చరణ మెత్తఁగా సభాసదు లందఱును భీతచిత్తులై యేమియుఁ బలుక కుండిరి. అప్పుడు శిశుపాలుని సేనాపతియైన సునీథుఁ డను వాఁడు క్షత్త్రియుల నెల్ల నొక్కచెంతఁ జేర్చుకొని యుద్ధ సన్నద్ధుఁ డయ్యెను. ఈ సందర్భమున మూలములో,

"తతః సాగర సంకాశం దృష్ట్వా నృపతి సాగరం
రోషా త్ప్రచలితం సర్వ మిద మాహ యుధిష్ఠిరః
భీష్మం మతిమతాం శ్రేష్ఠం వృద్ధం కురుపితామహం." (స. 37-1)

అని ధర్మరాజు రోష ప్రచలితమైన నృపతి సాగరమును జూచి భీష్మునితో నేదియో చెప్పిన ట్లున్నది. సునీథుఁడు యుద్ధ సన్నద్ధుఁ డగుట చూచి యదు వృష్ణి భోజాంధక సేన కూడఁ గలఁగె నని చెప్పి నన్నయ యా సంక్షోభము నాలంకారికముగా నిట్లు వర్ణించెను.

"రయ విచల త్తురంగమ తరంగములన్ మదనాగనక్ర సం
చయముల సంచలచ్ఛటుల పైవిక మత్స్యములన్ భయంకరం
బయి యదు వృష్ణి భోజ కుకు రాంధక వాహినియుం గలంగె ని
ర్దయ తర రోషమారుతవితాంత సమీరితమై క్షణంబునన్." (స.౨-33)

మూలము నందలి "రోషాత్ప్రచలితం సాగర సంకాశం నృపతి సాగరం" అను మాటల నూఁతగా గ్రహించి నన్నయ యీ పద్యము రచించెను.

అరణ్య పర్వము :-

27. నలుఁడు ఋతుపర్ణుని నగరమున వార్ష్ణేయ జీవలులతో నివసించుచు ప్రతి సాయంకాలమును

"క్వ ను సా క్షుత్పిపాసార్తా శ్రాంతా శేతే తపస్వినీ
స్మరన్తీ తస్య మందస్య కం వా సాఽద్యోపతిష్ఠతి." (3.64-10)

అను శ్లోకమును జదువు చుండె నని మూలమం దున్నది. నన్నయ యందలి భావమును విపులీకరించి యీ క్రింది సీసము వ్రాసెను :

"ఇభరాజ గమన! నీవెందుల కరిగి తత్పూరుకుచాభోగ యెం దున్న దాన
నబల యెవ్వరిచేత నడవులలోఁ బట్టువడి తశనాపేక్షఁ బఱచు చున్న
యుగ్ర మృగంబుల యుదరంబులో నున్న దానవే నీ తల్లి దండ్రు లొద్ద
ధృతి నున్న దానవే దేశాంతరంబుల నున్నదానవె యంచు నుదితమదన
హతి విమోహితాత్ముఁడై హృదయేశ్వరిఁ దలఁచి రాత్రులెల్లఁ దాపమునను
నిద్రలేక వంది నిట్టూర్పులూర్చుచు,నుండె నలుఁడు శోక ముత్కటముగ."
(అరణ్య-ద్వితీ-132)

28. ఋతుపర్ణుఁడు దమయంతీ స్వయంవరము మాట విని బాహుక చోదితమైన రథ మెక్కి విదర్భ కరిగిన సందర్భమున మూల మందు

" రాజానం రాజ పుత్త్రిం వా న స్మ పశ్యతి కంచన. " (3.71-22)

అని యాతని కచ్చట రాజు గాని రాజపుత్త్రుఁడు గాని కానఁబడఁ డయ్యె నని వ్రాయఁబడి యున్నది. నన్నయ యిచ్చట :

"ధరణిఁ గల రాజు లిట యెవ్వరు వచ్చినవారు లేరు వైదర్భి యొకున్
వరియింప నంత ధర్మేతర చరితయె యనుచు నుండెఁ దద్దయు లజ్జన్."

అని యించుక పెంచి వ్రాసెను. (అర-ద్వితీ-184)

29. భీముఁడు మణిమదాదులగు రాక్షసుల సంహరించి నప్పుడు హతశేషులు కుబేరుని కడ కరుదెంచి భీముని విక్రమమును వర్ణించి చెప్పిరి. అప్పుడు మూలమున :

"ద్వితీయ మపరాధ్యన్తం భీమం శ్రుత్వా ధనేశ్వరః
చుక్రోధ యక్షాధిపతి ర్యుజ్యతా మితి చాబ్రవీత్." (3-158-22)

అని చెప్పఁ బడినది. తెలుఁగున నన్నయ యిందలి భావమునే :

"తలఁకక మును సౌగంధికములు గొని యిప్పుడును దర్పమున నిందుల పు
వ్వులు గొని మణిమత్ప్రభృతులఁ బలువుర వధియించె నెట్టి బలియుఁ
డొయనుచున్. "(అర-౪-25)

అని పెంచి వ్రాసెను. భీముఁ డొనరించిన యపరాధములు రెండును ఇందు వివరింపఁ బడినవి.

IV. ఆలంకారికమైన పెంపు : అర్థాంతరన్యాస కల్పనము :-

మూలమునఁ గొన్నిచోట్ల విరలంకారములును శుష్కములునై కనుపట్టు భాగములకు నన్నయ తెలుఁగున నాలంకారికమైన పెంపు కలిగించి యెంతో వన్నె చేకూర్చు చుండును. ఇట్టి యాలంకారికమైన రచన పౌరాణికమైన సరళశైలికించుక ప్రౌఢిమ చేకూర్చి యుదాత్తమైన కావ్యశోభ నలవరించు చున్నది. సంస్కృతాంధ్ర భారతములకుఁ గల ప్రధాన భేదములలో నీరచనా భేదము కూడ నొక్కటి యనుటలో సందేహము లేదు.

1. శమంత పంచ కాక్షౌహిణీ సంఖ్యా కథన సందర్భమున మూలములోఁ బరశురాముఁడు "శస్త్రభృతాం వరః" అనియు నతఁ డమర్ష చోదితుఁడై క్షత్రియులను జంపె ననియుఁ (జఘా నామర్ష చోదితః) జెప్పఁబడి యున్నది.
(1 2.3)

నన్నయ యీ మాటల నాలంకారికముగాఁ బెంచి యీ విధముగాఁ బద్యము రచించెను:

" త్రేతా ద్వాపర సంధి నుద్ధత మదాంధీ భూత విద్వేషి జీ
మూతోగ్ర శ్వసనుండు రాముఁ డలుకన్ ముయ్యేడు మాఱుల్ రణ
ప్రీతిన్ వైరి ధరాతలేశ్వరులఁ జంపెం బల్వురన్ దీర్ఘ వి
ఖ్యాత క్రూర కుఠార లూన నిఖిల క్షత్త్రోరు కాంతారుఁడై."
(ఆది-౧-78)

2. దివ్య పురుషుని యుపదేశము ననుసరించి యుదంకుఁడ శ్వాపాన ధ్మానం బొనరింప ధమ్యమానమగు నా యశ్వము సర్వస్రోతో భాగముల నుండియు సధూమములైన యర్చులు బయల్వెడలె నని మూలము చెప్పుచున్నది. (1-3-157). నన్నయ దానికి భుజగాధి నాథు మనము కూడఁ "గల్పాంత

సంజాత ప్రోద్ధత బాడబానల శిఖా శంకాధికాతంకమై భేదిల్లె" నను వాక్యమును గూడఁ జేర్చి యుండెను.

3. శుక్రుఁడు విజోదరస్థుఁడైన కచునికి సంజీవని నుపదేశించిన పిమ్మట నాతఁ డుదరము చీల్చుకొని "ఉదయాద్రి దరీముఖమున నుదితుండగు పూర్ణ హిమ మయూఖుఁడు వలె" బయటికి వచ్చెననియుఁ, బిమ్మట నతనిచే సంజీవితుఁడైన "శుక్రుఁ డుచ్చారణ దక్షుచేత నభిహితంబగు శబ్దంబు నట్ల పోలె" (ఆది-3-126, 127) వెలింగె ననియు వర్ణించిన చోట్ల నన్నయ వాడిన యమూలకములైన యుపమానములు మిక్కిలి రమణీయముగా నున్నవి.

4. దుష్యంతుఁడు శకుంతలను "నీ వెవ్వతెవో నే నెఱుఁగను. ఎందుండి వచ్చితివో యచ్చటికిఁ దిరిగి పొ" మ్మని భంగించి పలుక నామె వ్రీడితయై, దుఃఖవశమున విసంజ్ఞవలె స్థాణువు వలె నచలయై నిల్చె నని మూలమున వ్రాయఁబడినది :

"సైవముక్తావరారోహా వ్రీడితేవ మనస్వినీ
విసంజ్ఞేవచ దుఃఖేన తస్థౌ స్థాణు రివాచలా" (1-68-20).

నన్నయ యామె రాజు మాటలు విని "వెలువెలనై వెచ్చ నూర్చి నిశ్చేష్టితయై కెందమ్మి రేకుల వలనం దొరంగు జలకణంబుల పోలెఁ గోపారుణిత నయనంబుల బాష్ప కణంబులు దొరంగం దల వాంచి" యాతనిఁ జూచె నని సాలంకారమైన రచన సాగించెను

5. అస్త్ర విద్యా ప్రదర్శన సందర్భమున నర్జునుఁడు విద్యా ప్రదర్శనము నకై రంగమున కరుదేరఁగనే ప్రజ లాతని గుణగణములఁ బ్రశంసింప మొదలిడిరి. అప్పు డా మాటలు విని కుంతి హర్షవిస్తారిత లోచనయై నందనుఁ గాంచి మిక్కిలి యుప్పొంగెను కుంత్యాః ప్రస్నవ సమ్మిశ్రైరస్రైః క్లిన్న మురోఽ భవత్ " అని మూల మామె యానందమును వర్ణించెను. నన్నయ :

చారు మనస్సమ్మదరస పూరము వెలివేర్చు నట్లు పొలఁతికి విగళ
న్నూరి స్తన జనిత పయోధారలు నానంద బాష్ప ధారలు నొప్పెన్ ".
(ఆది-౬-20)

అని మూలము నందలి భావమున కాలంకారికమైన వన్నె చేకూర్చెను. ఆ సందర్భముననే యర్జునుఁ డస్త్ర విద్యఁ జూపుటకై రంగమున కరుదెంచె నని విదురు వలన నెఱింగి ధృతరాష్ట్రుఁడు,

"ధన్యో ఽస్మ్యనుగృహీతో ఽస్మి రక్షితో ఽస్మి మహామతే
పృథారణిసముద్భూతై స్త్రిభిః పాండవవహ్నిభిః". (125-17)
అని తన సంతోషమును వెలిపుచ్చెను. నన్నయ యందలి భావమును బెంచి,
"భూరి నిజ ద్యుతి తోడఁ బృథారణి సంభూత పాండవాగ్ని త్రితయం
బారఁగ నస్మత్కుల దురితోరు త రారణ్య దాహ మున్నతిఁ జేయున్".
(ఆది-౬-124)
అని రూపకమును గొనసాగించెను.

సభా పర్వము :-

6. పాండవులు సభాసీనులై యుండఁగా వారినిఁ జూచుటకై నారదుఁ డరుదెంచె నను సందర్భమున మూలమునందు "నారదః సుమహాతేజాః ఋషి భిస్సహితస్తదా, లోకాననుచరన్ సర్వానాగమత్తాం సభామృషిః". (2-5-2) అని వ్రాయఁబడినది. "సుమహాతేజాః" అను విశేషణమును నన్నయ :
"నీరజ మిత్త్రుఁడేల ధరణీ గతుఁడయ్యెడు నొక్కొ యంచు వి
స్మేర మనస్కులై జనులు మెచ్చి నిజద్యుతి సూచు చుండఁగా
నారదుఁ డేగుదెంచె గగనంబున నుండి సురేంద్ర మందిర
స్ఫార విలాస హాసి యగు పార్థ గృహంబునకుం బ్రియంబునన్"
(సభా-౧-22.)
అని యాలంకారికముగాఁ బెంచి నారదుని తేజో విశేషమును బ్రకటించెను.

7. నారదుఁ డింద్ర సభను వర్ణించి చెప్పుచు మూలమున :
"త త్రైవాప్సరసో రాజన్ గంధర్వా శ్చ మనోరమాః
నృత్యవాదిత్రగీతై శ్చ హాస్యై శ్చ వివిధై రపి
రమయన్తి స్మ నృపతే దేవరాజశతక్రతుమ్". (2-7-21.)
అని గంధర్వులు నప్సరసలును నృత్యవాదిత్ర గీతముల చేతను వివిధములగు హాస్యముల చేతను దేవేంద్రుని రంజింతు రని చెప్పఁబడినది. నన్నయ :
"అతుల విభూతితో మణిమయాభరణ ద్యుతు లొప్పఁగా శత
క్రతుఁడు శచీసమేతుఁడయి కాంచనచారు విమాన మాలికా
గత దివిజోత్తముల్ గొలువఁగాఁ గొలువుండు వరాప్సరోంగనా
యత విలసత్కటాక్ష కుసుమార్చిత సుందర వక్త్ర చంద్రుఁడై".
(సభా-౧-63)
అని రూపకాలంకారమును గూర్చి యిచ్చటి భావమునకు వన్నె కలిగించెను.

8. కుబేరుని సభ :

" దివ్యా హేమమయై రుచ్చైః పాదపై రుపశోభితా

.... .... .... .... .... ....

సితాభ్రశిఖరాకారా ప్లవమా నేవ దృశ్యతే ". (2-10-3)

అని మూలము వర్ణించు చున్నది. అది సౌవర్ణ పాదపోప శోభిత మగుటచే నన్నయ " కనకమయ తరులతాలంకృతంబయి తటిల్లతా విచిత్ర శరదంబు దంబు ననుకరించుచుండు " నని వ్రాసి యుపమాలంకారమునకు సంపూర్ణత కలిగించెను. కనకపాదప శోభితమైనది తటిల్లతా విచిత్ర శరదంబు వలె నుండు ననుట యుక్తము కాని వట్టి సితాభ్ర శిఖరాకారమై యుండు ననుట యుక్తము కాదు గదా.

9. ధర్మరాజునకు రాజ సూయాచరణమునం దుత్సాహము కలిగించుచు భీముఁడు మూలమున :

" కృష్ణేన యో మయి బలం జయం పార్థే ధనంజయే

మాగధం సాధయిష్యామో వయం త్రయ ఇ వాగ్నయః ". (2-14-9)

అని చెప్పినట్లున్నది. ఇందు భీముని యహంకారము కొంత గోచరించు చున్నది. అందుచే నన్నయ మొదటి పాదమును విడిచి :

" ఈ హరి కరుణయు నర్జును సాహాయ్యముఁ గలుగ నీ ప్రసాదమున జగద్

ద్రోహం జరాసంధు మహా సాహసు వధియింతు నుగ్ర సంగ్రామమువన్ " (సభా. ౧-124)

అని భీముఁడు చెప్పినట్లు వర్ణించి యౌచిత్యమును బ్రదర్శించెను. పిమ్మట "వయం త్రయ ఇవాగ్నయః" అను మూలము నందలి యుపమానమును సర్వాంగ సుందరము చేయుటకై యీ క్రింది పద్యమును గల్పించెను :

"అనఘ యేము మువ్వురము మూఁడగ్నులట్లు

నీ మహా యజ్ఞ కార్యంబు నిర్వహింతు

మా జరాసంధ పశువున నఖిల శాత్ర

వాహుతులఁ జేసి తృప్తుల మగుచు బలిమి". (సభా. ౧-126)

10. హంస డిభకులు మరణించుటచే జరాసంధుఁడు :

" అయన విహీనుఁడౌ సవిత్రునట్లు విఖండిత పక్షతి ద్వయుం
డయిన ఖగేంద్రునట్లు. ......" నుండె నని నన్నయ వర్ణించెను.
(సభా. ౧-160)

ఇందలి యుపమానములు రెండును దత్కల్పితములే.

11. భీముఁడు జరాసంధునిఁ జంపునప్పుడు :

"భ్రామయిత్వా శతగుణం భుజాభ్యాం భరతర్షభ
బభంజ పృష్ఠే సంక్షిప్య నిష్పిష్య విననాద చ ". (స. 22-6)

అని మాత్ర మున్నది. నన్నయ యిందలి భావమును బెంచి

"అతనిఁ బట్టి యెత్తి నిహతాహిత వీరుఁడు వాని ముక్కునన్
వాతను గర్ణరంధ్రముల వారక శోణితధార లొల్కఁగా
వాతసుతుండు వీచె శతవారము లుద్ధత చండవాత సం
ఘాత వివర్తమాన తృణఖండసముం డగుచుండ మాగధున్ ".
(సభా. ౧-209).

అను పద్యమున భీముఁడు జరాసంధుని వీచిన తెఱంగు విశదముగా వర్ణించెను. వాతసుతుఁడైన భీముఁడు తృణఖండ సమానుఁ డగుచున్న యాతని శత వారములు వీచె ననుట యెంతయు నౌచిత్య భాసురమై యున్నది.

12. ద్యూతార్థమై పాండవులు ద్రౌపదితోఁగూడ హస్తినాపురమున కరిగినపుడు మూలమున :

" యాజ్ఞసేన్యాః పరామృద్ధిం దృష్ట్వా ప్రజ్వలితా మివ
స్నుషా స్తా ధృతరాష్ట్రస్య నాతిప్రమనసో ఒభవన్ ". (సభా. 52-32)

అను శ్లోకమున్నది. " పరామృద్ధిం " అను మాటను నన్నయ :

"అఖిలలావణ్యపుంజంబు నబ్జభవుఁడు మెలఁతగా దీని యందు నిర్మించె నొక్కొ-
క్కానినాఁ డిట్టి కాంతి యేకాంతలందు వేల లేదని సామర్షహృదయ లయిరి"

(సభా. ౨-160). అను పద్యమునందలి మొదటి రెండు పాదములలో నాలం కారికముగఁ బెంచి, ద్రౌపదీ సౌందర్యము యొక్క పరాకాష్ఠను బ్రదర్శించెను.

అరణ్యా పర్వము :-

13. విదురుఁడు ధృతరాష్ట్రునిచేఁ దిరస్కృతుఁడై వనమున నున్న పాండవుల కడ కరుదెంచి ధర్మరాజుతోఁ దాను వచ్చిన కారణ మెఱింగించి "రూప లావణ్యవతియై వృద్ధశ్రోత్రియుని చేతం బరిణీతయైన తరుణియుం బోలె రాజ్యలక్ష్మి విరక్తయ కాని ప్రీతిఁ బుట్టింప" దని చెప్పినట్లు నన్నయ వ్రాసి యుండెను. ఇచ్చటి యుపమాన మమూలకము. మూలమున విదురుఁడు ధృతరాష్ట్రునిఁ గూర్చి చెప్పుచు :

"న శ్రేయసే నీయతే ఽజాతశత్రో
స్త్రీ శ్రోత్రియ స్యేవ గృహే ప్రదుష్టా
బ్రువ న్నరుచ్యై భరతర్షభస్య
పతిః కుమార్యా ఇవ షష్టివర్షః." (3-6-15).

అని చెప్పియుండెను. "స్త్రీ శ్రోత్రియస్యేవ" ఇత్యాదిగా నిటఁ గల యుపమానము మనసున నుంచుకొని నన్నయ మార్చి దానిని దుర్యోధన పరముగా నుపయోగించెను. ఈ యుపమానమును ధృతరాష్ట్రుని విషయమునఁ గాక దుర్యోధనుని విషయమున నుపయోగించుట చాల యుక్తముగా నున్నది.

14. అర్ధరాత్ర సమయమున గజయూథములు వచ్చి నిద్రాసక్తులైన వనుప లోని వారిలోఁ బెక్కు తెఱంగుల హింసించెను. ఇచ్చట నన్నయ "వనుప యిట్టి పాటఁ బెనుపఱి యవినీతు సిరియుఁ బోలె వడఁగి విరిసి చనియె" అని వాడిన యుపమాన మాతఁడు కల్పించినదే. ఈ సందర్భముననే దమయంతి దైవ వశమున మరణమునకుఁ దప్పి,

"ఇచ్చన్నతోఁ జని యివ్వన క్లేశంబుఁ దలుఁగుదు నని బుద్ధిఁదలఁచి యున్న
నురుతర సార్థపయోరాశి హస్తియూ థాగస్త్యుచేఁ బీతమయ్యె నదియు."

(అరణ్య. ౨-113).

అని విచారించినట్లు నన్నయ రచించెను. ఇందలి రూపకాలంకార మాతని కల్పనయే. ఇందలి యుపమానము సార్థము యొక్క విస్తృతిని, అది పొందిన ధ్వంసమును జక్కఁగా సూచించు చున్నది.

15 నలుఁడు ప్రమద వనమున విహరించుచు హంసలను గాంచె నను సందర్భమున మూల మందా హంసలు జాతరూప పరిచ్ఛదము లని చెప్పఁబడినది.

(3-50-18). నన్నయ యీ విశేషమును విడిచి "అంతరిక్ష ( శ్రీ ) కాంతా హారావళియుంబోలె హంసావళి యవనీతలంబున కవతరించిన" (అర. ౨-11) అని సరూపక మైన చక్కని యుపమానముఁ గల్పించెను. ఈ సందర్భముననే నలుఁడు హంసలలో నొకదానినిఁ బట్టుకొనె ననియు, నప్పు డది నలునితో "దమయంతీ సకాశమున నిన్ను వర్ణించెద నని" చెప్పె ననియు మూలమం దున్నది నలుఁడు హంసను బట్టుకొనిన విధమును, అప్పు డితర హంసలు దానిని విడువఁజాలక యంత రిక్షమునఁ దిరుగు చుండిన విధమును నన్నయ సహజముగను సాలంకారముగను వర్ణించెను:

"వీరసేన సుతుఁడు వీర్యుండు హంసల నడ బెడంగుఁ జూచి నగుచు వాని
నెగచియెగచి యందు నెగయ కుండఁగ నొక్క హంసఁ బట్టుకొనియె నతి రయమున.
దాని విడిచి పోవఁగా నోప కఱచుచు నంతరిక్షమునను హంసలెల్లఁ
బిండు గట్టి తిరుగు చుండె వాతోద్ధూత శారదాభ్రశకల చయముఁబోలె".
(అర. ౨-12, 13).

ఇందలి రెండవ పద్య మంతరిక్షమునఁ దిరుగు చున్న హంసల యాకృతినే కాక, సంఘీభావమును మన స్తత్త్వమును మనోహరముగా వెల్లడించు చున్నది.

నన్నయ మూలమందు లేకున్నను బెక్కుపద్యములం దర్థాంతరన్యాసాలంకారములను గల్పించెను. విశేషమును సామాన్యముచేఁగాని సామాన్యమును విశేషముచేఁ గాని సమర్థించుట యీ యర్థాంతరన్యాసము లక్షణము. నన్నయ చాల పద్యములలో నంతమున సామాన్యాంశములను గల్పించి యీ యలంకారమునకుఁ దా వొసంగెను. ఇట్టి వాతని గ్రంథమున శతాధికముగా నున్నవి. నాలుగైదు మాత్రము సూచించెదను.

"గురుకార్య నిరతులగు సత్పురుషుల కగు ఁటరుదె యధిక పుణ్య ఫలంబుల్"
(ఆది. ౧-119).

ధర్మవు నుచితంబుఁ దప్పని వారల సదమలాచారుల నుదిత సత్య
రతుల నఖిలలోక హిత మహారంభుల భూరిగుణుల నిర్జితారి
వర్గులై వెలుఁగువారికై వంబరక్షించుదురిత విధులనెపుడుఁ బొరయకుండ"
(ఆది. తృతీ-14).

.... ——— ... ...... ... .... . .. అనంత సంతత
వ్రతనియమ ప్రభావు లగు వారలఁ బొందునె దేహ దుఃఖముల్."
(ఆది. 7-120).

"........ ... ........................ ....... ........ .. సౌ
మ్యాకృతులు గానివారల వాకులు శిక్షలు నుపద్రవంబులు కావే."
(ఆది. 8-41).

సభా పర్వము :-

"........ ... . . పెద్దల చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్."
(సభా. ౨-19).

".. ... . . .. .. . ...... ..........దైవము చెయిదిన్,
నిర్మిత మయిన శుభా శుభ కర్మఫలం బెట్టు దేహి గడవఁగ నేర్చున్."
(సభా. ౨-279).

"........ ... ....... ....... ... .........ధనమెట్టి వారికిం
గడుకొని చేయ కుండునె జగన్నుత గర్వము దుర్విమోహమున్."
(సభా. ౧-31).

అరణ్య పర్వము :-

"ఎట్లయేనిఁ గూర్తు రింతులు మా కని విశ్వసించువారు వెడఁగు లెందు."
(అర. ౨-164).

"ఎందుఁ గుడిచిన చోటికి నెగ్గుసేయ రెట్టి దుర్జనులైనను వెఱుక విడిచి."
(అర. తృతీ-390)

V. విశేషముల నధికముగా వాడుట :-

వ్యక్తులను వర్ణించు నప్పుడు, అందును ముఖ్యముగా వారిని మొదటఁ బ్రవేశ పెట్టు నప్పుడు, నన్నయ మూలములో లేని విశేషణముల నధికముగా వాడు చుండును. ఇట్టివాని కాతని భారతమున ననేక నిదర్శనము లున్నవి.

"జనమేజయః పారిక్షితః" (1-3-1)

"ప్రతిహత శత్రువిక్రముఁడు పాండవ వంశవివర్ధనుండు సు
వ్రతుఁడు పరీక్షి దాత్మజుఁ డవద్య విదూరుఁ డుదారకీర్తిని
ర్మిత వివిధాధ్వరుండు జనమేజయుఁడన్ జనపాలుఁ డుత్తమ
స్తుతమతి దీర్ఘ సత్ర మజితుం డొనరించె శుభాభికాంక్షియై."(ఆది-౧-82)

"అగ్నిరాశి రి వోద్భాసన్ సమిద్ధో ఽ తిభయంకరః
ప్రవృద్ధః సహసా పక్షీ మహాకాయో నభోగతః" (1.20-5)

"ఆతత పక్షమారుతరయ ప్రవికంపిత ఘూర్ణితాచల
వ్రాత మహార్ణవుండు బలవన్నిజ దేహ సముజ్జ్వల ప్రభా
ధూత పతంగ తేజుఁ డుదితుండయి తార్క్ష్యుఁడు......." (ఆది.౨-38).

"అభ్యాగచ్ఛ దృషి ర్విద్వాన్ కృష్ణ ద్వైపాయన స్తదా
జనయామాస యం కాళీ శక్తేః పుత్త్రా త్పరాశరాత్
కన్యైవ యమునా ద్వీపే పాండవానాం పితామహం
జాతమాత్ర శ్చ య స్సద్య ఇష్ట్యా దేహ మవీవృధత్
వేదాం శ్చాధిజగే సాంగా న్సేతిహాసా న్మహాయశాః
యం నాతి తపసా కశ్చి న్న వేదాధ్యయనేన చ
న వ్రతై ర్నోపవాసై శ్చ న ప్రసూత్యా న మన్యునా
వివ్యా సైకం చతుర్ధా యో వేదం వేదవిదాం వరః
పరావరజ్ఞో బ్రహ్మర్షిః కవి స్సత్యవ్రత శ్శుచిః
యః పాండుం ధృతరాష్ట్రం చ విదురం చా ప్యజీజనత్
శంతనో స్సంతతిం తన్వన్ పుణ్యకీర్తి ర్మహాయశాః" (1-54, 2-6)

"పరమ బ్రహ్మనిధిం బరాశర సుతున్ బ్రహ్మర్షి ముఖ్యున్ దయా
పరుఁ గౌరవ్య పితామహున్ జనహిత ప్రారంభుఁ గృష్ణాజినాం
బరు నీలాంబుదవర్ణదేహు ననురూప ప్రాంశు నుద్యద్దివా
కరరుక్పింగ జటాకలాపు గతరాగద్వేషు విర్మత్సరున్".
(ఆది. కృతీ-3)

"తీర్థయాత్రాం పరిక్రామ న్నపశ్య ద్వై పరాశరః" (1. 57-56)

"గత మదమత్సరుండు త్రిజగ ద్వినుతుండు వశిష్ఠ పౌత్త్రుఁ డు
న్నతమతి శక్తి పుత్త్రుఁ డఘనాశన ఘోర తపోధనుండు సు
వ్రతుఁ డయి తీర్థయాత్ర చనువాఁడు పరాశరుఁ డమ్మునీంద్రుఁడు"
(ఆది. కృతీ-36)

"తపసా దగ్ధకిల్బిషం - విశ్వామిత్రం తపస్యన్తం" (1. 66-2)

"...... మునీశ్వర ప్రవరుఁ గౌశికుఁ గౌశిక చిత్త భీతి సం

జనన మహా తపశ్చరణ సంయత చిత్తు విరక్త చిత్తజున్".
(ఆది. చతుర్థ-41).

"రూప సత్త్వ గుణోపేతా ధర్మా రామా మహావ్రతా
దుహితా కుంతి భోజస్య కృతే పిత్రా స్వయంవరే". (105.1)

"యదుకుల విమల పయః పయోనిధి సుధాకర రేఖఁ గమనీయ కాంతి నిలయ
వనవర తాన్నదానాభి తర్పిత ముని విప్రజనాళిఁ పవిత్ర మూర్తి
వినయాభిమాన వివేక సౌజన్యాది సదమల గుణరత్న జన్మభూమిఁ
బరమ పతివ్రతా భరణాభిశోభితఁ దామర సేక్షణఁ దాల్మియందుఁ
బృథివిఁ బోని దానిఁ బృథయను కన్యక నధిక వీర్యుఁడై స్వయం వరమునఁ
బడసి.................. .. ... " (ఆది. పంచమ-34)

గంగ భీష్మునిఁ దెచ్చి శంతనుని కిచ్చు సందర్భమున నాతని గుణగణములు వర్ణించుచు "ఆత్మ విజ్ఞానంబు నందు సనత్కుమారాదుల యట్టిఁడ యనఘమూర్తి" యని చెప్పియుండెను. (ఆది. చతుర్థ-168). ఈ విశేషణము మూలమున లేదు. కాని శాంతి పర్వమున గోచరించు భీష్ముని యాత్మజ్ఞాన పారీణతను బట్టి చూచినచో నీ విశేషకము నిటఁ గూర్చుట యెంత యౌచిత్య శోభితమో తేట తెల్లమగును.

సభా పర్వమున :-

"ఉమాపతిః పశుపతిః శూలధృ గ్భగ నేత్రహా
త్ర్యంబకో రాజశార్దూల।" (సభా. 10-20).

"వానికి నెయ్యుఁడై యమర వంద్య పదాంబుజుఁ డంబికా బృహ
త్పీన పయోధరాగ్ర పరిపీడిత వక్షుఁడు భూషణీ కృతా
హీనుఁ డశేష లోక గురుఁ డీశ్వరుఁ డెప్పుడు నంద యుండు".
(స. ౧-77)

"ద్రౌపద్యాః ప్రేక్షమాణాయాః సవ్య మూరు మదర్శయత్".
(స. 63-12)

"అమ్మదితన్ విభీత హరిణాక్షిఁ గలాప విభాసి కేశ భా
రమ్మున నొప్పుదాని . " (సభా. ౨-247)

అరణ్యా పర్వము :-

ధౌమ్యుఁడు ధర్మరాజునకు సూర్యుని యష్టోత్తర శత నామములను జెప్పుటకు ముందు మూలములో లేకున్నను నన్నయ సూర్య భజనము వలన మనోరథ ఫలంబులు చేకూరు నని తెల్పిన శ్లోక లయగ్రాహి వ్రాసెను. (అర. ౧-40)

"వారిరుహ మిత్రు నమరోరగమువిద్యుచర చారణ గణప్రణుత
చారుగుణు ..." (అర. ౧-40)

విత్యాదిగా నిందుఁ గల సూర్య విశేషణము లన్నియు నన్నయ కల్పితములే.

"ఆససాద మహాత్మానం త్ర్యక్షం త్రిపురమర్దనం
శంకరం భవ మీశానం శూలపాణిం పినాకినం
త్ర్యంబకం శివ ముగ్రేశం బహురూప ముమాపతిమ్."

(3-104-10-11).

సగరుఁడు సపత్నీకుఁడై కైలాసమున కేగి శివు నర్చించినప్పటి శివుని వర్ణనమిది. నన్నయ యిందలి విశేషణములు కొన్ని తొలఁగించి క్రొత్తవానిఁ గొన్నిటిఁ గలిపి యిట్లు వ్రాసెను.

"దక్షమఖక్షయకరు, విట లాక్షజ హంత భక్ష భక్షి తానంగు, విరూ
పాక్షు, మహోక్షధ్వజుఁ, బ్రత్యక్షము గావించె నుగ్రతపమునఁ బేర్మిన్".
(అర. తృతీ-49)

"తయో స్సంవదతోరేవం తదా పాండవయో ర్ద్వయోః
ఆజగామ మహాయోగీ వ్యాస స్సత్యవతీ సుతః." (3-37-20)

"వారల పుణ్యోదయమున వారిజభవ విభుఁడు లోకవంద్యుఁడు వచ్చెం
బారాశర్యుఁడు ధర్మశరీరుఁడు కృష్ణాజినోత్తరీయుఁడు ప్రీతిన్."
(అర. ౧-272)

D. మూలమునఁ గొన్ని చోట్ల నించుకైన సూచన లేకుండఁ గథలు హఠాత్తుగా (abrupt) నారంభింపఁ బడు చుండును. ఒక కథకును మఱియొక కథకును

గల సంబంధ మస్పష్టముగా నుండును. కథారంభమునకు ముందు వేయఁబడు ప్రశ్నకును దరువాతి సమాధానమునకును సంబంధ ముండదు. ఇట్టి యెడల నన్నయ వానికిఁ గల పరస్పర సంబంధమును సూచించుచు వాని కచ్చటఁ గల స్థానమును సమర్థించుచు నొక విధమైన క్రమమును అవిచ్ఛిన్నతను గలిగించుటకు యత్నించు చుండును. ఆతని కథారచన ప్రసన్నముగాఁ గనిపించుట కిదియు నొక హేతు వని చెప్పవచ్చును.

1. ఉత్తంకుని (ఉదంకుని) వలనఁ దక్షకుఁడు తన తండ్రిని జంపె నని యెఱింగి జనమేజయుఁ డా నాగరాజు నెడఁ గుపితుఁడై తన తండ్రి మరణించిన క్రమమును గూర్చి మంత్రుల నడిగె నని మూలమునఁ జెప్పఁబడినది. [(1-3-193) " అపృచ్ఛ చ్చ తదా రాజా మంత్రిణః స్వాన్ సుదుఃఖితః- ఉత్తంకస్యైవ సాన్నిధ్యే పితుః స్వర్గ గతిం ప్రతి. " ]. నాల్గవ అధ్యాయమున సౌతి శౌనకాదులకడ కరుగుట వర్ణింపఁబడినది. అయిదవ అధ్యాయమున శౌనకుఁడు భృగు వంశమును గూర్చి చెప్పు మని యడుగఁగా సౌతి దానినిఁ జెప్పుట కారంభించి న ట్లున్నది. ఇందు మూఁడవ యధ్యాయము తుదికిని దరువాతి యధ్యాయము లందలి కథా క్రమమునకును సంబంధ మేమియును లేదు. నాల్గవ అధ్యాయము మొదట నంతకుఁ బూర్వము జరిగిన కథతో నేమియు సంబంధము లేని క్రొత్త విషయ మారబ్ధమై నట్లున్నది. మరల 13వ అధ్యాయము మొదట శౌనకుఁడు సౌతిని :

" కిమర్థం రాజశార్దూలః స రాజా జనమేజయః
సర్పసత్రేణ సర్పాణాం గతో ఽ న్తం త ద్వదస్వ మే
ఆస్తీక శ్చ ద్విజశ్రేష్ఠః కిమర్థం జపతాం వరః
మోక్షయామాస భుజగాన్ దీప్తా త్తస్మా ద్ధుతాశనాత్
కస్య పుత్ర స్స రా జాసీత్ సర్పసత్రం య ఆహరత్
స చ ద్విజప్రవరః కస్య పుత్రో వదస్వ మే." (1-13-1-3)

అని యడుగ సౌతి జరత్కారు చరిత్రమును జెప్ప మొదలిడెను. శౌనకుఁడు సర్ప యాగమును గూర్చి ప్రశ్నించుటకు 12 వ అధ్యాయము చివర సహస్రపాదుఁడు " క్షత్రియుఁడైన జనమేజయుఁడు సర్పముల నెట్లు హింపించెను.

సర్పము లాతనిచే నేల హింసితము లయ్యెను. అవి యాస్తీకునిచే నేల మోషితము లయ్యె " నని రురుఁ డడిగిన ప్రశ్నకు సమాధానముగా

" శ్రోష్యసి త్వాం రురో సర్వ మాస్తీక చరితం మహత్
బ్రాహ్మణానాం కథయతాం ." (1-12-3)

అని చెప్పుటయే కారణము. జరత్కారు చరిత్రమును జెప్పిన పిమ్మట సౌతి 13 వ అధ్యాయము చివర "ప్రబ్రూహి భృగు శార్దూల కిం భూయః కథ్యతామితి" యని శౌనకు నడిగెను. శౌనకుఁడు 14 వ అధ్యాయము మొదట "సాధువైన యాస్తీకుని చరిత్ర మరల వినవలెనని చాల కుతూహలము కలుగు చున్నది. కావున దానినే విస్తరముగాఁ జెప్పు" మని యడుగ సౌతి గరుడోపాఖ్యానమును జెప్ప మొదలు పెట్టెను. పిమ్మట 36 వ అధ్యాయము మొదట జరత్కారున కా పేరు కలుగుటకుఁ గారణ మేమని శౌనకుఁ డడుగ సౌతి దానికి సమాధానము చెప్పి " జరత్కారుఁడు తపోనిరతుఁడై భార్యను గ్రహింప నొల్లకుండెను. అతఁడు భూమి యంతయుఁ దిరిగియు భార్యను గ్రహింపఁ గాంక్షింపఁ డాయె "నని కొంచెము తెల్పి హఠాత్తుగా పరీక్షిద్వృత్తాంతమును వివరించుట కుపక్రమించెను. ఈ విధముగా మూలమున సౌతి యా యా కథ లచ్చటఁ జెప్పుటకు హేతువులు కనఁబడుట లేదు. అతఁడు తన కేది తోఁచిన నది చెప్పఁ దొడంగినట్లు కవిపించు చున్నది. నన్నయ తెలుఁగు భారతమునఁ బై లోపమును సవరించి యొక్కొక్క కథకు ముం దది యచ్చటఁ జెప్పఁబడుటకు సంబంధము కల్పించెను.

తెలుఁగు భారతమున నుదంకుఁడు జనమేజయునకు సర్పయాగ బుద్ధి పుట్టించె నవి విని శౌన కాది మహర్షులు సౌతిని :

" అమిత జగద్భయంకర విషాగ్నియు నప్రతి హవ్యమాన వీ
ర్యము గలయట్టి సర్పముల కా జనమేజయు చేయు సర్పయా
గమున నుదగ్ర పావక శిఖాతతులం దొరఁగంగఁ గారణం
బమల చరిత్ర యేమి చెపు మయ్య వినం గడు వేడ్క యయ్యెడున్."
(ఆది. ౧-127).

అని యడిగిరి. అంత సౌతి " తొల్లి సర్పకుల జనని యైన కద్రువ శాపంబు కారణంబునం జేసి జనమేజయు సర్పయాగంబున సర్పాభక్షకుండైన యగ్ని

యందు సర్పంబుల కెల్ల నకాండ ప్రళయం బైన దాని భృగువంశజుం డైన రురుఁడు గావించు సర్పఘాతంబు సహస్రపాదుఁ డుడిగించినట్లు జరత్కారు సుతుం డైన యాస్తీకుం డుడిగించె దీని సవిస్తరంబుగాఁ జెప్పెద దత్తపోధను లరై వినుం డని భృగువంశ కీర్తనంబు నాస్తీకు చరితంబును జెప్పం దొడంగె " (ఆది. ౧-128). ఈ విధముగా సమమానము కల్పించి నన్నయ భృగువంశ చరిత్ర కిచటఁ బ్రసక్తి కలిగించెను.[1] లేనిచో భృగువంశ కథనమున కిచ్చట స్థానమే లేక యుండును. అట్లే యాతఁడు సహస్రపాదుఁడు రురునకుఁ జేసిన హితోపదేశమున " బ్రాహ్మణు లహింసాపరు లొరులు చేయు హింసలు వారించు పరమ కారుణ్య పుణ్య మూర్తులు. జనమేజయుం డను జనపతి చేయు సర్పయాగంబునందుఁ గద్రూ శాపంబున నయ్యెడు సర్పకుల ప్రళయంబును భవత్పితృశిష్యుం డైన యాస్తీకుం డను బ్రాహ్మణుండ కాదె యుడిగించె " నని చెప్పినట్లు సౌతి తెల్పుచుండ శౌనకాదులు :

"ఒరుల వలనఁ బుట్టు నోటమియును వెగ్గఁ బొరయ కుండ నరసి పుత్త్రివరులఁ
దగిలి కాచునట్టి తల్లి సర్పములకు నేల యలిగి శాప మిచ్చె నయ్య "

(ఆది-౧-159)

అని ప్రశ్నించిరి. ఈ ప్రశ్నకు సమాధానముగా సౌతి ద్వితీయాశ్వాసమున గరుడోపాఖ్యానము వివరించెను. ఈ విధముగా నిచ్చట నన్నయ కద్రువ

---

1. విశ్వమునకు సర్వభక్షకుం డైన యగ్నియందు సర్పంబుల కెల్ల నకాండ ప్రళయ మయ్యె నని సౌతి చెప్పఁగానే శౌనకాదు లగ్నికి సర్వభక్షకత్వ మెట్లు కలిగె నని ప్రశ్నించుట సమంజసము. భృగువంశ కథనము నందలి ప్రధానాంశ మదే. శ్రీకృష్ణభారతము నందీ సందర్భమున "అని చెప్పిన శౌనకాదు లిట్లనిరి. ఎట్లు దంకప్రేరితుఁ డైన జనమేజయుం డొనర్చు సర్పయాగంబున సర్పంబు లెల్లం ద్రెళ్లుటకును యాగంబున కంతరాయము కలుగుటకును వైశ్వానరుండు సర్వభక్షకుం డయి యాగంబున సర్పంబులఁ దినుటకును గారణం బున్న యెడల సవిస్తరంబుగఁ జెప్పు మనిన నక్కథకుండు ...... అవహితుల రయి వినుం డని యిట్లనియె " నని యున్నది. (ఆది. ౨-108). శౌనకాదు లీ ప్రశ్న వేయుట యిచ్చట నెంతో సమంజసముగా నుండుటయే కాక జరిగిన కథకును ముందు వచ్చు కథకును సంబంధము కలుపు చున్నది. శ్రీ కృష్ణమూర్తిశాస్త్రి గారి క్రమ మే ప్రతిలోఁ జూచియుండిరో తెలిసికొనుట కవకాశము లేదు.

పుత్త్రికుల శపించుటకుఁ గారణ మేమని శౌనకాదు లడుగుటకుఁ బ్రేరకమైన వాక్యము నంతకు ముందు కల్పించి గరుడోపాఖ్యానమునకుఁ బ్రసక్తి చేకూర్చెను. ద్వితీయాశ్వాసమున జరత్కారు చరిత్రము చెప్పిన పిమ్మట నాతఁడు "ఆ జనమేజయుండు తక్షక విషానలంబునం దన జనకు పంచత్వం బుదంట వలన వెఱింగి మంత్రులం జూచి యిది యేమి నిమిత్తంబు దీని సవిస్తరంబుగాఁ జెప్పుండని" యడుగఁగా మంత్రు లా వృత్తాంతము చెప్పి రని పరీక్షిద్వృత్తాంతమున కుపోద్ఘాతము కల్పించెను. జనమేజయుఁ డీ విషయము మంత్రులను జెప్పుమని యడుగుట మూలమున సమాధాన రహితముగాఁ దృతీయాధ్యాయము చివరనే యున్నది. అచ్చట నున్నదానిని నన్నయ యిచ్చటికిఁ దెచ్చి పరీక్షిద్వృత్తాంతమునకు స్థానము కలుగఁ జేసెను.

2. మూలమునఁ బూరువంశ చరిత్రమైన పిమ్మట 91 వ అధ్యాయమున "ఇక్ష్వాకు వంశ ప్రభవో రాజాసీ త్పృథివీపతిః మహాభిష ఇతి ఖ్యాతః" అని సూచన యేమియు లేకుండ గంగా వసువుల కథ యారబ్ధమైనది. అంతకు ముందరి కథను దీనిని గలుపు సంబంధము ప్రశ్న రూపమున నైన నిట కల్పింపఁబడి యుండలేదు. ఇచ్చట నన్నయ జనమేజయుఁడు పూరు వంశ క్రమము విని:

"నరవరుఁ డగు శంతనున కమరనదికిని నెట్టు సంగమం బయ్యె మహా
పురుషుండు భీష్ముఁ డె ట్లయ్యిరువురకును బుట్టె దీని నెఱిఁగింపు మొగిన్."
(ఆది-చతుర్థ-120)

"మఱి పాండవ ధార్తరాష్ట్ర సంభవంబును సవిస్తరంబుగా వినవలతుం జెప్పు మనిన వైశంపాయనుఁ డిట్లని చెప్పె" నని మూలమున లేని సంబంధము కల్పించెను.

3. మూలము నందు 119 వ అధ్యాయము చివర "ఏవం దుర్యోధనః కర్ణః శకునిశ్చాపి సౌబలః అనేకైరభ్యుపాయైస్తాం జిఘాంసన్తి పాండవాన్. పాండవాశ్చాపి తత్సర్వం ప్రత్యజానన్నరిందమాః. ఉద్భావన మకుర్వన్తో విదురస్యమతేస్థితాః" అని యున్నది. 120వ అధ్యాయము మొదట జనమేజయుఁడు:

"కృపస్యాపి మహాబ్రహ్మ న్సంభవం వక్తు మర్హసి
శరస్తంబా త్కథం జజ్ఞే కథం చాస్త్రాణ్యవాప్తవాన్"

అని ప్రశ్నింపఁగా వైశంపాయనుఁడు కృపుని జన్మాదికముఁ జెప్ప మొదలిడెను.

ముందటి యధ్యాయము చివరఁ జెప్పఁ బడిన కథకును దరువాతి యధ్యాయము మొదట నున్న కథకును సంబంధ మేదియు లేదు. నన్నయ " ఇట్లు దుర్యోధనుఁడు భీమునకుఁ దన సేసిన యెగ్గు లెల్లను గృతఘ్నునకుం జేసిన లగ్గులుమం బోలె నిష్ఫలంబులైన సిగ్గువడి వెండియుఁ బాండవుల కెల్ల నపాయంబు సేయ నుపాయంబు చింతించు చుండె నంత భీష్మ నియోగంబున :

"విలువిద్యఁ గఱచు చుండిరి బలయుతులు గుమారకులు గృప ద్రోణాచార్యుల తోడఁ గలసి యొక్కట నలఘు పరాక్రమ సమేతు లధికస్పర్ధన్ "
(ఆది-పంచమ-180.181)

" అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె :
" కృపుఁడు ద్రోణుఁడు ననఁగ సత్కీర్తులైన వారి జన్మ ప్రకారంబు, వారువచ్చి కౌరవుల కెల్ల గురులైన కారణంబు విప్రముఖ్య, నా కెఱుఁగంగ విస్తరింపు "
(అది-పంచమ-183)

అని కృప ద్రోణాదుల జన్మ కథనమున కుపపత్తి కల్పించెను.

4. మూలమున బ్రాహ్మణ భార్య యైన యాంగిరసి కల్మాషపాదుని శపించిన వృత్తాంతము వేఱే యధ్యాయములో నున్నది. (1-173). నన్నయ యట్లుగాక " అమ్మహీపతి వశిష్ఠుఁ దోడ్కొని యయోధ్యా పురంబున కరిగి సకల ప్రజానురాగ కరుం డయి యమ్మునివరు నతి భక్తిం బూజించుచుఁ బొల్లిఁ రాక్షసుఁ డయి దమయంతీ సహితంబు వనంబునం గ్రుమ్మరియెడి కాలం బొక బ్రాహ్మణ మిథునంబు " ఇత్యాదిగా నా శాపవృత్తాంతమును గథా సందర్భము నందే యిమిడ్చెను. ఇది మిక్కిలి యుచితమై కథ యొక్క అవిచ్ఛిన్నమైన గమనమున కెంతయైనఁ దోడ్పడు చున్నది.

సభా పర్వము :—

5. సభా పర్వము నందలి 60 వ అధ్యాయమున దుర్యోధనుఁడు ద్రౌపదిని సభకుఁ గొని రమ్మని ప్రాతికామిని బంపెను. ద్రౌపది యతని " కిం ను పూర్వం పరాజైషీ రాత్మానం మాం ను భారత " యని ధర్మరాజు నడిగి రమ్మనెను. ప్రాతికామి సభ కరిగి ద్రౌపదీ వాక్యము నెఱింగించెను. యుధిష్ఠిరుఁడు గతసత్త్వుని వోలె విశ్లేష్టుఁ డయ్యెను. అప్పుడు దుర్యోధనుఁడు " ఇహైత్య కృష్ణా పాంచాలీ ప్రశ్న మేతం ప్రభాషతాం ఇహైవ సర్వే శ్రుణ్వన్తు తస్యా

అపృచ యద్వచః '' (2-60-10). అని పలికెను. ప్రాతికామి ద్రౌపది కడకేగి విచారించుచు నా విషయము చెప్పెను. అప్పుడు ద్రౌపది '' విధి విధాన మిట్లు న్నది కాఁబోలును. ధర్మమే నన్ను రక్షించు '' (20.60.13) నని భావించి యూరకుండెను. తరువాత

'' యుధిష్ఠి రస్తు త చ్ఛ్రుత్వా దుర్యోధన చికీర్షితమ్
ద్రౌపద్యాః సమ్మతం దూతం ప్రాహిణో ద్భరతర్షభ
ఏకవస్త్రా అథోనీవీ రోదమానా రజస్వలా
సభా మాగమ్య పాంచాలీ శ్వశుర స్యాగ్రతో ఽభవత్ '' (2-60-14,15)

అని ధర్మరాజు ద్రౌపది కడ కొక దూతను బంపెననియు ద్రౌపది యేకవస్త్రయు, నథోనీవియు రజస్వలయునై, యేడ్చుచు సభ కరుదెంచి మామ ముందు నిలిచెననియుఁ జెప్పఁ బడినది. పిమ్మట దుర్యోధనుఁడు ప్రాతికామితో ''ఆమె నిచ్చటికే తీసికొనిరమ్ము. కురువు లామె తోడనే ప్రత్యక్షముగా మాటాడుదు '' రని చెప్పిన ట్లీ శ్లోకము కనఁబడు చున్నది.

'' తత స్తేషాం ముఖ మాలోక్య రాజా
దుర్యోధనః సూత మువాచ హృష్టః
ఇహై వేతా మానయ ప్రాతి కామిన్
ప్రత్యక్ష మస్యాః కురవో బ్రువన్తు. '' (2-60-16)

ప్రాతికామి ద్రౌపదీ కోప భీతుఁడై యట్లు చేయుటకు జంకుట యెఱింగి దుర్యోధనుఁడు :

'' దుశ్శాస నైష మమ సూత పుత్రః
వృకోదరా దుద్విజతే ఽల్ప చేతాః
స్వయం ప్రగృ హ్యానయ యాజ్ఞసేనీం
కిం తే కరిష్య న్త్యవశా స్సపత్నాః '' (2-60-18)

అని దుశ్శాసనుని ద్రౌపదిని సభకుఁ గొని రమ్మని యాజ్ఞాపించెను. దుశ్శాసనుఁ డన్న యాన శిరసావహించి, ద్రౌపది కడ కరిగి, యామె భీతయై స్త్రీ లున్న యెడకుఁ బరుఁగెత్తఁగా వెంట నంటి, కేశములు పట్టుకొని సభ కీడ్చుకొని వచ్చెను. (2-60 20-28).

మూలమునందలి పై వృత్తాంతమునుజూడఁగా నం దీ సందర్భమున రెండు భిన్న ప్రతు లందలి కథా సందర్భములు మిశ్రితము లైనట్లు కానిపించు చున్నది. లేనిచో ధర్మజుఁడు పంపిన దూత మాటల ననుసరించియే ద్రౌపది సభ కరుదెంచి నట్లు 14, 15 శ్లోకములలోఁ జెప్పఁబడి యుండఁగాఁ దరువాత దుర్యోధనుఁడు ప్రాతికామితో ద్రౌపదిని గొని రమ్మని చెప్పుటకును, నాతఁడు భయపడఁగా దుశ్శాసను నందుకు వియోగించుటకును నవకాశ మే మున్నది? 14, 15 శ్లోకము లను దొలఁగించినచో నీ పునరుక్తి తొలఁగి పోవును. కాని యన్ని ప్రతులలోను గానవచ్చుచున్న వీనిని దొలఁగించుట కాధార మేమున్నది? అందుచే మనకు లభ్యములైన లిఖిత ప్రతు లన్నిటికి మూలమని చెప్పఁదగిన పురాతన ప్రతిలో రెండు భిన్న కథా సంప్రదాయముల సమ్మేళనమునకు యత్న మొనరింపఁ బడె ననియు నది మెలఁకువతోఁ జేయఁ బడని కారణమున నీ పునరుక్తి యేర్పడె ననియు నిశ్చయింప వలసియున్నది. [1]

నన్నయ యిచ్చటి పునరుక్తిని దొలఁగించి రెండు కథలను జక్కఁగాఁ గలిపి రచన సాగించెను. ప్రాతికామి సభ్యు లామె యడిగిన యర్థము నిర్ణయింపఁ దలంచినవారై యామెనే రమ్మని రని చెప్పఁగా ద్రౌపది దుర్యోధను దుశ్చేష్టితం బునకును ధర్మరాజు సమ్మతమునకును వెఱచి ప్రాతికామి వెనుక నేకవస్త్రయు నఘోనీవియునై సభకు వచ్చి కురువృద్ధుల సమీపమున నుండె ననియు, నప్పుడు ద్రౌపదిని జూడ నోపక లజ్జితులై తలలు వాంచియున్న పాండవుల వైలక్ష్య ము నుపలక్షించి దుర్యోధనుఁడు దుశ్శాసనునిఁ బిల్చి " ప్రాతికామి వృకోదరునకు వెఱచు. నీవు పోయి ద్రౌపదిం దోడ్కొని రమ్మని'' పంచె ననియు, నది చూచి ద్రౌపది యతి రయమున గాంధారి యొద్దకు నరిగె ననియుఁ, దరువాత దుశ్శా సనుఁ డామెను వెంట నంటి " నే నురజస్వలను ముట్టకుండు " మని యెంత మొఱపెట్టుచున్నను వినక వెండ్రుకలు పట్టి సభ కీడ్చె ననియు నన్నయ వ్రాసి యుండెను. ఇందు ధర్మజుఁడు దూతను బంపిన వృత్తాంతము విడిచి వేయఁబడి నది. ద్రౌపది రెండవ మాఱు తనదగ్గఱకు వచ్చిన ప్రాతికామి వెంట సభలోని

1. Perhaps it is quite as likely that the original author or redactor of the text to which all our manuscripts go back knew both versions of the story and tried to combine them not very successfully. (సభా. Introduction XXX II Page)

కరిగెను. పిమ్మట దుర్యోధను నానతిపై దుశ్శాసనుఁడు శిరోజములను బట్టి యీడ్చుకొని సభ కీడ్చుకొని వచ్చెను.

6. ఇట్లే 45 వ అధ్యాయము నందలి కథను జెప్పు సందర్భమునఁ గూడ నన్నయ మూలము నందలి పునరుక్తిని, అసామంజస్యమును దొలఁగించి క్రమౌచిత్యములు చెడకుండ రచన సాగించి యుండెను. శకుని ప్రోత్సాహమున దుర్యోధనుఁడు తండ్రితో :

"అయ ముత్సహతే రాజన్ శ్రియ మాహర్తు మక్షవిత్
ద్యూతేన పాండుపుత్రస్య త దనుజ్ఞాతు మర్హసి." (2. 45-40)

అని వేఁడుకొనెను. అతఁడు "విదురుఁడు మహాప్రాజ్ఞుఁడు. నే నాతని శాసనము నందున్నాను. ఆతనితో మాటాడి కార్యమును నిశ్చయించెద" నని తెల్పెను. దుర్యోధనుఁ డంత నా విషయమున విదురు నడిగినచో నాతఁడు తప్పక నివర్తించు ననియు, నప్పుడు తాను దప్పక మరణింతు ననియు నెఱింగించెను. ఆ యార్తవాక్యము నాలించి ధృతరాష్ట్రుఁడు దర్శనీయమైన సభను నిర్మించి తనకు నివేదింపవలె నని శిల్పుల నాజ్ఞాపించెను. విదురుఁడు ద్యూత వ్యవసాయము తనకు సమ్మతము కాదని వివరించెను. ధృతరాష్ట్రుఁడు తానును భీష్మాదులును నుండఁగా ద్యూతమువలన నెట్టి హానియు జరుగ దని తెల్పి, ఖాండవప్రస్థమున కరిగి సుహృద్ద్యూతమునకై ధర్మజునిఁ గొని రమ్మని విదురుని నియోగించెను. ఇచ్చట మూలమున :

"ఇత్యుక్తో విదురో ధీమాన్ నైత దస్తీ తి చింతయన్
ఆపగేయం మహాప్రాజ్ఞ మభ్యగచ్ఛ త్సుదుఃఖితః." (2-45-58)

అని విదురుఁడు దుఃఖితుఁడై భీష్ముని కడ కరిగె నని చెప్పఁబడినది. దీనితో 45 వ అధ్యాయము ముగియు చున్నది.

46 వ అధ్యాయ మీ కథను గొనసాగింపక క్రొత్త త్రోవ ద్రొక్కు చున్నది. జనమేజయుఁడు ద్యూత వృత్తాంతమును దెల్పు మని వైశంపాయను నడిగెను. వైశంపాయనుఁడు చెప్ప మొదలుపెట్టెను. ధృతరాష్ట్రుఁడు విదురు నభిప్రాయము నెఱింగి ద్యూతము మాను మని దుర్యోధనున కుపదేశించెను. దుర్యోధనుఁడు 46 వ అధ్యాయము నుత్తరార్ధము నందును 47, 48, 49 అధ్యాయములందును రాజసూయము యొక్క వైభవమును దనకుఁ జరిగిన

యవమానమును సవిస్తరముగా వర్ణించెను. 50వ అధ్యాయమున ధృతరాష్ట్రుఁడు కొడుకు ననునయించుటకై యత్నించెను కాని లాభములేకపోయెను. 51 వ అధ్యాయమున శకుని యదే మొదటిసారి చెప్పు చున్నట్లుగా ద్యూత ప్రసంగము కావింప దుర్యోధనుఁడందు కంగీకరింపవలె నని తండ్రిని వేఁడుకొనెను. ధృతరాష్ట్రుఁడు విదురునితో నాలోచించి నిశ్చయించెద నని చెప్పెను. విదురుఁడు పాండవ హితంకరుఁడగుటచేఁ దన యిచ్ఛ నీడేర్ప నంగీకరింపఁడని దుర్యోధనుఁడు తెలుప ధృతరాష్ట్రుఁడు కొంత తడవు విచారించి ద్యూతసభా నిర్మాణము కావింప శిల్పి వరుల నాజ్ఞాపించెను. శిల్పు లచిరకాలముననే సభను నిర్మించి ధృతరాష్ట్రునకు నివేదించిరి. ధృతరాష్ట్రుఁడు విదురునిఁ బిల్చి సుహృద్ద్యూతార్థమై ధర్మజునిఁ దీసికొని రమ్మని పంచెను. విదురుఁడు ద్యూత దోషములను దెల్పి యది తన కభిమతము కాదని యెఱింగించెను. ధృతరాష్ట్రుఁ డతని యుపదేశము వినక "క్షిప్రమానయ దుర్ధర్షం కుంతీపుత్త్రం యుధిష్ఠిర"మ్మని యాజ్ఞాపించెను. విదురుఁడు చేయునదిలేక పాండవులను గొని తెచ్చుటకై యరిగెను. (2-52-1)

ఇచ్చటఁ గూడ రెండు భిన్న కథా విధానముల కలయిక గోచరించు చున్నది. 45 వ అధ్యాయము చివర విదురుఁడు ధర్మరాజును ద్యూతార్థమై కొనిరా ధృతరాష్ట్రునిచే నాజ్ఞప్తుఁడై గాంగేయునికడ కరిగె నని చెప్పఁబడినది. అతఁడు భీష్మునితో నేమి యాలోచించెనో యా ప్రసంగమే మరల రాలేదు. ధృతరాష్ట్రుఁడు విదురునితో నాలోచించుటయు నాతఁడు ద్యూతము హానికర మని నిషేధించుటయు నొకమాఱు జరిగి పోయెను. అతఁడు 51 వ అధ్యాయమున విదురునిఁ బిల్చి మరల నాలోచించుట యెందుకో తెలియరాదు. నన్నయ రచన యందును ఈ సందర్భమునఁ గొంత పునరుక్తి లేకపోలేదు, కాని యాతఁడు మూలమునందలి కొన్ని యసందర్భములను దొలఁగించుటకును గొన్ని యంశములను సమర్థించుటకును యత్నించెను. విదురుఁడు ధృతరాష్ట్రునిచే నాజ్ఞప్తుఁడై భీష్మునికడ కరిగె నని చెప్పి యూరకుండక నన్నయ "అతండును నాపగేయున కంతయు వెఱింగించి యిది యపకర్మం బనుచు నుండె" (సభా. 2-134) నని యా కార్యమునందే పుగ్నుఁడై యున్నట్లు సూచించెను. ఇంతలో ధృతరాష్ట్రుఁడు "తన నిర్మింపం బంచిన సభ దుర్యోధనునకుఁ జూపి" జూదమువలని దోషముల నెఱింగించి యా సభ

యం దధికములైన దక్షిణ లిచ్చి యిష్టంబైన యజ్ఞ మాచరింపు మని యనున యించెను. దుర్యోధనుఁడు "ఇమ్ముల ధర్మజుతో జూద మ్మాడఁగఁ గాన్ప నాకు యజ్ఞ"మ్మని చెప్పి ధర్మరాజుసభకును ధృతరాష్ట్రుఁడు నిర్మింపఁ జేసిన సభకును గల వ్యత్యాసము తెలుపుటకో యనఁ దాను జూచిన యా సభ వైభవమును వర్ణింప మొదలుపెట్టెను. ఇది యంతకుఁ బూర్వ మొకసారి వర్ణింపఁ బడినదే యగుటచే దాని నిచ్చట మరల వర్ణించుట కీ విధముగా నన్నయ యొక హేతువును బ్రదర్శించెను. పాండవ శ్రీ యుపేక్ష్యము కాదనియు దాని నెట్లయిన నపహరింప వలయు ననియు దుర్యోధనుఁడు పలుక చుండ శకుని యందుకొని. ద్యూతమునఁ దప్ప నొండు పాట పాండవోన్నతి నెల్లుల కయిన నపహరింప నలవి కాదని యెఱింగించెను ధృతరాష్ట్రుఁడు దాని కొడంబడ నొల్లక యర్థానర్థ విదుండైన విదురుండు జూదంబున నిగ్రహంబగు నని పలుకుట తెల్పి, దాని నుడిగి యెప్పటి యట్ల యుండుమని దుర్యోధనుని కుపదేశించెను. మూలమున నిక్కడ ధృతరాష్ట్రుఁడు "నేను విదురునితో నాలోచించి కార్యము నిశ్చయించెద"నని పల్కినట్లున్నది. నన్నయ యా పునరుక్తిని దొలఁగించెను. శిల్పులు ధృతరాష్ట్రు నానతిపై సభను వెంటనే నిర్మించిన కతమున సభా ౨. 134 నాతఁడు మూలము నందువలె మరల నా ప్రసంగము తేవలసిన యక్కఱ లేకపోయెను. ధృతరాష్ట్రుని యుపదేశముచే ద్యూత వ్యవసాయము నుండి దుర్యోధనుఁడు మరలు నేమో యని విదురుఁడు కొంతసేపు నిరీక్షించు చుండెను గాఁబోలును. దుర్యోధనుఁడు ధృతరాష్ట్రుని యుపదేశము వినియు ద్యూతమునుండి మరలక యందు దోషము లేదని తెలిపి ధర్మనందనుఁదప్పక రావింపవలయు నని నిర్బంధించెను. ధృతరాష్ట్రుఁడెట్టకేని దాని కొడంబడి ధర్మజానయనమునకై యింకను వెదలక నిరీక్షించు చున్న విదురునిఁ బిలిచి "వానిఁ దోడ్కొని చనుదెమ్ము భాసుర సఖున్ బుధ బంధు జనాను రంజనున్" అని నియోగించెను. నన్నయ యీ విధముగా నిచ్చటి భిన్నకథా విధానములఁ గలిపి చక్కని సమన్వయమొనరించి పునరుక్తి తోఁపకుండ రచన సాగించెను.

అరణ్య పర్వము :-

7. శ్రీకృష్ణుఁడు వనమున నున్న పాండవులఁ జూచుట కేగి వారి నోదార్చి ద్యూత సమయమ్మున నే నచట లేనందున నిట్టి యాపద కలిగె నని యుక్తియుక్తముగఁ బలికెను. అప్పుడు దృష్టాంతములు చూపి యాంబికేయు నొడంబఱిచి దుష్ట ద్యూతమ్ము వారింపఁ గలిగియుందును ... బలుక ధర్మరాజు :



అసాన్నిధ్యం కథం కృష్ణ తవాసీ ద్వృష్ణినందన
క్వ చాసీ ద్విప్రవాస స్తే కిం వా కార్షీః ప్రవాసకః." (3.15-1)

అని ప్రశ్నించెను. అంతఁగృష్ణుఁడు సౌంభ కాఖ్యానమును సంగ్రహముగా నెఱిం గించెను (3-15). 16 వ అధ్యాయమున యుధిష్ఠిరుఁడు మరల :

" వాసుదేవ మహాబాహో విస్తరేణ మహామతే
సౌంభస్య వధ మాచక్ష్వ న హి తృప్యామి కథ్యతః". (3-16.1)

అని యా వృత్తాంతము విస్తరముగాఁ జెప్పు మని యడిగెను. కృష్ణుఁడు దానిని వివరించెను. నన్నయ యీ పునరుక్తిని దొలఁగించి "మీకు దుర్వ్యసనావసరంబున నలబ్ధ సన్నిధానుండ నైతి ననిన నదియెట్లని యుధిష్ఠిరుఁ డడిగిన నాతనికి సౌంభకాఖ్యానంబు సవిస్తరంబుగాఁ గృష్ణుఁ డిట్లని చెప్పె" నని యొక్క మాతే యా కథను జెప్పుచుఁ, దాను సంగ్రహ కథనమును దొలఁగించిన విషయమును సవిస్త రంబుగా ననుమాటచే సూచించెను.

E. నన్నయ క్రమమునం దాసక్తికలవాఁడు. అన్నదమ్ముల పేర్లు చెప్పు నప్పుడును దిక్పాలకాదులను బేర్కొను నప్పుడును దదితర సమయము లందును మూలమున నొక్కొక్కప్పుడు క్రమము విడిచి వేయఁబడు చుండును. నన్నయ అట్టి చోట్లఁ దప్పక క్రమమును బాటించి వ్రాయు చుండును.

1. అక్షౌహిణీ పరిమాణమును జెప్పు నప్పుడు మూలమునఁ బత్తి విషయ మిట్లు చెప్పఁ బడినది :

" ఏకో రథో గజ శ్చైకో నరాః పంచ పదాతయః
త్ర యశ్చ తురగా స్తజ్ఞైః పత్తి రిత్యభిధీయతే". (1.2.15)

లోకమున రథ గజ తురగ పదాతులను క్రమము కనఁబడు చున్నది. అందుచే నన్నయ :

" వరరథ మొక్కండు వారణ మొక్కండు, తురగముల్ మూఁడు కాల్వురును రను సంఖ్య గల యది యగుఁ బత్తి (ఆదిపర్వ ) నేవు

అని తన వర్ణనమున నా క్రమము పాటించెను. ఇట్లే మూలమున నక్షౌహిణీ యందలి రథ గజాదుల సంఖ్య చెప్పునప్పుడు రథ గజముల తరువాత నరులను బిమ్మటఁ దురగములను జెప్పఁబడినవి. (1-2-19-22). నన్నయ " ఇరువది

యొక్క వేయి నెనమన్నూట డెబ్బది రథంబులు నన్ని యేనుంగులు నలువదేను వేలు నాలు నూటపది గుఱ్ఱంబులు లక్షయుం దొమ్మిది వేలున్ మున్నూట యేఁబండ్రు వీరభటులును గలది యొక్క యక్షౌహిణి " యని సక్రమముగా వర్ణనము సాగించెను.

2. ఆస్తీకుఁడు సర్పయాగమును నివారించు సమయమున "జనమేజయునాతని యజ్ఞమహిమను, ఋత్విజులను, సదస్యులను, నగ్నిభట్టారకు " (ఆది-౨-229) నను రూపకుభవచనంబులఁ బ్రస్తుతించెను. నన్నయ సరిగాఁ బై క్రమముననే యీ వర్ణనలు కావించెను. (223-228). మూలమునఁ గూడ నీ వర్ణనలున్నవి కాని క్రమవిరహితముగా నున్నవి. సర్ప సత్త్రమున వ్యాసుఁడును దచ్ఛిష్యులును సదస్యులే కాని ఋత్విజ్యులు కారు. (సదస్య శ్చాభవద్వ్యాసః పుత్త్ర శిష్యసహాయవాన్ 1-48-7) కాని ఆస్తీకుఁడు స్తుతించు సమయమున

" ఋత్విక్సమో నాస్తి లోకేషు చైవ
ద్వైపాయనే నేతి వినిశ్చితం మే
ఏతస్య శిష్యా హి క్షితిం చరన్తి
సర్వర్త్విజః కర్మసు స్వేషు దక్షః" (1-50-9).

వ్యాసుఁడును దచ్ఛిష్యులును ఋత్విజు లని చెప్పఁబడినది. నన్నయ యిట్లుగాక ద్వితీ-227 వ పద్యమున " కృష్ణద్వైపాయనుఁ దేగుదెంచి సుత శిష్య బ్రహ్మ సంఘంబుతో సద్వంద్యుండు సదస్యుఁ డయ్యె ననినన్" అని క్రమముగా వర్ణించి యుండెను.

3. దేవ దానవ ప్రముఖుల యుత్పత్తి వర్ణించు సందర్భమున మూలము నందు (1-59) మరీచ్యాది బ్రహ్మ మానస పుత్త్రులకును గశ్యప భార్యలు పదుమువ్వురికిని గలిగిన సంతాన మొక క్రమము లేక యథేష్టముగా వర్ణితమైనది. నన్నయ ముందు మరీచి కుమారుఁడైన కశ్యపునికిఁ బదుమువ్వురు భార్యలందును గలిగిన సంతతియుఁ ,దరువాత నంగిరో ఽ త్రి పులస్త్యాదుల సంతతియుఁ గ్రమముగా వర్ణించెను. (ఆది-3-58-68)

4. నారదుఁడు ధర్మజునకు నింద్రాది దిక్పాలకులయు బ్రహ్మయొక్కయు సభలను వర్ణించి చెప్పెను. ముందు ధర్మరాజుతో నాతఁడు తాను వర్ణింపఁ బోవు సభలను గూర్చి చెప్పునప్పుడు

" సభాం తు పితృరాజస్య వరుణస్య చ ధీమతః
కథయిష్యే త థేన్ద్రస్య కైలాస నిలయస్య చ
బ్రహ్మణశ్చ సభాం దివ్యాం కథయిష్యే గతక్లమాం." (2-6-11)

అని చెప్పియుండెను. ఇందలి క్రమము వ్యత్యస్తముగా నున్నది. నన్నయ యీ సందర్భమున :

" సురపతి యమ వరుణ ధనేశ్వర కమలాసనుల దివ్య సభ లెల్ల" (సభా.౧-29) జూచితి నని క్రమము పాటించి చెప్పి యుండెను.

5. పాండవు లడవి కేగిన విధమును విదురుఁడు ధృతరాష్ట్రున కెఱిం గించు సందర్భమున (2-71-4-5) మూల మందు ముందు సహదేవుఁడును దరు వాత నకులుఁడును జెప్పఁబడి యున్నారు వా రా యా వ్యాపారముల నొనరించుచు నరుగుటకుఁ గారణములు చెప్పు సమయమునఁ గూడ నిట్లే క్రమము వ్యత్యస్త ముగా నున్నది. నన్నయ దానిని సరిచేసి పై రెండు చోట్లఁ గూడ ముందు నకు లుని విషయమును దరువాత సహదేవుని విషయమును వర్ణించి యుండెను. (సభా. ౨-301-306)

6. అర్జునుఁ డీశ్వరునుండి పాశుపతాస్త్రమును బడసెనని విని యింద్రాదు లాతనిఁ జూచుటకై యరిగిరి. అప్పుడు మూలమున వరుణ కుబేరుల రాక పిమ్మట నింద్రుని రాక వర్ణిత మైనది. (3-42). నన్నయ యట్లు గాక " హరు చేత సంప్రాప్త వరుఁడయ్యె నరుఁ డని యెఱిఁగి యింద్రుఁడు ధనేశ ధర్మ వరుణే శ్వరుల తోడ " వచ్చె ( అర -౧-338 ) నని ముం దింద్రునే చెప్పియుండెను. కాని " ధనేశ ధర్మ వరుణేశ్వరుల తోడ " నని చెప్పు నప్పు డేలొకో యాతఁడు క్రమమును విడిచియే చెప్పి యుండెను.

ఇట్లే కథా సందర్భములందుఁ గూడ మూలమునఁ గ్రమ నిరపేక్షముగ వ్రాయఁబడిన చోట్లు కొన్ని గలవు. నన్నయ వాని నన్నిటిని బరిశీలించి సాధ్య మైనంత వఱకుఁ గ్రమము పాటించుటకు యత్నించెను.

7. ఋషులు శమంతపంచకమును గూర్చియు నక్షౌహిణీ సంఖ్యను గూర్చియుఁ బ్రశ్నించుట మూలమునఁ బర్వ సంగ్రహమునకు ముందే యున్నది. తెలుఁగున,

"అనఘా! మున్ను శమంత పంచకము నయ్యక్షౌహిణీ సంఖ్యయున్
వినఁగా మా కెఱిఁగించి భారత కథావిర్భూతికిం గారణంబు .. "

(ఆది -౧-74) మున్నుగాఁ గల విషయ ములను జెప్పు మని సౌతి నడుగుట పర్వ సంగ్రహ మైన పిమ్మటనే కానిపించు చున్నది. పర్వ సంగ్రహాదికము కథా రంభమునకు ముందుండుటే సమంజసము. అందుచే నన్నయ యా క్రమమునే పాటించెను.

8. మూలమున సముద్ర వర్ణనము (1-19) వినతా కద్రువ లశ్వవాల మును బరీక్షించుటకై యరిగి నప్పు డున్నది. నన్నయ యీ వర్ణనమును సము ద్ర తీరమున నుచ్చైః శ్రవమును జూచి నప్పుడే కావించెను. (ఆది. ౨-27-30) మొదట వారు సముద్రము కడ కరిగి నపుడు దానిని వర్ణించుటే యుచితము. మఱియు వా రశ్వవాలమును బరీక్షించుటకై యాత్రముమై నరుగు చుండఁగా సముద్ర వర్ణనము కావించుట కథా గమనమున కంతరాయము కలిగించును.

9. సర్ప సత్త్రమున సర్పములు పెక్కు పడిపోవుటచే నల్పశేషవరి వారుఁడైన వాసుకి మిక్కిలి విచారించి

"దహ్యన్తేం ఒగాని మే భద్రే దిశో న ప్రతిభాన్తి చ
సీదా మీవ చ శమ్మోహాత్ ఘూర్ణతీవ చ మే మనః
దృష్టి ర్భ్రమతి మే ఒ తీవ హృదయం దీర్య తీవ చ
పతి ష్యా మ్యవశో ఒద్యాహం తస్మి న్దీప్తే విభావసౌ
పారిక్షితస్య యజ్ఞో ఒసౌ వర్త తే స్మ జి ఘాంసయా."
.... .... .... .... .... .... .. . . .. . .... . . .... ... ....
ఆస్తీకః కిల యజ్ఞం తం వర్తన్తం భుజగోత్తమే
ప్రతిషేత్స్యతి మాం పూర్వం స్వయ మాహ పితామహః".

(1-48-20-25)

అవి సోదరితోఁ జెప్పినట్లు మూలమం దున్నది. మఱియు 35 వ అధ్యాయమున:

"అథ దేవాసురా స్సర్వే మమన్థు ర్వరుణాలయం
తత్ర నేత్ర మభూ న్నాగో వాసుకి ర్బలినాం వరః
సమా ప్యైవ చ తత్కర్మ పితామహ ముపాగమన్
దేవా వాసుకినా సార్థం పితామహ మ థాబ్రువన్
భగవన్ శాపభీతో ఒయం వాసుకి స్తప్యతే భృశం

త స్యేదం మానసం శల్యం సముద్ధరుం త్వ మర్హసి
జనన్యా శ్శాపజం దేవ జ్ఞాతీనాం హితకాంక్షిణః." (1-35-3-6)

అను వృత్తాంత మున్నది. ఇందుఁగొంత యసందర్భ మున్నది. అమృత మథన సమయమున మచ్చైశ్శ్రవము జనించెను. దాని తోకను నల్లగాఁ జేయవలె నని కద్రువ కోరఁగాఁ గొడుకు లధర్మభీత చేతస్కులై యట్లుచేయుట కంగీకరింప రైరి. అప్పు డామె వారికి శాప మొసంగెను. ఈ విషయ మమృత మథనమైన కొంత కాలమునకు జరిగెను. అమృత మథనము పూర్తియైన వెంటనే దేవతలు బ్రహ్మకడ కరిగి జననీ శాప భీతుఁడైన వాసుకిని గూర్చి చెప్పుట కవకాశములేదు. అందుచే నన్నయ యా విషయమును విడిచివైచెను.

" అమరులెల్లఁ బితామహుం బ్రార్థించి వాసుకి కవ్వయత్వంబును సకల భయ మోక్షణంబుగా, వర మిచ్చిరని " (ఆది. ౨-129) ముందు చెప్పఁబడి యున్నది. అట్టియెడ వాసుకి యగ్నిలోఁ బడఁబోవు చున్నట్లు చెప్పుట పూర్వ కథనమునకు విరుద్ధము. ఆస్తీకుఁడు సర్పసత్త్రము నుడిగించు నని దేవతలతో బ్రహ్మ చెప్పుచుండఁగా నేలా పుత్రుఁడు విని వాసుకి కెఱింగించెను. బ్రహ్మ వాసుకితో నా విషయము తెల్పియుండె ననుట కాధారము లేదు. ఈ వైరుద్ధ్యమును దొలఁగించుటకై నన్నయ " బ్రహ్మవచనంబు నిట్టిద కా విని యేలా పుత్త్రుండు మాకుఁజెప్పె. జరత్కారు మహామునికి నిన్ను వివాహముచేయు టయు నేతదర్థంబ " యని వాసుకి జరత్కారువుతోఁ జెప్పినట్లు వర్ణించెను. (ఆది. ౨-220). అతఁడు వాసుకి కూడ నగ్నిలోఁ బడఁబోవుటయు, బ్రహ్మయే తన కాస్తీకుఁడు యజ్ఞము నుడిగించు నని చెప్పినట్లు వాసుకి సోదరికిఁ దెల్పుటయు విడిచి వైచెను.

10. మూలమునందేఁ బదియైదవ యధ్యాయమున :

అతర్పయ చ్చ కౌంతేయః ఖాండవే హవ్యవాహనమ్
.... ....... .......................................
పార్థా యాగ్ని ర్దదౌ చాపి గాండీవం ధను రుత్తమమ్
ఇషుధీ చాక్షయై ర్బాణై రథం చ కపి లక్షణమ్ (1-55-37-38).

అని ముందు ఖాండవ దహనమును దరువాత నగ్ని యర్జునునకు గాండీవాదుల నొసఁగుటయుఁ జెప్పఁబడినవి. కథలో ఖాండవ దహనమునకు ముందే యగ్ని

వరుణునిచే గాండీ వాదుల నర్జునున కిప్పించిన ట్లున్నది. అందుచే నన్నయ "మఱియు నర్జునుఁడు నగ్నిదేవుని చేత దివ్యరథంబును దివ్యాశ్వంబులును, గాండీవ దేవదత్తంబులును, నక్షయ బాణ తూణీరంబులుం బడసి సురగణంబులతో సురపతినోర్చి ఖాండవ దహనంబున నగ్నిదేవునిం దనిపె" నని వ్రాసియుండెను. (ఆది. తృతీ-17).

11. పరాశరుఁడు సత్యవతిని జూచిన వెంటనే యామె యెడ వలపు నిలిపెను. అప్పు డామె యాతనితో :

"( సా బ్రవీత్ ) పశ్య భగవన్ ! పారావారే ఋషీన్ స్థితాన్
ఆవయో ర్దృశ్యతో రేభిః కథ న్ను స్యా త్సమాగమః ". (1-57-58)

అని పలుక నతఁడు నీహారమును సృజించె నని మొదటనే మూలముం దున్నది. నన్నయ :

"ఎల్లవారును జూడంగ నిట్టి బయల నెట్లు సంగమ మగు నని యింతియన్న
నమ్మునీంద్రుఁడు గావించె నప్పు డఖిల దృష్టి పథరోధి నీహార
తిమిరమంత " (ఆది. 3-42).

నని సమాగమమునకు ముందు నీహార తిమిరముఁ గల్పించె నని వ్రాసియుండెను. ఈ క్రమము మిక్కిలి యుచితముగా నున్నది.

12. బ్రాహ్మణ భార్య కల్మాషపాదుని శపించిన వృత్తాంతము మూలమునఁ బ్రత్యేకముగా నొక యధ్యాయములో వర్ణింపఁబడియున్నది. (1-173). నన్నయ దానిని గథలోఁ గలపి (ఆది. ౬-129) వచనమున సంగ్రహముగా వర్ణించి యుండెను. ఆ వృత్తాంతము కల్మాషపాదుఁడు వశిష్ఠునిఁ దనకై పుత్త్రునిఁ బడయు మని ప్రార్థించుటకు ముం దిచ్చట నుండుట చాల నుచితముగా నున్నది.

13. పాండవులతోడి విగ్రహము వల దని భీష్మద్రోణులు దుర్యోధనునికి బుద్ధిఁ గఱపిరి. అప్పుడు కర్ణుఁడు వా రిరువురు చెప్పిన పలుకులు తమ కహితము లని నిరసించెను. ద్రోణుఁ డలిగి కర్ణుని నిందింపఁ దొడంగెను. అప్పుడు విదురుఁడు వారి నిరువురిని వారించి ధృతరాష్ట్రునితోఁ బాండు సుతుల వేగ రావించి వారికిఁ బ్రీతి నర్ధరాజ్య మిమ్మని చెప్పుచుఁ బాండవుల బలవైభవమును వర్ణించెను. ఈ వర్ణించుటలో నతఁడు క్రొత్తగా బంధువులైన వారును, ద్రోణు

నెడ బద్ధమత్సరులైనవారు నగు ద్రుపదధృష్టద్యుమ్నుల మొదటఁ జెప్పుట యెంతయు నుచితముగా నున్నది. మూలమునఁ గూడ నీ విషయ మంతయు నున్నది. గాని యందుఁ జెప్పఁబడిన విధానము క్రమరహితమై యేది నోటికి వచ్చిన నది చెప్పినట్లుగా నున్నది.

14. సభా పర్వమున నారదుఁ డింద్రుని సభను వర్ణించు పట్టున నింద్రు నుపాసించు మునుల పేర్లెన్నో చెప్పుచు వారి నడుమ నొకచోట "హవి ష్మాంశ్చ గవిష్ఠ శ్చ హరిశ్చన్ద్రశ్చ పార్థివః" (2-7-11) అని హరిశ్చంద్రునిఁ గూడఁ బేర్కొని యుండెను. ఇచ్చట హరిశ్చంద్రుఁడు పేర్కొనఁబడుట కధిక మైన ప్రాధాన్య మున్నది. అది వినియే ధర్మజుఁడు హరిశ్చంద్రుని ప్రత్యేక తను గూర్చి ప్రశ్నించుటయు, దానిని వివరించుచు నారదుఁడు పాండురాజు ధర్మజుని రాజసూయయాగము చేయఁగోరె నని తెల్పుటయు సంభవించెను. అందుచే హరిశ్చంద్రుని పే రెక్కడనో నడుమఁగాక కొంచెము ప్రముఖముగాఁ బేర్కొనుట యుచితము. క్షేమేంద్రుఁడు భారతమంజరిలో నుపాసించు వారి నందఱిని విడిచి యొక్క హరిశ్చంద్రుని మాత్రము పేర్కొని యుండెను. నన్నయ నింద్రు నుపాసించు ఋషుల పే ర్లన్నియు వదలి "ధాతయు విధా తయు హరిశ్చందుఁడ్రను రాజర్షియు సురేంద్రసభ నుండుదు" (సభా. ౧-66) రని హరిశ్చంద్రునిపేరు తుదికిఁ దెచ్చి దానికిఁ గొంత ప్రాధాన్య మొసంగెను.

15. "భీమార్జునా వుభౌ నేత్రే మనో మన్యే జనార్దనమ్
మన శ్చక్షుర్విహీనస్య కీదృశం జీవితం భవేత్"

అను శ్లోకము మూలమున (2-15-2) కృష్ణుఁడెవఁడు జరాసంధునిఁ జంపునో యతఁడు సమ్రా ట్టగు నని చెప్పి నప్పుడు ధర్మరా జనియుండెను. కృష్ణుఁడు జరా సంధుని దురితములు వర్ణించి యాతని సంహరింప నేగు తనతో భీమార్జునులను బంపు మని "యిల్లడయిడు భీము నర్జును నలంఘ్య బలాఢ్యుల నా వశంబునన్" అని ధర్మజు నడిగినప్పుడు, నన్నయ దీని భావమును ధర్మజునిచే ననిపించెను. ఈ భావమున కీ ప్రకరణ మెంతయుఁ దగియున్నది.

"నయనములు నాకుఁ బవన తనయ విజయులు మనము కమల
నాభుడు, వీరిం
బ్రియహితులఁ బాసి నిమిషం, బయినను నెట్లుండ నేర్తు నవిచేష్టుఁడనై"
(సభా. ౧-168)

16. ధృతరాష్ట్రుఁడు ద్రౌపదికి వరము లిచ్చిన పిమ్మటఁ గర్ణుఁడు దుర్యశస్సాగరనిమగ్నులైన పాండవులను ద్రౌపది నావవలె నుద్ధరించెనని పల్కుట, సతికారణమునఁ బాండవులకు రాజ్యము లభించెనను వాక్యమును విని భీముఁడు క్రుద్ధుఁడై శత్రుసంహారమున కున్ముఖుఁడగుట, అర్జున ధర్మజు లాతని వారించుట మున్నగు విషయములు మూలమున 64 వ అధ్యాయములో నున్నవి. 65 వ అధ్యాయమున ధృతరాష్ట్రుఁడు ధర్మజునిఁ బిల్చి రాజ్యమిచ్చి నీతులు బోధించి పంపుట యను విషయమున్నది. నన్నయ యీ రెం డధ్యాయములందలి విషయములను దారుమాఱు చేసెను. అతఁడు ధృతరాష్ట్రుఁడు ధర్మజునకు నీతులు బోధించి పాండురాజు రాజ్యము నందు సమర్పించుట ముందును భీముని కోప వృత్తాంతమును, దరువాతను వర్ణించెను. ఇంద్రప్రస్థమున కరుగుటకు ముందు భీముని కోప వృత్తాంతమును వర్ణించుటయే యుచితముగా నున్నది.

17. పాండవు లడవికి బయలుదేరు చుండఁగా దుశ్శాసనుఁడు వారి నధిక్షేపించుటయు, దుర్యోధనుఁడు భీముని గతిభేదము ననుకరించుచు సపహాస్యము చేయుటయుఁ జూచి భీమాదులు క్రుద్ధులై శపథము లాచరించుట మూలమున 68 వ అధ్యాయమం దున్నది. పాండవులు విదురభీష్మద్రోణాదుల యనుజ్ఞ వడయుటయు ద్రౌపదికిని గుంతికిని జరిగిన సంభాషణమును దరువాత (69, 70 అధ్యా.) వర్ణింపఁబడినవి. తెలుఁగున నన్నయ పాండవు లందఱిని వీడ్కొని యడవికేగునప్పుడే శపథములు కావించి రని వర్ణించెను. ఈ క్రమమే యుచితతరముగా నున్నది.

18. మూలమున విదురుఁడు పాండవులరణ్యమున కేగిన విధమును, అట్లరుగుటకుఁ గారణములైనవారి యభిప్రాయములను ధృతరాష్ట్రుఁ డడుగఁగాఁ జెప్పిన పిమ్మట " అనభ్రే విద్యుతశ్చాసన్, భూమిశ్చ సమకంపత" (2-71-25) ఇత్యాదిగాఁ గల దుశ్శకునములు జరిగినట్లు వర్ణింపఁబడినది. తెలుఁగునఁ బాండవులు గజపురంబు వెలువడి యరుగు నప్పుడే (సభా. ౨-299) యవి వర్ణితములై యున్నవి. నన్నయ యవలంబించిన విధానమే లెస్సగా నున్నది.

అరణ్య పర్వము :-

19. ధర్మజుఁడు నహుషువలన నధ్యాత్మ విషయము లెఱింగిన పిమ్మట నాతని బుద్ధి సంపద కలరి " సర్వజ్ఞం త్వాం కథం మోహ ఆవిశత్స్వర్గవాసిన"

మ్మని యడుగ నతఁ డగస్త్యుఁడు తన్ను శపించుటయుఁ దరువాత శాపమోక్షమును దెలుపుటయు నెఱింగించె నని మూలమం దున్నది. ధర్మరాజు భీముని కొఱకు వెదకుచు నేగి యడవిలో సర్పగృహీతుఁడైన యాతనిఁగని యతని వలన యావద్వృత్తాంతము తెలిసికొని "దేవోవా యదివాఁ దైత్య ఉరగోవా భవాన్యది, సత్యం సర్వ వచో బ్రూహి పృచ్ఛతి త్వాం యుధిష్ఠిరః" (177-4) అని నహుషునిఁ బ్రశ్నించెను. అప్పు డతఁడు తాను నహుషుఁ డనియు, నైశ్వర్య మదమోహితుఁడై బ్రాహ్మణుల నవమానించి యగస్త్యునిచే నట్టిగతి నొందింపఁ బడె ననియుఁ దెలిపి యుండెను. నన్నయ యిక్కడనే నహుషుఁడు తన శాపవృత్తాంతమును, దద్విమోక్షవిధానమును గూడ ధర్మరాజున కెఱింగించినట్లు వ్రాసి యున్నాఁడు (అర. ౪-120-123). ధర్మజుఁడు చివర దీనికై ప్రత్యేకముగా నొక ప్రశ్న వేయ దానికి సమాధానముగా నహుషుఁ డా వృత్తాంతమును దెలుపుట కంటె ప్రసంగము వచ్చినది కావున నిచ్చటనే దానిని జెప్పి వేయుట యుక్తముగా నున్నది.

F. అన్యథా కల్పనలు :-

మూలమున నున్న కొన్ని కథాంశములను నన్నయ తన కుచిత మని తోఁచినట్లు మార్చి వ్రాసిన చోట్లు కూడఁ గొన్ని యున్నవి. కాని యిట్టి వాని సంఖ్య చాల తక్కువ. నన్నయ చూచిన ప్రతిలో నట్లుండెనో లేక యాతఁడు బుద్ధిపూర్వకముగనే యట్లు మార్చెనో తెలియ రాదు. ప్రస్తుతము లభించుచున్న ప్రతులను బట్టిచూడ నాతఁ డుద్దేశ పూర్వకముగనే వాని నట్లు మార్చినట్లు తెలియు చున్నది.

1. గరుడుఁ డండమునుండి వెల్వడఁగనే యగ్నిరాశి వలెఁ బ్రకాశించుచు నాకసమున కెగసెను. అప్పుడు ప్రజ లందఱు నగ్నిశరణు చొచ్చిరి. అగ్ని యా తేజము తనది కా దనియుఁ దనతోఁ దుల్యుఁడైన గరుడుని దనియుఁ దెల్పెను. ప్రజలు ఋషి గణములతోఁ గూడ నరిగి గరుడుని స్తోత్రము చేసిరి. గరుడుఁడు తుష్టుఁడై తేజము నుపసంహరించెను (1-20). మూలమునందలి యీ కథ నంతను మార్చి నన్నయ :

"దారుణ కల్పాంత మరుత్ప్రేరిత హవ్యవహశిఖల పెల్లిది యని బృం
దారకముని బృంద స్తుతి బోరనఁ దా నగ్ని సూక్తములతో నెగసెన్"
(ఆ.౨-39)

అని యొక్క పద్యమును మాత్రము వ్రాసెను.

2. కశ్యపుఁడు పుత్త్రకామేష్టి చేయు సందర్భమున వాలఖిల్యు లింద్రుని శపించిన వృత్తాంతము మూలమందు శౌనకాదులు ప్రత్యేకముగాఁ బ్రశ్నింపఁగా సౌతి చెప్పినట్లున్నది (1–27). నన్నయ గరుడాగమనమునకు ముం దమరలోకమునఁ గల్గిన యుత్పాతములకుఁ గారణమును జెప్పుచు బృహస్పతియే యింద్రున కా వృతాంతమును జెప్పినట్లు వర్ణించెను. (ఆది. ౨-83-89). దీని నిచ్చట బృహస్పతి చెప్పుటయే యుచితమై కథకు రామణీయకమును గూర్చు చున్నది.

3. విచిత్ర వీర్యుని యనంతరము కురు సామ్రాజ్యమునకు రా జెవ్వ రయ్యె నను విషయమున మూలమున ద్వైవిధ్యము గోచరించు చున్నది. 103 వ అధ్యాయమున :

"ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రతిపద్యత
కరణత్వా చ్చ విదురః పాండు రాసీ న్మహీపతిః " (23)

అని పాండురాజే రా జైనట్లు చెప్పఁబడినది. దాక్షిణాత్య ప్రతు లన్నిటిలో

"జ్యేష్ఠో య ఽ మితి రాజ్యే చ స్థాపితో వికలో ఽపి సన్
విర్జిత్య పరరాష్ట్రాని పాండుర్మహ్యం నివేదయత్ "

(పుట 935– Appendix–10,11).

అని అంధుఁ డయ్యు ధృతరాష్ట్రుఁడే రాజ్యమున స్థాపితుఁ డయ్యెనని చెప్పఁబడినది. పాండురాజు దిగ్విజయము చేసి వచ్చిన పిమ్మట :

"ధృతరాష్ట్రాభ్యనుజ్ఞాతః స్వబాహువిజితం ధనం
భీష్మాయ సత్యవత్యై చ మాత్రే చోపజహార సః" (106–1)

అని తాను సంపాదించిన ధన మంతయు ధృతరాష్ట్రాభ్యనుజ్ఞాతుఁడై భీష్మునికి సత్యవతికిఁ దల్లికిఁ గానుకగా విచ్చె నని చెప్పుటలోఁ గూడ ధృతరాష్ట్రుఁడే రాజుగా నుండె నను ధ్వని స్ఫురించు చున్నది. లేనిచోఁ బాండురాజు తాను జయించికొని వచ్చిన ధనము నెవ్వరికైన నొసంగు నప్పుడు ధృతరాష్ట్రుని యనుజ్ఞ నేల పొందవలయును ? దుర్యోధనుఁడు పాండవులను బలువిధముల హింసింప మొద లిడినప్పుడు ప్రజలు చత్వరముల యందుఁ గలసికొని :

"ప్రజ్ఞాచక్షు రచక్షుస్త్వాత్ ధృతరాష్ట్రో జనేశ్వరః
రాజ్య మప్రా_ప్తవాన్ పూర్వం స కధం నృపతి ర్భవేత్
........................................
తే వయం పాండవం జ్యేష్ఠం తరుణం వృద్ధశీలినం
అభిషించామ సాధ్వద్య సత్యం కరుణవేదినమ్" (129-5,7)

అని పల్కు చుండి రనియు, నా మాటలు విని దుర్యోధనుఁడు వ్యథితుఁడై తండ్రితో :

"అస్మాకం తు పరాం పీడాం చికీర్షన్తి పురే జనాః
పితృతః ప్రా_ప్తవాన్ రాజ్యం పాండు రాత్మగుణైః పురా
త్వ మ ప్యగుణసంయోగాత్ ప్రా_ప్తం రాజ్యం న లబ్ధవాన్" (129-14)

అని పల్కె ననియు మూలమం దున్నది. పాండవులు వారణావతమున కరుగు నప్పుడు ధృతరాష్ట్రుని దుర్బుద్ధిని గ్రహించి కొందఱు బ్రాహ్మణులు .

"తద్రాజ్యం పితృతః ప్రాప్తం ధృతరాష్ట్రో న మృష్యతే
అధర్మ మఖిలం కిం ను భీష్మో య మనుమన్యతే" (133-9)

అని పల్కి రనియు వ్రాయఁబడియున్నది. ఈ విధముగా నొకచోట ధృతరాష్ట్రుఁడు రాజయ్యె ననియు మఱొక చోటఁ బాండురాజే రాజయ్యె ననియుఁ దెలుపఁబడియున్నది.

నన్నయ భారతమునఁ గూడ నీ ద్వైవిధ్యము లేకపోలేదు కాని యాతని వ్రాఁతలో ధృతరాష్ట్రుఁడు రాజయ్యె నను భావమే యెక్కువగాఁ గానఁ బడుచున్నది.

"అయము గర్వమున్ విడిచి యన్య పతుల్ పనిసేయ నిట్లు గాం
గేయ భుజాబలంబున నిక్క విరోధి సమాజుఁడై కుమా
రాయిత శక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయు చుండె న
త్యాయత కీర్తితోఁ దనకు హస్తిపురంబది రాజధాని గాన్"

(ఆది. ౫-6)

అను పద్యమున ధృతరాష్ట్రుఁడు రాజ్యము చేయుచుండె ననియు దీనికి ముందున్న వచనమున నాంబికేయుఁడు ధృతరాష్ట్రు రాజ్యాభిషిక్తుఁ జేసె ననియు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. పాండురాజు దిగ్విజయ మొనరించిన పిమ్మట "ఇట్లు పాండురాజు దిగ్విజయంబు సేసి తదుపార్జితములైన యపరిమిత ధనం

బులఁదెచ్చి ధృతరాష్ట్రి ననుమతంబున భీష్మనకు సత్యవతికిం దమ తల్లులైన కౌసల్యలకు విదురునకు సుహృజ్జనులకు బ్రాహ్మణులకు నిచ్చె " నని యుండుట ధృతరాష్ట్రుఁడే రాజయ్యె ననుట కనుగుణముగా నున్నది. ధృతరాష్ట్రుఁడు ధర్మరాజును యౌవరాజ్య ప్రతిష్ఠితునిఁ గావించినప్పుడు దుర్యోధనుఁడు దుఃఖితుఁడై పాండవ పక్షపాతులైన ప్రజల వాక్యములు మఱింత వేదన కలిగింపఁ దండ్రికడ కరుదెంచి పాండవుల నెట్లైనఁ బురంబు పాయు నట్లొనరింపవలె నని ప్రార్థించి నప్పుడు ధృతరాష్ట్రుఁ డతనికిఁజెప్పిన యీ క్రింది వాక్యములవలనఁగూడ నతఁడే రాజయినట్లు వ్యక్త మగుచున్నది. " బలంబు కలిగియు నంగవైకల్యంబునం బర చక్రంబులకుం బ్రతివ్యూహంబులు రచియింప నేరమిఁజేసి రాజ్యంబునకుఁ దగకున్న

"లోకనుతుండు పాండుఁ డమలుండు మహా గుణరత్నపూర్ణర
త్నాకరుఁ డత్యుదారమతి నంధుఁడ నైనను నన్ను రాజుగాఁ
జేకొని నాకు భక్తిఁ బనిసేయుచు సర్వజగజ్జిగీషుఁడై
యీ కురు వంశరాజ్యభర మింతయుఁ దాల్చెఁ బరాక్రమంబునన్"
(ఆది.౬-124).

ఇట నన్నయ యిట్లు వ్రాసియుఁ బాండవుల నెట్లు పురంబుఁ బాపనేర్తు నని దుఃఖించుచున్న ధృతరాష్ట్రునితో దుర్యోధనుఁడు "ఈ రాజ్యంబు మొదలింటంగోలె భవదీయంబయినం బ్రకృతి జనులు వశ్యులు గాకున్నను గ్రమాగతంబయి మాకు నప్రయత్న లభ్యంబగుఁ దొల్లి పాండురాజు రాజై గుణంబులం బ్రజానురాగంబు వడయుటంజేసి యెల్లవారును ధర్మరాజు రాజ్యంబ వలతు" రనియుఁ "పైతృకంబగు లక్ష్మి పాండు భూపతి మున్ను తాల్చుటఁజేసి తత్తనయుఁడైన ధర్మజుఁడిప్పుడు దాల్చిన నాతని తనయుండు మఱి దానిఁదాల్చు మీఁద నిప్పాటఁ బాండువంశేశుల వసుమతీ రాజ్యార్హులగుదు" రనియుఁ జెప్పినట్లు వ్రాయుట పూర్వ కథనమునకు విరుద్ధముగా నున్నది. పాండవులు వారణావతమున కరుగునపుడు పురమునఁ గల బ్రాహ్మణ క్షత్రియ ప్రముఖానేక జనంబులు శోక సంతప్తులయి :

"పితృపితామహులచే భృతపూర్వమై క్రమాగతమైన రాజ్యంబు
గరము నెమ్మిఁ
బాండు సుత జ్యేష్ఠ భరతకుల శ్రేష్ఠ ధర్మజుఁ బూన్పక ధర్మ వుడిపి
యేల వృద్ధరాజు లెడ సేసిరో" (ఆది. ౬-142)

అని పలుకుటయందుఁ గూడఁ బై వైరుధ్యము గోచరించుచునే యున్నది. నన్నయ రెండు మూఁడు చోట్ల ధృతరాష్ట్రుఁడే రాజయ్యెనని స్పష్టముగా వ్రాసియు నిచ్చట నిట్లు చెప్పుటకు నిజమునకు ధృతరాష్ట్రుఁడే యభిషిక్తుఁడైనను దిగ్విజయాదులచే రాజ్యమున కభ్యుదయము కలిగించుచు రాజ్యపాలనము నంతను బాండురాజు నిర్వహించు చుండుటయే కారణమై యుండవచ్చును. ఈ విధముగా మూలాను వాదములు రెండింటను ద్వైవిధ్యము గోచరించుచున్నను మూలమున పాండు రాజే రాజయ్యె ననుటను అనువాదము ధృతరాష్ట్రుఁడు రాజయ్యె ననుటను బల పఱుచు చున్నట్లు కానఁబడు చున్నది.

విచిత్రవీర్యు ననంతరము పాండురాజు పట్టాభి షిక్తుఁడగుటయుఁ, దన్మరణానంతరము ధర్మరాజు యౌవరాజ్య పట్టాభిషిక్తుఁ డగుటయు జరిగి యుండెనేని దుర్యోధనుఁడు రాజ్యసంపాదనమునకై యత్నించుటకే యవకాశము లేకపోయి యుండును. అప్పుడు రాజ్యాధికారము ధర్మరాజు దగుటలో సంది యమేలేదు. దుర్యోధనుఁడు పాండవ సంహరణమునకును, వారిని బుర బహిష్కృతుల నొనరించుటకును యత్నించుట యసాధ్య కార్యమై యుండును. అతని చేఁత లన్నియుఁ జూచుచు నుపేక్ష వహింపక భీష్మవిదురాదులు దృఢ ముగా విరోధించియే యుందురు. ధృతరాష్ట్రుఁడు పట్టాభిషిక్తుఁడై యుండుట చేతనే పాండవులకు రాజ్య మిప్పించు విషయమున వా రెప్పుడును నయమార్గ మునే యవలంబించు చుండిరి. దుర్యోధనున కదియే బలము చేకూర్చినది. ఆ యూఁత చూచుకొనియే యాతఁడు తన కుట్ర లన్నియు సాగింపఁజాలెను. అందు చేతనే నన్నయ ధృతరాష్ట్రి పట్టాభిషేకమును బలపఱిచినట్లు తోఁచు చున్నది.

4. మత్స్యయంత్ర భేదనానంతరము ద్రుపదుఁడు తన కూఁతువకు వరుఁడైన వాఁడెవ్వఁడో యే వంశము వాఁడో యెఱిఁగి రమ్మని ధృష్టద్యు మ్నునిఁ బంపెను. పిమ్మటఁ దన బురోహితునిఁ గూడఁ బంపెను. వా రిరువును వచ్చి తాము చూచిన, యెఱింగిన సంగతులు ద్రుపదునికిఁ దెలియఁజెప్పిరి. అప్పుడు ద్రుపదుఁడు ధృష్టద్యుమ్నునిఁ జూచి చాతుర్వర్ణ్యోచితంబులగు రథ ములు గొనిపోయి వారలఁదోడ్కొని రమ్మని పంచె నని తెలుఁగు భారతములో నున్నది. సంస్కృతమున నింకను బురోహితుఁడు ధర్మజునితో మాటాడు చుండఁగనే ద్రుపదుఁ డొక దూతను బంపె నని యున్నది.

"ఏవం బ్రువత్యేవ యుధిష్ఠిరే తు
పాంచాల రాజస్య సమీపతోఽన్యః
త త్రాజగా మాశు నరో ద్వితీయః
నివేదయిష్య న్నివ సిద్ధ మన్నమ్" (185-28).

ఇచ్చట ద్రుపదుఁ డెవ్వరో దూతను బంపుట కంటె ధృష్టద్యుమ్నునిఁ బంపుటయే మిక్కిలి యుచితముగా నున్నది:

సభా పర్వము :

5. మయుఁడు తన ప్రాణము రక్షించిన యర్జునున కేదేని ప్రత్యు పకారము చేయఁదలఁచి "మీ కిష్టమైన దానిని నిర్మించెదను పనుపుఁ" డని పలుక నర్జునుఁడు " కృష్ణస్య క్రియతాం కించి త్తథా ప్రతికృతం మయి" అని తెలిపెను. అప్పుడు మయుఁడేమి చేయుమందువో తెలుపు మని కృష్ణు నడిగెను. కృష్ణుఁడు ముహూర్త కాల మాలోచించి ధర్మరాజునకు సభ నిర్మింపు మని యాదేశించెను. ఇది మూలము నందలి కథ. తెలుఁగున మయుఁడు త న్న డిగిన వెంటనే "యర్జునుఁడచ్యుతు మొగంబు చూచి యతని నెద్దియేని నొక్క యపూర్వంబైన దాని నిర్మింప నియోగింపు మనినఁ గృష్ణుఁడు పెద్దయుం బ్రొద్దు విచారించి మయున కిట్లనియె నని చెప్పఁబడినది. "ముహూ ర్తమివ సందధ్యౌ" యని మూలమున నుండ నన్నయ "పెద్దయుం బ్రొద్దు విచారించి" యని దానికి వ్యతిరేకముగ వ్రాసియుండెను. ఇక్కడఁ గృష్ణుఁడు చెప్పవలసిన దసామాన్య మైన విషయము. అందుచే నాతఁడెక్కువసేపు ఆలోచించె ననుటయే యుక్త ముగా నుండును.

6. మయుఁడు తాను దానవు లందఱును యజ్ఞ మొనరించు చుండఁగా బిందుసరమున మణిమయమైన భాండము నొనరించి వృషపర్వుని సభలో నుంచె ననియు, నది యున్నచోఁ దీసికొని వచ్చెద ననియుఁ జెప్పినట్లు మూల మున వ్రాయఁబడినది.

"కృతం మణిమయం భాండం రమ్యం బిందుసరః ప్రతి
సభాయాం సత్యసంధస్య య దాసీ ద్వృషపర్వణః
ఆగమిష్యామి త ద్గృహ్య యది తిష్ఠతి భారత" (2-3-3)

"వృష పర్వుఁడను దానవేంద్రున కొక్క సభ నిర్మింప సమకట్టి వివిధ రత్నమయంబులైన యుపకరణంబు లొడఁగూర్చి బిందుసరం బను కొలను

సంగ్రహించిన వాఁడ నయ్యుపకరణంబుల దాని విచిత్రంబుగా రచియించి తెచ్చి ధర్మరాజున కిచ్చెద" (సభా. ౧-8) నని మయుఁడు చెప్పినట్లు తెలుఁగు భారతములో నున్నది. తెలుఁగు నందలి క్రమమే యుచితముగా నున్నది. ఏల యనఁ దరువాత విశ్వకర్మ బిందుసరమునకే యేగి యందున్న వివిధ రత్నోప కరణములను గ్రహించె నని చెప్పఁబడినది (2-3-16).

7. మయుఁడు సభనెక్కడ నిర్మించె నను విషయము మూలమున సందిగ్ధముగా నున్నది.

"ప్రతిగృహ్య తు త ద్వాక్యం సంప్రహృష్టో మయ స్తదా
విమానప్రతిమాం చక్రే పాండవస్య సభాం ముదా" (2-1-12)
"సభాం ప్రచక్రమే కర్తుం పాండవానాం మహాత్మనాం" (2-1-16)
"దశకిష్కుసహస్రాం తాం మాపయామాస సర్వతః" (2-1-19)
"కింకరై స్సహ రక్షోభి రగృహ్ణా త్సర్వమేవ తత్
తదాహృత్య తు తాం చక్రే సోఽ సురో ఽప్రతిమాం సభాం"
(2-2-16)

అను వాక్యముల వలన మయుఁడు బిందు సరమునుండి రత్నాది పరికరములను దెచ్చి యింద్రప్రస్థముననే సభ నిర్మించె నని తెలియు చున్నది.

"తాం స్మ తత్ర మయే నోక్తా రక్షన్తి చ వహన్తి చ
సభా మష్టౌ సహస్రాణి కింకరా నామ రాక్షసాః" (1-2-25)

అను శ్లోక మతఁడు దానిని బిందుసరము కడనే నిర్మించి తెప్పించెనేమో యను భావమును గలిగించు చున్నది. నన్నయ యీ ద్వైవిధ్యము దొలఁగించి మయుఁడు సభను బిందుసరము నొద్దనే నిర్మించి యెనిమిదివేల రాక్షస కింకరు లచే మోపించుకొనివచ్చి ధర్మరాజున కిచ్చె నని స్పష్టముగాఁ జెప్పియుండెను.

8. మూలమున నారదుఁడు వెళ్లిపోయినతరువాత ధర్మరాజు రాజర్షుల యొక్క మహత్త్వమును హరిశ్చంద్రుని మహానుభావమును దలంచుచు రాజ సూయము నొనరింపఁ దలంచె నని యున్నది.

"యుధిష్ఠిర స్తత స్సర్వా నర్చయిత్వా సభాసదః
ప్రత్యర్చిత శ్చ తై స్సర్వై ర్యజ్ఞా యైవ మనో దధే
స రాజసూయం రాజేంద్ర ! కురూణా మృషభః క్రతుం
ఆహర్తుం ప్రవణం చక్రే మన స్సంచిన్త్య సో ఽసకృత్" (2-12,4,5)

నన్నయ ధర్మజుని పితృభక్తిని బ్రజానురక్తిని జక్కఁగా సూచించుచు నాతని మానసికాందోళనమును స్పష్టముగా వ్యక్తము చేసెను.(సభా.౧-93,94,95,96.)

" పితృగణ హితార్థముగ స
త్క్రతు వొనరింపంగ బుద్ధి గలదు ప్రజాసం
హృతి తత్క్రతువున నగు నని
మతి నాశంకయును గలదు మానుగ నాకున్ " (95).

అను పద్య మాతని డోలాయమాన మానస పరిస్థితిని బరితలకు సాక్షాత్కరింపఁ జేయుచున్నది. ఈ పద్యములు మూఁడును నన్నయ కల్పించినవే. అటు పిమ్మట ధౌమ్యాదుల మాట లాతని మనఃక్లేశమును దొలఁగించి రాజసూయమున కున్ముఖు నొనరించెను.

9. సహదేవుఁడు దక్షిణ దిగ్విజయము చేసిన సందర్భమున మాహిష్మతీ పురమం దగ్ని పారదారికుఁడయి దండితుఁడైన వృత్తాంతము చెప్పఁ బడినది. అగ్ని బ్రాహ్మణ రూపమున మాహిష్మతీ నగరమున నేల సంచరించెనో మూలమునఁ జెప్పఁబడి యుండలేదు. అచ్చటి సందర్భము చూచిన నతఁ డట కరుగుటకుఁ బారదారికత్వమే కారణముగాఁ గానఁ బడును. నన్నయ " జాతవేదుండు విప్రుండయి వేదాధ్యయనంబు సేయుచు మాహిష్మతీ పురంబున నుండి ప్రమాదవశంబునం బారదారికుం డయ్యె " నని చెప్పి యుండెను. (సభా. ౧-253) అతఁడు మాహిష్మతికి విప్ర రూపమున నరుగుటకు వేదాధ్యయనాసక్తి కారణ మనియు, నందాతఁడా దోషము నాచరించుట ప్రమాద వశముచే ననియు నన్నయ సూచించుట యౌచిత్య శోభితముగా నున్నది ఇది యా కాలమున నగ్నియంత వానికిఁగూడ వేదము గఱపఁ జాలు మహాపండితులు మాహిష్మతీ నగరమున నుండి రనియు, ధీమంతులకుఁ గూడ నొక్కొక్కప్పుడు ప్రమాదము సహజ మనియు సూచించుచున్నది. మూలమున నాపట్టణము నందలి స్త్రీలు స్వైరిణులై యుండవచ్చు నని యగ్నియే వరమిచ్చె నని యున్నది.

" ఏవ మగ్ని ర్వరం ప్రాదాత్ స్త్రీణా మప్రతివారణే
స్వైరిణ్య స్తత్ర నార్యో హి యథేష్టం ప్రచరన్త్యుత "
(2-28-24)

నన్నయ యగ్ని రాజున కాతఁడు కోరిన వరమిచ్చి " మఱి నీవు నాకుఁ బ్రతిప్రియంబుసేయు మిప్పురంబు వింతు లెంతయు మనోజ రాగిణులు కావున వీరల స్వైరిణీ వృత్తి యెల్లకాలము సహింప వలె" నని యడిగె ననియు నాఁటం గోలె

మాహిష్మతీ పురంబు స్త్రీలకు స్వైరిణీత్వంబు నిర్దోష మయ్యె ననియుఁ గల్పించెను. అగ్ని యా పురము నందలి స్త్రీలకుఁ దానే వర మిచ్చె ననుట కంటె నా రాజును బ్రతి ప్రియం బడిగి తన్మిషమున నచ్చటి స్త్రీలకు స్వైరిణీత్వము నిర్దోష మగు నట్లంగీకరింపఁ జేయుట మిక్కిలి యుక్తముగా నున్నది.

10 మూలమున ధర్మరాజు దీక్షితుఁడై యజ్ఞాయతనమున కరిగినపిమ్మటఁ బలుదేశముల రాజులు వచ్చిరని చెప్పఁ బడినది. యజ్ఞ మారబ్ధమైన పిమ్మట వారు వచ్చిరనుట కంటె నంతకు ముందే వారు వచ్చి రనుట యుచితముగా నుండును గావున నన్నయ యా విధముననే వర్ణించెను. (సభా. ౧-288)

11. ద్యూతారంభమునకు ముందు మూలమున శకుని :

" ఉపస్తీర్ణా సభా రాజన్ రనుం చైవ కృతక్షణాః
అక్షానుప్త్వా దేవనస్య సమ యోస్తు యుధిష్ఠిర " (53-1)

అని ధర్మరాజుతోఁ బల్కి నట్లున్నది. ఈ వాక్యము శకుని యనుట కంటె దుర్యోధనుఁ డనుట యుక్తముగా నుండును. అందుచే నన్నయ :

" అయ్యపూర్వ సభా కుట్టిమంబున నందఱు సుఖాసీనులయి యిష్ట సంభాషణాది క్రీడావసరంబున నున్నంత దుర్యోధనుండు యుధిష్ఠిరున కిట్లనియె.

" అనఘ సుహృద్ద్యూతం బిం
దొనరింతము ప్రొద్దు వోకయును నగు జూదం
బునకుం బ్రియుఁడవు దక్షుఁడ
వన విందుము విన్నుఁ బ్రీతి నక్షజ్ఞుల చేన్ " (సభా. ౨.164)

అని దుర్యోధనుఁడే యాహ్వానించినట్లు వ్రాసెను.

12 భీముఁడు దుర్యోధనుని తొడలు విఱుగ నడచెద నని ప్రతిన చేసిన పిమ్మట ధృతరాష్ట్రుని యింటఁ బుట్టిన మహోత్పాతములను వర్ణించు సందర్భమున మూలమున :

" తం రాసభాః ప్రత్యభాషన్త రాజన్
సమంతతః పక్షిణ శ్చైవ రౌద్రాః " (2-63-22)

అని చెప్పఁబడినది. నన్నయ దీనిని విడిచి

". ....అగ్నులు శాంత
ద్యుతులయ్యెఁ గౌరవస్త్రీ తతి హృదయము లధిక శోకతప్తము లయ్యెన్.
క్రూరాత్మకులై దుష్పదవీ రతులగు ధార్తరాష్ట్ర వీరుల కయ్యా
గారముల నెగసె నెంతయు ఘోరంబుగఁ గాకఘూకఘూత్కారంబుల్ "
(స-౨-251, 252)

అను నమూలకములైన యరిష్టములను గల్పించెను. ఈ సంగతి నెఱింగి

" భీష్మ ద్రోణౌ గౌతమ శ్చాపి విద్వాన్

స్వస్తి స్వ స్తీ త్యపి చైవాహు రుచ్చైః " (2-63-23)

అని భీష్మ ద్రోణాదులు స్వస్తి స్వస్తి యనిరని మూలమున నున్నది. తెలుఁగున నన్నయ వారు " నెట్టన ధృతరాష్ట్రజులకుఁ బుట్టె నరిష్ట మని " తమలో నిష్టమునఁ బలికినట్లు వర్ణించెను. ఇది వారికి ధార్త రాష్ట్రుల ధౌర్త్య మునఁ గల యేవగింపు సూచించుచున్నది. ఇచ్చట నన్నయ యరిష్ట శబ్దము నుపయోగించుట యాతని సమయస్ఫూర్తిని బ్రకటించు చున్నది. అరిష్ట మనఁగా మేలు, కీడు అను నర్థములు రెండు నున్నవి.

అరణ్య పర్వము :-

13. ధృతరాష్ట్ర తిరస్కృతుఁడై విదురుఁడు హస్తినా పురము విడిచి పాండవుల కడ కరిగిన పిమ్మట ధృతరాష్ట్రుఁడు వ్యథితుఁడై యాతని మరలఁ దీసికొని రమ్మని సంజయునిఁ బంపెను. సంజయుఁ డరిగి విదురునితోనే "ధృత రాష్ట్రుఁడు నిన్ను స్మరించుచున్నాఁడు. నీ వాతని కడ కరిగి యతని బ్రతికింపు" మని చెప్పినట్లు (3-7-15) మూలమం దున్నది నన్నయ సంజయుఁడు ధర్మ తనూజునకు నమస్కరించి " మిమ్ము ధర్మార్థ విదుండైన విదురునిం గౌర వేంద్రుఁ డెప్పుడుం దలంచు చుండు. మీ యనుమతంబునఁ దన యనుజుం దోడ్కొని తేర నన్నుఁ బుత్తెంచె" నని ధర్మజునితోఁ బలికినట్లును ధర్మజుఁడు పితృభక్తి ప్రేరితుఁడై విదురు నడుగు మని కోరఁగా నతఁ డరిగి నట్లును వర్ణించెను. ఈ విషయము సంజయుఁడు ధర్మజునితోఁ జెప్పుట మిక్కిలి యుచితము.

14. దమయంతి నలుని వరించిన పిమ్మట వింద్రాగ్ని యమ వరుణులు నలుగురును " ప్రహృష్ట మనసస్సర్వే నలాయాష్టౌ వరా న్దదుః " (3-54-28) అని యున్నది. నన్నయ వారు నలుగురును నాలుగు వర ములే యిచ్చినట్లు వర్ణించెను. (అర. ౨-౫౬)

15. రోమశుఁడు ధర్మజున కిల్వల వాతాపుల కథ చెప్పు సంద ర్భమున మూలమం దిల్వలుఁ డొక్క బ్రాహ్మణు నర్చించి "పుత్త్రం మే భగవా నేక మింద్రతుల్యం ప్రయచ్ఛతు" అని యడిగె ననియు, నతఁ డా వరము నొసఁగక పోవుటచేఁ గోపించి, వాతాపిని మేష రూపునిం జేసి

వధించి, యా మాంస మా విప్రునికిఁ బెట్టించి పిమ్మట వాతాపిని బిల్వఁగా నతఁడు విప్రు కడుపు వ్రచ్చుచు వెలువడి వచ్చె ననియుఁ జెప్పఁబడి యున్నది. ఇచ్చట నిల్వలు డింద్రతుల్యుఁ బుత్త్రి నడుగుట యుక్తముగా లేకపోవుటచే నన్నయ "నాకు సకలకామసిద్ధికరంబగు మంత్రం బుపదేశింపు"మని ప్రార్థించి విఫల ప్రార్థనుండై యలిగి తరువాత నతనిఁ జంపెనని వ్రాసి యుండెను. (అర. ౨.319). పుత్త్రి నిచ్చుటయు నీయక పోవుటయు నా క్షణముననే తేలు విషయములు కావు. అందుచే నన్నయ యీ మార్పు కావించి యుండును.

16. సగరుఁడు తన యిరువురు భార్యలతోఁ గైలాసమున కరిగి యీశ్వరునిఁ గూర్చి పుత్త్రార్థియై తప మొనరించెను. ఈశ్వరుఁడు వైదర్భి యందు అఱువదివేవురు కొడుకులను, శైబ్యయం దొక్క కొడుకుంగా వరమిచ్చి యయ్యఱువదివేవురు నతి దర్పితులై యేక కాలంబునఁ గాల గోచరు లగుదు రనియు నయ్యొక్క కొడుకు వంశకర్త యగు ననియుఁ జెప్పి యదృశ్యుఁ డయ్యెను. అప్పుడు మూలమున :

" స చాపి సగరో రాజా జగామ స్వం నివేశనమ్
పత్నీభ్యాం సహిత స్తాత ! సో ऽ తి హృష్టమనా స్తదా "
(3-104-16)

అని సగరుఁ డతి హృష్టుఁడై యింటి కరిగె నని వ్రాయఁ బడినది. ఇచ్చట నిజముగా నాతఁడు సంతోష పడుటకు హేతువు లేదు. పుత్త్రులు జనింతు రనుట సంతోషకరమే యైనను అందుఁ బలువురు దర్పితులై యేక కాలమున మరణింతు రనుట దుఃఖ కారణమై నట్టిది. అందుచే నన్నయ :

"కొడుకులఁ బలువురఁ బడసియుఁ ।
బడయని యట్టిదయి ధర్మపత్నులు దానుం
గడు సంతప పడ కరిగెను
దడయక సగరుండు మగిడి తన పురమునకున్ " (అర. 3-52)

అని మార్చి యుచితరీతి వ్రాసి యుండెను.

17. హైహయుఁడు జమదగ్ని ఆశ్రమమున కరుదెంచి గోవత్సమును మాత్రమే గొనిపోయె నని మూలమం దున్నది. ( " జహార వత్సాం " ). వత్సము నొక్క దానిని గొని పోవుటలోఁ బ్రయోజన మేమియుఁ గాన

రాకున్నది. అందుచే నన్నయ "జమదగ్ని హోమధేనువును దరుణ వత్సంబుతోఁ గట్టుకొని పోయిన" (అర-3-141) అని ధేనువును సవత్స ముగాఁ గొనిపోయినట్లు వర్ణించెను.

18. అర్జునుఁ డింద్ర లోకము నుండి వచ్చిన పిమ్మటఁ దా నస్త్ర ముల సంపాదించిన విధము సోదరుల కెఱింగించెను. ధర్మరా జా యస్త్ర ముల నన్నింటిఁ జూడఁ గోరెను. అర్జునుఁ డప్పుడు :

"శ్వః ప్రభాతే భవాన్ ద్రష్టా దివ్యా న్యస్త్రాణి సర్వశః
నివాత కవచా ఘోరా యై ర్మయా వినిపాతితాః" (3-171-16)

అని పల్కినట్లు మూలమం దున్నది. తెలుఁగున నన్నయ క్రీడి వానిని సోదరునకు వెంటనే చూపించినట్లు వర్ణించి యుండెను.

"దివ్య బాణములఁ దదీయ ప్రయోగముల్ మాకుఁ జూపు మనిన
మఘవ సుతుఁడు
వేఱు వేఱ చూపె వేలుపు లిచ్చిన యస్త్ర శస్త్రములు నిజాగ్రజునకు"
(అర. ४-92)

ధర్మ రా జాత్రమున వానిఁ జూపుమని యడుగుచుండ నర్జునుఁడు రేపు చూపెద ననుట యాతని భ్రాతృభక్తికి లాఘవ మాపాదించును. అందుచే నన్నయ యిట్లు మార్చి యుండును.

G. మూలమం దున్న విషయ మౌచిత్యహీనముగాఁ గనఁబడుటచే నన్నయ యందలి యనౌచిత్యమును దొలఁగించి మార్చి వ్రాసిన భాగము లనేకము లున్నవి. ఇట్టి చోట్ల నన్నయ మూలమునకు నిజముగా వన్నె చేకూర్చె ననియే చెప్పవలయును. ఈ మార్పు లాతని కావ్యకళా దృష్టికిని బ్రతిభా విశేషమునకును నిదర్శనములు.

ఆది పర్వము :-

1. ఉదంకుఁడు పౌష్య మహాదేవిం గానక యాతని కడకుఁ దిరిగి వచ్చినప్పు డతఁడు "సంప్రతి భవా నుచ్ఛిష్టః స్మర తావత్. నహి సా క్షత్రియా ఉచ్ఛిష్టే నాశుచినా వా శక్యాద్రష్టు" మ్మని (1-3-111) చెప్పినట్లు మూలమం దున్నది. ఇట్లు పల్కుట మార్దవ శూన్యమై యుదంకుని మానసమునకు నొప్పి కల్గించు నట్టిదిగా నున్నది. నన్నయ యా భావమునే నాగరికముగా మార్చి యిట్లు చెప్పెను.

" భూ వినుతః విన్నుఁ ద్రిభువన పావను నళుచి వని యెట్లు పలుకఁగ నగు న ద్దేవి పవిత్ర పతివ్రత. గావున నళుచులకుఁ గానఁ గాఁ దనవద్యా!"(ఆది. ౧-96)

2. ఉదంకుఁడు నాగలోకమున దివ్యపురుషుని స్తుతించి యాతఁడు నీ కభీష్ట మేదియో చెప్పుమని యడుగఁగా " ఈ నాగ కులం బెల్ల నాకు వశ మగునట్టు " లొనరింపు మని ప్రార్థించెను. అంత నాతఁడు " ఏత మశ్వమ పానే ధమస్వ " యని యుదంకునితోఁ జెప్పినట్లు మూలము. అపానధ్మాన మశ్లీలముగాఁ దోఁచుటచే నన్నయ యా పురుషుఁ డుదంకుని " ఈ యశ్వకర్ణధ్మానంబు సేయు " మని యాదేశించి నట్లు వ్రాసి యుండెను.

3 కద్రూ వినతలు సముద్ర తీరమున నుచ్చైశ్శ్రవమును జూచి నప్పుడు కద్రువ దాని రంగేమి యని వినత నడిగి నట్లును, వినత యది తెల్లగా నున్నదని చెప్పి " బ్రూహి వర్ణం త్వమ ప్యస్య తతో ఒత్ర విపణా వహే " (1-18-3) అని పందెము వేయుద మని యామెయే ముందు పల్కినట్లును మూలమం దున్నది. వినత శీలమున కిది విరుద్ధముగా నున్నది. నన్నయ కద్రువ యశ్వరాజు వాలప్రదేశము నల్లయై యున్న దని పలుక వినత యది మహాపురుష కీర్తి వలె నతి నిర్మలమై యున్నదని చెప్పె ననియు నంతఁ గద్రువ నవ్వి " అమ్మహాశ్వంబు ధవళ దేహంబు నందు నల్ల గలిగిన నీ విప్పు నాకు, దాసి వగుము. మఱి యందు నల్ల లేదయ్యేనేని నీకు నే దాసి వగుదుఁ బన్నిదము సఱము. (ఆది. ౨. 32)" అని పందెము ప్రసక్తి తెచ్చె ననియు వ్రాసెను. కద్రువ యి ట్లనుట యామె సామాన్య ప్రవృత్తి కనుగుణముగా నున్నది.

"వినత యయ్యశ్వంబు దాసి చూతము రమ్మ"నినఁ గద్రువ "యిప్పుడు ప్రొద్దులేదు. రేపకడ చూత" మనుట సహజముగా నుండుటే కాక యామె యాడఁ దలఁచిన కపట నాటకమున కనుకూలముగా నున్నది. మూలమున "జగ్మతుః స్వగృహానేవ శ్వోద్రక్ష్యావ ఇతి స్మహ" అని యిద్దరును బలికి నట్లున్నది.

4. జరత్కారువు గర్భము దాల్చిన సందర్భమున మూలమందు

"అతీవ తపసా యుక్తో వైశ్వానర సమద్యుతిః
శుక్లపక్షే యథా సోమో వ్యవర్ధత తథైవ సః" (1-43-12)

గర్భగర్భము శుక్లపక్ష చంద్రుని వలె వృద్ధి నొందె నని చెప్పఁబడినది. అని మనఁగా గర్భస్థ శిశు వని యర్థము. అట్టి శిశువు వృద్ధి కనరానిది. దానిని

వర్ణించుట యుచితముగా నుండ దని నన్నయ జరత్కారువు "తద్దయు గర్భం బనురక్తిఁ దాల్చి యొప్పెను దినకరగర్భయగు పూర్వదిక్సతి పోలెన్" అని యామెను వర్ణించెను. "దినకర గర్భయగు" నను నుపమాన మందలి విశేషణముచేఁ బుట్టఁ బోవు శిశువు తేజోవిశేషము లెస్సగా సూచింపఁ బడినది.

5. క్షత్త్రియుఁడు విప్రకన్యను వివాహ మాడుట విరుద్ధాచారము. వర్ణాశ్రమ పాలకుఁ డైన రా జెవ్వఁడు నట్టి వ్యత్యయము నంగీకరింపఁడు. యయాతి యట్లు చేసెను. అందుచేతనే నన్నయ జనమేజయునిచే,

"వర్ణ ధర్మముల్ గాచుచు వసుధ యెల్ల ననఘచరితుఁడై యేలిన
య య్యయాతి
భూసురోత్తమ ! భార్గవ పుత్త్రియైన దేవయానిని దా నెట్లు దేవిఁ జేసె.
(ఆది. 3–97)

నను ప్రశ్న నడిగించెను. ఈ ప్రశ్న యెంతో యుక్తియుక్తమై సాభిప్రాయ ముగా నున్నది. వైరుద్ధ్యమేదైన నుండు నప్పుడే ప్రశ్న కవకాశ ముండును. మూలమున నిచ్చట :

"యయాతిః పూర్వకో ఽస్మాకం దశమో యః ప్రజాపతేః
కథం స శుక్రతనయాం లేభే పరమదుర్లభామ్" (71–1)

అని యేదో కథను వినుటకై ప్రశ్న నడిగినట్లున్నది.

6. మూలమున కచుఁడు "గాయ న్నృత్య న్వాదయం శ్చ దేవాయానీ మతోషయత్" అనియు "దేవయాన్యపి తం విప్రం నియమవ్రతచారిణం అను గాయమానా లలనా రహః పర్యచర త్తదా" (1–71–14) అనియు కచదేవయాను లొండొరులఁ బ్రీతి నొందించిన విధము వర్ణిత మైనది. కచుని స్వభావమును బట్టి చూచినచో నిది విపరీతముగాఁ గనవచ్చును. అందుచే నన్నయ యిది యంతయు విడిచి కచుఁడు "మఱి యంతకంటె దేవయానికి సువిధేయుఁడై ప్రియ హిత భాషణములఁ బుష్పఫల విశేష దానములను సంతత ప్రీతి" చేయు చుండె నని మాత్రము వర్ణించెను.

7. శర్మిష్ఠా దేవయాన్యాదులు వనమునఁ గ్రీడించు చుండఁగా నింద్రుఁడే వాయుభూతుఁడై వారి వస్త్రములను గలపి వేసె నని మూలమునం దున్నది.

(1-73-4) ఇంద్రుఁడట్లు చేయుట యౌచిత్యవంతముగా లేమిచే నన్నయ యా వస్త్రములు "సురకరువలి చేతం బ్రేరితంబులయి కలసె" నని వర్ణించెను. (ఆది. 3-134)

8. దుష్యంతుఁడు శకుంతలను నాకు భార్యవు కమ్మని కోరినప్పు డామె

"మమ జాయేత యః పుత్త్రః స భవే త్త్వదనన్తరమ్
యువరాజో మహారాజ! సత్య మేత ద్బ్రవీహి మే
య ద్యేత దేవం దుష్యన్త అస్తు మే సంగమ స్తదా" (1-67-16, 17)

అని పల్కినట్లు మూలమునఁ జెప్పఁ బడినది. శాకుంతలుఁడు దుష్యంతుని యనంతరము రాజు కావలెను గాని యువరాజు కాదు. అతని కాలమున నాతఁడు యువరాజుగా నుండవలెను. అందుచే నన్నయ "త్వదనన్తర" మ్మను మాట తొలఁగించి :

"వరమత నీ ప్రసాదమున నా కుదయించిన నందనున్ మహీ
గురుతర యౌవరాజ్యమునకున్ దయతో నభిషిక్తుఁ జేయఁగా
వరము ప్రసన్నబుద్ధి ననవద్యముగా దయసేయు నెమ్మితో."
(ఆది. ४-59)

అని శకుంతల యడిగినట్లు వ్రాసియుండెను.

9. శకుంతల దుష్యంతునిచేఁ దిరస్కృతయై

"యది మే యాచమానాయా వచనం న కరిష్యసి
దుష్యన్త శతధా మూర్ధా తత స్తేఽద్య ఫలిష్యతి" (1-68-35)

అని పలికినట్లు మూలము. పతివ్రత యైన శకుంతల కోపమునఁ గూడ నిట్లనుట యుచితము గాకపోవుటచే నన్నయ యీ భాగమును విడిచి వైచెను.

10. భీష్ముఁడు స్వయంవరాగతులైన రాజుల నందఱి నోడించి కాశీరాజ కన్యలను గొనిపోవు చుండఁగా సాల్వుఁడాతని వెంట నంటి "స్త్రీ కామ! తిష్ఠ తిష్ఠేతి భీష్మమాహ స పార్థివః" (96-17) అన్నట్లు మూలము. నిజమునకు భీష్ముఁ డా కన్యలను దనకై గొనిపోవుట లేదు. అతని స్త్రీ కాముఁ డనుట యుచితము కాదు. అందుచే నన్నయ ఆ మాటలు విడిచి సాల్వుఁడు వీరోచితముగాఁ బలుకుచు నతనిఁ దాఁకె నని వర్ణించెను. (ఆది. ४-204)

11. పాండురాజు మాద్రిని బెండ్లియాడు సందర్భమున మూలమం దామె పాండురాజు కొఅకు విస్తార ధనముచేఁ గొనఁ బడె నని చెప్పఁబడినది. ["పాండోరర్థే పరిక్రీతా ధనేన మహతా తదా" (105-5)] నన్నయ ధన విషయము విడిచి "మఱియు మద్రరాజ తనయ మాద్రి యనుదాని మహోత్సవం బునఁ బాండురాజు" వివాహ మాడె నని మాత్రము చెప్పియుండెను. (ఆది. ౫-35) ఇట్లే సంతాన విచ్ఛేదముచే వగచుచున్న సత్యవతికి భీష్ముఁడు "బ్రాహ్మణో గుణవాన్ కశ్చి ద్ధనే నోపనిమన్త్ర్యతా" మ్మని చెప్పినట్లు మూల మందున్నది. ఇచ్చటఁ గూడ ననౌచిత్య భీతిచే నన్నయ ధన విషయమును దొలఁగించెను.

12. కుంతి ధర్మరాజాదులను గన్న పిమ్మట మాద్రి పాండురాజుతో రహస్యమున :

"గాంధార్యా శ్చైవ నృపతే జాతం పుత్త్రశతం తథా
శ్రుత్వా న మే తథా దుఃఖ మభవ త్కురునందన
ఇదం తు మే మహద్దుఃఖం తుల్యతాయా మపుత్త్రతా
........ .................... .. ... . ...............
స్తంభోహి మే సపత్నిత్వా ద్వక్తుం కుంతిసుతాం ప్రతి
యది తు త్వం ప్రసన్నో మే స్వయ మేనాం ప్రచోదయ"
( 115, 3-6 )

అని పల్కినట్లు మూలమందున్నది. ఈ పల్కులలో మాద్రికిఁ దనకు సంతానము లేదను దుఃఖము కంటెఁ గుంతికి సంతానము కలిగె నను దుఃఖమును, సపత్ని మాత్సర్యమును నధికముగా నున్నట్లు గోచరించు చున్నది. నన్నయ యామె శీలము నందలి యా మాత్సర్యమును దొలఁగించి :

"కోరిన కోర్కికిం దగఁగఁ గుంతి సుతత్రితయంబు గాంచె గాం
ధారియు నక్కడన్ సుతశతంబు ముదం బొనరంగఁ గాంచె నేఁ
గోరచి యాడుఁ బుట్టువునఁ బుట్టి నిరర్థక జీవ నైతి పం
సార సుఖావహంబయిన సత్సుత జన్మముఁ గానఁ బోలమిన్"
(ఆది. ౫-129)

అని యామె విచారమునకు సంసార సుఖావహ మైన సత్సుత జన్మముఁ గానఁ బోలమియే కారణమని చెప్పియుండెను.

నకుల సహదేవుల జనన మైన పిమ్మట మూలమునఁ బాండురాజు మాద్రీ నిమిత్తమై కుంతిని మరల వర్థించె ననియు నామె,

"ఉక్తా సకృ ద్ద్వంద్వ మేషా లేభే తే నాస్మి వంచితా
బిభే మ్యస్యాః పరిభవా న్నారీణాం గతి రీదృశీ
నాజ్ఞాశిష మహం మూఢా ద్వంద్వాహ్వానే ఫలద్వయమ్
తస్మా న్నాహం నియో క్తవ్యా త్వ యైషో ఽ స్తు వరో మమ"

(115-24)

అని పలికె ననియు వ్రాయఁ బడి యున్నది. ఇందు కుంతి మాత్సర్యశీలము వ్యక్తమగుచున్నది. నన్నయ యందుచే నీ భాగమును విడిచి వేసెను.

12. అర్జునుఁడు ద్రోణుని వలన నస్త్రములు పెక్కు నేర్చి యాతనికిఁ బ్రియుఁడై యుండె నని చెప్పిన పిమ్మట మూలము,

"ద్రోణేన తు తదాహూయ రహ స్యుక్తోఽ న్నసాధకః
అంధకారేఽ ర్జునా యాన్నం న దేయం తే కథం చన"

(1-123-2)

అని యర్జునున కంధకారమున నెన్నఁడు నన్నము పెట్టవద్దని సూదునితో ద్రోణుఁడు చెప్పినట్లు తెల్పుచున్నది. అతఁ డట్లు చెప్పుట కర్జునుఁడు చీఁకటిలో నేయ కుండవలె నను నతని యభిలాషయే కారణము. ద్రోణుఁ డర్జునుని యెడ నిట్టి యీర్ష్యాభావము కలిగియుండె ననుట కాధారము లేవియును లేవు. నన్నయ ద్రోణుని శిష్యవాత్సల్యమునకు మచ్చ యని చెప్పఁ దగిన యీ యంశమును మార్చి "అయ్యర్జును తోడి విద్యా మత్సరంబునఁ జీఁకటి నాతఁ డేయ నేర కుండవలయు నని తలంచి యశ్వత్థామ రహస్యంబున నన్న సాధకుం బిలిచి యెన్నండును నరున కంధకారంబునఁ గుడువం బెట్టకుమీ యని పంచె" నని ( ఆది. ౫-227 ) వ్రాసి యుండెను. ద్రోణుఁడు కాక యశ్వత్థామ యట్లు సూతునితోఁ జెప్పె ననుట యౌచిత్యాకరమై యున్నది.

14. అస్త్ర విద్యా ప్రదర్శన సందర్భమున కర్ణుఁడు సూతపుత్త్రుఁ డని యెఱింగి భీముఁ డతఁడు నృప ధర్మోదయుఁ డగు నర్జునునితో యుద్ధము చేయుటకుఁ దగఁడనియు, నుత్తమ క్షత్త్రియ ప్రవరోప భోగ్యమైన యంగ రాజ్య మతని కర్హము కా దనియుఁ బలుకఁ గర్ణుఁడు వెల్లనయి యేమియుఁ జేయ నేరక నిట్టూర్పులు పుచ్చుచుండెను. అంత భ్రాతృమధ్యమున నున్న దుర్యోధనుఁ డదిచూచి భీమునితో "అనిలజః నీ కిట్లని పల్కను, దలఁపను నగునె లేదీ కడుపునఁ బులి పుట్టునె" యని పల్కినట్లు నన్నయ వ్రాసి

యుండెను. ఇచ్చట అనిలజ యను సంబోధనము సముచితమై యెంతో భావ గర్భితముగా నున్నది. అది భీముని జన్మరహస్యమును వెల్లడించుచు నాతని లెస్సగా నుపాలంభించుచున్న ట్లున్నది. మూలమున నీ సందర్భమున "వృకోదరః న యుక్తం తే" అని వృకోదర శబ్దము వాడఁ బడినది.

15. అర్జునుఁడు మత్స్యయంత్రము నేసిన పిమ్మట స్వయంవరాగతు లైన రాజులందఱును గుపితులై ద్రుపదుపై నెత్తి వచ్చిరి. అప్పుడు కర్ణుఁ డర్జునుని, శల్యుఁడు భీమునిఁ దాకిరి. ఆ సమయమున విప్రులు దండాజినముల నెగురవేయుచు "మేము శత్రువులతోఁ బోరుదుము. నీ వేమియు భయపడకు" మని యర్జునితోఁ జెప్పినట్లు మూలమున వ్రాయఁ బడినది. నన్నయ రాజు లందఱును దనపై నెత్తిరాఁగా ద్రుపదుఁడు భీతుఁడై బ్రాహ్మణుల మఱువు సొచ్చె ననియు, నప్పుడు వారు ద్రుపదు నోడకుండు మని తమ దండాజినంబు లెత్తుకొని ప్రతిబలంబు పయి వీచు చుండి రనియు వ్రాసియుండెను. బ్రాహ్మణులు మహావీరు డైన యర్జునునితోఁ గాక భీతుఁడై తమ మఱువు చొచ్చిన ద్రుపదునితో నిట్లని రనుట యుచితముగా నున్నది.

16. తిలోత్తమ బ్రహ్మయానతిపై సుందోప సుందులకడ కరుగుచు దేవసభకుఁ బ్రదక్షిణ మొనర్చెను. అప్పుడు శివుఁడు తత్సౌందర్యదర్శన లాలసుఁడై యామె యే దిక్కున నున్న నా దిక్కునకుఁ దిరిగె ననియు, నీ విధ ముగా నతఁడు చతుర్ముఖుఁ డయ్యె ననియు [ఏవం చతుర్ముఖః స్థాణుః మహాదేవో ఽ భవత్పురా (203-26) ] మూలమందున్నది. నన్నయ శివుఁడే చతుర్ముఖుఁ డయ్యెనని వ్రాయక "తత్క్షణంబ తద్రూప సౌందర్య దర్శన లోలుఁడై యజుఁడు నాలుగు దిక్కులందుఁ దనకు గావించుకొనియె ముఖంబు" లని వ్రాసి మూలము నందలి యసందర్భమును దొలఁగించెను.

సభాపర్వము :

17. ధర్మరాజు మయసభలో నుండినప్పు డతని ననేకులు సేవించు చుండి రని మూలమందున్నది. వారిలో వేదవేదాంగ పారగులైన పలువురు ఋషులు కూడ నుండిరి.

"మునయో ధర్మసహితా ధృతాత్మానో జితేంద్రియాః
ఏతే చా న్యే చ బహవో వేద వేదాంగ పారగాః
ఉపాసతే మహాత్మానం సభాయా మృషిసత్తమాః" (2-4-17)

నన్నయ ధర్మతనయుఁడే యీ మహామునుల నెల్లఁ బూజించి వారల వలన ధర్మ కథలు వినుచుఁ దమ్ములుం దానును సుఖం బుండె నని వ్రాసియుండెను. (సభా. ౧-21)

18. బృహద్రథుని భార్యలు తమకు శరీర శకలము లుదయింపఁగనే భయపడి యుద్విగ్నలై యాలోచించి వానిని విడిచి పైచి రని మూల మందున్నది.

"దృష్ట్వా శరీరశకలే ప్రవేపాతే ఉభే భృశమ్
ఉద్విగ్నే సహ సంమన్త్ర్య తే భగిన్యౌ తదాబలే
సజీవే ప్రాణిశకలే తత్యజాతే సుదుఃఖితే" (2-16-36)

నన్నయ కేవల భయమునే కాక లజ్జనుగూడ వర్ణించుట మిక్కిలి సహజమును సముచితమునై యున్నది.

"అమ్మానిసి వ్రయ్యలు గని యమ్ముదితలు వెఱచి వీని నాత్మజుఁడని నె
య్యమ్మున నెట్టులు సూపుదు మిమ్మనుజేశ్వరున కంచు నెంతయు లజ్జన్ (సభా. ౧-145)

19. గిరివ్రజము చుట్టును గల యైదు పర్వతములను వర్ణించు పట్టున మూలమందు :

"ఏతే పంచమహాశృంగాః పర్వతాః శీతలద్రుమాః
రక్షం తీ వాభిసంహత్య సంహతాంగా గిరివ్రజమ్" (2-19-3)

అని చెప్పఁబడినది. "సంహతాంగాః" అనఁగా నొంటొంటితో లెస్సగాఁ గలసిన దేహములు (రూపములు) గలవై యని యర్థము. నన్నయ యిచ్చుట :

"భూరి గిరులేను దీనికి శూర భటులు వోలెఁ గాచి చుట్టును నుండున్" (స. ౧-174)

అని యీ పర్వతములను శూర భటులతోఁ బోల్చుట రమణీయమై యున్నది.

20. కృష్ణార్జున భీములు గిరివ్రజమున జరాసంధు సౌధములు చేరఁగనే యాతఁడు వారి కెదురు వచ్చెను. అంత వా రాతనిఁ జూచి "స్వస్త్యస్తు కుశలం రాజ" న్నని పలికినట్లు మూలమందున్నది. వారు జరాసంధునికి "స్వస్తి" కోరుట సహజముగాదు. అందుచే నన్నయ యీ మాట విడిచి వైచెను.

21. భీమ జరాసంధులు పోరాడుటకు ముందు మూలమున జరాసంధుఁడు బలిరాక్షసుఁడు శక్రునివలె భీమునిఁ దాకె నని యున్నది. ఈ యుపమానమున భీముని భవిష్యజ్జయము సూచిత మగుటలేదు. ఏలయన బలియే యింద్రుని నోడింపఁ గల్గెను. అందుచే నన్నయ దానిని మార్చి

" . ... ................... .....................పోరిరూ
ర్జిత భుజదర్పమేర్పడఁగ సింహ గజేంద్రములట్లు వజ్రప
ర్వతముల యట్లు ఘోరతర వాసవ వృత్రుల యట్లు నిద్ధఋన్"
(స. ౧-205)

ఈ యుపమానము లుచితములై ముందు రాఁబోవు జరాసంధుని యోటమిని భీముని యాధిక్యమును జక్కఁగా సూచించు చున్నవి.

22. పాండవ సభా వైభవము చూచి దుర్యోధనుఁ డీర్ష్యావశమున వివర్ణుఁడై కృశించిన తఱి శకుని యాతని వోదార్చి ధృతరాష్ట్రుని కడకుఁ గొనిపోయి యతని శరీర కార్శ్యవైవర్ణ్యంబునా లా యంధరాజునకు వర్ణించి చెప్పఁగా నతఁడు "కొడుకు నొడలంటి చూచి కడు దుఃఖితుఁ డయ్యె"నని నన్నయ వ్రాసి యుండెను. అమూలక మైన యీ కల్పన యెంతయో సహజమై ధృతరాష్ట్రునికి కొడుకుపైఁ గల ప్రేమాతిశయమును జక్కఁగా వ్యక్తము చేయుచున్నది.

23. ద్యూతార్థము ధర్మజుని హస్తినాపురమునకుఁ గొనిపోవచ్చిన విదురుఁడు మూలమున నాతనిఁ జూచి కుశల ప్రశ్నానంతరము (52 వ అధ్యాయము) 6, 7, 8 శ్లోకములలో ధృతరాష్ట్రుఁడు చెప్పిన పలుకు లన్నియుఁ జెప్పెను. నిజమునకు విదురున కీ ద్యూత వ్యాపార మిష్టములేదు. అందుచే నన్నయ యీ వివర మంతయు విడిచి "విదురుఁ డతనిచే నభ్యర్చితుఁ డయి కుశలం బడిగి నిజాగమన ప్రయోజనం బెఱింగించె" నని యీ విషయము నంతయు సంగ్రహముగను వ్యంగ్యముగను సూచించి విడిచి పెట్టెను.

ఇట్లే అరణ్యపర్వమునఁ గిరాతుఁడు దమయంతిని జూచి కామ విశాత శరాహతుఁడైనప్పు డాతఁ డామెతోఁ బల్కిన పల్కు లేమియు వ్రాయక నన్నయ "నిజ హృదయం బెఱింగించె లతాంగి కనింద్య చరిత్రకు వేడుక తోన్" (అర. ౨-89) అని యతని కోరికను వ్యంగ్యముగాఁ దెలిపి

యుండెను. అనుచిత విషయముల నీ విధముగా వ్యంగ్య రీతిని సూచించుట యం దౌచిత్య మెక్కువగా నుండును.

24. ద్యూత సమయమున విదురుఁడు ధృతరాష్ట్రునకు రహస్యముఁగా జెప్పిన వాక్యములలో మూలమున :

"వృక్షా నంగారకా రీవ మైనాన్ ధాక్షీః సమూలకాన్
మాగమః ససుతామాత్యః సబల శ్చ పరాభవమ్" (55-16)

అని యతవిని గూర్చియే చెప్పినట్లున్నది. నన్నయ :

"అంగారములు గొను వేడ్కఁ బుష్పఫలావళీ లలిత
తుంగ ద్రుమ ప్రకరంబుఁ గరుణా విదూరుఁడై కాల్చు
నంగారకారుఁ బోలంగ సమకట్టె నర్థ లోభంబు
నం గురుకుల హానికరుఁడు ధారుణీనాథ నీ సుతుఁడు" (స. ౨-182)

అని యా యుపమానమును దుర్యోధనునిఁ గూర్చి చెప్పి యుండెను. విదురుఁ డిది ధృతరాష్ట్రు నుద్దేశించి కాక దుర్యోధన విషయముగాఁ జెప్పుట యుచితమై యొప్పారుచున్నది.

25. ప్రాతికామి ద్రౌపది కడ కరుదెంచి ధర్మరాజు ద్యూతమున నోడిన సంగతి చెప్పి కౌరవేశ్వరు కడకు రమ్మని పలుకఁగా నామె :

" మూఢో రాజా ద్యూత మదేన మత్తః
అహో నాన్య త్కైతవ మస్య కించిత్ " (2-60-5)

అని పలికినట్లు మూలమం దున్నది; ద్రౌపది ధర్మరాజు నిట్లు దూషించుట యౌచిత్యమునకు దవ్వుగా నున్నది. అందుచే నన్నయ :

"ఏ యుగంబు నందు నెట్టి దుష్కృతవుండు భార్య నొడ్డి యోటుపడిన భర్త
గలఁడె యిది వినంగఁ గడు నపూర్వం బయ్యె నిట్లు సేయు నొక్కొ యిందు
కులుఁడు (స. ౨. 208)

అని యామె చెప్పినట్లు మార్చి వ్రాసెను. ఇది ద్రౌపదికి ధర్మజుని ద్యూత పరాజయము నెడఁగల జుగుప్సను అతని యెడఁ గల సహజ గౌరవమును గూడ వెల్లడి చేయుచున్నది.

26. దుశ్శాసనుఁడు ద్రౌపదిని వెంట్రుకలు పట్టుకొని సభలోనికి లాగి నప్పుడు మూలమున "చకర్ష వాయుః కదలీ మివార్తా" (60-24)

మను నుపమాన మున్నది. నన్నయ యప్పు డామె వాతావధూత మైన పతాక వలె నుండె నని వర్ణించెను. ఈ యుపమానము ద్రౌపది యా సమయ మందుఁ బొందిన వేదనా చాంచల్యముల నెంతో విశదముగా వ్యక్తము చేయుచున్నది.

27. మూలమునఁ బాండవు లడవికి వెళ్లు నప్పుడు నకులుఁడు పాంసూపలిప్త సర్వాంగుఁడును సహదేవుఁ డాలిప్త ముఖుఁడు నై చనిరని చెప్పఁ బడినది. నన్నయ సహదేవుఁ డధోవక్త్రుఁడై యేగినట్లు వర్ణించెను. వా రట్లేగుటకుఁ జెప్పఁబడిన కారణములు మూల మందుఁ గంటెఁ దెలుఁగున నుచిత తరములుగా నున్నవి.

" నాహం మనాం స్యాదదేయం మార్గే స్త్రీణా మితి ప్రభో
పాంసూపచిత సర్వాంగః నకుల స్తేన గచ్ఛతి " (2-71-17)

నకులుఁడు పాంసూపలిప్త శరీరుఁ డగుటకు మార్గము నందలి స్త్రీల హృదయము లాకర్షింపఁ బడునేమో యను నూహ కారణము. ఇది కొంచె మసభ్యముగా నున్నది. మఱియు నా సమయము స్త్రీలు చూచి యాకృష్ట లగుటకుఁ దగినట్టిది కాదు. అందుచే నన్నయ " దుఃఖాను భవంబున కనుచితంబైన తన సుందర రూపంబు సూచి జనులు దుఃఖింప కుండ ధూళి ధూసరిత శరీరుఁడై నకులుం డరిగె " నని మార్చి వ్రాసెను. ఇట్లే సహదేవుఁ డాలిప్తముఖుఁ డగుట కెవ్వరును దన ముఖము గుర్తింప కుండ వలె నను కోరికయే కారణము (71-16). " దీనంబైన తన యాన నంబు సూచిన వారికెల్ల నెగ్గగు నని యవనతవదనుండయి సహదేవుఁ డరిగె " నని (స. ౨. 306) తెలుఁగునఁ జెప్పఁబడిన రీతి సందర్భోచిత ముగా నున్నది. మఱియు నతఁ డాలిప్తముఖుఁడై కాక యధోముఖుఁడై యరిగె ననుట మిక్కిలి సహజముగా నున్నది.

ఆరణ్య పర్వము :-

28. ధృతరాష్ట్రతిరస్కృతుఁడై పాండవుల కడ కరిగిన విదురుఁడు సంజయునితోఁ దిరిగి వచ్చిన పిమ్మట ధృతరాష్ట్రుఁ డాతని మూర్ధా ఘ్రాణంబు చేసి (" క్షమ్యతా మితి చోవాచ యదుక్తోసి మయా రుషా ") నేను గోపముచేఁ బలికిన పలుకులు క్షమింప వలసిన దని కోరెను. అప్పుడు విదురుఁడు :

" క్షాన్త మేవ మయా రాజ న్గురు ర్నః పరమో భవాన్ " (3-7-21)

అని పల్కినట్లు మూలమునం దున్నది. విదురుఁడు నేను క్షమించితి నని పల్కుట యుచితము కాదు. అందుచే నన్నయ యా మాట విడిచిపైచెను.

29. ఇంద్ర సురభి సంవాదమున సురభి బలముగల బలీవర్ధములతో బలహీనములైన వానిని బూన్చి జనులు లాంగలాకర్షణమున నసమర్థములైన దుర్బల బలీవర్ధముల బాధించుచుండఁ జూచి దుఃఖింప నింద్రుఁడు బాగుగా వర్షము కురియించి కర్షకులకు విఘ్న మాచరించె నని మూలమం దున్నది.

" ప్రవవర్ష చ తత్రైవ సహసా తోయ ముల్బణమ్
కర్షక స్యాచర ద్విఘ్నం భగవాన్ పాకశాసనః " (3.10–18)

ఇది చాల నసహజముగా నున్నది. ఇంద్రుఁడు దుర్బల బలీవర్ధముల దౌర్బల్య ముడుప వలెఁ గాని యొకమాఱు వర్షము కురియించి కర్షకాచరణములకు విఘ్న మాచరించిన నేమి లాభము? అందుచే నన్నయ " వర్షంబునఁ దృణ వర్ధనంబు చేసి దుర్బల బలీవర్ధంబులకు బలంబు గావించె " నని వ్రాసి యుండెను.

(అ. ౧–86)

30. కిమ్మీరుఁడు కామ్యక వనమందున్న పాండవులను సమీపించు నప్పు డాతని మూల మీ విధముగా వర్ణించు చున్నది.

"దష్టోష్ఠ దంష్ట్రం తామ్రాక్షం ప్రదీప్తోర్ధ్వ శిరోరుహమ్
సార్క-రశ్మి తటిచ్చక్రం సబలాక మి వాంబుదమ్ " (3.12–8)

అర్క-రశ్మితోఁ గూడిన (పగటి) యంబుద మందుఁ దటిచ్చక్ర ముండుట యరు దగుటచే నన్నయ తటిచ్చక్రమును దొలఁగించి బాలార్క-రశ్మియుతంబైన బలాహకంబునుం బోలె నని వర్ణించెను.

31. విదురుఁడు భీముఁడు కిమ్మీరుని వధించిన వృత్తాంతమును జెప్పఁగా విని ధృతరాష్ట్రుఁ డార్తుని వలె నిశ్వసించె నని మూలమం దున్నది. (" శ్రుత్వా ధ్యాన పరో రాజా నిశశ్వాసార్త వ త్తదా"). నన్నయ "విదురుఁడు కిమ్మీరుని కథ చెప్పిన విని ధార్తరాష్ట్రుల హృదయ దళనంబయ్యె" నని వర్ణించెను. కిమ్మీరవధ భీమ పరాక్రమ స్ఫూర్తిని వెల్లడిచేయుటయేకాక భవిష్యత్సుయోధన సంహరణ మును గూడ ధ్వనింపఁజేయుటచే నా వృత్తాంతము ధార్తరాష్ట్రుల హృదయ దళన మొనరించె నని నన్నయ వ్రాసిన వ్రాఁత సాభిప్రాయమై యున్నది.

32. దమయంతి యొరుల నెవ్వరి మెచ్చక నలుని వరించె నని దేవతల వలన నెఱింగి కలి కుపితుఁడై నిషధ కరుదెంచి నలునందుఁ బ్రవేశించుట కంత రము కానక పండ్రెండేండ్లు వేచియుండె నని మూలమం దున్నది. (3–56–3)

అతఁడు నలునిఁ బ్రవేశింపఁ జాలమికి హేతు విందుఁ గానరాదు. తెలుఁగున "నలుండు చేయుచున్న యశ్వమేధాదికానేక భూరి దక్షిణమహాక్రతువులయు జపహోమ దానాది వివిధ పుణ్య కర్మలయుఁ గారణంబునఁ జొర నవసరంబు గానక" (అర. ౨-58) అని నన్నయ దానికి చక్కని హేతువు సూచించెను.

33. మూలమున దమయంతి తన పాతివ్రత్య మహిమచేఁ గిరాతుని విహతుఁ గావించి యరణ్యమున నరుగుచు శార్దూలమును బర్వతమును నలునిఁ గూర్చి ప్రశ్నించినట్లున్నది. ఆ పర్వతము "కింశుకాశోక వకుళ పున్నాగోప శోభిత" మైనట్టిది. ఈ విశేషణమును బురస్కరించుకొని కాఁబోలు నన్నయ :

"సహకార మత్ప్రియ సహకారుఁ బున్నాగ, పున్నాగుఁ దిలక భూ
భువన తిలకుఁ
జందన బుధహరి చందనుఁ బ్రస్ఫీతా, శోక సుహృజ్జన శోకదమను
వకుళ : కులైకదీపకు విభీతక భయో, పేతా ర్తిహరు నలుఁ బ్రీతి తోడఁ
గానరే కానలలోన లోకో త్తరు, నని భ్రమాని భ్రమానికి నరిగి యరిగి "

(అర. ద్వితీ- 94) యడిగినట్లు వర్ణించెను. సంబుద్ధములైన వృక్షముల పేర్లే చివర వచ్చునట్లుగా విందు నలునకు వాడఁబడిన విశేషణము లభిప్రాయ గర్భితములై యామె యా యా వృక్షముల నేల యడిగెనో లెస్సగా వ్యక్తము చేయుచున్నవి.

34. సార్థము హస్తియూధముచే విహతమైన పిమ్మట దమయంతి హతశేషులైన వారితోఁ జేదిపురము ప్రవేశించెను. అప్పు డామెను గాంచి రాజమాత

"భాసి విద్యుదివాభ్రేషు శంసమే క్వాసి కస్యవా"(3-62-23)

అని యడిగినట్లు మూలమందున్నది. నన్నయ దమయంతి యప్పుడు "దిన కరప్రభాపటల ధూసరిత ప్రభాత చంద్రరేఖయుంబోలె దీప్తివిహీనయై దన్పియు రమ్యాకృతియై యుండె" నని వర్ణించెను. (అర.౨-114) ఆ స్థితిలో నన్నయ దమయంతికి వాడిన యుపమాన మెంతయో యుచితమై యొప్పారు చున్నది.

35. నలుఁడు దమయంతిని గలసికొనిన పిమ్మట "ఒక్క రథంబును బదియాఱేనుంగులును నేఁబది గుఱ్ఱంబులును నాఱునూఱు కాల్బలంబులుఁ దనకుఁ దోడయి రా" భూమిని గంపింపఁజేయుచు నిషధనగరమున కరిగె నని మూలమందున్నది. ("స కంపయ న్నివ మహీమ్"). కాని యిచ్చట నాతనికిఁ

దోడ్డైన సేన భూమిని గంపింపఁజేయునంతటి పెద్దది కాకపోవుటచే నన్నయ యా మాటను దొలఁగించెను.

36. కృష్ణ బలరామాదు లడవికేగి ["భూమౌ శయానాన్ మలదిగ్ధ గాత్రాన్". భూశయనులను, మలదిగ్ధ గాత్రులు నైన పాండవులను జూచి రని మూలమందున్నది. (3-118-19).] నన్నయ వారు "ప్రీతి నరుగుదెంచి కనిరి సకల తీర్థగమన పథిక్లేశ కృశులఁ బాండు సుతుల'' నని వ్రాసి యుండెను. మలదిగ్ధగాత్రులనుట కంటె "సకల తీర్థగమన పథిక్లేశకృశుల'' నని నన్నయ వాడిన విశేషణము చాల నుచితముగా నున్నది.

38. సుకన్యాఖ్యానమున నన్నయ అశ్వినుల శీలము పోషించుటకై యత్నించి కృతార్థుఁడాయెను. మూలమున నాశ్వినులు "కృతాభిషేకాం వివృతాం సుకన్యాం తా మపశ్యతామ్'' (123-1) అని వివృతయైన సుకన్యను జూచి నట్లున్నది. నన్నయ యీ యనౌచిత్యమును దొలఁగించెను. మరల మూలమున నాశ్వినులు సుకన్యతో చ్యవనుని విడిచి మా యిరువురిలో నొకని వరింపు మని చెప్పిరి. (123-9) సుకన్య "రతాహం చ్యవనే పత్యౌ మైవం మా పర్యశంకిథాః'' (123-10) అని పలికెను. అశ్వినులంత "నీ భర్తను రూపసంపన్నుఁడైన యువ కునిగాఁ జేసెదము. అప్పుడు మా ముగ్గురిలో నొకరిని వరింపు'' (123-11) మనిరి. సుకన్య భర్తకడ కేగి యా విషయము చెప్పెను. అతఁడట్లే చేయుమని పలికెను. అశ్వినులు చ్యవనుని నీటిలో దిగు మని తాము నందుఁజొచ్చిరి. అప్పుడు ముగ్గురును దుల్యరూప ధరులై మా ముగ్గురిలో నొకరి వరింపు మనిరి. సుకన్య మనసుచే బుద్ధిచే నిశ్చయించి తన పతినే వరించెను. (123-19) అశ్వినులు తన్ను యువకునిఁ గావించినందుకు సంతోషించి చ్యవనుఁడు వారితో "దేవరాజు చూచుచుండఁగా మిమ్ము సోమపీథులఁ గావింతు" నని చెప్పెను. నన్నయ యాశ్వినులు సుకన్యకడ కరుదెంచి"నీ వయోరూపంబులకుం దగిన వరున్ వరియింపుము. వానిం దెచ్చెద'' మని పల్కినట్లును సుకన్య వారట్లనుట యుచితము కాదనిచెప్పి వారి పలుకులు పతి కెఱింగించి నట్లును వ్రాసెను. (అర. 3-184). అశ్వినులును జ్యవనుఁడును జలప్రవేశము కావించి నవయౌవనులైన పిమ్మట వారు "మా ముగ్గురిలో నొకరిని వరింపు" మని కాక "నీ వలచు వానిని వరింపు"మని పలికినట్లు నన్నయ మార్పుకావించెను. అశ్వి నులు సుకన్యను జూచి మా యిరువురిలో నొకని వరింపు మని పలుకక "నీ వయోరూపంబులకుఁ దగిన వరునిఁ దెచ్చెదము. వానిని వరింపు" మనుట వారి

మానసమున నున్న దురభిలాషను మఱుఁగుపుచ్చి యువతి యయ్యు వృద్ధునికి భార్య కావలసివచ్చిన యామె స్థితికి జాలి పొంది రవి వ్యక్తము చేయుచున్నది. "వారు నీ భర్తను యౌవన వంతుఁ గావించెదము. మా ముప్వురిలో నొకరిని వరింపు" మని చెప్పుట నన్నయ తొలఁగించెను. తగిన వరుని వరింపు మని యాశ్వను లనఁగానే సుకన్య భర్తకడకేగి యా విషయము నెఱింగించుట యామె పతిభక్తికిఁ దార్కాణముగా నున్నది. మూలమున నామె మా యిరువురిలో నొకరిని వరింపు మన్నప్పుడు గాక తరువాత భర్తకడకేగి విషయము చెప్పి నట్లున్నది. తెలుఁగున నాశ్వనులకు సుకన్య యెడఁ గామవాంఛ గాక సానుభూతి యెక్కువగా నున్నట్లు గోచరించుచున్నది. మూలమున నాశ్వనులు చ్యవనుని యౌవనవంతుఁ గావించుట సానుభూతిచేఁ గాదు. తాముకూడ సుకన్యచే వరింపఁ బడు నవకాశము కల్పించుకొనుటకు. దుర్బుద్ధులైన యాశ్వనులకుఁ జ్యవనుఁడు ప్రత్యుపకారము చేయవలసిన యావశ్యకము మూలమునఁ గానిపింపదు.

38. అష్టావక్రుఁడు గర్భస్థుఁడై యున్నప్పుడు రేయంతయుఁ గూడ నధ్యయనము కావించు చుండిన తండ్రిని జూచి "సర్వాం రాత్రి మధ్యయనం కరోషి, నేదం పితః సమ్యగివోపవర్తతే" యని పలుకఁ దండ్రి యట్లుపాల భ్ధుఁడై కోపించి "యస్మాత్కుక్షౌ వర్తమానో బ్రవీషి తస్మాద్వక్రో భవితా స్యష్టకృత్వః" (132-9) అని శపించినట్లు మూలమందున్నది. ఇందష్టావక్రునికి వక్రత కలుగుటకుఁ గారణము సరిగాఁ జెప్పఁబడలేదు. నన్నయ "నీ వధ్యయ నంబునకు వక్రంబుగాఁ బలికితివి కావున నెనిమిది వంకలుగల శరీరంబుతో జన్మింపు" మని శపించినట్లు చక్కని కారణమును గల్పించెను.

39. అర్జునుఁడు నివాత కవచులతోఁ బోరునప్పుడు వారు తమ ప్రయో గించిన యస్త్రమ్ములన్నియు వమ్ముకాఁగాఁ దుదకుఁదిమిర బాణ మేసిరి. అప్పుడు మాతలి మిక్కిలి భీతి నొందెను. అర్జునుఁ డతని నూఱడించి మోహిని యను నస్త్ర మాయను బ్రయోగించె నని మూలమందున్నది (3-168-25). తిమిర బాణ నివారణమున కస్త్రమాయకాక సూర్యబాణము ప్రయోగించుట యుచితము కావున నన్నయ :

"వాసరనాయకుం దలఁచి వజ్రి వరంబున సూర్యబాణ మే
నేసిన నింద్రుఁ దొట్టి సుర లెంతయు సంతస మందఁగా జగ
త్త్రాసి తమిస్రరాశి......"(అర. 4-72) విహతమయ్యె నని వర్ణించెను.

40 పాశుపతాస్త్ర ప్రయోగముచే నర్జునుఁడు పౌలోమ కాలకేయాది రాక్షసులను సంహరించిన పిమ్మట మూలమందు మాతలి "దేవతలకుఁగూడ దురాసదమైన తన కర్మ నారసి" యాశ్చర్యపడి కృతాంజలియై

"సురాసురై రసహ్యం హి కర్మ య త్సాధితం త్వయా
న హ్యేత త్సంయుగే కర్తు మపి శ క్తః సురేశ్వరః" (170-53)

ఇత్యాదిగా స్తుతించిన ట్లర్జునుఁడు వర్ణించి యుండెను. ఈ కథ నర్జునుఁడే చెప్పుచుండుటచే మాతలి తన్నట్లు స్తుతించినట్లు చెప్పుట యాత్మశ్లాఘయౌ నని నన్నయ యా స్తోత్రమును దొలఁగించివై చెను.

41 సర్పరూపమున నున్న నహుషుఁడు భీమునిఁ బట్టినప్పుడు భీముఁ దట్టి శక్తి తన కెట్లబ్బె నని యడుగ నతఁడు సమాధానము చెప్పుటకు ముందు నన్నయ "తిర్యగ్జాతియయ్యును దన పూర్వస్మృతి చెడకుండ వరంబు గాంచుటఁ జేసి వాని కిట్లనియె" (అర. ౪-109) అను వాక్యమును గల్పించి సర్పము పూర్వస్మృతి గల్గి యుండుటకుఁ గారణము వెల్లడించెను. ఈ కారణము మూలమందు లేదు.

42. ధర్మజుఁడు భీమునకై వెదకుచు "దదర్శ పృథివీం చిహ్నై ర్భీమస్య పరిచిహ్నితా" మ్మని భీమ చిహ్నపరిచిహ్నితమైన పృథివిని జూచె నని మూలమందున్నది. పాదచిహ్నము లెవరివైనఁ గావచ్చును. అందుచే నన్నయ "తదీయ పాదతలలలితహలకులిశకలశాది లక్షణలక్షితం బైన పాంసు పథంబునం" జని యా పాదములు భీమునివే యని ధర్మజుఁ డనుకొనుటకుఁ గారణము వివరించెను.

H. మూలమున నా యా వ్యక్తుల గుణగణములను దెలుపు విశేషణములా యా స్థలములం దచ్చటచ్చటఁ జెదరి యుండును. నన్నయ వాని నన్నిటిని బరిశీలించి యెచ్చటనో యున్నవాని నా పాత్రలను వస్తువులను బ్రవేశపెట్టునప్పుడు ముందే వ్రాయు చుండును. ఈ పద్ధతి వలన వారి లేక వాని స్వరూప స్వభావములను గూర్చి పాఠకుల కొక యభిప్రాయము ముందే కలుగుట కవకాశ ముండును. ఇట్లే యతఁడు ముందెక్కడనో వివరింపఁబడు కథాంశములను సందర్భము వచ్చినప్పుడు మొదటనే సూచించు చుండును. మూలమం దట్టి సూచన యెక్కడను గానరాదు.

1. గరుడుఁ డమృత హరణార్థమై యమరలోకమున కరిగినప్పుడు కశ్యపుని పుత్త్రకామేష్టివృత్తాంతము వివరింపఁబడినది. ఈ విషయమును నన్నయ గరుడోపాఖ్యా నారంభమునందే "కశ్యపప్రజాపతి తొల్లి పెద్దకాలము తపంబు చేసి పుత్త్రకామేష్టి చేసెఁ గావున" (అర. ౨-4) అని సూచించెను.

2. బృహద్రథుఁడు పత్నీద్వయ సమేతుఁడై యడవికిఁ దపమ్మాచరింప నరిగినప్పుడు మూలమున "వృక్షమూల సముపాశ్రితుఁ"డైన యాతని గౌతముఁడు చూచె నని యున్నది. తరువాత నొక్క చూతఫల మాతని యంకతలమునఁ బడె నని కథలో నుండుటచే నన్నయ ముందే "బాల సహకార మహీజము క్రింద నుజ్జ్వల త్పావక తేజుఁడై" తపము చేయుచుండె నని వ్రాసియుండెను.

3. కృష్ణుఁడు ధర్మజునకు జరాసంధుని విషయము చెప్పు సందర్భమున హంసడిభకు లాతనికి దక్షిణ వామ భుజములై వర్తిల్లుచుందు రని తెల్పుచు వా "రవిచ్ఛేయులు పరస్పరస్నేహాయత్త సుచిత్తు లతని యాప్తు"లని వారి ప్రధాన గుణము వర్ణించెను. తరువాత వారు మరణించుట కా పరస్పరస్నేహాయత్తతయే కారణము. అందుచే నన్నయ మూలమున లేకున్నను ఆ విశేషణము నిచ్చుటఁ జొప్పించెను. హంసడిభకులకుఁ గౌశిక చిత్రసేను లను పే ర్లుండుట మూలమున ముం దెక్కడనో యుండఁగా (2-20-31) నన్నయ వానిని వారినిఁ బ్రవేశపెట్టు నప్పుడే సూచించెను.

4. సుదేవుఁడు చేదిపురమున కేఁగి పుణ్యాహము చేయించు బ్రాహ్మణులతో రాజగృహము చొచ్చి దమయంతిని జూచెను. వియోగభారకృశయై దమయంతి యప్పుడు గుర్తింప వీలులేని స్థితిలో నుండెను సుదేవుఁడామెను దా నెట్లు గుర్తింపఁ జాలెనో తరువాత రాజమాత కెఱింగించును. (3-66-5). అందుచే నన్నయ "తదీయ భ్రూయుగమధ్యగతంబైనసూక్ష్మలక్షణంబిమ్ముగా నిరీక్షించి దాని దమయంతిగా నెఱింగె" నని ముందే సూచించెను. (అర. ౨-141).

5. మూలమున హనుమంతుఁడు భీమునకు స్వస్వరూపముఁ జూపి నప్పుడు

"త మర్క మివ తేజోభిః సౌవర్ణ మివ పర్వతమ్
ప్రదీప్త మివ చాకాశం దృష్ట్వా భీమో న్యమీలయత్" (149-7)

అని హనుమంతుఁడు సౌవర్ణ పర్వతమువలె నుండె నను వర్ణన మున్నది. నన్నయ యాతఁడు కాయముఁ బెంచునప్పుడే :

"అతులితమై ద్వితీయ కనకాద్రి యొకో యిది నా నిజాంగ ము
చ్ఛ్రితముగఁ బెంచి పుచ్ఛమునఁజేసి దిగంతము"
లందుచుండె నని వర్ణించెను. (అర. 3-343)

సూక్తులు :

నన్నయ తానుఁ రచించిన భారత భాగము నందా యా సందర్భములలో ననేక సూక్తులను జొప్పించి యుండెను. వీనిలోఁ బెక్కు మూలక ములైనట్టివే. కొన్ని యెడల నన్నయ మూలమున బీజప్రాయముగా నున్న భాగమును గ్రహించి సూక్తిగా పెంపొందించు చుండును. ఇవి నీతిధర్మములకు నిలయ ములై లోకవ్యవహారమున నాయా ప్రసక్తులు వచ్చు నప్పు డుదాహరించుటకుఁ దగియున్నవి. నన్నయ యిట్టి సూక్తులను సాధారణముగా వెనుకముందు పద్య ములతోఁ గలపక ప్రత్యేక పద్యములుగా వ్రాయుచుండును. అర్థభావములం దవి స్వయంసంపూర్ణములై యుండును. వానిని మనము సందర్భాను గుణ ముగా నెక్కడనైన వాడుకొన వచ్చును. ఇప్పటికిని బెద్దలు నీతి ధర్మముల ప్రసంగము వచ్చినప్పు డాతని సూక్తులను బ్రమాణములుగాఁ బఠించుచునే యుందురు.

ఆది :-

౧-85. తగునిది తగదని యెదలో
3-121. మొదలి పెక్కు జన్మముల
3-199. తనయుఁడు తల్లిదండ్రులు.... ఇది మూలములో నున్నది.
౫-58. ఎట్టి విశిష్ట కులంబున
౬-242. కృత మెఱుఁగుట
౬-245. నలసారము సంసారము
౬-246. ఆదివి సంయోగ వియోగాది
౬-254. పడిన యామిషంబు
౮-157. ధృతిహీనుల చిత్తము లట్లతివల.

సభా :-

౧-93. పితృ సంకల్పము సేయఁగ
౨-202. మదమలిన మనస్కుఁ డధుంతుడుఁడు

అర :-

౧-217. క్షమయ తాల్చి యుండఁ జన దెల్లప్రొద్దు ..

౧-222. ఎఱుక గల మహాత్ముఁడు

౨-74 అలసి నెద దస్సి నెద

౩-256 గురుముఖమునఁ బడయక

౩-282 గురుశుశ్రూష యొనర్చుచు — మూలమం దున్నది.

౪-130 విత్తహీనుఁడు వెండియు.

J. నన్నయ యనువాదము చేయునపు డొనరించిన పై మార్పు చేర్పులను బట్టి యాతఁడు సర్వత్ర మూలమును సంక్షేపించుటయో పెంపు చేయుటయో మార్చుటయో యేదోయొకటొనరించుచునే యుండె నని భావింపరాదు. మూల శ్లోకముల నాతఁడు యథాతథముగా ననువదించిన పట్లనేకము లున్నవి. పెక్కు చోట్ల నాతఁడు మూలము నందలి పదములను గూడ నున్నవాని నున్నట్లే తెలుఁగునఁ బ్రయోగించి యుండెను. ఇట్టి వాని కుదాహరణములు బహు సంఖ్యాకములుగా నుండుటచే నొక్కొక్క పర్వము నుండి యైదేసి మాత్ర మిచ్చుట సూచించెదను :-

ఆది :-

1. "తతః శుక్లాంబర ధరః శుక్ల యజ్ఞోపవీతవాన్
శుక్ల కేశ స్సిత శ్మశ్రుః శుక్ల మాల్యాను లేపనః
రంగమధ్యం తదాచార్యః సపుత్రః ప్రవివేశ హ
నభో జలధరై ర్హీనం సాంగారక ఇ వాంశుమాన్"

(1-124-17-18)

"అట్టి యవసరంబున నాచార్యుఁడు శుక్లాంబరాభరణమాల్యాను లేపన యజ్ఞోపవీత పలితకేశ శ్మశ్రు శోభిత దేహుఁడై రంగ మధ్యంబున నశ్వత్థామ సహితుఁడై విముక్తజలదజాల వియన్మధ్యంబున నంగారక సహితుఁడైన యాదిత్యుండునుం బోలె నున్న" (ఆది-౬-8).

2. "దర్శయామాస బీభత్సు రాచార్యా దస్త్ర లాఘవమ్
ఆగ్నేయే నా సృజ ద్వహ్నిం వారుణే నా సృజ త్పయః
వాయవ్యే నా సృజ ద్వాయుం పర్జన్యే నా సృజ ద్ఘనాన్
భౌమేన ప్రావిశ ద్భూమిం పార్వతే నా సృజ ద్గిరీన్ (అభవద్గిరిః)

అంతర్ధానేన చా ప్యేణ పున రంతర్హితో ఒ భవత్
క్షణా త్ప్రాంశుః క్షణా ద్ధ్రస్వః క్షణా చ్చ రథధూ ర్గతః
క్షణేన రథ మధ్యస్థః క్షణే నావపత న్మహీమ్
గవ్యే విషాణ కోశే చలే రజ్జ్వ వలంబితే
నిచఖాన మహావీర్యః సాయకా నేక వింశతిమ్ '' (1-125-18-20,22)

" ఆగ్నేయ శరమున నతి భీకరాగ్నియు వారుణాస్త్రమున దుర్వార జలము
ననిలబాణంబున నధికానిలంబును మేఘాస్త్రమున మహామేఘ చయముఁ
బుట్టించు మఱియును భూమి బాణంబున భూప్రవిష్టుండగు భూరి ఘోర
శైల బాణంబున శైల రూపము దాల్చు వీరుఁ డదృశ్యాస్త్ర విద్య పేర్మిఁ
దా నదృశ్య దేహుండగుఁ దత్క్షణంబ
హ్రస్వుఁడగు దీర్ఘుఁడగు సూక్ష్ముఁడగుఁ రయంబు
తోడ రథమధ్య గతుఁడగు ధూర్గతుండు
నగు మహీతల గతుఁడగు నద్భుతముగ (ఆది. ౬-26)

రజ్జు సమాలంబితం బయిన గోశృంగంబునం దేకవింశతి శరంబులు వరుసన
నాట నేసియు."

3. "వినిద్ర కరణం ఘోరం హృది శల్య మివార్పితమ్'' (1-131-20)
వినిద్ర కరణంబయిన నా హృదయ శల్యం బుద్ధరింపుము" (ఆది. ౬-130)

4. " జ్ఞాతయో యస్య నైవ స్యుః విషమాః కులపాంసనాః
న జీవే త్సు సుఖం లోకే గ్రామే ద్రుమ ఇ వైకజః " (1-138-24)
"కుల పాంసనులయి యహితంబులు సేయుచు నుండు చుట్టములఁ బొందక యి
మ్ముల నుండు వాఁడ పుణ్యుఁడు వెలయఁగ గ్రామ స్థితైక వృక్షమ పోలెన్"
(ఆది. ౬.181)

5. "బిభీషికైషా గంధర్వ నాస్త్రజ్ఞేషు ప్రయుజ్యతే
అస్త్రజ్ఞేషు ప్రయుక్తైషా ఫేన వ త్ప్రవిలీయతే '' (1-158-24)
వెరఁగ : యిట్టి పాటి వెఱపించుటలును మాయలును నేమి చేయు నస్త్రవిదులఁ
బెక్కులయ్యు నీ బిభీషికల్ నుఱువులు విరియునట్లు లిందు విరియుఁ జూవె"
(ఆది. 2-43)

6. "తతో లాలప్య మానస్య పార్థివస్యాసితేక్షణా
సౌదామి వీవ సా భ్రేషు త తై్ౖరవాంతరధీయత " (1-160-39)
"అని పలుకుచున్న నృప నందనునకు మఱుమాట యీక తామరస నిభా
నన మేఘమధ్య సౌదామని వోలె నడంగె దృష్టి మార్గము గడవన్."
(ఆది.-2-76)

సభా పర్వము :-

7. "కచ్చి చ్ఛారీర మాబాధ మౌషధై ర్నియమేన వా
మానసం వృద్ధ సేవాభిః సదా పా ర్థాపకర్షసి " (2-5-79)
"సారమతిఁ జేసి మానస శారీర రుజావళులకు సతతంబుఁ బ్రతీ
కారములు చేయు చుండుదె యారఁగ వృద్ధోప సేవనౌషధ సేవన్" (స. ౧-34)

8. "అగ్ని హోత్ర ఫలావేదా దత్తభుక్తఫలం ధనమ్
రతిపుత్త్రిఫలా దారాః శీలవృత్తఫలం శ్రుతమ్" (2-5-101)
"దార సంగ్రహంబు ధరణీశ రతిపుత్త్రిఫలము శీలవృత్తఫలము శ్రుతము
దత్తభుక్తఫలము ధనము వేదము లగ్నిహోత్ర ఫలము లనియు
నొగి నెఱుంగు" (స. ౧-51)

9. "నాస్తిక్య మనృతం క్రోధం ప్రమాదం దీర్ఘసూత్రతామ్
అదర్శనం జ్ఞానవతా మాలస్యం క్షిప్రచిత్తతామ్
ఏకచింతన మర్థానా మనర్థజ్ఞై శ్చ చింతనమ్
నిశ్చితానా మనారంభం మన్త్ర స్యావరిరక్షణమ్
మాంగల్య స్యాప్రయోగం చ ప్రసంగం విషయేషు చ
కచ్చి త్త్వం వర్జయ స్యేతా న్రాజ దోషా న్చతుర్దశ" (2-5-96-98)

"మఱియు నాస్తిక్యం, బనృతంబు, ప్రమాదం, బాలస్యం, బనర్థజ్ఞుల తోడి చింత
నంబు, క్రోధంబు, దీర్ఘచింత, దీర్ఘసూత్రత, యెఱుక గల వారి నెఱుంగమి,
యర్థంబులయం దనర్థక చింత, నిశ్చిత కార్యంబులు సేయమి, మంత్రంబుల
రక్షింపమి శుభంబులఁ బ్రయోగింపమి విషయంబులం దగులుట యనం బరఁగిన
పదునాలుగు రాజదోషంబులం బరిహరింతె" (స. ౧-55)

10. "తా వుభౌ సహితౌ వీరౌ జరాసంధ శ్చ వీర్యవాన్
త్రయ స్త్రయాణాం లోకానాం పర్యాప్తా ఇతి మే మతిః" (2-13-37)

"భూమీశ హంసడిభకులు నా మగధాధీశ్వరుండు నమ్మువ్వురు ను
ద్దామ భుజవీర్యసంపదతో మూఁడు జగములు నోపుదురు సాధింపన్"
(స. ౧-114)

11. "తపో్యపవిష్టస్య మునే రుత్సంగే నిపపాత హ
అవాతమశుకా దష్ట మేక మామ్రఫలం కిల"(2-16-28)
పవనవిధూతము శుకచంచు విలూనము గాక యొక్క చూతఫలం బ
య్యవనిజమువలన నమ్ముని ప్రవరు పృథూత్సంగ తలముపై వడిఁ బడియెన్"
(స. ౧-142)

12. "తస్య పద్మప్రతీకాశే స్వభావాయత విస్తృతే
భూయః క్రోధాభి తామ్రాన్తే రక్తే నేత్రే బభూవతుః
త్రిశిఖాం భ్రుకుటీం చాస్య దదృశు స్సర్వపార్థివాః
లలాటస్థాం త్రికూటస్థాం గంగాం త్రిపథగా మివ" (2-39-10,11)
"ప్రకటిత కోప వేగమునఁ బద్మదళాయత నేత్రముల్ భయా
నకతర లీలఁ దాల్చె నరుణద్యుతి నుద్యతమై త్రిశాఖమై
భ్రుకుటి లలాటదేశమునఁ బొల్చెఁ ద్రికూటతటిం ద్రిమార్గగా
సుకృతిఁ బ్రభంజన ప్రియతనూజున కంతకమూర్తి కచ్చటన్"
(స. ౨-51)

13. "శాంతవిఘ్నః సుఖారంభః ప్రభూతధనధాన్యవాన్
అన్నవాన్ బహుభక్ష్య శ్చ కేశవేన సురక్షితః" (2-42-33)
"అట్లు ప్రశాంతవిఘ్నం బయి సుఖారంభం బయి ప్రభూతభక్ష్యాన్న ధన దాన్య
సనాథం బయి జగన్నాథ రక్షితం బయి" (స. ౨-72)

14. "అల్పో ఽపి హ్యరి రత్యన్తం వర్ధమాన పరాక్రమః
వల్మీకో మూలజ ఇవ గ్రసతే వృక్ష మంతికాత్" (2-50-24)
"అల్పుఁడయ్యు మనుజుఁ డతి పరాక్రమమునఁ బేర్మిఁ దరతరంబ పెరుఁగుచున్న
వాఁడు మ్రానిమొదలి వల్మీక మా మ్రానిఁ జెఱుచునట్లు గడఁగి చెఱుచుఁ బగఱ"
(స. ౨-144)

15. "త్రీణి జ్యోతీంషి పురుష ఇతి వై దేవలో ఽబ్రవీత్
అపత్యం కర్మ విద్యా చ ...:"(స. 64-5)
"పేర్మి నపత్యంబు కర్మంబు విద్యయు నను నివి దేజంబులట్టె తగిన
పురుషునకు....,"
(స. ౨-268)

ఆరణ్య పర్వము :-

16. "అస్మత్పోషణజా చింతా మాభూ త్తే హృది పార్థివ" (3-2-10)
"అస్మత్పోషణోపాయచింత సేయవలదు" (అర. ౧-17)

17. "వస్త్ర మాప స్తిలాన్ భూమిం గంధో వాసయతే యథా
పుష్పాణా మధివాసేన సంసర్గం కురుతే యథా" (3-1-11)
"తిలలను నీళ్ళను వస్త్రంబులుఁ బుష్పసుగంధవాసమున సౌరభముం
బొలుపెసఁగఁ దాల్చుఁగావున నలయక సత్సంగమమున నగు సద్గుణముల్"
(అర. ౧-6)

18. "వ్యాధే రనిష్ట సంస్పర్శా చ్ఛ్రమా దిష్ట వివర్జనాత్
దుఃఖం చతుర్భి శ్శారీరం కారణైః సంప్రవర్తతే" (3-2-21)
"వ్యాధిశ్రమానిష్టసంస్పర్శనేష్టవివర్జనంబుల నాల్గింటఁబుట్టి శారీరదుఃఖంబులు"
(అర. ౧-22)

19. "రాజత స్సలిలా దగ్నే శ్చోరతః స్వజనా దపి
భయ మర్థవతాం నిత్యం మృత్యోః ప్రాణ భృతా మివ
యథా హ్యామిష మాకాశే పక్షిభి శ్శ్వాపదై ర్భువి
భక్ష్యతే సలిలే మత్స్యైః తథా సర్వేణ విత్తవాన్" (3-2-38-39)
"మృత్యువువలనం బ్రాణులకు భయంబుకలుగున ట్లర్థవంతులకు రాజచోర స్వజన
జలానలంబుల వలన భయంబు నియతంబు'' (అర. ౧-26)
"జలములందు మత్స్యంబులు చదలఁ బక్షు లామిషం బెట్లు భక్షించు నట్లు
దివిరి
యెల్లవారును జేరి యనేక విధుల ననుదినంబును భక్షింతు రర్థవంతు"
(27).

20. "కిం బాలిశం మతిం రాజ న్నాస్థితో ఽసి" (3-8-7)
"ఇట్లేల బాలిశంబైన మతిం దలంచితివి" (అర. ౧-73)

21. "దుశ్శాసన కరోత్సృష్ట విప్రకీర్ణ శిరోరుహా
పంచపర్వత మధ్యస్థా నదీవాకులతాం గతా
మో ముహ్యమానాం తాం తత్ర జగృహుః పంచపాండవాః
ఇంద్రియాణి ప్రసక్తాని విషయేషు యథా రతిమ్''. (3-12-17,18)

"దుశ్శాసన కరాకృష్ట వికీర్ణవేణీ భరంబు వెనువెంట నొలయం బాంచాలి పంచపర్వతముల నడిమి నదియుంబోలెం బతుల నడుమ భయవ్యాకులచిత్త యైన నింద్రియంబులు విషయరతిం బరిగ్రహించునట్లు లేవురు నక్కోమలిం బట్టుకొని భయపడకుండ నాశ్వాసించు చున్నంత'' (అర. ౧-107)

23. "తథా బ్రువతి వాయౌతు పుష్పవృష్టిః పపాత హ
దేవదుందుభయో నేదు ర్వవౌచ పవన శ్శివః'' (3-75-15)

"కురిసె మరుద్వచనానంతరమున సుర పుష్పవృష్టి దడయక వించెన్
సురదుందుభి నాదంబులు కరము ప్రసన్నుండయి వీచె
గంధవహుండున్" (అర. ౨-2-7)

24. "శృంగైర్బహువిధాకారై ర్ధాతు మద్భి రలంకృతమ్"(3-107-5)
"బహువిధాకారధాతుమంతంబులైన యుత్తుంగశృంగంబులను"
(అర. ౨-77)

25. "అథ తం నరకం ఘోరే పచ్యమానం దదర్శ సః" (3-128-10)
"ముందర నరకానల పచ్యమానుం డయ్యేడు ఋత్విజుం జూచి"

26. "కృత మేవ న కర్తవ్యం తస్మి న్కాలే యుగోత్తమే" (3-148-10)
"కృతమ కాని కర్తవ్యంబు గృతయుగంబునందు లేదు."(అర. 3-336)

27. "అకామఫలసంయోగా త్ప్రాప్నువంతి పరాం గతిం" (148-20)
"అకామఫల సంయోగంబునం బుణ్య లోకంబులు వడయుదురు"

28. "యుధిష్ఠిర ధృతి ర్దాక్ష్యం దేశకాలౌ పరాక్రమః
లోకతంత్రవిధానా మేష పంచవిధో విధిః" (159-1)

"ధృతియును, దాక్ష్యంబును, దేశంబును, గాలంబును, బరాక్రమంబును నను పంచవిధంబులైన లోకతంత్ర విధానంబు లెఱింగిన" (అర. 4-32)

పై యుదాహరణములను బట్టి నన్నయ మూలములోని భావములను బదములను గూడ విడువకుండ నందలి శ్లోకములను సన్నిహితముగా నను వదించిన పట్లు కూడం జాలం గలవవి వ్యక్తము కాంగలదు. ఆది సభారణ్య పర్వము లందలి యనువాదమును బరిశీలించి చూడ నొకదానికంటె నొక దాన నుత్తరోత్తరముగా నది మూలమున కెక్కువ సన్నిహితముగా నుండినట్లు

గోచరించును. ఆరణ్య పర్వము నందలి కథా క్రమము కల్పనల కెక్కువ తా విచ్చునట్టిదికాదు. తీర్థాదులను, దన్మహిమలను వర్ణించుపట్ల నెవ్వరైన మూల మును సన్నిహితముగా ననుసరింపక తప్పదు. అందుచే మిగిలిన రెండు పర్వము లందుఁ గంటె నారణ్య పర్వ భాగమున నన్నయ యనువాదము మూలమునకు మిక్కిలి సన్నిహితముగా నుండుట సంభవించినది. ఆతఁడు మూలమును యథా తథముగా ననుసరించిన చోట్లఁ గూడఁ బద్యములలోని యనువాదము కంటె వచనములందలిది మూలమున కెక్కువ దగ్గఱగాఁ గానిపించును. దానికిఁ బద్యములందుండు ఛందో నిరోధము వచనములలో లేకుండుటయే కారణమై యుండును.

K. ఈ విధముగా నన్నయ రచన యుదాత్తమును, రసవంతమును, నౌచిత్య శోభితమునై యొప్పారు చున్నను గొన్ని చోట్లఁ దెలుఁగు భారతము కన్న సంస్కృత భారతమే మిన్నగా నున్నట్లు పొడగట్టు చున్నది. కాని యిట్టి పట్లు చాలఁ దక్కువ. వాని నీ దిగువ సూచించెదను. ఇంత విస్తృతమైన గ్రంథమును రచించుటలో నిట్టి లోపము లొండు రెండు ప్రవేశించుటలో వింత లేదు.

1. నన్నయ యుదంకుని కథను జాల హఠాత్తుగా నారంభించెను. జనమే జయునిఁ గూర్చి చెప్పుచుఁ జెప్పుచు నతఁడు :

" పంకజ భవసన్నిభుఁ డఘ పంకక్షాళన మహా తపస్వులిలఁ దనా
తంక మతి పైల శిష్యుఁ డుదంకుం డను మునివరుండు దద్దయు భక్తిన్.
(ఆది-౧-౮౧)

గురుకులమున గురులకుఁ బరిచర్య చేసి జ్ఞానము వడసె" నని కథ మొదలు పెట్టెను. పై దానికిని ఈ కథకును ఎట్టి సంబంధమును గానరాదు. జనమే జయుని కడ కుదంకుఁ డరిగి సర్పయాగ బుద్ధి పుట్టించె నని చెప్పి, దానికిఁ గారణ మేమని ఋషు లడుగఁగా సౌతి యుదంకుని కథ చెప్పియుండె నని వ్రాయుట మిక్కిలి యుచితముగా నుండును. మూలమున నుదంకుని గురువైన వేదుని కథతోఁ గలిపియే యుదంకుని కథ కూడఁ జెప్పఁబడినది. ఆ వేదుని కథ తెలుఁగున లేకపోవుటచే నుదంక వృత్తాంత మించుక యసంబద్ధముగా గోచ రించుచున్నది.

2. ఉదంకుఁడు పౌష్య వింటఁ గుడుచుచు నన్నంబు కేశ దుష్టం బగు టకుఁ గోపించి యపరీక్షితమైన యశుద్ధాన్నముఁ బెట్టితివి కావున నంధుండ వగు

మని యతని శపించెను. అల్ప దోషంబున శాప మిచ్చితివి కావున నీ వనపత్యుఁడ వగుమని పౌష్యుఁ డుదంకునికిఁ బ్రతిశాప మిచ్చెను. అంత నుదంకుఁడు శాపము గ్రమ్మఱింపు మని ప్రార్థింపఁ బౌష్యుఁడు తన కిచ్చిన శాపము గ్రమ్మఱింప వేఁడుకొనెను. ఉదంకుఁ డతని కల్ప కాలముననే శాపమోక్ష మగునని పల్కి వెడలి పోయెను. ఇది నన్నయ రచించిన కథా క్రమము. ఇం దుదంకునికిఁ బౌష్యుఁ డిచ్చిన శాపమెట్లు తొలఁగి పోయెనో చెప్పఁబడి యుండ లేదు. మూలము నందలి కథలో నా విషయము చమత్కార పూర్వకముగా సూచింపఁ బడినది. ఉదంకుఁ డశుచియైన యన్నము పెట్టుచుంటివి కాన నంధుఁడ వగుమని పౌష్యుని శపింపఁ బౌష్యుఁడు "యస్మాత్త్వ మవ్యదుష్ట మన్నం దూషయసి తస్మా దనపత్యో భవిష్యసి" యని ప్రతిశాప మిచ్చెను. తరువాత నతఁ డన్నము యొక్క యశుచి భావము నెఱింగి క్షమింపవలె నని యుదంకుని వేఁడుకొనెను. ఉదంకుఁ డచిర కాలముననే శాపమోక్షము కలుగునని చెప్పి తన శాపము గ్రమ్మఱింపు మని కోరెను. పౌష్యుఁడు తీక్ష్ణ హృదయత్వముచే శాపము గ్రమ్మఱింపఁ జాల నని పలికెను. అప్పు డుదంకుఁడు "అదుష్టమైన యన్నమును దూషించితివి కావున ననపత్యుఁడ వగుదు వని నీ వంటివి. అన్నము దుష్ట మైనచో నీ శాపము నాకుఁజెందదు. నేను దుష్టమైన యన్నమునే దూషించితి" నని పలికి వెడలి పోయెను. ఈ రీతిగా మూలమున నుదంకునికిఁ గూడ శాపము తొలఁగి పోయినట్లు సూచింపఁ బడినది. నన్నయ యీ విషయము నేల విడిచెనో తెలియదు.

3. ఉదంకుఁడు జనమేజయునకు సర్పయాగ బుద్ధి పుట్టించెనని విన్నపిమ్మట ఋషులు సౌతిని "సర్పములకా జనమేజయు సర్పయాగమున నుదగ్ర పావక శిఖాతతులం దొరఁగంగఁ గారణం బమల చరిత్ర యేమి చెపుమయ్య" యని యడిగిరి. (ఆది-౧-127). అప్పుడు సౌతి "తొల్లి సర్పకుల జననియైన కద్రువ శాపంబు కారణంబునం జేసి జనమేజయు సర్ప యాగంబున సర్వ భక్షకుండైన యగ్ని యందు సర్పంబుల కెల్ల నకాండ ప్రళయంబైన దాని భృగు వంశజుండైన రురుఁడు గావించు సర్ప ఘాతంబు సహస్రపాదుఁ డుడిగించి నట్లు జరత్కారు సుతుండైన యాస్తీకుఁ డుడిగించె దీని సవిస్తరముగాఁ జెప్పెద వినుం" డని భృగువంశ కీర్తనము చెప్పఁ దొడంగెను. ఋషులు వేసిన ప్రశ్నకును గథకుఁడు చెప్పమొదలిడిన కథకును నిచ్చట సంబంధము కనఁబడుట లేదు.

మూలమున నైదవ అధ్యాయములో శౌనకుఁడు "తత్ర వంశ మహం పూర్వం శ్రోతు మిచ్ఛామి భార్గవ" మ్మని యడిగినట్లున్నది. (1.5-2)

శ్రీకృష్ణ భారతమం దీ సందర్భమున "అట్లుదంక ప్రేరితుఁ డగు జనమేజయుఁ డొనర్చు సర్ప యాగంబున సర్పంబు లెల్లఁ ద్రెళ్లుటకును, యాగంబున కంతరాయంబు కలుగుటకును, వైశ్వానరుండు సర్వభక్షకుండయి యాగంబున సర్పంబులఁ దినుటకును గారణం బున్న యెడల సవిస్తరంబుగం జెప్పు మనిన" నక్కథకుం డంతయుఁ జెప్పఁ గడంగె నని యున్నది. ఈ క్రమము కథను బాగుగాఁ గలుపు చున్నది. కాని యిది యే ప్రతియం దున్నదో తెలియదు. (ఆది. ౧. 108)

4. సహస్రపాదుఁడు రురుని సర్ప ఘాతము నుండి వారించు సందర్భమున " జనమేజయుం డను జనపతి చేయు సర్ప యాగంబు నందుఁ గద్రూశాపంబున నయ్యెడు సర్పకుల ప్రళయంబును భవత్పితృశిష్యుఁడైన యాస్తీకుం డను బ్రాహ్మణుండ కాఁడె యుడిగించె" నని చెప్పి యుండెను. దీనిని బట్టి రురుని వృత్తాంతమునకు ముందే సర్ప యాగము నాస్తీకుఁ డుడిగించుట జరిగి యుండె నని తెలియుచున్నది. భృగు వంశ కథనమునకు ముందు "భృగు వంశజుఁడైన రురుఁడు గావించు సర్ప ఘాతంబు సహస్రపాదుఁ డుడిగించినట్లు జరత్కారు సుతుఁడైన యాస్తీకుఁ డుడిగించె "నని చెప్పఁబడి యుండుట(ఆది-౧-128) చూడ రురుఁ డొనరించు సర్పఘాతమును సహస్రపాదుఁ డుడిగించుటయే ముందు జరిగినట్లు తోఁచుచున్నది.

మూలమునఁ గూడ సహస్రపాదుఁడు సర్ప యాగము నాస్తీకుఁ డుడిగించినట్లు రురునికిఁ జెప్పి నట్లున్నది. (1.11-17.). కాని భృగు వంశ కథనమునకు ముందు తెలుఁగున నున్న యా యుపమానము లేదు. అందుచే నందుఁ బూర్వాపర వైరుధ్య మేదియు గోచరింపదు.

5. జనమే జయుఁ డాస్తీక ప్రార్థనం జేసి సర్ప యాగం బుడిగించె నని (ఆది. ౧. 232) లోఁ జెప్పఁ బడినది. తరువాతి పద్యములో విప్ర మంత్ర మాహాత్మ్యముచే వాసవచ్యుతుఁడై తక్షకుఁడు మేఘపథమునఁ దిరుగుచుండె నని కలదు.

"ఆతని సత్యుగ్రానలపాతోన్ముఖుఁడైన వానిఁబడకుండఁగ నో
హో తక్షక క్రమ్మఱు మని యాతతభయుఁగ్రమ్మఱించె
నాస్తీకుఁడెడన్" (ఆది. ౧-234)

జనమేజయుఁడు సర్పయాగమును మానిన పిమ్మటఁ దక్షకుఁడింకను నగ్నిలోఁ బడనుండుటయు నాస్తీకుఁడు క్రమ్మఱింపుటయు ననావశ్యకములు.

మూలమున జనమేజయుఁడు వరము కోరుకొను మనఁగా నాస్తీకుడు "సత్రం తే విరమ త్వేత న్నపతేయు రి హోరగాః" (1-52-17) అని యడిగె ననియు, జనమేజయుఁ డింకొక వరమేదైన వేఁడు మని యతనిఁ బ్రార్థించె ననియు, నింతలో నింద్రహస్తచ్యుతుఁడై తక్షకుఁడు పడఁబోవుచుండఁగా ఆస్తీకుఁడు "తిష్ఠ, తిష్ఠ" యని పలికె ననియుఁ దరువాత సదస్యు లాస్తీకుఁడు కోరిన వరము తప్పక యీయవలె నని చెప్పఁగా జనమేజయుఁ డంగీకరించె ననియుఁ జెప్పఁబడినది. తెలుఁగులోని క్రమము కంటె నీ క్రమమే యుచితముగా నున్నది.

6. ఏకచక్రపురము నందలి బ్రాహ్మణు నింట బకుని కాహారము పంప వలసిన వంతు తమకు వచ్చుటచే నందఱు వేడ్చుచుండఁ గుంతి వారల డాయఁ బోయి "మీ రిట్లేడ్చుటకుఁ గారణమేమో నాకుఁ జెప్పుఁడు. తీర్చెద"నని యడిగిన సందర్భమున నన్నయ "విగతాసులఁ దన మృదు వచన ప్రశ్నమను నమృతమున నెత్తెన్" అని వ్రాసెను. (ఆది. ౬-262). పోయిన ప్రాణము గల వారిని తన మృదువచనములతోఁ గూడిన ప్రశ్న మనెడి యమృతముతోఁ బైకెత్తెను (జీవింపఁజేసె) నని యిందలి భావము. బ్రాహ్మణాదులు విచారగ్రస్తులే కాని విగతాసులుకాదు. విగతాసుల నమృతముచే వలె నెత్తె నని యుండుచో నుచితముగా నుండును.

"గతాసూ నమృతే వేవ జీవయం తీద మబ్రవీత్" (1.147-24)
అని మూలమున సరిగా నిట్లే యున్నది.

7. సహదేవుఁడు మాహిష్మతీ పురమును ముట్టడింపఁగనే యాతని సేన నగ్ని చుట్టుముట్టె నని వైశంపాయనుఁడు చెప్పఁగా జనమేజయుఁడు :

"కిమర్థం భగవా నగ్నిః ప్రత్యమిత్రో ఒభవ ద్యుధి
సహదేవస్య యజ్ఞార్థం ఘటమానస్య వై ద్విజ" (2.28-16)

అని ప్రశ్నించెను. ఇందు "యజ్ఞార్థం ఘటమానస్య" అను విశేషణము సాభిప్రాయమైనది. అగ్నికి యజ్ఞములు ప్రీతికరములు. అట్టిచో రాజసూయ యజ్ఞార్థమై యత్నించు సహదేవుని కగ్నియేల విరుద్ధుఁడయ్యెనని యాతఁ డట్లు డుగుటలోని యభిప్రాయము. నన్నయ ఆ విశేషణమును దొలఁగించి "కడఁగి

యనలేఁ దేమి కారణమున సహదేవు సేనపయి నతి ప్రచండశిఖలు గప్పె" నని మాత్రము జనమేజయుఁ డడిగినట్లు వ్రాసెను. ఆ విశేషణముతోఁ గూడిన మూల శ్లోకమే తెలుఁగు పద్యముకంటె హృద్యముగా నున్నది.

9. చ్యవనుఁడు తన సైన్యంబుల కెల్ల మూత్రపురీష నిరోధ మొన రింపఁగాఁ జింతాక్రాంతుఁడై యున్న తండ్రికడకేగి సుకన్య:

"మిన్న మిడుగుఱులై రెండు మెఱచు చున్న
మెఱుఁగు లొక పుట్టలో నున్న నెఱుఁగ కేను
బుట్ట గ్రొప్పించి యా రెంటి పొడవుఁ గాన
కుడిగి వచ్చితి విస్మయపడి మనమున" (అర. 3-179)

అని చెప్పియుండెను. ఆమె పుట్ట గ్రొప్పించి చూడఁగా జ్యవనుఁడేల కనఁబడ లేదో యిందుఁ జెప్పఁబడి యుండలేదు. పిమ్మట సంయాతి యచ్చటి కేగి యతి వృద్ధు భార్గవుఁ గనె నని చెప్పఁబడినది. మూలమున :

"మ యాట స్త్వేహ వల్మీకే దృష్టం స త్త్వ మభిజ్వలత్
ఖద్యోతవ దభిజ్ఞాతం త న్మయా విద్ధ మంతికాత్
ఏత చ్ఛ్రుత్వా తు శర్యాతి ర్వల్మీకం తూర్ణ మాద్రవత్
త త్రాపశ్య త్తపోవృద్ధం వయోవృద్ధం చ భార్గవమ్" (3-122-20)

అని సుకన్య పుట్ట గ్రొప్పించిన మాటయే లేదు. కూఁతురు చెప్పిన తరువాత సంయాతియే దానిని గ్రొప్పించెను. ఇదే యుచితతరముగా నున్నది.

10. అష్టావక్రుని కథయందు నన్నయ "మాతుల భాగినేయులైన యష్టావక్ర శ్వేతకేతు లింద యుగ్రతపంబుఁ జేసిరి" (అర. 3-237). ఇట "సుజాత ప్రసూతయై యష్టావక్రుఁ గనియెఁ దత్కాలంబున నుద్దాలకు భార్య శ్వేతకేతుఁగనియె నిట్లు మాతుల భాగినేయు లిద్దఱు సవయస్కులై పెరిఁగి" (242) అని యష్టావక్రుఁడు మేనమామ యనియు శ్వేతకేతుఁడు మేనల్లుఁ డనియు వ్రాసియుండెను. మూలమున నుద్దాలకునికి కహోడుఁడను శిష్యుఁ డుండె ననియు, నతని కాతఁడు తన కూఁతురైన సుజాత నిచ్చి పెండ్లిచేసె ననియు, నామె కష్టావక్రుఁడు జన్మించె ననియు స్పష్టముగాఁ జెప్పఁబడినది. (నన్నయ కహోడుని పేరే కపాదుఁ డని వ్రాసెను). "తస్యాసీద్వై మాతులః శ్వేతకేతుః" (3-132-10) అను వాక్యమున శ్వేతకేతుఁడే మాతులుఁ డని వ్యక్తమగుచున్నది. నన్నయ యిట్లేల మార్చెనో తెలియదు.

11. సౌగంధికాహరణమున హనుమంతుఁడు భీమునికిఁ జతుర్యుగాచార వర్తనంబులు చెప్పునప్పుడు కృష్ణుఁడు ద్వాపరమునఁ గృష్ణుఁడును గలిని బీత వర్ణుఁడునై జగము రక్షించుచుండు నని నన్నయ వ్రాసియుండెను. (అర. 3.339-340) మూలమున :

"ద్వాపరేఽ పి యుగే ధర్మో ద్విభాగో నః ప్రవర్తతే
విష్ణు ర్వై పీతతాం యాతి చతుర్థా వేద ఏవ చ" (3-148-26)
"పాదే నైకేన కౌంతేయ ధర్మః కలియుగే స్థితః
తామసం యుగ మాసాద్య కృష్ణో భవతి కేశవః" (32, 33)

అని కృష్ణుఁడు ద్వాపరమునఁ బీతవర్ణుఁడును గలియుగమునఁ గృష్ణవర్ణుఁడు నై యుండు నని చెప్పఁబడినది. ఇదియే సరియైనది.

12. ఆర్ష్టిసేనాశ్రమమున ధౌమ్యుఁడు ధర్మజునకు మందర పర్వతమును గూర్చి చెప్పు సందర్భమున :

"తతో యుధిష్ఠిరం ధౌమ్యో గృహీత్వా దక్షిణే కరే
ప్రాచీం దిశ మభిప్రేక్ష్య మహర్షి రిద మబ్రవీత్
శైలరాజో మహారాజ మందరోఽ భివిరాజతే
ఇంద్రవైశ్రవణా వేతాం దిశం పాండవ! రక్షతః" (3-160-3,4)

అని మందరము వారున్న యెడకుఁ దూర్పున నున్నట్లు చెప్పఁబడినది. నన్నయ "ధర్మరాజు కుబేరాదేశంబున నార్ష్టిసేనాశ్రమంబున నుండునంత నాతనికి నొక్క-నాఁడు ధౌమ్యుండు విజాంగుళి నుత్తర దిగ్భాగంబు చూపుచు నిట్లనియె" (అర. ४-36) అని వ్రాసియుండెను. తరువాత ధౌమ్యుఁడు మందరమును మేరువును ధర్మజునకుఁ జూపి యుండెను. మేరువు దేవతల కావాసముకావునఁ దూర్పున నున్న దనుటయే యుచితమని తోఁచుచున్నది.

ఈ విధముగాఁ దెలుఁగున కంటె మూలమునందే కొన్ని భాగము లుచిత తరములుగాఁ గన్పట్టుచున్నవి. ఇచ్చట మూలానువాదములకుఁగల వ్యత్యాసము ప్రతి భేదముచేఁ గలిగినదో లేక నన్నయ బుద్ధిపూర్వకముగాఁ జేసినదో తెలియ రాదు. ప్రమాదవశమునఁ గొన్ని లోపము లనువాదములోఁ జొచ్చె నని యను కొనుటకును వీలులేకపోలేదు. కాని యట్టివాని సంఖ్య చాలఁ దక్కువ. ఉన్న వైనను అల్పతరములైనవే కాని గ్రంథసౌష్ఠవమునకు భంగము కలిగించు నట్టివి కావు.

L. సంస్కృతమున మహాకవులు పలువురు భారతము నుండియే వస్తువును గ్రహించి దృశ్య శ్రవ్య కావ్యములను నిర్మించి యుండిరి. వానిలో గాళిదాసుని యభిజ్ఞాన శాకుంతలము, మాఘుని శిశుపాల వధ, హర్షుని నైషధము, భారవి కిరాతార్జునీయము ముఖ్యము లైనవి. వీనికి సంబంధించిన కథాభాగము లన్నియు నన్నయ రచించిన భాగములో నున్నట్టివే. ఈ కవు లందఱును నన్నయకుఁ బూర్వులే. అందుచే నన్నయ రచించిన భారత భాగమునకు సంస్కృత భారతమే ప్రధానాధార మైనను అందుఁ బైని పేర్కొనఁ బడిన కావ్యము లందలి భావములు కూడ నచ్చటచ్చట గోచరించు చున్నవి. నన్నయ యా కావ్యము లన్నింటితోఁ బరిచయము కలవాఁ డగుటచే భారతము నం దా యా సందర్భములలో వాని యందలి భావములను గొన్నింటిని జొప్పించినట్లు కనఁబడు చున్నది. అట్లు తలంచుట కవకాశ మొసంగు శ్లోకాదులు కొన్ని యిట నుదాహరింపఁ బడుచున్నవి.

1. అభిజ్ఞాన శాకుంతలమున దుష్యంతుఁ డనసూయా ప్రియంవదా శకుంతలల సంభాషణము వలన శకుంతల కణ్వుని కుమార్తె యని యెఱింగి యామె బ్రాహ్మణ కన్య యగుటచేఁ దన ప్రణయమున కవకాశము లేదని మొదటఁ దలంచినను దరువాత "అపి నామ కులపతే రియ మసవర్ణ క్షేత్ర సంభవా స్యాత్. అథవా కృతం సందేహేన.

అసంశయం క్షత్త్రపరిగ్రహక్షమా
య దార్య మస్యా మభిలాషి మే మనః
సతాం హి సందేహ పదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" (అంక. ౧-21)

అని నిశ్చయించుకొనెను. ఈశ్లోక భావమునే నన్నయ :

"ఇది ముని కన్య యేని మఱి యేలొకొ యీ లతాంగియందు నా
హృదయము తద్దయుం దవిలె నిప్పలు కింకను నమ్మనేరన
య్యెద........" (ఆది. ౪-30)

అను పద్యమున [stamp] యున్నది. ఈ భావము వ్యాస భారతమునఁ గాన రాదు. మరల నన్నయ వలన దుష్యంతుఁడు శకుంతలా జన్మవృత్తము నెఱింగిన పిమ్మట:



"భవ హృదయ సాభిలాషం
సంప్రతి సందేహనిర్ణయో జాతః
ఆశంకసే య దగ్నిం
తదితం స్పర్శక్షమం రత్నం" (అంక. ౧-26)

అని యనుకొనెను. దీని ఛాయ నన్నయ రచించిన ఈ క్రింది పద్యమందు గోచరించు చున్నది.

"ఇది మునినాథ కన్యయని యెంతయు నిస్స్పృహవృత్తినున్న నా
హృదయము రాజపుత్త్రి నని యిక్కమలాక్షి నిజాభిజాత్య సం
పద నెఱింగించినన్ మదనబాణ పరంపర కిప్పు డుండె నా
స్పదమయి సంచలించె నళిపాత వికంపిత పంకజాకృతిన్"
(ఆది. ४-50)

2. తెలుఁగు భారతమునఁ గణ్వుఁడు సర్వదమను నుదార తేజో రూప విక్రమ గుణంబులకు సంతసిల్లి యాతఁడు యౌవరాజ్య పట్టాభిషేకమునకు సమర్థుఁ డయ్యె నని విచారించి శకుంతలతో :

"ఎట్టిసాధ్వులకును బుట్టిన యిండ్లను బెద్దకాల మునికి తద్ద తగదు
సతుల కడన యునికి సతులకు ధర్మువు సతుల కేడుగడయుఁ బతుల
చూవె" (ఆది. ४-65)

అని చెప్పినట్లున్నది. ఇచ్చట మూలమునఁ గణ్వుఁడు శిష్యులతో
(కణ్వః శిష్యా నువాచ హ)

"నారీణాం చిరవాసో హి బాంధవేషు న రోచతే
కీర్తిచారిత్రధర్మఘ్న స్తస్మా న్నయత మా చిరమ్" (1-68-11)

అని చెప్పినట్లు వ్రాయఁబడినది. అభిజ్ఞాన శాకుంతలమునఁ బంచమాంకములో శార్ఙ్గరవుఁడు రాజుతోఁ జెప్పిన

"సతీ మపి జ్ఞాతికులైక సంశ్రయాం
జనో ఽ న్యథా భర్తృమతీం విశంకతే
అత స్సమీపే పరిణేతు రిష్యతే
త దప్రియాపి ప్రమదా స్వబంధుభిః" (అంక. ౫-17)

అను శ్లోకము కూడఁ బై భావమునే వెల్లడించుచున్నది. నన్నయ పద్య మీ శ్లోకమునే యెక్కువగా ననుసరించు చున్నది.

3. ఋతుపర్ణుఁడు బాహుకవార్ష్ణేయ సహితుఁడై రథమెక్కి దమయంతీ ద్వితీయ స్వయంవరమున కరుగు నప్పుడు :

"ఎదురను దవ్వులఁ జూచిన పొడవు లెల్లఁ దత్క్షణమ
కదియఁగా నవ్వి యెంతయును దవ్వయి కనఁబడఁ బిఱుఁద"
(అర. ౨-169)

విస్మితుఁ డయ్యెనని నన్నయ రథ గమన వేగమును వర్ణించెను. ఇది కాళిదాసుని :

"యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా త ద్విపులతాం
య దర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధాన మివ తత్" (అభి. ౧-9)

అను శ్లోకమును బోలియున్నది.

4. స్వయంవర రంగ మధ్యమునందు :

"పుష్పసాయకు కుసుమేతరంబైన యాఱగు సాయకం బనఁగ జనులు
(ఆది. 2-167)

ద్రౌపది యొప్పారె నని నన్నయ వర్ణించెను. మూలమునందీ సందర్భమున :

"ఆప్లుతాంగీ సువసనా సర్వాభరణభూషితా
వీరకాంస్య ముపాదాయ కాంచనం సమలంకృతం
అవతీర్ణా తతో రంగం ద్రౌపదీ భరతర్షభ" (1-176-30)

అను వర్ణన మున్నది. నన్నయ కావించిన వర్ణన కాళిదాసుని కుమార సంభవము నందలి "కామస్య పుష్ప వ్యతిరిక్త మస్త్ర"మ్మను శ్లోక భాగమును (౧-31) స్మృతికిఁ దెచ్చుచున్నది. కాళిదాసు దానిని వయస్సునకు (యౌవనమునకు) విశేషణముగా వాడి యుండెను.

5. ఉదంకుఁడు పౌష్యునిఁ గాంచి యాతనిచే సత్కృతుఁడై

"ఏను గుర్వర్థ మర్థినై మానవేశ
కడఁగి వచ్చితి నిపుడు నీ కడకు వేడ్క" (ఆది. ౧-94)

అని పల్కియుండెను. ఈ వాక్యము రఘువంశము నందలి "గుర్వర్థ మర్థీ శ్రుత పారదృశ్వా" (5-24) అను శ్లోక భాగమును స్మరింపఁ జేయుచున్నది.

6. శకుంతల దుష్యంతునితోఁ దన కొడుకును గూర్చి చెప్పుచు

"నీ పుణ్యతనువు వలనన యీ పుత్త్రకుఁ డుద్భవిల్లి యెంతయు నొప్పున్
దీపంబువలనఁ గొండొక దీపము పుట్టించినట్లు తేజం బెసఁగన్"
(ఆది. ४-83)

అని చెప్పియుండెను. అమూలక మైన యిందలి యుపమానము కాళిదాసుని రఘువంశము నందలి "ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్ (5–37) అను నుపమానము ననుకరించుచున్నది.

7. శిశుపాల వధ కావ్యము నారదుఁడు శ్రీకృష్ణుని కడ కరుదెంచుటతో నారంభించుచున్నది. ఆ సందర్భమున నందు నారదునికి "పతత్పతంగ ప్రతిమ స్తపోనిధిః" (౧–12) అను విశేషణము వాడఁబడినది. సభా పర్వమున నారదుఁడు ధర్మజుని సభ కరుదెంచు నప్పుడు నన్నయ "నీరజమిత్రుఁడేల ధరణీగతుఁ డయ్యెడు నొక్కొ యంచు విస్మెర మనస్కులై జనులు మెచ్చి నిజద్యుతి సూచుచుండఁగా" (సభా. ౧–12) అని వర్ణించి యుండెను. ఈ భావము వ్యాస భారతమున లేదు. నన్నయ శిశుపాల వధ యందలి యా వాక్యమునే యిట్లు వివరించినట్లు తోఁచుచున్నది.

8. అరణ్య పర్వ ప్రథమాశ్వాసమున నర్జునుఁడు పాశుపతాస్త్ర సంపాదనమునకై శివునిఁ గూర్చి తప మాచరించుటయుఁ, గిరాత రూపమున వచ్చిన శివునితోఁ బోరాడుటయు, శివుఁ డాతని విక్రమమునకు మెచ్చి పాశుపతాస్త్రము నొసంగుటయు మున్నగు విషయములు వర్ణింపఁ బడినవి. ఈ సందర్భమున భారవి కిరాతార్జునీయము నందలి భావములు కొన్ని కానవచ్చుచున్నవి. ద్రౌపది ధర్మజునితోఁ గేవల క్షమా వృత్తి క్షత్రియున కుచితము కాదని చెప్పునపుడు :

"ధర్మదూరులైన ధార్తరాష్ట్రుల యం దధర్మ మేమి సేయు ధరణినాథ
నికృతిపరులయందు నికృతి సేయని వారు వారి నికృతిఁజేసి
వధ్యులండ్రు" (అర. ౧–226)

యను నమూలక మైన పద్యము కానవచ్చుచున్నది. ఇది

"వ్రజన్తితే మూఢధియః పరాభవం
భవంతి మాయావిషు యే న మాయినః
ప్రవిశ్య హి ఘ్నన్తి శఠా స్తథావిధా
న సంవృతాంగా న్నిశితా ఇ వేషవః" (౧–30)

అను కిరాతార్జునీయ శ్లోకమును బోలియున్నది.

9. భీముఁడు కూడ నట్లే క్షాత్త్ర గుణములను వర్ణించి ధర్మజుని శత్రు సంహారమునకుఁ బురికొల్పుచు దీర్ఘోపన్యాసముఁ గావింప ధర్మరాజాతని

వచనముల నిట్లు పొగడి యుండెను.

"నీ వచనంబు ధర్మ్యము వినీతము నీతియుతంబు నిష్టసి
ద్ధ్యావహ మత్యుదార మిదియైనను నిప్డు దలంపఁగా విచా
రావసరాప్తికిన్ విషయమైనది." (అర. ౧-257)

ఈ పద్యము కిరాతార్జునీయములోని ;

" అపవర్జిత విప్లవే శుచౌ హృదయ గ్రాహిణి మంగళాస్పదే
విమలా తవ విస్తరే గిరాం మతి రాదర్శ ఇ వాభిదృశ్యతే " (౨.26)

అనుశ్లోకము నందలి క్రమము ననుసరించు చున్నది.

పై సందర్భముననే ధర్మరాజు భీమునకు సమాధానము చెప్పుచు :

" అలఘు గుణంబులం దధికుఁడైన మహాత్ముఁడు రాగ కోపమా
యలఁబడి యక్షమా వివశుఁడై యచిరాంశు లతావిలాస చం
చలమగు లక్ష్మి కాసపడి సత్యము ధర్మము దప్పి సత్ప్ర భా
వలిఁ దగు వారి యొద్దఁ దగువాఁడయి సద్విధి నుండ నేర్చునే "
(అర. ౧-259)

అని క్షమ వర్ణించి, నశ్వరములగు సంపదల కాసపడువారు సజ్జన స్తుతి పాత్రులు కాఁజాలరని తెల్పియుండెను. ఈ భావము కిరాతార్జునీయము నందలి యీ క్రింది శ్లోకము నందుఁ గూడఁ గానవచ్చు చున్నది.

" అభిమాన ధనస్య గత్వరై రసుభిః స్థాస్ను యశ శ్చిచీషతః
అచిరాంశు విలాస చంచలా నను లక్ష్మీః ఫల మాను షంగికమ్ "
(౨. 19)

ఇందలి అచిరాంశు విలాస చంచలా అను విశేషణమునే నన్నయ యించుక మార్పుతోఁ బద్యమున వాడి యుండెను.

10. అర్జునుఁడు ద్రౌపదిని, సోదరులను విడిచి యేగు సందర్భమున నన్నయ " పాంచాల రాజపుత్త్రి దన స్నేహ లాలస విలోపాంగ విలోకనంబులం బార్థుఁ బరిగృహీత పాథేయుం జేయుచుఁ దద్వియోగ తరళంబైన హృదయం బెట్టకేనియు నొక్కింత సేసికొని యుండె " (అర-౧-286) నని వర్ణించి యుండెను.

ఈ వర్ణన కిరాతార్జునీయ మందలి :

" అకృత్రిమ ప్రేమ రసాభిరామం
రామార్పితం దృష్టి విలోభి దృష్టం

మనః ప్రసాదాం జలినా వికామం

జగ్రాహ పాథేయ మి వేంద్ర మామః " (3-37)

అను శ్లోకము నందలి భావమునకు మిక్కిలి సన్నిహితముగా నున్నది.

11. నలోపాఖ్యానము నందు నలుఁ డవని కవతరించిన హంసలలో నొక దానిని బట్టుకొన్నప్పుడు దానిని విడిచిపోవ నోపక యితర హంస లఱచుచు నాకసమునఁ బిండుగట్టి తిరుగుచుండె నని నన్నయ వర్ణించెను. మల్లినాథుఁడు చెప్పినట్లు ("స్వయూధ భ్రంశే కూజనం పక్షిణాం స్వభావః") స్వయూధము నందలి పక్షులు కొన్ని తప్పిపోయినచో నితర పక్షులు కూఁత పెట్టుట సహజము. ఈ భావము వ్యాస భారతమునఁ గానరాదు. నైషధములో నీ సందర్భమున నీ క్రింది శ్లోక మున్నది.

" పతత్రిణా త ద్రుచిరేణ వంచితం

శ్రియః ప్రయాంత్యాః ప్రవిహాయ పల్వలమ్

చల త్పదాంభోరుహ నూపురోపమా

చుకూజ కూలే కలహంస మండలీ " (౧-127)

M. నన్నయ సంస్కృత భారతము ననువదించుచుఁ దనకుఁ బూర్వ మందుండిన సంస్కృత మహాకవుల కావ్యముల లోని భావముల నాయా ఘట్టములందు గ్రహించినట్లే, కన్నడ మహాకవుల కావ్యము లందలి భావములను గూడఁ గొన్నిచోట్ల ననుసరించి యుండినట్లు కనఁబడుచున్నది. ఆ రోజులలోఁ దెలుఁగు కన్నడముల కిప్పు డున్నంత పార్థక్య మున్నట్లు తోఁపదు. అప్పటి మహాకవు లిరు భాషల తోడను గొంచెమో గొప్పయో పరిచయము కలిగి యుండిరని చెప్ప వచ్చును. నారాయణ భట్టు సంస్కృతాంధ్ర ప్రాకృతము లందే కాక కర్ణాటము నందుఁ గూడఁ గొప్ప కవియై యుండెనని నందమపూఁడి శాసనము తెలుపు చున్నది. నన్నయయు నట్లే యా భాష తోడను, అందలి వాఙ్మయము తోడను దప్పక పరిచయము కలిగి యుండును. తెలుఁగున నూతన కావ్య రచన సాగింప నుత్సుకుఁ డగుచున్న యాతఁ డంతకు ముందే యుత్తమ రచనలతో వాప్పారు చుండిన సాటి దేశభాషా వాఙ్మయమును దత్పరతతోఁ బరిశీలించి యుండు నను టలో నచ్చెరువు లేదు. అందును ఆంధ్రుఁడును, ఇంచుక తత్త్వభేదముతో నైనఁ దా ననువదింపనున్న భారతము నందలి వస్తువునే కావ్యముగా నిబంధించిన వాఁడును, అగు పంపకవి గ్రంథముల నాతఁడు తప్పక పఠించి యుండును. అట్టి

యెడ నందుఁ దనకు హృద్యము లని తోఁచిన కొన్ని పద్యములను, బలుకు బళ్ళను ఆతఁ డనుసరించి యుండుట యసంభావ్యము కానేరదు. "పంపని భారతమును భట్టారకుని భారత రచనమును బోల్చి చూచినప్పుడు రెండు గ్రంథములను రచించిన వా రొక రేనా యన్నంత పోలిక కనిపించు" నని యా యిరువురు కవుల రచనలను నిశితముగాఁ బరిశీలించిన శ్రీ పుట్టపర్తి నారాయణా చార్యులుగారు చెప్పియున్నారు 1-.

పంపఁడు పదమటి చాళుక్యుల కొలువులో నున్నట్టి వాఁడు. అతఁడు విక్రమార్జున విజయమునఁ జాళుక్య వంశమును, దనకాశ్రయ దాతయైన యరి కేసరిని, దనివితీర వర్ణించినాఁడు. తన కావ్యమున నాతఁ డర్జునునికిని, అరికేసరి కిని అభేద ప్రతిపత్తి కల్పించుచు నర్జునుని వృత్తాంతము వచ్చి నప్పుడెల్ల నరి కేసరికిఁ గల బిరుదముల నెల్ల శ్లేషగనో స్పష్టముగనో యందుఁ జొప్పించి యున్నాఁడు. అరికేసరిపైఁ బ్రీతిచేఁ గాకపోయినఁ జాళుక్య వంశ మందును, భారత కథ యందును గల యాదరాభిమానములచే నైన రాజరాజు పంప భారత మును దన కొలువునఁ జదివించుకొని యుండు ననుట సత్యదూరము కానేరదు. తెలుఁగునఁ గూడ భారతమును రచింపఁ జేయవలె ననియు, దానిని కృష్ణ ద్వైపా యన ముని వృషభాభి హితమైన యర్థము నిరూపిత మగునట్లుగా రచింపఁ జేయ వలె ననియు, నాతనిఁ బ్రేరేఁచిన హేతువులలోఁ బంప భారత శ్రవణము కూడ నొక్కటై యుండును. తన మనస్సున సహజముగా నుండిన యభిలాషకు తేని యానతి కూడ దోహద మొసంగ నన్నయ భారత రచన కుపక్రమించుచు దార తమ్య పరీక్షకో, యతిశయించి వన్నె చేకూర్చుటకో, పంప భారతమును దప్పక పఠించి యుండును. అందుచే జ్ఞాతముగనో యజ్ఞాతముగనో యందలి భావ ములు కొన్ని యతని రచనలోఁ జొచ్చి యుండుటలో వింత యుండదు.

రాజరాజు నన్నయను భారతము తెనుఁగున రచింపుమని చెప్పెనే కాని దానిని తన కంకితము చేయు మని యెచ్చటను గోరి యుండలేదు. కాని నన్నయ యాశ్వాసాద్యంతము లందు రాజరాజును సంబోధించుచు వ్రాసిన పద్యములు చూడ నా రచన యాతని కంకిత మైనట్లే కానిపించును. ఇట్లంకితము చేయుపద్ధతి సంస్కృతమునఁ గాని ప్రాకృతమునఁ గాని కానరాదు. కన్నడమున నున్నది. అందుచే నా పద్ధతి కర్ణాటానుకరణమే కావచ్చును. అట్లే నాయకునికిని గృతి

1. సుజాత - అలంపుర సంచిక. పుట - 60.

భర్తకును అభేద ప్రతిపత్తి కల్పించుట కన్నడ మందు బహు కావ్యములం దున్నది. నన్నయ యట్లభేద ప్రతిపత్తి కల్పించుచు వ్రాసె నని ఖండితముగాఁ జెప్పఁజాలము కాని యట్లు తోఁపఁజేయు పద్యము లాతని రచనలో ననేకము లున్నవి. జనమేజయుఁడు, దుష్యంతుఁడు, భరతుఁడు మున్నగు మహారాజుల వర్ణించుచు నాతఁడు రచించిన పలు పద్యములు రాజరాజునకు గూడ నన్వ యింపఁ దగినట్టివిగా నున్నవి. ఇట్టి పద్యములు ''నన్నయ చిత్రించిన రాజరాజ''ను భాగమున నుదాహరింపఁ బడియున్నవి.

నన్నయ భారత రచన కారంభించుచు " హరిహరాజ గజాననార్కషడాస్య మాతృ సరస్వతీ గిరిసుతాదిక దేవతా తతికి " న్నమస్కృతి యొనరించి యుండెను. పంప భారతమున నీ దేవతల తోపాటు మనోజుని స్తుతి కూడ నున్నది. నన్నయ మనోజస్తుతిని విడిచి మిగిలిన దేవతల నందఱిని వేఱువేఱు పద్యములలోఁ గాకున్న నొకే పద్య మందైన స్తోత్రము కావించియుండుట కన్నడానుకరణమునే సూచించుచున్నది. నన్నెచోడుని కుమార సంభవమునఁ గూడ నీ దేవతల స్తోత్రము లున్నవి. తరువాతి కవుల కావ్యములలోఁ ద్రిమూర్తులయుఁ, దద్భార్యలయు, గజాస్యునియు స్తోత్రములే కాని యర్కషడాస్య స్తోత్రములు కానరావు.

పంప మహాకవి విక్రమార్జునీయమున దేవతా స్తోత్రమైన పిమ్మట "వ్యాస మునీంద్ర రుంద్ర వచనామృత వార్ధియ నీసువెం కవి వ్యాసనె నెంబ గర్వమెన గిల్ల " (పంప.౧-13) యని వ్యాస మహామునిని స్తుతించి యుండెను. నన్నయయు "భారత భారతీశుభ గభస్తి చయంబులఁ జేసి" (ఆది. ౧-22) యను పద్యమునఁ బరాశరాత్మజాంభోరుహమిత్రుఁ గొల్చుటయే కాక, యంతకు ముందు గురుపద్య విద్యకు నాద్యుఁడైన ప్రచేతసుపుత్త్రుఁ గూడ స్మరించి యుండెను. నన్నయ యవతారి కాంతమున :

" సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు దెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్ "
(ఆది. ౧-25)

అను పద్యమునఁ దన కవిత్వము నందలి ప్రధాన గుణములను బేర్కొని యుండెను.

అట్లే పంపఁడును విక్రమార్జున విజయమందు :

"ఆ సకళార్థ సంయుత మళంకృత యుక్త ముదాత్త వృత్తి వి
న్యాస మనేక లక్షణ గుణ ప్రభవం మృదుపాద మాదవా
క్శ్రీ సుభగం కళాకళిత మెంబ సెగఱ్ఱ యనాళ్ద కబ్బమం
కూసుమ నీవు దీవు దరికేసరి గల్లద వస్తు గీవుదే" (ప్రథ. ౬)

"లలిత పదం ప్రసన్న కవితా గుణ మిల్లదె పూణ్దు పేఱ్ఱ్దె బె
ళ్గళకృతి బంధముం బరిహకాఅర క్కైగళ కేడు నుణ్ణ న
ప్పుళ కదవేడు పేఱ్ఱిసి దొడర్ధదకేడినె పేఱ్దు బీగి పూ
ట్టళిస నెగఱ్ఱ గాటిసువ దుష్కవియుం కవియెంబ లెక్కయే"
(ప్రథ. 12)

అను పద్యము లందుఁ దన కవితా గుణములను జెప్పుకొని యున్నాఁడు.

ఇట్లు చెప్పుకొనుటలోనే కాక యిరువురు నవలంబించిన కవితా గుణము లందుఁ గూడఁ గొంత సామ్యము కానిపించు చున్నది. పంపని పద్యము లందలి ప్రసన్నకవితాగుణ, ఆ సకలార్థ సంయుత, లలిత పద, వాక్శ్రీ సుభగాది పద ములే నన్నయ పద్యము నందలి ప్రసన్న కథా కలితార్థ యుక్తి, అక్షర రమ్యత, అను వానికి మూలము లైనట్లు తోఁచు చున్నది.

"ఆతం నిజ భుజ విజయ
ఖ్యాతియ నాళ్దాళ్ద నధిక బల నవనిపతి
వ్రాత మణి మకుట కిరణ
ద్యోతిత పాదం సపాద లక్షక్షితియం" (ప్రథ. 16)

"శ్రీ వనితా వల్లభ వేఁ
గి విషయాధీశ కావ్య గీతప్రియ నా
నావనినాధ కిరీట త
టీ విలసద్రత్న సంఘటిత పద కమలా" (ఆది. 2-1)

"శ్రీ పతిగె యుద్ధ మల్లమ
హీపతిగె నెగఱ్ఱ పుట్టి పుట్టిద నఖిళ
క్ష్మాపాల మౌళిమణి కిర
ణాపాళిత నఖమయూఖ రంజిత చరణం" (ప్రథ. 18)

పై యుదాహరణములను బట్టి పంపని పద్యము లందలి సమాసము లనే నన్నయ యించుక మార్పుతో ననువదించెనని వ్యక్తమగు చున్నది.

కొన్ని వర్ణన భాగము లందుఁ గూడఁ బంప భారతమునకును నన్నయ భారతమునకును సన్నిహిత సాదృశ్యము కనవచ్చుచున్నది. పాండు మహారాజు మాద్రిని గూడుటకు ముందు పంపఁడు వసంత ఋతువును దీర్ఘమైన వచనములో వర్ణించి యున్నాఁడు. (ద్వితీ. 13. అగళా బసంత రాజన బరవింగె గుడి గట్టి దంతి ఇత్యాది). నన్నయ దీనినే లయగ్రాహులలోఁ జక్కఁగా వర్ణించి యుండెను. (ఆది. 2-138. 139). ఒకనాఁడు కుంతీదేవి బ్రాహ్మణ భోజనంబు పేయించుచుండి మాద్రీ రక్షణమునం దేమఱి మఱచి యుండఁగా :

" చారు సువర్ణ హాసి నవచంపక భూషయు సిందువార ము
క్తారమణీమయున్ వకుళదామ వసంతయునై యపూర్వ శృం
గార విలాసలీల యెసఁగ........" (ఆది. ౫-141)

మాద్రి యాతని ముందు నిలువఁగా నామెను జూచి పాండురా జంగజ రాగమత్తుఁ డయ్యె నని నన్నయ వర్ణించెను. ఈ వర్ణనము మూలమునందు లేదు. దీనికి బీజమని చెప్పఁదగినది పంపని పై వచనమం దున్నది. (ద్వితీ -13)

కణ్వాశ్రమమును వర్ణించుచు నన్నయ " శ్రవణసుఖంబుగా సామ గానంబులు చదివెడు శుకముల చదువు దగిలి " ఇత్యాదిగా (ఆది. ౪-23)హృద్యమును, దరువాతఁ బలువురు కవులకు మున్యాశ్రమ వర్ణన సందర్భములం దాదర్శమైనదియు నగు సీసమును వ్రాసి యుండెను. ఈ వర్ణనము సంస్కృత భారతమునఁ గానరాదు. పంపఁడు కావించిన శతశృంగము నందలి ఋషుల యాశ్రమముల వర్ణనమున కిది ఛాయవలెఁ గానవచ్చు చున్నది. (ప్రథ. 116) (అ పర్వతద విపుళ వనోప కంఠం గళోళ్ తాపస కన్యియర్ - ఇత్యాది)

ఆదిపర్వ చతుర్థాశ్వాసమున సత్యవతి కురువంశోద్వహనార్థంబు పారాశర్యుం దలంచుడు నాతఁ డామె ముందు నిలిచెనని చెప్పు సందర్భమున నన్నయ యతని :

" నీల గిరీంద్ర శృంగమున నిర్మలమైన సువర్ణ వల్లరీ
జాలములోని పింగళ విశాల జటాచయ మొప్పఁగా వచ
శ్శ్రీ లలితుఁడు వచ్చి నిలిచెన్ హరినీల వినీల విగ్రహా
రాళరుచుల్ వెలుంగఁగ........ (ఆది. ౪-239)

అనివర్ణించి యుండెను. ఈ వర్ణనము సంస్కృత భారతములో లేదు. దీనికి మూలమని చెప్పఁదగిన వర్ణనము పంప భారతమం దున్నది.

" అంతు నీలాంబుద శ్యామనుం కనక పింగళ జటాబంధ కళా
పనుం, దండ కపాళ హస్తనుం, కృష్ణమృగ త్వక్పరి
ధానను మాగి వ్యాస భట్టారకం " (ప్రథ. 70)

వేదవ్యాసావతార సందర్భమున నన్నయ " అంతఁ గృష్ణ ద్వైపాయనుండును గృష్ణాజిన పరిధాన కపిల జటామండల దండ కమండలు మండితుఁడై తల్లి ముందట నిలిచి కర కమలంబులు మొగిచి మ్రొక్కి " (ఆది. ౨.46) అని పైపంపని వర్ణనము నేసంగ్రహముగా నొక్క సమాసమునం దిమిడ్చెను. కపాల ధారణము వైదిక సంప్రదాయమున కనుగుణము కాకపోవుటచే నాతఁడా విషయమును మాత్రము విసర్జించెను.[1]

" సరళ తమాల తాళ హరిచందన నందన భూజరాజియం "
(పంప. భా. 5-52)

" సరళ తమాల తాళ హరిచందన చంపక నారికేళ కేసర కదళీ లవంగ"
(ఆది. 8-78)

" ఏలా లవంగ లవలీ వేలావన భూమి యొర్ " (పంప. ఆది. పు. 13.2)

" ఏలావన రమ్యములగు వేలా వనములను " (ఆది. ౮-137)

" సకల క్ష్మాచర ఖేచరాంచిత మహా మాణిక్య గాణిక్య హస్తి "
(పం. ఆది. 8-137)

" మద మాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సంపద "
(స-1-18)

" కురువృద్ధం కులవృద్ధ " (పంప. భా. 6-44)

" కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్ " (స. ౨. 233)

పంపని రచనమున కనుకరణములని చెప్పఁదగిన నన్నయ పద్య భాగముల వింకను గొన్నిటిని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తెలుఁగు కవుల చరిత్ర 145, 146 పుటలలో నొసంగి యున్నారు.

నన్నయ సంస్కృత సమాసములను బహుళముగా వాడు మాట సత్యమే యైనను అందుఁ గ్లిష్టత యెచ్చటను గానరాదు. స్పష్టత యాయన రచనకు జీవా

---

1. దుర్వాసుఁడు మంత్రశక్తి నిచ్చి యరిగిన పిమ్మటఁ గుంతి యమ్మంత్ర శక్తి యెఱుంగ వేఁడి యొక్కనాఁ డేకాంతంబ చని గంగనీళ్ళఁ గాళ్ళు, మొగంబు కడిగి కొనెనని నన్నయ వ్రాసెను. ఈ విషయము సంస్కృత భారతమున లేదు. పంపభారతములో మన్నది.

"బందు సురనదియ నీరొళ్
మిందినవం నోడి " (ప్రథ. 91)

తువు. అనన్వితములుగా దీర్ఘ సమాసములు గూర్చి యర్థ క్లేశము కలిగించుట యాయనకుఁ జేతకాని విద్య. ఆయన సమాసములను సులభముగా విడిచి పదాంతరముల సాయము లేకుండనే విగ్రహ వాక్యములు చెప్పవచ్చును. సమాస రచనము నందలి యీ విధానము పంపని యందుఁ గూడ సర్వత్ర కానవచ్చుచుండును. ఆతని సమాసముల చివరఁ దెనుఁగు విభక్తులఁ జేర్చి చూచినచో నవి నన్నయ సమాసముల వలెనే గోచరించును.

పంపఁడు కథా వృత్తాంతమును వేగముగా నడపుటకును వర్ణనములకును వచనముల నెక్కువగా వాడుచుండును. ఆతఁ డనవసరములైన విషయములను బెంచకుండఁ జిన్న చిన్న సమాసములను వాడుచు వచనములను సాగించుచుండును. నన్నయ వచనములలోఁ గూడ సరిగా నీ గుణములే కానవచ్చును.

వైదిక విషయములను వర్ణించునప్పు డిరువురును ఆ వాఙ్మయమునందలి పదములను సందర్భోచితముగా వాడు చుందురు. అగ్నిముఖము, అగ్నులను విహరించుట, విధివత్స్వాహాస్వధాస్వస్తి శబ్దములు, విఘసంబు, విఘసాశి మున్నగు పదము లిందుకుఁ దార్కాణములు.

"పంపఁడు పాత్రలకుఁ జీవమిచ్చి యెదుట నిల్చి మాటాడునట్లు చేయును. అనౌచిత్యమును బరిహరించి సహజముగ నభివర్ణించును. అభిప్రాయమును వెంటనే మనసునకుఁ దోఁచినట్లు స్పష్టముగ వెల్లడించును. సన్నివేశమునకుఁ దగినట్లు మితిమీరనట్లు కథను నడపును. ఆతని రచనమందు సంకుచితి యెక్కువ. బహువిధప్రయోగదక్షతను జూపును. బంధపు బిగియు, శైలీ సారళ్యమును వర్ణనా రమ్యతయుఁ బంపని స్వభావము. సముచ్చయముల విరివిగా వాడుటయు నాతని పోకడ. పై చెప్పిన లక్షణములు చాల వఱకు నన్నయ యందున్నవనఁగా(నాపల్కు) గాదనువా రుండరను కొందును.[1]

పఠితల మనస్సునం దే విషయమునైన గాఢముగా నత్తుకొనునట్లు చేయవలెనను తలంపు కలిగినప్పుడు పద్యములందు- అందును ప్రాస స్థానములందు- నన్నయ యొకే పదమునకుఁ బునః పునరావృత్తి కలిగించుచుండును.

"గంగాధర పింగ జటా
సంగమ మంగళ విశాల సలిల తరంగన్
గంగానది సేవించెను
గంగాద్వారమున విగత కల్మషుఁ డగుచున్" (ఆది. 8-126)

1. సుజాత - అలంపుర సంచిక. పుట. 74

"అన్యోన్య ప్రియ భాషణు
లన్యోన్యహితైషు లసుర లన్యుల బోలెన్
మన్యు పరిప్రేరితులై
యన్యోన్యాభిహతిఁ జనిరి యమపురమునకున్" (ఆది. 8-113)

పంపని భారతమునఁ గూడ నీ పద్ధతి కనవచ్చుచుండును.

"విజయారంభ పురస్సర
విజయ గజం గళనె పిడిదు ఘూర్జరరాజ
ధ్వజిని యని ట్టిదోడిసి భుజ
విజయదె విజయను మని ట్టివిదం నరసింహం" (ప్రథ. 36)

"ఆత్మభవనా నరాధిప
నాత్మజనానహుష పృథు భగీరథ నళమా
హాత్మరవి ట్దిసి నెగట్దిమ
హాత్మం నరసింహ నరసింహ నటి వినోళ్ పరమాత్మం" (ప్రథ. 31)

పద్యముల యెత్తుగడలందు సైత మిరువురి యందుఁ జాల పోలికలు కనిపించును. పాండురాజు కిందమునిచే శపింపఁ బడినపుడు :

"ఎత్తవన మెత్త మృగయా
వృత్తక మీ తపసి యెత్త మిగమెందెంతా
నెత్తెచ్చె నాత్మ కర్మా
యత్తం పెఱ తల్తిదెల్ల మఘటిత ఘటితం" (ప్రథ. 113)

అని వాపోయెను. నన్నయ యీ సందర్భమున :

"ఎట్టి విశిష్ట కులంబునఁ
బుట్టియు సదసద్వివేకములు గల్గియు మున్
గట్టిన కర్మ ఫలంబులు
నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్" (ఆది. ४-58)

అని పరమ నిర్వేదన పరుండైన పాండురాజు శోకించినట్లు వ్రాసియుండెను.

దుష్యంతోపాఖ్యానమున శకుంతల సత్యప్రభావమును దెల్పుచుఁ దన్నుఁ జేకొనవలె నని చెప్పినప్పుడు దుష్యంతుఁడు తెల్పిన యీ క్రింది పద్యము నందలి యెత్తుగడ సరిగాఁ బై పంపని పద్యమునందలి యెత్తుగడవలెనే యున్నది.

"ఏనెట నీవెట సుతుఁడెట
యే నెన్నఁడు దొల్లి చూచి యెఱుఁగను నిన్నున్
మావిను లసత్యవచనలు
నా నిట్టు లసత్యభాషణంబుచితంబే" (ఆది. ౫- 99)

నన్నయ కందములలో ద్వితీయ చతుర్థ పాదములం దొక్కొక్క యెడ జగణము వాడుచు నపూర్వమైన యొయ్యారము నొలికించు చుండును. ఇట్టి వాని కుదాహరణము లాయన రచనలో లెక్కకు మిక్కిలిగాఁ గనవచ్చును.

"కరుణా విరతులు ధర్మ
స్వరూపు లింతకు మదీయ జనకులు సనుదెం
తురు వారు వచ్చి నీ కి
చ్చిరేని పాణిగ్రహణముచేయుము నన్నున్" (ఆది. ౪-55)

మృదంగ వాద్యమునకు ముక్తాయింపువలె నింపు గూర్చు నీ పద్ధతి నాయన పంపని నుండియే గ్రహించి యుండవచ్చును. పంపఁడును నొయ్యారమునకును, భావస్ఫూర్తికిని, ఒక విషయమునుండి విషయాంతరమునకు మరలవలసి వచ్చినప్పుడును నై విధమున జగణ ప్రయోగము చేయుచుండును.

"భరత కుల గగన దినకర
వరాతి కుళ కమళ హిమకరం శికుతేజో
విరచనెయుం కాంతియు మా
వరిసిరె గర్పోదయాద్రి యిందుదయి సిరం" (ప్రథ. 145)

కారకము నందుఁగూడ నన్నయ పంపని ననుసరించిన చోట్లు కొన్ని కలవు :

"నారదన పేళ్ద" (నారదుని చెప్పిన) షష్ఠా. 21
"తన్ను సుడిద" (తనచెప్పిన) 12-190. వచ.
"నరకాంతకనం నుడిదం నరేంద్ర నా నరసుగియ్యే." 12-129
"నరకాంతకుని నరేంద్రుఁడు పలికెను"

కర్తృపద ప్రథమకు షష్ఠి వాడుటయు, వచ్యర్థాముఖ్యకర్మమునకు ద్వితీయ వాడుటయు నన్నయలోఁగూడఁ గానిపించుచుండును.

"నీ యెఱుంగని నృప ధర్మవుల్ గలవె" (ఆది. ౫-54)
"అని తన్ను నిందించి పలికిన" (ఆది. ౫-55).

పదప్రయోగ విషయమునఁ బంపనికిని నన్నయకును గల సాదృశ్యము లిది వఱకుఁ గొన్ని సూచింపఁబడినవి. ఈ క్రిందివి మఱికొన్ని యుదాహరణములు :

"కాశ్యపులు, మాగధులు, సాల్వరు, అను సమూహార్థములును నన్నయ వలెనే పంపనిలోను మాటిమాటికిఁ గనిపించును. భట్టారక శబ్దము నన్నయకు వలెనే పంపనికిఁ బ్రియము." (అలంపుర సూచిక. పుట. 74)

భీముని పరాక్రమము చూచి సహింపఁ జాలక దుర్యోధనుఁడు శకుని దుశ్శాసనాదులతో విచారించి :

"ఉపాంశు వధచేసి మధ్యము మదోద్ధతుం జంపి ని
స్సపత్నముగ ధర్మనందను సశక్తు బంధించి యే
నపాండవముగా సముద్రవలయాఖిల క్షోణి మ
త్కృపాణ పటుశక్తి నత్యధికకీర్తినై యేలెదన్" (ఆది. పంచ. 168)

అని నిశ్చయించినట్లు నన్నయ వ్రాసియుండెను. ఉపాంశువధయను సమాసము వ్యాస భారతమునలేదు. పంపభారతములో నున్నది :

నన్నయ పంపని వలెనే నందనశబ్దము నుద్యానపరముగా వాడుచుండును :

"నలదమయంతు లిద్దరు;... విలసన్నవనందనంబులన్" (అర. ౨-24)

"అష్ట శోభనంబు చేయించి (ఆది. ౭-281) అనుమాట పంప భారతములోఁగూడఁ గలదు.

"నడనడ నడుంగి" (ప్రథ. 95 వచన)

"వాలుపయి నడచు నట్లబ్బాలిక నడునడ నడుంకి" (ఆది. ౨-155)

ఈ విధముగా నన్నయ ప్రధానముగా వ్యాసభారతమునందలి కథనే యనుసరించినను ఎడనెడఁ దనకుఁ బూర్వముండిన సంస్కృత కర్ణాట కవుల కావ్యముల నుండికూడఁ గొన్ని భావములు గ్రహించియు, ( గొన్నిచోట్ల సందర్భానుగుణముగా నూత్నకల్పనలు కావించియు, ననుచితములని తోఁచిన పద్యములు పరిహరించియుఁ, గొన్ని వర్ణనలు పెంచియుఁ గొన్ని తగ్గించియు నాంధ్రభారతమును సర్వాంగ సుందరముగా వెలయించెను. అందుచేతనే అనువాదమను పేరున్నను అది స్వతంత్రగ్రంథము వలెనే శోభిల్లుచు నన్నయ ప్రతిభావిశేషమును వేయి విధముల వెల్లడి చేయు చున్నది.

# 9. నన్నయ అవతారిక

పూర్వ లాక్షణికు లాశీర్నమస్క్రియా వస్తు నిర్దేశో వాపి తన్ముఖ మ్మని కావ్యారంభమున నాశీర్వాదము కాని నమస్కారము కాని వస్తు నిర్దేశము కాని యుండవలెనని శాసించి యుండిరి. సంస్కృత కావ్యములలోఁ బెక్కింట నీ మూఁడింటిలో నేదో యొక ప్రక్రియ కానవచ్చుచునే యుండును. కొందఱు కవులు పై యాశీరాదులలో నొక దానిని సూచించుటతో మాత్ర మూరకుండక కావ్యరచనా ప్రేరకములైన సందర్భములను, దద్రచనమునఁ దమకుఁ గల యర్హతానర్హతలను గూడఁ గావ్యా రంభములం దించుక సూచించు చుందురు. కాళిదాసుని రఘువంశ మహాకావ్యమునఁ గల యారంభ శ్లోకము లిందు కుదాహరణము. ఈ సంస్కృత మహాకవుల నొజ్జబంతులుగాఁ గైకొని నన్నయయు భారతేతిహాసము నాంధ్రీకరింపఁ బూని తదారంభమున నొక యవతారిక రచించినాఁడు. నన్నయను గుఱించి కాని, యాతఁడు భారతమును రచింపఁ బూనిన పరిస్థితులను గుఱించి కాని యతిక్కించి తైన నెఱుంగుట కీ యవతారికయే ప్రధానమైన యాధారము.

నన్నయకుఁ బూర్వ మాంధ్రమునఁ గవిత్వ మున్నను ఆతని కాదర్శముకాఁ దగిన కావ్య మేదియు లేక యుండెను. అందుచే నాతనికి సంస్కృత కావ్య నాటకాదులును బ్రతివేశ దేశమునం దంతకు ముందే రచింపఁబడిన కన్నడ కావ్యములును గొంతవఱకు మేలుబంతు లయ్యెను. సంస్కృత నాటకముల యారంభము లందు నాందీ ప్రస్తావనలను ప్రక్రియలు కానవచ్చును. అందు నాంది పూర్వ రంగము నందలి భాగము. ఇది యాశీర్వాదము తోడనో, నమస్కారము తోడనో కూడి యుండి శబ్దము చేతనో యర్థము చేతనో కావ్య వస్తువును సూచించుచుఁ జంద్ర నామాంకితమై యుండవలయు నను నియమ మున్నది. అందలి పదముల సంఖ్యను గూర్చి కూడ లాక్షణికులు కొంత నియమము నేర్పఱిచిరి. కాని సంస్కృత నాటకము లందే యది పెక్కు చోట్లఁ బాటింపఁబడి యుండలేదు. నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి నటీనట విదూషకులు పారిపార్శ్వకులలో నొక్కరితోఁ జిత్రమైన సంభాషణ కావించును. దీనికిఁ బ్రస్తావన యని పేరు. ఇందుఁ గవి గోత్రనామాది కథనము, ప్రరోచన మనఁబడు సున్ముఖీకరణము, ఋతువర్ణనము, కావ్యార్థ సూచనము, పాత్ర ప్రవేశ సూచనము

అనఁబడు నైదంగము లుండును. ఈ ప్రస్తావన ప్రవర్తింపఁ జేసి సూత్ర ధారాదులు నిష్క్రమించిన పిమ్మట నాటక మారంభింపఁ బడును.

భారతారంభమున నన్నయ రచించిన యవతారిక యొక విధముగా సంస్కృత నాటకముల మొదల నుండు నాందీ ప్రస్తావనలను బోలియున్నది. ఇందలి యారంభ మంగళ శ్లోకము సరిగా నందలి నాందీ శ్లోకమును దలపించుచున్నది. పురుషోత్త మాంబుజభవ శ్రీకంధరులు మీకు శ్రేయోదాయకు లగుదురు గాక యను నాశీర్వాద మిం దున్నది. దీనిని గావించిన వాఁడు భారతాంధ్రీకరణ సూత్ర ధారుఁడగు రాజరాజ నరేంద్రుఁడు. ఇందుఁ గావ్యార్థ సూచనాదులైన యితర నాందీ లక్షణము లేవియు లేవుగాని ఋషితుల్యుఁడైన నన్నయ నోట నాంధ్ర వాఙ్మయ ప్రపంచమునకుఁ ద్రిమూర్తు లనఁదగు ముప్పురు కవి పుంగవు లీ భారతాంధ్రీకరణమును బూర్తి చేయుదు రను సూచన యప్రయత్నముగా వెలువడి యుండెనని చెప్పుదురు. నన్నయ శబ్దము నారాయణభట్ట భవ మనుటకు వీలుండుటయుఁ, దిక్కన యెఱ్ఱాప్రెగడలకుఁ గవిబ్రహ్మ యనియు, శంభుదాసుఁ డనియు బిరుదము లుండుటయు, నీ యూహ కవకాశ మొసంగు చున్నది. ప్రకృతి స్వరూపిణులగు శ్రీవాణీ గిరిజలను వక్షోముఖాంగము లందు ధరించి పురుషోత్త మాంబుజభవ శ్రీకంధరులు స్త్రీ పుంస యోగోద్భవమైన లోకముల స్థితి నావహించునట్లు త్రిమూర్తి స్వరూపులగు నారాయణ (నన్నయ) కవిబ్రహ్మ శంభుదాసు లాంధ్ర భారతమను ప్రపంచము యొక్క స్థితిని నిర్వహింతు రను భావము నారంభ మంగళ శ్లోకము నుండి తీయవచ్చును. నన్నయ యిందు సాధారణముగా లోకమున వాడుకలో నున్న బ్రహ్మ విష్ణు మహేశ్వరులను క్రమము చెప్పక పురుషోత్త మాంబుజభవ శ్రీకంధరు లను క్రమమును సూచించెను. దీనికి నన్నయ నారాయణ శబ్దములకుఁ గల సన్నిహిత సంబంధమే కారణమై యుండవచ్చును. తొలుత భారతాంధ్రీకరణ మను సృష్టి కారంభించిన వాఁడు నన్నయ యగుటచే నాతని యందు "మహి మున్ వాగనుశాసనుం" దను పద్యమున భట్టుమూర్తి వలె బ్రహ్మత్వమును గూడ నారోపింప వచ్చును గాని యప్పుడు తిక్కన యందు విష్ణుత్వ కల్పనమునకుఁ గొంత దూరాన్వేయమైన పద్ధతి నవలంబింప వలసి వచ్చును. అందుచేతనే నన్నయ నోట లోక వ్యవహారమున కించుక విరుద్ధమే యైనను బురుషోత్త మాంబుజభవ శ్రీకంధరులను క్రమమే వెల్వడి యుండెను.

కాలమును బట్టి నన్నయ మొదటి వాఁడు. తిక్కన ద్వితీయుఁడు. ఎఱ్ఱన తృతీయుఁడు. పై సమాసము నందలి వరుస కూడ దీని కనుగుణము గానే యున్నది. కవిత్రయమువారు నివసించిన కాలమును బట్టియు, వారు భారతము నాంధ్రీకరించిన కాలమును బట్టియు నీ క్రమ ముచితముగానే యున్నది కాని భారత గ్రంథ భాగముల యానుపూర్విని బట్టి చూచినచో నది యించుక విరుద్ధ ముగాఁ గానిపించును. ఏల యన నాది సభా పర్వములును నారణ్య పర్వ పూర్వ భాగమును నైన పిమ్మట ద్వితీయుఁడైన తిక్కన రచించిన భాగము కాక తృతీయుఁడైన యెఱ్ఱన రచించిన యారణ్య పర్వ శేష మున్నది. ఈ గ్రంథ భాగ క్రమమును బట్టి చూచినచో ముందు నన్నయను, దరువాత నెఱ్ఱనను, బిమ్మటఁ దిక్కనను జెప్ప వలసి యుండును. ఈ లోపమును బరిహరించుటకే మంగళ శ్లోకమునకు వెంటనే వ్రాయఁ బడిన వచనమున నన్నయ పై శ్లోకము నందలి క్రమమును విడిచి "అని సకల భువన రక్షణ ప్రభువులై యాద్యులైన హరిహర హిరణ్యగర్భ పద్మోమా వాణీ పతుల స్తుతియించి" అను చోట హరిహర హిరణ్యగర్భులను క్రమమును జెప్పి నాఁడనియు, లేనిచో నాతఁడు వెనువెంటనే యా త్రిమూర్తుల క్రమమును మార్చి చెప్పవలసిన యక్కఱ లేదనియు, శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యుల వారొక యుపన్యాసమున వక్కాణించి యున్నారు. కాల రచనా క్రమములను బట్టి చూచినచో మొదటిదియు, గ్రంథభాగ క్రమమును బట్టి చూచినచో రెండవదియు సమంజసములుగా నుండును. అందుచే రెండు విధములుగాఁ జెప్పి నన్నయ క్రమవైరుధ్యమును బరిహరించుటకు యత్నించి నాఁడు.

పై శ్లోకమున నన్నయ యయత్నముగ నైన భారతాంధ్రీకరణమును మువ్వురు కవులు పూర్తి చేయుదు రని సూచించుట యథార్థమా లేక యది విమర్శకుల బుద్ధి చాతుర్యమా యను సందేహ ముదయింప వచ్చును. కాని పై శ్లోకము నందలి త్రిమూర్తుల క్రమమును, దరువాతి వచనము నందలి క్రమమును బై యూహపఁ దా వీయక పోవుట లేదు. అదియుఁ గాక మహాకవియు నవిరళ జప హోమ తత్పరుఁడును ఋషికల్పుఁడు నగు నన్నయ నోట నట్టి సూచన వచ్చుటయు నసహజము కానేరదు.

ఈ కల్పన యెంత చమత్కారముగా నున్నట్లు తోఁచినను, నన్నయకు ఋషిత్వమును అలౌకిక ప్రజ్ఞలను అరోపించుట కంటె నాతఁడు తన కంటెఁ బూర్వులైన మహాకవుల యడుగు జాడలలో నడచి యందుఁ గొంత మెలకువ

ప్రదర్శించెనని యూహించుట యుక్తముగా నుండును. భారతమునఁ బెక్కుచోట్ల శ్రీకృష్ణుని మహత్త్వ ముగ్గడింపఁ బడినది. మహాభారత పారిజాతమునకుఁ కృష్ణార్జునోత్తమ నానాగుణ కీర్తనార్థము ఫలమని నన్నయ చెప్పియున్నాఁడు. (ఆది. ౧-౬౫) భారత సృజన సందర్భమున వ్యాసుని విమల విజ్ఞాన మయమైన వాగ్దర్పణమున వెలుంగు చుండిన విషయములలోఁ జతుర్ముఖ ప్రముఖ నిఖిల సురమునిగణ పూజితుఁడైన శ్రీకృష్ణుని మాహాత్మ్యము కూడ నొక్కటి (ఆది. ౧-30). అందుచే భారతారంభ శ్లోకము నందలి పురుషోత్తమ శబ్దముచే శ్రీకృష్ణ మహత్త్వము సూచితమగు చున్నదని చెప్పవచ్చును. నన్నయ తక్కిన యిరువురు మూర్తులను గూడఁ బేర్కొన్నను అంబుజభవ శ్రీకంధరుల వ్యాపారము లగు సృష్టి సంహార కార్యములను బ్రశంసింపక పురుషోత్తముని వ్యాపారమైన లోకస్థితి ప్రవర్తనమునే ముఖ్యముగా గణించుటచే నారాయణ సంకీర్తనమునే ప్రధానముగ నెంచెనని సంభావింపఁ దగియున్నది. సంస్కృత భారతము "నారాయణం నమస్కృత్య" అని నారాయణ స్తోత్రము తోడనేయారంభించు చున్నది. అచ్చట నారాయణ నర సరస్వతులు ముగ్గురును స్తుతింపఁ బడినారు. నన్నయ కూడ దేవతాత్రయ స్తవము చేయఁదలచినవాఁడై యొక క్రమము కల్పించుకొని త్రిమూర్తులను వారి భార్యలను స్తుతించి అనన్వితత్వము నం దన్వితత్వమును సాధించిన వాఁ డాయెను. మఱియు లోకస్థితి స్త్రీ పుంస యోగోద్భవ మైనదని తెలుపు "స్త్రీపుంస యోగోద్భవాం" అను విశేషణము వలన గావ్య ప్రపంచము వాగర్థ సంయోగముచేఁ బుట్టి పెరుఁగు చున్నదని కవి వ్యంగ్య రీతిని సూచించి నట్లు తోఁచు చున్నది. ఈ కల్పనకుఁ గాళిదాసుని "వాగర్థా వివ సంపృక్తౌ" ఇత్యాదిగాఁ గల శ్లోకము ప్రేరకముగా నున్నది.

కావ్యాదియైన శ్లోకమునో పద్యమునో శ్రీకారముతో నారంభించుట మంగళ సూచకము. ఈ యాదిమ పద్యమున శబ్దార్థములం దెచ్చటను నమంగళ స్ఫూర్తి కలుగకుండఁ జూచుట మంచిది. అట్టి యెడ నన్నయశివునకు మాంగళ్య సూచకములైన నామము లనేకము లుండఁగా విషము కంఠమునఁ గల వాఁడను శ్రీకంధర శబ్దము నేల వాడవలయునను శంక కలుగవచ్చును. విషము భయంకరమును విధ్వంస కరమునైన వస్తువే యైనను శివుఁడు శ్రీకంధరుఁ డైన పరిస్థితి మాత్రము జగద్ధిత ప్రయోజనక మైనట్టిదే. అమృత మథన సమయమున హాలాహల ముదయించి సర్వజగ దుపద్రవము కలిగింపఁ బోఁగా రుద్రుఁడు దానిని

మ్రింగి కంఠమున నిల్పి దివిజ మనుజ లోకముల కెట్టి యిక్కట్టును గలుగ కుండఁ గాపాడెను. దీనిని బట్టి శివుని శ్రీకంధరత్వ మతని లోకరక్షణ పరాయణతకు ఫలితమైనదే కాని యమంగళ స్ఫోరకమైనది కాదు. అందుచేతనే నన్నయ నిశ్శంకముగా మొదటి శ్లోకమున నా శబ్దమును వాడి యుండును.

తన కుల బ్రాహ్మణు నిత్యాది పద్యము నన్నయ కుల గోత్ర సూత్రాదికమును, విద్యా విజ్ఞాన విశేషములను, ఆచార స్వభావములను, సూచించుచున్నది. నన్నయ విషయమును గొంచెముగనో గొప్పగనో మనకుఁ దెల్పు నాధార మీ పద్య మొక్కటే. ఇందుఁ గానవచ్చు విశేషణములను పరికరములనే యొండొంటితోఁ గూర్చి మనము నన్నయ జీవిత చరిత్ర యను సౌధమును నిర్మించుకొన వలయును. అతఁడు రాజరాజు కుల బ్రాహ్మణుఁడు. అతని కను రక్తుఁడు. నిరంతర జప హోమ పరాయణుఁడు. విపుల శబ్ద శాసనుఁడు. వేద సంహితల నభ్యసించినవాఁడు. బ్రహ్మాండ పురాణము మున్నుగా గల వివిధ పురాణములఁ బఠించి యందలి విజ్ఞానమును జూఱగొన్న వాఁడు. పాత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. ముద్గల గోత్రుఁడు. సజ్జన స్తోత్రపాత్రమును స్వచ్ఛమునైన చరిత్ర సంపద కలవాఁడు. లోకజ్ఞుఁడు. సంస్కృతాంధ్ర భాషలు రెండింటఁ గావ్యరచన చేయఁ గలవాఁడు. సత్ప్రతిభాభియోగ్యుఁడు. నిత్య సత్య వచనుఁడు, సుజనుఁడు. బుద్ధి బృహస్పతి. ఇందుఁ గులబ్రాహ్మణుఁడు, అనురక్తుఁడు అనునవి నన్నయకును రాజరాజునకును గల సంబంధమును దెలుపుచున్నవి. ఆపస్తంబసూత్రుఁడు, ముద్గల గోత్రుఁడు అనునవి నన్నయ సూత్రమును గోత్రమును సూచించు నట్టివి. సద్వినుతావదాత చరితుఁడు, పాత్రుఁడు, నిత్య సత్య వచనుఁడు, సుజనుఁడు అను విశేషణము లాతని స్వభావమును బ్రవృత్తిని సూచించు చున్నవి. సంహితా భ్యాసుఁ డనునది యతని వైదిక విద్యా నిష్ణాతత్వమునకును, అవిరళ జప హోమ తత్పరుఁ డనునది యతని నైష్ఠికతకును సూచకములుగా నున్నవి.

పై విశేషణములను బట్టి చూడ నన్నయ పరస్పర విరుద్ధ గుణ స్వభావము లొక్కచోఁ గలిసిన సమగ్రమూర్తి వోలెఁ గాననగుచున్నాఁడు. వైదికులకు ఛాందసులను పేరున్నది. బ్రహ్మదేవుని వేదాభ్యాస జడుఁడని కొందఱు కవు లాక్షేపించి యున్నారు. అల్లసాని పెద్దన "బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియు" లని శ్రోత్రియత్వమునకు బుద్ధిజాడ్యమును సహచారి గుణముగాఁ బేర్కొనుట యెల్ల రెఱింగినదే. నన్నయ వైదికుఁ డయ్యును బుద్ధి జాడ్యముతోఁ గూడిన వాఁడు కాఁడు. లోకజ్ఞుఁడు. మత్యమరాధిపాచార్యుఁడు.

కవితా కళా పారగులైనవారు కర్మఠులై యుండుట యరుదు. తిరుపతి వేంకట కవులు శ్రవణానందములోఁ గవిత్వమును సంధ్యావందనమునకు బావగారని వర్ణించి యున్నారు. కాని యీ విషయమున కపవాదములైనవారు కొందఱు లేకపోలేదు. నన్నయ తిక్కన లందుఁ బ్రథమ గణ్యులు. నన్నయ యవిరళ జపహోమ తత్పరుఁడు; తిక్కన వైదిక మార్గ నిష్ఠమగు వర్తనమును నిర్వహించి సోమయాజి యైనవాఁడు. నన్నయ కూడఁ దణుకునకుఁ దూర్పున నొక్కచో యజ్ఞ మొనరించె నని తెల్పు పద్య మొక్క టున్నది కాని యది యెంతవఱకు యథార్థమో తెలియరాదు. లోకమునఁ గవితా కర్మిష్ఠతలకును శ్రోత్రియతా సుధీ సంపదలకును వైరుధ్యము చెప్పఁబడుచున్నను గవి కన్నియు నుండవలె నని లాక్షణికులు చెప్పుచున్నారు. అప్పకవి యప్పకవీయ ప్రథమా శ్వాసమున సత్కవి లక్షణములను జెప్పుచు

ఇమ్మహిని మునులచే వెల
పెమ్మను గావ్యములు నానృషిః కురుతే కా
వ్యమ్మను వచనార్థంబే
సమ్మతిఁ గలివేళ సుకవిజనులే మౌనుల్. 43

ధరణీసురుఁడు ప్రశాంతుఁడు
గురుభక్తుఁడు శుచియుఁ గల్పకుఁడు పూర్వ కవీ
శ్వర వాక్ప్రయోగ దక్షుఁడు
గరుణామతి యెవ్వఁ డతఁడు కవియనఁ బరఁగున్. 44

శ్రుతి శాస్త్రాంగ పురాణ
ప్రతతియు నితిహాస కావ్య భరతాగమముల్
స్మృతి సంగీత రతికళా
గతుల నలంకృతుల నెఱుఁగఁగాఁ దగుఁ గవికిన్. 45

అని చెప్పియున్నాఁడు. ఈతఁడు చెప్పిన లక్షణము లన్నిటికిఁ గుదురైన కవులు నన్నయ వంటి వా రే యొక్క రిద్దరో తప్ప నెందఱో యుండరు.

"కులవిప్రః పురోహితః" అను వాచస్పత్యము నందలి నిర్వచనము నూతఁగాఁ గొని, విప్రబ్రాహ్మణ శబ్దములురెండును బర్యాయ పదము లగుటచేఁ గులబ్రాహ్మణుఁ డనఁగాఁ బురోహితుఁ డవియు, నందుచే నన్నయ రాజరాజునకుఁ బురోహితుఁడుగా నుండె ననియుఁ,[1] బురోహితులు

---

1. రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక - పుట 91.

సాధారణముగ వైదిక బ్రాహ్మణులే యగుటచే నన్నయ కూడ వైదిక బ్రాహ్మణ శాఖకే చెంది యుండు ననియుఁ జెప్పువారు పలువు రున్నారు. కాని యీ యభిప్రాయము భ్రాంతి మూలకము. కులబ్రాహ్మణుఁ డనఁగాఁ బురోహితుఁడు కాఁ డనుటకుఁ గొన్ని నిదర్శనము లున్నవి. చాళుక్య రాజ్యాంగమున మంత్రి పురోహిత సేనాపతి యువరాజులు పంచ ప్రధాను లనఁ బడుచుండిరి. ఈ పంచ ప్రధానులలో రెండవవాఁడు పురోహితుఁడు. కావున పురోహితత్వము కూడ నప్పుడు న్యూనతావహ మైనది కాదు. అవతారిక యందలి 8 వ వచనమున రాజరాజు "మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంత సామంత విలాసినీ పరివృతుండై" యుండె నని వర్ణింపఁబడి యున్నది. వెనువెంటనే నన్నయను వర్ణించు సీస పద్యమునఁ గులబ్రాహ్మణ శబ్దము వాడఁ బడినది. ఈ రెండు శబ్దములు నొకే స్థలమున వేఱువేఱుగాఁ బ్రయోగింపఁ బడియుండుటచే నీని యర్థమునఁ గూడఁ బార్థక్య మున్నదని యూహించుట కవకాశ మున్నది. "కుల బ్రాహ్మణ పదమునకుఁ బురోహిత పదము పర్యాయముగాఁ జాళుక్య శాసనములలోఁ గాని, కర్ణాట రాజ శాసనములలోఁ గాని యెచ్చటను వ్యవహరింపఁ బడి యుండ లేదనియుఁ, బంచ ప్రధానులను జెప్పుచోటఁ జాళుక్య శాసనములలోఁ బురోహిత శబ్దమే వినవచ్చును గాని కులబ్రాహ్మణ శబ్దము వినరాదనియు" సాహిత్య పత్రికలో కీ. శే. బుర్రా శేషగిరిరావు పంతులు గారు వ్రాసి యున్నారు. అది గాక నన్నయయే వ్రాసిన నందమపూఁడి శాసనములోను దత్పూర్వ శాసనము లందును జాళుక్యుల కు మూలపురుషుఁడైన విజయాదిత్యుఁడు జిగీషచే దక్షిణాపథమున కరుదెంచి త్రిలోచన పల్లవునితోడి యుద్ధమున దివంగతుఁ డైన పిమ్మట నాతని మహాదేవి, యంతర్వత్ని యైనది. పురోహితునితోఁ గూడ (పురోహితేన సార్థం) ముడివేము నామకమైన యగ్రహారమున కరిగి తద్వాస్తవ్యుఁ డైన విష్ణుభట్ట సోమయాజిచే దుహితృనిర్విశేషముగా నభిరక్షింపఁబడి విష్ణువర్ధనునిఁ బ్రసవించె నని చెప్పఁ బడి యున్నది. ఈ సందర్భమునఁ గులబ్రాహ్మణేన సహ యనక నన్నయాదులు పురోహితేన సార్థమని వ్రాయుట గమనింపఁ దగి యున్నది. దీనిని బట్టి నన్నయ యుద్దేశమునఁ బురోహిత కుల బ్రాహ్మణ పదములు పర్యాయ రూపములు కావనినట్లు తోఁచును. కాని కుల బ్రాహ్మణుఁడును బురోహితుఁడును గూడ నా కాలమున నతి గౌరవార్హులైన రాజోద్యోగులే

మనుటలో సందేహములేదు. ఇప్పటి పురోహితులకు సంఘమున నున్న గౌరవ మును బట్టి యప్పటి పురోహితులు కూడ నిట్టివారే యై యుందు రనుకొనుట పొరపాటు.

రాజరాజ నరేంద్రుని తాతయైన రెండవ అమ్మరాజ రాజమహేంద్రుని శాసనమున నొక్కచో " .. ర్మణః పుత్త్రాయ, కౌండిన్య గోత్రాయ,........ ర్మాభిధానాయ మత్కుల బ్రాహ్మణాయ" యను భాగము కానవచ్చు చున్నది. ఈ శాసనము చాలవఱకు శిథిలమై పోయినది కాని యర్థ సందర్భమును బట్టి యెవ్వరో యొక శర్మ కుమారుఁడు, కౌండిన్యగోత్రుఁడు, మఱియొక శర్మ, యా మహారాజునకుఁ గుల బ్రాహ్మణుఁడై యుండినట్లు స్పష్టమగు చున్నది. ఈ శాసనము శిథిలము కాకుండ నుండినచోఁ బంచ ప్రధానులను పేర్కొను చోటఁ బురోహిత శబ్దమును గనఁబఱిచి నన్నయ వర్ణనమును దృఢ పఱిచి యుండు ననియుఁ, బురోహిత కులబ్రాహ్మణ శబ్దముల రెండింటిని జూపిన భారత వచన మీ శాసనము ననుసరించి వ్రాయఁబడి యుండుననియు శ్రీ శేషగిరిరావు పంతులుగారు చెప్పియున్నారు. (పుట 92)

రాజరాజనరేంద్రుని కాలమున నన్నయ శాసనకావ్యకర్తగా నుండె ననుటకు సందమఫూఁడి మండ తామ్ర శాసనములు తార్కాణములు. సాధారణ ముగా శాసన లేఖనాధికారము సంధివిగ్రహులు, రహస్యకులు, మహా మంత్రులు అను వారి కొసంగఁ బడుచుండెను. కుల బ్రాహ్మణులు కూడ వీరితో సమాన ప్రతిపత్తి కలవారై యుందురు. ఇంతవఱకు లభ్యము లైనశాసనములలోఁ బురోహితుఁ డను నుద్యోగి వ్రాసిన శాసన మొక్కటి యుఁ గానరాదు. సంధి విగ్రహు లొక్కొక్కప్పుడు తమకు సన్నిహితు లైన వారిచే శాసనములు వ్రాయించు నాచార ముండెను. క్రీ. శ. 1084 వ సంవత్సరమున రాజరాజు జ్ఞాతియగు పాశ్చాత్య త్రిభువనమల్లదేవుని యాజ్ఞా పత్రము నాతని సంధివిగ్రహి యల్లుఁడు వ్రాసినట్లు తెలియు చున్నది. కాని పురోహిత రచితమైన శాసన మెచ్చటను గానవచ్చుటలేదు. ఇదికూడఁ బురోహిత కులబ్రాహ్మణు లను నుద్యోగులు భిన్నభిన్నధర్మ నిర్వాహకులుగా నుండిరని యూహించుటకుఁ దోడ్పడు చున్నది.

కుల బ్రాహ్మణులనఁగా క్షత్త్రోపేత బ్రాహ్మణు లనియు, వారు రాజా స్థానములందుఁ బలుకుబడి కల్గి తమవారి కుపాధులు కల్పించిరనుట కనేక

దృష్టాంతము లున్నవనియు శ్రీ శేషగిరిరావు పంతులుగారు వ్రాసియున్నారు. (పుట 92). కులపుత్త్రికులవలెఁ గుల బ్రాహ్మణులుకూడ రాజాంతఃపురములలోఁ బెంపఁబడిన బ్రాహ్మణులై యుందురని వా రూహించి యుండిరి. రాజరాజ నరేంద్రుఁ డను గ్రంథమునందలి సప్తమ ప్రకరణమున (పుట 141) శ్రీభావరాజు వేంకట కృష్ణారావు పంతులుగారు "రాజచాళుక్య కులమున నరపాలురకు కుల బ్రాహ్మణు లుండుట చాళుక్య వంశాచారము. ఇమ్మడి అమ్మరాజ విజయాదిత్యునికి కాడిపట్టు వాస్తవ్యుఁడును, ఆపస్తంబ సూత్రుఁడును, కౌండిన్య గోత్రుఁడు నగు కులబ్రాహ్మణుఁ డొక డుండెను. వంశ మవిచ్ఛిన్నముగ వర్ధిల్లుటకు క్షత్త్రధర్మ మొకటి భారతకాలము నాఁటినుండి ఆచరణలో నుండెను. అన్వయాభివృద్ధికి భూసురోత్తములు రాజపుత్త్రికలందు ధర్మవిధి సంతతి నిలుపుచుండిరి. అట్టి భూసురోత్తములు కుల బ్రాహ్మణులు ..కుల బ్రాహ్మణుల నియమించి వారికి ఆడుబిడ్డల నిచ్చి వివాహము చేయు నాచారము కాకతీయ యుగాంతము వఱకు ఆంధ్రదేశమున వర్ధిల్లెను....కుల బ్రాహ్మణులు క్షత్త్రియ పత్నుల తోపాటు స్వకులాంగనలను గూడఁ బెండ్లి యాడిరి. కుల బ్రాహ్మణులు సాధారణముగా నున్నత రాజకీయపదవులం దుండిరి. అట్టి కుల బ్రాహ్మణులు వైదికులు కారు. లోకజ్ఞులు. కవులు. అప్పుడప్పుడు కార్య ఖడ్గముల నెఱపిన దక్షులు" అని కుల బ్రాహ్మణులను గూర్చి వివరించి యున్నారు. పరశురాముఁడు సర్వక్షత్త్రిసంహారము కావించిన పిమ్మటను, చిత్రాంగద విచిత్రవీర్యుల మరణానంతరమును, భారతమున బ్రాహ్మణులు క్షత్త్రియ కాంతలందు సంతానముఁ బడసిన వృత్తాంతములు చెప్పఁబడిన మాట సత్యమే. అట్టిది సాధారణముగా సంతాన రాహిత్యముచే వంశవిచ్ఛేదము చేకూరు నుపద్రవము కల్గినప్పుడే జరుగు చుండెను. చాళుక్య వంశమున నిట్టి యుపద్రవ మెప్పుడైన సంభవించి నట్లు కావి, కుల బ్రాహ్మణులు దయ దలఁచి యా వంశము నవిచ్ఛిన్న మొనరించి నట్లు కావి తెల్పు సందర్భ మొక్కటియుఁ గానరాదు. కావునఁ బై చారిత్రకులు రాజులు కుల బ్రాహ్మణుల నుంచుకొనుటకుఁ జెప్పిన ప్రయోజనము సందేహాస్పదమై యున్నది. వారు రాజులకడ నుద్యోగులుగా నుండి శాసన లేఖనాద్యన్య కార్యముల నొనరించు చుండి రనుటలో నాక్షేపములేదు.

భారత సభాపర్వమున నారదుఁడు ధర్మజుని కడ కరుదెంచి యాతని రాజ్యపరిపాలన పరిస్థితులనుగూర్చి యనేక ప్రశ్నలు వేసియుండెను. అందులో

కచ్చిదాత్మ సమాబుద్ధ్యా శుచయో జీవిత క్షమాః
కులీనాశ్చానురక్తాశ్చ కృతా స్తే వీర మంత్రిణః.(2-5-16)

అనున దొకటి. "కులీనాశ్చానురక్తాశ్చ" అను పదములకు తన కులబ్రాహ్మణు ననురక్తు నను పదములు సరియైన యనువాదములని శ్రీ శేషగిరిరావు పంతులుగా రభిప్రాయపడి యుండిరి. "దీనిఁబట్టి నన్నయను గూర్చిన కుల బ్రాహ్మణ ప్రయోగము వీరమంత్రికిఁ దగియున్న దనియుఁ, బురోహితుని గూర్చినది కాదనియు నూహింప వలె" నని వారు సిద్ధాంతీకరించియుండిరి. పై శ్లోకము నందలి కులీన శబ్దమునకును గులబ్రాహ్మణ శబ్దమునకును సంబంధ మున్నట్లు గోచరింపదు. పైఁగా నందలి వీర శబ్దము ధర్మజానికి సంబోధనము. పంతులు గారు దానిని మంత్రికి విశేషణముగాఁజేసి వీరమంత్రి యని వ్రాసి యుండిరి. అందుచే నా శ్లోకమునకును నన్నయను వర్ణించు పద్యమునందలి పదములకును ముడిపెట్టుట యంత సమంజసము కాదు. అనురక్త పద మున్నది గదా యని పంతులుగారు కులబ్రాహ్మణ శబ్దమును గులీన శబ్దమునకుఁ బర్యాయముగా గ్రహించియుందురు. కులీనత్వానురక్తత్వము లొక్క కుల బ్రాహ్మణునికే కాక రాజోద్యోగు లందఱికిని నుండవలసిన లక్షణములు. నారదుఁడు సేనాపతినిగూర్చి యడుగు సందర్భమునఁ గూడ "కులీన శ్చానురక్త శ్చ దక్ష స్సేనాపతి స్తవ" యనుట యిందుకు దృష్టాంతము. సాధారణముగా నారోజులలో విప్రులే మంత్రిత్వాదులగు నున్నతోద్యోగము లందు నియమింపఁబడు చుండిరి. ఆముక్తమాల్యదలో రాయలు చెప్పిన రాజనీతిని బఠించినచో నిది వ్యక్త మగును. పై సభా పర్వము నందలి శ్లోకము ననువదించుచు నన్నయ

"అనఘుల శాస్త్ర విధిజ్ఞుల
ననురక్తులఁ బితృపితామహ క్రమమున వ
చ్చిన విప్రుల మంత్రులఁగా
నొనరించితె కార్య సంప్రయోగము పొంపెన్" (౧-26)

అని వ్రాసి యుండెను. ఇందు ననురక్తపదము తప్ప మిగిలిన వన్నియు నన్నయ కల్పించినవే. "పితృపైతామహాన్" అని మఱియొక్కయెడ నెచటనో యున్న విశేషణమును దీసికొని వచ్చి యాతఁ డిక్కడ నిమిడించెను. దీనిని బట్టి నన్నయ యుద్దేశమున మంత్రులకు ననురక్తతతో పాటు అనఘత్వము, శాస్త్రవిధిజ్ఞత్వము, పితృపైతామహక్రమమున రాక యను లక్షణములు కూడ

నుండవలె నన్నట్లు వ్యక్తమగుచున్నది. కులబ్రాహ్మణుఁ డనఁగాఁ బితృపితామహక్రమమున వచ్చిన విప్రుఁడైన మంత్రి యని యర్థము చెప్పవచ్చును. రాజు తండ్రి తాతలు రాజ్యము పాలించుచుండఁగా మంత్రి తండ్రి తాతలు మంత్రిపదవి నధిష్ఠించి యుండ వలయును. అట్టిమంత్రులు రాజున కితర మంత్రులకంటె సన్నిహితులు ననురక్తులునై కులబ్రాహ్మణు లనఁబడుచుండిరని విశ్వసింప వచ్చును. నన్నయ తండ్రి తాత లెవ్వరో మనకుఁ దెలియదు కావున నీ విషయమును దృష్టాంత పూర్వకముగా నిరూపించుటకు వీలులేకున్నది. ఆంధ్రకవితరంగిణీ కారులు బేతన భీమన భట్టులను నన్నయ తండ్రి తాతలుగా నిర్ధారణ చేసి యున్నారు. ఇది సత్యమే యైనచోఁ బై యభిప్రాయము మఱింత బలవంత మగుచున్నది. ఏలయన బేతన భీమన భట్టులు రాజరాజ విమలాదిత్యుల యాస్థానములందుండి సంధివిగ్రహులై శాసనములను రచించి యుండిరి. (కోరుమిల్లి, రణస్థిపూఁడి).

కుల బ్రాహ్మణుఁ డనఁగాఁ బురోహితుఁడను నర్థము నిరస్త మగుచున్నది కావున దానిని బట్టి నన్నయ వైదికశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడే యనుట కూడ నిరస్తమై పోవుచున్నది. ఆ కాలమునకు బ్రాహ్మణ వర్ణమున నియోగి వైదిక శాఖలు విస్పష్టముగా నేర్పడె నని చెప్పుట కాధారములు లేవు.[1] అందుచే నన్నయ వేద వేదాంగ విదుఁడైన బ్రాహ్మణుఁ డనియే తప్ప నాతని బ్రాహ్మణత్వమును గూర్చిన యితర వివరములను దెలుపుట యశక్యము.

---

1. శ్రీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులు గారు నియోగి వైదిక భేదకాల నిర్ణయ మను వ్యాసమున మంగి యువరాజు చెందలూరి శాసనములో (క్రీ. శ. 673 E. I.VIII-4) "సర్వనైయోగిక వల్లభాన్" అను ప్రయోగ ముండుటచే నప్పటికే నియోగి బ్రాహ్మణ శాఖ యుండి యుండుననియు, నన్నయకు సమకాలికుఁడైన పావులూరి మల్లన వంశీయులలో నెవ్వరును మంత్రి పదవి నిర్వహించినవారు కాకపోయినను గణిత శాస్త్రమున "పావులూరి మల్లనామాత్య ప్రణీతంబైన గణిత శాస్త్రమునం" దని అమాత్య శబ్దము వాడఁబడి యుండుటచే నా యమాత్య శబ్దము నియోగిత్వ సూచక మనియు, నారాయణ భట్ట నన్నయభట్టాది భట్ట శబ్దాను ప్రయోగముతోఁ గూడిన నామములు వైదికత్వ సూచకములని యూహింపఁ దగి యున్నవనియు, నందుచే నా కాలమునాఁటికి నియోగి వైదిక

శాతవాహనుల కాలమున నాంధ్రదేశమున బౌద్ధమతము మూఁడు పూవు లాఱు కాయలుగా విరాజిల్లెను. తరువాత దానితోపాటు జైనవైదిక మతములు కూడ వించించుక తలలెత్త సాగెను. పూర్వ చాళుక్య రాజుల కాలమున వైదిక మతమున కధికమైన ప్రాపు చేకూరెను. కుమారిలభట్టు జైన బౌద్ధ మత సిద్ధాంతములను దీవ్రముగా ఖండించి పూర్వమీమాంసాపద్ధతిని బ్రతిష్ఠాపించెను. వేదాభ్యాసమును, వైదిక కర్మాచరణమును ఆ పద్ధతికి జీవా

భేదము లుండినట్లు చెప్ప వచ్చుననియు వ్రాసి యున్నారు. చెందలూరి శాసనము నందలి నైయోగిక వల్లభులను పద ముద్యోగ సూచకమే కాని కుల సూచకము కాదు. నైయోగిక / వల్లభు లనఁగా నియోగాధికృతు లను నుద్యోగులు. వారు నియోగి బ్రాహ్మణులే యై యుండిరనుట కాధారము లేదు. (This would imply that in the service of the Court there were several classes of Niyogikas each with a superintendent of its own who were somehow involved in the administration of the villages and presumably of the vishayas though it is not possible to state who they were and how they functioned in the provincial and local government. E. ch. P. 280. The temple establishment therefore was modelled on the lines of that of the royal palace and the servants of the temple were divided into 72 classes or niyogas. Page 290. Niyogadhikrita=Superintendent of the Niyogas. page 274). ఇట్లే భట్టామాత్య శబ్దములు కూడ నప్పటి శాఖాభేద వర్ణ సూచకములుగా నుండెనని చెప్పుట కవకాశము లేదు. ఒకే వంశమునకుఁ జెందిన వ్యక్తుల కమాత్య భట్ట శబ్దము లుపపదములుగా వాడఁబడి యున్నవి. నన్నయ సహాధ్యాయుఁడైన నారాయణ భట్టు తండ్రి - అకలంక శంకనామాత్యుఁడనియుఁ దాత కంచె నార్యుఁ డనియు, ముత్తాత కంచెన సోమయాజి యనియు నందంపూఁడి శాసనములోఁ జెప్పఁబడి యున్నది. కంచె నార్యుని శత్రువులు యమునిగా భావించు చుండిరని చెప్పఁబడుటచే (యం మన్యంతే యమ మరి గణాః) నాతఁడు మంత్రిత్వమునో తత్తుల్యమైన మఱియొక పదవినో నిర్వహించె నని చెప్పవచ్చును. అయినను అతఁడు కంచె నామాత్యుఁడని కాక కంచెనార్యుఁ డనియే వర్ణింపఁబడి యున్నాఁడు. నారాయణ భట్టు మంత్రి పదవిని నిర్వహించెనని స్పష్టముగాఁ దెలియు చున్నను (కుపమ్రాదారామ శిలాశాసనము క్రీ. శ. 1055) అతఁడెచ్చటను నారాయణామాత్యుఁ డని పేర్కొనఁబడి యుండలేదు. అతని తండ్రి బుద్ధి బృహస్పతి యని మాత్రము చెప్పఁబడినది. అతఁడు మంత్రి పదవి నిర్వహించి యుండెననుట కాధారములు లేవు. అయినను అతఁడు

తువులు. ఆ మతము నవలంబించి వర్తించెడివారి సమగ్రస్వరూపము మనకు నన్నయలోఁ బ్రత్యక్షమగు చుండును. అతని సంహితాభ్యాసతయు నవిరళ జపహోమ తత్పరత్వము నిందుకుఁ దార్కాణములు.[1]

సంస్కృతమున నష్టాదశ పురాణము లున్నవి. వానిలో బ్రహ్మాండ పురాణ మొకటి. పురాణమునం దుండవలసిన పంచలక్షణము లన్ని పురాణము లందు గోచరించు మాట నిజమే యైనను బ్రహ్మాండపురాణమున నవి మఱింత విపులముగా నుండును. సర్గ ప్రతిసర్గ మన్వంతరముల వృత్తాంతము నెఱుంగుట కది చాలఁ దోడ్పడును. మఱియుఁ బురాణముల పౌర్వాపర్యము నిర్ణయించుట కష్టమేయయ్యుఁ బెద్దలు బ్రహ్మాండపురాణమునకుఁ బ్రాచీనత చెప్పుచుందురు. అందుచేఁ బురాణములలో దాని కొక విశిష్టత యున్నది. నన్నయ "బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుఁడ" నని బ్రహ్మాండమునే పేరు పెట్టి పేర్కొనుట యీ కారణము చేతనే. శ్రీనాథుఁడు కూడఁ గాశీఖండమున "బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ" నిత్యాది పద్యమం" దభ్యర్హిత బ్రహ్మాండాది మహా పురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళావిధానమ" నని యా పురాణ మునే ప్రముఖముగాఁ బేర్కొనుటకుఁ గూడ నిదియే కారణమై యుండును.

---

శంకనామాత్యుఁ డని పేర్కొనఁబడి యున్నాఁడు. అందుచే నమాత్య పదము 'మంత్రి' త్వమునుగాని, నియోగిత్వమును గాని సూచించునదిగాఁ గనఁబడుట లేదు. భట్టశబ్దమునకు A title used with the names of learned Brahmanas, any learned man or philosopher అను నర్థము లున్నవి. (Apte's Dict.) అందుచే నది పాండిత్య సూచకమే కాని శాఖా భేద సూచకము కాదు. గణిత శాస్త్ర ప్రణేత మల్లన నవఖండవాడా గ్రహార గ్రహీతయై రాజరాజ నరేంద్రుని కాలమున నుండిన మల్లన కాద నియు నాతని మనుమఁ డనియుఁ దెలియు చున్నది. తన వంశీయు లెవ్వ రును మంత్రిత్వము నిర్వహింపక పోయినను అతఁ డమాత్య శబ్దమును వాడుకొనుట కతనికిఁ గల లౌకిక కార్య నిర్వహణ ప్రజ్ఞయే కారణమై యుండును. అందుచే నమాత్య భట్ట శబ్దములు ప్రజ్ఞా పాండిత్య సూచక ములే కాని శాఖాభేద సూచకములు కావనియు నా రోజులలో నొకే వంశమునకుఁ జెందిన వ్యక్తులకే ప్రతిభా విశేషములను బట్టి భట్ట శబ్దమో అమాత్య శబ్దమో వాడఁబడు చుండె ననియుఁ దోఁచుచున్నది.

1. నన్నయ శబ్దశాసనత్వము నింకొక ప్రకరణమున వివరించెదను.

కళింగ దేశమందలి భారత ప్రతులలో నొండు రెండు చోట్లఁ బాత్రునను మాటకుఁ భ్రాత్రు (తృ) అను పాఠాంతర ముండిన కారణమున నదియే సరియైన పాఠమై యుండుననియుఁ, దిక్కనను మనుమసిద్ధి మామా యని పిలుచుచుండినట్లే రాజరాజు నన్నయను అన్నా (భ్రాత) యని పిల్చి యట్లే భావించుచుండ వచ్చుననియుఁ, గ్రావడి వత్రుసుడులకు వేయఁబడిన ప్రాసయతిని సాధించుటకు భారతముననే ప్రయోగమున్న దనియుఁ, బై సాహిత్య పత్రికలోనే శేషగిరిరావు పంతులుగారు వ్రాసి యుండిరి. భ్రాతృ శబ్దమునకుఁ దెనుఁగున ద్వితీయైక వచనాంతము "భ్రాతను" అనియే యుండును గాని భ్రాత్రున్ (భ్రాతృన్) అని యుండదు. ఈ రూపము వ్యాకరణ సాధ్యము కాదు. అందుచేఁ బై కళింగ దేశ భారత ప్రతు లందలి పాఠము లేఖక ప్రమాద జనితమైనదే కాని సరియైనది కాదు. ఒకవేళ పాత్రశబ్దమే సరియైన దగుచో నది నాయకత్వమును (leadership) సూచించునని వారే యభిప్రాయపడి యయాతి చరిత్రమునఁ బ్రజలు యదుని వర్ణించు సందర్భమున నందలి పద్యమును దానికి నిదర్శనముగాఁ జూపిరి.[1] నిఘంటువులలోఁ బాత్ర శబ్దమునకు యోగ్యుఁడు, దానగ్రహణార్హుఁడు అను నర్థము లున్నవి. కాని నాయకుఁ డను నర్థము లేదు. ఆ యోగ్యత సందర్భమును బట్టి పలువిధముల వ్యక్తము కావచ్చును. యదుని వర్ణించు సందర్భమున దానికి నాయకత్వ స్ఫూర్తి కలుగుట కవకాశ మున్నది. కాని నన్నయ విషయమున నట్టి యవకాశము లేదు. దాని కిచ్చుట గుణపాండిత్యాభిజాత్య బుద్ధి వైభవములచే సర్వథా యోగ్యుఁ డనునదే యర్థము కాఁదగి యున్నది.

ఈ పద్యమున నన్నయ యుభయ భాషా కావ్యరచనాభిశోభితుఁ డని వర్ణింపఁ బడి యున్నాఁడు. ఉభయ భాష లనఁగా సంస్కృతాంధ్రములు. ఆ రెండింట నన్నయ కపారమైన పాండిత్యము తోపాటు కావ్యరచనా దక్షతయు నున్నట్లీ విశేషణము సూచించు చున్నది. నన్నయ యాంధ్రమున భారతము కాక మఱి యే కృతులైన రచించెనేమో చెప్పుటకు బలమైన యాధారములులేవు. భారత మొక్కటే చాలు నాతని యాంధ్రభాషా కావ్యరచనాభిశోభితత్వమును

---

1. "అవిచారంబని పల్కనోడెదము ధర్మాభిజ్ఞ నీ యగ్రసంభవుఁ డత్యున్నత శక్తి యుక్తుఁడు మహీభార ప్రగల్భుండు భార్గవదౌహిత్రుఁడు పాత్రుఁ డీ యదుఁడు లోక ఖ్యాతుఁడుండంగ" ఆది. 3, 193.

చాటుటకు. సంస్కృతమున నాతఁడు రచించిన కావ్యము లేవియు లభ్యములు కాలేదు కాని భారతాదిని గల మంగళ శ్లోకమును, నందమపూఁడి శాసనము నందలి శ్లోకములును, సంస్కృత భాషయం దాతనికిఁ గల కావ్య రచనా పాటవమును వేనోళ్ల వక్కాణించు చున్నవి.

ఈ విధముగా నీ సీసపద్య మేకైక మయ్యు నిష్ఠాగరిష్ఠుఁడును, పాండిత్య పాథోధియు, గుణ రత్నాకరుఁడును, గవితా కళానిధియు, ధీరధిషణా దివిజాచార్యుఁడు నగు నన్నయను గూర్చి యెన్నో విషయములను వ్యక్తము చేయుచు నాతని భౌతికమూర్తిని, గవితామూర్తిని, మన కనుల యెదుట సాక్షాత్కరింపఁ జేయు చున్నది. ఇందలి విషయము లాక్షణికులు ప్రస్తావనలో నుండవలెనని చెప్పు కవి గోత్ర నామాది కథన మగు నంగమును స్ఫురింపఁ జేయు చున్నది.

కావ్యార్థ సూచనము ప్రస్తావన యందలి మఱియొక యంగము. అదియు నీ యవతారికలో సూచ్యమాత్రముగాఁ గానవచ్చుచున్నది. రాజరాజు నన్నయతో "నే ననేక పురాణములు వింటిని. అర్థధర్మ శాస్త్రముల క్రమ మెఱింగితిని. ఉదాత్త రసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కు చూచితిని. జగత్పరి పూజ్యములైన యీశ్వరాగమములందు భక్తితో హృదయము నిల్పితి" నని చెప్పిన పిమ్మట "ఐనను నాకు ననవరతంబును శ్రీ మహా భారతమునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు" నని మహాభారతోదంతము నుగ్గడించెను. తరువాతఁ దనకు మిక్కిలి యిష్టములై యుండు నైదు విషయములలో మహా భారత శ్రవణాసక్తి యొక్కటని స్పష్టపఱిచెను. అనంతరము చంద్రుఁదొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండు భూపతులు క్రమముగా వంశకర్తలై యొప్పిన తనవంశమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవోత్తముల చరిత్ర వినుట తనకెంతో యభీష్టమని వ్యక్తీకరించెను. భారతేతిహాసము నందలి ప్రధానవస్తువు పాండవోత్తముల చరిత్రయే కదా! అందుచే నీ పై విషయములు సూక్ష్మముగ నైనను జక్కఁగాఁ గథాంశ సూచనము నొనరించు చున్నవి.

దశరూపకాదులు రత్నావళీ నాటకము నందలి "శ్రీహర్షో నిపుణః కవిః" ఇత్యాది శ్లోకము నున్ముఖీకరణ మను ప్రస్తావనాంగమున కుదాహరణముగా సూచించి యున్నవి. ఇందుఁ గవికావ్యవస్తునటసభ్యాదుల గుణవిశేషములు

వర్ణితము లైనవి. ఇట్టి సూచన సభ్యులను నాటకదర్శనమున నత్యంతోన్ముఖులుగా నొనరించుట సహజమే. ఇట్లే నన్నయయు నీ యవతారికలో భారత మహత్త్వము వించుక ప్రశంసించినాఁడు. అది జననుతుఁడైన కృష్ణద్వైపాయన మునివృషభుఁడు సంస్కృతమున రచించి నట్టిది. భారత కథా శ్రవణాభిరతిచే నుత్తమములును సువర్ణశృంగ ఖురములును నగు కపిల గోవుల నూఱింటిని సర్వథా పాత్రులైన యుత్తమ వేదవిప్రులకు దాన మొనరించిన మహాఫలము చేకూరును. మఱియు భారతమును బహు భాషలలో బహు విధములుగా బహు జనుల వలన వినుచు దాని యెడ బద్ధాదరులై యుండు వారికి బహుయాగముల ఫలము లభించును. బహు విధముల ననఁగా శ్రవ్య కావ్యముగాఁ గాని, దృశ్య కావ్యముగాఁ గాని, గేయముగాఁ గాని, మఱి యే రూపమునఁ గాని యని యర్థము. సంస్కృతము, ఆంధ్ర కర్ణాట తమిళములు మున్నగునవి బహు భాషలు. బహుజనములను శబ్దము వ్యాఖ్యానము చేయు పండితులను, గావ్యముగాఁ జెప్పు కవులను, బురాణముగా నుడువు పౌరాణికులను, దృశ్య కావ్యముగా నభినయించు నటకులను, గేయముగాఁ బాడు గాయనులను సూచించు చున్నది. ఈ పై పద్యము లొక విధమైన ఫలశ్రుతి పద్యములుగా గోచరించి నను గవి చెప్పఁ బోవు భారతమహాకావ్యము యొక్క మహనీయతను బ్రకటించుచుఁ బఠితలను దచ్ఛ్రవణ పఠనాదులం దున్ముఖులనుగా నొనరించు చున్నవి.

ఈ యవతారికలోఁ బ్రత్యక్షమైన ఋతువర్ణన మేదియు లేదను మాట సత్యమే. కాని "ఘనదురితాను బం" ధేత్యాది పద్యమున వసంతర్తు వర్ణనము సూచ్యమాన మగుచున్నది. వసంతము తుషార సంహతిని దవ్వుగఁ జోపి పుష్పపల్లవ విభూతితో విరాజిల్లును. అప్పుడు మన్మథుఁడు 'ధర్మ' విబద్ధ బుద్ధియై విజృంభించును. ఈ పద్యమునఁ గవి యలంకారమిషచే ఋతువర్ణనము నంగమును గూడఁ జొనిపి నట్లు కానఁ బడుచున్నది.

ఇంకఁ బ్రస్తావనలోఁ జివర నుండు నంగము పాత్రప్రవేశ సూచన. భారతాంధ్రీకరణము నొక నాటకముతోఁ బోల్చినచో దానికి సూత్రధారుఁడు రాజరాజు. నన్నయ యందలి ప్రధాన పాత్ర. నారాయణభట్టాతనికి సహాయుఁడు. అవతారిక యందలి తుది రెండు పద్యములలోఁ బ్రధాన పాత్ర సూచింపఁ బడుచున్నది. "నన్నయభట్టు తెమంగునన్ మహాభారత సంహితా

రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్" అను వాక్యములో నా సూచన స్పష్టముగా గోచరించుచునే యున్నది. ఈ విధముగా నీ యవతారిక లక్షణ సామ్యముచే సంస్కృతము నందలి నాందీప్రస్తావనల దృష్టియం దిడుకొని రచింపఁ బడినదేమో యను నభిప్రాయమునకు దోహదము చేకూర్చు చున్నది.

ఇంక నీ యవతారిక యందలి యితర విషయములఁ బరికింతము. మంగళ శ్లోకము తరువాత నిందు రాజరాజనరేంద్రుని గుణగణ వర్ణన మున్నది. ఇచ్చటి పద్యములు భావ రచనా గాంభీర్యమున నందమపూఁడి శాసనము నందలి రాజరాజ ప్రశస్తి శ్లోకములతోఁ దులఁ దూగుచు నా మహారాజు పరాక్రమమును, కీర్తిని, గాంతిని, రూపమును, అభిజాత్యమును, ధర్మమార్గ తత్పరతను, దాన దయా విలాసములను, వర్ణాశ్రమ ధర్మ బ్రాహ్మణ జన రక్షణ పరాయణతను, విద్యా వివేకములను, భారత శ్రవణాసక్తిని మనోహరముగా వర్ణించుచున్నవి. ఇందు వ్యక్తములగు రాజరాజు గుణగణము లాశ్వాసాద్యంత పద్యములలో వెల్లడియగు విశేషణములతోఁ గూడ వేఱు ప్రకరణమున వివరింపఁ బడును. ధారాశుద్ధి యందును, గాంభీర్యము నందును, నక్షర రమ్యత యందును నీ పద్యము లనన్య సామాన్యములై, నన్నయకు రాజరాజు నెడఁ గల ప్రేమ గౌరవముల సూచించుచు నామహారాజు నిర్మలమైన కీర్తికెత్తిన యక్షర పతాకవోలె విలసిల్లు చున్నవి.

రాజరాజు వేఁగీ దేశమునకు నాయక రత్న మనఁదగిన రాజమహేంద్ర పురమున మహేంద్ర వైభవముతో ననవరత మహీరాజ్య సుఖముల ననుభ వించుచు సకల భువనలక్ష్మీ విలాస నివాసమైన రమ్యహర్మ్య తలమున మంత్రి పురోహితాది వివిధజన పరివృతుఁడై విద్యావిలాస గోష్ఠి సుఖోపవిష్టుఁడై యుండెను. అప్పుడా సభలో మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంత సామంత విలాసినీ జనాదుల తోపాటు అపార శబ్ద శాస్త్రపారగులైన వైయాకరుణులును, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణు లైన పౌరాణికులును, మృదు మధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులైన మహాకవులును, వివిధ తర్క విగాహిత సమస్త శాస్త్ర సాగర గరీయః ప్రతిభులైన తార్కికులు నాదిగాఁ గలుగు విద్వజ్జను లాతనిఁ బరివేష్టించి కొలుచుచుండిరి. ఇందుఁ బేర్కొనఁ బడిన మహాకవు లెట్టివారో మనము పరిశీలింప వలయును. వారు మృదులవును, మధురములును, రసభావ

భాసురములును, నవార్థ సహితములు నగు వచనముల రచించుట యందు నేర్పరులు. ఇచ్చట వచన మనఁగా భాషణక్రియ (Act of speaking) లేదా వాక్కు అని యర్థము చెప్పవలయును. అనఁగా నా కవులు మృదు మధురముగా రసభావ బంధురముగా నవార్థ శోభితముగా మాటాడఁ జాలు వారును, రచన సాగింపఁ జాలువారును నై యుండిరి. వారి వచన రచన యే భాషకు సంబంధించినదో యందుఁ బేర్కొనఁ బడి యుండలేదు. అప్పుడు సంస్కృతమున నట్టి రచన చేయఁగల మహాకవు లుండి రనుటలో నాక్షేపము లేదు. భీమన బేతన భట్టులు సంస్కృతమున మహాకవులై యుండి నట్లు రణస్థిపూఁడి, కోరుమిల్లి శాసనముల వలనఁ దెలియు చున్నది. కోరుమిల్లి శాసనమున దేశీయవృత్తమైన రగడ వాడఁబడి యుండుటచే బేతనభట్టునకుఁ దెలుఁగు కవిత్వమునఁ గూడఁ బరిచయ ముండిన ట్లూహింప వచ్చును. ఇట్టివారు రాజరాజు కాలమునఁ బలువు రుండి యుందురు. నారాయణభట్టు సంస్కృత ప్రాకృతములలోనే కాక యాంధ్ర కర్ణాట భాషలలో సైతము మహాకవియై యుండినట్లు నందమపూఁడి శాసనమే సాక్ష్య మిచ్చుచున్నది. నన్నయ విషయము చెప్పుటకు భారతము ప్రత్యక్ష ప్రమాణముగా నుండనే యున్నది. సంస్కృత భాషలో మహాపండితులును గవులు నైన ఈ మహనీయులకు వలెనే యప్పటి యితర మహా విద్వాంసులకును దేశభాషా కవితా రచనా నైపుణ్యముండియుండవచ్చును. ఇట్లు గాక సంస్కృతములో నంత పాండిత్యము లేకయుఁ గేవల దేశభాషా కవిత్వము చెప్పఁగల వారుండినను వారు మహాకవు లనఁ బరఁగి రాజాస్థానములఁ గల సంస్కృత కవీంద్రులతో సమాన ప్రతిపత్తి కలిగి యుండిరో లేదో తెలియదు. దేశ భాషా మహాకావ్య రచనా ప్రస్తావమునకై కూర్పఁ బడిన యా సభలో దేశభాషా కవులు కూడఁ గొంద ఱుండి యుండవచ్చు నని యూహించుటలో దోషముండదు.

రాజరాజు నన్నయతో "విమలమతిం బురాణములు వింటి ననేకముల"ను పద్యమున "సుదాత్తకావ్య నాటక క్రమములు పెక్కు సూచితి" నని చెప్పియుండెను. ఇందలి కావ్యములును నాటకములును బహుశః సంస్కృత భాషకు సంబంధించినవే యై యుండవలెను. సంస్కృతము నందలి సుప్రసిద్ధ కావ్య నాటకములన్నియు రాజరాజు కాలమునకు ముందు వెలసినవే. వాని

నాతఁడు పఠించి యందలి రసాస్వాదముచేఁ జొక్కి యుండును. కన్నడమున రత్నత్రయము రచించిన గ్రంథములుకూడ నాతని నాఁటికి సుప్రసిద్ధములై యుండవచ్చును. అతఁడు వానిని గూడ స్వయముగాఁ బఠించియో వినియో యుండుట కవకాశ మున్నది. ఆంధ్రమున నప్పటికిఁ గవిత్వ ముండెను గాని సుప్రసిద్ధములైన కావ్యము లుండె నని చెప్పుట కాధారములు లేవు. మఱియు నుదాత్త రసాన్వితములైన వప్పటికి లే వనియే చెప్పవచ్చును. ఇంక నాటకముల సంగతి. ఆ కాలమునకు సంస్కృతమున నుదాత్తరసాన్వితములైన బహునాటకములు వెలసి యుండినమాట నెవ్వరును గా దనరు. తెలుఁగునఁ గూడ నప్పటికి దేశీయములైన కొన్నినాటక విధానము లుండెనేమో యని తలంచుట కవకాశ మున్నది. ఏల యనఁ బాల్కురికి సోమనాథుఁడు శివరాత్రి జాగరమున వేడ్కలు, ప్రదర్శనములు, బహు విధములుగ జరుగుచుండె నని వ్రాయుచు

ప్రమథ పురాతన పటు చరిత్రములు
గ్రమమొంద బహు నాటకము లాడువారు
భారతాది కథలఁ జీర మఱుఁగుల
నారంగ బొమ్మల నాడించువారు
ఆదట గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాడెడు నాడెడు వారు
పురములు గాల్చిన పోల్కి నాడుచును
పతి కర్త మిచ్చిన పోల్కి నాడుచును
యతుల గొల్వఁగ నున్న యందమాడుచును
గంధ గజాసురుఁ గడుపు టాడుచును
.... .... .... .... .... .... .... .... .... ....
జన్నంబు ద్రుంచిన చాలి నాడుచును
వెన్నుండు కన్నిచ్చు వేళ నాడుచును
గరళంబు దాల్చిన కరణి యాడుచును
వెండియు భవు బహువిధచరిత్రము ల
ఖండితగతి నాటకంబు లాడుచును

అని యప్పుడు శివుని బహువిధ చరిత్రములు నాటకములుగా నాడఁ బడుచుండె

నని వ్రాసియుండెను. ఆ సందర్భముననే యీతఁ డవి ప్రదర్శింపఁ బడు చుండిన క్రమము కూడఁ గొంత వర్ణించెను.[1] "దీని వలన నాటక రచనయుఁ బ్రదర్శన మును గూడ నా కాలమున జనసామాన్యమునఁ బ్రబలముగనే యుండె నవి తెలియు చున్నది. అది యిటీవలి కాలమునఁ బ్రదర్శింపఁ బడెడి వీథినాటకము లను బోలియుండు నని సోమనాథుని వర్ణనలను బట్టి మన మూహింప వచ్చును.[2] ఆ వేషములు, చర్యలు, ఆటలు, పాటలు, గంతులు, చిందులు మొదలగు వాని వర్ణనము చూడ సోమనాథుని కాలమునుండియు నంతకుఁ జిరపూర్వము నుండియుఁ గూడ నిప్పటివఱకు నీ వీథినాటకము లొకే రీతినే యున్నవా యని యాశ్చర్యము కలుగక మానదు". (దేశి. పుట, 132-133 శ్రీ.కో.రా.) ఇట్టి నాటకముల తోపాటు తోలుబొమ్మల నాడించుచు భారతాది కథలను బ్రదర్శించు నాచారము కూడ నాకాలమున నుండె నని "భారతాదికథలఁ జీర మఱుఁగుల నారంగ బొమ్మల నాడించు వా" రను ద్విపద వలనఁ దెలియనగు చున్నది. సోమనాథుని కాలమునఁ బ్రచురముగా నుండిన యిట్టి ప్రర్శనము లంతకుఁ బూర్వము రెండు శతాబ్దముల క్రిందఁ గూడ నుండె ననుకొనుట సమంజసముగనే యుండును. రాజరాజు వీరశైవుఁడు కాకపోయినను

---

1. భసితంబు పూఁతపై జరుగు బచ్చెనలు
నసలారు చిఱుగజ్జియలు నందియలును
గరమొప్పు తొంగల్లు గల చల్లడములుఁ
బొల్చు దంతావళుల్ పుష్పమాలికలుఁ
దాల్చి యత్యద్భుతోత్సవ లీలఁ దనర
..............................
ఆర్భటం బిచ్చి యొయ్యన జవనికల

2. గర్భంబు వెడలి యక్కజము వట్రిల్ల
నిక్కుచును ద్రిభంగి నిలుచుచు నట్ల
చొక్కుచు సభఁజూచి యొక్కింత నగుచు
అలరి శిరఃకంప మాచరించుచును
తను పాదఘట్టనఁ దనరు నుద్ఘటన
లనునయించుచు నందియల్ కదల్చుచును
జతులు పాడుచుఁ దాళగతుల గాడుచును
..................................
ఒడ్డోలగరంబుల నొలసి తిర్గుచును.

వివిధాగమము లందు, అందును నీశ్వరాగమములందు, విహితక్రముఁడై పార్వతీపతి పదాబ్జధ్యాన పూజా మహోత్సవమునఁ బరితృప్తి నొందుచుండిన భక్తశిఖామణి. అందుచే సోమనాథుఁడు వర్ణించిన శివచరిత్రవస్తుకము లైన నాటక ప్రదర్శనముల వంటి ప్రదర్శనముల నాతఁడును గొన్నింటిని జూచి యుండవచ్చును. ఉదాత్త రసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కు సూచితి నన్నప్పుడు కావ్యముల సందర్భమున బరిశీలించితి నని యర్థము చెప్పుకొన్నను నాటకముల సందర్భమునఁ బ్రదర్శితము లగుచుండఁగాఁ జూచితి ననియే యర్థము చెప్పుకోవచ్చును. ఆ నాటకములు సాంస్కృతికములు దేశీయ ములు కూడనై యుండవచ్చును.

బహు భాషల బహు విధముల
బహు జనముల వలన వినుచు భారత బద్ధ
స్పృహులగు వారికి నెప్పుడు
బహు యాగంబుల ఫలంబు పరమార్థ మగున్ 17.

అను పద్యమును బట్టి చూడఁగా రాజరాజును నన్నయయుఁ గూడ నప్పటికే బహు భాషలలో రచింపఁ బడిన భారతములను బరిశీలించినట్లు కనఁబడుచున్నది. కన్నడమునఁ బంపకవి "విక్రమార్జున విజయ" మను పేర భారతము నంతకు ముందే రచించి యుండెను. "క్రీ. శ. 7, 8 శతాబ్దుల కాలమున పెరిందేవనా రను కవిచే నఱవమున భారతము దేశీయములగు వెంబా పద్యములలో రచింపఁ బడినట్లు తెలియుచున్నది. "(దేశి. పుట 62). ఆ కాలమునఁ దెనుఁగు కన్నడ ముల కిప్పు డున్నంత పార్థక్యము లేకపోవుటచేతను, దమ వంశమునకే చెందిన పశ్చిమ చాళుక్య రాజుల యాస్థానమున రచింపఁబడిన దగుట చేతను, గవితాగుణ ముచే నత్యుత్తమ శ్రేణికిఁ జెందిన దగుట చేతను రాజరాజు పంప భారతమును దప్పక చదివియో వినియో యుండు ననుటలో సందేహము లేదు. ఇట్లే యాతఁడు చోళ రాజుల దౌహిత్రుఁడై యప్పుడప్పుడు తమిళ దేశమున మాతామహుని యింట నుండిన కతమునఁ దమిళమునఁ గూడ వించుక పరిచయము కలిగి యా భాష యందు రచితమైన భారతమును గూడ వినియుండ వచ్చును. ఇంక సంస్కృత భారత మప్పటి హిందూ రాజుల కందఱికి శిరోధార్యమై యుండె ననుటలో నచ్చె రువు లేదు. చోళరాజు లా పంచమవేదము నెడ నత్యధిక ప్రీతి కలవారై తాము స్థాపించిన వేద పాఠశాలలలో దాని నవశ్యపఠనీయముగాఁ జేయు చుండిరని

తెలియుచున్నది. (M. Ep. R. 1919). "చళుక్యుల కుటుంబమున మహా భారత గ్రంథమునం దాదరణమును బాండిత్యమును వాతాపి నగరమున వారు రాజ్యాధికార మేర్పఱుచుకొనినప్పటి నుండియు ననుశ్రుతముగా వచ్చుచుండె" నని శ్రీ బుఱ్ఱా శేషగిరిరావుగారు వ్రాసి యున్నారు. (రాజ. న. సం. 106 I. A. VII.) ఈ పై హేతువు లన్నియు రాజరాజునకు భారతము నెడ నవిశేషమైన ప్రీతి గౌరవములఁ గలిగించి యుండవచ్చును. నాటి దేశభాషలైన తమిళ కన్నడములలో భారత మేదో రూపమున నవతరించి యచ్చటి ప్రజల విజ్ఞాన వికాసములకు దోహద మొనఁ గూర్చుట చూచి రాజరాజు తన మాతృభాషయైన తెనుఁగునఁ గూడ దాని నవతరింపఁ జేయుటకు యత్నించి కృతకృత్యుఁ డయ్యెను.

"విక్రమార్జున విజయము" రచించిన పంపకవి జైన మతావలంబి. అతఁడా గ్రంథమునఁ బాండవు లందఱిలో నర్జునునికే యధిక ప్రాధాన్య మిచ్చుట కాక సమయము దొరికి నప్పు డెల్ల నతనికిని దన ప్రభువైన యరికేసరికిని నభేదాధ్యవసాయము కల్పించి యుండెను. మఱియు నాతఁడు జైనుఁ డగుటచే శ్రీకృష్ణ భగవత్త్వమును మఱుఁగు పుచ్చి యాతని సామాన్య మానవునిగాఁ జిత్రించి యుండె నని తెలియుచున్నది. వ్యాసుని భారతమున శ్రీకృష్ణుఁడు గొప్ప రాజకీయవేత్త గనే కాక పరబ్రహ్మతత్త్వమును వివరించి చెప్పఁగల భగవత్స్వరూపుఁడుగాఁ గూడఁ గానవచ్చు చున్నాఁడు. ఈ వ్యత్యాసమును దిలకించియే కాఁబోలు రాజరాజు నన్నయను భారతము నాంధ్రీకరింపు మని కోరునప్పుడు "జననుత ! కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్" అని వ్యాస మహర్షి నిబంధించిన యర్థమునే యనుసరింపు మని ప్రత్యేకముగాఁ జెప్పెఁ యుండెను.

సంస్కృతమున నుదాత్త భావ బంధురములైన పురాణాది గ్రంథము లనేకము లుండఁగా రాజరాజు భారతమునే యాంధ్రీకరింపఁ జేయుటకుఁ గారణ మేమని సందేహము కలుగ వచ్చును. దానికి సమాధానము కొంతవఱ కాతని వచనములందే కానవచ్చుచున్నది. పురాణములు, శాస్త్రములు, కావ్య నాటకములు మున్నగున వెన్ని చూచినను ఆతనికి "శ్రీమహా భారతము నందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై" యుండెను. మఱియు,భారత కథా శ్రవణమునఁ గలుగు ఫలితమును నసితర సామాన్య మైనది. రాజరాజాది చంద్ర వంశము. ఆ వంశము

వనే పుట్టి సుప్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన వారు పాండవోత్తములు. వారి చరిత్రము భారతము. అందుచే రాజరాజున కితర గ్రంథముల కంటె దానిపై నాదరము మిన్నయై యుండుట సహజము. అదియుఁ గాక గుణ గణమును బట్టి చూచినను భారత మితర గ్రంథములకుఁ దలమానిక మైనట్టిదే. అది పంచమ వేదము. ఉపనిషత్సార భూతమైన భగవద్గీత యం దొక భాగము. అందలి ప్రధాన కథయు, నుపాఖ్యానములును కడు మనోహరము లైనవి. సూతుఁడు మునులం జూచి నావలన నెక్కథ వినవలతు రని యడుగ వా రీ కథ యా కథ యని చెప్పక

"ఏ యది హృద్యం, మపూర్వం
బే యది, యెద్దాని వలన నెఱుక సమగ్రం
బై యుండు నఘనిబర్హణ
మేయది యక్కథయ వినఁగ నిష్టము మాకున్" (1. 29.)

అని పలికిరి. అట్టి విశేషణముల కర్హమైన పుణ్యకథ భారతము తక్క నింకొకటి లేదని యుగ్రశ్రవసునికిఁ దోఁచెను. అతఁ డప్పుడు దానిని జెప్పఁ దొడంగెను. అది "యైహికాముష్మిక శ్రేయః ప్రాప్తి నిమిత్తమై, లోకాగమన్యాయైకాంత విధానమై, నానావేద వేదాంత విద్యాయుక్తమై" విశ్వజనీనతకుఁ దావలమైన మహా గ్రంథము. అది రాజరాజు నాకర్షించె ననుటలో వింత యేమున్నది?

రాజరాజు వైదిక మతాభిమాని. ఆకాలమున బౌద్ధులు జైనులు మున్నగు నవైదిక మతస్థులు దేశభాషలలోఁ దమ తమ మతముల ప్రాశస్త్యములు వర్ణించి సామాన్య జనులఁ దమవంక కాకర్షించుకొన యత్నించుచుండిరి. వైదిక మత మహత్త్వము నట్లు దేశభాషలో సర్వ సుబోధముగాఁ జెప్పు గ్రంథ మొకటి యత్యవసరమై యుండెను. కన్నడమున నట్టి గ్రంథ మొకటి రచింపఁబడెను గాని యది జైన మతమునకే యెక్కువ ప్రోత్సాహ మొసంగు చుండెను. అటువము నందలి దాంధ్రుల కందుపాటులో లేకపోయెను. పోనీ భారతము కాక మఱి యే గ్రంథము నైనఁ దెనిగింత మన్నఁ బురాణము లన్నియుఁ బాక్షిక తత్త్వమును బోధించు నట్టివే. ఒక్కటి శివునికిఁ బారమ్యము చెప్ప నింకొకటి విష్ణువునకుఁ జెప్పును. మఱొకటి మఱొకరికిఁ జెప్పును. ఈ విధముగా వానిలో విశ్వజనీనత కొఱవడి యుండెను. అందుచే రాజరాజు దృష్టి భారతము వంకకే కేంద్రీకృత మయ్యెను. భారతాంధ్రీకరణ మను నేక క్రియచే నాతఁ డైహికము నాముష్మి

కము నైన యభ్యుదయ ద్వితయమును సంపాదింపఁ గాంక్షించెను. అతఁ డందుఁ గృతార్థుఁడు కాలేదని యెవ్వ రనఁ జాలుదురు ?

రాజరాజు తెనుఁగున భారతమును రచింపు మని నిండు సభలోఁ దన్నుఁ గోరఁగనే నన్నయ భట్టు

" అమలిన తారకా సముదయంబుల నెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషసారము ముదంబునఁ బొందను బుద్ధి బాహువి
క్రమమున దుర్గ మార్గజల గౌరవ భారత భారతీ సము
ద్రముఁ దఱియంగ నీదను విధాతృన కైనను నేరఁ బోలునే "

యని తత్కార్య నిర్వహణమునఁ దనకుఁ గల సామర్థ్యమును శంకించెను. పై పద్యమున భారత భారతీ సముద్రము యొక్క గాంభీర్యము వోలె నన్నయ వినయ సముద్రము యొక్క లోతును సమముగా వ్యక్తము లగుచున్నవి. నన్నయ యెంత మహా పండితుఁడో యంత మహా వినయ సంపన్నుఁడు. నిజము నకు భారతాంధ్రీకరణ భారము వహించుట కప్పుడు నన్నయ కంటె నర్హుఁడైన వాఁడింకొక్కఁడు లేఁడు లేనిచో మనీషి విద్యాశ్రమ తత్త్వవేత్తయైన యా మహా రా జందఱు విద్వజ్జనులు, కవులు, కొలువున నుండఁగా నన్నయనే యా కార్య మున నెందుకు నియోగించును ? అర్హత యెంతయున్న నహంకార పూరితుఁడు కాని వాఁ డెవ్వఁడైన నప్పటి యాంధ్రభాషా వాఙ్మయ పరిస్థితులలో భారతము వంటి యుద్గ్రంథము నా భాషలో రచించుటకు వెనుదీయుట సహజము. పరి స్థితులు గుర్తింపక ముందుగనే ప్రజ్ఞావాదములు భాషించినచోఁ దరువాత నొకప్పు డవమానము చేకూర వచ్చును. అందుచే వివేకవంతుఁడు వినయ సముద్రుఁడు నైన నన్నయ పై విధమున శంక ప్రదర్శించెను. ఇది సరిగా రఘువంశ మహా కావ్యమును వ్రాయఁ బోవుచుఁ గవికుల గురువైన కాళిదాసు

మందః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యపహాస్యతాం
ప్రాంశు లభ్యే ఫలేలోభా దుద్బాహు రివ వామనః

అని పల్కి వట్లున్నది. ఇ ట్లనుటచే నన్నయ కాని కాళిదాసు కాని స్వశక్తి సామ ర్థ్యముల కొలఁది యెఱుంగని వా రని భావింపరాదు. అందుచేతనే వారు ముందు వినయమున సందేహము ప్రదర్శించియు " అథవా కృత వాగ్ద్వారే " యనియు " అయినను దేవా ! నీ యనుమతంబున విద్వజ్జనుల యనుగ్రహంబునంజేసి

నా నేర్చు విధంబున నీ కావ్యంబు రచియించెద" ననియుఁ గార్యాచరణము నం దుత్సాహము పూని యుండిరి. వారు పల్కినట్లు తాము మందులు, అసమర్థులు నౌటయే నిక్కమైనచోఁ దరువాత నాకార్యములకుఁ బూనియే యుండరు. అట్లు పూనుటలో వారు తాము నిర్వహింపఁ బోవు కార్యము యొక్క దుష్కరత్వ మును సూచించుచునే తదాచరణమునఁ దమకుఁ గల ప్రజ్ఞా పాండిత్యములను వ్యంగ్యముగా వెల్లడించుచునే యున్నారు.

అప్పటికిఁ దెలుఁగున కింకను సౌష్ఠవముతోఁ గూడిన రూప మేర్పడి యుండలేదు. మహాకావ్య నిర్మాణావశ్యకములైన పుష్టియుఁ బద సంపదయు నం దప్పటికిఁ గొఱవడి యుండెను. ఆదర్శముగా గ్రహించుటకుఁ దగిన కావ్యమేదియు నప్పటికి లేకుండెను. అట్టి స్థితిలో మహాభారతమువంటి యుద్గ్రంథమును రచింపఁ బూనుట యేటి కెదు రీదుటయే. ఆ పని చేయఁబూను వాఁడు వ్యవహారమున నున్న భాషకుఁ గావ్యోచితమైన రూప మొసంగవలయును; సంస్కృతాద్యన్య భాషల నుండి పదములను ఛందోరీతులను గ్రహింప వల యును; వివిధ భాషలఁ బరిశీలించి కావ్య మార్గ స్వరూపమును నిర్ణయించు కొనవలెను. వే యేల? అతఁడు దారి తెన్ను లేని దుర్గమారణ్యమున సర్వ సంచ రణ యోగ్యమైన రాచబాట నిర్మింపవలయును; విషమ శిలాకర్కశమైన విపిన భూమిలో దివ్య సౌధమునకుఁ బునాదులు దిద్దవలయును. ఈ భారము నూహిం చియే నన్నయ ముందు సందేహమును బ్రదర్శించెను. తరువాత రాజానుమతి నూఁతగా గ్రహించి విద్వజ్జనంబుల యనుగ్రహంబు నభ్యర్థించుచు వినయమునఁ గావ్యరచనమున కుపక్రమించెను.

కావ్య రచనారంభమున నిర్విఘ్న పరిసమాప్తికై నన్నయ "హరిహరాజ గజాననార్క షడాస్య మాతృ సరస్వతీ గిరిసుతాదిక దేవతాతతికి" నమస్కృతి యొనరించెను. "శ్రీ వాణీ గిరిజాః" అనునది రాజరాజు కావించిన యాశీస్సు. అది యవతారిక కారంభము. ఇది నన్నయ కావించిన ప్రార్థన. భారత మహా కావ్యమున కారంభము. ఇందు నన్నయ త్రిమూర్తులకును, వారి భార్యలకును, గణపతికిని, సూర్యునికిని, కుమారస్వామికిని నమస్కార మొనరించెను. నన్నె చోడుని కుమారసంభమునఁ గూడ నారంభమున నీ దేవత లందఱును స్తుతింపఁ బడి యున్నారు. తరువాతి కవుల యవతారికలలోఁ ద్రిమూర్తులయుఁ దత్కాం తలయు గజాననునియు స్తుతులే కాని యర్కషడాననుల స్తోత్రము లుండవు.

ఒక్క చేమకూర వేంకట కవి మాత్రము తాను సూర్యవర ప్రసాది యగుటచే సూర్యుని స్తోత్రమును బ్రత్యేకముగాఁ గావించెను. నన్నయ షడాననుని పేరు పేర్కొనుటకుఁ గారణ మున్నది. చాళుక్యులు స్వామిమహాసేన పదాను ధ్యాతులు. వారి శాసనములలో "స్వామిమహాసేన పాదానుధ్యాతానాం చాళుక్యానాం" అను మాట కనిపించును. ప్రభువంశమున కా దేవుని యెడల భక్తి గౌరవములుఁ దలంచియు స్వయముగాఁ దన కాతని యెడఁ గల భక్తిని పురస్కరించుకొనియు, నన్నయ షడాస్యనామమునుగూడ నా వేలుపులపేరులనడుమఁ జొప్పించి యుండును. తరువాత నాతఁడు గురుపద్యవిద్యకు నాద్యుఁడును, వంబురుహగర్భనిభుఁడు నైన వాల్మీకిని, మునిపూజితుఁడు, భూరియశోవిరాజితుఁడు నైన వ్యాసునిఁ బూజించి యుండెను. అనంతర మాతఁ డితర సంస్కృత కవులనుగాని యప్పటి దేశభాషాకవులను గాని పేర్కొనకయే సత్సభాంతర సరసీవనంబులఁ గొనియాడియుండెను. ఆతఁ డితర సంస్కృత కవుల విట స్మరింపమికిఁ గారణము చెప్పఁజాలము. ఇంక దేశ భాషాకవు లతని మన్నన కెక్క నమస్కార్యులైన వా రప్పటి కెవ్వరును వెలసియుండ లేదేమో! ఒకవేళ యుండినచోఁ దరువాతఁ గావింపఁ బడిన సభా పురస్కారముననే వారి సన్నుతియు లీనమై యున్న దేమో!

తరువాత నన్నయ సత్సభాంతరములను గొనియాడి యుండెను. ఇచ్చట సత్‌- శబ్దము పండితార్థకమైనది. సత్సభ లనఁగాఁ బండిత సంఘములు లేక విద్వత్పరిషత్తులు. ఆ రోజులలోఁ గవీంద్రుల రచనల గుణాగుణముల విమర్శించుటకును, భాషా పారస్వతాభ్యుదయ మార్గములను సూచించుటకును గొన్ని విద్వత్పరిషత్తులు నెలకొల్పఁబడి యుండును. అట్టి పరిషత్తులలో నన్నయకుఁ గూడఁ బ్రముఖమైన స్థాన ముండియుండవచ్చును. ఈ పండిత సంఘముల యామోదము నొందఁజాలిన గ్రంథములే యా కాలమున నుత్తమము లైనవిగాఁ బరిగణింపఁబడు చుండెను. నన్నయ పర్వసంగ్రహము చెప్పు సందర్భమునం దచ్చటచ్చటి పద్యములందు వ్రాయు చుండు "సకల సూరి సభారమ్యంబగు తృతీయ పర్వము" 1.39, "సభారంజనమై పర్వ మనోజ్ఞము నాలవ పర్వము" 1-41, "ద్రోణపర్వ మమరున్ సభలన్" 1-47., "స్త్రీ పర్వంబు పదునొకండగు పర్వము నా వెలయు సుకవి పండిత సభలన్" 1.55; "విబుధశ్రేణి నుతంబై యానుశాసనిక పర్వ మిలన్" 1-59; "అశ్వ

మేధపర్వమత్యంత వివిధవస్తువిస్తరమగు బుధవరుల సభల" 1-61; మున్నగు వాక్యము లా నాఁడు పండిత సభలకుఁ గల ప్రాముఖ్యమును వెల్లడి చేయుచున్నవి. ఇట్లే తృతీయాశ్వాసమున జనమేజయుఁ డడుగ వైశంపాయనుఁడు భారతమును జెప్పఁదొడంగె నను సందర్భమునఁ గూడ నాతఁడు దాని నుత్తమసభాసేవ్య మని (3-11) కొనియాడి యుండెను. భారతమునందలి కథలను వర్ణించు నప్పుడుసైత మాతఁడు కొన్నిచోట్ల మూలమున లేక పోయినను ఇట్టి సభల ప్రసక్తి తెచ్చియుండెను. యవక్రీతుని చరిత్రలో నాతఁడు "తన విద్యా విభవంబు మునిసభల విస్తరించు చుండె" నని వర్ణింపఁ బడుట యిందుకు నిదర్శనము. (అరణ్య. 3 ఆశ్వా. 261). ఈ సభల కప్పు డున్న యధిక ప్రాధాన్యమును బురస్కరించుకొనియే నన్నయ యవతారికలో సత్సభాంతరములను ముదం బలరఁ గొనియాడి యుండెను.

ఇట్లు విద్వత్సంఘములు నెలకొల్పఁబడి గ్రంథముల గుణాగుణములు నిర్ణయించు సంప్రదాయము దక్షిణ దేశమునకుఁ గ్రొత్తదికాదు. తమిళదేశమునఁ బ్రాచీనకాలమునందు భిన్నభిన్న సమయములలో వేఱువేఱు స్థలములందు మూఁడు సంఘము లుండెనని తెలియు చున్నది. ఇఱైయనారు అగప్పొరల్‌కు నక్కీరల్ వ్రాసిన వ్యాఖ్యానములో వాని వివరములు చెప్పఁబడి యున్నవి. ఒక్కొక్క సంఘమున నెంద ఱెందఱు సభ్యులుండిరో, దాని కధ్యక్షుఁడెవరో, అందెన్ని గ్రంథము లామోదింపఁ బడెనో, యెందఱు పాండ్య రాజులు దానిని బోషించియుండిరో, యది యెంతకాలము కొనసాగియుండెనో మున్నగు విషయముల నాతఁ డొసంగి యున్నాఁడు. ఈ తమిళ సంఘములను గూర్చి యాతఁడు చెప్పిన విషయములు కొన్ని చారిత్రకముగాఁ జూచినచో నతిశయోక్తులుగాఁ దోఁచు ననుట సత్యమే కాని యట్టి సంఘము లొకప్పు డుండి యట్టి కార్యమును నిర్వహించుచుండె నని విశ్వసించుటకు మాత్ర మభ్యంతర మేదియును లేదు. నన్నయ కొనియాడిన సభాంతరములు కూడఁ బైని పేర్కొనఁబడిన యా తమిళ సంఘముల వంటివే యై యుండ వచ్చును.

ఆంధ్రదేశమున శాతవాహనుల కాలమునుండియు బౌద్ధమతము వేఱూని ప్రజాదరముఁ బడసి యుండెను. బౌద్ధులకు ధర్మము, సంఘము, బుద్ధుఁడు అను మూఁడును మూఁడు రత్నములు. "ధర్మం శరణం గచ్ఛామి,

సంఘం శరణం గచ్ఛామి, బుద్ధం శరణం గచ్ఛామి'' అనునవి వారి సాంప్రదాయిక వచనములు. బౌద్ధమతమున బౌద్ధజనసంఘములకు, సంఘారామములకు నమితమైన ప్రాధాన్య మున్నది. ఆ బౌద్ధ సంఘములఁ జూచి యితరులును వాని పద్ధతిపై మఱికొన్ని సంఘములను స్థాపించియుందురు. నన్నయ కొనియాడిన విద్వత్సంఘముల వ్యవస్థయుఁ బై సంప్రదాయమునకు ఫలితమై యుండవచ్చును. నన్నయ యా సత్సభాంతరములఁ గొనియాడిన క్రమము వాని గుణ విశేషములను, నన్నయకు వానిపైఁగల భక్తి విశేషమును జక్కఁగా వ్యక్తము చేయుచున్నది.

అవతారిక యందలి తుది రెండు పద్యములలో నొకదాన భారతాంధ్రీకరణమున నన్నయ కాతని సహాధ్యాయుఁడును, వాఙ్మయధురంధరుఁడును, వానస వంశ విభూషణుఁడు నైన నారాయణభట్టు తోడ్పడె ననియు, రెండవదానఁ గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తిని, ఇతరు లక్షరరమ్యతను, జూచి మేలు మేలని యగ్గింప నానా రుచిరార్థసూక్తినిధియైన నన్నయ మహా భారత సంహితా రచన సాగించె ననియుఁ దెల్పఁబడి యున్నది. నారాయణభట్టు తన కెట్టి సాయము చేసెనో నన్నయ స్పష్టముగాఁ జెప్పియుండని హేతువున నా సాయమును గూర్చి పలువురు పలువిధములఁ దలంచుచున్నారు. నారాయణభట్టు నన్నయకు సహాధ్యాయుఁడు. సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్ర భాషలందుఁ గవిరాజశేఖరుఁ డని పేరు పొందినవాఁడు. మనీషాలవ దుర్విదగ్ధులైన కవులను మనోహరములైన తన సూక్తులచే గర్వహీనులఁ గావించి కవీభవజ్రాంకుశుఁ డను సార్థకమైన బిరుదు వహించినట్టివాఁడు. నన్నయ నందమపూఁడి శాసనములో నాతని వంశమును, గుణగణములను, ప్రీతి పూర్వకముగా వర్ణించియున్నాఁడు. అతఁడు సకలజగదభినుత గుణశాలియనియు, సరస్వతీ కర్ణావతంసుఁ డనియు కామా నష్టాదశావధారణచక్రవర్తి యనియుఁ, దాని వలన దెలియు చున్నది. అతఁడు కేవల పండితుఁడు మాత్రమే కాదు, రాజనీతి ధురంధరుఁడు. కొంత కాల మతఁడు పశ్చిమ చాళుక్య రాజైన త్రైలోక్య మల్ల దేవరకు మంత్రియై యుండినట్లు శా. శ. 977 లో నాతని కూఁతురైన కుపమ దాక్షారామమున వేయించిన శిలాశాసనము వలన స్పష్టమగు చున్నది. మత విషయమునఁ గల భిన్నాభి ప్రాయముల కారణముచేతనో లేక రాజకీయ

కారణము చేతనో[1] యాతఁడు పశ్చిమ చాళుక్యుల కొలువునుండి రాజమహేంద్ర వరమునకు వచ్చి యుండును. రాజరాజ నరేంద్రుఁ డాతనికి నందమపూఁడి నగ్రహారముగా నొసంగి గౌరవించెను. అతఁడు పెక్కు భాషలలో మహా పండితుఁడును మహాకవియు నై యుండినప్పటికిని ఏ భాషలోఁగాని రచించిన గ్రంథ మొక్కటియుఁ గానవచ్చుటలేదు. అతఁడు భారత రచనమున నన్నయకుఁ దోడ్పడె నను విషయమున కైనను భారతావతారికలోఁ గనఁబడు "పాయక పాకశాసనికి" అను పద్యము తప్ప వే ఱాధార మేదియు లభ్య మగుట లేదు.

నన్నయ రచించిన భారత భాగమున నారాయణభట్టు రచించిన పద్యములు కూడఁ గొన్ని కల వనియు, నా సత్య విషయమును వెల్లడి చేసి యుండినచోఁ దనకుఁ గీర్తి తగ్గుటయు నారాయణునకు ఖ్యాతి చేకూరుటయు సంభవించు ననియుఁ, దలంచి యసూయాగ్రస్తుఁడైన నన్నయ "పాయక పాకశాసని" కను పద్యమున నాతఁడు తనకుఁ దోడై నిర్వహించె నని యర్థహ్రుదయముతో నా తోడ్పాటు నస్పష్టముగాఁ జెప్పియుండె ననియుఁ గవిజీవితచరిత్రకారులు వ్రాసి యుండిరి. నిత్యసత్య వచనుఁడు, సుజనుఁడు నని వర్ణింపఁబడిన నన్నయ శీలసంపదను బరికించినను, నందమపూఁడి శాసనమున నాతఁడు నారాయణ భట్టును వర్ణించిన విధము చూచినను, "బాయక పాకశాసని" కను పద్యమున నతఁడు నారాయణునెడఁ జూపిన యాదరాతిశయమును బట్టి చూచినను బై వ్రాఁతలో లేశమైన సత్యము లేదని తెల్లము కాక మానదు. అసలు రాజరాజు భారతమును తెలుఁగున వ్రాయు మని కోరినది నన్నయభట్టు నొక్కనినే. ఒక వేళ నారాయణభట్టు కూడఁ గొన్ని పద్యములు వ్రాసి యుండ నన్నయ యీర్ష్యా బద్ధ బుద్ధియై యా విషయమును మఱుఁగు పుచ్చినచో మనీషియు, విద్యాశ్రమ తత్త్వవేత్తయుఁ, గవీంద్ర సమాజ సురక్ష్మాజుఁడు నైన రాజరా జట్లు జరుగ నిచ్చునా? నన్నయ యది రాజరాజునకుఁ గూడఁ దెలియకుండ దాచి యుంచినచో మాటాడ కూరకుండుటకు నారాయణభ ట్టేమి నోట నాలుక లేనివాఁడు కాదుగదా! నిజముగా నన్నయ కట్టి దుర్బుద్ధియే యుండినచో నతఁ డీ పద్య మును వ్రాసి లేనిపోని సందేహముల కేల తా విచ్చును? కావునఁ బై వారి

1. ఇందుకుఁ గల రాజకీయ కారణము రాజకీయ పరిస్థితులను వివరించు సందర్భమునఁ జెప్పఁ బడినది.

వ్రాఁతలో యాథార్థ్యము లేక పోవు టటుండ నన్నయ నారాయణ భట్టును; అతఁడు చేసిన సాయమును నవతారికా ముఖమునఁ బ్రశంసించుట చూడ నతని హృదయము కృతజ్ఞతాసిధాన మనియు, మిత్రులయెడ నత్యంతాదరార్ద్రి మనియు దెలియు చున్నది.

"భారతఘోర రణమున నర్జునునికి నారాయణుఁడు వలె" నను నుప మానము సాభిప్రాయ మనియు, స్వయముగా నాయుధము పట్టి యుద్ధము చేయక పాండవులకు వాక్పూర్వకమైన యుపదేశము మాత్రమే యొనర్చిన శ్రీకృష్ణుని వలె నారాయణభట్టుకూడ నెన్నఁడుఁ కలము పట్టి పద్యము వ్రాయక తన కాంధ్రీకరణ విషయమున నేదో వాఙ్మాత్రమైన సాహాయ్యము నొనరించి యుండె నని నన్నయ యిం దన్యాపదేశముగ సూచించె ననియుఁ, జెప్పువారి వ్రాఁతలలోఁ గూడ సామంజస్యము కానఁబడదు. నిజముగా నన్నయ యట్టి యభిప్రాయమునే యుద్దేశపూర్వకముగాఁ బై పద్యమున సూచింపఁ దలఁచినచో నారాయణభట్టు తన కేమియుఁ దోడ్పడ లేదని యతని నిందించి నట్లుగాఁ జెప్పవచ్చును. ఈ పద్యమున నట్టి నిందాస్తుతి యిసు మంతయును గోచరింపదు. భారత రణమునఁ గృష్ణుఁ డర్జునునికి వలె నారాయణభట్టు భారతాం ధ్రీకరణమునఁ దన కేదో తోడ్పై నిర్వహించె నని చెప్పుటయే యిట నన్నయ యభిప్రాయముకాని కృష్ణుఁ డర్జునునికిఁ జేయనట్లే నారాయణభట్టును తనకెట్టి చెప్పఁదగిన సాయమును జేసి యుండలే దని చెప్పుట నన్నయ యభిప్రాయము కాదు. మిత్రుఁడు చేసిన సాయమున కాతఁ డతనిఁ బ్రశంసించు చుండగా నుప మానమును బట్టి యపూర్వార్థమును దిగిచి యాతఁడు మిత్రుని నిందించు చుండె నని యూహించుట యుచితము కాదు.

అయినచో నారాయణభట్టు నన్నయకుఁ గావించిన సాహాయ్యమెట్టిది ? అది యిట్టి దట్టి దని చెప్పుట కాధారములు లేవు కాని యూహించుట కవకాశ మున్నది. అప్పటికిఁ బూర్వ మాదర్శప్రాయము లైన తెలుఁగు కావ్యములు లేకపోవుట చేతను, భారతము వంటి మహా కావ్యము నా భాషలో నొంటరిగా నిర్వహించుట యె ట్లను నిరుత్సాహము చేతను, దాను గ్రొత్తగా నిర్మింపఁబోవు కావ్యము రాజునకును బండిత సమాజమునకును మెప్పు కలిగింపఁ జాలునో చాలదో యను నధైర్యము చేతను గావ్య రచన కున్ముఖుఁ డయ్యు రణక్షేత్రమున నెదురుగాఁ దీర్చియున్న సేనలలోఁ గల బంధువులను, గురువులను, మిత్రులను

జూచి విషణ్ణుఁడై యధైర్యమునకుఁబాలైన యర్జునుని వలె వెనుకంజ వేయు చుండిన సమయమునన, న్నయ కర్జునునకు గీతోపదేశముచేఁగృష్ణుఁడువలె, నారాయణభట్టుచ్చావచములైన యుత్సాహ వాక్యములచే ధైర్యముకలిగించి కార్యా ణము నందుఁ బూనిక చేకూర్చి యుండును. అట్టి సమయములలో ముఖ్యముగాఁ గావలసినది ప్రోత్సాహమే. సాగర లంఘనమునకు ముం దితర వానరు లనేక విధములఁ బ్రోత్సాహము నొసంగి యుండనిచో హనుమంతు నంతటి బల వంతుఁడు కూడ నా కార్యమును జేయఁజాలక పోయి యుండును. శ్రీకృష్ణుని ప్రోత్సాహమే లేక యుండిన మహావీరుఁడైన యర్జునుఁ డరదముపైఁ జదికిలఁ బడి యట్లే కూర్చుండి తుదకు రణ విముఖుఁడై తొలఁగిపోయి యుండును. అందుచే నీ విధముగా నారాయణభట్టు నన్నయకుఁ గలిగించిన ప్రోత్సాహ మా సందర్భమును బట్టి యింతిం తని విలువ కట్టరానిది. అదే యాంధ్రమున నాద్య కావ్యముగా భారత మవతరించుట కమోఘ హేతువైనది.

ఆ కాలమున సంస్కృత భాషలోఁ బండితులైన వారే యుత్తమ పండి తులుగాఁ బరిగణింపఁ బడుచుండిరి. అట్టివారికే రాజాస్థానములఁ బూజా పుర స్కారములు జరుగుచుండెను. వారు కవితా కళాసంపన్నులు కూడనై యుండి నచో నా భాషలోనే దానికి సాఫల్యము చేకూర్చు చుండిరి. వారికిఁ దెలుఁ గన్నను దేశభాష లన్నను గౌరవభావము లేకున్నమానె వా రొక్కప్పు డా భాషలను, అందుఁ గృషిచేయు పండితులను నీసడించు చుండి రన్నను అసత్య ముండదు. అప్పుడే యననేల ? తరువాత మూఁడు శతాబ్దముల వఱకు దెనుఁగున కంత గౌర వాదరములు లేకుండె ననుటకు విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడా మణిలో వ్రాసిన "విలసద్భావ రసాద్యలంకృతులచే" నిత్యాదిగాఁ గల పద్యము తార్కాణముగాఁ నున్నది. అట్టి రోజులలోఁ దెనుఁగున మహాకావ్య మొకటి వ్రాయఁగడంగుట, అందును వేదతుల్యమైన మహా భారతము నాంధ్రీకరింపఁ బూనుట సులభ సాధ్యమైన కార్యము కాఁజాలదు. "వేదముల నెల్లవారు వినరాదు, అభ్యసింపరాదు, వ్రాయరాదు" అను విశ్వాసము కొందఱు సనాతనులలో మొన్న మొన్నటి వఱకు సురూఢమై కానవచ్చుచుండె నన నన్నయ నాఁట నది మఱింత ప్రబలముగా నుండియుండె ననుటలో వింత యుండదు. అందుచే నసలు తెలుఁగునఁ గావ్యము నిర్మించు యత్నమునకును, అందును బంచమ వేదమును దెనిఁగించు యత్నమునకును, బూర్వాచార సంప్రదాయము నం దభిమానము గల

వా రాటంకము చూపించి యుండుట సహజము. అట్టియెడ నారాయణభట్టు కర్ణాటాది భాషలలో భారత మంతకు ముందే వ్రాయఁబడి యుండుటయుఁ, దత్కాల మత సాంఘిక పరిస్థితుల ననుసరించి యట్టి గ్రంథ మాంధ్రీకరింపఁ బడుట యత్యవసరమై యుండుటయు నెఱింగించి, పూర్వపక్షుల నొప్పించి, నన్నయ కట్టి యాటంకము లేకుండఁ దోడ్పడి యుండును. అక్కడనకూడ "లేఖ్యంబైన యామ్నాయ మని" భారతమును వర్ణించి తాను దానిని వ్రాయు పూనికను సమర్థించు కొనుట యిక్కడ గమనింపఁదగి యున్నది.

ఒక వేళ పండితులు భారతాంధ్రీకరణమున కంగీకారము చూపినను దాని నెట్టి భాషలో నే రూపమున వ్రాయవలె ననుట యొక చిక్కు సమస్యయై యుండును. అప్పటి కింకను దెనుఁగు మహాకావ్య రచనార్హమైన పద సంపదను, బుష్టిని గలిగి యుండ లేదనుట సత్యదూరము కాదు. తెలుఁగువారు గాసట బీసటే చదివి గాథలు త్రవ్వుచుండిరి. సంస్కృత పదసాహాయ్య ముండినఁగాని దాని కొక సౌష్ఠవము, సమగ్రత చేకూరదు. ఆ సంస్కృత పదములను దెలుఁగులో వాడుకొనుట యెట్లను విషయమున భిన్నాభిప్రాయము లుండుట కవకాశమున్నది. కొందఱు మణిప్రవాళమునెడ మక్కువ చూపి యుందురు; కొందఱు తత్సమీ కరణము నాదరించి యుందురు. మఱికొందఱు తెలుఁగును సాధ్యమైనంత వఱకు మిశ్రణము లేకుండ స్వచ్ఛముగా నుంచవలె నని తలంచి యుందురు. ఈ సందర్భమున సంస్కృత పండితులు సంస్కృత శబ్దములను తెలుఁగున వాడుచో వానిని సంస్కృతములుగానే, అనఁగా సుబాద్యంతములుగానే, వాడవలె నని తలంచుచు నన్నయ తత్సమీ కరణ విధానము నాక్షేపించి యుందురు. అప్పుడు బహుభాషా పండితుఁడైన నారాయణ భట్టు నన్నయకండగా నిల్చి కర్ణాటమునఁ బంపాదులు రచించిన గ్రంథము లందలి భాష నుదాహరణముగాఁ జూపి తత్సమీ కరణ విధానమునే సిద్ధాంతీకరించి మనీషాలవ దుర్విదగ్ధులైన యా కవులను బండితులను నిరుత్తరులను గావించి యుండును. నందమపూఁడి శాసనమున నన్నయ నారాయణునిఁ గూర్చి వ్రాసిన "కవీన్ మనీషాలవ దుర్విదగ్ధాన్" అను శ్లోక మీ సాహాయ్యమునకు స్ఫోరకముగానున్నది.

ఇంకఁ గావ్య రూపము విషయము. సంస్కృతమున మహాకవులచే రచింపఁబడిన కావ్యము లనేకము లున్నవి. అందుఁ బెక్కు పద్య కావ్యములే. అట్లే బాణభట్ట దండి మహాకవులు రచించిన కేవల-గద్య కావ్యములును, నల

చంపువు, యశస్తిలక చంపువు మున్నగు గద్య పద్య మిశ్రితములైన చంపూ
కావ్యములును గొన్ని కలవు. ఇట్టి పరిస్థితులలో మహాభారతమును రఘు
వంశాదుల వలెఁ గేవల పద్య కావ్యముగా వ్రాయవలెనో లేక చంపూ కావ్యముగా
వ్రాయవలెనో యనునది కూడ నన్నయ నిశ్చయించుకొనవలసి యుండును.
సంస్కృత భాషాభిమానులైన పండితులు భాష యందుఁ బ్రచురమై యుండిన
సంప్రదాయమును బట్టి కేవల పద్య కావ్య రచన యందే మక్కువ చూపుట సహ
జము. అంతకు ముందే కన్నడమునఁ బంప మహాకవి వ్రాసిన "విక్రమార్జున
విజయము" చంపూ పద్ధతినే రచింపఁ బడియుండి జనాదరమును బొంది యుండెను.
తెలుఁగునఁ గూడ నీ చంపూ పద్ధతి యప్పటి కపరిచితము కాదనుటకుఁ బద్య
గద్య మిశ్రితములై కనఁబడుచున్న శాసనములే తార్కాణము. నన్నయ నారా
యణభట్టు సాయమున విక్రమార్జున విజయాదుల విదర్శనముచే నా చంపూ
మార్గము యొక్క ప్రాశస్త్యము నుగ్గడించి, పండితుల యామోదముఁ బడసి
భారతాంధ్రీకరణమునకుఁ గడంగి యుండును. ఈ విధముగాఁ గావ్య రూప
నిర్ణయము గావించు పట్లఁ గూడ నారాయణభట్టు నన్నయకు మిక్కిలి తోడ్పడి
యుండును.

సంస్కృత మహాభారతము గహనము వంటిది. అందుఁ బెక్కు చోట్లఁ
బునరుక్తులును తత్త్వ ధర్మ ప్రసంగములును విశేషముగా నుండుటయే కాక
కావ్య కళా దృష్టితోఁ జూచినచో ననవసర విస్తరణమును, ననవసర వస్తు సంగ్ర
హణమును, గథా గమన విరోధములైన ఘట్టములును, గానవచ్చు చుండును.
ఇవి కాక పురాతన కాలము నుండియు నం దచ్చటచ్చట నన్యకృతములైన శ్లోక
ములు, వర్ణనలు, కథలు, ఉపాఖ్యానములు ప్రక్షేపింపఁబడి యున్నవి. అట్టి
గ్రంథమును రమణీయముగా నాంధ్రీకరింప వలెనన్నఁ గొన్ని చోట్లఁ బెంచుట,
కొన్నిచోట్ల సంకోచించుట, కొన్నిచోట్లఁ బ్రధాన కథకు విరోధము కలుగకుండ
ఘట్టములను దీర్చి దిద్దుట, మూలమునఁ బ్రక్షిప్తముల కతమునఁ గాని, దృష్టి
భేదముచేఁ గాని, సాంఘికాద్యాచారముల పరివర్తనముచేఁ గాని యనౌచిత్యము
లుగాఁ దోఁచు వాని నుచితరీతిఁ దీర్చి దిద్దుట, మున్నగు కార్యము లవశ్య కర్తవ్య
ములై యుండును. ప్రతిభా పాండిత్య మహత్త్వ మెంత యున్నను ఒక్కఁ
డేకాకియై యీ కార్యమును జనాంగీకారమును బడయునట్లుగా నిర్వహించుట
కష్ట సాధ్యము. ఇట్టి యెడలఁ గూడ మహా పండితుఁడైన నారాయణ భట్టు తన

సహాధ్యాయునికిఁ దోడ్పడి యుండును. నన్నయ యాంధ్రీకరణమునఁ గావించిన మార్పు చేర్పుల నారసి కొందఱు విద్వజ్జను లందలి సామంజస్యమును బురస్కరించుకొని వాదోపవాదములు కావించి యుండుట కవకాశ మున్నది. ఆ వాదోపవాదములు భారత రణము వలెనే ఘోరాకృతిని దాల్చి యుండును. భారత ఘోర రణము నందుఁ బాకశాసనికి నారాయణుఁడు సాయక తోడై నిర్వహించినట్లే భారతాంధ్రీకరణమునకు సంబంధించిన యీ ఘోర రణము నందును నారాయణుఁడు నన్నయ భట్టునకుఁ బాయక తోడై నిర్వహించి యుండును. ఈ సాహాయ్యమునే విస్మరింపక నన్నయ కృతజ్ఞతా పూర్వకముగా నీ పద్యమున స్మరించి యున్నాఁడు.

నన్నయ భారతము నాంధ్రీకరించి తన ప్రభువును బోషకుఁడు నైన రాజరాజ నరేంద్రున కంకితము చేసె నని సాధారణముగా నందఱును జెప్పుచుందురు. ఆశ్వాసాద్యంతము లందుఁ గానవచ్చు రాజరాజ సంబోధన రూపము లైన పద్యము లిట్టి యూహను బలపఱుచు చుండును. కాని యాంధ్రమునఁ దరువాత వ్రాయఁ బడిన పెక్కు కావ్యముల యవతారికలలో వలె నీ భారతావ తారికలో రాజరాజు నన్నయను బిల్చి భారతము నాంధ్రీకరించి తన కంకితము చేయు మని యడిగి నట్లు కాని, నన్నయ యందు కంగీకరించి కావ్య రచనమున కారంభించి నట్లు కాని, యెచ్చటను సూచింపఁబడి యుండలేదు. నన్నయ యెక్కడను రాజరాజు తన కృతికిఁ బతియని చెప్పి యుండలేదు. ఆరంభమున వేల్పులు కృతిపతిని బ్రోచుఁ గాక యని చెప్పు పద్యములును, దరువాతఁ గృతిపతి వంశ వర్ణన పద్యములును, షష్ఠ్యంతములును, గృతిపతి కభ్యుదయ పరం పరాభి వృద్ధిగాఁ గావ్యము నుపక్రమించుటయు నీ యవతారికలోఁ గానరావు. అందుచే నన్నయ తన యాంధ్రీకరణమును రాజరాజున కంకితము చేసెనో లేదో చెప్పలేము. ఆశ్వాసాద్యంత పద్యములు మాత్ర మా యభిప్రాయమును గలిగించు చున్నవి. పాల్కురికి సోమనాథుఁడు తన బసవ పురాణ పండితారాధ్య చరిత్ర లందుఁ దన కిష్టులైన వారిని శ్రోతలుగా నిర్ణయించుకొని, వారు వినుచుండఁగాఁ దా నా గ్రంథములను జెప్పి నట్లు వ్రాసియుండెను. నన్నయయు నట్లే రాజరాజును శ్రోతగా భావించి యుండె నేమో!

నన్నయ యవతారికను బఠింపఁగానే రెండు విషయములు వింతగాఁ దోఁచ గట్టును. అం దొకటి తెలుఁగున వ్రాయఁబడు గ్రంథమునకు మొదట

సంస్కృత శ్లోక ముండుట; రెండవది యది నన్నయ యుత్తమ పురుషలోఁ గాక ప్రథమ పురుషలో సంతరించుట. ఆ కాలమున సంస్కృత భాషపైఁ బండితుల కున్న గౌరవాదరము లిది వఱకే సూచింపఁ బడినవి. గ్రంథము నందలి యీ యాదిమపద్యము మంగళైక ప్రయోజన మైనది. అది యాశీ రూపముగా నున్నది. నిజమున కది వైదికోక్తులతోఁ జేయఁ దగినది. ఆశీరాదుల పట్ల నితర భాషల కంటె సంస్కృతమునకును, లౌకిక సంస్కృతము కంటె వైదిక సంస్కృత మునకును నెక్కువ ప్రభావ ముండునని భావించుట యిప్పటికిని గాన వచ్చు చున్నది. వైదికోక్తుల తరువాత సంస్కృతోక్తులకుఁ బావిత్ర్యము హెచ్చు. సంస్కృత భాషపైఁ గల యిట్టి విశ్వాసము చేతను, ఆశీస్సు దేవభాషా ప్రయుక్త మగుట యెక్కువ మంగళావహము కాఁజాలు నను నమ్మకము చేతను నన్నయ దానిని సంస్కృత భాషలో వ్రాసి యుండెను. తిక్కన కూడ నిర్వచనోత్తర రామాయణమున నీ విధానమునే యవలంబించెను. కాని విరాటపర్వాదిని మాత్రము తెలుఁగు పద్యమునే రచించెను. ఆ నాఁటికిఁ దెలుఁగు భాష పొంది యుండిన గౌరవ ప్రతిపత్తుల కది యొక చిన్న దృష్టాంతము.

ఈ యవతారిక ప్రథమ పురుషమున వ్రాయఁబడి యుండుటచే నది నన్నయ కాక యే నారాయణ భట్టో వ్రాసి యుండునని యొక వాద మున్నది. దీని కూహ తక్క నాధారాంతరము మృగ్యము. బలవత్తరమైన యిత రాధారము లభించు వఱకు దీనిని నన్నయయే రచించె నని యనుకొన వచ్చును. ఇందలి పద్యము లిందలి శైలియు, భారతమును దెనిఁగింపు మని రాజరాజు కోరఁగా నన్నయ పలికిన పల్కుల యందలి సహజత్వమును, నీ విషయమును నిరూ పింపఁ జాలి యున్నవి. అయినచో దీనిని నన్నయ ప్రథమ పురుషమున వ్రాసి యుండుటకు హేతు వే మను ప్రశ్న యుదయించును. నన్నయ యతివినయ సంపన్నుఁడు. " అమలిన తారకా సముదయంబుల నెన్నను " అను పద్య మాతని వినయ సంపదను వేనోళ్ళ వక్కాణించు చున్నది. ఈ యవతారికలో నాతఁడు తన్నుఁ గూర్చి కొంత చెప్పుకోవలసి యున్నది. అట్టి యెడ నది యుత్తమ పురుషలో రచింపఁ బడినచో నించుక యహంకారమునో యాత్మ శ్లాఘా పరాయణత్వమునో సూచింప వచ్చును. నన్నయ హృదయమున నాబాల్య ప్రరూఢమైన వినీతత్వమున కది విరుద్ధమై తోఁచి యుండును. అందుచే నాతఁడు దాని నెవ్వరో చెప్పినట్లుగా నిరాడంబరముగా వ్రాసి యుండెను. బమ్మెర పోత

రాజు భాగవతములో "ఇమ్మను జేశ్వరాధముల కిచ్చి" యను పద్యమున "సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్" అని ప్రథమ పురుషము నుపయోగించుట యేతాదృశ వినయ సంపత్ప్రేరిత మైనట్టిదే.

ఈ విధముగా నన్నయ భారతా రంభమున వ్రాసిన యవతారిక యాథార్థ్యమునకును గాంభీర్యమునకును దావలమై, యతిశయోక్త్య హంకారములకు దూరమై, సహజతా సారళ్యముల కాలవాలమై, యుప పాద్యాంశమును సుస్పష్టముగా వెల్లడించుచు, మంగళమును స్ఫురింపఁ జేయుచు, ముద్దులొల్కు శైలితో నాంధ్ర కావ్య సరస్వతీ ప్రథమావతారమును బరమౌచిత్య భాసురముగాఁ బఠితలకుఁ బ్రత్యక్షము చేయుచున్నది. ఆంధ్ర వాఙ్మయమున వితర కవులు గ్రంథాదుల రచించిన యవతారిక లెన్నో యున్నవి కాని సత్య కథనమునఁ గాని, సహజత్వమునఁ గాని, సారళ్యమునఁ గాని, శైలీ సంపదను గాని యం దేదియు నన్నయ యవతారికకు సాటి కాఁ జాలదు.



# 10. నన్నయ కవితారీతి - శైలి

వ్యాస రచితమైన మహాభారతము ననువదించునెడ నన్నయ యవలంబించిన మార్గమును, అతఁ డనువాదమునుగూడ స్వతంత్ర కావ్యముగాఁ దీర్చి దిద్దిన పద్ధతియు విదివఱకు వివరింపఁ బడినవి. ఆతఁడు సంస్కృత భారతము నందలి యర్థమును, అభిప్రాయములను, అధికధీశక్తితో వెల్లడింపవలయు ననియే రాజరాజు కోరిక; ప్రభునభీష్టము ననుసరించి నన్నయయు నట్టి ప్రయత్నమునే కావించి కృతార్థుఁ డయ్యెను. అరణ్యపర్వప్రథమాశ్వాసమున శౌనకుఁడు ధర్మరాజునకు జనక గీతము నెఱిఁగించు సందర్భమున "నాత్మ వ్యవస్థానార్థంబు జనక గీతంబులైన శ్లోకంబుల యర్థంబులు యుధిష్ఠిరున కిట్లనియె" నని (అర. 1-19) నన్నయ వ్రాసియుండుట యీ యొక్క సందర్భమునకే కాక యాతని యనువాదమున కంతకును అన్వయించును. మఱియు సంస్కృతమునం దితిహాసముగానున్న మహా భారతమునుఁ గవివృషభులు మహా కావ్యమనునట్లు రూపొందింపవలె నని నన్నయ సంకల్పము. అందుచేతనే యాతఁడు "దేవా ! నీయనుమతంబున విద్వజ్జనుల యనుగ్రహంబునంజేసి నా నేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద " నని వాక్రుచ్చియుండెను. రచనావిధానమున వ్యాసునిది పౌరాణిక నైతిక దృష్టి; నన్నయది కావ్య కళాదృష్టి. ఈ దృష్టిభేదమే ఆంధ్రమహాభారత మనువాద మయ్యు స్వతంత్రకావ్యము వోలె సాగిపోవుటకు హేతువైనది. వర్ణన విధానమునందు, గథాకథన మందు, రసపాత్రపోషణమందు, ఔచిత్య సంఘటనమునందు, నన్నయ రచనమున నా స్వాతంత్ర్యము సర్వతోముఖముగా గోచరించుచునే యుండును. అందుచేతనే వ్యాసుని కవితారీతియే నన్నయ కవితారీతి కాక యించుక భిన్నమై క్రొత్తఁదనము కూర్చుకొనుట సంభవించినది.

భారతకథా ప్రస్తావ నారంభమున "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" ఇత్యాదిగాఁగల పద్యములో నన్నయ వేదవ్యాసుఁడు భారతమును విశ్వజనీనమై పరఁగున ట్లెట్లు నిర్మించియుండెనో తెల్పి యున్నాఁడు. అందలి విశేషణములు వ్యాసుని రచనమునకే కాక నన్నయ రచనమునకుఁగూడ నన్వయించును. "కవివృషభులు మహాకావ్యమనియు లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని "

యను రెండు విశేషణములను విజమునకు సంస్కృత భారతము నెడఁగాక తెలుఁగు భారతము నెడనే సంపూర్ణముగా సార్థక్యము వహించును. ఏలయన మహా కావ్యత సర్వలక్ష్య సంగ్రహత యను గుణ విశేషములు మూలాను వాదముల రెండింట గోచరించు చున్నను. ఆ విషయమున మూలము కంటె ననువాదమునకే ప్రశస్తి యెక్కువ.

ఆంధ్ర భారతావతారికలో "సారమతింగవీంద్రు" లిత్యాది పద్యమున నన్నయ కవిత్వమునందలి ప్రధానగుణములు చెప్పఁబడినవి. అవి ప్రసన్న కథాకలితార్థ యుక్తి, అక్షరరమ్యత, నానారుచిరార్థసూక్తినిధిత్వము అనునవి. వీనిని గూర్చి శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు మున్నగు కవులును, విమర్శకులును విపులముగాఁ జర్చించియున్నారు. వానిని వివరింపనిచో నన్నయ కవితారీతి వర్ణన మసమగ్రమై యుండును. కావునఁ దత్సారాంశమును సంగ్రహముగాఁ దెల్పి నన్నయ యితర కవితాగుణముల నుగ్గడించెదను.

ప్రసన్న కథా కలితార్థయుక్తి యను సమాసమునకు ప్రసన్న కథా కవితార్థయుక్తి యను పాఠాంతర మున్నది. ప్రసన్నమైన కథలయొక్కయుఁ, గవిత్వము యొక్కయు నర్థము యొక్కయుఁ, గూడిక, ప్రసన్నమైన కథా కవిత యందలి యర్థముయొక్క కూడిక, ప్రసన్నమైన కథలయందలి కవిత్వము యొక్కయు నర్థము యొక్కయు కూడిక, ప్రసన్నమైన కథా కవితార్థముల కూడిక, యని నాలుగు విధములుగా దీనికి విగ్రహ వాక్యములు చెప్పవచ్చును. ప్రసన్న శబ్దమును కథాకవితార్థములు మూఁడింటికిఁగాని, కథా కవితకుఁగాని, యుక్తికిఁగాని విశేషణములుగా గ్రహింపవచ్చును. కవిత్వము విశాలమైన పదము. ఇందుఁ గథలు, అర్థములు, మున్నగున వన్నియు నిమిడి యుండును. కావునఁ గథార్థములనుఁ గవితా పదము కంటె భిన్నములుగాఁ జెప్పుటలో స్వారస్యము లేదు. ఇంకఁ "గథా కవిత యను" సమాసమును, ఆంగ్ల భాషా సంపర్కము కల్గిన తరువాత "Story Poem, Narrative Poetry" అను నర్థము లందాధునికులు వాడుచున్నారు. ఈ యర్థమున దీనికిఁ బూర్వము ప్రచారము కాని ప్రయోగము కాని యున్నట్లు లేదు. లాక్షణికు లెవ్వరును కథా కవితను నిర్వచించి యుండలేదు. పంపఁడు లలిత పదము, ప్రసన్న కవితా గుణము అను వానినే వాడెనుగాని కథా కవిత యను పదమును వాడి యుండలేదు. నన్నయయే

యీ పదమును స్వతంత్రముగా వాడె ననుకొన్నచో నందలి సార్థక్యము నిట్లూహింప వచ్చును. నన్నయకుఁ బూర్వము తెలుఁగున శాసన కవితయే కాని కథా కథ నాత్మకమైన కవిత్వము లేదు. పదాదులు కొన్ని కథా కలితములే యైనను వానికి శిష్టులదృష్టిలోఁ గవితా గుణము లేదు. అందుచేఁ దెలుఁగునఁ గవిత్వము ప్రౌఢ మైనదో యప్రౌఢ మైనదో నన్నయకుఁ బూర్వము కొంత యుండినను గథాత్మకమైన కవిత వ్రాయుట కాతఁడే మొదటివాఁడు. అందుచే దానిని గూర్చి యాతఁడు ప్రత్యేకముగాఁ జెప్పుకొనె నని యనుకొన వచ్చును. అప్పుడు ప్రసన్నమైన కథా కవిత్వము నందలి యర్థము యొక్క కూడిక యని యీ సమాసమున కర్థము పొసఁగును. ఇచ్చటఁ బ్రసన్న శబ్దమును గథా కవితకుఁ గాని యందలి యర్థమునకుఁ గాని, దాని యొక్క యుక్తికిఁ గాని విశేషణము చేయ వచ్చును. ఈ విధముగాఁ గవితా పదముతోఁ గూడిన పాఠమునకు దూరానేయమైన యర్థమే కాని సహజమైన యర్థము విశద మగుట లేదు. అందుచేఁ బ్రసన్న కథా కలితార్థ యుక్తి యను పాఠమునే గ్రహించుట యుక్తముగా నుండును. ప్రసన్నములైన కథల యందుఁ గూర్పఁబడిన యర్థము యొక్క యుక్తి యని దీని కర్థము. ఇచ్చటఁ బ్రసన్నపదమును గథలకుఁ గాని యర్థమునకుఁ గాని విశేషణముగా గ్రహింప వచ్చును.

ప్రసన్న మనగాఁ బ్రసాద గుణముతోఁ గూడిన యని యర్థము. ఈ ప్రసాద గుణమును సంస్కృత లాక్షణికులు పలువురు నిర్వచించి యున్నారు. దీనిని గొందఱు శబ్ద గుణము గాను, గొంద ఱర్థ గుణము గాను, గొంద ఱుభయాత్మకము గాను, గొందఱు రసగుణముగాను జెప్పియున్నారు. భరతుఁడు నాట్య శాస్త్రమున " బుధులచేఁ జెప్పఁ బడకయు సుఖ శబ్దార్థ సంయోగము వలన శబ్దము గాని యర్థము గాని ప్రతీయమాన మగుట ప్రసాద మనఁ బడునని చెప్పి యుండెను.[1]

దీనిని బట్టి యాతఁడు ప్రసాద గుణమును శబ్దార్థములు రెండింటికి సంబంధించిన గుణముగా భావించియుండె నని తెలియు చున్నది. ఝటిత్యవభాసకత్వమే ప్రసాద గుణము యొక్క ప్రధాన లక్షణ మని యాతని యభిప్రాయము. వామనుఁడు కావ్యాలంకార సూత్రవృత్తిలోఁ బ్రసాదమును శబ్ద గుణము గను, అర్థ గుణముగను కూడ నిర్వచించి యుండెను. కావ్యమునకు శోభ నాపాదించు

1. అప్యనుక్తో బుధై ర్యత్ర శబ్దార్థో వా ప్రతీయతే
సుఖ శబ్దార్థ సంయోగాత్ప్రసాదః స తు కీర్త్యతే - నా. శా. 16-99.

శబ్దార్థ ధర్మములే గుణము లవి యాతని యభిప్రాయము[1]. శాబ్దికమైన ప్రసాద మనఁగా బంధము (పద రచన) యొక్క శిథిలత్వము. కేవలము ప్రసాదము దోషమే యనియు (స శుద్ధః = పశుద్ధస్తు దోష ఏ వేతి) నోజ స్సంప్లవము[2] కల్గి నపుడే దానికి గుణ మావహిల్లు ననియు, నోజః ప్రసాదములకు సామ్యము గాని యొకదాని కంటె వేఱొక దాని కుత్కర్ష గాని యుండవచ్చును గావున నది మూఁడు రకములుగా నుండు ననియు నాతఁడు చెప్పి యుండెను. ఇఁక నార్థికమైన ప్రసాద మనఁగా నర్థ వైమల్యము (తృతీ. 2-3). వైమల్యమనఁగఁ బ్రయోజన మాత్ర పరిగ్రహ మని యాతఁ డిచ్చిన వివరణము. దీనిని బట్టి యత్యావశ్యకమైన యర్థమును మాత్రమే వెల్లడించుట. ( The mention of that alone which is absolutely necessary - గంగనాధఝూ అనువాదము) వైమల్య మని తెలియు చున్నది[3]. దండి కావ్యాదర్శమున "ప్రసాదవత్ ప్రసిద్ధార్థ" మ్మని చెప్పి యుండెను. (కావ్యా-1-45) ప్రసిద్ధార్థమును కల్గియుండుటే ప్రసాదమని యాతని యభిప్రాయము. ఇతఁడు గుణములను గేవల మర్థ సంబంధులుగా వ్రాసెను. మమ్మటుఁడు గుణములను శాబ్దికములు గను, ఆర్థికములుగను విభజించు పద్ధతి నంగీకరించి యుండలేదు. వాని నాతఁడు శాబ్దికములుగా మాత్రమే గ్రహించెను. శబ్దముల ప్రథమ శ్రవణము నందే కర్త వెల్లడింపఁ దలఁచిన యభిప్రాయము నవగతము చేయు గుణము ప్రసాద మని యాతని యభిప్రాయము[4]. నాట్య శాస్త్రము నందలి యభిప్రాయము నీతఁడు సన్నిహితముగా ననుసరించెను. విద్యానాథుఁడు గూడఁ బ్రసాద గుణమును నిర్వచించుచుఁ గొంచె మించుమించుగా నీ భావమునే వెల్లడించెను. ప్రసిద్ధార్థ పదత్వము ప్రసాద మని యాతని నిర్వచనము. ( గుణప్ర.4 )[5]. ప్రసాద గుణమున కాతఁ డొక యుదాహరణము నిచ్చి యుటి

---

1. "యేఖలు శబ్దార్థ యోర్ధర్మాః కావ్య శోభాం కుర్వంతి తే గుణాః." తృతీయాధి కరణము - 1.
2. "గుణః ప్రసాదః ఓజసా సహ సంప్లవాత్". తృ - 7.
3. "సవర్ణా కన్యకారూప యౌవనారంభ శాలినీ" అనునది యర్థ వైమల్యమున కీఁబడిన యుదాహరణము. "ఉపాస్తాం హస్తోమే విమలమణి కాంచీ పద మిదమ్" అనుచో విమలమణి యను విశేషణ మప్రయోజక మగుటచే నిది వైమల్య విపర్యయమున కుదాహరణముగ నొసంగఁ బడినది.
4. VIII - 76.
5. "ప్రసిద్ధార్థ పదత్వం యత్ స ప్రసాదో నిగద్యతే".

త్యర్థ సమర్పకము లైన పదము లుండుటచే విందుఁ బ్రసాదము కలదని వ్యాఖ్యా వించెను. ఈ విధముగా నితఁ డర్థములను గూర్చి కూడఁ గొంత వచించినను బదములకే యెక్కువ ప్రాధాన్య మిచ్చెను. ఆంధ్ర శబ్ద చింతామణిలోఁ బ్రసాద గుణమునకు నిర్వచనముగాఁ జెప్పఁబడక పోయినను "విఖ్యాన్ పేచో షాదిక శబ్దా" నిత్యాది శ్లోకమున సంకేతిత సుప్రసిద్ధ పదమే యిచ్చట (ఆంధ్రమున) ప్రవ్యాహరింపఁ దగిన దనుట యీయర్థమునే సూచించు చున్నది. పై లాక్షణికుల నిర్వచనములను బట్టి ప్రసిద్ధార్థములు, ఝటిత్యర్థ సమర్పకములు, సప్రయోజన ములు నైన పదములు కలిగియుండుటే ప్రసాద గుణ మని స్పష్టమగు చున్నది. నన్నయ " ప్రసన్న కథా కలితార్థ యుక్తి " యని చెప్పుటచేఁ బ్రసాదము నర్థ గుణము గానే గ్రహించినట్లు తోఁచు చున్నది. ఆ యా సందర్భము లందు సప్ర యోజనము లైన విషయములను మాత్రమే చెప్పుచు, నేక మాత్ర శ్రవణముననే లోని యర్థమును వ్యక్తముచేయుట యాతని ప్రసన్నతకు లక్షణ మని చెప్ప వచ్చును. ఈ యర్థమునే కథల విషయమునఁ గూడ నన్వయించినచోఁ గథా ప్రసన్నత లేక ప్రసన్న కథాత్వము అనఁగా నేమో తెల్ల మగును. ఏవైన కథ లను రచించు నప్పుడు ప్రధాన కథతో వానికిఁ గల సంబంధమును, అందు వానికిఁగల స్థానమును వివరించుచు, ప్రయోజన రహితములైన సందర్భముల నుజ్జగించుచు, విన్నంత మాత్రమున నందలి తత్త్వమును స్ఫురింపఁజేయుట యా కథాప్రసన్నతకు లక్షణము.

రసాది రూపమగు నర్థ[1] మంగి యగునపుడు శౌర్యధైర్యాది గుణము లాత్మనువలె, దాని నవలంబించి యుండునవి గుణము లనియుఁ, గటక కుండల హారాదు లవయవములను వలె వాచ్య వాచక రూపములగు నంగముల నాశ్ర యించి యుండునవి యలంకారము లనియు ధ్వన్యాలోకమునఁ జెప్పఁబడినది . దీనిని బట్టి రస మలంకారముగాని గుణముగాని కాక యలంకార్యమును గుణియు నని తెలియుచున్నది. ఈ విధముగా నంగియగు రసమే గుణవంత మని తెలియు చున్నను దద్వ్యంజకము లగుటచే శబ్దార్థములు గూడఁ బ్రసన్నములు, మధుర ములు అని యుపచారవశమునఁ జెప్పఁబడుచున్నవి. గుణములలో నోజోమాధు ర్యములు సర్వరససాధారణములు గావు. అవి హాస్య భయానక బీభత్స శాంతము లందుఁ గలిసియుండు నవకాశ మున్నను శృంగార రౌద్రాదులం దట్లుండఁ

1. త మర్థ మవలంబంతే యేఽంగినం తే గుణాః స్మృతాః
అంగాశ్రితా స్త్వలంకారా మన్తవ్యాః కటకాదివత్.

జాలవు. వీనివలెఁగాక ప్రసాదము సర్వరస సాధారణమై యుండును. అది సర్వరస సమర్పకము. శబ్దార్థముల స్వచ్ఛతయే ప్రసాదము. శబ్దార్థ స్థితమైన స్వచ్ఛతచే నది శుష్కకాష్ఠములం దగ్నివలె సామాజికుల హృదయములందు స్వస్వరూపముతో వెంటనే వ్యాపించును. "ఈ యకాలుష్య రూపమగు ప్రసన్నత్వ మన్నిరసముల కనుగుణము. అట్లు సర్వరసవ్యంజకమగు నర్థమును శబ్దములు సమర్పించుటయే యుపచారవశమునఁ బ్రసాదమని గ్రాహ్యము. కావ్య నాట్యములందు రసస్ఫురణము శబ్దార్థముల యకాలుష్యముననే సంభవించును గావున శబ్దార్థముల స్వచ్ఛతయే ప్రసాదమని పర్యవసించినది!" (ఆంధ్రధ్వన్యాలోకము 204.). ఓజో మాధుర్యములకువలె రసశబ్దార్థముల విషయమున దీనికెట్టి నియమమును కానరాదు. ఇది సర్వరసములకు, సర్వ రచనలకు సాధారణమైన గుణము[2]. ప్రసాదము రసగుణ మగుట చేతను, అది సర్వరస సాధారణ మగుట చేతను, బ్రసన్నమైన కథ లను నప్పుడు నానారసమయములైన కథలని స్ఫురించుచున్నది. ఈవిధముగాఁ "బ్రసన్న కథా కలితార్థ యుక్తి"యను సమాసమును నన్నయ రసదృష్టితోఁ బ్రయోగించె నని వ్యక్తమగు చున్నది. సంస్కృత భారత మందలి కథా రచనలో ధార్మిక దృష్టి యుత్కర్ష వహించును. అందలి కథలు రసవంతము లగుట యానుషంగికము. నన్నయ కథా రచనలో నట్లుగాక రసమున కధికమైన ప్రాధాన్యము. రసమునకుఁగాక కేవల కథా నిర్మాణమునకే ప్రాధాన్య మొసంగుట మహాకవిత్వ లక్షణము కాదు. "ప్రబంధమును విరచించుకవి సర్వవిషయముల రస పరతంత్రుఁడై యుండవలయును. ఇతివృత్తమున రసాననుగుణమైన స్థితి కానిపించినచో దానిని భంజించియైన స్వతంత్రముగా రసానుగుణమైన కథాంతరము నుత్పాదింపవలయును. ఇతివృత్తమాత్ర నిర్వహణముచేఁ గవి కెట్టి ప్రయోజనమును సిద్ధింపదు. ఏలయన నది యితిహాసము వలననే కలుగుచున్నది[3]." అని ధ్వన్యా

1. "సమర్పకత్వం కావ్యస్య యత్తు సర్వరసాన్ ప్రతి
స ప్రసాదో గుణో జ్ఞేయః సర్వసాధారణక్రియః."

2. "ప్రసాద స్తు స్వచ్ఛతా శబ్దార్థయోః, స చ సర్వసాధారణో గుణః సర్వరచనాసాధారణ శ్చేతి వ్యంగ్యార్థాపేక్షయైవ ముఖ్యతయా వ్యవస్థితో మంతవ్యః" (ధ్వ-2-33 వివృతి.)

3. "నహి కవే రితివృత్తమాత్రనిర్వహణేన కించి త్ప్రయోజనమ్.
ఇతిహాసా దేవ తత్సిద్ధేః"

లోకము చెప్పుచున్నది. ఈ విషయమును దృష్టియం దిడుకొనియే నన్నయ తన కవిత్వమునందలి గుణముల వెల్లడించు నప్పుడు "ప్రసన్న" పదమును వాడి స్వీయ కథా నిర్మాణము రసాను గుణముగా నుండు నని సూచించినట్లు తోఁచు చున్నది.

కథా ప్రసన్నత రెండు విధములుగా నుండవచ్చును. 1. ఆత్మగతము. 2. శరీరగతము. ఆత్మగతమైనప్పు డది రసభావములకు సంబంధించియుండును. శరీరగతమైనప్పుడు వానిని వెల్లడించు శబ్దములకు సంబంధించి యుండును. మొదటిదాని "నర్థయుక్తి" యనియు. రెండవదాని "నక్షరరమ్యత" యనియు నన్నయ చెప్పె నని తలంపవచ్చును.

నన్నయ కథలనుఁ బ్రసన్నములుగాఁ జేయుటకై యవలంబించు పద్ధతుల నాఱు విధములుగా విభజింపవచ్చును. 1. కథ కనవసరములును, కథా గమన మున కడ్డు కల్గించినవియు నగు వర్ణనములను, నీతిధర్మతత్త్వ వివరణములను దగ్గించుట. 2. పునరుక్తులను దొలఁగించుచు నొకే కథకు ద్విరుక్తత సంభవిం చినచో నారెండు పట్టులందలి కథాంశములను బరిశీలించి వాని నుచిత విధమున నేకత్ర సమ్మేళనము చేయుట. 3. ప్రధాన కథకును ఉపాఖ్యానములకును గల సంబంధమును వివరించుట. 4. మూలమున వేఱువే అధ్యాయములుగా స్థలాంత రములఁ జెప్పఁబడిన విషయములను గథలో నుచిత సందర్భము లందుఁ జొప్పిం చుట. 5. మూలమున గూఢముగానున్న కథారహస్యములను సముచిత వ్యాఖ్యా నముచే సువ్యక్త మొనరించుట. 6. స్థాయిభావములను విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావములచేఁ బోషించి రసమును వ్యక్తము చేయుట.

1. ఏదైనఁ గథను వ్రాయునప్పు డందలి వివిధాంశములను బాగుగాఁ బరిశీలించి వాని వానికిఁ దగినంత ప్రాధాన్య మొసఁగుచుండ వలయును. అనవ సర విషయముల కధిక ప్రాధాన్య మొసంగినచోఁ బ్రముఖముగా నుండవలసిన ప్రధాన కథాభాగము మఱుఁగుపడుట సంభవించును. అందుచేఁ గథ కనవసర ములని తోఁచిన వానిని, కథాగమనమున కడ్డు కలిగించు వానిని, బూర్తిగాఁ దొలఁగించుటయో సూచ్యమాత్రముల నొనరించుటయో కథకుఁడొనరింపవలసిన ముఖ్య కర్తవ్యములలో నొకటి. అట్లు చేయనిచో నితరాంగముల పరిమితి కననుగుణముగాఁ బెరిఁగియుండు హస్తపాదోదరాదు లంగి సమష్టి సౌందర్య మును జెఱచునట్టు లా భాగములు కావ్యమునకు శరీర మని చెప్పఁదగిన కథను వికృతమును, విషమము నొనరించి పఠితలకు వైమనస్యము కలిగించును. ఈ

విషయము నెఱింగినవాఁడు కావుననే నన్నయ కథతో సంబంధములేని యంశములను, దాని గమనమున కడ్డు కలిగించు నంశములను, గొన్ని మూలమునఁ గానిపించినను వానిని స్పృశించి విడుచుటయో లేక పూర్తిగాఁ బరిహరించుటయో చేయుచుండును. ఉపమన్యువు, ఆరుణి, వేదుఁడు అను ధౌమ్య శిష్యుల వృత్తాంతమును, పాండవుల సభావైభవమును జూచి దుర్యోధనుఁడీర్ష్యవహించి నపుడు శకుని యాతనికి ధర్మానుగతమైన యుపదేశ మొనరించిన వృత్తాంతమును, హనుమంతుఁడు భీమునికిఁ ద్రయీవార్తాదండనీతులఁ గూర్చియుఁ జాతుర్వర్ణ్య ధర్మాదులఁగూర్చియు వివరించు వృత్తాంతమును అతఁడు విడిచివేయుట యిందుకుఁ దార్కాణము. మూలమునఁ బ్రధాన కథలో వలెనే యుపాఖ్యానములలోఁగూడ వివిధ విషయముల వర్ణనములు సుదీర్ఘములై కానిపించును. నన్నయ యట్టి వానివి పెక్కుచోట్ల సంగ్రహించి సవేగమైన కథా గమనమున కవకాశము కలిగించెను[1].

2. సంస్కృత భారతమున నేదైన నుపాఖ్యానము వివరించుటకుముందు పెక్కుచోట్ల దాని సంగ్రహ స్వరూపము చెప్పఁబడుచుండును. అప్పుడు జనమేజయుఁడు దానినే వివరముగాఁ జెప్పవలసిన దని యడుగ వైశంపాయనుఁడు మరల దానిని సవిస్తరముగాఁ జెప్పుట కారంభించును. అట్లే జరత్కారువృత్తాంతము, పరీక్షిద్వృత్తాంతము మున్నగు రెండు మూడు కథాభాగములు సంస్కృత భారతమునఁ బునరుక్తములు చేయఁబడినవి. మఱియు ధర్మరాజాదులు తమ్ము విడిచి యరుగువప్పుడు ప్రజలు, విప్రులు, విచారించిన సందర్భములు సమాన విషయ విలసితములైనను మూలమున వచ్చినచోట్ల నెల్ల విస్తృతముగా వర్ణింపఁబడి యున్నవి. ఇట్టి పునరుక్తులను నన్నయ తొలఁగించి యుచిత స్థలములందు మాత్రమే యా యా సందర్భములను విస్తృతముగాఁ జెప్పుచుఁ గథల యందభిరక్తిని బెంపుచేయుచుండును.

3. నీతి ధర్మ విషయములను నీతులైనపుడెల్ల విస్తృతముగాఁ జెప్పుచుండుట సంస్కృత భారతకర్త యుద్దేశ మగుటచే నాతఁడు వానిని వెల్లడించుటకై యెడనెడ పెక్కు సందర్భములు గల్పించు చుండును. కొన్నిచోట్ల నిట్టి కథోపాఖ్యానములు మూలమునఁ బ్రధాన కథతో సంబంధములేకుండ హఠాత్తుగాఁ

1. ఇట్టివాని కుదాహరణములు పెక్కు నన్నయ యనువాద పద్ధతి యను భాగమున నొసంగఁబడినవి.

జెప్పఁబడినట్లు కానిపించును. ఈసంబంధము తక్కువైన కొలంది కథాబంధము సడలి పేలవ మగుట సంభవించును. అందుచే నన్నయ ప్రధాన కథకును ఉపాఖ్యానాదులకును గలసంబంధమును విబిడమొనరించి వానికిఁగల యవిచ్ఛిన్నతను జక్కఁగాఁ బ్రదర్శించుచుండును. కొన్నిచోట్ల నడుగఁబడినప్రశ్నకును జెప్పఁబడు సమాధానమునకును సంబంధము మృగ్యమై యుండును. నన్నయ యట్టిచోట్ల నా సంబంధమును విస్పష్టముచేసి కథను బ్రసన్న మొనరించు చుండుటయే కాక కథయందలి ప్రధానాంశము పాఠకుని హృదయమున సూటిగా హత్తుకొనునట్లు ప్రశ్నలను గూర్చుచుండును.

"వర్ణధర్మముల్ గాచుచు వసుధ యెల్ల, ననఘ చరితుఁడై యేలిన యయ్యయాతి భూసురోత్తమ ! భార్గవపుత్రియైన, దేవయానిని దా నెట్లు దేవిఁ జేసె" (ఆది 3-97) అను ప్రశ్న యట్టి వాని కొక యుదాహరణము. యయాతి గుణగణ భూషితుఁడే యైనను క్షత్త్రియుఁడు. దేవయాని బ్రాహ్మణ పుత్త్రిక. ఈ కథ వినఁగాఁనే క్షత్త్రియుఁడు-అందు "వర్ణ ధర్మముల్ గాచుచు ననఘ చరితుఁడై వసుధనెల్ల నేలిన వాఁడు"-ఇట్టి విలోమ వివాహమున కెట్లు సమ్మతించెనను సందేహము పఠితల కుదయించును. అందుచేత నన్నయ యావిషయమును సూచించుచుఁ బ్రశ్నను సంఘటించెను. మూలమునందలి ప్రశ్నలో నీ మొదటి భాగము కానరాదు. మఱియు నిచ్చట జనమేజయుఁడు వైశంపాయనుని "భూసురోత్తమ" యని సంబోధించుట సాభిప్రాయమై కానఁబడు చున్నది.

ప్రధాన కథలోఁ బ్రాతికామి దుర్యోధను నానతిచే ద్రౌపదిని సభకుఁ బిల్చుకొనివచ్చు సందర్భమునను, ధృతరాష్ట్రుఁడు ద్యూతార్థమై పాండవులఁ బిల్చుకొని రమ్మని విదురునిఁ బంపు సందర్భమునను మూలమునఁగల పునరుక్తుల నన్నయ యెట్లు తొలఁగించెనో యిదివఱకుఁ (అనువాదపద్ధతిలో)జెప్పఁబడినది.

4. వస్తువుల యొక్కయు వ్యక్తుల యొక్కయు దీర్ఘములైన పట్టికల నొసంగవలసి నపుడును, గథలలో నవాంతరములుగా వచ్చు నుపకథలను వివరింపవలసివచ్చినపుడును, మొదట వాని నూరక స్పృశించి యా కథయంతయు ముగిసిన పిమ్మట నెచ్చటనో ప్రశ్నోత్తర రూపమున మరల వానిని వెల్లడించుట మూలమునందలి పద్ధతి. ఇట్లు కొన్ని విషయములను జెప్పవలసినచోట్లఁ జెప్పక మఱియొకచోట నెచటనో చెప్పుట కథాబంధమునకు లోపమును బఠితకుఁ గ్లేశ

మును గలిగించును. అందుచే నన్నయ యట్టివాని నెల్ల ముందే పరిశీలించి వానిని యథాస్థానములందుఁ జొప్పించుచుండును. బ్రాహ్మణభార్య కల్మాష పాదుని శపించిన వృత్తాంతమును, అగస్త్యుఁడు నహుషుని శపించిన వృత్తాంత మును వేఱుగాఁ జెప్పక నన్నయ యుచిత స్థానములందు వివరించుట యిందుకు దృష్టాంతములు.

5. మూలమునఁ బ్రధానకథ యందును, ఉపాఖ్యానములందును గల కొన్ని విషయములు వివరణ సాపేక్షములై యుండును. అట్టి సందర్భము లందలి గూఢతను వివృత మొనరించినఁగాని కథకుఁ బ్రసన్నత చేకూరదు. మఱియుఁ గొన్ని సన్నివేశముల సంఘటనము స్థూలదృష్టికి హేతు రహితము గను సందర్భ దూరముగను గనిపించును. అట్టి పట్టులందు నన్నయ కథాక్రమ మునకుఁ జక్కని వ్యాఖ్యానము కావించుచుఁ గథారహస్యములను బాఠకుల హృదయముల హత్తుకొను నట్లొనరించు చుండును కథానిర్మాణమున నన్నయ యవలంబించిన పద్ధతులలో నిది మిక్కిలి రమణీయమై యొప్పారుచుండును.

(అ) అస్త్రవిద్యా ప్రదర్శన సందర్భమున దుర్యోధనుఁడు కర్ణు నంగరాజ్య మున కభిషిక్తునిఁ గావించి "యతనికి రాజవరుఁడైన పార్థునితో ననిసేయు " నర్హత కలిగించెను. దుర్యోధనుఁడు రాజైన ధృతరాష్ట్రుని జ్యేష్ఠకుమారుఁడగుట నిజమేకాని యాతఁడు యువరాజైనను గాఁడు. రాజకుమారుఁడై యుండుటతప్ప రాజ్యమున నాతని కింకే యధికారమును లేదు. అట్టివాఁడు కర్ణునికిఁగాని మఱి యెవ్వరికిఁగాని యొక రాజ్యము నిచ్చుట యెట్లు సంభవించెను? దానికి భీష్మాదు లెట్లనుమతించిరి? అను ప్రశ్న ఉదయించును. నన్నయ యీ ప్రశ్నకు సమా ధానముగా మొదటినుండియు దుర్యోధనునికి రాజ్యమునఁగల ప్రతిపత్తిని వివ రించుచుఁ గర్ణునికి రాజ్యమిచ్చుట యం దాతనికిఁ గల యర్హతను నిరూపించెను. పాండవులు హస్తినాపురమునకు రాకముందును దరువాతను రాజ్యమున దుర్యో ధనునికిఁగల స్థితిలో భేదమున్నది. వారు రాకముందు రాజు కాకపోయినను రాజాధికార మంతయు దుర్యోధనునిదే ; అతని నే విషయమునఁగాని యడ్డు వారు లేకుండిరి. పాండవులు వచ్చిన తరువాత నాతని స్థితి యించుక మాఱెను. రాజ్యము విస్తరింపఁజేసి దానిని సుప్రతిష్ఠిత మొనరించినవాఁడు పాండురాజు. అతని జ్యేష్ఠసుతుఁడు ధర్మరాజు. వయసున దుర్యోధనుని కంటెఁ బెద్ద. మఱియుఁ బాండవులలో రెండవవాఁడైన భీముఁ డతి బలశాలి. బాల్యక్రీడలలో

వితర రాజసుతు లందఱు వాతవికిఁ " గీర్వడి " యుండిరి. దుశ్శాసనాదు లెల్ల వాటలలో వాతవిచే బాధితాత్ములైరి. ఇదంతయు దుర్యోధనునికిఁ దన భావ్య భ్యుదయము విషయమున సందేహము కలిగించెను. " ఉపాంశు వధఁజేసి, మదోద్ధతుఁడైన మధ్యమువిఁ జంపి, సముద్రవలయాఖిలక్షోణిసపాండవముగా " నేలవలయు నని యాతఁడు ప్రయత్నించుచుండెను. రాజు కావలెనను సంకల్పము దుర్యోధనుని కప్పుడే కలదు. ఆ భావముతోనే యతఁడు రాజ్యమున సర్వవిషయములందు నిరంకుశుఁడై వర్తించుచుండెను. అందుచేతనే యాతఁడు భీష్మవిదురాదు లెఱుఁగకుండనే భీముని కపాయము సేయ నంతర మన్వేషించు చుండెను. ఆతని లతికాపాశబద్ధుఁ గావించి గంగమడుగునఁ ద్రోయించెను. విషోరగములచేఁ గఱపించెను. విషాన్నము పెట్టించెను. అవన్నియుఁ గృత ఘ్నునకుఁజేసిన లగ్గులవలె విఫలము లగుటచే సిగ్గువడి యాతఁడు పాండవుల కెల్ల నపాయము చేయు నుపాయము చింతించుచుండెను. విషోరగములచే భీమునిఁ గఱపించు సందర్భమున నన్నయ

" జనపతి పంపఁగ సారథి మనవిషకృష్ణోరగములఁ గఱపించె శ్రమం
బున నిద్రితుఁడైన ప్రభంజనసుతు సర్వాంగమర్మసంధులనెల్లన్. "

(ఆది. 5-175.)

అని దుర్యోధనునికి జనపతి శబ్దమును వాడుట యాతఁడు రాజు కాక పోయినను రాజాధికారము నెట్లు సాగించుకొనుచుండెనో వెల్లడిచేయుచున్నది.

అస్త్రవిద్యా ప్రదర్శన సందర్భమున భీమ దుర్యోధను లొండురుం దాఁకి గదాకౌశలము మెఱయించిరి. ఇచ్చట వీరి ప్రవృత్తి విద్యాప్రదర్శన ప్రయోజనమై కాక మహా మాత్సర్యముతో కూడి యుండెను. వారి గదాభిఘట్టన మకాండప్రోత్థమై భావి పాండవ కౌరవ్య రణాభిసూచనపటిష్ఠమై యుండెను. అప్పుడు ప్రదర్శన దిదృక్షులై వచ్చిన జనుల " పక్షపాతజనిత పరస్పర క్రోధ వచనం"బులు మిన్ను ముట్టి రంగభంగము కలిగించెను. దీనిఁబట్టి యస్త్రవిద్యా ప్రదర్శన కాలమునకుఁ బూర్వమే పాండవపక్షముకూడ ప్రబలి యుండె నని తెలియుచున్నది. దుర్యోధనున కీ విషయము మఱింత వేదనాపాదకమై యుండును.

తరువాత నర్జునుఁడు రంగమున కరుదెంచి వివిధాస్త్ర శస్త్ర లాఘవ వైచిత్ర్యమును బ్రదర్శించెను. " వీఁడె భరత వంశం బెల్ల వెలుఁగఁ గుంతి

కడుపు చల్లఁగాఁ బుట్టిన ఘన భుజుం"డని జనులు పొగడిరి. అర్జునుని యస్త్ర విద్యా ప్రదర్శనమును జూచి యెల్లఁ బరమాద్భుత చిత్తులై కావించిన హృదయ పూర్వక ప్రశంసయు దుర్యోధనుని కాసమయమున నధికమైన మనస్తాపము కలిగించి యుండును. ఇంతలోఁ గర్ణుఁడు వచ్చి యర్జును నాక్షేపించి ద్రోణానుజ్ఞాతుండై యాతఁడు చూపిన యస్త్రవిద్యలెల్ల " నశ్రమంబున "నే ప్రదర్శించెను. ఇచ్చటి " అశ్రమంబున " అనుశబ్దము కర్ణుని కర్జునునికంటెను ఆవిషయమునఁ గల దక్షతను సూచించు చున్నది. కర్ణు నస్త్రవిద్యా నైపుణ్యము చూచినతోడనే దుర్యోధనుఁ డర్జునుఁ బ్రతిఘటింపఁగల యోధుఁ డున్నందు కెంతో సంతసించెను. తమ్ములతోఁ గర్ణుని కడకేగి యాతనిఁ గౌఁగిలించుకొని " నాతో బద్ధ సఖ్యుండ వయి నాకును బాంధవులకును హితంబుచేసి నన్నునుఁ గురు రాజ్యంబు నుపయోగింపు "మని కోరెను. కర్ణుఁడందు కొడంబడెను. పిమ్మటఁ గర్ణార్జునులు ద్వంద్వ యుద్ధమునకుఁ గడంగిరి. కృపాచార్యుఁడు వారి నడుమ నిలిచి అర్జునుఁడు రాజధర్మబంధురచరితుఁ డనియుఁ, గర్ణుఁడు తన వంశమునుఁ దల్లి దండ్రులనుఁ జెప్పి యర్జునునితో దొరయగుటను నిరూపించిన పిమ్మటనే యుద్ధము సాగవలయు ననియు నిష్కర్ష చేసెను. అతఁ "డఖిల ద్వంద్వయుద్ధసమాచార నిపుణుఁడగుటచే"నా నిష్కర్ష నాక్షేపించుటకు వీలులేదు. కర్ణుఁడు తన కులమునుఁ దల్లిదండ్రులనుఁ బేర్కొనుటకు సిగ్గుపడి తలవంచి యూరకుండెను. అర్జునునికిఁ బ్రతిద్వంద్విగాఁ గర్ణు నుపయోగించుకొనవలె నన్నచో నాతని రాజుఁ జేయుట తప్ప దుర్యోధనునికి వేఱు మార్గము కనిపింపలేదు. అతఁడు రా జను నామము కల్గుటకుఁగల మూఁడు కారణములను బేర్కొని కర్ణుని కంగరాజ్య మిచ్చుటకు నిశ్చయించెను. భీష్మ ధృతరాష్ట్రులందు కనుమతించిరి. "వీని నెల్లవారును జూడంగ నీ క్షణంబ రాజుఁ జేసెద నే నంగ రాజ్య మిచ్చి" అని తండ్రి తాతల యనుమతిని బొందక పూర్వమే దుర్యోధనుఁడు చెప్పిన పద్ధతిచూడ వారి యనుమతి నామమాత్రమే యని తోఁచుచున్నది. వారనుమతింపకున్నను అతఁ డట్లు చేయునేమో! అందుచేతనే వారును అడ్డు మాటాడక యందు కనుమతించిరి. దుర్యోధనుఁడు తాను జెప్పినట్లు కర్ణు నాక్షణమున నాస్థలముననే యంగరాజ్య పట్టాభిషిక్తునిఁ గావించెను. సామాన్యులిట్టిపని చేయఁజాలరు. దాని కతి సమర్థత యుండవలయును. అందుచేతనే కర్ణుఁ డాతనితో

"బృహదబ్ధి మేఖలాఖిల మహీతల క్షత్త్రివర సమక్షమున మహా
మహిమాన్వితుఁగా నన్నును మహీశుఁగాఁ జేసి తతి సమర్థత వెలయన్".
(ఆది. 16-49)

అవి యాతని యతిసామర్థ్యము నగ్గించెను. ఆదిత్యుఁ డస్తంగతుఁడైన పిమ్మట దుర్యోధనుఁడు కర్ణునిఁ దోడ్కొని కటదీపికా సహస్రముతో రంగము వెలువడి తనమందిరమున కరిగెను. కటదీపికా సహస్రాదులు రాజ చిహ్నములు. దుర్యోధనుఁడు రాజు కాకపోయినను రాజుగా వ్యవహరించు చుండె ననుట కిది యొక నిదర్శనము. ఈ విధముగా నన్నయ కర్ణునికి రాజ్యదానము చేయు విషయమున దుర్యోధనుఁడు తెచ్చిపెట్టుకొన్న యర్హతను బహు నిపుణతతో వ్యాఖ్యానము చేసెను.

(b) జనమేజయుని సర్పయాగమునకుఁ గారణ భూతమైనది కద్రువ కొడుకుల కిచ్చిన శాపము. ఉచ్చైశ్శ్రవము తోఁక నల్లగాఁజేసి రమ్మని యామె కోరినను ఉరగము లా యధర్మారంభమునకు సుముఖులు గాకుండుటచే నామె యలిగి వారికి

"అనుపమముగ జనమేజయుఁ
డను నరపతి సేయు సర్పయాగ నిమిత్తం
బునఁ బాములు పంచత్వము
ననియెడు మని యురగములకు శాపం బిచ్చెన్". (ఆ. 2-36)

తరువాత సర్పయాగము జరిగెను. అందు కొన్ని సర్పములే దగ్ధములై పోయెను. ఆస్తీకుఁడు సర్పయాగము నుడిగింపఁటచే సర్పముల కాయాపద తప్పెను. అందుచేఁ గద్రువ శాపము పూర్తిగా సంభవింపలేదా యను సందేహము తోఁచును. ఈ సందర్భమున నన్నయ వ్రాసిన పద్యములను సూక్ష్మముగాఁ బరిశీలించినచో నీ సందేహము తొలఁగి పోవును కద్రువ "పాములు పంచత్వము ననియెడు"మని యురగములకు శాపంబిచ్చెను విజమున కది "మీరు పంచత్వము ననియెడు మని యురగములకు శాపఁబిచ్చె"నని యుండవలెను. ఆమె యెల్ల పాములు పంచత్వము ననియెడు మని యనక పాములు పంచత్వము ననియెడు మని మాత్ర మని యూరకుండెను. అందుచేతనే కొన్ని పాములు మాత్రమే సర్పయాగమున మరణించెను.

సౌపర్ణాఖ్యాన శ్రవణ కుతూహలులైన మునులు సూతు నడిగిన ప్రశ్నలోఁ గూడఁ గొంత చమత్కార మున్నది.

"ఒరుల వలనఁ బుట్టు నోటమియును నెగ్గుఁ
బొరయకుండ నరసి పుత్త్రవరులఁ
దగిలి కొలుచునట్టి తల్లి సర్పములకుఁ
నేల యలిగి శాప మిచ్చెనయ్య". (ఆది. 1-159)

అనునది వారడిగిన ప్రశ్న. ఇందలి పుత్త్రవరులు నాగరాజులు. సర్ప ములు సామాన్యోరగములు. నిజమునకుఁ దల్లి పుత్త్రవరులనుఁ గాపాడ నక్కఱలేదు వారు తమ్ముఁ దామే రక్షించుకొనఁగలరు. అట్టివారిని గూడఁ దగిలి కాచునట్టి తల్లి రక్షణీయులైన సర్పముల కేల యలిగి శాప మిచ్చె నని ప్రశ్న యందలి భావము.

వాసుకి జననీ శాపముచే నురగకుల ప్రళయ మగుటకు దుఃఖించి దాని నుడిగించుట కుపాయ మేదైనఁ గలదా యని చింతించుచుండ నాగ కుమారులు తమకుఁ దోఁచిన యుపాయముల నెఱిఁగించిరి. అప్పుడు నాగరాజానుజుఁ డైన యేలా పుత్త్రుఁడు శాపసమయమున జనని యుత్సంగతలమున నిద్రపోవుచున్న ట్లుండి తాను విన్న యమర కమలసంభవుల సంభాషణమును వివరించెను. కద్రువ యనంత బలవీర్య సంపన్నులైన కొడుకులఁ బడసి వారి కకారణముగా దారుణమైన శాప మొసంగ మీ రుపేక్షించుటకుఁ గారణ మే మని దేవతలు బ్రహ్మ నడిగిరి. బ్రహ్మ "క్రూరాకారులును జగదపకారులు నగు పన్నగులఁ దాల్ప నోపని ధారుణికి హితముగా దుష్టోరగ సంహార మిప్పు డొదఁబడవలసి వచ్చినది. సకల లోక హితాచారులై ప్రసిద్ధులైన నాగ ముఖ్యుల నెల్ల వాసుకి చెల్లెలైన జరత్కారువునకుఁ బుట్టు నాస్తీకమహాముని రక్షించు"నని సమాధానము చెప్పెను. కద్రువ శాపము విన్నప్పుడు కలుగు పాఠకుల సందేహమునుఁ దీర్పు టకై చేయఁబడిన వ్యాఖ్యాన మిది.

కద్రువ కొడుకులలో నిరుతెగల వారున్నారు. కొందఱు జగదపకారులగు దుష్టోరగములు. కొందఱు సకలలోక హితాచారులైన నాగముఖ్యులు. దీనికి బ్రహ్మ దేవతలకుఁ జెప్పిన సమాధానము నిదర్శనము. సర్పయాగమున మొదటి వారు మరణించిరి. రెండవవారిని ఆస్తీకుఁడు సర్పయాగ భయమునుండి రక్షించెను. అసలు కద్రువ యుచ్చైఃశ్రవము తోఁక నల్లగాఁజేయుఁడని పుత్త్రి

వరులైన నాగ ముఖ్యులను గాక సర్పములనే యడిగియుండును. వా రట్లు చేయుటకు సుముఖులు కారైరి. కద్రువ వారినే శపించి యుండును వారే సర్ప యాగమున నగ్నిలోఁబడి మరణించిరి. సకలలోక హితాచారులైన నాగముఖ్యులా స్తీకుని మూలమున నట్టి దారుణ మరణమునుండి రక్షింపఁబడిరి.

(c) నలుఁడొక్కనాఁడు దమయంతీ బద్ధచేతస్కుఁడై మదనానలము సహింప నోపక ప్రమదవనమునఁ గ్రుమ్మరుచుండెను. అప్పుడు హంసావళి యవనీతలంబున నవతరించెను. నలుఁ డం దొక్క హంసను బట్టుకొనెను. అతఁడు దానిని బట్టుకొనుటకు కారణ మేమి? అతఁడు హంసల నడబెడంగులచే నాకర్షింపఁబడెను. అప్పు డాతనికి నవ్వువచ్చెను. ఆ నడ బెడంగున నతనికి దమయంతి గమన సౌందర్యము స్ఫురించెను గాఁబోలును.

హంస "నీ హృదయేశ్వరియైన దమయంతి పాలికిఁబోయి నీగుణంబులు దానికి వర్ణించి యామె నీ యందు బద్ధానురాగయై యుండునట్లు చేసెద"నని పలికెను. దమయంతి యాతని హృదయేశ్వరి యని యా హంస కెట్లు తెలిసెను? అది సామాన్య హంసకాదు. "దమయంతికి నలునకు సంగమకారణదూతయైన కలహంస." శివుఁడే యా హంస యని శివపురాణము చెప్పుచున్నది. ఆహూకులను భిల్లదంపతులు యుగాంతరములందుఁ దపస్సు చేయఁగా శివుఁడనుగ్రహించి "మీరిద్దరు నల దమయంతు లయి జన్మింతురు. మీకు నేను దౌత్యము చేయుదు నని ప్రసాదించెను."[1] అందుచేతనే యది మనుష్యవాక్యములతోఁ బల్కఁ జాలెను. దాని మాటలు నలుని హృదయమున నమృతధారాపాతమువలె హాయి కలిగించెను. అతఁ డనురక్తుఁ డయి దానిని విడిచెను.

ఆ హంస యితర హంసలతోఁ గలసి విదర్భాపురమున కరిగి యం దుపవనమున సఖీజనపరివృతయైయున్న దమయంతి యంతికమున వ్రాలెను. అప్పటి యువతు లెల్ల నొండొరులఁ గడచి పఱచుచు నొక్కొక హంసను బట్టుకొనిరి. అప్పుడు నలుచేత విడువంగఁబడిన హంస దమయంతి చేతఁ బట్టువడియెను ఈ పట్టువడుటలో దమయంతి కర్తృత్వముకాక హంస కర్తృత్వమే కానఁబడుచున్నది. అందుచేతనే యది పోయి యామె యంతికమున విహరింప మొదలిడెను. హంస దౌత్యమునకు నన్నయగారు చేసిన వ్యాఖ్యానమిది.

1. నన్నయగారి ప్రసన్న కథా కలితార్థయుక్తి. పుట 26.

(d) రురుఁడు ప్రమద్వరను వివాహమాడ నిశ్చయించెను. వివాహము కాకముందే పాదమర్దితమైన పన్నగముచేఁ గఱవఁబడి యామె మరణించెను. రురుఁడు శోక వ్యాకుల హృదయుఁడై దివిజాధిపులను, భూసురులను, మంత్ర తంత్రజ్ఞులను ఆమెకు మరల జీవము కల్గినట్లు చేయవేఁడుచు దీనవదనుఁడై యాక్రోశించెను శృంగార మయోగ వియోగ సంయోగములందు మూఁడు రకములుగా నుండును. ఈ కథలో సంయోగము లేదు. అయోగ వియోగ శృంగారములు రెండును వర్ణింపఁబడినవి. సాధారణముగా సంయోగానంతరమే వియోగము సార్థకమై యుండును. ఇచ్చటి వియోగము విచిత్రమైనది. కరుణ రసా ప్లుతముగా నున్నది. "మన్మనో నిలయకు నీ ప్రమద్వరకు" అను విశేషణములో నీ కరుణమునకుఁ గారణము చెప్పఁబడినది. ప్రమద్వర రురుని గృహమున నడుగు పెట్టక పోయినను అతని మనస్సున సుప్రతిష్ఠితురాలైనది. అందుండి యామెనుఁ దొలఁగించుట కాతనికి శక్తి లేక పోయెను. అందుచేతనే యాతఁడు తన యాయుష్యము నం దర్ధ మొసంగి యామెను మరల బ్రతికించి కొనెను. ఇది యాతని మనోనిష్ఠితమైన పవిత్రప్రేమను వేయి విధముల వ్యక్తము చేయుచున్నది.

(e) సుకన్య యిష్ట సఖులతో వనమున విహరించుచు పుట్టనుండి చ్యవనుని కన్నులు మెఱయుచుండఁగా నవి విలసత్ఖద్యోతద్యుతు లనుకొని పుట్ట గ్రొప్పించి చూచెను. ఆమె కేమియుఁ గనఁబడలేదు. ఆమె విస్మయపడి తిరిగి వచ్చెను. సేనలకు మూత్రపురీష విరోధంబు కలిగెను. సుకన్య వలన సంయాతి జరిగిన విషయము తెలిసికొని పుట్ట దగ్గఱకు వచ్చెను. తపఃక్లేశ కృశాస్థిభూఁత శరీరుఁడైన చ్యవనుఁ డతనికిఁ గనిపించెను. అతఁడు కూఁతు నపరాధము క్షమించి సైన్య విరోధము నాపు మని ప్రార్థించెను. ఆమె యెఱుఁగక యట్లు చేసె నని యాతఁడు విన్నవించెను. ఆమెను బరిగ్రహించి కాని క్షమింప నని చ్యవనుఁడు పలికెను. సంయాతి తన కూఁతు నమ్మునివరున కిచ్చి సైన్య విరోధముఁ బాపుకొని యరిగెను.

సుకన్య పుట్ట గ్రొప్పించి నపుడు చ్యవనుఁడు కనఁబడ కుండుటకుఁ గారణ మేమిః అతఁ డలిగి విమీలితనయనుం డయ్యెను. అతని దేహము వల్మీకమునఁ గప్పఁబడి వికటవల్లీ గుల్మములు పైఁ బ్రాకుటచే నేర్పడక యుండెను. సంయాతి వచ్చినప్పు డాతఁడు కనులు తెఱచి యుండును.

-తాపసియైన చ్యవనుఁడు సుకన్యను( బరిగ్రహింపఁ గోరుటకు హేతు వేమి? ఆమె సంయాతి చెప్పిన ట్లెఱుఁగక పుట్ట గ్రొప్పించలేదు; అతిశయ రూప యౌవన గర్వితయై యామె యట్లు కావించె నని చ్యవనుని యూహ. ఆగర్వము నడఁచుటకే యాతఁ డామెను బరిగ్రహింపఁగోరెను. సుకన్య యౌవన గర్విత యే కాక సద్యస్సంజాత బుద్ధి సంభ్రమ ఆమె కేదైన సంకల్పము కలిగినచో నది వెంటనే కార్యరూపమునఁ బెట్టఁబడును. అట్టి బుద్ధి సంభ్రమము చేతనే యామె చ్యవనుఁడున్న పుట్ట గ్రొప్పించెను. చ్యవనుఁడు మొదట సుకన్యకుఁ గనఁబడకుండుటకు అతఁ డామెను బరిగ్రహింపఁ గోరుటకు నన్నయ చేసిన వ్యాఖ్యాన మిది.

అశ్వను లతిశయ రూప యౌవనశోభిత యైన సుకన్యకు భోగబాహ్యుఁ డైన వృద్ధుఁడు భర్తయగుటకు జాలిపడి " నీ వయోరూపములకుఁ దగిన వరుని వరింపుము. మేము వానిని దెచ్చెద " మని యామెతోఁ బల్కిరి. పతివ్రతయైన యామె కా పల్కు లసహ్యము లనిపించెను. ఆమె వెంటనే భర్తకడ కేగి వారి పల్కులెల్లఁ జెప్పెను. చ్యవనుఁడు వారి పల్కుల కొడంబడు మని యామెను బంపెను. ఈ పంపుట చాల విరుద్ధముగాఁ గనిపించును. కాని యిందు వైరుద్ధ్య మేమియు లేదు. చ్యవనుఁడు సుకన్య మహా పతివ్రత యని యెఱుం గును. వచ్చినవారు వైద్యవిద్యయం దారితేరిన వేల్పువెజ్జు లనియు నెఱుంగును. వృద్ధుఁడైన తాను వారి వలన యౌవనము పొందవలె నని - పొందఁగలనని - యాతఁడు తలంచెను అందుచేతనే యాతఁడు భార్యను వారి పలుకుల కొడం బడు మని పంపెను. సుకన్య నాకు నవయౌవన వరుం గావింపు మని వారి నడి గెను. వృద్ధుఁడైన నా భర్తను యౌవనవంతుఁ గావింపుఁడని యా మాట కర్థము. అంతేకాని నాకు యౌవనవంతు నెవ్వనినైన వేఱొకని భర్తగాఁ జేయు మని యామె కోరికకాదు. అప్పు డాశ్వను లచ్చటి కొలనుఁ జొచ్చిరి. చ్యవ నుఁడును వారితోఁగూడ సరఃప్రవేశము గావించెను. దానివలన నాతఁడు యౌవనము ప్రాపించెను.

అశ్వను లంతకుముందే యౌవనవంతులై యుండిరి. ఇట్లా ముప్వురు నవయౌవను లయి మాయందు నీ వలచు వాని వరింపు మనిరి. అశ్వినీ దేవతలు మాలో నొకరిని వరింపు మని పల్కక మాయందు నీ వలచువాని వరింపు మనిమ సాభిప్రాయమై యున్నది. చ్యవను నందుఁ దనకు సంతత ప్రీతియై యున్నదని

యామె యంతకు ముందే చెప్పియుండెను. ఆమె వలచిన వాఁ డాతఁ డొక్కడే. అందుచే నామె యాతనినే వరించెను. చ్యవనుఁడతి ప్రీతుఁడై యాశ్వినులను సోమపీథులఁగావించెద నని వాగ్దాన మొనరించెను. చ్యవనుఁడు సుకన్య నాశ్వినుల పలుకుల కొడంబడు మని పంచుటకు నన్నయ చేసిన వ్యాఖ్యానమిది.

ఇట్లు నన్నయ గూఢమై యున్న రహస్యములకు వ్యాఖ్యానము కావించుట యింకనుఁ బెక్కుచోట్లఁ గానిపించును.

6. ప్రసాదము సర్వరససమర్పక మైన గుణ మగుటచేఁ బ్రసన్న పద ప్రయోగమున నన్నయకుఁగల రసదృష్టి వ్యక్త మగుచున్న దని తెల్పఁబడినది. కథలలో వీలైనప్పు డెల్ల నతఁడు మూలమున లేకపోయినను రసానుగుణములైన విభావానుభావాదులను వర్ణించుచు నా రసములకుఁ బుష్టి కలిగించు చుండును.

(a) యయాతి దేవయానిని నూతినుండి యుద్ధరించునపుడు "దక్షిణ హస్తమునందదున్న మద్గళదురు ఘర్మవారి కణ క్రమ కరాబ్జమువట్టి నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె" నని నన్నయ వర్ణించెను. ఈ సందర్భమున మూల మున"గృహీత్వా దక్షిణే పాణా వుజ్జహార తతోఽవటాత్ ఉద్ధృత్య చైనాం తరసా తస్మా త్కూపాన్నరాధిపః" (అధ్యా 78-23) అను శ్లోక మున్నది. మూల మందులేని ఘర్మ వారి కణములను దెలుఁగున నన్నయ కల్పించెను. స్వేదము శృంగార రసమునకు సంబంధించిన సాత్త్విక భావములలో నొకటి. ఇది దేవ యాని మనమునఁగల శృంగార భావమును, యయాతిని బెండ్లాడ వలె నను తలంపును. సూచించుచున్నది.

(b) శంతనుఁ డొక్కనాఁడు యమునా తీరమున వేఁట లాడుచు, నపూర్వ సురభి గంధ మాఘ్రాణించి, దాని వచ్చిన వల నారయుచు నరిగి యోజన గంధిని గాంచెను. పిమ్మట

" దాని శరీర సౌరభము, దాని విలోల విలోకనంబులున్
దాని మనోహరాకృతియు, దాని శుచి స్మిత వక్త్ర కాంతియున్
దాని విలాసముం గడు ముదంబునఁ జూచి మనోజ బాణ సం
తాన హతాత్ముఁ.................. " (ఆది. 4-171)

డయ్యెను. ఈ పద్య మమూలకమైనది. ఇందలి శరీర సౌరభము, మనోహరా కృతి, శుచిస్మిత వక్త్రకాంతి మున్నగునవి యుద్దీపన విభావములు, విలోల విలోకనము లనుభావములు.

(c) తీర్థయాత్రల కేగు పరాశరుఁడు యమునానది యోడరేవున నేక వస్త్రయై యోడ నెక్కవచ్చువారి నిరీక్షించుచున్న సత్యవతినిఁజూచి మదన పరవశుఁ డయ్యెను. తరువాత నాతఁడు దాని జన్మము దివ్యజ్ఞానముచే నెఱింగి యా యోడ నెక్కి దానితో నరుగుచు వివిధ చేష్టా విశేషములచేఁ దన యభి ప్రాయము దాని కెఱింగించెను. ఆ చేష్టలను నన్నయ యిట్లు వర్ణించెను.

" చపలాక్షి చూపుల చాడ్పున కెదమెచ్చుఁ జిక్కని చనుఁగవఁ జీఱఁగోరు
వన్నువ కౌఁదీఁగ యందంబు మదివిల్చు. జఘన చక్రంబుపైఁజలుపుదృష్టి
యభిలాష మేర్పడునట్లుండఁగా బల్కు వేడ్కతో మరుమాట వినఁగఁదివురు
నతిఘన లజ్జావనతయగు వక్కన్యపైఁ బడి లజ్జయుఁ బాపఁగడుగు........"

(ఆది. 3-38)

సహజ సుందరమైన యీ వర్ణన ముద్దీపన విభావమై శృంగారమున కెంతయో పోషకముగా నున్నది.

(d) పాండురాజు మరణమునకు ముందు గల వసంత వర్ణనము తటస్థో ద్దీపనము. సర్వభూత సమ్మోహనమైన యీ వసంత సమయమున మాద్రి యలంకృతయై పాండురాజు మ్రోల నిల్చెను. అప్పుడు నన్నయ కావించిన యామె వర్ణనము మనోహరమై యచ్చటి శృంగారమునకుఁ బుష్టి చేకూర్చు చున్నది.

"చారు సువర్ణహాసి నవచంపక భూషయు, సిందువారము
క్తారమణీయయున్ వకుళదామ వతంసయునై యపూర్వ శృం
గార విలాస లీల యెసఁగం దన ముందట మన్న మాద్రి నం
భోరుహ నేత్రఁజూచి కురుపుంగవుఁ డంగజరాగ మత్తుఁడై"

(ఆది. 5-141)

ఈ పద్యమున నలంకరణోద్దీపనము వర్ణింపఁ బడినది.

(e) భీమరాజు ననుమతంబున బాహుకుఁడు దమయంతి కడకు రావింపఁ బడెను. అప్పుడు నలుఁడు దమయంతినిఁ గాంచెను. ఆ దమయంతి యిట్లున్నది.

"చనుదెంచి యందు, దీనానన, నవిరళ పంకమలిన, వతగాత్రఁ, దప
స్విని, నతి కృశ, దమయంతిం గనియె నలుం డుదితబాష్ప కణకలిత
ముఖిన్. (ఆది. 2-204)

ఈ పద్యమున పతివ్రతయైన విరహిణీమూర్తి ప్రత్యక్షమగు చున్నది. తనకొఱకై యట్లు కృశించిపోయిన దమయంతిని౯ జూడఁగనే నలుని హృదయము కరుణ శృంగారములకు౯ దావలమై యుండును. తనకై యామె పొందిన కార్శ్యమునకు౯ గరుణము, తన యెడ నామె ప్రదర్శించిన పాతివ్రత్యముతో౯ గూడిన ప్రణయమునకు శృంగారము. మతంగాశ్రమమున దుష్యంతుఁడు చూచినప్పుడు శకుంతల యిట్లే యుండెను. "వసనే పరిధూసరే వసానా, నియమ క్షామవతీ ధృతైకవేణీ".

"దమయంతి నలుని వికృతాంగము చూచియు నతని నన్యుఁగా వగవక నెయ్యమునను లజ్జను నతిసంభ్రమమునను వివశాత్మయై" యుండెను. ఇచ్చటి నెయ్యము, లజ్జ, సంభ్రమము అనునవి చిరకాల విరహానంతరము ప్రియుని చూచి యామె పొందిన శృంగార భావమును వెల్లడించుచున్నవి.

దుష్యంతుఁడు శకుంతలతో నభిమత సుఖము లనుభవించి నిజపురమునకు౯ జనెను. శకుంతల తన చేసిన దాని మునివరుఁడెఱింగి యలిగెడునో యని వెఱచుచుండెను అంత వనమునుండి కందమూల ఫలంబులు గొని కణ్వు౯ దరుదెంచి శకుంతలను జూచెను. అప్పు డామె లలిత శృంగార భావంబున లజ్జావనతవదనయు, నతిభీత చిత్తయు నై యుండె నన్నది నన్నయ కావించిన యమూలకమైన వర్ణనము.

(f) నలుఁడు కలిసమావిష్టుఁడై నిద్రించుచున్న దమయంతిని విడిచి వెడలి పోయెను. తరువాత దమయంతి మేల్కాంచి నలుగడం బరికించి పతిం గానక భయశోక వ్యాకులిత చిత్త యయి "హా మహారాజ! మహామహీరక్షణ దక్ష దక్షిణ బాహుదండ, దండితారాతి, నిషధరాజాగ్రణీ! నన్నిట్లు వీతదయుండవై విడిచి చనఁగ౯ దగునె" (అర 2-81). ఇత్యాదిగా విచారించెను. నలుఁడు ఋతుపర్ణునొద్ద నశ్వాధ్యక్షుఁడై ప్రచ్ఛన్నముగా౯ గాలము పుచ్చుచు

"ఇభరాజగమన నీ వెందుల కరిగి తి, త్యురుకుచాభోగ యెందున్న దాన,
వబల యెవ్వరిచేత నడవులలో౯ బట్టు, వడి తశనాపేక్ష౯ బఱచుచున్న
యుగ్ర మృగంబుల యుదరంబులోనున్న దానవే! నీ తల్లి దండ్రు లొద్ద
ధృతి నున్నదానవే దేశాంతరంబుల, నున్నదానవె యంచు నుదిత మదన
హతి విమోహితాత్ముఁడై హృదయేశ్వరి౯ దలఁచి గాత్రులెల్ల౯ దాపమునను
నిద్రలేక వంది నిట్టూర్పు లూర్చుచు నుండె నలుఁడు శోకముత్కటముగ"
(అర. 2-132)

పై రెండు పద్యములలో సంబోధనలందు దమయంతియు నలుఁడునుఁ బొందిన దుఃఖాతిశయము వ్యక్త మగుచున్నది. మొదటి దానిలో భయముతోఁ గూడిన శోకమును, రెండవదానిలో శృంగారముతోఁ గూడిన కరుణమును వర్ణింపఁబడి యున్నవి. ఇచ్చట విస్తరించి భావములను చెప్పుటచేఁ గాక "శబ్ద సంయోజన శక్తి" చేతనే యీ రసము వ్యక్తమగు చున్నది

పై నొసంగఁబడిన యుదాహరణము లన్నియుఁ గొంచెము మించు మించుగా నన్నయగారు కల్పించిన భాగములనుండియే గ్రహింపఁ బడినవి. ఇవి రసవ్యంజనమున నాయనకుఁ గల ప్రత్యేక దృష్టిని సూచించుచున్నవి. "ప్రసన్న కథా కలితార్థయుక్తి" యను సమాస మందలి "ప్రసన్న"శబ్ద ప్రయోగ మీ దృష్టినిఁ జక్కఁగా వెల్లడి చేయు చున్నది. సభాపర్వ ప్రథమాశ్వాసాంతమున "అని వైశంపాయనోక్తమైన కథ రసోత్కటముగ" అని నన్నయ వ్రాయుట కూడ (సభా. 1-293) నాతని కీ విషయమునఁగల యభినివేశమును బ్రకటించు చున్నది.

నన్నయ కథలను బ్రసన్న మొనరించుట కవలంబించిన పద్ధతులలోఁ బద ప్రయోగమును గూడఁ బేర్కొన వలయును. అపరిచితములు, శ్రవణ కటువులు నైన పదములను పరిహరించి యాతఁడు మృదు మధురములు, జాతీయ ములు నైన పదములనే వాడుచుండును. ప్రాతవడ్డ పదముల పొంత కాతఁడు పోఁడు. సంస్కృత సమాసములను వాడినను నంతఁ గ్లిష్టత యించుకేనియు నుండదు. ప్రసాద గుణ భరితములైన యిట్టి పదముల ప్రయోగముకూడ నాతని కథలందలి ప్రసన్నతకుఁ దోడ్పడు చున్నది.

నన్నయ తాను రచించిన కథా భాగము లన్నిటియందు నేదో యొక పరమార్థమును నిక్షేపించు చుండును. మూలమునందుఁగూడ నిది యస్ఫుట స్ఫురితముగా నుండవచ్చును. దాని నాతఁడు స్ఫుట మొనరించి పాఠకులకుఁ బ్రసన్న మగునట్లు కథారచన సాగించును. సూక్ష్మముగాఁ బరిశీలించుచుఁ బోయి నచో నాతని కథ లన్నిటి యందు నిట్టి పరమార్థమును దద్వివరణమునుఁ బరికింప వచ్చును.

(౧) గరుడోపాఖ్యానము నందలి పూర్వ భాగము సవతుల మానసముల నొండొరుల యెడ నెలకొని యుండు నీర్ష్యా ద్వేషములపై నాధారపడి యున్నది. గడుసరులైన వారమాయికలను వేధించుచు వారిపై నధికారము

నిర్వహించుచుండురు. కద్రువ వినతపై నిట్టి యధికారము సాగించెను. ఆమెను దాసిగాఁ జేసికొనుటకై కపట మార్గ మవలంబించెను. దానికి ఫలితముగా నామె తన కొడుకులను దానే శపించుకొన వలసివచ్చెను.

(b) యయాతి మొదట యౌవన గర్వమును. దరువాత తపో గర్వ మును వహించెను. అతఁడు శర్మిష్ఠ యందనురక్తుఁడై పుత్త్రత్రయము వడ సెను. ఈ చేఁత మొదట శుక్రుఁడు చేసిన నియమమునకు విరుద్ధమైనది. అందుచేతనే యాతఁ డధర్మముచే ధర్మమును గీడ్వఱిచె నని దేవయాని తండ్రితో మొఱపెట్టుకొనెను. "యౌవన గర్వంబున రాగాంధుండవై నా కూఁతున కప్రి యము చేసితివి. కావున జరాభార పీడితుఁడవు క"మ్మని శుక్రుఁ డాతనికి శాప మిచ్చెను. అతఁడు విషయోపభోగ తృప్తుఁడు కాఁడు. తన ముదిమి పూరుని కిచ్చి యాతని యౌవనమును దాను బొంది పెక్కేండ్లభిమత సౌఖ్యము లను భవించుట యిందుకుఁ దార్కాణము. తరువాత నాతఁడు తపో గర్వముచే మహ ర్షుల తపము నవమానించి పలికెను. ఇంద్రుఁ డలిగి యాతని దేవలోక భ్రష్టునిఁ గావించెను యయాతి యెంత గుణ గణ సంపన్నుఁ డైనను గర్విష్ఠుఁడు. "నీ గర్వము నిన్నింత సేసె" నని యింద్రుఁ డాతనిఁ గూర్చి యన్న మాటలో నిది వ్యక్తము చేయఁ బడినది.

(c) పాండవు లేవురును ద్రౌపదిని వివాహ మాడిరి. అట్టి క్రమము లోకా గమము లందు విరుద్ధమైనది. ఆమె కారణమున వారిలో వారికి ద్వేషము కలుగ వచ్చును. ఆ విషయమై మందలించుటకై నారదుఁడు వారి కడ కరుదెంచెను. "ప్రియ సహోదరు లయ్యు సుందోప సుందు లొక్క యువతి కడరి, విగ్రహించి, యొండొరులతోఁ బోరి మరణించిన" వృత్తాంతముఁ జెప్పి వారిని సమయము చేయఁ బ్రేరేఁచెను. "ఇంతుల నిమిత్తమున ధృతిమంతులు, బొందుదురు భేద మతి" యనునది యీ కథలో నన్నయ వ్యక్తము చేయఁ దలఁచిన పరమార్థము.

(d) నలుఁడు నిద్రించుచున్న దమయంతిని విడిచి వెడలిపోయెను. ఆమె మేల్కాంచి నలుం గానక విషణ్ణయై పలుపాట్లు పడి చేది దేశమున కరిగెను. సుదేవుఁ డామెను గుర్తించి విదర్భకుఁ గొని వచ్చెను. అప్పటి నుండియు నామె దేహ సౌఖ్యములు వీడి సువ్రతయై జీవితస్వామి యైన నలునిఁ జూచు దివసముల కెదురు చూచుచుండెను. తల్లిచే రాజునకుఁ జెప్పించి నలుని వెదకుటకై యాతఁడు

బ్రాహ్మణుల నియోగించున ట్లొనరించెను. పర్ణాదుఁడు దమయంతి గఱపిన పల్కులు పల్క విని యయోధ్య యందు బాహుకుఁడు దీర్ఘ నిశ్వాసపురస్సరుఁడై
" పురుషు నందు దోష పుంజంబు గలిగిన నెఱిఁగి యెద సహించునేని భార్య
పురుషు నం దభీష్ట భోగంబు దేహాంతరంబు నందు ధర్మ రతియుఁ బడయు
(అర. 2-159)

అని ప్రతివచన మిచ్చెనని యెఱింగించెను. నలుఁడు కానివాఁడు ప్రతి వచన మేలయిచ్చు నని నిశ్చయించి దమయంతి ఋతుపర్ణునికి ద్వితీయ స్వయంవర వార్త తెలిపి రమ్మని సుదేవునిఁబంపెను. సుదేవు డా వార్త నయోధ్యలోఁ దెలిపెను. ఋతుపర్ణునితో నలుఁడు కూడ విదర్భ కరుదెంచెను. పిమ్మట దమయంతి బాహుకుని కడకుఁ గేశినిని బంపి యాతఁడు నలుఁడే యని దృఢపఱచు కొని యతని నంతిపురికి రప్పించెను. ఈ విధముగాఁ బుట్టినిల్లు చేరిన క్షణము నుండియు దమయంతి నలు మార్గణమునకై యెంతయో ప్రయత్నము కావించెను. నలుఁడు దమయంతి విషయమున నట్టి ప్రయత్న మేమియుఁ జేయలేదు.

" అధిక దుఃఖ రోగార్తున కౌషధంబు సురుచిరంబుగ భార్యయ
చూవె.. ........ . .... ............... . ........".
అలసినెడ డస్సినెడ. ........ పురుషునకు విమ్మల భార్యయు
పాచుఁ జిత్తమున దుఃఖంబుల్ ".

అని దమయంతి నలునితోఁ జెప్పిన మాటలు. ఇందలి యభిప్రాయమే యాకథ యందు నన్నయ వెల్లడి చేయ నెంచిన పరమార్థము. దుఃఖార్తుఁడైన నలునికి దమయంతి యె ట్లౌషధమై యాతని చిత్తమునఁ గల దుఃఖముల నెల్లఁ బాపెనో నన్నయ యీ కథ యందుఁ జక్కఁగా వర్ణించినాఁడు. మఱియుఁ బురుషు నందలి దోష పుంజంబు నెఱిఁగియు దమయంతి యెద సహించిన కతంబునఁ గాలాంతరమునఁ నభీష్ట భోగము లందఁ జాలెను.

(c) లోకమున విషయ లాలసులైన వారిని వాని నుండి మరలించుట మిగుల దుర్ఘటమైన కార్యము. అట్లే విషయ పరాఙ్ముఖులైన వారినిఁ దదాసక్తులుగా నొనరించుటయు సులభ సాధ్యము కాదు. ఈ విషయము ఋశ్య శృంగుని కథలోఁ దెలియ వచ్చును. అతఁ డబుద్ధేషుధనుఃపత్తిుఁడు. లింగ భేదమే యాతనికిఁ దెలియదు. అట్టి వానిని రక్తచిత్తుఁ డగునట్లు ప్రబోధింప వలయును. సాధారణముగా నజ్ఞాన దశ నుండి జ్ఞాన దశకు మానవుని మఱల్చుట ప్రబోధ

మందురు. ఇట్టి ప్రబోధము వ్యతిరేక ప్రవృత్తి కలది. రెండును సమాన క్లేశ కరములే। అభినవ యౌవన విలాసిని యైన వేశ్య మొదటిసారి కందుక నర్తన మృదు గీతము లందుఁ దనకుఁ గల కౌశల మెల్లఁ జూపి యాతనికి ముదము గావించెను. అనఁగా నజ్ఞాతవైషయికానందుఁడైన యాతని కించుక తద్రుచి కలిగించెను. రెండవసారి యామె " మునినందను చిత్తమునకు వైకృతము " చేసెను. అనఁగా నాతని నివృత్తి నుండి ప్రవృత్తికి మఱలించెను.

బ్రాహ్మణులు వఱపు తొలఁగి పోవుటకు వేదాంత నివేదియైన ఋశ్య శృంగుని నేర్పు రూపున రాఁబనుపు మని రాజున కుపదేశించిరి. రాజు బుద్ధిమంతు లతో విచారించి విదగ్ధ వేశ్యాంగనలం బిలువం బంచి మీ నేర్పు విధంబున ఋశ్య శృంగుఁ బ్రబోధించి తోడ్కొని రండని పంచెను. ఆతనిని రప్పించుట కుపా యాంతరము లనేకము లుండవచ్చును కాని వారు నిర్ణయించిన మార్గ మిది. ఎంత విరక్తుఁడైన రక్తు నొనరించుటకు విలాసినుల వలె నమోఘమైన సాధన మింకొండు కానరాదు. " విలాసినుల సహాలాప సహాసన సహాయానములు బంధ సమములుగావే " అని యీ కథలో నన్నయ వెల్లడించిన పరమార్థము.

వస్తువునందునుఁ, బాత్ర లందునుఁ, బ్రతిపాద్యాంశము నందునుఁ గల భేదములను బట్టి కథ లన్నియు నొక్క మాదిరిగా నుండక వైవిధ్యమును దాల్చి యుండును. భారతము నందలి కొన్ని కథలు రాజులకు సంబంధించినవి; కొన్ని ఋషులకు సంబంధించినవి; కొన్ని ధర్మతత్త్వమునకు సంబంధించినవి; కొన్ని వైదికములు; కొన్ని లౌకికములు. ఈ భిన్న కథలను నిర్మించుటలో నన్నయ భిన్న శిల్ప విధానముల నవలంబించు చుండును. కథానుగుణమైన వాతావరణ మును గల్పించి యాతఁడు పఠితచే దాని ననుభవింపఁ జేయుచుండును. శిల్ప దృష్టితోఁ జూచినచో యయాతి చరిత్రయు, సౌకన్యాఖ్యానమును ఒక్క జాతికిఁ జెందినవిగాఁ గన్పించును. వీని నాతఁడు వ్యంగ్యముగా నడపించెను. వ్యంగ్యమైన యీ కథా కథన పద్ధతి ముందు వివరింపఁ బడును. నల దుష్యంతోపాఖ్యానములు రాజుల కథలు. ఇందు కథా కథనమునకుఁ బ్రాధాన్యము. నన్నయ వీని యం దెంతో లోకజ్ఞత ప్రదర్శించెను. రురు ఋశ్యశృంగుల కథలు మనస్తత్త్వము నకు సంబంధించినవి. సర్పయాగ వృత్తాంతమును, అగ్ని సర్వభక్షకుఁడైన కథయు వైదికము లైనవి. దీర్ఘతముని వృత్తాంతము, వ్యుషితాశ్వుని వృత్తాం తము, ధర్మతత్త్వ వివరణమునకై వ్రాయఁబడినవి. సుందోపసుందోపాఖ్యానము,

గరుడోపాఖ్యానము లౌకికము లైనవి. మొదటి దానిలో స్త్రీ విషయమైన కలహము, రెండవ దానిలో సవతుల యీర్ష్యా ద్వేషములు వర్ణింపఁ బడినవి. ఆరణ్య పర్వ మందలి చిన్న కథలు పెక్కు తీర్థ క్షేత్ర మాహాత్మ్య బోధకము లైనవి.

నన్నయ యంగాంగి భేదమును మఱవక వాని కెంతెంత ప్రాధాన్య మీయ వలెనో యెప్పుడును గమనించుచునే యుండును. ఉపాఖ్యానముల నతి దీర్ఘ విస్తృతములుగా వర్ణించి ప్రధాన కథకుఁ గావి, యుపాఖ్యానములలో నంగ వస్తువును విస్తరించి యంగి విషయమునకుఁ గాని, యాతఁ డెన్నఁడును భంగము కల్పింపఁడు. ఉపాఖ్యానము లందలి దీర్ఘ వర్ణములను, అనవసర వివరణ ములను అతఁడు చాల వఱకుఁ దగ్గించును. ఇట్టివాని కనువాద పద్ధతి వివరించు నప్పుడు పెక్కుదాహరణ లొసంగఁ బడినవి. గరుడో పాఖ్యానమునకు ముందున్న యమృత మథన వృత్తాంతమును, నడుమ నున్న విభావసు సుప్రతీకుల వృత్తాతమును, యయాతి చరిత్రకు మూలమైన కచ దేవయానుల కథను అతఁడు సంగ్రహించుట యీ దృష్టి తోడనే " నన్నయగారు కథ యొక్క ప్రాణమును బట్టి నొక్కును గావి కథలోని వివిధాంశములను బెంచఁడు. వివిధాంశములను బెంచుట యొక పద్ధతి ; కథయొక్క ప్రాణములను బిగించి పట్టుట యొక పద్ధతి. దానికి దీనికి సంబంధము లేదు. లోకములో నూటికి తొంబది తొమ్మండుగురు కవులు కథాంశములను బెంచి, ప్రసంగమును వృద్ధిపఱచి, లోకోక్తులు, గడుసు పలుకుబళ్లు, మనోభావచిత్రణములు విస్తరించి చేయు కవులు. నన్నయ్య గారికి వితరకవులకు సంబంధము లేదు ఆయన కథ కోసము తదితర విష యములనుఁ జెప్పినచోఁ జెప్పును[1]."

కథను నడపించుటలో రెండు పద్ధతులున్నవి. అం దొకటి కవి తటస్థుఁడై యిట్లు జరిగె నట్లు జరిగె నని చెప్పుట. ఇది కథనపద్ధతి. రెండవది పాత్రల సంభాషణ చేతనే కథను సాగించుట. ఇది నాటక పద్ధతి. వీనిలో నన్నయ గారిది మొదటి పద్ధతి. తిక్కన గారిది రెండవ పద్ధతి. నన్నయ కథకు వెలుపలనుండి యందలి పాత్ర లే యే సందర్భములం దే మేమి చేసిరో చెప్పు చుండును. "ఇట్లు చెప్పుకొని పోవుచుఁ గథలోని స్థూలాంశములను మాత్రమే పైకిఁ గనఁబడఁ జేయుచు జాగ్రత్తగాఁ జదివినచో వెనుక నెంతయో యుండుట తెలియునట్లు నిర్మించిన యొక విచిత్రమైన శిల్పము నన్నయగారిది."[2]

---

1. నన్నయగారి కథా కలితార్థ యుక్తి పుట 7 2. పుట 53,

నన్నయ నలోపాఖ్యానము, దుష్యంతోపాఖ్యానము, మున్నగు పెద్ద కథలను స్వతంత్ర కావ్యములా యన్నట్లు తీర్చిదిద్దెను. ఆయన భారతమున నే ఘట్టమున కా ఘట్టమే యొక చిన్న ప్రబంధము అందలి యుపక్రమోపబృంహణోప సంహృతుల నాయన యెంతో జాగరూకతతో సంఘటించును. అస్త్రవిద్యా ప్రదర్శన ఘట్టమున జరిగిన ప్రధానాంశములు రెండు : కర్ణుఁడు కౌరవ పక్షము నవలంబించుట, కుంతి యాతని గుర్తించుట. పంచమాశ్వాసము - చివర నన్నయ

"అనిలాత్మజు బలమును నర్జును కార్ముక కౌశలంబు శూరగుణంబుల్
మనమున సహింప నోపక వనరుచు ధృతరాష్ట్రసుతులు వందిరి తమలోన్"
(ఆ. 5-247)

అని వ్రాసెను. షష్ఠాశ్వాస మస్త్రవిద్యాప్రదర్శనముతో నారంభించుచున్నది. దాని చివర.

"వినుతధనుర్విద్యావిదు ఘనుఁగర్ణు సహాయుఁ బడసి కౌరవ విభుఁ డ
ర్జును వలని భయము సెడి యొమ్మనఁ జేయిడి విదురపోయె
ముదితాత్ముండై (ఆ. 6-62).

అను పద్యము వ్రాయఁబడినది. ఈ రెండు పద్యములను సమన్వయించి చూచి నచో నస్త్రవిద్యాప్రదర్శన ఘట్ట మే ప్రయోజనముతోఁ గూర్పఁబడినదో తెలియును. మఱియుఁ బాల్యమునఁ గుంతి కర్ణుని గంగలో విడిచివైచిన తరువాత నాతఁ డేమయ్యెనో యేమియు నెఱుఁగదు. ఈ విషయమున నామె మానసమున నేమి మథన పడుచుండెనో యెచ్చటనుఁ జెప్పఁబడి యుండలేదు. ఈ అస్త్రవిద్యా ప్రదర్శన సందర్భమున నామె ప్రత్యభిజ్ఞచేఁ గర్ణుని గుర్తించుట వ్యక్తము చేయఁ బడినది. నన్నయ యీ సందర్భమునఁ గుంతి కధికమైన ప్రాధాన్య మొసంగెను. విద్యా ప్రదర్శనమును జూచు వేడ్క నరుదెంచిన స్త్రీల నందఱ నాతఁ డొక పద్యమున వర్ణించి (6-5) కుంతికిఁ బ్రత్యేకముగా నొక పద్యము (6-6) వ్రాసెను. కర్ణార్జునులు పోరు సంధర్భమునఁ గుంతి మోహ మూర్ఛాన్విత కాఁగా విదురుఁ డతి శీతల చందనోదకాసేకములచే నామెను బ్రత్యాగతజీవిత నొనరించుట వర్ణింపఁబడినది. చివరఁ గల

"కుంతి యంతసహజ కుండల కవచాభిరాముఁ గర్ణుఁ జూచి రవిసమానుఁ
బ్రత్యభిజ్ఞ నెఱిఁగి ప్రథమపుత్రస్నేహ మెఱుకపడకయుండ వింతియుండె"
(ఆది. 6-61)

అను పద్య మీ విషయమునకు నన్నయ యెంత ప్రాధాన్య మిచ్చెనో వ్యక్తము చేయుచున్నది.

సభాపర్వమున నన్నయ కథారంభవిస్తరణోపసంహరణములను జక్కఁగా నిర్వహించెను. సభా పర్వమున కా పేరు సార్థకమైనది. కృతజ్ఞుఁ డైన మయుఁ డపూర్వమైన యొక సభను నిర్మించి పాండవుల కిచ్చుట యిందు మొదట వర్ణింపఁబడినది. నారదుఁ డరుదెంచి దివ్య సభలను వర్ణించి ధర్మరాజునకు రాజసూయయాగాచరణ బుద్ధిని కలిగించెను. ధర్మజుఁ డా సభయందే రాజసూయ మొనరించెను. అప్పుడు చూచుటకు వచ్చి దుర్యోధనుఁడు పాండవ వైభవము హృదయతాపము కలిగింప నీర్ష్యాళువై దాని నపహరింప నిశ్చయించెను. ధృతరాష్ట్రుఁ డాతని నోదార్చుటకై యింకొక సభను నిర్మింపఁ జేసెను. దుర్యోధనుఁ డా సభయందు జూదమున ధర్మజు నోడించెను ఆ సభయందే ద్రౌపదీ వస్త్రాపహరణము, పునర్ద్యూతము జరిగెను. ఆ సభనుండియే పాండవులు ద్రౌపదీసహితులై యరణ్యమున కరిగిరి. ఇట్లీ పర్వమునందలి రెండాశ్వసములందు రెండు సభలు కథాంశములకెల్ల నాధారములై వస్త్వైక్యమును సంఘటించుచున్నవి. అగ్నిభయమునుండి రక్షితుఁడైన మయుఁ డపూర్వమైన సభను నిర్మించి యిచ్చుట యాది సభాపర్వములకును, జూదమున నోడిన పాండవులు వనమున కరుగుట సభారణ్య పర్వములకును గల సంబంధమును జక్కఁగా వ్యక్తము చేయుచున్నవి.

నలోపాఖ్యానమునఁ గథావస్తు విభజనము సుస్పష్టముగాఁ గానిపించును. 1. హంసదౌత్యము- 2. నలదౌత్యము- స్వయంవరము. 3. నల పుష్కరుల ద్యూతము- 4. వనగమనము- 5. పునస్సమాగమము- 6. రాజ్య సంపాదనము రాజై దమయంతీ బద్ధచేతస్కుఁడై యుండిన నలునితో నారంభించుచున్న కథ యాతఁడు దమయంతీ పునస్సమాగమము నొంది మరల రాజ్యము సంపాదించుటతో ముగియుచున్నది. మధ్య వనగమనము, వియోగ దశలో నలదమయంతులు పొందిన యిడుమలు వర్ణింపఁబడినవి. ఈ కథ వస్త్వైక్యముతోడను వివిధ సంధుల తోడనుఁగూడి కథా నిర్మాణ శిల్పమును జక్కఁగా వ్యక్తముచేయు చున్నది. ఇట్లే నన్నయ ప్రతి కథయందలి వస్తువును లెస్సగాఁ బరిశీలించి దాని యారంభాంతరావసానములను సముచితముగా సంఘటించు చుండును.

నన్నయ కథాంశముల నన్నిటిని వాచ్యముగా వెల్లడింపఁడు. అందలి కొన్ని విషయముల నాతఁడు పాఠకుల యూహకు వదలి పెట్టును. ఆతఁడు కథ చెప్పుచు జరిగిన యంశములేవో కొన్ని వివరించును అట్లు జరుగుటకు హేతువేమో యాతఁడు సూచింపఁడు. వానిని బరిత యూహించుకొన వలెను. ఆతఁడు చెప్పిన వృత్తాంతమును, బరిత యూహయుఁ గూడినచోఁ గథ కొక సమగ్రత్వమేర్పడును. ఇట్లు కథను వ్యంగ్యముగా నడపు పద్ధతి నన్నయ కథానిర్మాణమునఁ బ్రదర్శించు గొప్ప శిల్పరహస్యములలో నొకటి. అది ప్రతి క్షణము పరిత నవహితునిగా నొనర్చి ఆలోచనా నిమగ్నునిఁ గావించును. ఇట్టి వ్యంగ్యమైన కథా కథన పద్ధతి ప్రసన్నతకు భంగము కలిగింపదా ? యను సందేహము పొడమవచ్చును. వ్యంగ్యార్థము స్ఫురించనిచో నయోమయముగా నుండును. పరిత దానిని భావింపఁ జాలినచో నది ద్విగుణితమైన యానందము నొసంగి విషయమున కెంతో ప్రసన్నత చేకూర్చును. ఆ ధ్వని వ్యక్తమగుటకు నన్నయ చక్కని యాధారము లొసంగు చుండును. ఆ యాధారములను బట్టి వెనుక కూహించినచోఁ గథ సుస్పష్ట మూర్తితో సాక్షాత్కరించి యానందా వహము కాఁజాలును.

(౧) ద్యూతానంతరము ధృతరాష్ట్రుఁడు సకల బాంధవులకు హితము చేయఁదలఁచి ద్రౌపదిని రావించి నీకిష్టమైనది కోరుకొమ్మనియడిగెను. ఆమెరెండు వరములు కోరుకొనెను. ధృతరాష్ట్రుఁ డనుజసహితుఁడైన యుధిష్ఠిరు రావించి "నీవు సర్వసంపదలు స్వరాజ్యంబును నొప్పుగొని యెప్పటియట్ల యింద్ర ప్రస్థంబున కరిగి సుఖంబుండు" మని పంచెను. దాని నంతయు భీమసేనుండు విని "పాండవులకు రాజ్యసంప్రాప్తి సతికారణమున నగుట కెంతయో కలు షించి శత్రువులఁ జంపి కుతల రాజ్యమెల్లఁ గొందు నని యుద్యమించెను. ధృత రాష్ట్రుఁ డనుజసహితుఁడైన ధర్మజుని రావించె నని పైని చెప్పఁబడినది. కాని యా సమయమున భీముఁ డున్నట్లు తోఁపదు. ఆఁతడే యున్నచో ధృత రాష్ట్రుఁడు చెప్పిన మాటల ప్రత్యక్షముగా నెఱిఁగి యప్పుడే ప్రతిఘటించి యుండును. అందుచేతనే నన్నయ "దాని నంతయు భీమసేనుండు విని" యని వ్రాసియుండెను. ఇందలి "విని" యను పదమువలనఁ బై యర్థము స్ఫురించు చున్నది. ఆ సమయమున దుర్యోధనుఁడు కూడ నచ్చట లేకుండెను ఆతఁ డున్నచో ధృతరాష్ట్రుఁడు పాండవులకు మరల రాజ్య మిచ్చుట జరుగదు ధృత రాష్ట్రుఁడు సకల బాంధవ హితము చేయఁ గోరి కుమారుఁ డెఱుగఁ కుండనే యా

కార్యము నెఱవేర్చెను. అందుచేతనే నన్నయ ధర్మరా జనుజసహితుఁడై యింద్ర ప్రస్థమున కరిగిన పిమ్మట "దుశ్శాసనుచేత నంత వృత్తాంతంబు విని" యని వ్రాసియుండెను. ఇచ్చటి విని యను మాటచే రాజ్యప్రదాన సమయము దుర్యోధనుఁడు లేమి ధ్వనిత మగుచున్నది. ధృతరాష్ట్రుఁడు ద్రౌపదిని రావించిన వరము లిచ్చుటకుఁ గారణము "సకల బాంధవ హితము సేయఁ గోరుట". ఈ మాట వలన ద్యూతానంతరము బంధువు లే మనుకొనుచుండిరో వ్యక్త మగు చున్నది. సుహృద్ద్యూతమునకు రమ్మని పాండవులను బిల్చి కౌరవులందు వారి నోడించుటయే కాక "పరమ పతివ్రతన్, సభఁ దపస్విని, బాండవ ధర్మపత్ని, ధర్మరత, నయోనిజం, బ్రకృతి మానవ భామినిఁగాఁ దలంచి" యవమానించుటఁ జూచి బంధువు లెల్లరు దుఃఖించిరి. వా రా సమయమున సభలో నెవ్వరు నేమి యనకపోయినను మిక్కిలి యసహ్యించుకొనిరి. బంధువులందుఁ గలిగిన యీ వైముఖ్యమును దొలఁగించి వారికి హితము గావించుట కొఱకే ధృతరాష్ట్రుఁ డట్లు చేసెను.

(b) సభాపర్వాంతమున భీముఁడు మూఁడు సార్లు కోపోద్రేకమును బ్రద ర్శించెను. దుశ్శాసనుఁడు ద్రౌపది వలువ లొల్చు నప్పు డాతఁడు "కోపరక్తాంత నయనుం డగుచు, నంతకాకారంబున దంత సందష్ట దారుణ ముఖుండై" యుద్ధమున దుశ్శాసనుని వధించి యాతని ఱొమ్ము నందలి నెత్తురు త్రావుదు నని ప్రతిన చేసెను. దుర్యోధనుఁడు ద్రౌపదిని తన తొడపైఁ గూర్చుండ రమ్మని సన్నచేసినప్పుడు భీముఁడు "లయ సమయ దండధర నిర్దయుఁడై" యుగ్ర రణాంతరమున దుర్యోధను తొడలు విఱుఁగ నడఁతు నని ప్రతిన చేసెను. ద్రౌపది వలన పాండవులకు రాజ్యప్రాప్తి యయ్యె నని విని యాతఁడు కోప మూర్ఛిత రక్త నేత్రుఁడై యుగ్రసంగరంబున శత్రువులనెల్లఁ జంపి కుతల రాజ్య మెల్లఁ గొందు నని యుద్యమించెను. మొదటిసారి యాతఁడు ప్రతిన చేసి యూరకుండెను. రెండవసారి సర్వజన భయానక క్రోధావేశ వివశుఁడై యాయుధంబు లున్న వలనికి దృష్టులు సలుపుచు నగ్రజు మొగంబుఁ జూచు చుండెను. అప్పుడు భీష్మాదు లది కోపమున కవసరము కాదని యాతని వారించిరి. మూఁడవసారి భీముఁడు మృగమధ్యంబున నున్న సింహంబునుఁబోలె ననుజ మధ్యంబున విజృంభించెను. ధర్మరా జప్పు డాతనిఁ గరతలమున వారించెను. సభలో భార్య వలువ లొల్చి పరాభవించుట, అనుఁడు భార్యను దొడపైఁ గూర్చుండ రమ్మని సన్నచేయుట, స్త్రీ మూలమున రాజ్యము సంప్రాప్తించుట యనునవి వరుసగాఁ బై మూఁడు సందర్భములందును భీముఁ డాగ్రహము నొందు

టకు హేతువులు. సామాన్యదృష్టికీ మూఁడింటిలో మూడవ దాని కంటె రెండవది, రెండవదానికంటె మొదటిది యెక్కువ కోప కారణములుగాఁ గానిపించును. కాని భీముని కోపముయొక్క విజృంభణము వ్యతిరేక క్రమమున నుత్తరోత్త రాధిక ప్రజ్వలితమై కానిపించు చున్నది. మొదటిది సంఘాచారమునకు విరుద్ధము. రెండవది స్త్రీ పురుష సంబంధియైన శృంగార భావమునకు విరుద్ధము. మూఁడవది లోక ధర్మమునకు విరుద్ధము. పాండవులు ధర్మ నిష్ఠులు ధర్మ వ్యతిరేకమును వారు సహింపరు. ఆత్మార్జిత ముత్తమ మనియు, పిత్రార్జితము మధ్యమ మనియుఁ, భ్రాత్రార్జిత మధమ మనియు, స్త్రీ విత్త మధ మాధ మమనియు ధర్మము చెప్పుచున్నది. ధర్మ వైరుద్ధ్యము సంభవించుట చేతనే మూఁడవ సారి భీముని యాగ్రహ మితర సమయముల కంటె నుగ్రతర మగుట సంభవించెను. అదియునుఁ గాక మొదటి రెండు సందర్భము లందు భీముఁడు కార్యోన్ముఖు డగుటకు వీలు లేదు. అప్పు డతఁడు ద్యూతజితుఁడు, పరాధీనుడు ఆయుధోపయో గమునఁ గూడ నాతని కర్హత లేదు. ద్రౌపది ధృతరాష్ట్రుని వలనఁ బొందిన రెండవ వర మీ విషయమును వ్యక్తము చేయును. "ధర్మజు నలువురు తమ్ములుఁ దమ యాయుధముల తమ వర్మ వరూధమ్ములయుఁ దోడ దాస్యము వలనఁ బాయవలె" నని యా వరము. రాజ్యోపయోగమే కాక యాయుధోప యోగాధికారము కూడ భీమునకు స్త్రీ నిమిత్తముననే ప్రాప్తించెను. అతఁడు కోప ఘూర్ణిత రక్త నేత్రుఁడై కౌరవ విధ్వంసమునకు సిద్ధ మయ్యెను.

(c) పాండురాజు శత శృంగమున నున్నతఱి నొక్క యమవసనాఁడు మునులు స్వర్గమార్గము ననుసరించి బ్రహ్మను గొలువ నరుగు చుండిరి పాండు రాజు కూడ భార్యాద్వయ సమేతుఁడై వారి వెంట సమ విషమ ప్రదేశములఁ జన నారంభించెను. ఋషు లది చూచి

"వీర లతి లలిత మృదులాకారలు, గిరివిషమ గహన గహ్వరముల రానేరరు కావున నిట చనుదేరక నిలువుండ యివియు దేవ పథంబుల్"

(ఆది. 5-68)

అని వారించిరి. ఆ మాటలు విని పాండురాజు "స్వర్గద్వారం బనపత్యులు గాన నోప రటె మును లయ్యున్. అపుత్రస్య గతి ర్నాస్తి యను వేద వచనం బుం గలదు గావునత్తనే నపుత్రకుండ నేమి చేయుదు" నని దుఃఖించెను. ఋషులు పాండురాజు ననపత్యతం గూర్చి యేమియు ననలేదు. "అతి లలిత మృదులా

కారలైన కుంతీ మాద్రులు గిరి విషమ గహన గహ్వరములఁ రానేరరు. ఇవి దేవ పథములు. అందుచేత మీరు రాక నిలువుం " డని వారు చెప్పిన మాటలు. ఈ మాటలకును, పాండురాజు అనపత్యతను గూర్చి దుఃఖించుటకును సంబంధము కానిపించదు. కాని "లలిత మృదు లాకార లను పదములో సంతాన రాహిత్యము సూచించు నట్టియు " దేవ పథము " లను మాటలో ననపత్యులు స్వర్గమునకు రానర్హులు కా రనునట్టియు ధ్వని స్ఫురించు చున్నది. ఈ వ్యంగ్యమును భావించు నప్పుడే తరువాతఁ బాండురాజు పొందిన యనపత్యతా నిమిత్తమైన దుఃఖమునకు హేతువు కనిపించును.

(d) కద్రువకు వేవురు నాగముఖ్యులు పుట్టిరి. వినతా గర్భాండములు రెంటి నుండియు నందనులు వెలువడరైరి. అప్పు " డతి లజ్జావనత యయి వినత పుత్రార్థిని యొక యండంబు విగత ధృతి " నవియించెను. కద్రూ వినతలు పుత్రార్థినులై సహస్ర వర్షములు కశ్యపు నారాధించిరి. కద్రువ అనలతేజులు, దీర్ఘ దేహులు, వినుత సత్త్వులు నైన వేవురు కుమారులను గోరెను. వినత వారి కంటెను బలాధికులైన వారినిఁ గోరెను. నన్నయ యట్లుచెప్పి యూరకుండెను. వినత కద్రూ పుత్త్రుల కంటె బలాధికులైన సుతులను గోరు కొనుటకును, విగత ధృతియై యొక యండంబు నవియించుటకునుఁ గారణము లూహింప వలెను. ఇచ్చట వ్యంగ్యమై యున్న కథను భావించుటకుఁ బై రెండు నన్నయ యిచ్చిన కీలకములు. కద్రూ వినతలలో కద్రువ గడుసుది. కపటాత్మురాలు. వినత సాత్త్వికురాలు; మాయ యెఱుఁగనిది. కశ్యపుని కిరువురును సమానముగా భార్యలే యయినను, గద్రువ చాతుర్యము కలదగుటచే వినతను లోఁబఱచుకొని యామెపై నధికారము నిర్వహించు చుండెను. గరుడుఁ డుదయించి యామెకు మ్రొక్కఁ బోఁగా నామె " నా కొడుకుల నెల్ల నెత్తుకొని క్రుమ్మరు చుండుమ. ఏమి పంచినన్ మడవక చేయు మీ వని "ప్రభుత్వ మేర్పడునట్లుగా సమర్పణము చేయుట యామె స్వభావమును వ్యక్తము చేయు చున్నది. ఇట్టి పరిస్థితులలో నామె యండములు మొదట నవిసి కుమారు లుదయించిరి. అప్పు డామె గర్వము మఱింత యధికమై యుండుటయు, వినత జీవితము దుర్భరమై యుండుటయు జరిగి యుండును. అందుచే వినత లజ్జావనతయు, విగత ధృతియు నై యొక యండము నవియించెను. ఇంటిలో నిట్టిపరిస్థితులు కొనసాగుచుండుటయే యామె కద్రూ పుత్త్రుల కంటెను బలాధికులైన వారిని గోరుకొనుటకు హేతువు. ఆ కొడుకులు కూడ బలహీను లయినచో నామె గతి వేఱ యడుగ నక్కఱ లేదు.

వారు బలాధికు లైనచో నామె స్థితి చక్కఁ బడును. గురు దోదయానంతర మామె "కొడుకులు సమర్థు లైనం దలిదండ్రుల యిడుమలు వాయుట యెందునుం గలయది" యని యనుట యిందుకుఁ దార్కాణము. పై రెండు మాటల వలన నన్నయ చెప్పియుండని యింత యర్థము వెల్లడి యగుచున్నది.

(c): దేవయానియు, శర్మిష్ఠయు జలక్రీడార్థమై సఖులతో నొక్క సరో వరమున కరిగిరి. వారు తమ తమ పరిధానంబులు తీరంబునఁ బెట్టి జలక్రీడ యొనరించుచుండఁగా సురకరువలి చేతం బ్రేరితంబులై యవి కలసిపోయెను. కన్యకలు కొలను వెలువడి యన్యోన్య పరిధానంబులు వీడ్వడం గట్టుకొను నెడ శర్మిష్ఠ దేవయాని పుట్టము కట్టుకొనెను. దేవయాని దాని పరిధానము పుచ్చు కొనక రోసి "నేను భూసురకన్యను, నీ కారాధ్యను. నీ కట్టిన మైల కట్ట నేర్తునా" యని పలెకెను. శర్మిష్ఠ "మీ తండ్రి మా యయ్యకుఁ బాయక పని చేయుచు దీవించి ప్రియము చేయుచుండును. ఆతని మహిమలు నా యొద్దనే పలుకుటకు నీకు సిగ్గులేదా" యని యెగ్గు లాడి దేవయాని నొక్క నూతఁ ద్రోచి నిజ నివాసమున కరిగెను. కొంతసేపటికి వేఁటకై వచ్చి యలసిన యయాతి జల మపేక్షించి యచ్చట విశ్రమించి చూచెను. చెఱు వచ్చటికి సమీపముననే యుండినచో నతఁడు జలపానమునకై నూతికి రాక యచ్చటికే యరిగి యుండును. దీనిని బట్టి చెఱు వా నూతికిఁ గొంత దవ్వుననే యుండె నని తెలియుచున్నది. దేవయాని శర్మిష్ఠ పుట్టము పుచ్చుకొనలే దని నన్నయ చెప్పుచున్నాఁడు. మఱి యామె చెఱువునుండి నూతి వఱకు నెట్లు వచ్చెను? వివస్త్రయై వచ్చెనా ? ఈ విషయము నన్నయ చెప్పలేదు పాఠకుఁ డూహింప వలెను. ఆమె వివస్త్రయై వచ్చుట యసహజము ఆమె విధిలేక శర్మిష్ఠ చీరయైనఁ గట్టుకొని యుండవలయును. లేదా యామె పట్టుదల చూచి శర్మిష్ఠ తాను గట్టుకొనిన యామె చీర నామె కిచ్చియైన నుండవలయును. బహుశః రెండవదే జరిగియుండును. శర్మిష్ఠ దేవయానిని నూతఁ ద్రోచిన పిమ్మట నేమయ్యెను ? ఆ నూయి యెట్టిది ? అది పాడునూయి. అందు నీరు లేదు. లతలు కూడఁ బెరిఁగి యుండెను. శర్మిష్ఠ యామె నందుఁ ద్రోయుట యవమానించుటకే కాని చంపుటకుఁ గాదు అందుఁ బడినవారు లతల సాయమునఁ బైకి రావచ్చును. అందుచేతనే శర్మిష్ఠ యామె నందుఁ ద్రోసియు నిశ్చింతగా నింటి కరుగఁ జాలెను. దేవయాని యెట్లో పైకివచ్చి పిమ్మట నింటి కరుదెంచు నని యామె భావించెను.

కాని దేవయాని యట్లు చేయలేదు. విలసత్కూప ఘనవల్లి యన్నిష్టసఖి నూది యా కూపముననే యుండిపోయెను. తా నా నూతిలోఁ ద్రోయఁ బడె ననుటకు సాక్ష్య ముండవలయును అందుచేతనే యామె యందుండి తన సమీపమునకు జనుల యాగమనంబు పన్నుగాఁ గోరుచుండెను. ఆమె గురుకుచయుగముపై బరువకిఁ దొరఁగెడు కన్నీరు పూరించుచుండెను. ఏల? నూతిలోఁ జనిపోదు నని భయముచేఁ గాదు. తన తండ్రి యనుగ్రహమున వైరుల జయించి వైభవముగా రాజ్య మేలుచున్న వృషపర్వుని కూఁతురు. కొండు కయది. త న్నట్లు నూతఁ ద్రోపెనే యను నభిమానము చేత. పై కథా భాగమున నన్నయ యీ యర్థ మంతయు ధ్వనింపఁ జేయుచున్నాఁడు.

నన్నయ ధ్వనిపూర్వకములుగాఁ గథను నడపించిన యిట్టి పట్టు లెన్నో యున్నవి. విస్తరభీతిచే వాని నిచ్చట వివరించుట లేదు. కథాకథనమున నాతఁ డవలంబించిన ప్రశస్త పద్ధతులలో నిదియొక్కటి. దీని గథా (వస్తు) ధ్వని యని యనవచ్చును. ఇది యాతని కథల కెంతయో వన్నె చేకూర్చుచున్నది

నన్నయ కథ రచించుచుఁ బోవునపు డెచ్చట నే పాత్రకు నే సంఘటనకు నెంత ప్రాధాన్యము కలదో నిర్దేశించి యా పాత్రకు నా సంఘటనకు నచ్చట నంత ప్రాధాన్య మొసంగుచు, నా విషయము పరిత గ్రహించుటకు వీలుగా దానిని నొక్కి చెప్పుచుండును.

(౨) పాండవ కౌరవ విరోధమునకుఁ బ్రధాన కారణ మైనది ద్యూతము; తత్పర్యవసాన మైనది ద్రౌపదీ పరాభవము. ఈ ఘట్టమున ద్రౌపది కమిత మైన ప్రాధాన్య మున్నది. ద్యూత కథాద్యంతములందుఁ దదనుగుణముగనే నన్నయ యామెను గేంద్రముగాఁ జేసి వర్ణించి యున్నాఁడు. ధృతరాష్ట్రుని పంపున విదురుఁ డింద్రప్రస్థమున కేగి ద్యూతమునకై ధర్మరాజాదులను గొనివచ్చెను. హస్తినాపురిని జేరినపిమ్మట ధర్మజుఁ డనుజసహితుఁడై భీష్మధృతరాష్ట్రాదుల దర్శించి వారికి వినయమున నమస్కరించెను. ద్రౌపదియు స్నుషాపరివృతయై యున్న గాంధారిని దర్శించి యామెకు మ్రొక్కెను. అప్పుడు గాంధారి కోడం డ్రెల్ల నామెను గాంచి "అఖిల లావణ్య పుంజంబు నబ్జభవుఁడు మెలఁతఁగా దీని యందు నిర్మించె నొక్కొ కాని నాఁ డిట్టి కాంతి యే కాంతలందు నేల లే దని సామర్షహృదయ లైరి." (సభా. 2-160) ద్రౌపది కాంతి లావణ్యముల నారసి వారు విస్మయామర్షములను బొందిరి. వారు భర్తలతో

నేమి చెప్పెనో మనకు తెలియదు. ద్యూతానంతరము ద్రౌపది నిండుసభలో వలువ లొల్వఁబడి పరాభవింపఁబడెను. అప్పుడు కొన్ని మహోత్పాతములు పుట్టెను. బంధువు లెల్లరుఁ గౌరవుల దౌర్జన్యమున కెంతయుఁ గంటగించు కొనిరి. ధృతరాష్ట్రుఁడు వారికి హితము చేయ నెంచి, ద్రౌపదిని బిల్చి, వర ప్రదాన మిషమున ధర్మజునకు రాజ్యము సమర్పించెను. ఈ విధముగాఁ బరా భవము నొందినదియుఁ బాండవులకు రాజ్యము నిప్పించినదియు ద్రౌపదియే. ధృతరాష్ట్రుఁడు ధర్మజునకు రాజ్యమును సమర్పించిన పిమ్మట నన్నయ

"తరుణి ద్రౌపది యిట్లు పాండవ ధార్తరాష్ట్రుల దైన భీ
కర పరస్పర కోపవేగము గ్రన్నఁ బాచి విపత్తి సా
గర నిమగ్నుల నుద్ధరించెఁ బ్రకాశకీర్తుల ధీరులం
బురుషసింహములన్ నిజేశులఁ బూని తద్దయుఁ బ్రీతితోన్".

(సభా. 2.268)

అని ద్రౌపదిని గూర్చి వ్రాసెను. ద్యూతాద్యంతములందుఁ గల యీ రెండు పద్య ములను సమన్వయించి చూచినచో నీ ఘట్టమున ద్రౌపది కెంత ప్రాధాన్య మొసంగఁ బడెనో తెలియ వచ్చును.

(b) దుష్యంతుఁడు కణ్వుని యాశ్రమమున కరిగి శకుంతలను గాంచి సంచలిత హృదయుఁడై నీ వెవ్వరి కూఁతుర విట్టి రూప లావణ్య విలాస విభ్రమ గుణసుందరి విట్లేల వచ్చితి వనియడిగెను. ఆమె తాను గణ్వు నాత్మజ నని బదులు చెప్పెను. అప్పుడు దుష్యంతుఁడు.

"ఇది మునికన్య యేని మఱి యేలొకొ యీ లలితాంగి యందు నా
హృదయము దద్దయుం దవిలె నిప్పలు కింకను నమ్మనేర న
య్యెద విజితేంద్రియుం డనఁగ నిమ్మునిఁ బాయక యిందు నుందుఁదా
నిది కల రూ పెఱుంగ....... .........................." (ఆది. 4.30)

నాత్మలో నుత్సుకుఁ డయ్యెను. అతఁడు చూచి చూడక మునుపే శకుంతల రూపలావణ్య విలాస విభ్రమములచే నాకర్షింపఁ బడెను. ఆమె కణ్వుని కూఁతు రని వినుటతోడనే ప్రేమ శృంగారములకు సంబంధించిన యాతని భావములకు విరోధము సంభవించెను. ఆమె చెప్పినదే నిజమైనచో నాతఁడు తన శృంగార సమారంభమును గట్టిపెట్టి వెనుదిరిగి పోవలసినదే."నేను గణ్వుని కూఁతుర నని శకుంతల చెప్పిన మాట యిచ్చట కథా ప్రవాహమున కడ్డుకట్ట

యయ్యెను. కాని దుష్యంతునకుఁ దన యంతరంగ ప్రవృత్తియం దమితమైన విశ్వాసము. మునికన్య యందుఁ దన హృదయము దగుల దని యాతఁ డెఱుంగును. ఆ విశ్వాసముచేఁ బ్రేరితుఁడై యాతఁ డూర్ధ్వరేతుఁ డైన కణ్వుని కెట్లు కూఁతుర వైతి వని యామెను బ్రశ్నించెను. ఆమె తన జన్మవృత్తాంతము నెఱింగించెను. దీనితో నిల్చిపోయిన కథ మరల నారంభించుచున్నది.

"ఇది మునినాథకన్య యని యెంతయు నిస్పృహవృత్తి నున్న నా
హృదయము రాజపుత్త్రి నని యిక్కమలాక్షి వి జాభి జాత్య సం
పద నెఱిఁగించినన్ మదన బాణపరంపర కిప్పు డుండె నా
స్పదమయి సంచలించె నళిపాత వికంపిత పంకజాకృతిన్."

(ఆది. 4-50)

అని దుష్యంతుఁడు మదనాతురుం డయ్యెను. పైని పేర్కొనఁ బడిన రెండు పద్యములను గొంచె మించుమించుగా నొకేమాదిరిగా నారంభించు చున్నవి. ఇవి యచ్చటి కథాప్రవాహముపైఁ గట్టఁబడిన వంతెన కటు నిటుఁగల సమాన రూపము లైన యాధార స్తంభముల వలె నున్నవి. ఈ పద్యముల నిట్లు వ్రాయుట నన్నయ కథాకథన శిల్పమును జక్కఁగాఁ జాటుచున్నది. ఈ రచన యాదృచ్ఛికమైనది కాదు. బుద్ధిపూర్వకముగాఁ జేయవలె నని చేసినట్టిదే.

నన్నయ కథ చెప్పుచు నా యా ఘట్టములందుఁ గొన్ని వాక్యములకుఁ గొన్ని పదములకు నమితమైన ప్రాముఖ్యము కల్పించుచుండును. అవి యా యా ఘట్టముల కాయువుపట్టు లైన వగుటచే వాని నాతఁడు రెండుమూఁడు సారులు పునరుక్త మొనరించుచుఁ బఠితహృదయము నాకర్షించునట్లుగా నొక్కి చెప్పుచుండును. ఆ పదములను, వాక్యములను సరిగా నవగాహనము చేసికొన్నచో మన కచ్చటి కథాసందర్భము చక్కఁగా వ్యక్త మగుచుండును.

(a) అంగదేశమునఁ గలిగిన యనావృష్టిని దొలఁగించుటకై ఋశ్యశృంగు నచ్చటికి రప్పింప వలె నని బ్రాహ్మణులు రోమపాదుని కెఱిఁగించిరి. రోమపాదుఁ డప్పుడు బుద్ధిమంతులతో విచారించి విదగ్ధవేశ్యాంగనలఁ బిలువఁ బంచి మీ నేర్పు విధంబున ఋశ్యశృంగుఁ బ్రబోధించి యిటఁ దోడ్కొని రండని పంచెను. రాజాజ్ఞ తలఁదాల్చి వేశ్యలు ఋశ్యశృంగు నాశ్రమమున కరిగిరి. విభాండకుఁ డాశ్రమమున లేని సమయమున నొక్క జరద్వేశ్య

యభినవ యౌవనవిలాసిని యైన తన కూఁతు ఋశ్యశృంగుని కడ కంపెను. అది ఋశ్యశృంగునిచే సత్కరింపఁ బడి యాతనిఁ దమ యాశ్రమమునకు రమ్మని పిలిచెను. పిమ్మట నామె కందుక నర్తన మృదు గీతములందుఁ దనకుఁ గల కౌశల మెల్లను జూపి మునిపతికి ముదము గావించెను. ఇది యామె కావించిన ప్రబోధమునందలి మొదటిమెట్టు. ఇచ్చట నన్నయ ''ఇట్లు ఋశ్య శృంగుఁ బ్రబోధించి వేశ్యాపుత్రి యరిగె" నని 'ప్రబోధించి' యనుమాటను మరల వాడెను. ఋశ్యశృంగుఁ డా వేశ్య పోయిన వలను చూచుచు నగ్నిహోత్రంబు వేల్వక విపరీతబుద్ధియై యుండెను విభాండకుఁడు వచ్చి యాతని యనవధాన మునకుఁ గారణ మడిగెను. ఋశ్యశృంగుఁ డంతయుఁ జెప్పెను. కొడుకు పలుకులు విని విభాండకుఁడు విస్మితుఁడై "తపస్వుల తపంబులకు విఘ్నంబులు సేయ ననేకరూపు లయి రాక్షసులు వనంబునం గ్రుమ్మరుచుందురు. తజ్జన దత్తంబులైన పానీయంబు లపేయంబు లతిసుగంధులైన కుసుమంబులు మును లకు వర్జనీయంబు లని కొడుకుం "బ్రబోధించి" యెప్పటియట్ల వన్యఫలంబులు తేర నరిగెను." ఇచ్చట మరలఁ 'బ్రబోధించి' యనుపదము వాడఁబడినది. తండ్రి కావించిన యీ ప్రబోధము వేశ్య కావించిన ప్రబోధమునకు వ్యతిరేక మైనది. మొదటిది ప్రవృత్తికిని రెండవది నివృత్తికినిఁ బ్రబోధములు. తండ్రిలేని సమయమున మరల నా వేశ్య ఋశ్యశృంగుని దర్శించి "యాతని చిత్తమునకు వైకృతము చేసెను. ఇది యామె కావించిన ప్రబోధమునకు రెండవ మెట్టు. ఆ ప్రబోధము ఫలించెను. ఋశ్యశృంగుఁడు విలాసినీ మోహితుఁడై తండ్రి కెఱింగింపక సచ్చరిత్రం బైన తన యాశ్రమంబు విడిచి యక్కోమలి పిఱుందం జని యంగదేశమున కరిగెను. ఈ కథకుఁ "బ్రబోధించు, ముదముకావించు, వైకృతముచేయు" అను పదములు ప్రాణభూతము లైనవి. ఇతర విషయ మెంతయున్నను కథయంతయు వాని మీఁదనే నడచినది. ఇట్లు పదములను బ్రయోగించుట నన్నయ కథాకథనశిల్పమున నొకవిధము.

(b) యయాతి నూతనున్న దేవయానిని జూచి "నీ వెవ్వరి దానవు. ఏకతంబ యీ విపినాంతరమున నేల యున్నదాన"వని యడిగెను. ఆమె తాను భార్గవుకూఁతుర ననియుఁ బ్రమాదవశంబున నానూతఁబడి వెల్వడకుండెననియుఁ దెల్పి నన్నుద్ధరించి రక్షింపు మని వేఁడెను. యయాతి యామెను నూతినుండి పైకిఁదిగిచెను. పిమ్మట నన్నయ "ఇట్లు దేవయాని నుద్ధరించి యయాతి

విజపురంబున కరిగె నని వ్రాసియుండెను. ఇచ్చట" నన్నయ "ఉద్ధరించి"యను పదమునకుఁ బ్రాధాన్య మొసంగెను. మూలమునం దీ సందర్భమున మొదట "సముద్ధర గృహీత్వా మాం,కులీనస్త్వం హి మేమతిః'(అధ్యా. 78–21)అనియు, "ఉద్ధృత్య చైనాం తరసా తస్మా త్కూపా న్నరాధిపః" (78–23) అనియు వ్రాయఁబడియున్నది. అచ్చటఁగూడ నా ధాతువే వాడఁబడియున్నది. ధృ–హృ – అను ధాతువులకు 'ఉత్' అను ఉపసర్గ చేర్చినచో 'ఉద్ధృ' అను రూప మేర్పడును. దీనికిఁ బైకెత్తుట, వెల్వరించుట మొదలగు నర్థము లెన్నో యున్నవి. ఇచ్చట ఉద్వహనార్థము లేకపోయినను ఆ ధ్వని యున్నదనుటలో సందేహములేదు. దేవయాని కచుఁడు తనకొసంగిన శాపమెఱుంగును ఆ వచ్చిన వాఁడు యయాతి మహారా జని యెఱుంగును. అతఁడు తన్ను వివాహ మాడినచోఁ గచుని శాపము ఫలించును; తనకు గౌరవ సహితమైన స్థితియుఁ జేకూరును. అందుచే నామె యాతనిఁ దన్నుద్ధరించి రక్షింపు మని వేఁడుకొన్నది యయాతి కుడిచేతితో నామె కరాబ్జము పట్టుకొని నూతినుండి వెల్వరించెను. ఒక విధముగా నిచ్చటఁ బాణిగ్రహణము జరిగెను. యయాతి రెండవసారి కనఁబడినప్పుడు దేవయాని యాతనితో

> "నిగ్రహమేది నన్ను ధరణీవర ! కూపము వెల్వరించు నాఁ
> డుగ్రమయూఖ సాక్ష్యముగ నున్నత దక్షిణ పాణిఁజేసి భూ
> పాగ్రణి ! నాదు దక్షిణ కరాబ్జము వట్టితి కాన మున్నపా
> ణిగ్రహణంబుఁ జేసి ... ... ... ... ... ... ... ." (ఆది. 3–160)

తని చెప్పిన పల్కులను దృష్టియం దిడుకొని చూచినచో పై 'ఉద్ధరించి' యను పదమునందలి ధ్వని సువ్యక్తము కాఁగలదు

(c) గాంధారీ వృత్తాంత మైదాఱు పద్యములతో గూడిన చిన్న వృత్తాంతము. దీనిని చెప్పుటలో నన్నయ యెంతో మెలఁకువ ప్రదర్శించెను. ఆరూఢ యౌవనుఁడైన ధృతరాష్ట్రుఁడు రాజ్యము చేయుచుండఁగా భీష్ముఁడు గాంధార పతియైన సుబలు కూఁతు రతిశయ రూపలావణ్య శీలాభిజాత్య సమన్విత యనియు, నేకశతసుతులఁ బడయ హరుచే వరము గాంచెననియు నెఱింగి యామెను ధృతరాష్ట్రునకు వివాహము చేయఁదలఁచి ముదుసళ్ళను సుబలునికడ కంపెను. సుబలుఁడు వారి మాటలు విని "కురుకుల విస్తారకుం డైన ధృతరాష్ట్రుండ యిక్క

న్యకు నర్హుండు గావున నా రాజునకు గాంధారి నిచ్చితి" నని పలికెను. అతఁ డంధుఁడైన ధృతరాష్ట్రున కామె నీఁ గడంగుట బంధువుల కిష్టములేదు. వారు తమలో

"అంగములలోన మే లుత్తమాంగ మందు నుత్తమంబులు కన్నుల యుర్వి జనుల
కట్టికన్నులు లేవను టంతెకాక యుత్తముఁడు గాఁడె సద్గుణయుక్తి నతడు".
(ఆది. 5-11)

అని చెప్పుకొనిరి. ఇందు కొంత హేళనము కొంత అపహాస్యము కూడ నున్నవి. వా రా పల్కులు గాంధారి వినునట్లుగాఁ జెప్పుకొనిరి. గాంధారి యా మాటలు వినియు విముఖురాలు కాలేదు ఆమె తన్ను ధృతరాష్ట్రునకుఁ 'పితృ వచన దత్త'గా నిశ్చయించుకొని "నాకుఁ బతి యమ్మహీపతియకాని యొరు నొల్ల నని పరమపతివ్రత పరపురుషసందర్శనంబు పరిహరించి తన పతి కనుగుణంబుగా నేత్రపట్టంబుఁ గట్టుకొని యుండెను".

సుబలుఁడు నిరంకుశుఁడు అతని కెదు రాఁడువా రెవ్వరును లేరు. అందుచేతచే భీష్మప్రేరితులైన మునుసళ్ళ మాటలు విని యాతఁ "డా రాజునకు గాంధారి నిచ్చితి" నని నిశ్చయముగాఁ జెప్పవైచెను. ఇచ్చటి భూతకాలప్రయోగ మాతని నిశ్చయమును, నిరంకుశత్వమునుఁ దెలియఁజేయుచున్నది. బంధువులైన నాతని కెదు రాడు శక్తి కలవారు కారు. వా రతని పరోక్షమున గాంధారి విను నట్లుగాఁ దమ యుద్దేశమును వెలిబుచ్చిరి. గాంధారి యా మాటలు వినియుఁ దండ్రి తన్ను ధృతరాష్ట్రున కిచ్చెనుగావున నింకఁ జేయునది లేకయో, పితృ వచన గౌరవముచేతనో తన కాతఁడే పతి యని నిశ్చయించెను. బంధువు లామె యైన తండ్రితలంపున కడ్డు చూపు నేమో యని తలంచిరి. ఆ యింట సుబలుని శాసన మట్టిది. "ఆ రాజునకు గాంధారి నిచ్చితి", "బంధుజనములు తమలో నిట్లనిరి", "వారి పలుకులు విని గాంధారి పితృవచనదత్తగాఁ దన్ను నిశ్చయించి" అను వాక్యములపై నిచ్చటఁ గథయంతయు నడచినది.

నన్నయ కథ నంతను ఆ యా ఘట్టములు జరిగినప్రదేశములను బట్టి కొన్ని ముఖ్యభాగములుగా విభజించుచుండును. ఈ పద్ధతి సరిగా నాటకము లందలి రంగవిభజనమును బోలియుండును. కథ యొకరంగమునుండి యింకొక రంగమునకు మాఱుట నతఁడు "అట, ఇట, అంత నిక్కడ," అను పదమ్ము

లతో సూచించుచుండును. ప్రధాన కథాభాగమును ముఖ్యములైన కొన్ని యుపాఖ్యానములనుఁ జూచినచో నా విషయము తేటతెల్ల మగును.

(a) పాండవులు జననీసహితులై వారణావతంబున కరిగి లాక్షాగృహమున జాగరూకులై మెలఁగుచుండిరి. "అట హస్తినాపురంబున విదురుండు దుర్యోధనుని దుర్మంత్ర మంతయు నిమ్ముగా నెఱింగి విశ్వాసపాత్రుఁ డైన ఖనకుని బాండవులపాలికిఁ" బంచెను.

(b) బ్రహ్మ వసువులను శపించెను. వారు భూలోకమునఁ దమకు జన్మకారణముగా గంగనుఁ బ్రార్థించిరి. గంగ యంగీకారము చూపెను. "అని యిట్లు గంగావసువులు సమయంబుసేసికొని చని రంత నిక్కడ" (ఆది 4-131).

(c) కుంతి కర్ణుని గంగలో విడిచివైచెను. తరువాత నతనిని సూతుఁడు గ్రహించిన వృత్తాంతము చెప్పఁబడెను. ఇంకఁ గుంతీ వివాహకథ చెప్పవలయును. దానిని నన్నయ యిట్లు సూచించెను. "కర్ణుండు రాధేయుండై సూతగృహంబునఁ బెరుఁగుచుండె నంత నిట" (ఆది. 5-33).

(d) హస్తినాపురమున ధృతరాష్ట్రునకు గాంధారియందు దుర్యోధనాదులగు నూర్గురు పుత్త్రు లుదయించిరి. అప్పుడు దుర్నిమిత్తములు కలిగెను. విదురాదులు దుర్యోధను దూషించి కులము రక్షించుట పాడి యని ధృతరాష్ట్రుని కెఱింగించిరి. "పుత్త్రస్నేహమున నాతఁడా పలుకులను బెడచెవిని బెట్టెను. అంత నట శతశృంగమున" (ఆది. 5-112).

(e) నలుఁడు నిద్రించుచున్న దమయంతిని విడిచి యరిగెను పిమ్మట దమయంతి మేల్కాంచి నలునిఁ గానక దుఃఖించి పెక్కిడుములు పడి చేది పురముఁ జొచ్చెను. ఇంత వఱకును దమయంతి చరిత్ర చెప్పఁ బడినది. ఇంక నలుని చరిత్ర చెప్ప నారంభించుచు నన్నయ అట నలుండు దమయంతిం బాసి దారుణారణ్యములో నరుగువాఁడు ముందట" అని రంగము మార్పు సూచించెను.

(f) నలుఁ డయోధ్యాపురి కరిగి యట నశ్వశిక్షకుఁడై ప్రచ్ఛన్నముగాఁ గాలము పుచ్చుచుండెను. మరల కథ దమయంతి యున్న యెడకు మాఱినది. "ఇట్లయోధ్యా పురంబున బాహుక నామంబుతో నలుం డుండె నంత నిట విదర్భేశ్వరుండు" ఇత్యాదిగా నన్నయ యీ మార్పును సూచించెను. (అర. 2-137)

నాటకములందు కథలో Dramatic irony యనఁబడు నొకానొక చమ

త్కారము ప్రదర్శింపఁ బడుచుండును. సామాజికులకుఁ గథలో జరుగుచున్న వృత్తాంత మంతయుఁ దెలియు చుండును. కాని యొకప్పుడు రంగము మీఁద సంభాషించు పాత్రలు మాత్ర మొండొరుల నెఱుంగక తమ్ముఁ గూర్చియే ప్రసంగించు కొనుచుందురు. ఇట్టి సన్నివేశములు చమత్కార సహితములై సామాజికుల కెంతో యానందము నాపాదింపఁ జాలి యుండును. సమర్థులైన కవులు శ్రవ్య కావ్యములలోఁ గూడ నిట్టి చమత్కారమును బ్రదర్శించు చుందురు. నన్నయ కథలలో నిట్టి వెన్నో కానిపించు చుండును.

(a) యతిరూపమున నున్న యర్జునుని సుభద్ర " ఇంద్ర ప్రస్థపురంబు సూచితిరే. పాండుసుతు లందు సుఖంబున్న వారె. మా యత్త యంభోరుహాక్షి కుంతీ మహాదేవి కుశలమే. అమ్మ హావీరుఁ డర్జునుఁడు జితారి తీర్థ గమనోద్యతుండయ్యేఁ గ్రమ్మఱి వచ్చెనే యెఱుఁగుదురేని నా కెఱుఁగఁ జెప్పుఁ " డని యడిగియుండెను. ఆ యతి యర్జునుఁడే యని పాఠకు లెఱుఁగుదురు. సుభద్ర యెఱుఁగదు. ఇట్టి యెడ నాటకీయ చమత్కార ముత్పన్న మగుచుండును.

(b) భీముఁడు సౌగంధి కాపహరణమున కేగు నప్పుడు దారిలో నడ్డముగాఁ బండియున్న హనుమంతునితో "నాకుం దెరు వి మ్మీనినాఁడు దొల్లి శతయోజన విస్తారం బైన సముద్రంబు లంఘించి లంకకుం బోయిన హనుమంతు వట్ల నిన్ను నీ పర్వతంబు లంఘించి పోదు" నని పలుకుటయుఁ, దరువాత జరిగిన సంభాషణమునుఁ గూడ నిట్టి చమత్కారమునకుఁ దార్కాణము. తాను హనుమంతుని తోనే మాటాడుచున్నట్లు భీమునికిఁ దెలియదు. పాఠకుల కీ విషయము తెలియును. జరత్కారువు పితరులతో మాటాడు ఘట్టము కూడ నిట్టిదే.

(ఆది. ౨.'140-143)

నన్నయ కథలు వివరించుచు నచ్చటచ్చట ధ్వని పూర్వకముగా భావి కథాంశ సూచన మొనరించు చుండును. ఇట్టి దాతఁడు రచించిన భారతమున నాలుగైదు చోట్లఁ గావిపించును. మొదటఁ జదువు నప్పు డా సూచనలు సాధారణముగానే గోచరించును గాని సూక్ష్మముగాఁ బరిశీలించి నప్పు డందలి ధ్వని సువ్యక్తమై పాఠకుల కానందము కలిగించును.

(a) "ప్రల్లదుఁడైన యొక్క కులపాంసను చేసిన దానఁ దత్కులం
బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము............" (ఆది. 1-125)

ఇది యుదంకుఁడు జనమేజయునితోఁ దక్షకుని గూర్చి చెప్పిన మాట. ఆది పర్వ ప్రథమా శ్వాసముననే యున్నది. దుష్టుఁడైన దుర్యోధనుని దౌర్జన్యముచేఁ గౌరవ కుల మెల్లను నాశనమై పోవునను కథావస్తు విందుఁ జక్కఁగా సూచింపఁ బడినది.

(b) కుమారాస్త్ర విద్యా ప్రదర్శన ఘట్టమున భీమ దుర్యోధనుల గదాయుద్ధ మును వర్ణించుచు నన్నయ యది " భావి పాండవ కౌరవ్య రణాభి సూచన పటిష్ఠంబయ్యె ఘోరాకృతిన్ " అని వర్ణించెను. నిజమున కా సమయమునకుఁ బాండవ కౌరవ యుద్ధము యొక్క ప్రసక్తియే లేదు. కాని దుర్యోధనుని యాలో చనలు చేష్టలును దానికిఁ ద్రోవఁ దీయుచుండెను. ఇచ్చట భీమ దుర్యోధనులు వినోదమునకై పోరుచున్నట్లు లేదు. వారి ప్రవృత్తి అతి మాత్సర్య పూరితమై యుండెను అది భావి పాండవ కౌరవ్య రణాభి సూచన పటిష్ఠమై యుండెను.

(c) దుశ్శాసనుఁడు ద్రౌపది వలువ లొల్చు సమయమున భీముఁడు "దద్విపుల వక్షశ్శైల రక్తౌఘ నిర్ఝరముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్" అని శపథము చేసెను. అట్లే దుర్యోధనుఁడు ద్రౌపదినిఁ దన తొడపైఁ గూర్చుండరమ్మని సన్నచేసి నప్పుడు "ఇద్దురాత్మ దుర్వార మదీయ బాహుపరివర్తిత చండగదాభిఘాత భగ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్" అని యాతఁడు ప్రతిన యొనరించెను. అడవి కరుగు సమయమున భీమాదు లొనరించిన ప్రతిజ్ఞలలోఁ గూడ రణప్రసక్తి యున్నది. "జగద్ద్రోహులఁ జంపుదు నత్యుగ్రాహవంబున," "మార్తురం దునుముదున్ సంగ్రామరంగబునన్," "అస్మత్సాయకజితహస్తుఁ జేసి చంపుదు మాజిన్", ఈ మాటలు కూడ భవిష్యత్కాలమున జరుగఁబోవు యుద్ధమును సూచించుచున్నవి.

(d) పాండవులు గజపురము వెలువడి యరుగునప్పుడు పెక్కు దుర్నిమిత్తము లుప్పతిల్లెను. అప్పుడు నారదుఁడు సభాంతరస్థితజను లెల్ల విను చుండ "పదునాలుగవ యేఁడు భారతాజియగు నపార వీరులైన పాండవులు జయం బందుదురు. భీమ మఘవ సుతుల విక్రమమున" నని పలికియుండెను. ఈ మాటలు భవిష్యద్భారతయుద్ధమును సూచ్యముగాఁ గాక వాచ్యముగానే వ్యక్తము చేయుచున్నవి.

(e) పాండవు లడవి కేగుచుఁ జేసిన కార్యముల వివరించుచు విదురుఁడు వాని యర్థమును వ్యాఖ్యానము చేయునప్పుడుకూడ భవిష్యద్భారతాజి సూచనయున్నది.

"సమరమున బాహుబలదర్పము మెఱయం గంటి ననుచు బాహు లతివిశా
లములుగఁ జేయుచు నరిగెను సమీరజుఁ డరాతిభీతిసంజననుండై"
(స. 2-304)

"భారతరణహతు లగు కురుశూరుల పరలోకవిధులు సూచించి క్రియా
పారగుఁడు ధౌమ్యుఁ డరిగె విచారజ్ఞుఁడు రౌద్రయామ సామోద్గీతిన్"
(స. 2-308)

వనగమన సమయమునఁ గూడ యుద్ధము తప్పక జరుగు నను నిశ్చయ మేమి యును లేదు. కాని దుర్యోధనునికి సహజమైన దౌష్ట్యము ధృతరాష్ట్రుని తత్ప రాధీనత, సభలో ద్రౌపదికిఁ జేయఁబడిన యవమానము, మున్నగు వానిని బురస్కరించుకొని వనవాసానంతరము యుద్ధ మెట్లును దప్పదని యంద అనుకొనియుందురు. ఆ విషయమునే నన్నయ పై పద్యములలో సూచించెను.

(f) నలుఁడు దమయంతీసహితుఁడై యడవి కరిగెను. వా రేక వస్త్రులై యందుఁ దిరుగుచుండిరి. అప్పుడు నలుఁడు దమయంతినిఁ జూచి

"ఇది దక్షిణాపథంబున కిదియు విదర్భాపురమున కిది కోసల కి
య్యది యుజ్జయినికిఁ దెరువులు మది నన్నిటిలోన నరుగ
మన కెద్దియగున్" (అర. 2-69)

అని యా యా దేశముల కరుగుమార్గములు తెలిపెను. ముందు నలుఁడు దమ యంతిని విడిచి వెళ్లఁ బోవుచున్నాఁడు. అప్పు డా గహనమున నామె దారి తెన్ను తెలియక క్లేశపడవలసివచ్చును. అందుచే నామె కా యా పట్టణములకుఁ బోవు మార్గములు తెలియుట మంచిది. మఱియు నామె తరువాత విదర్భా పురమున కేగి పుట్టినింట సుఖముగా నుండవలయు నని యతని యూహ. ఆ యూహచే నతఁ డామెకు మార్గము లన్నియుఁ దెలిపియుండెను.

ఆదిపర్వ ద్వితీయాశ్వాసమున జనమేజయుఁడు వైశంపాయనుని ''అస్మద్వంశకరుం డైన యయాతి చరితంబు వినవలతుం జెప్పు''మని యడిగెను. వైశంపాయనుఁడు యయాతి చరితము చెప్ప నారంభించుచు దాని కుపోద్ఘాత ముగాఁ గచదేవయానుల కథ మొదటఁ జెప్పి తరువాత యయాతి వృత్తాంత మును వివరించెను. అప్పుడు యయాతిని బ్రవేశపెట్టుచు నన్నయ "ఆ నహు షాత్మజుం డగు యయాతి" యని పద్యము నారంభించెను. ఇందలి 'ఆ' యయాతితోఁ బాఠకులకుఁ గల పూర్వపరిచయమును వ్యక్తము చేయుచున్నది.

ఈ పరిచయము జనమేజయుఁడు వైశంపాయనుని యయాతి చరిత్రము చెప్పు మని యడుగు నప్పటిది. ఈ పాత్రప్రవేశన పద్ధతి గంభీరమై రమణీయముగా నున్నది.

అరణ్యపర్వమునఁ బాండవుల వనవాస జీవితము వర్ణింపఁబడియున్నది. మొదటి రెండు పర్వములతోఁ బోల్చి చూచినచో నిందుఁ బాండవుల ప్రత్యక్ష జీవితమునకు సంబంధించిన వృత్తాంతము చాల తక్కువగాఁ గనిపించును. పలు విధములైన కథోపాఖ్యానములతో నీ పర్వ మంతయు నాక్రమింపఁబడియున్నది. ఇందుఁ బూర్వరాజులయు, ఋషులయుఁ, బతివ్రతలయుఁ జరిత్రములు, దీర్థ యాత్రల వర్ణనలు, నీతిధర్మతత్త్వవిషయముల వివరణములు, ప్రాచీనగాథలు కానిపించును. కొందఱు విమర్శకు లీ కథాదు లేవియు మూలరచనమున నుండి యుండ వనియుఁ, దరువాత నెవ్వరో వీని నందుఁ జేర్చియుందు రనియుఁ దలంచుచున్నారు. కాని మహాభారతేతిహాస నిర్మాణక్రమముఁ బురస్కరించు కొని చూచినచో నవి మూలప్రణాళికయందే యుండె ననియుఁ, దరువాతఁ జేర్పఁ బడినవి కా వనియుఁ, దెలియవచ్చును. "భారతమున నీతిధర్మాదులకుఁ గథోపా ఖ్యానాదులకు సంబంధించిన చాల భాగము కాలవ్యవధానమును గప్పిపుచ్చుటకై ప్రవేశపెట్టఁ బడినది. ఇట్టిది యరణ్యపర్వమునందును, భారతయుద్ధానంతర మందలి శాంత్యనుశాసనపర్వము లందును గనఁబడుచున్నది. కాలవ్యవధాన గోపనమునకై యిట్లు నీతికథోపాఖ్యా నాదులను బ్రవేశపెట్టు పద్ధతి కథనక్రమ మున కంతరాయమును గలిగింప కుండుటయేకాక సూక్ష్మవివరములతోఁ గూడిన కథాభాగమునకును, సత్వరముగా ముగించివేయఁబడిన కథాభాగమునకును గల ప్రతియోగమును (contrast) బాఠకులకు గనఁబడనీయకుండ బ్రముఖాంశ విరహితములైన వత్సరము లందలి వృత్తాంతమును గూడ నానందముతోఁ జదువుట కనువు కలిగించు ననియు, పాశ్చాత్యకవివరుఁ డైన హోమరు కూడ ముఖ్యాంశవిరహితమైన కాలముయొక్క గమనమును మఱుఁగుపఱుచుటకై సంభాషణములను, ఉపాఖ్యానములను దఱుచు ప్రవేశపెట్టుచుండు ననియు" పిసానీ యను విమర్శకుఁడు చెప్పిన విషయ మెంతయో సమంజసముగా నున్నది[1]. నన్నయ రచించిన యారణ్యపర్వభాగమునఁ గల 'కిరాతార్జునీయ

[1] The episodical matter in the Mahabharata is in general not secondarily introduced It belongs to the original plan and serves a distinct purpose. As Pisani has pointed out in his paper on the

కాలకేయ నివాతకవచ' వధ వృత్తాంతము లర్జునుని యతిలోకపరాక్రమమునకును 'సౌగంధికాపహరణము' భీముని ప్రియసాహసత్వమునకును. 'అజగరోపాఖ్యానము' ధర్మజుని ధర్మజ్ఞతకును.నిదర్శనములై యతిమనోహరములుగా నున్నవి. కృష్ణుఁడు చెప్పిన సౌంభకాఖ్యానము వీరరసపూరితమై యద్భుతముగా నున్నది. ఇంక నిందలి 'నలోపాఖ్యానము, ఋశ్యశృంగునికథ, సౌకన్యాఖ్యానము' అను కథలు భారతమునందలి యుపాఖ్యానముల కెల్లఁ దలమానికములై నన్నయ కథాకథన శిల్పమును వేయివిధముల వెల్లడిచేయుచున్నవి. వీనిని బాగుగా పరిశీలించినచో నన్నయ "ప్రసన్నకథాకలితార్థయుక్తి" యను సమాసము నెంత సార్థకముగా వాడెనో వ్యక్తము కాఁగలదు.

అక్షర రమ్యత :-

'ప్రసన్నకథాకలితార్థ యుక్తి' యను గుణము కావ్యమునందలి యర్థమునకు సంబంధించినది. అక్షర రమ్యత యనున దందలి శబ్దమునకు సంబంధించినది; మొదటిది బుద్ధిగ్రాహ్యము; రెండవది శ్రవణేంద్రియముద్వారా గ్రహింపఁదగినది. మొదటిది కావ్యముయొక్క యంతరంగమునుగూర్చి చెప్పును. రెండవది బహిరంగమును గూర్చి చెప్పును. మొదటిదానిని 'పాక' మనియు రెండవదానిని 'శయ్య' యనియుఁ జెప్పవచ్చును.

సంస్కృత లాక్షణికులలో శయ్యనుగూర్చి చెప్పిన వాఁ డొక్క విద్యానాథుఁడే. అతఁడు "యా పదానాం పరాన్యోన్యమైత్రీ శయ్యేతి కథ్యతే" యని శయ్యను నిర్వచించియుండెను 'పదమైత్రియే శయ్య' యని దానియర్థము.

rise of Mahabharata (Volume of Eastern and Indian studies presented to prof F. W. Thomas, 1939 Page 170 Intro. XIV) The bulk of the didactic and episodic matter has been used to fi l up the great temporal hiatus in the narrative, namely in the first place the twelve years of exile in forest (అరణ్య పర్వ) and the long interval between the end of the Bharata war and the last adventure of the Pandavas (శాంతి & అను శాసన) ' This distribution" remarks Pisani ' to fill up temporal hiatuses has not only the scope of not disturbing the course of narration but also that of helping the reader to pass over irrelevant years without striking against too strong a contrast between periods minutely narrated and others rapidly surpassed. In a not different manner Homer introduces often diologues and episodic stories when he must conceal the flowing of times w thout noteworthy events".

అర్థమును బట్టి యే పదమునైన నే పదము తరువాతనైనఁ గూర్పవచ్చు ననుట పొరపాటు. ఏ శబ్దముల తరువాత నే శబ్దములను వాడిన శ్రుతిసుభగముగా నుండునో గ్రహించి వాని న ట్లుచితరీతి వాడుచుండవలయును. అట్లు పొందిక గల పదములను వాడుటకే 'శయ్య' యని పేరు అదే అక్షర రమ్యత. పరివృత్త్యసహిష్ణువుగాఁ బదములను బ్రయోగించుట వలన నిది యేర్పడును. ఒకప్పుడు వాక్యముయొక్క కూర్పు మార్చినను ఒకపదమును దొలఁగించి దానిస్థానమునఁ బర్యాయపదమును వాడినను అర్థమంతయుఁ జెడిపోవుట సంభవించును పద ప్రయోగము నందలి యీ సౌష్ఠవమునే శయ్యయని చెప్పుచుందురు. ఆంగ్ల కవీంద్రుఁడైన Wordsworth కవిత్వమును నిర్వచించుచు "The choice of best words in best place" అని చెప్పుటయుఁ, బింగళి సూరన "పొసఁగ ము త్తెపుసరుల్ పోహళించిన రీతిఁ దమలోన దొరయు శబ్దములు గూర్చి" యని చెప్పుటయు నీ శయ్యను బురస్కరించుకొనియే.

అక్షర మనఁగా వర్ణము. వర్ణముల సముదాయము పదము. పదముల సముదాయము వాక్యము. వాక్యసముదాయము కావ్యము ఇవన్నియుఁ బరంపరగాఁ గావ్యముయొక్క సౌందర్యమునకు దోహద మొసంగు నట్టివే. విశిష్ట మగు కూర్పుగల యవయవసముదాయము శరీరసమష్టిసౌందర్యమును వలె విశిష్టవిన్యాసముతోఁ గూడిన పదసముదాయము కావ్యసమష్టిసౌందర్యమును బెంపొందించును. ఆ సౌందర్య మొక్కొక్క పద మున్నఁ బుష్టి నొందుటయు నది లేకున్న లోపించుటయు సహృదయు లెఱింగిన విషయమే. అందుచేఁ బదప్రయోగవిషయమునఁ గవి యత్యంతశ్రద్ధ వహింపవలయును. భామహుఁడీ విషయమునే

"మాలాకారో రచయతి యథా సాధు విజ్ఞాయ మాలాం
యోజ్యం కావ్యే ష్వవహితధియా తద్వ దేవాభిధానమ్."

అని చెప్పియుండెను.

అక్షరముల నన్నిటి నుచ్చరింప నప్పుడు వినఁబడు ధ్వనియంతయు నొక్కమాదిరిగా నుండదు. కొన్ని యక్షరములు పరుషములు; కొన్ని

1. Change the structure of the sentence, substitute one synonym for another and the whole effect is destroyed This felicity of expression of wodrs is what Sanskrit writers on poetics called మైత్రీ, శయ్యా or పాక (Trivedi on Bhamaha)

భండార్కరు స్మారక సంచిక పుట 403

పరశ్యములు. అన్ని యక్షరములు నన్ని రసములకు ననుగుణములుగా నుండవు. వర్ణములుకూడ రసవ్యంజకములే. ధ్వన్యాలోకమున

"శషౌసరేఫసంయోగౌ ఢకార శ్చాపి భూయసా
విరోధిన స్స్యుః శృంగారే తేన వర్ణా రసచ్యుతః
త ఏవ తు నివేశ్యన్తే బీభత్సాదౌ రసే యదా
తదా తం దీపయ న్త్యేవ తేన వర్ణా రసచ్యుతః." ధ్వ. 3-59, 60.

అని శ, ష వర్ణములును, రేఫసంయుక్తములైన క్ర, ప్ర, ట్ర మున్నగు వర్ణములును, ఢకారమును, శృంగారమునకు విరుద్ధము లగుటచే నా రసమును ప్రకాశింపఁ జేయఁ జాల వనియు నవే బీభత్సాదుల యందుఁ బ్రయోగింపఁబడి రసపుష్టిని గలిగించు' ననియుఁ జెప్పఁబడినది. పై శ్లోకములందు శృంగారపదము కరుణశాంతముల కుపలక్షకము. 'బీభత్సాదౌ' యందలి యాది పదము రౌద్ర వీరములను గూడ సూచించును. ఇట్లే యే యే వర్ణము లే యే గుణములను జక్కఁగాఁ దెలుపఁ జాలునో కావ్యప్రకాశమునఁ దెల్పఁబడి యున్నది. రీతులు గుణసమూహరూపములు. పరివృత్త్యసహిష్ణువుగా గుణములను సంకలనము చేయుటయే శయ్య యగును. దీనినే నన్నయ 'అక్షర రమ్యత' యని చెప్పినాఁడు. ఈ గుణము నన్నయ కవితయం దెల్లెడల గోచరించును.

"పతదుర్వీధర ధాతువిర్ఝరజలాభంబై మహాదేహ వి
గ్గత సాంద్రారుణపూర మొక్క మొగి నొల్కం బ్రెస్సి నారాయణో
న్నత దోర్దండ విముక్తచక్రవిహతిన్ నాకద్విషన్మస్తక
ప్రతతుల్ ఘోరరణంబునం బడియె భూభాగంబు గంపింపఁగన్"
(ఆది. ౨-24.)

ఇందలి 'ర్వీ, ర్ఝ, ద్వి, న్మ, ప్ర, ష' మొదలైన వర్ణము లోజోగుణమును సూచించుచున్నవి. వీరబీభత్సరౌద్రములందు రచన యోజోగుణభరితమై యుండవలయును ఈ రసములందు దీర్ఘసమాసయుక్తమైన రచన యింపుగా నుండును. ఒకానొకచో నసమాసయు నల్పసమాసయు నగు రచనకూడ నుండవచ్చును. "రౌద్రాదౌ మధ్యమ సమాసా సంఘటనా, కదాచి ద్ధీరోద్ధతనాయక సంబంధ వ్యాపారాశ్రయేణ దీర్ఘసమాసాపి వా" అని ధ్వన్యాలోకము చెప్పుచున్నది.

"గంగ నిజాంగ దీప్తులెసగం జనుదెంచి లతాంగి సాతతో
తుంగ పయోధర ద్వితయ... ... .. ..."

ఇచ్చట బిందువులు పిఱుందఁగల వర్ణముల కూర్పు సౌకుమార్య మను గుణమును సూచించు చున్నది.

"ఎందులదాన వేకతమ యియ్యమునా నది యొడరేవునన్
సుందరి నీకు నునికి యిది సూడఁగఁ దా నుచితంబె నావుడున్."

ఇది శంతనుఁడు యోజనగంధితోఁ బల్కిన పద్యము. ఇచ్చటి రసము శృంగారము. ఇది పై పద్యమునందలి మాధుర్యగుణముచేఁ జక్కఁగాఁ బ్రకాశించు చున్నది. దీర్ఘసమాసములు లేక సరసములగు పదములతోఁ గూడియున్నచో మాధుర్యగుణ మొప్పారును. "పృథక్పదత్వం మాధుర్యం" అని వామనుఁడు చెప్పిన నిర్వచనము.

"అన్న! సహదేవ! నీవును నన్నలతో నరిగె దయ్య యట యడవుల కీ
వున్నను నుతు లందఱు నిం దున్నట్టుల నాకుఁ జిత్త మూఱడి యుండున్.
స. ౨-288

ఈ పద్యముకూడ సమాసరహితమై మాధుర్యగుణముతోఁ గూడి యిచ్చట కరుణమును జక్కఁగా వ్యక్తము చేయుచున్నది

ప్రసిద్ధములైన పదములతోఁ గూడి యుండుట ప్రసాదగుణమునకు లక్షణము. (ప్రసిద్ధార్థపదత్వం యత్ స ప్రసాదో నిగద్యతే). వామనుఁడు కావ్యాలంకార సూత్రవృత్తిలో "శైథిల్యం ప్రసాదః" అని నిర్వచించి యది యోజో గుణమునకు విపర్యయ రూప మని తెలిపెను గుణవిపర్యయము దోష మగును గావున ప్రసాదము దోష మగునా యని శంకించి యతఁడు కేవల ప్రసాదము దోషమే యనియు, నోజోగుణ మిశ్రిత మైన ప్రసాదమే గుణ మనియు సిద్ధాంతము చేసెను. ఓజః ప్రసాదముల కలయిక మూఁడు విధములుగా నుండును. ఆ రెండు సమానముగా నుండుట, ప్రసాదముకంటె నోజ స్సధికముగా నుండుట, ఓజస్సు కంటెఁ బ్రసాద మధికముగా నుండుట.

"అలయక పుణ్య వ్రతములు
సలుపుచు సైరంధ్రి యనఁగఁ జైద్యేశు పురిన్
నలుదేవి యుండె నెదఁబతిఁ
దలఁచుచు దుస్సహవియోగతాపార్దిత యై."

(అర ౨-121)

ఈ పద్యమున నోజః ప్రసాద సామ్యము గలదు.

"ధారుణి రాజ్యసంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁజూచి రం
భోరునిజోరు దేశమున............................" (స.౨-247)

ఈ పద్యమునఁ బ్రసాదముకన్న నోజ స్సధికము.

"ఘనతర దైత్య దానవ నికాయ కళేబర పాదఘట్టనం
దనరి యుగాంత్యకాల చలితంబును బోలెఁ బయోధి మ్రోసె న
వ్వనధి రవంబుకంటె ననివారితమై చెలఁగెన్ మదీయ వా
హిని భటసింహనాద హయహేషిత సింధుర బృంహితధ్వనుల్." (అర. ౧-186)

ఈ పద్యమున నోజస్సుకంటెఁ బ్రసాద మధికము.

ధ్వన్యాలోకమున

"శ్రుతి మాత్రేణ శబ్దాత్తు యే నార్థప్రత్యయో భవేత్
సాధారణ స్సమగ్రాణాం స ప్రసాదో గుణో మతః."

అని ప్రసాదగుణము నిర్వచింపఁబడినది. విన్నంత మాత్రముచే నే రచన వలన నర్థము స్పష్ట మగునో యా రచన ప్రసాదమును దెలుపు ననియు, నది సర్వ రససాధారణ మనియు దీని యర్థము.

"నిండు మనంబు నవ్య నవనీత సమానము, పల్కు దారుణా
ఖండల శస్త్ర తుల్యము జగన్నుత విప్రులయందు...." (అది. ౧- 100.)

పద్యారంభము నందలి నకార వృత్త్యనుప్రాసము మార్దవమును, దారుణాఖండల శస్త్రతుల్య మను సమాసమునందలి ఖ, శ, అను నక్షరములు పారుష్యమును సూచించుచు శ్రవణమాత్రముచే నర్థమును స్ఫురింపఁ జేయుచున్నవి.

ఇట్లే యితర గుణములకును నన్నయ భారతమునుండి యుదాహరణము లెన్నియేని చూపవచ్చును. రసానుగుణముగాఁ బదవర్ణములను వాడుటయందు నన్నయకుఁ గల నే ర్పసామాన్యమైనది. ఈ నేర్పే యాతని రచన కధికమైన యక్షర రమ్యతను గూర్పఁజాలినది.

"దాని శరీర సౌరభము దాని విలోల విలోకనంబులన్"

అనుదానిని "దాని శరీరవాసనయు దాని విలోల సమీక్షణంబులున్" అని వ్రాయవచ్చును. కాని రెండవ పంక్తి మొదటి దాని యంత యందముగా లేదు దీనికే పరివృత్త్యసహిష్ణుత యని పేరు. ఇట్టిదాని వలననే శయ్యాసౌష్ఠవమును అక్షర రమ్యతయు నేర్పడును.

కేవల మృదుసరళాక్షర ఘటితములైన పదములచే మాత్రమే యక్షర రమ్యత యేర్పడు నని తలంపరాదు. అది పదములందలి యక్షరముల సరళతా పారుష్యములపైఁ గంటె రసానుగుణత్వముపై నెక్కువగా నాధారపడి యుండును.

"నలదమయంతు లిద్దరు మనః ప్రభవానల బాధ్యమానులై
సలిపిరి దీర్ఘవాసర విశల్ విలసన్నవనందనంబులన్ .."

అనుదానియం దెంత యక్షరరమ్యత యున్నదో

"అవిన విని జరాసంధుండు పటాసముత్పాటన కుపితకుంజర వైరియుం బోలెఁ గడు నలిగి పటుకుటిల భ్రుకుటీ ఘటిత ఫాలుం డగుచు" ననుదాఁ గూడ నంతే యక్షర రమ్యత యున్నది.

నానారుచిరార్థ సూక్తి నిధిత్వము:-

సూక్తు లనఁగా సుభాషితములు. ఇవి శాశ్వతము లైనవి. వీనికి దేశ కాలములతో సంబంధము లేదు. కావ్యమునకు రసానంద సంధానమే ప్రధాన ప్రయోజన మైనను అందు ధర్మోపదేశముకూడ నుండుట మేలని ప్రాచ్య పాశ్చాత్య లాక్షణికు లెల్లరు నంగీకరించుచున్నారు. మనువు "కావ్యాలాపాం శ్చ వర్జయే" త్తని శాసించుట కూడ నీ విషయమునే సూచించుచున్నది అందుచేఁ గవులు వ్యంగ్యముగనే కాక యొక్కొక్కచోట వాచ్యముగఁ గూడ నీతిధర్మ ములఁ నుపదేశించుచుందురు. అట్టివానికే సూక్తు లని పేరు.

పెద్దలు పిన్నలకు నీతిధర్మములను గూర్చియు,సద్వర్తనమును గూర్చియు నుపదేశించునపుడు మహాకవుల రచనలందలి సూక్తుల నుదాహరించుచుండుట పరిపాటి. అట్లు చేయుట వలన వారి వాక్కులకు మఱింత ప్రామాణికత్వ మేర్పడును. ఇప్పుడు సాధారణముగా నట్టి సందర్భము లందు తెలుఁగునుండియే కాక ఆంగ్లభాషనుండియు, సంస్కృతమునుండియు సూక్తు లుదాహరింపఁ బడుచుండుట మనము వినుచుందుము. తెలుఁగువారికిఁ గవిత్రయమువారి భారతము పరమ ప్రమాణమైనది. అందుచేఁ బూర్వు లా గ్రంథమును దీరిక గలిగినప్పు డెల్లఁ బఠించుచు నందలి సూక్తులను జ్ఞప్తియం దుంచుకొనెడివారు. సందర్భము వచ్చినప్పుడు వా రా సూక్తుల నుదాహరించి తమ వాక్కులకు బలము కలిగించు కొనెడివారు. ఇప్పుడు భారతమును గళాదృష్టితోనేకాని ధర్మ దృష్టితోఁ జదువువారి సంఖ్య తక్కువైనది. అందుచే నందలి సూక్తు లిప్పు

దంతగా వినఁబడవు. మన తండ్రితాతల కాలము నందును వారికిఁబూర్వమును దెలుఁగుదేశమున భారతమునందలి సూక్తులు విరివిగా వాడఁబడుచుండె నని భావింపవచ్చును. నన్నయ భారతమున నిట్టి సూక్తు లెన్నియో కలవు.

నన్నయ అనువాదమును గూర్చి చెప్పునప్పు డాతని సూక్తులను గూర్చి వివరించియుంటిని. అతఁడు మూలమున లేకపోయినను బెక్కుచోట్ల సూక్తులను గల్పించి వ్రాసెను. కొన్ని సూక్తులను అర్థాంతర న్యాసాలంకార పూర్వకముగా వివరించెను. ఈ సూక్తులను గథాసందర్భముతోఁ గూడిన పద్యములందే యేకదేశముగఁ జొప్పించుట కవకాశ మున్నది. కాని నన్నయ యట్లు చేయక సాధారణముగా వానిని విడివిడి పద్యములుగా వ్రాయుచుండును. ఆ సందర్భమున వానిని దొలఁగించినను గథ కాటంకము కలుగదు కావలసిన వారు వానిని వల్లించి యుచితసందర్భములం దుదాహరించుకొనవచ్చును. అవి కథలను వ్రాయునప్పు డేదో యొక ప్రత్యేకసందర్భమునందే వ్రాయఁబడినను నిజమునకు సర్వజనీనము లైనవి. అందుచేతనే నన్నయ విడిగాఁ దీసి వివిధ సందర్భములందు వాడుకొనుట కనువుగా వానిని స్వయంసంపూర్ణములుగా వ్రాయుచుండును. వాని కర్థము వివరించునప్పుడు ప్రత్యేక కథా సందర్భమునకై వెదకవలసిన యక్కఱ యుండదు. ఇట్టివాని నతఁడు వ్రాయవలె నని యుద్దేశ పూర్వకముగానే వ్రాసినట్లు కనిపించును. అందుచేతనే యతఁడు వినీతుఁడు, అవికత్థనుఁడు నయ్యు భారతావతారికలో "నానారుచిరార్థసూక్తినిధి" యను విశేషణమును వాడుకొనియుండెను. నన్నయ సూక్తులు పెక్కు కంద పద్యములందే వ్రాయఁబడియున్నవి. ఆది సభాపర్వములందుఁ గంటె నారణ్య పర్వమున వానిసంఖ్య హెచ్చు.

"మతిఁ దలఁపగ సంసారం
బతి చంచల మెండమావు లట్టుల సంప
త్ప్రతతు లతిక్షణికంబులు
గతకాలము మేలు [illegible] కంటెన్." (ఆది. ౫-159.)

"ఆరంభ [illegible] బొందునె
యాక[illegible]పదలు [illegible]య్యును బు[illegible]
దారం[illegible]యిక్క
తారంభ[illegible]ర్పు నెంత యధికుల న[illegible]న్" (స. ౧- 122.)



"క్షమ గల వానికిఁబృథ్వీ
సమునకు నిత్యంబు విజయ సంసిద్ధి యగున్
క్షమి యైనవాని భుజ వి
క్రమము గడున్ వెలయు సర్వకార్యక్షమమై". (అర. ౧-223.)

ఇట్టి వాతని సూక్తుల కుదాహరణములు. ఇవిగాక యర్థాంతరన్యాస రూపముగా నున్న సూక్తులు పెక్కనువాద పద్ధతియం దొసంగఁబడినవి.

నన్నయ సూక్తులు "రుచిరార్థము" లైనవి అవి యర్థగంభీరములై యతిమనోహరములుగా నుండును. రుచిర మనఁగా రుచిగల, తియ్యని (Tasteful, sweet) అని యర్థము. ఈ యర్థ మాహారమునకు సంబంధించినది. దానిని సూక్తుల కన్వయించినచో నవి మృదుమధురములై చదివిన కొలంది చవు లూరించునవై యుండు ననిచెప్పవచ్చును. "హితం మనోహారి చ దుర్లభం వచః" అని భారవి తెల్పియుండెను. కొన్ని వాక్కులు హితకరము లయ్యును మనోహరముగా నుండవు. ఆ రెండు గుణములు నొక్కచోఁ గూడి యుండుట యరుదు. నన్నయ సూక్తులలో నా గుణద్వయ సమ్మేళనము గోచరించుచుండును.

నన్నయ సూక్తులం దొక్కొక్కచోటఁ గథకు సంబంధించిన యెంతో యర్థమును ధ్వనింపఁ జేయుచుండును. నలోపాఖ్యానమున నలుఁడు దమయంతిని విడిచి వెళ్లిపోయిన పిమ్మట నామె యాతనికై చుట్టుపట్ల వెదకెను. ఆతఁ డెచ్చటను గానరాలేదు. అప్పు డామె దుఃఖించుచు

"వగవఁగ సాంగోపాంగము
లగు నాలుఁగు వేదములయు నధ్యయనము పొ
ల్పుగ నొక సత్యముతో నెన
యగునే యెవ్వియును బోలవె సత్యంబున్." (అర. ౨-48)

అని పలికియుండెను. ఇది పైకి సత్యముయొక్క మహత్త్వమును దెల్పు సూక్తిగా గోచరించుచున్నది, కాని పరిశీలించినచో నిందు నలునికిఁగల విద్యావైదుష్యములు చక్కఁగా ధ్వనితము లగుచున్నవి. షడంగములు, వేదములు, మీమాంసా న్యాయ పురాణ ధర్మశాస్త్రములు, అనువానికిఁ జతుర్దశవిద్య లనిపేరు. నలుఁడు సాంగోపాంగముగా నాలుగువేదముల నధ్యయనము చేసినవాఁడు. అనఁగా నై చతుర్దశవిద్యలందు నారితేఱిన వాఁడు. శ్రీహర్ష మహాకవి

నైషధమున అధీతిబోధాచరణ ప్రచారములచే నలుఁడు విద్యలకుఁ 'జతుర్దశత్వ'ము కలిగించె నని చమత్కరించి యున్నాఁడు. నన్నయ కథారంభమున నలుని వైదుష్యమునుగూర్చియేమియుఁ జెప్పియుండలేదు. "విపినంబులలోఁ గడుకొని మా యట్లిడుమలఁ బడిన నరులు గలరె యొరులు పరమ మునీంద్రా" యని ధర్మజుఁ డడిగిన దానికి సమాధానముగా బృహదశ్వుఁడు నలోపాఖ్యానమును జెప్పెను. ఇచ్చట నలుఁడు పడిన యిడుమలకే ప్రాధాన్యము. నన్నయ వానినే నలోపాఖ్యానమున వివరింప నెంచెను. అందుచే మొదట నలుని గుణగణములనుగాని, విద్యావైదుష్యములనుగాని, వాచ్యముగాఁ జెప్పియుండలేదు. మఱియొక కవి యైనచో నట్లు చేసియుండును. పై సూక్తిని చెప్పుచు నన్నయ నలుని పాండిత్య విశేషమును వ్యంగ్యముగా వెల్లడించెను. అతని సూక్తుల రుచిరార్థత్వమున కిదియొక చక్కని దృష్టాంతము.

సూక్తు లనఁగా సుభాషితము లనియేకాక సామెతలు, నానుడులు, జాతీయములు, (పదగతములు - వాక్యగతములు). నీతిబోధక వాక్యములు మున్నగున వని కూడ విశాలమైన యర్థము గ్రహింపవచ్చును. అప్పు డివి యన్నియు నన్నయ రుచిరార్థసూక్తినిధిత్వమునకు నిదర్శనములు కాఁగలవు. వీనియందు సందేశదాయకత్వమునేకాక భాషయొక్క దేశీయశబ్దప్రయోగ వైచిత్రిని గూడఁ దిలకింపవచ్చును. నన్నయశైలిని వివరించు పట్ల నాతఁడు వాడిన సూక్తుల కుదాహరణము లొసంగఁ బడును.

నన్నయ వర్ణనలు :-

వర్ణనల యందు నన్నయకుఁగల ప్రతిభ యసామాన్య మైనది. అతని వర్ణనలు మితము లయ్యు నుదాత్తములై వర్ణ్య వస్తువులను బఠితలకు సాక్షాత్కరింపఁ జేయు చుండును. సహజ తౌదాత్త్యము లాతని వర్ణన లందలి ప్రధాన లక్షణములు. సభా పర్వము నందలి దివ్య సభల వర్ణనములును, గరుడోపాఖ్యానము నందలి సముద్ర వర్ణనమును, ఆది పర్వాష్టమాశ్వాసము నందలి యింద్రప్రస్థ, ద్రౌపదీ వివాహ వర్ణనములును, అరణ్య పర్వము నందలి వర్షా శరద్వర్ణనములును ఇందుకు దృష్టాంతములు. ఇంద్రుఁడు దివిజోత్తములు గొలువ శచీ సమేతుఁడై "వరాప్సరోంగనాయత విలసత్కటాక్ష కుసుమార్చిత సుందర వక్త్రచంద్రుఁడై" కొలువుండు వనియు, బ్రహ్మసభ "ఈ వియత్తల మను కంద మొక్కటియ తాల్పఁగ సుస్థిరమై నిజప్రభావలి శశివారిజమిత్రుల మంద

లములను వెలిఁగించుచుండు" ననియుఁ, గుబేరుని సభ "కనకమయ తరులతాలంకృతమయి తటిల్లతా విచిత్ర శరదంబు డంబు ననుకరించు" ననియు, పరిష జలము లందలి కుసుమములను, ఆకస మందలి యుజ్జ్వల తారకా నిరంతర కుసుమంబులను, "బుకవప్రము పాద పీఠికా శిరముల కొప్ప నర్చనలు చేసిన పువ్వుల యవ్విధంబున వెలయు" ననియు (ఆది-౮-76)"గంధ మాదనము నానా వర్ణశిలా విహగానేక మృగాభి రామమై భూనారీ నానాభరణ విభూషిత పీనోన్నత కుచముఁ బోలె వెలుఁగు'' ననియు (అర. ౩-292) నన్నయ కావించిన వర్ణనలద్భుతములై యతి మనోహరములుగా నున్నవి. అతఁడు దేనిని వర్ణించినను దానికి సంబంధించిన వస్తుసముదాయము నంతను స్పష్టముగా వివరించి యందలి యుదాత్తతను బ్రకటించు చుండును. అందుచే వర్ణ్యముల సమగ్ర స్వరూపము సుస్పష్ట రేఖలతో సాక్షాత్కరించి పఠితల కమందమైన యానందము నావహించు చుండును.

వ్యక్తులను, వస్తువులను వర్ణించు నప్పుడు నన్నయ వర్ణింపఁ దగిన ప్రముఖాంగముల నన్నిటిని జక్కగాఁ దీర్చి దిద్ది వారి లేక వాని సమగ్ర మూర్తులను బఠితల మనః ఫలకంబు లందుఁ జిత్రితము లగునట్లు చేయుచుండును.

" తేజిత బాణహస్తు, దృఢ దీర్ఘ మలీమస కృష్ణదేహుఁ, గృ
ష్ణాజిన వస్త్రుఁ, నష్ట విషయాప్త విషాదు, విషాదుఁ జూచి.... ."

ఏకలవ్య వర్ణనము. (ఆది. ౫-235)

" పాల ప్రాంశు విజోజ్జ్వల త్కవచు శశ్వత్కుండలోద్భాసితున్
బాలార్క ప్రతిమున్ శరాసన ధరున్ బద్ధో గ్రనిస్త్రింశు శౌ
ర్యాలంకారు సువర్ణవర్ణు ఘనుఁ గర్ణాఖ్యున్ జగత్కర్ణ పూ
ర్ణాలోలద్గుణుఁ జూచి ... ... " కర్ణవర్ణనము. (ఆది. ౬-30)

" మృదు రోమములును శంఖనిభ కర్ణముల్ మెత్తని వలుఁద
పొదుగును విడుద చన్నులును గుఱుచలై పొలుచు కొమ్ములును
సదమల శరదిందు శంఖ నిభమైన చాయయుఁ గలుగు
మొద విది .. ........ .." నందిని వర్ణనము. (ఆది. ౭-98)

" ధవళ విభూషణ దామానులేప నామలినాంగి సితపుష్పమాల సేతఁ
గొని పుష్ప సాయకు కుసుమేతరంబైన యాఱగు సాయకం బనఁగ జనుల
ధవళాక్షి రంగమధ్యంబునఁ దనుమధ్య దా నొప్పి పాంచాల
తనయ యున్న ......" ద్రౌపదీ వర్ణనము. (ఆది. ౭-167)

దమయంతి స్వయంవరము సమయము నందలి వర్ణనము కూడ నిట్లే యున్నది. (అర. ౨-53.)

"ప్రాతికామి పిలువంద నేకవస్త్రయు నథోనీవియు నవిరళ గళిత నయనోదక బిందుసందోహ పరిపీడ్యమాన పీనస్తన పరిధానాంతరయు నగుచు సభకుం జనుదెంచి." ద్రౌపదీ వర్ణనము. (సభా. ౨-212.)

"కాంచన వర్ణాపఘనుఁడై మహోన్నత
కార్ముక హస్తుఁడై గాలకంరుఁ
డెఱుకు రా జయ్యెఁ, నద్రీంద్ర తనూజయు
వనచరీ భావంబు వఱలఁ దాల్చెఁ
గుఱుచచేతులు మిడిగ్రుడ్లును గడుకొన్న
తఱటులు మఱి చెంచుదలలు నమరఁ
దడవిండ్లు పేపట్టి తడయక యెఱుకులై
యార్చుచు భూతమ్ము లాత్మనతుల
నెఱుకునతులఁ గావించి యయ్యెఱుకరాజు
ముందటం బక్కియల నొక్కమొగిన వీలిచిరి."
కిరాత వర్ణనము. (అర. ౧-౩౦౦).

"హ్రస్వపీనగ్రీవు నవనతాయత హను
నతిచపల స్వభావాభిరాముఁ
దనుమధ్యకటిచక్రు దహనకణాకార
తామ్రోష్ఠు వతిదృఢదశనకరజుఁ
బృథులవిద్యుత్పుంజపింగాంగు నుత్తుంగ
దృఢవక్షు నక్షీణదీర్ఘబాహు
నూర్ధ్వలాంగూల మత్యున్నతధ్వజలీలఁ
గ్రాలుచునుండ నేకాంతయోగ
నిద్రనున్న ధర్మనిర్మలు హనుమంతుఁ జూచి."
హనుమద్వర్ణనము. (అర. ౩-319.)

ఈ పై వర్ణనలను జదువునప్పుడు వర్ణ్యాంశముల రూపములు పరితలకు సాక్షాత్కరించు ననుటలో సందేహములేదు. నన్నయ భారతభాగమునఁ బారాశర్యుని వర్ణనము పలుచోట్ల వచ్చుచుండును. ఆ యన్నిచోట్ల నతఁ డతని కపిల గడ్డమును, గపిల జడలను, గపిల గన్నులను, నల్లని దీర్ఘతనువును, కమండలువును వర్ణించి యతని దివ్యమూర్తిని బరితల యెదుటఁ బెట్టుచుండును. (ఆది. ౩-146; ౪-239; ౪-253; ౬-129; ౬-225; అర. ౧-272).

నన్నయ యే డెనిమిదిచోట్ల స్త్రీవర్ణనము కావించెను ఈ వర్ణనలన్నియుఁ జాల పరిమితములై యున్నవి. వీనియందు సాధారణముగా నతఁడు ముఖము, నేత్రములు, కుచములు, కురులు, జఘనము అనువానిని మాత్రమే పేర్కొనుచుండును. వాని నైనను ఒక్కొక్కపదముతో సూచించునుగాని తరువాతి ప్రబంధములందు వలె నుత్ప్రేక్షాతిశయోక్తులతో విపులముగా వర్ణింపఁడు.

"....తన్వీఁ బయోజదళాక్షి, సం
కులమిళితాళినీల పరికుంచిత కోమలకుంతలన్ శకుం
తల యను కన్యకం గనియె" (ఆది. ౪-25).

"కనకావదాత కోమల తనులతఁ, దనుమధ్యఁ, గమలదళనేత్రను
యోజనగంధి నవనినాథుఁడు గనియెను" (ఆది. ౪-170.)

"నెఱికురులన్ విలోల సితనేత్రయుగంబును నొప్పు లొల్కు వా
తెఱయును దీని యాననము తెల్విఁ గరంబు మనోహరంబు"
తపతి వర్ణనము (ఆది. ౬-73.)

"...ంగ విశాంగ దీప్తు లెసఁగం జనుదెంచి లతాంగి సంతతో
త్తుంగ పయోధరద్వితయ తోయరుహాయత చారునేత్ర దివ్యాంగనయై ..."
(ఆది. ౪-134.)

సంవరణుఁడు తపతిని గాంచి యనిమిషలోచనుం డయి మనమున వితర్కించు సమయమున నన్నయ యొక సీసపద్యమును వ్రాసెను.

"త్రిభువనలక్ష్మి యేతెంచి యేకాంత మిచ్చేలకో యున్నది యివ్వనమున
..................................................
అమరకన్యయొక్కొ యక్షకన్యకయొక్కొ సిద్ధకన్యయొక్కొ శ్రీసమృద్ధి
సర్వలక్షణప్రశస్తాంగి యిది దివ్యకన్య యగు ననంతకాంతి పేర్మి."
(ఆది. ౬-72.)

ఈ పద్య ముత్ప్రేక్షాలంకారముతోఁ గూడి యించుక విపులముగా నున్నది కీచకుఁడు ద్రౌపదిని వర్ణించునప్పుడు విరాటమున తిక్కన కావించిన వర్ణనముల కీ పద్య మాదర్శ మనఁ దగియున్నది.

శకుంతల మేనకావిశ్వామిత్రుల సమాగమమును వర్ణించు సందర్భమున—

మిళిత సుగంధ బంధుర సమీర వశంబునఁ దూలి చాల పై
వలు వెడలన్ బయల్పడియె వర్ధకుచంబులుఁ గక్షయుగ్మమున్
వలితకృశోదరంబుఁ దరళత్రివళీయుత రోమరాజియున్." (ఆది. ౪-43)

అను పద్యము వ్రాయఁ బడినది. ఇందుఁ గ్రీఁగీత గలభాగ మమూలక మైనది. యౌవనవతి యైన శకుంతల యువకుఁ డైన నూత్నపురుషునితో నిట్లు వర్ణించి చెప్పుట యించుక యౌచిత్యదూరమై యున్నది.

పితృదేవతలు గిరికకు మృగమాంసము పెట్టు మని యాదేశింప వసురాజు మృగవధార్థము వనమున కరిగి

"పలుకుల ముద్దును గలికిక్రాల్గన్నులతెలివును వలుఁదచన్నులబెడంగు
నలఘుకాంచీపదస్థలములయొప్పును లలితాననేందుమండలమురుచియు
నళినీలకుటిలకుంతలములకాంతియు నెలజవ్వనంబునవిలసనమును
వలపభావంబునపొలుపును మెలుపును గలుగు నగ్గిరికను దలఁచితలఁచి"

(ఆది. ౩-27)

రక్తుఁడై యామెయందుఁ దనహృదయము లగ్న మొనరించెనని నన్నయ వర్ణించెను. ఈ పద్యమున గిరిక యంగముల భౌతికాకారమునకుఁ గాక వాని యందలి కాంతిసౌందర్యముల కధికమైన ప్రాధాన్య మీఁ బడినది. గిరిక సమక్షమున లేని తఱి వసురా జామె యవయవములను గాక తన హృదయమందు నెలవుకొనియున్న యామె యంగముల కాంతి సౌందర్యములను దలఁచి రక్తుఁ డయ్యె ననుట యెంతయో యుచితముగా నున్నది. ఇట్లే నన్నయ శంతనుఁడు యోజనగంధి "శరీరసౌరభమును, శుచిస్మితవక్త్రకాంతిని, విలాసమును" జూచి "మనోజబాణసంతానహతాత్ముఁ డయ్యె"నని వర్ణించెను. ఇట్లువస్తువుల భౌతిక స్వరూపమును గాక యాంతరశోభను వర్ణించుట మిక్కిలి ప్రశస్తమైన పద్ధతి.

పాండురాజు మరణమునకు ముందు నన్నయ యాతని నంగజరాగమత్తునిఁ గావించిన మాద్రి విలాసము నిట్లు వర్ణించెను.

"చారుసువర్ణహాసి నవచంపకదామయు సిందువార ము
క్తారమణీయయున్ వకుళదామవతంసయు నై యపూర్వశృం
గార విలాసలీల యెసఁగం దనముందట నున్న మాద్రి నం
భోరుహనేత్రఁ జూచి..............." (ఆది. ౫-141.)

అది వసంతర్తువు. మాద్రి వసంత సుమాలంకార శోభితయై యపర మధులక్ష్మి వోలె విరాజిల్లుచుండెను. అప్పటి యామె విలాస మపూర్వమై పాండు రాజు హృదయము నాకర్షించెను. వనవాసిని యైన మాద్రి యిట్లు వసంత

కుసుమాలంకార శోభితనుగా వర్ణించుట మిక్కిలి సహజమును నౌచిత్యవంతము నై యొప్పారుచున్నది. ఈ వర్ణనము నన్నయ కల్పించి వ్రాసినది.

నన్నయ వర్ణనవైఖరి పెక్కుచోటఁ జిత్రకారుని చిత్రరచనా పద్ధతిని బోలి యుండును. లోకము నందలి పదార్థము లెప్పుడును నొకేమాదిరిగా నుండవు. వానిస్థితి ప్రతిక్షణ చాంచల్యమానమై యుండును. చిత్రకారుఁ డాస్థితియందలి యొక విన్యాసమును (Pose) మాత్రమే యొకసారి వర్ణింపఁ జాలును. అతఁ డొకే చిత్రమున విన్యాస వైవిధ్యమును బ్రదర్శింపఁజాలఁడు. బహు విన్యాసములను జిత్రింపఁదలఁచినచో నతఁడు బహుచిత్రములను జిత్రింపవలయును. కవి వాక్సాహాయ్యమునఁ బ్రతిక్షణ చాంచల్యమాన మగు దశావిపర్యయము నొకే పద్యమున వర్ణింపఁ జాలును. తిక్కన వర్ణనలు పెక్కు విధముననే యుండును. నన్నయ యట్లుకాక చిత్రకారుని వలెనే వర్ణ్యము యొక్క యేకైక విన్యాసమును మాత్రమే (Static pose) వర్ణించుచుండును.

“చనుదెంచి యమ్మహాజనపతి జల మపేక్షించి యచ్చో విశ్రమించి చూచి
తత్కూపమున విలసత్కూపఘనవల్లి యన్నిష్టసఖి నూదియున్నదానిఁ
గురుకుచయుగముపైఁ బరువడిఁ దొరఁగెడు కన్నీరు పూరించుచున్నదానిఁ
దన సమీపమునకు జనుల యాగమనంబు పన్నుగాఁ గోరుచున్నదాని
వరుణదేవుతోడఁ గర మల్గి జలనివాసంబు విడిచి భూస్థలంబు వలవి
కరుగుదేర మున్న వరుణేంద్రుదేవియ పోవిదాని దేవయానిఁ గనియె.”
(ఆది. 3-140.)

“అలఘుఫణీంద్ర లోకకుహరాంతర దీపమణిస్ఫురత్ప్రభా
వలి గలదాని శశ్వదుదవాస మహావ్రతశీతపీడితా
చలముని సౌఖ్యహేతువిలసద్బడబాగ్ని శిఖాచయంబులన్
వెలిఁగెడుదానిఁ గాంచి రరవిందనిభానన లమ్మహోదధిన్.”
(ఆది. ౨-28.)

“ప్రాంశుజాలములు పైఁ బ్రాకినఁ గరము రూక్షములగు
నూర్ధ్వాలకములదాని
నతిమలినంబైన యర్ధవస్త్రంబుచే నావృతం బగు దేహయష్టి దాని
నాఁకలి తృష నిద్ర లను వీని నెఱుంగక యున్మాదినియుఁ బోలె
నున్నదాని
దమయంతిఁ జూచి .......................” (అర. ౨-102.)

"హంసచేఁ దన వినినంతకంటెను రూప విభవాతిశయమున వెలయుదాని"
(అర. ౨-39.)

మొదలగు పై పద్యములందలి భావములను గ్రహించి యొక్కొక్కదాని కొక్కొక్క చక్కని చిత్రమును రచింపవచ్చును. వానియందలి 'దాని, దాని' యను సర్వనామములతో ముగియు విశేషణము లోకేస్థితియొక్క వివిధ భంగిమలను సూచించుచున్నవి. ఇట్లే కణ్వాశ్రమ వర్ణనమునందలి "శ్రవణ సుఖంబుగా సామగానంబు" లిత్యాది సీసపద్యము కూడ నా యాశ్రమము యొక్క యొక భాగమునందలి సంపూర్ణచిత్రమును బ్రదర్శించుచున్నది.

పాండవులు వనమున కరిగినక్రమమును ధృతరాష్ట్రునకుఁ జెప్పుచు
"వదనసరోజంబు వస్త్రాంతమునఁగప్పికొని యేగె ధర్మనందనుఁడు
మఱియు" (స. ౨-301)

విత్యాదిగా విదురుఁడు కావించిన వర్ణనము భావగంభీరమై యాదృశ్యమును బ్రత్యక్షము చేయుచున్నది.

నన్నయ యేదైన వస్తువును వర్ణించునప్పుడు దానికి సంబంధించిన వివిధాంగములను వివరించి తదనుగుణమైన వాతావరణమును గల్పించు చుండును. కణ్వాశ్రమమును వర్ణించు సందర్భమున ఏచి, తనర్చి, తలిర్చిన వివిధ వృక్షములను, ఆజ్యహవిర్గంధ ధూమలతాతతులను, వేదధ్వనులను, స్వాహాశబ్దములను బేర్కొనుటయు, వర్షరువును వర్ణించునప్పుడు జలదధ్వానములను, దర్దురస్వరములను, వేదధ్వనులను నవతృణ శిలీంధ్రసుర గోపములను, వర్షధారలను బేర్కొనుటయు, వారణావతమును వర్ణించు సందర్భమున విపణి వీథులను, సౌధములను, జనసమృద్ధిని బేర్కొనుటయు నిందుకుఁ దార్కాణములు. ధర్మజుని రాజసూయ యాగమును వర్ణించు సందర్భమున

"వేదవినాదము నాశీర్వాద వినాదము ననేక వాదిత్ర మహా
నాదంబుఁ జెలఁగె నన్యనినాదంబు జనంబులకు వినఁబడకుండన్."
(స. ౧-291.)

అని నన్నయ కావించిన వర్ణనము యాగవాతావరణమును బరితఃఁ యెదుటఁ బెట్టుచున్నది. అన్యనినాదము వినఁబడకుండ వేదాదుల మహానాదము చెలఁగె ననుట దాని పరాకాష్ఠను సూచించుచున్నది. యాగము, వివాహము,

ఆశ్రమము మున్నగువానిని వర్ణించుతఱి నన్నయ వైదికకర్మలను జాఁ నాసక్తితో వర్ణించుచుండును. అట్లే తీర్థములను, క్షేత్రములను, వర్ణించునప్పు డాతఁడు వాని మహత్త్వమును, పవిత్రతను బెక్కువిధముల వెల్లడించుచుఁ బఠితల హృదయములను వానియెడ భక్తిభావభరితములుగా నొనరించుచుండును

చెలికత్తెలు దమయంతి మదనతాపమును దండ్రి కెఱింగించు సందర్భమునఁ జెప్పిన పద్యము ["కలహంస పలికిన పలుకులు గణియించు నది దాని పోయిన వలను సూచు" ఇత్యాది. (అర ౨-28)] సరససుందరమై స్త్రీల విరహావస్థను వర్ణించుపట్లఁ దరువాతి కవుల కెందఱికో యొజ్జబంతి యైనది. అట్లే దమయంతి నలునిఁ గానక దుఃఖితయై యడవిలో నాతని వెదకుసందర్భమున వ్రాయఁబడిన పద్యములు కూడ ("హా మహారాజ మహామహీరక్షణదక్ష దక్షిణ బాహుదండ దండితారాతి" మొ. అర. ౨-8 ; "సహకార మత్ప్రియ సహకారుఁ బున్నాగ పున్నాగుఁ దిలక భూభువన తిలకు" మొద. అర. ౨-94) కరుణరసపూరితములై తరువాతఁ బలువురు కవులచే ననుకరింపఁబడినవి.

నన్నయ రచించిన భారతభాగమునందే దెనిమిది చోట్ల యుద్ధవర్ణనలున్నవి. నరనారాయణులు రాక్షసులతోఁ బోరి వారిని సంహరించుట, భీముఁడు బక హిడింబ కిమ్మీరులతోఁ బోరి వారిని వధించుట, సౌగంధిక సరోవర సమీపమున యక్షరాక్షసులతోఁ బోరుట మున్నగున వందు ముఖ్యమైనవి. ఈ యుద్ధము లన్నియు వీరరసపూరితములై భీముని యనితరసామాన్యమైన పరాక్రమమును బ్రకటించుచున్నవి. కాని వీనియందు వైవిధ్యము తక్కువ. అవన్నియుఁ గొంచెము మించుమించుగా నొకేమాదిరిగా నున్నవి. భీముఁడు "బకుం జంపిన విధంబుననే కిమ్మీరునిఁ గూడ విగతప్రాణుఁ జేసె". నని నన్నయయే చెప్పియున్నాఁడు. సౌంభకాఖ్యాన కిరాతార్జునీయ నివాతకవచ సంహరణాదులగు సందర్భముల వర్ణింపఁబడిన యుద్ధములు మహాభీకరములును, అపూర్వములునై యద్భుతము నావహించుచున్నవి. అందులోఁ జివరి రెంటింట నరును నతిలోకమైన శస్త్రాస్త్రకౌశలము వర్ణింపఁబడినది.

నన్నయ ప్రకృతివర్ణనలను జాల తక్కువచోట్లఁ గావించియుండెను. అందుఁ గణ్వాశ్రమ వర్ణనము, పాండురాజు మరణమునకు ముందరి వసంత వర్ణనము (ఆది. ౫-138-140) పాండవులు లక్కయింటి నుండి తప్పించుకొని యేకచక్రపురమున కేగుచు మధ్య నొక వటవృక్షము క్రింద విశ్రమించినప్పటి

సాయంకాల వర్ణనము (ఆది. ౫-171-175); కచదేవయానుల కథయందలి సాయంకాల వర్ణనము, ఖాండవదహనమునకుఁ బూర్వ మున్న గ్రీష్మవర్ణనము (ఆది ౮-230.) భగీరథుని చరిత్రమందలి హిమవద్వర్ణనము (అర. 3-76) సౌగంధికాఖ్యాన మందలి గంధమాదన, వర్షవర్ణనములు. (అర. 3-291-297) ఇంద్రుఁడు పాండవులను జూడవచ్చుటకు ముందున్న రాత్రివర్ణనము (అర.3-42) నన్నయ రచనకుఁ జివర నున్న వర్ష శరదృతు వర్ణనము (అర.౪-134-142) ముఖ్యములైనవి. వీనిలో నొండు రెండు తప్ప మిగిలిన వన్నియు నేక ద్వి పద్య పరిమితములై మిక్కిలి చిన్నవిగా నున్నవి. కణ్వాశ్రమ వర్ణనము కడుంగడు సహజమై యచ్చటి పవిత్రతను, శాంతిని, కర్మనిష్ఠను జక్కఁగా వెల్లడించుచున్నది. వసంత వర్ష శరద్వర్ణన లా యా ఋతువులందలి ప్రకృతిశోభను వెల్వరించుచు మహోదాత్తములై యలరారుచున్నవి ఇందు గ్రీష్మ,వర్ష శరద్వర్ణనము లాలంకారిక రచనతోఁ గూడి తరువాతి ప్రబంధములందలి వర్ణనలకు మార్గదర్శకములుగా నున్నవి. సాయంకాల రాత్రి వర్ణనలు కథకు సంబంధించినవై యచ్చటి కాలగమనమును సూచించుచున్నవి.

ఆది పర్వము నందలి యష్టమాశ్వాసమున నింద్రు నానతిచే విశ్వకర్మ పాండవులకై నిర్మించిన యింద్రప్రస్థపుర వర్ణన మున్నది. (ఆది ౮-70-78.) అందు కాంచన హర్మ్య తుంగ శృంగమ్ములు, భవనములు, కామినీజన సమూహములు, వప్రము, గోపుర శాతకుంభ కుంభములు, పురబాహ్యములు, అనిలము మున్నగునవి చక్కఁగా వర్ణింపఁబడియున్నవి. ఈ వర్ణనము నందలి చాల భాగము నన్నయ కల్పితమైనదే. ఇందలి రచన గంభీరభావ బంధురమై, యాలంకారికమై నన్నయ భావనాపటిమకు నిదర్శనమై యున్నది. తరువాతి కాలమున వెలసిన ప్రబంధములలో మొట్టమొదటఁ గానిపించు పురవర్ణనముల కెల్ల నిది మూల మనఁదగి యున్నది. ముందు మయుఁడు పాండవులకపూర్వమైన యొకమహాసభ నిర్మించి యీఁ బోవుచున్నాఁడు. నన్నయ కావించిన యింద్రప్రస్థవర్ణన ముదాత్తమై యట్టి మహాసభ యునికి కాపురము సర్వవిధముల నర్హమై యున్నదని ప్రకటించుచున్నది.

నన్నయ సాధారణముగా వర్ణనములకై సీసములను గాని వచనములను గాని వ్రాయుచుండును. వర్ణన సందర్భమున నాతఁడు వ్రాయు వచనములు దీర్ఘములును, సంస్కృత సమాస భూయిష్ఠములునై శ్రవణానంద కరములుగా నుండును. ఇట్టి వచన వర్ణనలలో గరుడోపాఖ్యాన మందలి సముద్ర వర్ణనము,

అస్త్రవిద్యాసందర్శనమున రంగవర్ణనము (ఆది. ౬-4) దుర్యోధను నానతిని మంత్రులు పాండవులు "విని యెదఁ దగులునట్లుగా" వర్ణించిన వారణావత వర్ణనము, రాజసూయ యాగారంభమునకు ముందు మంత్రులు గావించిన ధర్మజు వైభవవర్ణనము (స. ౧- 272.). జూదమున ధర్మజుఁ డొడ్డిన వివిధవస్తువుల వర్ణనము. (స. ౨- 177). హిమవద్వర్ణనము (అర. 3-77). గంధమాదన వర్ణనము (అర. 3-311); నిర్జరవిహారస్థాన వర్ణనము (అర. ౧-363) ను ముఖ్యములైనవి. హిమవంతమును వర్ణించుచు నన్నయ యది 'రమణీయభయానకంబై' (అర. పుట 96) యుండె నని వర్ణించెను. ఈ విశేషణ మా నగాధిరాజును దర్శించునప్పుడు జనుల మానసములఁ గలుగు భయకౌతుకములను (awe and curiosity) లెస్సగా సూచించుచున్నది. తిక్కన యుద్ధములను వర్ణించునప్పుడు తఱచుగా నవి రమణీయభయానకములై (దారుభీషణములై) యుండె నని చెప్పుచుండును. ఈ విధముగా నన్నయ వర్ణన లెల్ల నుదాత్తములును, గంభీరభావ విస్ఫురములును, సహజములును, గ్వాచిత్కముగా నాలంకారికములు నై మనశ్శ్రవణానందకరములై యొప్పారు చుండును.

రస పోషణము : attempt 1st.

రస పరిపోషణమున నన్నయ ప్రదర్శించిన యభినివేశము నిదివఱకు సూచించి యుంటిని. అతఁ డితిహాసమును గావ్యముగాఁ జేయ సంకల్పించిన వాఁడు కావున నా యా సన్నివేశములం దా యా రసములకు సంబంధించిన విభావానుభావాదులను వర్ణించి వానికిఁ దగిన పరిపోషణము కలిగించుటకు యత్నించెను. భారతము బహువిస్తృత మగు గ్రంథ మగుటచేతను, బహువిధ ములైన కథోపాఖ్యానము లందు వర్ణింపఁ బడుటచేతను, నానారసాశ్రయమై యుండును. ఇందలి అంగిరసము శాంతము. కవి దీనికి విరోధముకాని, న్యూనత కాని సంభవింప కుండునట్లుగా నంగరసములను వర్ణింపవలయును. అట్లుకాక యంగరసములనే విపులముగా వర్ణించినచో నంగిరసమునకుఁ బుష్టి తగ్గిపోవును. ఈ విషయమున ధ్వన్యాలోకము "విరోధివస్తు రసస్య అంగి రసాపేక్షయా కించి న్న్యూనతా సంపాదనీయా[1]. యథా శాంతే అంగిని శృంగారస్య, శృంగారే వా

1. 'న్యూనో హ్యంగ భూతో ఽంగినం బలీయాంసం బాధితుం న శక్నో యాదిత్యా శయః' - వ్యాఖ్య - పుట 281.

శాంతస్య. పరిపోష రహితస్య కథం రసత్వమితి చేత్ ఉక్త మత్ర అంగిరసా పేక్ష యేతి. అంగినో హి రసస్య యావాన్ పరిపోషః తావాం స్తస్య న కర్తవ్యః. స్వగత స్తు సంభవి[1] పరిపోషః కేన వార్యతే" (తృతీ. పుట. 281-282) అని చెప్పుచున్నది. నన్నయ యీ విషయము నెఱింగినవాఁడు కావుననే యంగిరసమున కెచ్చటను భంగము కలుగకుండ నంగరసములను బోషించి యున్నాఁడు

(a) దుశ్శాసనుఁడు తన్ను సభలోని కీడ్చితెచ్చినప్పుడు ద్రౌపది కోపలజ్జా పరవశ యయి చేయునది లేక తుదకు భీతయై కృష్ణునిఁ దలంచెను. ఈ ఘట్టము భక్తిరస ప్రకటనమున కెంతో యనువైనది. ఇం కొక కవి యెవ్వరైన నిట్టి సందర్భము లభించుచో భక్తిభావ నిర్భరములైన పద్యము లెన్నో గుప్పించి యుండును. నన్నయ యట్లుకాక "కోమలి కృష్ణుఁ దలంచె భీతయై" యని యొక్కమాట చెప్పి యూరకుండెను.

(b) కృష్ణుని కర్ఘ్య మొసంగుటను శిశుపాలుఁ డాక్షేపించిన సందర్భమున సహదేవుఁడు క్రుద్ధుఁడై

"ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి మిచ్చిన దీని కిం దొడం
బడ మని దుర్జనత్వమునఁ బల్కెడు పీఁదల మస్తకంబుపై
విడియెద నంచుఁ దాఁ జరణ మెత్తె సభన్". (స. 2.30)

ఇది రౌద్ర రసమును విస్తృతముగా వర్ణించుట కనువైన స్థలము. నన్నయ యట్లుచేయక పై విధముగా నొక్క పద్యార్థమున నాతని రౌద్రమును వెల్లడించి యూరకుండెను.

(c) దుశ్శాసనుఁడు ద్రౌపది వలువ లొల్చుసందర్భమునను, దుర్యోధనుఁ డామెను దన యూరుతలము నెక్కఁగా రమ్మని సన్నచేసిన సందర్భమునను భీముఁడు శపథము లొనర్చిన పట్టు లిట్లే రౌద్రరసమున కాలంబములైన ఘట్టములు. కాని నన్నయ యచ్చట పైత మా రసమును విప్పులవిడిగా వర్ణింపక భీమకృత ప్రతిజ్ఞలచే ధ్వనింపఁ జేసి విడిచెను.

ఇట్లంగి రసమున కెచ్చటను న్యూనత కలుగకుండ నంగరసములను సాధ్యమైనంత వఱకుఁ దగ్గించుట నన్నయ భారతమునఁ బెక్కుచోట్లఁ గానిపించును అసలు నన్నయ యెచ్చటను భావములను పొంగిపొరలునట్లుగ

1. ప్రధానరసా ప్రతికూలః వ్యాఖ్య.

అస్త్ర విద్యాసందర్శనమున రంగవర్ణనము (ఆది. ౬-4) దుర్యోధను నానతిని మంత్రులు పాండవులు "విని యెదఁ దగులునట్లుగా" వర్ణించిన వారణావత వర్ణనము, రాజసూయ యాగారంభమునకు ముందు మంత్రులు గావించిన ధర్మజు వైభవవర్ణనము (స. ౧- 272.). జూదమున ధర్మజుఁ నొడ్డిన వివిధవస్తువుల వర్ణనము. (స. ౨- 177). హిమవద్వర్ణనము (అర. 3-77). గంధమాదన వర్ణనము (అర. 3-311); నిర్జరవిహారస్థాన వర్ణనము (అర. ౧-363) ను ముఖ్యములైనవి. హిమవంతమును వర్ణించుచు నన్నయ యది 'రమణీయభయానకంబై' (అర. పుట 96) యుండె నని వర్ణించెను. ఈ విశేషణ మా నగాధిరాజును దర్శించునప్పుడు జనుల మానసములఁ గలుగు భయకౌతుకములను (awe and curiosity) లెస్సగా సూచించుచున్నది. తిక్కన యుద్ధములను వర్ణించునప్పుడు తఱుచుగా నవి రమణీయభయానకములై (చారుభీషణములై) యుండె నని చెప్పుచుండును. ఈ విధముగా నన్నయ వర్ణన లెల్ల నుదాత్తములును, గంభీరభావ నిర్భరములును, సహజములును, గ్వాచిత్కముగా నాలంకారికములు నై మనశ్శ్రవణానందకరములై యొప్పారు చుండును.

రస పోషణము: attempt 1st.

రస పరిపోషణమున నన్నయ ప్రదర్శించిన యభినివేశము నిదివఱకు సూచించి యుంటిని. అతఁ డితిహాసమును గావ్యముగాఁ జేయ సంకల్పించిన వాఁడు కావున నా యా సన్నివేశములం దా యా రసములకు సంబంధించిన విభావానుభావాదులను వర్ణించి వానికిఁ దగిన పరిపోషణము కలిగించుటకు యత్నించెను. భారతము బహువిస్తృత మగు గ్రంథ మగుటచేతను, బలువిధములైన కథోపాఖ్యానము లందు వర్ణింపఁ బడుటచేతను, నానారసాశ్రయమై యుండును. ఇందలి అంగిరసము శాంతము. కవి దీనికి విరోధముకాని, న్యూనత కాని సంభవింప కుండునట్లుగా నంగరసములను వర్ణింపవలయును. అట్లుకాక యంగరసములనే విపులముగా వర్ణించినచో నంగిరసమునకుఁ బుష్టి తగ్గిపోవును ఈ విషయమున ధ్వన్యాలోకము "విరోధివస్తు రసస్య అంగి రసాపేక్షయా కించి న్న్యూనతా సంపాదనీయా[1]. యథా శాంతే అంగిని శృంగారస్య, శృంగారే వ

1. 'న్యూనో హ్యంగ భూతో౽౦గినం బలీయాంసం బాధితుం న శక్ను యాదిత్యా శయః' - వ్యాఖ్య - పుట 281.

శాంతస్య. పరిపోష రహితస్య కథం రసత్వమితి చేత్ ఉక్త మత్ర అంగిరసా పేక్ష యేతి. అంగినో హి రసస్య యావాన్ పరిపోషః తావాం స్తస్య వ కర్తవ్యః. స్వగత స్తు సంభవి[1] పరిపోషః కేన వార్యతే" (తృతీ. పుట. 281-282) అని చెప్పుచున్నది. నన్నయ యీ విషయము నెఱింగినవాఁడు కావునవే యంగిరసమున కెచ్చటను భంగము కలుగకుండ నంగరసములను బోషించి యున్నాఁడు

(a) దుశ్శాసనుఁడు తన్ను సభలోని కీడ్చితెచ్చినప్పుడు ద్రౌపది కోపలజ్జా పరవశ యయి చేయునది లేక తుదకు భీతయై కృష్ణునిఁ దలంచెను. ఈ ఘట్టము భక్తిరస ప్రకటనమున కెంతో యనువైనది. ఇంకొక కవి యెవ్వరైన నిట్టి సందర్భము లభించుచో భక్తిభావ నిర్భరములైన పద్యము లెన్నో గుప్పించి యుండును. నన్నయ యట్లుకాక "కోమలి కృష్ణుఁ దలంచె భీతయై" యని యొక్కమాట చెప్పి యూరకుండెను.

(b) కృష్ణుని కర్ఘ్య మొసంగుటను శిశుపాలుఁ డాక్షేపించిన సందర్భమున సహదేవుఁడు క్రుద్ధుఁడై

"ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి మిచ్చిన దీని కిం దొడం
బడ మని దుర్జనత్వమునఁ బల్కెడు పీరుల మస్తకంబుపై
విడిచెద నంచుఁ దాఁ జరణ మెత్తె సభన్". (స. ౨.౩౦)

ఇది రౌద్ర రసమును విస్తృతముగా వర్ణించుట కనువైన స్థలము. నన్నయ యట్లుచేయక పై విధముగా నొక్క పద్యార్థమున నాతని రౌద్రమును వెల్లడించి యూరకుండెను.

(c) దుశ్శాసనుఁడు ద్రౌపది వలువ లొల్చుసందర్భమునను, దుర్యోధనుఁ డామెను దన యూరుతలము నెక్కఁగా రమ్మని నన్నుచేసిన సందర్భమునను భీముఁడు శపథము లొనర్చిన పట్టు లిట్టే రౌద్రరసమున కాలంబములైన ఘట్టములు. కాని నన్నయ యచ్చట పైత మా రసమును విపులవిరిగా వర్ణింపక భీమకృత ప్రతిజ్ఞలచే ధ్వనింపఁ జేసి విడిచెను.

ఇట్లంగి రసమున కెచ్చటను న్యూనత కలుగకుండ నంగరసములను సాధ్యమైనంత వఱకుఁ దగ్గించుట నన్నయ భారతమునఁ బెక్కుచోట్లఁ గాన్పించును అసలు నన్నయ యెచ్చటను భావములను పొంగిపొర్లునట్లుగా

1. ప్రధానరసా ప్రతికూలః వ్యాఖ్య

వర్ణింపఁడు. భావనిగ్రహ మాతని రచనలో సర్వత్ర గోచరించు చుండును. ఎట్టి యెడరు దొడరినప్పుడైన నాతని పాత్రలు గాంభీర్యమును విడువక నిగ్రహముతో వర్తించుచుండును. కుంతి కర్ణుని గంగలో విడుచునట్టి ఘట్టమును బరికించినచో నీ విషయము తేటతెల్లము కాఁగలదు. మాతృహృదయము కరుణరస సముద్రమై దుఃఖతరంగములను వెల్లివిరియఁ జేయవలసిన ఘట్ట మిది. ఈ సన్నివేశమునే మఱల వర్ణింపవలసివచ్చినప్పు డారణ్యపర్వమున (ఏడవ ఆశ్వాసము) నెట్టన యట్లే వర్ణించెను. సమానవస్తు భావములైన యీ రెండు ఘట్టములను బోల్చి చూచినచో నన్నయ భావనిగ్రహము సువ్యక్త మగును. ఉదంకుఁడు సర్పయాగ బుద్ధి పుట్టించుటకై జనమేజయుని కడ కరుదెంచి యాతని "మిత హిత సత్యవాక్య జనమేజయ" (ఆది. ౧-121.) యని సంబోధించెను. ఈ మితవాక్యత్వము నన్నయ పాత్రి లన్నింటియందుఁ గానవచ్చుచుండును. యయాతి పూరునకు నీతులు బోధించునపుడు.

"మనమునకుఁ బ్రియంబును హితమును బథ్యముఁ దథ్యమును
నమోఘము మధురం
బును బరిమితమును నగు పలు కొనరఁగఁ బలుకునది ధర్మ
యుతముగ నఖిలన్ ...."
(ఆది. 3-205.)

అని బోధించెను. పలుకు మధురమును బరిమితమునై యుండవలె ననుట నన్నయ యాదర్శము.

నన్నయ భారతమున నా యా ఘట్టము లందు వివిధ రసములు మితము లయ్యుఁ జక్కఁగాఁ బోషింపఁ బడి యున్నవి. అతఁడు వర్ణించిన యుద్ధము లన్నియు వీరరసమున కాకరములు. అందును అరణ్య పర్వము నందలి సౌంభకాఖ్యానము నందును, నివాత కవచ సంహార సందర్భము నందును ఆ రసము పరమోదాత్తమైన పరిపోషము నొందినది. పాండవులు వనమున కేగునప్పుడు కుంతి విలపించు సందర్భమునఁ గరుణరసమును, అమృత మథనసందర్భమున నద్భుతరసమును, గణ్వాశ్రమ వర్ణన సందర్భమున శాంతరసమును, భీముఁడు బకాసురుని వధించి యాతని కళేబరము నీడ్చుకొనివచ్చి నగరద్వారమున విడిచిన సందర్భమున బీభత్స రసమును, తపతీ సంవరణులకథ, గంగా శంతనుల సమయము, మత్స్యగంధీ పరాశరుల సమాగమము, శకుంతల జన్మవృత్తాంతము మున్నగుచోట్ల శృంగారరసమును వర్ణింపఁబడినవి. నల్లో

పాఖ్యానము కరుణరస పూరితమై యున్నది. ఊర్వశి యర్జునుని వలచిన ఘట్టము శృంగార రసాభాసమున కిరవై యున్నది. నన్నయ తన రచనలో మూఁడు నాల్గుచోట్ల మృదువైన హాస్యమును గూడఁ బ్రదర్శించియున్నాఁడు. ద్రౌపది యర్జునుని వరించినపిమ్మట స్వయంవ రాగతులైన రాజు లందఱును ద్రుపదుని మార్కొన నాతఁడు భీతుఁడై బ్రాహ్మణుల మఱువు సొచ్చెను. "ఇట్లు శరణాగతుండైన ద్రుపదు నోడకుండు మని బ్రాహ్మణులు తమ దండాజినంబు లెత్తికొని ప్రతిబలంబుపై" పేవఁ దొడంగిరి. ఈ ఘట్టము హాస్యరస పూరితమై నవ్వు పుట్టించుచున్నది. మనకే యేల. అది చూచినప్పు డర్జునునకుఁ గూడ నవ్వు వచ్చెను. (ఆది. ౭-191). వేశ్య ప్రబోధించి యరిగిన పిమ్మట ఋశ్య శృంగుఁడు తదేకధ్యాన మగ్నుఁడై యగ్నిహోత్రంబు వ్రేల్వక చింతాపరుండై యుండఁ దండ్రి వచ్చి యాతఁ డట్లుండుటకుఁ గారణ మడిగెను. అప్పుడు ఋశ్యశృంగుఁడు ఋషికుమారుఁ డను భావముతోనే యా వేశ్య యువతిని వర్ణింప మొదలిడెను. (అర. తృతీ. 103-106). ఇచ్చట ఋశ్యశృంగుని స్త్రీరూప జ్ఞానహీనత హాస్యమున కవలంబమై యున్నది. "అనయము వట్రువ లగు రెండు పిండంబు లురమున విలసిల్లుచుండ" (అర. 3-103) ఇత్యాదిభావము లుత్తర రామ చరిత్రము నందలి ఋషికుమారుల యశ్వవర్ణనము వలె హాస్యరసమున కధికస్ఫూర్తి కలిగించుచున్నవి.

పాత్ర పోషణము :-

నన్నయ పాత్రపోషణమునఁ గృతహస్తుఁడు. అతఁడు సర్వపాత్రల స్వభావమును లెస్సగా గ్రహించిన వాఁ డగుటచే వానిని సుస్పష్టరేఖలతోఁ దీర్చిదిద్దుచుండును. గాంభీర్యమును, ఉదాత్తతయు నాతని పాత్రలయందలి సామాన్యలక్షణము. పుత్రాధీనుఁడై ధృతరాష్ట్రుఁడు పాండవులయెడ వాత్సల్యము నభినయించుటయు, దుర్యోధనుని యీర్ష్యాదౌష్ట్యములను, దురభిమానమును, శకుని కైతవమును, విదురుని ధర్మజ్ఞతను, ధర్మజుని ధర్మతత్పరతను, భీష్ముని నిష్పక్షపాతమును, కృపద్రోణుల తాటస్థ్యమును, భీమార్జునుల భ్రాతృభక్తిని, శ్రీకృష్ణుని ధర్మరక్షణ పరాయణతను జక్కఁగా వర్ణించెను. స్త్రీ పాత్రలను సృష్టించుటలో నాఁత డందెవేసిన చేయి. అతని స్త్రీలు పాతివ్రత్యమునకుఁ బట్టుకొమ్మలు; గరువతనమున కిరవులు; భారతనారీత్వము రూపుగొన్న బంధురమూర్తులు. గాంధారి పాతివ్రత్యమును, ద్రౌపది ధర్మజ్ఞతయు, గృహిణీ

త్వమును, కుంతి యుదాత్తతయుఁ బుత్త్రప్రేమయు, దమయంతి పతిప్రేమయు, లోకజ్ఞతయు, దేవయాని గడుసుఁదనమును, సుకన్య యౌవన చాపల్యమును, పాతివ్రత్యమును,ఆతని రచనలో సమగ్రస్ఫూర్తితో వర్ణింపఁబడి యున్నవి.

1. పాండవుల యెడఁ బ్రజ లనురక్తులై యుండుట యెఱింగి దుర్యోధనుఁ "డుపాయంబున గొంతిని బాండవులను వదీయ భృత్యామాత్యవర్గంబుతో వారణావతంబునకుం బుత్తము మనకు రాజ్యంబు సుప్రతిష్ఠితం బైన వార లిందులకు వత్తు" రని పలుక ధృతరాష్ట్రుఁడు

"ఏ నెల్లప్రొద్దు నా యెదలోనఁ దలఁతు నీ యభిప్రాయంబ, యిది దారుణంబు
గాన వారునకుఁ జుల్కన తేర నోపఁ గడఁగి పాండవుల నేకత మెట్టు లనుప
గా నగు, మఱి దీని గాంగేయ విదుర కలశజాశ్వత్థామ గౌతముల్ బుద్ధి
గా నొండబడుదురె కాదయ్య ......... ......." (ఆది.౬-129)

అని చెప్పియుండెను. ధృతరాష్ట్రుఁడప్పుడప్పుడుపాండవులయెడఁ బ్రీతియున్నట్లు నటించినను నిజముగా వారియెడ నాతనికిఁ గల భావ మీ పద్యమున వెల్లడి యగుచున్నది. విదురుఁడు "కులదూషకు దూషించి కులంబు రక్షింపు" మని పలుక నాతఁడు కుపితుఁడై "నీవు నా కొడుకుల యున్నతి కెన్నండు సహింపవు నీ సహాయత్వంబు నే నొల్లఁ బాండవుల కడ కేనియు నొండుగడ కేనియు నీ యిష్టం బైనచోటికి నరుగు" మని (అర. ౧-53) పంపివైచెను.

2. ప్రజలు పాండవుల యెడ ననురక్తులై యుండుట వినియుఁ, బాండవుల రాజసూయ యాగవైభవమును, వారికి మయుఁడు నిర్మించి యిచ్చిన సభను గనియు, దుర్యోధనుఁడు పొందిన యీర్ష్య వర్ణనాతీతమైనది. సభలో జరిగిన యవమానమున కాతఁడు ప్రదర్శించిన యభిమాన మింతింత యనరాదు. ఈ యీర్ష్యాభిమానములచే

"కందుగల పసిఁడి గాఁచినఁ గంది వివర్ణ మయినట్లు కౌరవుకాయం
బొందఁగవివర్ణ మయి కడువందె మనస్తాప హవ్యవహ దాహమునన్."
(స. ౨-89.)

3. భారత కథలో నధర్మము జరిగినప్పు డెల్ల జంకక ధృతరాష్ట్రుని తోడను దుర్యోధనుని తోడను అట్లు కూడ దని చెప్ప సాహసించిన వాఁడు విదురుఁ డొక్కఁడే. ఇదియాతని ధర్మపరాయణతను సూచించుచున్నది. ధృతరాష్ట్రునికిఁ గూడ నాతని ధర్మజ్ఞతపై నమితమైన ప్రత్యయము కలదు ద్యూత సమయమున "ధర్మాధర్మ విదుం డైన విదురున కిది సమ్మతంబు కాదు. సురపతి గురుం డైన బృహస్పతి సేసిన నీతిశాస్త్ర రహస్యంబులం దెవ్వరి కంటె విదురుం డెంతయు విశారదుండు. ఏను విదుర శాసనంబున వర్తిల్లుచున్నవాఁడ. అతఁ డర్థానర్థవిదుండు. సకలకార్య సమర్థుండు " (స. ౨-148) అని యాతఁడు పల్కుట యిందుకుఁ దార్కాణము.

4. ''చతురంగ బలసమేతులమై యుద్ధమునఁ బాంచాలు భంజించి పాండవుల నొండుగడ నుండనీక తోడ్కొని తెత్త మనినఁ గర్ణు పలుకు లాకర్ణించి ధృతరాష్ట్రుం డిది యకార్యం బగు నయినను మతిమంతులతో విచారించి చేయుద" మని భీష్మాదులం బిలిపించి వారి కంతయు నెఱింగించెను. అప్పుడు భీష్ముఁడు.

> "ధీయుతా ధృతరాష్ట్రపాండు లతిప్రశస్తగుణుల్ ప్రసి
> ద్ధోరు కీర్తులు నాకు నిద్దఱు నొక్క రూప తలంపఁగా
> వీరు వా రనునట్టి బుద్ధివివేక మెన్నఁడు లేదు గాం
> ధారి పుత్త్రశతంబునందుఁ బృథాతనూజుల యందునన్."
>
> (ఆది. ౮-29.)

అని చెప్పుట యాతని సమస్వభావమును వ్యక్తము చేయుచున్నది.

5. నన్నయ రచించిన భారత భాగమున ధర్మజుని ధర్మతత్పరత పెక్కుచోట్లఁ గాననగును. అతఁడు ధర్మమునకుఁ గట్టువడియే యుండనిచో నపారపరాక్రము లైన భీమార్జును లెప్పుడో కౌరవుల పై కెత్తిపోయి యుందురు. భీముని కోపము నాతఁడు పెక్కుసార్లు వారించెను. ఇట్టిపట్ల నాతని ధర్మతత్పరతతో పా టాతని యనుజుల భ్రాతృభక్తియు వెల్లడి యగు చుండును.

6. సభలోఁ దన కవమానము జరుగుచున్నప్పుడు ద్రౌపది భీతయై కృష్ణుఁ దలంచెను. దుశ్శాసనుఁడు దౌర్జన్య మొనరించినను ఆమె కవమానము కలుగలేదు. ఇ ట్లామె శీలమును గాపాడిన దెవ్వరో నన్నయ చెప్పలేదు. కాని

కృష్ణుఁడే. ఇది యొక్కటి చాలును గృష్ణుని ధర్మరక్షణ పరాయణతను సూచించుటకు.

7. సుబలుఁడు గాంధారిని ధృతరాష్ట్రున కీయ నిశ్చయించెను. ఈ మాట విని గాంధారి తన్నుఁ బితృదత్తనుగా నెఱింగి పరమపతివ్రత యౌటచేఁ బరపురుష దర్శనంబు పరిహరించి తన పతి కనుగుణముగా నేత్రపట్టము కట్టుకొనెను.

8. దేవయాని నూతఁ ద్రోయఁబడి బైటికి రాకుండుట కామె యస మర్థత కాక గడుసుఁదనము కారణము. అట్టి స్థితిలో నితరు లెవ్వరైనఁ దన్నుఁ జూడవలె నని యామె యభిప్రాయము. తండ్రికిఁ దనపైఁ గల యనురాగ మును బురస్కరించుకొని యామె చేసిన చేఁత లామె దిట్టతనమును సూచించును.

9. దమయంతి నలునితో నడవి కేగి యాతనితోఁ బెక్కుడుపులఁ గుడుచుట యామె పతిప్రేమకుఁ దార్కాణము. నలుని గుర్తించుటకై యామె కావించిన యత్నములును, బాహుకుఁడే నలుఁడని నిర్ణయించుపట్ల నామె చూపిన నేర్పును అనన్య సామాన్యమైన లోకజ్ఞతను వెల్లడి చేయుచున్నవి.

10. సుకన్య చ్యవనుని నేత్రకాంతులను జూచి పుట్ట గ్రొప్పించుట యామె యతిశయ రూపయౌవన గర్వమును సూచించుచున్నది. తరువాత నామె యశ్వినీదేవతల మెచ్చక చ్యవనునే వరించుట యామె పాతివ్రత్యమును బ్రకటించుచున్నది.

11. ఏకచక్ర పురాగ్రహారమునఁ దా మున్న బ్రాహ్మణునికిఁ గలిగిన యాపద తొలఁగించుటకై కుంతి భీమునిఁ బంప నెంచుటయు, నప్పుడు ధర్మజుఁడు నివారింపఁ బోఁగా నామె పల్కిన పల్కులును (ఆది. ౬-283) ఆమె యుదాత్తతను వెల్లడి చేయుచున్నవి. కర్ణుని గంగలో విడువవలసివచ్చి నప్పుడును, పాండవ వనగమన సమయమునను ఆమె ప్రకటించిన భావములు మాతృహృదయ మార్దవమును వేయివిధముల వ్యక్తము చేయుచున్నవి.

12. అన్నియు నొకయెత్తు. ద్రౌపదీ పాత్రచిత్రణ మొకయెత్తు. సభాపర్వమున నన్నయ యనన్యాదృశమైన యామె గృహిణీత్వమును, ధర్మజ్ఞతను వెల్లడిచేసెను. "జన్నంబు సూడంగ సకలభూములనుండి వచ్చిన రాజన్యవరుల ...... పేదల సాధుల నిత్యంబుఁదాన పరీక్షించి తగ నెఱింగి

యన్నంబు దయఁబెట్టి యందఱుఁ గుడిచినఁ దనుమధ్య యర్ధరాత్రంబు నపుడు గాని కుడువ దట్టి కమలాక్షి - ద్రౌపది " ( స. ౨-116. ) యనునట్ల దుర్యోధనుఁడు పరిశీలించిన విషయము. ఇది ద్రౌపది యుత్తమ గృహిణీత్వ మును బలువిధములఁ బ్రకటము చేయుచున్నది. దుశ్శాసనుఁడు తన్ను సభలోని కీడ్చుకొని వచ్చిన తఱిఁ గోపలజ్జాపరవశయై యామె పల్కిన పల్కు లామె సత్యమైన యాగ్రహావేశమును ధర్మశీలమును వ్యక్త మొనరించు చున్నవి. ప్రాతికామి దుర్యోధనుని యానతిపైఁ దన్ను సభలోనికిఁ గొనిపో వచ్చినప్పుడు "మున్నుఁ దన్నోటువడి మఱి దన్ను నోటువడియెనో, నన్ను ము న్నోటువడి విభుండు గ్రన్నఁ దన్నోటు వడియెనో యన్న ! నాకు నెఱుఁగఁ జెప్పు" (స. ౨-209) మని ప్రశ్నించుట యామె నీతిజ్ఞతకును, ఆరణ్యపర్వమున క్షమాతేజః ప్రదర్శనమును గూర్చి యామె ధర్మజునితోఁ గావించిన సంవాద మామె రాజనీతి పరిజ్ఞానమునకును, ధృతరాష్ట్రుఁడు పిలిచి వరములు కోరుకొ మ్మన్నప్పుడు "వైశ్యసతికి నొక్కవరము, సత్క్షత్రియసతికి రెండు, శూద్రసతికి మూఁడు, విప్రసతికి నూఱు వేఁడ బ వ్వరములు గాన యింక వేఁడఁ గాదు నాకు" (స. ౨-263) అని పల్కుట యామె ధర్మజ్ఞత కును, దార్కాణములై యున్నవి. ఆమె స్వార్థము విడిచి భర్తృదాస్య విమోచ కములైన వరములఁ గోరి విపత్తిసాగర నిమగ్నులైన భర్తల నుద్ధరించుట యామె పాతివ్రత్యమును బెక్కువిధములఁ బ్రకటించు చున్నది. "ఆమె ప్రకృతి మానవ భామిని కాదు. పరమ పతివ్రత. తపస్విని. అయోనిజ. ధర్మరత" ( స. ౨-255 ). అని ధృతరాష్ట్రుఁడే యామె శీలమును విదిత మొనరించి నాఁడు.

నన్నయ సాధారణముగా నా యా పాత్రలను మొదటఁ బ్రవేశపెట్టు నప్పుడే వారి శీలములందలి ముఖ్యాంశములను విశేషణములచే సూచించు చుండును. ఇట్టి సూచనల కీ క్రిందివి కొన్ని యుదాహరణములు.

"అయ్యుదంకుండు గురుహితకార్యధురంధరుం డయి" (ఆది. ౧-93)

"మితహితసత్యవాక్య ! జనమేజయ .... " ( ఆది. ౧-121 )

"రురుఁడు పుట్టెఁ గాంతియుతుండై .... " (ఆది. ౧-144)

"అరుణుఁ డనంగా నుదయించె సుతుండు మహాసీతియుతుండు
తల్లి కప్రియ మెసఁగన్ (ఆది. ౨-6)
"బలవన్నిజదేహ సముజ్జ్వల ప్రభాధూత పతంగతేజుఁ డుదితుం
డయి తార్క్ష్యుఁడు తల్లికిం మనఃప్రీతి యొనర్చుచున్ నెగసె."
(ఆది. ౨-38)
"పరమతపోనిధి యాయావర వంశోత్తముఁడు నియమవంతుఁడు
.... జరత్కారుఁడు .... బ్రహ్మచర్య పరిపాలకుఁడై"
(ఆది. ౨-138)
"వాసవప్రతిముండు వసు వను నాతండు". (ఆది. 3-23)
"వర్ణధర్మముల్ గాచుచు వసుధ యెల్ల ననఘచరితుఁడై యేలిన
యయ్యయాతి." (ఆది. 3-97)
"బాలుండవు నియమవ్రతశీలుండవు" (కచుఁడు). (ఆది. 3-106)
"ఆ దుష్యంతుఁ డనంతసత్త్వుఁడు" (ఆది. ౪-8)
" యౌవన గర్వంబున నొప్పె నుర్విఁ గడు నధికుండై "
( ఆది. ౪-7 )
" తన్విఁ బయోజ దళాక్షి ... శకుంతల యను కన్యకం గవియె. "
(ఆది. ౪-25.)
"ఆత్మవిజ్ఞానంబు నందు సనత్కుమారాదుల యట్టిఁడ
యనఘ మూర్తి"- (భీష్ముఁడు). (ఆది. ౪-168)
"బలవన్మదనాగాయుత బలయుతుఁడు సుతుండు పుట్టెఁ
ప్రజ్ఞాచక్షుం డలఘుఁడు ధృతరాష్ట్రుండు-" (ఆది. ౪-255 )
"గుణరత్నాంబుధి పాండురాజితాంగుండు ప్రభవించెం బాండు
రాజు గురువంశంబు ప్రతిష్ఠింప" (ఆది. ౪-256.)
"పరమపతివ్రత పరపురుషసందర్శనంబు పరిహరించి-" గాంధారి
(ఆది. ౫-11)

"యదుకుల విమలపయఃపయోనిధి సుధాకరరేఖ
వినయాభిమాన వివేకసౌజన్యాది సదమలగుణరత్న జన్మభూమి
పరమ పతివ్రతాభరణాభిశోభిత-" కుంతి (ఆది, ౫-34)

"పుత్త్రుఁడు ధర్మవంశమునఁ బుట్టె నతిస్థిర ధర్మమూర్తియై"
ధర్మరాజు- (ఆది. ౫-94.)

"ఉదారచరిత్రు నుత్తమస్థిరజవసత్త్వ నయ్యనిలదేవుదయం
గలిగింపు పెంపుతో-" భీముఁడు- (ఆది. ౫-102)

"గాంధారికి నగ్రనందనుఁడు ఘనుఁడు పుట్టెఁ గలియంశమునన్
(ఆది. ౫-105)

"స్థిరపౌరుషుండు లోకోత్తరుఁడు.. భాసురితేజుఁడు వంశ
కరుఁడు సుతుఁ డుదయించెన్." (ఆది. ౫-122)

"కవలవారు సూర్యేందుప్రకాశతేజులు" (ఆది. ౫-133)

"పాండుతనయులు వినయాన్వితులు"

"భీమునకు నందొఱు కీడ్పడఁ దొడఁగి రుద్ధతులు రాజసుతుల్"
(కౌరవులు) (ఆది. ౫-163.)

"కులపవిత్ర సితేతరకోమలామలవర్ణ .... దివ్యతేజము దాల్చి
యొక్క కుమారి తజ్జ్వలనకుండమునందుఁ బుట్టెఁ బ్రసన్న మూర్తి-"
ద్రౌపది. (ఆది. ౭-20.)

"వేల నయ్యంబుధి గడవనియట్ల శాంతుఁ డయి యెవ్వఁడేనిఁ
గృతాంతకుఁ గడవంగ నొల్లండ యట్టి యత్యుగ్రతేజు"
(ఆది. ౭-94.)

"వీత సమస్తదోషు- జగత్పూత చరిత్రు- సాధుజన పూజితు-
హితభాషణు-" (ధౌమ్యుఁడు). (ఆది. ౭-157)

"ధర్మార్థ విత్తముల్ తథ్యవాదులు వయోవృద్ధులు మధ్యస్థ విమల
మతులు ద్రోణగాంగేయులు దురితవిదూరులు-" (ఆది-౭-42)

"విదురుఁ డనఁగ ధర్మవిదుఁడు" (ఆది. ౪-258)

"ప్రియసహోదరుల్ దొల్లి సుందోపసుందులు-" (ఆది. ౮-94)

"అతిదర్పోద్ధతుఁడు మహాద్భుతభూరిబలుండు చేదిభూపతి."
శిశుపాలుఁడు- (స. ౧-110.)

"ఆయత భుజవీర్యులు మాయాయోధులు హంసడిభక లను
వార లనిర్జేయులు పరస్పరస్నేహాయత్త సుచిత్తులు-" (స. ౧-111.)

"ఖల్లుఁడు బృహద్రథాత్మజుఁడు గర్విష్ఠుఁడు" (స. ౧-118.)

"పరమపతివ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవధర్మపత్ని ధ
ర్మరతసమోవిజన్-" (స. ౨-255.)
"నల్లుఁ డను వాఁ డనేకాక్షౌహిణీపతి యనవరతాక్షప్రియుండు"
(అర. ౨-7)
"భగీరథుఁ డను చక్రవర్తి నపరాజితతేజు విజాన్వవాయ దు
ష్పథవినివర్తకున్." (అర. 3-74)
"ఋశ్యశృంగు వేదాంతనివేది దాఁ బనుపు మంగమహేశ్వర"
(అర. 3-93)
"విద్యుల్లతాంగి .. సద్యస్సంజాత బుద్ధిసంభ్రమ-" సుకన్య.
(అర. 3-177)

"ప్రియసాహసుండు భీముఁడు" (అర 3-371)
పై విశేషణములను బాగుగాఁ బరిశీలించినచో నవి యాయా పాత్రల గుణశీల స్వభావముల నెట్లు వివృత మొనరించుచున్నవో తెలియ నగును. నన్నయ ముం దొసంగు నీ బీజములనే క్రమముగాఁ బెంచి కథ యంతటను వ్యాపించున ట్లొనరించును.

కొన్నిచోట్ల నన్నయ ప్రతియోగముచే (Contrast) అనఁగాఁ బాత్రలయం దుండు విరుద్ధ గుణములను, వారుచేయు విరుద్ధకార్యములను స్పష్టముగా వివరించుటచే వారి శీలస్వభావసములను స్ఫుటిమ మొనరించుచుండును.

(a) ఆదిపర్వ పంచమాశ్వాసమునఁ బాండవులు హస్తినాపురమున కరుదెంచిన వెంటనే యాతఁడు పాండుకుమారులు వినయాన్వితు లనియుఁ, గౌరవు లుద్ధతు లనియుఁ జెప్పియుండెను ఈ విశేషణము లల్పము లయ్యుఁ బాండవకౌరవ గుణశీలభేదములను సమగ్రముగా వెల్లడించుచున్నవి.

(b) మయుఁడు పాండవులకు నిర్మించియిచ్చిన సభ వైభవమును జూచి దుర్యోధనుఁ డసూయాగ్రస్తుడై శోకింప నారంభించెను. తన శరీరకార్శ్యమునకు గారణమును జెప్పుచు నాతఁడు

"భావి పురాత నాద్యతన పార్థివలక్ష్మిలు పాండవేయు ల
క్ష్మీవిభవంబుతోడ నుపమింప సమంబులుగా వశేష రా
జావళిలోన నత్యధికులైన సపత్నుల పేర్మిఁ జూచియేఁ
జావె సహింప నోపక కృశుండ వివర్ణుఁడ నైతి నెంతయున్."
(సభా. ౨-114)

అని తన యసహనమును వెలిబుచ్చెను. దుర్యోధనునికై ధృతరాష్ట్రునిచేఁ గట్టింపఁబడిన సభను జూచి ధర్మరా జెంతయో మెచ్చుకొనెను.

"ఆ ధృతరాష్ట్రుచేసిన యనర్ఘమణిప్రకరానుబద్ధ శో
భాధృతి నొప్పుచున్న సభ పార్థివముఖ్యుఁడు ధర్మజుండు దు
ర్యోధనుఁ దర్థిఁ జూపఁగ సహోదరవీరులుఁ దానుఁ జూచి ల
క్ష్మీధరమూర్తి యెంతయును మెచ్చె మనంబునఁ దద్విభూతికిన్"
(స. ౨-162)

పై రెండు సందర్భములను బరికించినచో దుర్యోధన యుధిష్ఠిరుల శీలములందలి తారతమ్యము చక్కఁగా గోచరించును.

(c) కద్రూ వినత లంబుధితీరమున నుచ్చైశ్శ్రవమును గాంచిరి. కద్రువ దాని వాలప్రదేశమున నల్లయై యున్న దని పలికెను. వినత యా యశ్వరాజ మూర్తి నిర్మలమై యొప్పుచున్న దని వాక్రుచ్చెను. కద్రువ పందెము వేయు మనెను. ఇద్దఱును బందెము వేసిరి. వినత దగ్గఱకుఁ బోయి గుఱ్ఱమును జూతమని పలుకఁ గద్రువ "యిప్పుడు ప్రొద్దులేదు. రేపకడ చూత" మని యప్పటి కా పని తప్పించెను. ఈ మాటల వైఖరిలోనే వారి శీలములందలి భేదము గోచరించుచున్నది.

మనస్తత్త్వ నిరూపణము :-

నన్నయ కథలయం దచ్చటచ్చటఁ బాత్రల మనస్తత్త్వములను జక్కఁగా నిరూపించుటయే కాక తత్తదింగిత చేష్టా వర్ణనముచేఁ దన మానవ మానసస్వభావ పరిగ్రహణమునుగూడ వెల్లడిచేయుచుండును. ఇందు కాతని వచనమున నిదర్శనములనేకము లున్నను మూఁడు నాలు గుదాహరణములు మాత్ర మొసంగెదను.

(a) బకాసురవధ ఘట్టమున నా యసుర కాహారము పంపు వంతు తమకు వచ్చుటచేఁ బాండవులు నివసించుచున్న యింటిలోని బ్రాహ్మణుఁడు, అతని భార్య, వారి కూఁతురు, బకుని కాహారముగా, 'నేను బోయెద, నేను బోయెద' నని పల్కుచు దుఃఖించుచుండిరి. ఆసమయమున వారల కన్నీళ్లు తుడుచుచు

"బాలుఁ డొక్కండు కొండొక కోల చేతఁ
బట్టుకొని యేను రక్కసుఁ గిట్టి చంపి
చులకఁగా వత్తు మీ రేడ్వవలవ దనుచుఁ
గలయ నూరార్చెఁ దన తొక్కుఁ బలుకు లొప్ప". (ఆది. ౬-260.)

ఆ బాలుఁడు చిఱుతవాఁడు. అతని కా యాపదయొక్క అనివార్యత కాని యా రక్కసుని బలము కాని తెలియదు. తనచేత నున్న కోలతో రక్కసునిఁ జంపుట యశక్య మనియు నాతఁ డెఱుంగఁడు. అయ్యుఁ బితరులును సోదరియు దుఃఖ మగ్నులై యుండుట యాతని మనస్సునకుఁ గలఁత కలిగించుటచే నతఁ డా తొక్కుఁ బలుకులతో వారి నోదార్చెను. ఇట్లు పలుకుట యా బాలస్వభావమున కెంతయు సహజమై నన్నయ మనస్తత్త్వ పరిశీలనమును వెల్లడిచేయుచున్నది

(b) మత్స్యగంధిని జూచి పరాశరుఁడు కామపరవశుఁ డైనప్పుడు నన్నయ వర్ణించిన సీసపద్యమున నాతని యింగితము సహజమనోహరముగా వర్ణింపఁ బడియున్నది. ఇం దాతని మదనవికార మాదర్శమునవోలెఁ బ్రతి పదమునందును సువ్యక్త మగుచున్నది.

'చపలాక్షి చూపుల చాడ్పున కెద మెచ్చుఁ జిక్కని చనుఁగవఁ జిఁఁగోరు' ఇత్యాది పద్య మిదివఱ కొసంగఁబడినది. (ఆది. 3-38.)
తిక్కన సోమయాజి కీచకుని మదనవికారమును వర్ణించు తఱి నిట్టిపద్యములు పెక్కు వ్రాసెను.

(c) ధర్మజుఁ డింద్ర ప్రస్థమున రాజ్య మొనరించు చుండఁగా నొక విప్రుని హోమ ధేనువును ముచ్చు లపహరించిరి. అప్పు డాతఁ డాక్రోశింప నర్జునుఁ డాతనిఁ బిల్చి యందుకుఁ గారణ మడిగెను. ఆ విప్రుఁడు తన గోవును ముచ్చు లపహరించుట తెల్పి

"వదలక ముచ్చుల పధియించి నా హోమధేనువుఁ గ్రమ్మఱఁ దెచ్చియిమ్మ
జననుత! దానివత్సంబు విన్నటఁ గోలె నుడుగక యఱచుచు నున్న యదియు"
(ఆది. ౮-118)

అని పలికెను. గోవులు వేళ కింటికి రావిచో వత్సము లంభారవ మొనరించుచు నలజడి పొందుట యెల్ల రెఱింగిన విషయమే. నన్నయ పై పాదమున నా నైసర్గిక స్థితిని లెస్సఁగా వర్ణించి కరుణరసమును గురియించినాఁడు.

(d) దుర్యోధనుఁడు దుశ్శాసనునిఁ బిల్చి కురువృద్ధు సమీపమున నున్న ద్రౌపదినిఁ దోడ్కొని రమ్మని పంపెను.

"నిర్దయాత్ముఁ 'బాపనిరతు' దుశ్శాసనుఁ బనుచు బెఱిఁగి కృష్ణ పంకజాక్షి
కడు భయంబు నొంది గాంధారి యొద్దకు నరిగెఁ గడు నడింగి యతి
రయమున" (స. ౨-213.)

ఆ సభలోఁ బురుష లోక ప్రక్కను స్త్రీ లోక వైపునను గూర్చుండి యుందురు. దుశ్శాసనుఁడు కాని మఱి యెవ్వరు కాని స్త్రీ లున్న యెడ కరుగుట సభ్యతకు విరుద్ధము. అందుచే ద్రౌపది రానున్న యాపద నెఱింగి గాంధారి చెంత కరిగెను. మఱియు మానభంగ భీతి యుదయించి నప్పుడు స్త్రీలు రక్షణాపేక్షమై నన్యస్త్రీల ప్రాపు చేరుట సహజము. అందుచే నిచ్చటి వర్ణనము నిసర్గమై స్త్రీ స్వభావమున కెంతయో తగి యున్నది.

(e) నలుఁడు నిద్రించుచున్న దమయంతిని విడిచి పోవునప్పుడు నన్నయ కావించిన యాతని మనః పరిస్థితి వర్ణనము మిక్కిలి నిసర్గమై యద్భుతముగా నున్నది.

"కలి దమయంతిఁ బాప సమకట్టు సతిం బతి వాయ నోపఁ డా
లలన సుదీర్ఘ సౌహృద బలంబున విట్టుల రెంటఁ జేసి య
న్నలుఁడు విమోహ రజ్జులఁ బెనంగి గతాగతకారియైన యు
య్యేలయును బోలె నూఱడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చి తాత్ముఁడై.
(అర. ౨-78.)

గతాగతకారి యైన యుయ్యేలయును బోలె నను నుపమాన మిచ్చుట నలుని మానస స్థితిని సువ్యక్త మొనరించు చున్నది. ప్రియురాలిని బలవంతముగా విడిచి పోవలసి వచ్చినప్పుడు ప్రియుఁడు పొందు వ్యథ యిందు చక్కఁగా నిరూపింపఁ బడినది.

(f) నలుఁ డుద్యానమున విహరించుచు నొక హంసను బట్టుకొనెను. అప్పుడు

"దాని విడిచి పోవఁగా నోప కఱచుచు నంత రిక్షమునను హంస లెల్లఁ
బిండుగట్టి తిరుగుచుండె వాతోద్ధూత శారదాభ్ర శకల చయముఁ బోలె"
(అర. ౨-13)

తమ గుంపులోని యొక పక్షి కాపద తటస్థించు నప్పు డితర పక్షు లిల్లే చేయును. నన్నయ యీ పద్యమునఁ బక్షి స్వభావము నెంతో సహజముగాఁ బ్రదర్శించి యున్నాఁడు.

ఔచిత్య పరిపోషణము :-

" అనౌచిత్యా దృతే నాన్య ద్రస భంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్య బంధ స్తు రస స్యోప నిష త్పరా" అని

ఆనందవర్ధనుఁడు చెప్పియున్నాఁడు. అందుచేఁ గవు లనౌచిత్యమును బరిహరించి యౌచిత్య పోషకముగా రచన సాగించుట కెంతయేని అవశ్యకము గలదు. రచన యితర విధముల నెంత యుత్తమమై యున్నను అనౌచిత్య జుష్టమై యున్నచో రస భంగమునకు దారి తీయును. ఈ విషయము నెఱిఁగిన వాఁడు కావున నన్నయ యౌచిత్య పోషణ విషయమున నెంతో శ్రద్ధ వహించి తన రచన నత్యుదాత్తముగా సాగించి యున్నాఁడు.

(a) యయాతి చరిత్రలో శర్మిష్ఠా దేవయాన్యాదులు రెండు సారులు వన విహారమున కరిగిరి – దేవయాని యయాతినిఁ బెండ్లాడక ముందు – తరువాత. మొదటిసారి నన్నయ " వృషపర్వు కూఁతురు శర్మిష్ఠ యను కన్యక యొక్క నాఁడు కన్యకా సహస్ర పరివృత యయి " (ఆది. ౧-134)

అని శర్మిష్ఠకుఁ బ్రాధాన్య మొసంగెను. రెండవ సారి

" వనకేళీ కౌతుకమునఁ జనియెను శర్మిష్ఠ దొట్టి సఖు లెల్ల ముదం
బునఁ గొలిచి రాఁగ విభవము దన కమరఁగ దేవయాని
తద్వనమునకున్ " (ఆది. 3-154)

అని దేవయానికిఁ బ్రాధాన్య మొసంగెను. అప్పుడు శర్మిష్ఠ రాజు కూఁతురు. దేవయాని పురోహితుని బిడ్డ. ఇప్పుడు దేవయాని రాణి, శర్మిష్ఠ దాసి అందుచే నీ మార్పెంతయు నౌచిత్య పూరితమై యున్నది.

(b) దమయంతి యడవులలో నిడుమలు పడిపడి చివరికిఁ బుట్టినిల్లు చేరెను. అప్పటి నుండి యామె భర్తృ మార్గణమునకై ప్రయత్నములు చేయ మొదలు పెట్టెను. ఆమె యేది చేయ నెంచినను దల్లి తోడనే చెప్పి యామె యనుమతి నందియే చేయు చుండెను. ఆమె తండ్రితో నేమియు మాటాడ లేదు. తల్లియే యామె కోరిక భర్త కెఱింగించి దానిని సఫల మొనరించు చుండెను. ఇది రాజ గృహ మందలి మర్యాద. వయసు వచ్చిన స్త్రీ లే విషయమునఁ గాని తండ్రి కెదురుపడి మాటాడరు. వా రన్నియుఁ దల్లి ముఖముననే యాతని కెఱింగింతురు. నల చరిత్రలో నన్నయ యీ యౌచిత్యమును జక్కఁగాఁ బాటించెను.

(c) భీమరాజు భార్య వలన దమయంతి కోరిక యెఱింగి బాహుకుని దమయంతి యొద్దకు రావించెను. నలుఁ డప్పుఁడు నలుఁడుగా లేఁడు. వికృతాంగుఁడై యుండెను. దమయంతికి మాత్ర మాతఁడు నలుఁడే యని విశ్వయము. " సందియ మేల సర్వగుణ సంపదఁజూడఁగ బాహుకుండు భూవందితుఁ డైన నైషధుఁ

దవశ్యము దా నగు" నని యామె తన నిశ్చయము నంతకు మున్నే తల్లి కెఱిం గించెను. బాహుకుని యాకృతి చూచిన వా రితరు లెవ్వరు నట్లు తలంపరు. అట్టి స్థితిలో బాహుకుఁ డామె చెంత కరుదెంచెను. అతఁడు నలుఁడే యని యితరులు కూడ నెఱుంగు వఱకు నామె యాతనితో మాటాడరాదు. ఈ యౌచిత్యమును భావించి యిచ్చట నన్నయ కథ నెంతో నైపుణ్యముతో సాగించెను.

"విజనంబైన విపినంబు నందు నలసి నిద్రవోయిన దాని నబల నతిసాధ్వి ననువ్రతఁ …… బాసి నలున ట్లొరులు నిర్దయులై యరిగిన వారులేరు,
సురవరుల నురివి తన్నున్ వరియించిన నన్నుఁ బుత్త్రవతి నే లొకా చె
చ్చెర విడిచె నాతనికి నిష్కారుణున కే నేమి యెగ్గు గావించితినో.
నిన్ను విడువ నోడకుండు మని పలికిన యప్పలుకు లేల మఱచెనో"
(ఆది. ౨-207, 208)

అని దమయంతి బాహుకుఁడు వినునట్లుగాఁ బ్రథమ పురుషలోఁ బలికెను. అప్పుడు శోకాకులుఁడై నలుఁడు త న్నెఱింగించెను. పై సందర్భమున నన్నయ యవలంబించిన పద్ధతి మిక్కిలి యౌచిత్య భాసురమై యున్నది.

(d) ధర్మేతరములును, అసభ్యములును అగు విషయములను జెప్పవలసి వచ్చినప్పుడు నన్నయ వానిని వాచ్యముగాఁ జెప్పక వేఱు మాటలచే ధ్వనింపఁ జేయు చుండును. అతఁ డట్లు చేయుట కౌచిత్య దృష్టియే కారణము.

1. పరాశరుఁడు మత్స్యగంధిని గాంచి మదన పరవశుఁ డయ్యెను. అతఁ డామె జన్మంబు దివ్య జ్ఞానంబున నెఱింగి యయ్యోధ యెక్కి దానితోఁ జని యెను. పరాశరుఁడు దాని జన్మము దివ్య జ్ఞానమున నెఱుంగుట మూలములో లేదు. ఆమె నిజముగా దాశ కన్యక కాదు. వసు వీర్య ప్రభవ అని తెలిసిన పిమ్మటనే యాతఁడు తన యభిప్రాయ మామె కెఱింగించుట యౌచిత్యమున కాకరమై యున్నది. ఇచ్చట నాతని శృంగార చేష్టలనో శృంగార ప్రసంగమునో వర్ణింపక "తన యభిప్రాయ మెఱింగించి" యని వ్రాయుట యెంతో సభ్యముగా నున్నది.

2. యయాతి శర్మిష్ఠతో విహరించె ననుటకు బదులు "అయ్యయాతి యొడంబడి శర్మిష్ఠకు నభిమతం బొనరించె" ననుటయు, వర్ణనుఁ దులాపి

కోరిక విదిన పిమ్మట "దాని మనోరథంబు సలిపి యా రాత్రి నాగ భువనంబున వసియించె" ననుటయు ననౌచిత్య పరిహారకములును నౌచిత్య పోషకములునై భాసిల్లుచున్నవి.

3 కిరాతుఁడు దమయంతిని జూచి మోహ పరవశుఁ డయ్యెను. ఆతఁ డనాగరికుఁ డౌటచే నెట్టి యల్ప ప్రసంగమునైనఁ గావింప వచ్చును. అట్టి యెడఁ గూడ నన్నయ యనౌచిత్యమును బరిహరించుటకై "నిజ హృదయం బెఱిఁగించె లతాంగి కనింద్య చరిత్రకు వేడుకతో" అని వ్రాసి యుండెను.

3. జూదమున ధర్మరాజును గొనివచ్చుటకై విదురుఁ డింద్రప్రస్థమున కరిగెను అది దుర్వ్యవసాయ మని యాతఁ డెఱుంగును. అయ్యును "ధృతరాష్ట్ర విధాతృ నియోగమున కొడంబడి" యాతఁ డా పని చేయుచుండెను. అందుచే ధర్మజుఁడు గాంచి కుశలం బడిగి "నిజాగమన ప్రయోజనం బెఱిఁగించె" నని నన్నయ యేమియును వివరింపకయే కథ సాగించెను. విదురుఁ డచ్చటఁ దాను వచ్చిన పని వివరింప మొద లిడినచో నాతనికి యం దభినివేశము కలదేమో యను సందేహ ముదయించును.

నన్నయ లోకజ్ఞత :-

అవతారికలో నన్నయ తన్నుఁ గూర్చి చెప్పుకొన్న పద్యమున "లోకజ్ఞు" అను విశేషణము వాడి యుండెను. కావ్యము లోకవృత్తము నకుఁ బ్రతిబింబము కావున లోకజ్ఞుఁడు కానివాఁడు మహాకవి కానేరఁడు. నన్నయ రచనలోఁ బెక్కుచోట్ల నాతని లోకజ్ఞత బహుముఖముల వెల్లడియై పై విశేషణము నన్వర్థ మొనరించుచున్నది.

(a) యయాతి నూతిలో నున్న దేవయానిని గాంచి "నీ వెవ్వరిదాన వి ట్లేల యేకతంబ యివ్విపినాంతర కూపంబున నున్నదాన" వని యడిగెను. దేవయాని తాను శుక్రు కూఁతుర నని పల్కి "ప్రమాదవశంబున నిన్నూతం బడి వెలువడ నేర కున్నదాన నన్నుద్ధరించి రక్షింపు" మని వేఁడెను. నిజమున కామె యందుఁ బ్రమాదవశమునఁ బడియుండలేదు. శర్మిష్ఠ బల నంతముగా నామె నందుఁ ద్రోపియుండెను. ఈ విషయము చెప్పినచో దేవయానికి న్యూనత కలుఁగును. అందుచే నామె యట్లు చెప్పెను. ఇట్లు చెప్పించుట నన్నయ లోకజ్ఞత.

(b) ద్రౌపదిని సభలో వివస్త్ర నొనరించి యవమానింపవలె నని దుర్యోధనాదుల సంకల్పము. తదనుసారముగా దుశ్శాసనుఁ డామె కట్టిన

పుట్టంబు లొలువ మొదలుపెట్టెను అప్పుడు వివిధవర్ణములైన వస్త్రము లామె జఘనమున విరాజిల్లె నని మూలము. పుట్టముల వర్ణమునఁ దారతమ్య మున్నచో నొకటి తొలఁగింపఁబడి రెండవది వచ్చునంతలో - అది యెంత యత్యల్ప కాల మైనను సరే - ద్రౌపది నగ్నత వ్యక్తము కావచ్చును. నన్నయ యందుచే రంగుబట్టల ప్రసంగము విడిచిపెట్టి "ఉడుగక యొలువంగఁ బడియు మున్నుపనీతయైన తద్వస్త్రంబునట్టి వలువ లలితాంగి జఘనమండలమునఁ బాయక యొప్పుచున్న నయ్యువిదఁ జూచి" యని వ్రాసియుండెను. ఒకేరకమైన వస్త్రము మఱల నుత్పన్న మగుచున్నచో నగ్నత భాసింపదు. ఇచ్చట నిట్లు నన్నయ ప్రయోగించిన 'పాయక' యను శబ్దము సాభిప్రాయము.

(c) దమయంతి నడవిలో నొక యజగరంబు పట్టికొనెను.[1] ఇతర సర్పములు కఱచును. వాని విషము రక్తమునఁజొచ్చి గుండె స్తంభింపఁ జేయును. కొండచిలువ మ్రింగును. మ్రింగినపిమ్మట నే చెట్టునకోఁ జుట్టుకొని రాపిడి చేయును. అప్పుడుకాని మ్రింగఁబడిన జంతువు చావదు. ఈ లోపుగా నెవ్వరైన నా పాము పొట్ట చీల్చినచో నా జంతువు బ్రతుకవచ్చును. కిరాతుఁ డట్లే యప్పెనుబాము వదనము వ్రయ్యఁ దఱిగెను. దమయంతి సజీవయై దాని ముఖమునుండి వెలువడెను. అప్పు డాతఁ డామె నాశ్వాసించి సమీప సరోవర స్నాతను గావించెను. పాము మ్రింగినప్పుడు దమయంతి శరీరమును దాని లాల యావరించి యుండును. స్నాత యైన పిమ్మట నా యావరణము తొలఁగి యామె ద్విగుణిత సౌందర్యముతోఁ బ్రకాశించియుండును. ఆ సౌందర్యము కిరాతుని మదనపరవశు నొనరించెను. అప్పుడు నన్నయ కావించిన దమయంతి వర్ణన మామె సరోవరమునుండి స్నానముచేసి వచ్చుచుండఁగాఁ జూచి చేసి నట్లున్నది. ముం దామె యాననము (రజనికరానన) తరువాత పయోధరము (పీనపయోధర) పిమ్మట నడక (విలసద్గజపతిగామిని) అనంతర మామె మేని సౌరభ్యము (చందనగంధి) వరుసగా నందు వర్ణింపఁ బడినవి.

చనుప తెల్లవారుజామునఁ బ్రయాణ మారంభించి, యెండ యెక్కునంత వఱకు నడకసాగించి, యప్పుడు జలసమీపమునఁ జెట్లనీడ విశ్రమించుట లోకమున స్వభావమే. నన్నయ సరిగా నీ క్రమముననే వర్ణించెను.

(అర. ౨-108)

---

1 "నానారాగ విరాగాణి వసనాన్యథవై ప్రభో
ప్రాదుర్భవన్తి శతశః ధర్మస్య పరిపాలనాత్." (స. 68-48)

(d) దమయంతి నలుని విదర్భాపురమునకు రప్పించుట యందును, రథ ఘోషమును విని యది నలునిదే యని గుర్తించుట యందును ఆమె లోకజ్ఞత యపారముగా వెల్లడి యగుచున్నది. ఇది నన్నయ లోకజ్ఞతయే. ఈ విధముగ నన్నయ లోకజ్ఞత ప్రకటించిన చోట్లెన్నియేని కలవు. ఇవన్నియు నాతని లోకప్రవృత్తి పరిశీలనమును చక్కఁగా వ్యక్తము చేయుచున్నవి.

రమ్య రమణీయ శబ్దప్రయోగము :-

నన్నయ కొన్ని యాశ్వాసముల యంతములందు "అని జనమేజయు నకు వైశంపాయన కథితంబైన పుణ్యకథ యతిరమణీయంబుగాను" (అర. ౧-399) "అని వైశంపాయన కథిత కథాక్రమం బతి రమ్యంబుగాను" (అర. ౨-353) "అని వైశంపాయన కథితంబైన కథ రమ్యంబుగ" (అర. 3-397) "అట్లు వైశంపాయనోక్త కథ రసోత్కటముగ" (స. ౧-293) "పరీక్షి దగ్ర సుతునకు వైశంపాయనుఁ డనంత పుణ్యఫలాయత్తముగాఁగఁ జెప్పె" (ఆది. 3-226) అని రమణీయ రమ్యాది శబ్దములను వాడియుండెను. ముఖ్యముగా నరణ్య పర్వాశ్వాసాంతములందే యీ పదములు వాడఁబడుటకుఁ గారణము తెలియదు. అరణ్యపర్వ ప్రథమాశ్వాసమున 'సౌంభకాఖ్యానము,' 'కిరాతార్జునీయము' ద్వితీయాశ్వాసమున 'నలోపాఖ్యానము,' తృతీయాశ్వాసమున 'ఋశ్యశృంగ సౌకన్యాఖ్యానములు,' 'సౌగంధికాపహరణ' కథ రమ్యములై యుండుట నిజమేకాని యందు నీరసమైన భాగముకూడఁ జాలఁ గలదు. అచ్చటి వస్తు స్వభావమును బట్టి యది యెవ్వరు రచించినను అట్లే యుండును. ఆది సభా పర్వములం దట్లుకాక కథాభాగము ఆద్యంతము రమణీయముగా నుండును. వాని యంతములఁ గాక యరణ్య పర్వాశ్వాసాంతములందే నన్నయ యీ శబ్దముల వాడుట కందలి కథల రచించుపట్ల నాతఁ డమితమైన శ్రద్ధ వహించుటో, తీర్థాదివర్ణనములపట్లఁ గల్గు శుష్కతానిరాసము చేయ నెంచుటో కారణమై యుండు నని తోఁచుచున్నది.

"రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అన్న జగన్నాథుని సూత్రము జగన్నాథుని కల్పన కాదు. ఇది వేంగీ పరిషత్తుల విశ్చితాభిప్రాయము. నన్నయ గా రాదిపర్వము వ్రాసిన తరువాతఁ, దన గ్రంథము వేంగీ పరిషత్తులకు విని పించెను. వారియొక్క కావ్యవిష్కృష్ట పరమార్థ మిట్టిది: "శబ్దము రమణీ యార్థ- ప్రతిపాదకముగా నుండవలయు" నని. నన్నయగారు తరువాత

వ్రాసినవి సభాపర్వము యొక్క రెం డాశ్వాసములు, అరణ్యపర్వము యొక్క మూఁ డాశ్వాసములు. వాని చివర "అతి రమణీయం బైన . "అని వ్రాయుచు వచ్చెను. సభాపర్వము రెండవ యాశ్వాసము చివర నీ విశేషణము లేదు. అది వినిపించలే దేమో. అచ్చుపడ్డ పుస్తకములలో లేదో" అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ( నన్నయగారి ప్ర. క. క. యుక్తి. పుట 178, 179 ) చెప్పిన కారణము సమంజసముగా గోచరించుచున్నది.

నన్నయ శైలి - పద ప్రయోగము.

నన్నయకు ముం దాతని కాదర్శములు కాఁ దగిన తెలుఁగుకావ్యము లెవ్వియును లేవు. అందుచేఁ గన్నడ కవుల రచనలును, సంస్కృత కావ్యములునే యాతనికి మార్గదర్శకము లయ్యెను. కన్నడమునం దంతకు ముందు వెలసిన కావ్యములు తత్సమ బహుళములై మార్గపద్ధతిని రచింపఁబడి యుండెను. నన్నయయు నా మార్గమునే యవలంబించెను. అతఁడు సంస్కృతమున మహాపండితుఁడు. తెలుఁగున నప్పటి కున్న పదసంపద చాలఁ దక్కువ. ఆ పదము లన్నిటిని బరిశీలించి యాతఁడే వాని కొక సుస్థిరమైన రూప మొసఁగ వలసివచ్చెను. ఈ కారణముచే నాతని రచనలోఁ దత్సమ పదములును సంస్కృత సమాసములును హెచ్చుగాఁ గానఁ బడుచుండును. ఆ యారంభ స్థితిలో మహాకావ్య రచన సాగింపఁ దలఁచిన వా రెవ్వ రైన నట్లు చేయ వలసినదే.

నన్నయ సంస్కృత సమాసముల నెక్కువగా వాడినను వానిలోఁ గ్లిష్టత లేశమైన నుండదు. అవి ప్రసన్నతా గుణముతో నిండారియుండును. అతఁడు సంస్కృత సారస్వతము వంతఁ గబళించిన వాఁ డగుటచే నందు మృదు మధురములును శ్రవణానంద కరములును గాఁ దోఁచిన వానిని మాత్రమే తన కావ్యమున నెక్కువగాఁ బ్రయోగించి యుండెను. పాండిత్య ప్రకటన మునకై యాతఁడు మాఱుమూల పదముల నెచ్చటను వాడఁడు. అది యాతని రచనలోని విశిష్టత. తెలుఁగు వాఙ్మయమున సమాసభూయిష్ఠ మైన రచన చేసినవారు పలువురు కలరుకాని నన్నయవలె సుందర బంధములు, అక్లిష్టాన్వయములును గా సమాసములను గూర్చిన వారి సంఖ్య చాలఁ దక్కువ.

నన్నయ రచనమున 'ధ్వని' గాంభీర్యము సర్వత్ర గోచరించుచుండును. ఇచ్చట 'ధ్వని' శబ్దము శ్రవణ సంబంధిగా వాడఁబడినది. అతని పద్యము లన్నియు నాదసౌందర్యమునకు నిలయములై వీనులకు విం దొనరించు

చుండును. వేదఋక్కులు సస్వరముగా నుచ్చరింపఁబడుచో వాని యర్థము మన కవగతము కాకపోయినను అందలి ధ్వని గాంభీర్యము మానసముల నాకర్షించి యలరించుచుండును. నన్నయ 'సంహితాభ్యాసుఁడు'. వేదస్వరముల ధ్వని యాతనికి సుపరిచితమైనది. అందుచేతనే కొన్ని ఘట్టములం దాతని పద్యములు వేదఋక్కులవోలె ధ్వనించుచుండును. ఉదంకుఁడు నాగరాజుల స్తోత్రము చేసినప్పటి పద్యములును, వర్షా శరద్వర్ణన సందర్భమునందలి పద్యములును (ఆది. ౧-104 - 107), (అర 8-137 - 142) నిందు కుదాహరణములు.

నన్నయ రచనమున సంస్కృత వాక్యయోజన పెక్కుచోట్లఁ గానఁబడుచుండును. అతఁడు సంస్కృతమునవోలె విశేషణములను విశేష్యములకు ముందును వెనుకను గూడ వాడుచుండును విశేషణ విశేష్యములకు నడుమ నొక్కొక్కప్పు డితర పదముల వ్యవధానము గోచరించుచుండును ఇట్టి యెడఁ గూడ నాతని పద్యములందలి యన్వయ మేమియుఁ గ్లేశకరముగా నుండదు. సంస్కృతమునవలె య త్తదర్థక శబ్దముల ప్రయోగముతోఁ గూడిన వాక్యము లాతని రచనలోఁ బెక్కుచోట్లఁ గానిపించును. ఇట్టి వాక్యము లాతని పద్య గద్యములు రెండింటను గోచరించును. నన్నయ తనరచనలోఁ గర్మణి ప్రయోగముల నచ్చటచ్చటఁ గావించియుండెను. సంస్కృతమున నా ప్రయోగమునకు వాడుకయు జాతీయతయు హెచ్చు. నన్నయ తరువాతి కవుల కావ్యములలో నిట్టి ప్రయోగము లంతగా గానిపింపవు వీని కన్నిటికి నిదివఱ కనేక నిదర్శనము లొసంగఁబడినవి.

నన్నయ్య దాలంకారికమైన రచన. ఇ ట్లని యాతఁ డదే పనిగా నలంకారములఁ జొప్పింపవలె నని ప్రయత్నముచేయఁడు. ఆతని యలంకారము లన్నియు రచనలో ధారాళముగా నప్రయత్నముగా సమకూడినట్టివే. ఉపమ, రూపకము, అర్థాంతరన్యాసము, స్వభావోక్తి యను నలంకారము లాతని రచనలో నెక్కువగాఁ గానిపించును. అతిశయోత్ప్రేక్షలు తక్కువ. "సాత్యవతేయ విష్ణుపద సంభవమై" (ఆది. ౧-72) "అమితాఖ్యానకశాఖలం బొలిచి" (ఆది ౧-65); "ఆ నారాయణ పాండవేయ గుణ" (ఆది. ౩-21) అను న వాతని సంపూర్ణ రూపక రచనకుఁ దార్కాణములు. అతఁ డర్థాంతరన్యాసములను బెక్కుచోట్ల వాడియుండెను. అందుఁ బె క్కాతఁడు కల్పించినవే. నీతి బోధనమునకుఁ గూడ నాతఁ డీ యర్థాంతరన్యాస కల్పనము చేయుచుండును. స్వభావోక్తులను రచించుటలో నన్నయ మిక్కిలి నేర్పు ప్రదర్శించును.

"తల వడఁకఁ దొడఁగె నింద్రియముల గర్వ మడంగె నంగములు వదలె వళీ
పలితంబు లయ్యె వగరును దలయేరును నుక్కఁసయును దలకొను దెంచెన్" (ఆది. ౩-191)
"ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల విమ్మగు తావుల జొంపములన్." (ఆది-౪-20)
"పరిపెఁ బ్రచండ వృష్టి ఘనఘోషము లెల్ల కెలంకులన్ భయం
కరములుగా ......... .. .... ..." (అర. ౩-297.)
"అన్న! సహదేవ నీవును నన్నులతో నరిగె దయ్యె యట యదవుల కీ
వున్నను సుతు లందఱు నిం దున్నట్టుల నాకుఁ జిత్త మూఱడి యుండున్". (సభా.౨-288.)

మొదలైన విందుకు దృష్టాంతములు. సమయోచితములును. భావస్ఫోరకములు నగు నుపమానములను నన్నయ పెక్కుచోట్ల వాడుచుండును. ఇవియును బెక్కుమూలకము లైనట్టివే.

"సుతుల రాక్షసనిహతులఁ జూచి పరమ
యోగధరుఁ డయ్యుఁ బుత్త్రవియోగశోక
భరముఁ దాల్చె వసిష్ఠుం డపార భూరి
ధరిణీ భరము నగేంద్రుండు దాల్చునట్లు". (ఆది. ౬-117.)

ఈ యుపమానము వసిష్ఠుఁడు సహించిన విచారభరము యొక్క యాధిక్యమును. ఆతని ధీరతోదాత్తతను జక్కఁగాఁ జాటుచున్నది.

''అగ్నిశిఖయుఁ బోలె నంటను డాయను జూదరాని యట్టి
శుభచరిత్ర-" (అర. ౨-90.)

ఇచ్చటఁ బతివ్రతామతల్లి యగుటచే నితరుల కంటను, డాయను, జూదరాని యట్టి దమయంతి నగ్నిశిఖతోఁ బోల్చుట యెంతయు నౌచిత్యభాసురమై యొప్పారుచున్నది

"అర్థరాత్రమునప్పు డందుల కేతెంచె గజయూథములు జలకాంక్షఁజేసి
యంబుధి విమల తోయంబు లాస్వాదింపఁ జనుదెంచు జలధర సమితి యట్ల"- (అర. ౨-110.)

మున్నగు సుందరములైన యుపమానము లాతని రచనలో నింకను అసంఖ్యాకములుగా నున్నవి. "చనుప యుట్టిపాటఁ బెనుపరి చువినీతు పిరియుఁ బోలె

నడఁగి విరిసి చనియె" (అర. ౨-110) అనుచోటి యుపమానము మిక్కిలి సాభిప్రాయమై యున్నది. నలు నెచ్చటనైనఁ గాంచితిరా యని దమయంతి యడుగ సార్థవాహుఁడు "నలుఁ గాన మివ్వనంబునఁ గల వెప్పుడుఁ గాంతు ముగ్రకరులను, సింహంబుల, ఋక్షంబుల" (అర. ౨-106) అని సమాధాన మిచ్చెను. ఇందుఁ గొంత యపహాస్య మున్నది. దమయంతిని జూచి చనుప లోనివారు కొందఱు భయపడిరి. కొంద అధికహాస్యంబు చేసిరి. ఇట్లా చనుపలోఁ గొంద అవినీతు లుండిరి. ఈ యవినీతికి ఫలితముగా వా రున్నత ద్విపముల యుగ్రపాదహతిఁ జేసి మర్దితులైరి. కొందఱు దంతహతిఁ జేసి భిన్నాంగు లైరి. అవినీతి సిరిని దొలఁగించు నని నన్నయ విశ్వతాభిప్రాయము. ఈ యర్థమునే యాతఁడు పెక్కుచోట్ల నొక్కిచెప్పుచుండును. ("రాజ్యలక్ష్మి యద్దురాత్మునందు విరక్తయ కాని ప్రీతి పుట్టింపదు.( అర. ౧-60) అవివేకి యందుఁ బ్రయుక్తంబు లైన సుభాషితంబులుం బోలె (అర. ౧-313) దుర్జన గృహీతంబులైనరాజుల విభవంబులుం బోలె సాధుజన వర్జితంబులై యుండును " (ఆది. ౮-149.) అను నుపమానములు కూడ నిట్టివే.

కచుఁడు శుక్రునిఁ బునర్జీవితుఁ గావించినప్పుడు నన్నయ

"విగత జీవుఁడై పడియున్న వేదమూర్తి
యతనిచేత సంజీవితుఁడై వెలింగె
దనుజమంత్రి యుచ్చారణదక్షు చేత
నభిహితం బగు శబ్దంబు నట్ల పోలె." (ఆది. ౩-127)

ఉచ్చారణ దక్షుఁ డుచ్చరించు శబ్దమునందలి వర్ణము లుచితములైన యుత్పత్తి స్థానముల నుండి వెలువడుచు స్పష్టములై విన వింపుగా నుండును. నన్నయ యట్టి శబ్ద సౌష్ఠవమును బాగుగా నెఱింగిన వాఁడు, శబ్దబ్రహ్మ విదుఁడు. ఇంద్రాగ్నులు శిబి యౌదార్యమునకు మెచ్చి యాతనికి వరము లిచ్చిన సందర్భ మున "నీ కీర్తి నిత్యంబై శబ్దబ్రహ్మంబు గల యంతకాలంబును వర్తిల్లు చుండెడు" మని పలికియుండిరి. ఇదియు నన్నయ శబ్దబ్రహ్మవేత్తృతను సూచించుచున్నది.

నన్నయ శ్లేషాలంకారమును మూఁడు నాలుఁగు చోట్ల వాడియుండెను. అందుఁగొన్ని యుపమాలంకారములతోఁ గూడి యుపమానోపమేయముల రెండింటికిని అన్వయించు సమాసములతో నొప్పారుచున్నవి.

"ఉద్యాన వనంబునుం బోలె బహు విద్రుమ లతాలంకృతంబైన దాని. నాటక ప్రయోగంబునుం బోలె ఘనతర పాత్ర శోభిత రంగ రమ్యంబైన దాని. దివంబునుం బోలె నహిమకర భరితం బైన దాని"(ఆది. ౨- 27).ఇది సముద్ర వర్ణనము. ఇచ్చటి శ్లేష సభంగము, నభంగము నై రమణీయముగా నున్నది.

వసువులు రుద్రులు వసుహీన విప్రుల క్రియ దక్షిణాశ్రితులై రి భీతి- (ఆది. ౨-99.) ఇట దక్షిణాశ్రితు లనునది వసు రుద్రులకును విప్రులకును గూడ నన్వయించును.

"అలఘుతరంబులై తుహినహారి సుధారుచి విందురోచి రా
కుల శశికాంతవేది పృథుకుంజ గళజ్జలనిర్ఝరంబులన్
విలసిత జాహ్నవీ విమలవీచివిలోలలసత్పతాకలన్
బొలుపగుఁ దత్పురీభవనముల్ హిమశైలముఁ బోలి యున్నతిన్"
(ఆది. ౮-72)

"భూపతికిం దివంబునకుఁ బొల్పెసఁగంగ శరత్సమాగమ
బాసకలప్రమోదకరమై విలసిల్లె మహర్షిమండలో
పాసిత రాజహంసగతి భాసి ప్రసన్నసరస్వతీక మ
బ్జాసన శోభితం బగుచు నబ్జజాయానముతో సమానమై."
(అర. ४-141)

ఈ రెండు పద్యములందును విశేషణములు శ్లేషమహిమచే నుపమానోప మేయములు రెండింటితో నన్వయము కలిగియున్నవి.

నన్నయ రచనము నందందు శబ్దాలంకారములు కూడ గోచరించు చున్నవి. ఇందు వృత్త్యనుప్రాసముల సంఖ్య హెచ్చు. ఇవియు నంద ప్రయత్నముగా సిద్ధించినవే.

"సటా సముత్పాటన కుపిత కుంజరవైరియుం బోలెఁ గడు వలిగి
పటు కుటిలభ్రుకుటి ఘటిత విటలుం డగుచు" (స. ౧-194)

ఇందు వృత్త్యనుప్రాసము. పరుషమైన టకారముతోఁ గూడి జరాసంధుఁడు వండ్లు పటపట కొఱుకుచున్నాఁడా యను భావమును గలిగించుచు నతని క్రోధమును జక్కఁగా వ్యక్తము చేయుచున్నది.

"ఘోరవనమున వీరుఁ గిమ్మీరుఁ డను సురారి నిశ్చలభీక రాకారుఁ బట్టి
పోర వధియించినట్టి సమీరజునకు భూరిభుజునకు మార్కొనువారు
గలరె !"

ఇందు రకార పునరావృత్తి తేటగీతిలోఁ గూడఁ బ్రాస సౌందర్యమును గూర్చుచు రమణీయముగా నున్నది.

"వడిఁ బడియెఁ బిడుగు లడుగక పడఁకె మహీతలము-"(అర.3-369)

ఈ పాదము పిడుగుపాటునందలి ధ్వని ననుకరించుచుఁ జక్కఁగా నున్నది.

"తడయ కపుడు వాని మెడ గ్రుంగఁ బిడికిటఁ
బొడిచె నసుర ముడిఁగి పడియెఁ బుడమి." (అర. 3-396.)

అను పద్యముకూడ నట్లే ముష్టిఘాతముల ధ్వని ననుకరించు చున్నది.

'అఱ పొఱడు కుఱుచ చేతులు
నొఱవ శరీరంబుఁ గలిగి యొరులకుఁ జూడం
గొఱగాకుండియు మన్మథు
నొఱపులఁ బడియెడు నితండు యువతీప్రియుఁడై." (అర. ౨-134.)

ఇందలి అకార పునరావృత్తి వర్ణితుఁడైన వ్యక్తి వికృతాకారమును లెస్సగా సూచించుచున్నది.

"అమ్మునివరు చిత్తంబు మెత్తన చిత్తజాయత్తం బగువట్లుగాఁ
జేసెద" (ఆది. ౪-39.)

"అనిలజున్ రాజీవరాజీవ సత్పమ దాళి వ్రజ చక్రవాక
బక హంస క్రౌంచనాదంబులన్'' అనుచోట యమక మున్నది.

"తత్స్వయంవరము చేయుచున్నవాఁడు వాఁడు-" ఛేకాను ప్రాసము.

నన్నయ రచనలో నంత్యానుప్రాసము లెచ్చటను గానరావు కాని ప్రతి పాదము వను దావి, దాని అని ముగియుచుండు పద్యములు మాత్రము నాలుగై దున్నవి. (ఆది. 3-140; ఆది. ౨-28; అర. ౨-39; అర. ౨-102). నాలు గైదు చోట్ల నన్నయ శబ్దములకుఁ గల రెం డర్థములను బురస్కరించుకొని చక్కని చమత్కారమును గల్పించి యున్నాఁడు. అం దొకటి యస్త్రవిద్యా ప్రదర్శన సందర్భమునం దున్నది. కర్ణార్జునులు ద్వంద్వయుద్ధ మొనరించు చుండఁగాఁ గృపుఁడు వారి నడుమ నిలిచి కర్ణునితో

"కురుకులజుండు పాండునకుఁ గుంతికిఁ బుత్త్రుఁడు రాజధర్మ బం
ధుర చరితుండు నీ వితనితోడ రణం బొనరించె దేని వి
స్తరముగ నీదు వంశమును, దల్లిని, దండ్రిని జెప్పు చెప్పినన్
దొర యగుదేని నీ కెదిరి దోర్బలశక్తి నితండు నూపెడిన్." -

(ఆది. ౬-44)

అని పలికియుండెను. 'దొర' యను శబ్దమునకు రాజు, సాటి యను రెం డర్థములు నున్నవి. "అర్జునుఁడు సుక్షత్త్రియుఁడు. నీవు నీ తల్లిదండ్రుల పేర్లు చెప్పుము. నీవును సుక్షత్త్రియుఁడవై యాతనితో సమానుఁడ వైనచో నర్జునుఁడు ని న్నెదిరించి దోర్బలమును బ్రదర్శించు" నని కృపుని భావము. దుర్యోధనుఁడు "దొర" శబ్దమును రా జను నర్థమున గ్రహించి, కులముగల వాఁడు, శౌర్యముగలవాఁడు, సేన గలవాఁడు రాజనామమును దాల్ప నర్హుఁ డగు నని వివరించి

"రాజవరుఁ డైన పార్థుతో రాజుగాని
యాతఁ డని పేయఁగాఁ దగఁ డేని
నెల్లవారును జూడంగ నీ క్షణంబ
రాజుఁ జేసెద నే నంగ రాజ్య మిచ్చి." (ఆది. ౬-47.)

అని యాతని నంగరాజుగా నొనరించెను. ఇచట శ్లేషచే నన్యార్థ కల్పనము చేయఁ బడినది. దీనినే వక్రోక్తి యందురు.

"అన్నలుఁడు విమోహ రజ్జులఁ బెనంగి గతాగతకారియైన యు
య్యెలయును బోలె-" (అర. ౨-78.)

నలుఁడు 'విమోహరజ్జులఁ బెనంగి' గతాగతకారియైన యుయ్యెల వలె ముందు వెనుకల కేగుచుండెను. విమోహ మనఁగా విశేషమైన మోహ మని సామాన్య మైన యర్థము. ఈ యొక్క యర్థమునే గ్రహించినచో నలుఁడు వెనుదిరిగి వచ్చుటయే చేయవలెను. కాని ముందుకుఁ బోవుటకు వీలులేదు. అందుచే దీనికి మోహరాహిత్య మను నర్థము కూడఁ జెప్పుకోవలయును. అప్పు డాతఁడు దమయంతిని విడి పోఁ జాలును. వి = విగత; విశేష అను రెం డర్థము లున్నవి. ఈ రెం డర్థములను గ్రహించినప్పుడే యిచ్చటి యౌపమ్యము సార్థక మగుట సంభవించును.

ద్రౌపదీ పరాభవ సమయమునఁ బెక్కు దుర్నిమిత్తము లుదయించెను. అప్పుడు కృప విదుర శాంతనవాదులు "ధృతరాష్ట్రజులకుఁ బుట్టె నరిష్ట మని రిష్టమునఁ దమలోనన్. (స. ౨-253.)
మూలమున నిచ్చట నమంగళము తొలఁగి స్వస్తి యగుఁ గాక యని వారు పల్కిన ట్లున్నది. నన్నయ యా స్వస్తికి బదు లరిష్ట మని వాడియుండెను. దీనికి మేలు-కీడు అను రెం డర్థము లున్నవి. నిజమున కిచ్చట వారి యుద్దేశము కీడే యైనను శ్లేషాశ్రయముచే మేలను మూలార్థము కూడ ధ్వనించుచున్నది.

శివుఁ డర్జునునకుఁ బాశుపతాస్త్రము నొసంగి యంతర్హితుం డయ్యెను. అప్పుడు నన్నయ

"అవిరళ సూర్యమండల సహస్ర సమప్రభమై ధనంజయ
ప్రవరు కరమ్మునన్ వెలుఁగు పాశుపతాస్త్రముఁ జూచి దైత్య దా
నవ సుర యక్ష రాక్షస గణమ్ము కరమ్ము భయమ్ము నొందె"
(అర. ౧-333)

అని వ్రాసెను. ప్రవర శబ్దము శ్రేష్ఠ వాచకము. శ్రేష్ఠుఁ డైన యర్జునుఁ డని విశేషణోత్తర పద సమాసము చెప్పవచ్చును. కాని యంతకంటె ధనంజయ నామధారులలో మేటి యని చెప్పుట యుక్తముగా నుండును. యదుప్రవరుఁడు మున్నగు వానికిట్లే యర్థము చెప్పుచుందుము. ధనంజయుఁ డనగా అగ్ని, అర్జునుఁడు, విష్ణువు అను నర్థము లున్నవి. పాశుపతాస్త్రసంపాదనముచే నర్జునుఁడు ధనంజయులలోఁ బ్రవరుఁడైనాఁ డను ధ్వని యిచట నున్నది.

చ్యవనుఁడు సంయాతిచే యజ్ఞము చేయించుచు నాశ్వినులకు సోమం బీఁ బోయెను. అప్పు డింద్రుఁడు.

"వీ రిద్దరు సోమార్హులుగా రమరుల వెజ్జ లిది యికర్తవ్యము బృం
దారకులు గానివారికి వారింపక సోమ మిచ్చు వారుం గలరే."
(అర. 3-191.)

అని పలికి వారించెను. దీనిని బట్టి యాశ్వను లమరుల వెజ్జలే కాని బృందారకులు కారని యర్థము చెప్పవలసి యున్నది. వా రమరులు కానిచో మఱెవ్వరు? బృందారక శబ్దమునకు eminent, Excellent, Respectable అను నర్థములు కూడ నున్నవి. ఇచ్చట నీ యర్థమును గ్రహించుట యుచితముగా నుండును.

నన్నయ పెక్కుచోట్లఁ బదములను సాభిప్రాయములుగా వాడుచుండును. ఆ శబ్దముల నచ్చట నుండి తొలఁగించి వానికిఁ బర్యాయములైన యితర పదములను వాడినచోఁ జమత్కారమునకు భంగము వాటిల్లును. అనఁగా నవి పరివృత్త్యసహిష్ణువులై యుండును.

1. నీ గర్భంబున నున్నవాఁడు సూర్యానల సమ ప్రభుండైన పుత్త్రుం డుభయ కుల దుఃఖోద్ధరణ సమర్థుండు" (ఆది. ౨-160)

ఇది జరత్కారువు తన భార్యతోఁ జెప్పిన మాట. ఆ పుట్టిన పుత్త్రుఁ డాస్తీకుఁడు. అతఁడు సంతాన హీనమై నశింపనున్న పితృ వంశమును, సర్ప యాగమున నగ్నిలోఁ బడి నశింప నున్న (మాతృ వంశమును), నాగ కులమును గూడ నుద్ధరించెను.

2. "సుత జలపూరితంబు లగు నూతులు నూఱిటి కంటె సూనృత వ్రత యొక బావి మేలు." (ఆది. ౪-93.)

ఆశ్రమమునఁ దనకుఁ జేసిన సమయమును దప్పిన దుష్యంతుని శకుంతల యిట్లు సంబోధించెను. అతఁడు నిజముగా నప్పుడు సత్యవ్రతుఁడు కాడు. అట్లు సంబోధించుట "సత్యము తప్పుట పాడికాదు. సూనృత వ్రతుఁడవు కమ్ము" అని ప్రబోధించుచున్న ట్లున్నది.

3. "అనిలజ నీ కి ట్లని పల్కను దలఁపను నగునె". (ఆది. ౬-58.) మూలమున నిచ్చట 'వృకోదర' శబ్దము వాడఁ బడినది. కర్ణుఁ డుత్తమ క్షత్త్రియుఁడు కాఁడని నిరసించుచున్న సమయమున దుర్యోధనుఁడు భీము నిట్లు సంబోధించెను. భీముఁడు కుంతి కనిలదేవుని ప్రసాదమునఁ బుట్టిన వాఁడు. పాండు పుత్త్రుఁడు కాఁడు. ఈ సంబోధనలో నాతని జననమునకు సంబంధించిన యీ హేళన యున్నది.

4. "ఆ లలితాంగి యందు హృదయంబులు దృష్టులు నిల్పి పాండుభూ
పాల తనూజ పంచకము పంచ శరాహతిఁ బొందె"

ఇటఁ బాండవు లైదుగురు కావున మన్మథునికిఁ బంచశర శబ్దము వాడుట సాభిప్రాయమై యున్నది.

5. "ధర్మ తత్త్వజ్ఞుఁ డీ ధర్మతనూజుండు ధర్మమార్గం బేల తప్పఁ
బలుకు - (ఆది. ౭-284.)

ధర్మము తప్పఁ డను సందర్భమున యుధిష్ఠిరునకు 'ధర్మతనూజ' శబ్దము వాడుట యభిప్రాయ గర్భితమై యున్నది.

6. " లక్షించి యేయు మని సూక్ష్మేక్షణు ద్రోణుండు పంచె నింద్ర తనూజున్ " - (ఆది. ౫-252.)

లక్ష్య భేదన ప్రధానమైన యీ సందర్భమున నర్జునుని 'సూక్ష్మేక్షణుఁ' డనుట యెంతయు సమంజసముగా నున్నది.

7. " పార్థ బాణ పంచక విభిన్న దేహంబయి పంచత్వంబుఁ బొందినం" (ఆది. ౫-258 )

బాణ పంచక విభిన్న దేహ మయిన యా గ్రాహము మరణించె ననుట కంటెఁ 'బంచత్వము పొందె' ననుట సాభిప్రాయముగా నున్నది.

8. " వాత సుతుండు వీచె ........ తృణ ఖండ సముం డగుచుండ మాగధున్." (స. ౧-209.)

తృణఖండసముఁడైన మాగధుని వాయుసమానుఁడు వీచె నని భీమునికి 'వాయుసూను' శబ్దము వాడుట యుక్తముగా నున్నది.

9. " దీని కొడంబడు మొదఁబడ వేవి నేఁడ యీ క్షణమ సర్వభక్షుచేత భక్షితుండ వగుదు " (స. ౨-127)

మానవుని దహించు సందర్భము కావున 'సర్వభక్ష' శబ్ద మిచ్చుట సాభిప్రాయముగా నున్నది.

10. " నిత్య సత్యవ్రత ! నిషధేశ నీవు మా కమరంగ దూతవై యభిమతంబు సేయుము ". (అర. ౨-34.)

" ఇభరాజ గమన ! నీ వెందుల కరిగితి.
అబల యెవ్వరిచేత నడవులలోఁ బట్టువడితి ". (అర. ౨-132)

అరిగితివి అను ప్రశ్నించు నప్పు "డిభరాజ గమన" యనియు, పట్టువడితి వని నప్పు 'డబల' యనియు సంబోధించుట రమణీయముగా నున్నది.

11. " తపన తేజుండైన కపిలు కోపంబున గత జీవులై " (అర. 3-80)

కపిలుఁడు సాగరులను భస్మసాత్కరించెను గావునఁ 'దపన తేజుఁ' డను విశేషణ మిచ్చుట సార్థకమై యున్నది.

12. " ఇది ప్రళయాగ్ని వోలె దెస లెల్లను గప్పఁగ విస్ఫులింగముల్
వదలక వాయు సారథి జవంబునఁ దా నిట వచ్చె "
(ఆది. ౮-304.)

ఇట నగ్నిని 'వాయుసారథి' యనుట సాభిప్రాయము.

కొన్ని చోట్ల నన్నయ వాడుచుండు పదము లా యా సందర్భములకుఁ దగి పరమౌచిత్యభాసితములై యొప్పారు చుండును. అనువాద విషయమును వివరించుపట్ల నిందుకుఁ బెక్కుదాహరణము లొసంగఁ బడియున్నవి. మఱి రెండు మూఁ డిచ్చట నుదాహరించెదను.

1. ప్రాతికామి తన్ను సభలోనికిఁ గొని పోవుటకై వచ్చినప్పుడు ద్రౌపది యాతనిఁ జూచి

" మున్నుఁ ద న్నోటు వడి........................
గ్రన్నఁ ద న్నోటువడియెనో యన్న! నా కెఱుఁగఁ జెప్పుము "

'అన్న' యని సంబోధించుట యా సందర్భమున కెంతయుఁ దగి యెట్టి నిష్కరుణునికైన జాలి పుట్టించు నదిగా నున్నది.

2. " శకుంతలయుఁ దన చేసిన దాని మునివరుం డెఱింగి యలిగెడునో " (ఆది. ౪-60.)

ఇచ్చటఁ దండ్రి యనక 'మునివరుఁ' డనుట యౌచిత్యమున కాకరమై యున్నది.

3. సౌంభకాఖ్యానమునం బ్రద్యుమ్నుఁడు యుద్ధ మధ్యమున మూర్ఛితుఁడు కాఁగా దారుక తనయుఁడు రథమును రణమునకు దూరముగాఁ దోలుకొని పోయెను. ప్రద్యుమ్నుఁడు మూర్ఛ దేఱి సూతునితో

" విక్రమము విడిచి సమరా
పక్రాంతుఁడ నయిన నన్ను బలదేవుఁడునుం
జక్రధర సుతులు నమజాలు
నక్రూరాదులును నేమి యని నగరె సభలన్ ". (అర. ౧-171.)

అని పలికెను. ఇచ్చట 'ఏమి యని నగరె' యను మాట మిక్కిలి సహజమై మాటలతోఁ జెప్పుటకు వీలులేని గంభీరమైన యర్థమును సూచించు చున్నది. బలదేవాదు లే మందురో వివరించుట కంటె నిట్లు సూచించుటయే మిక్కిలి యుచితతరమై యున్నది.

4. " నీవ కడు నేర్పు కాఁడవు – కా వలవదు నీని఼ గొన్ని఼ గఱచితి మేమున్ ". (ఆది. ౬–32.)

అని కర్ణుఁ డర్జునునితోఁ జెప్పుమాట. ఇచ్చటి 'ఏము' అను బహు వచనము కర్ణుని యహంకృతిని జక్కఁగా వ్యక్తము చేయుచున్నది. విదురునితో దుర్యోధనుఁడు " నీ యిమ్ములనుండు బుద్ధి చెప్పకుండు మాకు " అని చెప్పినప్పటి 'మాకు' కూడ నిట్టిదే. (స. ౨. 118)

5. అర్జునుఁడు గురు ననుమతిపై ద్రుపదుని రథాక్షమునకుఁ గట్టి తెచ్చి ద్రోణునకు గురుదక్షిణగా నర్పించెను. అప్పుడు ద్రోణుఁడు ద్రుపదుం జూచి నవ్వుచు.

" నీ రెవరయ్య ! ద్రుపద మ
హారాజులె యిట్లు కృపణు లయి పట్టువడన్
వీరికి వలపెనె – యహహా ! మ
హారాజ్య మదాంధకార మది వాపె నొకో ! " (ఆది. ౬–89.)

అని పలికెను. ఈ క్రమ మిచ్చట నాటకోచితమై ద్రోణుఁడు ద్రుపదునికిఁ జేయనెంచిన పరాభవము నెంతో ధ్వని గర్భితముగా వెల్లడి చేయు చున్నది. ఇట్లు గాక వాచ్యముగాఁ బలు విధముల నిందించినను అతని కింత పరాభవము కాఁ జాలదు.

6. నన్నయ రచనలోఁ గొందఱు వ్యక్తులు మఱికొందఱిని గూర్చి పలుకు విధానము విలక్షణమై యౌచిత్య సంపద కాలవాలమై యలరారు చుండును.

(a) " ధర్మజుఁడు కుంతిని గూర్చి మాటాడు నప్పు డెప్పుడును బహు వచన ప్రయోగమే చేయుచుండును. ఇది యాతని కామె యెడఁ గల గౌరవ విశేషము నెంతో గంభీరముగా వెల్లడి చేయు చుండును. ధర్మజుఁడు తన్నును, దమ్ములను, దల్లిని, ద్రుపదుని కెఱింగించు సందర్భమున " వీరు కుంతీ మహాదేవులు " అని చెప్పి యుండెను. (ఆది. ౭–237)

బకాసుర వధ ఘట్టమున ధర్మజుఁడు యుద్ధోన్ముఖు డై వట్లున్న భీముని఼ జూచి కుంతితో 'ఇతని భావము సూడగ వేఱు వీని పుస్తిని బలు మీరు పంచితిరొ.... మఱి భీమసేనుండు మీకు విడువం దగియెడి . కొడుకే"

(ఆది. ౬–276, 277) అని పల్కుచు 'మీరు' 'మీకు' అను శబ్దములనే వాడియుండెను.

(b) నన్నయ రచనలో దుర్యోధనుఁడు ధర్మరాజుతో రెండుసార్లే ప్రత్యక్షముగా మాటాడును. ఆ రెండు సారులు నతఁ డతని "అనఘ!" అనియే సంబోధించును. ఇది దుర్యోధనుని కతని యెడఁ గల గౌరవమును వ్యక్తము చేయుచున్నది. నిజమునకు దుర్యోధనునికిఁ బాండవులలో నెల్ల భీమునియందే మత్సరము.

"అనఘ! మా మామ శకుని మాకై కడంగి" (స. ౨-174)

"అనఘ! సుహృద్ద్యూతం బిం దొనరింతము" (స.౨-164)

(c) ద్రౌపది సభలోనికి వచ్చి నేను దాసినా, అదాసినా చెప్పుఁ డని సభాసదుల నడిగెను. అప్పుడు భీష్ముఁడు "అవ్వ! నీ ప్రశ్నంబున కుత్తరం బయ్యుధిష్ఠిరుండు సెప్ప వలయు" (స. ౨-245) అని జవా బిచ్చెను. "అవ్వ!" యను సంబోధన మిచ్చుట భీష్మునికి ద్రౌపది యెడఁ గల గౌరవ వాత్సల్యమ్ముల నొక్కుమ్మడి సూచించుచున్నది.

ఇట్లే కుంతి సహదేవు 'నన్న!' యని సంబోధించుటయు నామె కతని యెడఁ గల వాత్సల్యమునకు సూచకమై యున్నది. (స. ౨-288)

నన్నయ తన రచనలో నా యా సందర్భముల వాడిన వృత్తములఁ బరిశీలించినచో నతఁడు పాటించిన వృత్తౌచిత్యము తేటతెల్ల మగును. వీర రౌద్రాది రసములను వర్ణింపవలసినప్పు డాతఁడు తఱచుగా శార్దూల మత్తేభ మహాస్రగ్ధరలను, కరుణ శృంగార శాంత రసములను వర్ణింపవలసివచ్చినప్పు డుత్పల చంపకమాలలను వాడుచుండును. కరుణరసమయ మైన నలోపాఖ్యానములో నాతఁడు శార్దూలమును గాని మత్తేభమును గాని వాడియే యుండలేదు. యుద్ధములను వర్ణించునప్పు డాతఁడు పెక్కుచోట్ల మత్తేభములను, మహాస్రగ్ధరను వాడుచుండును ఇట్టిచోట్ల రచనయు నోజో భరితమై దీర్ఘములైన సమాసములతోఁ గూడియుండును. నరనారాయణులు దేవదానవుల సంహరించుట (ఆది. ౨–22, 23, 24); పాండురాజు జైత్రయాత్ర (ఆది. ౫–36, 38); కౌరవ పాండవులు ద్రుపదుని పై కెత్తిపోవుట (ఆది. ౬–79, 85); సౌంభకాఖ్యానము (అర. ౭–185, 186); వర్ణనల కాతఁడు

సీసము, లయగ్రాహి మున్నగు పద్యములను, వచనమును వాడుచుండును. సీతులకై కందములు వాడుట యాతని కలవాటు. మిగిలిన వృత్తముల నాతఁ డెప్పు డెప్పుడు వాడునో నన్నయ ఛంద స్సను భాగమునఁ జూడనగును.

పద్య గద్యములను వాడు సందర్భమున సైతము నన్నయ యౌచిత్య మును బాటించుచుండును. నీరసములును, విషయ ప్రధానములు నగు నంశముల నాతఁడు వచనముననే చెప్పుచుండును. ఏదైన కథ నారంభించునప్పు డందలి పాత్రలకు వారి కందుఁ గల ప్రాధాన్యమునుబట్టి గద్యమో పద్యమో వ్రాయుచుండును. నలోపాఖ్యాన మను పే రున్నను అందు నలుని కంటె దమయంతికే యెక్కువ ప్రాధాన్య మనియు, నందుచేతనే నలుని గూర్చి మొదటఁ జెప్పునప్పుడు వచనమును (అర. ౨-7); దమయంతిని గూర్చి చెప్పు నప్పుడు పద్యమును (అర. ౨-8) ఆతఁడు వ్రాసియుండెననియు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు "నన్నయ గారి ప్రసన్నకథాకలితార్థయుక్తి" లో వ్రాసి యున్నారు. కాని యి ట్లాతని రచనలో నంతటను సమన్వయము చేయుట కష్టసాధ్యమైన విషయము. పద్య గద్యముల ప్రయోగము విషయమున నాతఁడు విచక్షణత చూపు నను మాట మాత్రము సత్యము.

కొన్నిచోట్ల నన్నయ పద్య రచనా ధోరణి యచ్చటి పాత్ర పద్యమయ మైన యుపన్యాస మిచ్చుచున్నదా యను తలంపు కలుగఁజేయుచుండును. ఇట్టివానికి నాస్తీకుఁడు సర్పయాగ నివారణ సందర్భమున జనమేజయుని స్తుతించుచుఁ జదివిన పద్యములు చక్కని తార్కాణము. ఆది పర్వాష్టమా శ్వాసమునఁ బాండవులతోఁ గలహించుట లగ్గు కాదని ద్రోణుఁడు ధృతరాష్ట్రుని తోఁ బల్కిన పల్కులును (34-36); ద్రోణ కర్ణుల వాక్కలహము నాపి విదురుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పిన మాటలును (43-68); శిశుపాలుఁడు ధర్మజు నాక్షేపించుచుఁ బల్కిన పల్కులును (స. 8-12) గూడ నిట్టివే.

సాధారణముగాఁ గావ్యమునందలి శైలి కథన శైలి, వర్ణన శైలి, సంవాద శైలి, యని మూఁడు తెఱఁగులుగా నుండును. నన్నయది ప్రధానముగాఁ గథన శైలి. కథను రెండు విధములుగా నడపింపవచ్చును. కథకుఁడు తానే చెప్పుట యొకపద్ధతి. కథకుఁడు తాను వెనుకనుండి కథా పాత్రముల మూలమునఁ గథను నడపించుట రెండవది. మొదటిది కవి నిబద్ధము. రెండవది పాత్ర నిబద్ధము. ఇందు మొదటిదానిని గథన శైలి యనియు, రెండవ దానిని సంవాద

శైలి యనియుఁ జెప్ప నగును. పై రెండివలెఁ గథా ప్రధానముగాక వర్ణన ప్రధానమై యుండునది వర్ణన శైలి. నన్నయ పెక్కుచోట్లఁ కథకుఁడు కథను చెప్పునట్లుగాఁ దటస్థుఁడై కథలను సాగించు చుండును. పుత్త్రవియోగ దుఃఖితుఁడై వసిష్ఠుఁడు ప్రాణత్యాగము చేయఁ దలఁచిన సందర్భమున (ఆది. ౭-118-122) వ్రాయఁ బడిన పద్యములలోఁ గథన వేగము రమ్యమై గోచరించును. ఇట్లని నన్నయ రచనలో వర్ణన సంవాద శైలు లసలూ లేవని భావింపరాదు. సభా పర్వమునందలి సభావర్ణన సందర్భ మందును, వసంత (ఆది. ౫-138-139) వర్ష శరద్వర్ణనముల సందర్భమందును (ఆది. ౮-136-142) ఇంద్రప్రస్థ వర్ణన సందర్భమందును (ఆది. ౪-70-79) వర్ణన శైలి కనిపించుచున్నది. ఇట్లే సౌగంధికాపహరణ వృత్తాంతమున హనుమద్భీములు సంభాషించుకొనుట, బకాసుర వధ సందర్భమునఁ దల్లి దండ్రులును, గూఁతురును, బకుని కాహారముగా నేను బోయెద నేను బోయెద నని చెప్పుచు నితరుల వారించుట, మున్నగు సందర్భములందు సంవాద శైలి గోచరించుచున్నది.

నన్నయ రచన యందు ధారాశుద్ధి సర్వతోముఖముగా గోచరించును. ఆతని పద్యము లెక్కడను గుంటక నిరర్గళమైన గమన సౌందర్యముతో సాగిపోవు చుండును దీని కాతని పద్యమును దేనినైన నుదాహరణముగా గ్రహింపవచ్చును.

"మద మాతంగ తురంగ కాంచన ...." (వ. ౧-18)

"రయ విచల త్తురంగమ తరంగములన్ ..." (స. ౨-33.)

"శారద రాత్రు లుజ్జ్వల....". (అర. ౮-142)

"నల దమయంతు లిద్దరు. .." (అర. ౨-24.)

"కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు...." (ఆది. ౫-138)

"అమల సుధా రమ్య హర్మ్య తలంబుల ..." (ఆది. ౮-216.)

"వివిధోత్తుంగ తరంగ ఘట్టన ..." (ఆది. ౨-30.)

మున్నగు వాని నీ విషయమునఁ బ్రత్యేకముగాఁ దెల్పఁగనవచ్చును. ఎట్లన హరి వంశమున.

"ఉన్నత గోత్ర సంభవము మూర్జిత సత్త్వము భద్రజాతి సం
పన్నము నుద్ధ తాన్య పరిభావి మదోత్కటము న్నరేంద్ర పూ
జోన్నయ నోచితంబు నయి యొప్పెడు నన్నయ భట్ట కుంజరం
బెన్న విరంబు శోక్తి గతి నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్."

అని నన్నయను భద్రజాతి కుంజరముతోఁ బోల్చుట యాతని పద్యములందలి గమన సౌష్ఠవమును బురస్కరించు కొనియే.

"వీరు లని పాండు సుతులకు వెఱతు నేను
వెఱచుటకుఁ దగఁగ నిపుడు విభుఁడ నీవు-" (ఆది. ౬-120.)

మొదలగు నొండు రెండు చోట్లు గతి భంగ సూచకము లైనవి కలవు. ఇవి దుఃఖమునో వ్యాకులతనో సూచించుచు నా యా సందర్భములకు సర్వ విధ ములఁ దగియే యుండును. పై పద్యము దుర్యోధనుఁడు తండ్రితోఁ దన మనో దుఃఖమును జెప్పు సందర్భములోనిది. ఇచ్చటి ధారాహైన్య మాతనికిఁ బాండ వుల యెడఁ గల వెఱపును, అసహ్య భావమును సూచించుచున్నది.

నన్నయ వచనమును గూర్చి యిదివఱకుఁ జెప్పియుంటిని. ఆంధ్రమునఁ బద్యమునకును గద్యమునకును నతఁడే ఆద్యుఁ డని చెప్పవలయును. ఆతని వచనములు ధారాళములై, వర్ణన సందర్భముల దీర్ఘ సంస్కృత సమాస భూయిష్ఠములై, నాతి దీర్ఘములై యతిమనోహరములుగా నుండును. ఆధుని కాంధ్ర వచనమునకు మార్గ దర్శకుఁ డైన చిన్నయసూరి వచనమునకు నన్నయ వచనమే యొజ్జబంతి. కొన్నిచోట్ల నాతని వచనము చిన్న చిన్న వాక్యములతోఁ గూడి చక్కని సంభాషణ శైలిలో రచింపఁ బడి యున్నది. (ఆది. ౨-31). వినతా కద్రువల సంభాషణము (అర.౨-127), నల కర్కోటకుల సంభాషణము, సభా పర్వమున ద్రౌపది ధర్మ విజితయా యధర్మ విజితయా యను సందర్భ మున (స. ౨-227,229) వికర్ణుఁడును కర్ణుఁడును బల్కిన పల్కులు హేతు వాద పూర్వకములై వాది ప్రతివాదుల పక్షముల నవలంబించి న్యాయవాదులు వాదించుచున్న ట్లున్నవి. అరణ్య పర్వము నందలి వచనములు పెక్కు విషయ ప్రధానములై యున్నవి ఆది సభా పర్వములందుఁ గంటె నిందు వచనముల సంఖ్య హెచ్చు. ఇవి యలఁతి యలఁతి వాక్యములతోఁ గూడి యా యా విష యములను విశదముగా వర్ణించుచున్నవి. పద్యమునం దైనను గద్యమునం దైనను గాంభీర్యము, ధారాశుద్ధి, అన్వయ సౌలభ్యము, అర్థ వైశద్యము అను నవి నన్నయ శైలి యందలి ప్రధాన లక్షణములుగా గోచరించును.

నన్నయ పెక్కుచోట్లఁ బద్యములలో సంబోధన లెక్కువగా వాడు చుండును. ఒకే పద్యమున నొక్కొక్కయెడ రెండు మూఁడు సంబోధన లుండును.

"గురుభుజాంధ నాకుఁ గూర్తేనిఁ జేయకు
మయ్య యిట్టి చెయ్వు లనఘ యింక" (అర. 3-377.)

"వరనుత ! నీ ప్రసాదమున నా కుదయించిన నందనున్ మహీ
గురుతర యౌవరాజ్యమునకున్ దయతో నభిషిక్తుఁ జేయఁగా
వరము ప్రసన్న బుద్ధి ననవద్యముగా దయసేయు నెమ్మితో
నిరుపమ దాన యట్లయిన నీకును నాకును సంగమం బగున్"
(ఆది. ౪-59.)

ఈ సంబోధనల నాతఁ డించుక యలక్ష్యముగా వాడినచోట్లును గొన్ని కలవు.

"వారికిం బనుల్ సేయను నేమి కారణము చెప్పుము దీనిఁ బయో
రుహాననా !" (ఆది. ౨-48.)

గరుడుఁడుతల్లిని 'బయోరుహాసనా' యని పిల్చుటలో నౌచిత్యము లేదు.

"ఏను నీ చెప్పిన వారి లోపల నెవ్వఁడఁ గాను
గానీన !" (ఆది. ౭-200.)

ఇది యర్జునుఁడు కర్ణునిఁ గూర్చి యన్నమాట. కానీనుఁ డనఁగాఁ గన్యా పుత్త్రుఁడు. కర్ణుఁ డట్టివాఁడే. కాని యర్జునున కా విషయము తెలియదు. అతఁ డతని నట్లు సంబోధింపఁ గూడదు. అత డట్లు పిల్చుటకు జనశ్రుతి కారణమై యుండవచ్చును.

నన్నయ యీ క్రింది పదములను వాడుటలో నెక్కువ మక్కువ చూపు చుండును.

మరణించె ననుట కాతఁడు మాటికిఁ దొంబదిచోట్ల 'పంచత్వము నొందె' ననియే వ్రాయుచుండును.

[ఆది. ౨-136; ౩-78; ౫-57; ౫-259; ఆది. ౭-78; ౭-131; ౭-129; ౮-102 మొద]

పూజ్యులను గూర్చి చెప్పునప్పు డాతఁడు 'భట్టారక' శబ్దమును దఱచు వాడుచుండును.

[ఆది ౧-141; ౪-257; ౭-265; అర. ౩-30; 330; 392]

'మానుగ, తగిలి, ఇమ్ము, ఇమ్ముల, రమణ' అనునవి యతఁడు పద్య పూరణ మునకై తఱుచుగా వాడుచుండు పదములు. నకార ప్రాసముతోఁ గూడిన కంద పద్యము లెల్ల నొక పాదము మొదట 'మానుగ' వాడుచునే యుండును.

మానుగ :—ఆది: ౭_202; ౩_108; ౪_148; ౫_253; ౬_23; 50; 78; 108; ౭_202; ౭_68; సభా. ౧_19. అర. ౩_312

తగిలి .—ఆది: ౩_95; 193; ౪_63; 206; 266; ౭_256. సభా: ౨_84; అర: ౧_211. 243. అ౨. ౭_230.

ఇమ్ముల :—ఆది: ౫_39; ౫_111; ౬_131; 233; 274: ఆది: ౪_5; ౭_176;

సభా : ౨_138; అర: ౨_10. 234; అర. ౪_77.

నన్నయ కవిత యందలి దేశి లక్షణములు :—

నన్నయ ప్రధానముగా మార్గ కవితా సంప్రదాయమునే యవలంబించిన వాఁ డైనను అతని కవితలో దేశి సంప్రదాయమునకుఁ జెందిన లక్షణములను గొన్ని లేకపోలేదు. అతఁడా రెండు సంప్రదాయములకుఁ దన కవిత్వములో సమ్మేళనము కల్పించె నని చెప్పవచ్చును. అతని కవిత్వమునందలి దేశి కవితా లక్షణము లీ క్రింద వివరింపఁ బడుచున్నవి.

1. అతఁడు చంపకోత్పలమాలాది సంస్కృత వృత్తములనే కాక దేశీయ పద్యములను గూడఁ దన కవిత్వములో వాడి యుండెను. తరువోజ. మధ్యాక్కర. సీసము. తేటగీతి. ఆటవెలఁది.

2. సంస్కృత వృత్తములలోఁ గూడ నాతఁడు దేశీయములైన యతి ప్రాసలను బ్రవేశపెట్టి వాని కధిక తరమైన సౌందర్యము చేకూర్చెను.

3. అతఁడు మూలములో లేకపోయినను గొన్నిచోట్ల ఆంధ్ర దేశము నందలి నదులను, బ్రదేశములను బేర్కొని దేశాభిమానమును జాటియుండెను. అర్జును తీర్థయాత్ర సందర్భమున వేఁగిదేశ వైభవమును, సభా పర్వమున వరుణుని సభను వర్ణించుపట్ల పేన్నానదిని బేర్కొని యుండెను. సహదేవునిచే జయింపఁ బడిన దేశములలో నాంధ్రమును దొలఁగించి రాజసూయ యాగమునకు వచ్చిన వారిలో నాంధ్రులను జేర్చెను.

4. అమూలకములైన కొన్ని వర్ణనములలో నన్నయ దేశీయములైన వేష సంప్రదాయాదులను వర్ణించియుండెను.

1. "తెరల వలపైచి జాలరి దిగిచి, దాని - యుదరదళనంబుసేయ." (అర. ౩-32.)

2. " పుణ్యాహరవపురస్సరంబుగా గృహప్రవేశంబుసేసిరి." (ఆది. ౬-147)

3. "అడుగకయు విప్రవరులకు నడరఁగ నద్దేశమున గృహస్థులు భక్తిం గుడువఁగఁ బెట్టుదు రెప్పుడు." (ఆది. ౭-30)

4. "ద్వైపాయనుండు ధౌమ్యుండు నాదిగా భూసురుల్ సూత్ర విన్యాస మమరఁ జేసి శాంతిక విధుల్ సేయంగ"- (ఆది, ౮-70.)

5. "కుఱుచ చేతులు మిడిగ్రుడ్లును గడుకొన్న తఱటులు మఱి చెంచుఁ దలలు నమరఁ

దడవిండ్లు సేపట్టి తడయక యెఱుకులై యార్చుచు భూతమ్ము లాత్మ సతుల-

నెఱుక సతులఁ గావించి య య్యెఱుకరాజు
ముందటం బిక్కయల నొక్క మొగిన విలిచి
రంత-" (అర- ౧-300.)

6. "ధరణిఁ గడుఁ బేదవారును బురిటికి ఘృత తైలధాన్యములఁ జెచ్చెర ముందర సంగ్రహింతురు" (అర- ౩-241.).

7. " మొల్ల గుత్తులను నుయ్యెల లొప్పఁగ నెక్కి యూగె. " (అర- ౪-138.)

ఆంధ్రదేశ వ్యవహారమునఁ దఱచు వాడఁ బడుమందు నానుడులును, బలుకుబళ్లను, సామెతలును అతవి రచనలో వచ్చుటచ్చటఁ గానఁ బడుచుండును. వాని నిప్పటికిని దెలుఁగువారు వాడువిధముననే ఆ సందర్భముననందే యాతఁడును వాడియుండెను. అట్టిచోట్ల నతవి రచన మిక్కిలి జాతీయమై తెలుఁగుఁదనముతో నొప్పారుచుండును.

1. "ఇప్పుడు ప్రొద్దులేదు రేపకడ చూతము". - (ఆది- ౨-33)

2. "వాలుపయి నడచున ట్లబ్బాలిక నడువడ నడుంగి" (ఆది- ౨-155)

3. "నీ మందులు మంత్రంబులు నా యందు నీకుం బని సేయవు" (ఆది- ౨-190)
4. "ప్రొద్దున బోయె." (ఆది- ౩-112)
5. "వెండి మహిమలు నా యొద్దన పలుక నీకు నానయు లేదే." (ఆది- ౩-137)
6. "ఏ నెట నీ వెట సుతుఁ డెట" (ఆది- ౪-99)
7. "అర్జును వలని భయము పెడి బొమ్మనఁ జేయిడి విద్రవోయె" (ఆది- ౬-62)
8. "ఓలిన మేలుగాఁ బడసి యూర్లను నున్నది యట్లు గానినాఁడు" (ఆది- ౬-267)
9. "ధర్మవె తాత్పర్యముగా నిర్మలమతి నెగడునది" (ఆది- ౭-34)
10. జననుత! దాని వత్సంబు విన్నటఁ గోలె నుడుగక యఱచుచు నున్నయదియుఁ బలుకుల కెడలేదు.' (ఆది. ౮-118)
11. ప్రీతి నెత్తికొనియెన్ మహి నెత్తినపుణ్యుఁ డున్నతిన్ (స. ౧-101)
12. ఇతనికిఁ గూర్తురేని ధనమిత్తు రభీష్టములైన కార్యముల్ మతి నొనరింతు రిష్టుఁ డని మంతురుగాక- (స. ౨-10.)
13. ఇమ్మది వెట్టి వీవిఁ బరమేశ్వరుఁ గాఁ గొని యాడె (స. ౨-39.)
14. పొగడుచు నున్న నీ నాలుక యొక్కఁ డయ్యు ద్రయ్యవలయు నూఱు ద్రయ్యలు గాఁగ నట్లయినఁ గాని చాల వతనిఁ బొగడ- (స. ౨-41.)
15. "అదియేమి గహనంబు దానిన యిచ్చెద." (అర. ౧-293)
16. "వలున కాని నలిన దళ నేత్ర వరియింప దబ్బె చూత మనుచు" (అర. ౨-52)
17. "కడుపుఁ దడవికొనుచుఁ గబ్బునఁ ద్రేఁచిన నసుర జీర్ణ మయ్యె (అర. ౨-341)
18. "విని రోయు తీగ కాళ్లం బెనఁగెం దా ననుచు" (ఆది. ౫-220)
19. "పాయ మొగ మిది" (ఆది ౫-224)
20 "కుంతి కడుపు చల్లఁగాఁ బుట్టిన ఘన భుజుండు" (ఆది. ౬-18)
21. "ఇచ్చిదిపి కుత్తి" (ఆది. ౭-101)

22. "మెత్తని వలుఁద పొదుగు" (ఆది ౭-98)
23. "కొండలు వడినట్లు పడిరి" (అర. ४-73)
24. "ఈ వ్యాధి యెంటఁ దీరదు" (అర. ౫-248)
25. "కన్ను మొగుడ కున్న (అర. ౨-75) కన్నుమూయదు నాకున్" (అర. ౧-270)

"కన్ను వొందకున్న" (ఆది. ౬-284)
26. "ఏమి యని నగరె సభన్" (అర. ౧-171)
27. "వెంద్రుకలు పాచి ముడిచి సందెనఁగఁ దాల్చి" (౧-20)
28. "ఈ యున్న పౌష్యపాలికి" (ఆది. ౧-116)
29. "దానితోడి దేమి" (ఆది. 3-148)
30. "వంటయిలు కుందెలు సొచ్చె" (ఆది. ౬-186)
31. "జము కుత్తుకఁ జొచ్చి వెలువడునట్లు" (ఆది. ౬-195)
32. "నీ యిమ్ముల నుండు బుద్ధిచెప్ప కుండు మాకు" (స-౨-188.)
33. "కుడిచిన చోటికిఁ గూర్చ వెపుడు" (.స. ౨-188.)
34. "తర తరంబ యవిసిన" (ఆది. ౨-152.)
35. "జంట పన్నిదంబు సఱచితిమి" (ఆది. ౨-34.)
36. "వ్రచ్చి వందఱ లాడెన్" (ఆది. ౨-155.)

ఇట్టి ప్రయోగములను జూచినప్పుడు నన్నయ కేవల సంస్కృతాభిమానియే కా దనియు. దేశియము లైన పలుకుబళ్లు వాడుట యందుఁ గూడఁ జాల ప్రీతి కలవాఁ డనియుఁ దెలియ వచ్చును. ఆ నాఁడు జన వ్యవహారమున నుండి విన వింపుగా నుండిన జాతీయము లన్నిటిని అతఁడు గ్రహించి తన కావ్యమున సందర్భము వచ్చినప్పుడు ప్రయోగించి యుండెను. కాని యప్పటి కింకను దెలుఁగు భాష సమగ్ర పరిణామమును బొంది యుండని కతమున నట్టి జాతీ యొక్కు లాతని రచనలో నెక్కువగాఁ బ్రవేశించుటకు వీలు లేక పోయెను. మార్గ దేశి పద్ధతులను గలుపుటకే నన్నయ యథాశక్తిగాఁ బ్రయత్నము చేసి యుండెను. ఆ సమ్మిళిత రూపము యొక్క ప్రథమావతారమే యాతని యాంధ్ర భారత రచన.



## 11. నన్నయ భారతము నందలి భాషా విశేషములు;-

నన్నయకుఁ బూర్వ ముండిన శాసనము లందలి భాషా స్వరూపమును, భారతమును రచింపఁ బూనుటకు ముందా శాసనము లందును, దన నాఁటి వ్యవహారము నందును గల భాషను బాగుగాఁ బరిశీలించి యాతఁడు కొన్ని ధ్వనులను, రూపములను బరిహరించి, కొన్నిటిని బరిగ్రహించి, స్థిరపఱిచిన విషయమును, ఇది వఱకుఁ జెప్పఁబడి యున్నవి. ఆతనికి ముందు భాష యింకను స్థిరత్వమును బొందక ద్రవ రూపముననే యుండెను. ఆతని రచనలో నది స్థైర్యమును రూప సౌష్ఠవమును బొంది తరువాతి కవులకెల్ల రకును బరమప్రమాణమయ్యెను. అందుచేఁ బూర్వపు శాసనములందలి భాషను గూర్చి కంటె నాతని భారతమునందలి భాషనుగూర్చి కొంచెము స్పష్టతరముగఁ జెప్పుటకవకాశ మున్నది. కాని శాసన భాషను బరిశీలించు నప్పుడు గల యొక సౌలభ్య మీతని భాషను బరిశీలించునప్పుడు కొఱవడి యున్నదవిచెప్పవచ్చును. శాసనములు శిలల మీఁదనో రాగి రేకులమీఁదనో వ్రాయఁబడియుండును గావున వానినిబరిశీలించు నప్పుడు రచయిత లూహించిన రూపములనుగూర్చి మనకు నిశ్చితజ్ఞాన మేర్పడుట కవకాశమున్నది నన్నయ భారతము సహస్రాబ్దములకుఁ బూర్వమెప్పుడో తాటియాకులపై వ్రాయఁబడినది తాటియాకులు శిలా తామ్రములవలె శాశ్వతముగా నుండుట కవకాశము లేదు కావున నన్నయ స్వయముగా వ్రాసిన ప్రతి మనకు దొరకుట దుర్లభము దాని పుత్త్రికల పుత్త్రికలనో లేక వాని పుత్త్రికలనో మాత్ర మిప్పుడు మనము చూడఁ జాలుదుము. ఈ లోపుగా లేఖకులు బుద్ధి పూర్వకముగను అజ్ఞాతముగను గూడఁ గొన్ని మార్పులు చొప్పించి యుండ వచ్చును. తెలుఁగు దేశభాషయై జీవనది వోలెఁ బ్రవహించుచు వచ్చుచున్న కారణమున నిందలి పదములు, రూపములు కాలాను గుణముగాఁ గొంత పరిణామమును బొందు చుండుటయు, నా పరిణామమును వైయాకరణులు సూచించుటయు, వాని తోడను అర్వాచీన కవీంద్రుల ప్రయోగముల తోడను బరిచయము గల వారు లేఖకులలోఁ గొంద ఱుండుటయు నా మార్పులకుఁ గారణము. మఱియు లిఖితస్థితి నుండి ముద్రణ స్థితిని బొందించునప్పు డాధునిక పండితులు తమ నాఁటి వ్యాకరణముల సిద్ధాంతముల ననుసరించి యందు మఱికొన్ని మార్పులు చేసి యుండ వచ్చును. అందుచే మన కిప్పు డుపలభ్యము లగుచున్న నన్నయ భారత ముద్రిత ప్రతి సరిగా నన్నయ వ్రాసికొన్న మాతృకకు నకలే యని చెప్పుటకు వీలు లేదు, కావునఁ దాశ

పత్ర ప్రతు లందును, వ్రాఁత ప్రతు లందును గల ప్రయోగ విశేషములను గూడ దృష్టియం దిడుకొని నన్నయ భాషా విశేషములను బరిశీలింప వలయును.

శ్రీ చిలుకూరి నారాయణరావు గారు, శ్రీ గంటి జోగిసోమయాజి గారు, గిడుగు వారు, శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, శ్రీవజ్ఝల చిన సీతారామశాస్త్రి గారు మున్నగు భాషా తత్త్వజ్ఞులు నన్నయ భాషా విశేషములను గూర్చి పరిశోధనలు కావించి యున్నారు. చిన్నయసూరి బాలవ్యాకరణము వ్రాయు నప్పుడితర కవుల ప్రయోగములను గూడ గ్రహించినను నన్నయ భారత భాగమునే ప్రధానాధారముగా స్వీకరించినట్లు కనఁబడు చున్నది. పై విద్వాంసు లందఱును గావించిన పరిశోధనలలో ముఖ్యము లైనవియు, నా పరిశీలనమునకు గోచరించిన విశేషములును మాత్రమే యిందుఁ బొందు పఱుపఁ బడినవి. ఒక్కొక్క విషయమునకు భారతమున నున్న ప్రయోగము లన్నియు నొసంగినచో గ్రంథము పెరుఁగును గావున ముఖ్యము లైనవియు, లభ్యమగు చోట యతి ప్రాస స్థానములం దున్నవియు నగు ప్రయోగములే చూపఁబడు చుండును.

ధ్వనులు :-

తనకుఁ బూర్వము శాసనము లందుఁ గనవచ్చు ఱ, ఴ అను ధ్వనులను నన్నయ పరిహరించె ననియు నవి యాతని భారతమునఁ గానరా వనియు విదితమునకుఁ జెప్పఁ బడినది. ఇట్లే సంయుక్తాక్షరములలో నాతఁడు శకట రేఫమును దొలఁగించిన విధము కూడ సూచింపఁ బడినది.

ఉకారము తప్ప మిగిలిన యచ్చుల కచ్చు పర మౌనపుడు యశ్రుతి వినఁబడు చుండెను. అందుచేతనే సంధ్యభావము గల యట్టి చోట్ల నన్నయ యడాగమమును స్థిరము కావించెను. ఈ యశ్రుతి గల యచ్చునే లఘు యకార మందు రని అం.శ. చిం. చెప్పుచున్నది. ("యశ్రుతి మార్యాలఘు యం ప్రవదన్తి ప్రాణతః పరమ్ ప్రాణమ్" 25). మధ్యమ పురుషేకారమున కచ్చు పర మగునపుడు యశ్రుతి లేకుండెను. అందుచే నచ్చట యడాగమము రాదు. పదాంత మందలి ఉకారము తేలికగా నుచ్చరింపఁ బడుచుండుట వలన సంధియం దది లోపించుటయు దాని స్థానమునఁ బరాచ్చు విర్చుటయు జరుగుచుండెను. ద్విత్వ శకట రేఫము తమిళమున ట్ర యను ధ్వనితో నుచ్చరింపఁ బడుచుండును. నన్నయ కాలమునఁ గూడ దాని కట్టి యుచ్చారణ ముండినట్లు కనఁబడు చున్నది. రణస్థిపూఁడి శాసనమున "ముయ్యలి కుట్టు" అను మాట రెండు సార్లు వ్రాఁద

బడినది. నందంపూడి శాసనమున ముయ్యాలి కుఱ్ఱున, ముయ్యాలి కుఱ్ఱ సీమా అను రూపము లున్నవి. దీనికి నేఁటి రూపము ముయ్యేల గుట్ట మూఁడు + ఎల్ల + గుట్ట యని శబ్ద రత్నాకరమునను, బ్రౌను నిఘంటువునను, ఇందలి పదములు విడఁదీయఁ బడినవి. దీనివి బట్టి 'కుఱ్ఱు' అనునది మొదట కుట్టు, కుఱ్ఱు అను రూపములను బొంది తరువాత సమీకరణముచే కుట్టు అయి,పిమ్మట గుట్టగా మాఱినదని తలంప వచ్చును. కుఱు, చిఱు మొదలగు శకట రేఫాంత విశేషణములు విశేష్యములతోఁ జేరునప్పు డందలి తుది శకట రేఫములు ద్విరుక్తములై పై క్రమమున ద్విత్వ టకారములుగా మాఱినవి. ఏఱు మొదలగు శకట రేఫాంత నామములకు ద్వితీయాది విభక్త్యంగము లందుఁ గనఁబడు టి వర్ణము సైతమిట్లేర్పడినదే.

నన్నయ భారతమున క్షకారమునకు కకారాదులతోనే కాని ఛకారాదులతో నెచ్చటను యతి వేయఁబడి యుండలేదు. సంస్కృతము నందలి క్షకారము ప్రాకృతమునఁ గొన్నిచోట్ల ఖకారోచ్చారణమును, గొన్ని చోట్ల ఛకారోచ్చారణమును బొందుచున్నట్లు కనఁబడు చున్నది. (ష్క-స్క- ఖో౦ఖః ప్రా. ప్ర. 3_29; అక్ష్యాదిషు ఛః 30; క్షమావృక్ష క్షణేషు వా 31) ఈ రెండు విధములైన యుచ్చారణములలో నన్నయకు ఖ కారోచ్చారణమే యభిమతమై యుండుట చేతనో, ఆతఁ డుండిన ప్రాంతమున నట్టి యుచ్చారణమే విరివిగా నుండుట చేతనో, యాతఁడు దానికే ప్రాధాన్యము నొసంగి యుండును.

క్షమయ తాల్చి యుండఁ - జనదెల్ల ప్రొద్దు (అర. 3_136)
క్షత్త్రి చరిత్రుఁడై పరఁగు - సత్త్వమునన్ అర.

అను రెండుచోట్ల క్షకారమునకు జసలతో యతి వేయఁబడిన ట్లచ్చు ప్రతులలో నున్నది. కాని వ్రాఁత ప్రతులలో

క్షమయ తాల్చియుండఁ గాదెల్ల ప్రొద్దు
క్షత్త్రిచరిత్రుఁడై పరఁగు గర్వమునన్ (గర్వమునన్)

అను పాఠాంతరము లున్నవి. (ఆం. భా. చ. పు. 1332)

ఇట్లే జ్ఞ యను దానికి నన్నయ భారతమున జకారాదులతో మాత్రమే యతి కనఁబడు చున్నది. కాదులతో దానికి యతిమైత్రి చెల్లుట తరువాతి గ్రంథములలో మాత్రమే గోచరించుచున్నది.

"జ్ఞానము కేవల కృపన
జ్ఞానికి నుపదేశ విధిఁ బ్రకాశము సేయం
గానది సకల ధరిత్రీ
దానంబునకంటె నధిక తర ఫలదమగున్" (శాంతి. 4-255)

అను పద్యమునఁ దిక్కన జ్ఞకారమునకును కకారమునకును యతివేసెననితెల్పి, యప్పకవి జ్ఞకారమునకును బ్రథమ వర్గంబు తొలియక్కరములు నాల్గింటికిని విశేషవళి యను పేర యతివేయవచ్చునని యప్పకవీయమునఁజెప్పియున్నాడు. (అప్ప. 3-58) దీనినిబట్టి నన్నయ కాలమున దానికి జ్ + ఞ అను నుచ్చారణమే కాని, నేఁటి కాలమున వలె గ్ఞ, గ్న అను నుచ్చారణములేదని యూహింపవచ్చును. ఞ అను ననునాసికముతో నారంభించు పదములు లేకుండుటచేతను, దాని కపంయుక్తమయిన ప్రయోగము మృగ్యమగుట చేతను, చ జ లతోఁదప్ప నితరాక్షరములతో దానికి సంయోగ ముండక పోవుటచేతను, జ్ఞకు జకారాదులతోఁ దప్ప వింకొక దానితో యతి వేయుట కవకాశమే లేదు. నన్నయ గకారాదులతో దాని కెక్కడను యతివేయలేదు కావున దానికట్టి యుచ్చారణ మప్పుడు లేకుండెనేమో యని వ్యతిరేకముగా (Negative) మాత్ర మూహ చేయవచ్చును.

అద్రుచు, విద్రుచు అనుధాతువుల రూపములందే కాక సంస్కృత సమాసములలోఁ గూడ రేఫ యుక్తములైన సంయుక్తాక్షరములకు ముందున్న యక్షరములు కొన్నిచోట్ల లఘువులుగా నున్నవి. ఇట్టి శిథిల ద్విత్వముల విషయము "నన్నయ భారతమునందలి ఛందస్సు" అను భాగమునఁ దెల్పఁ బడినది.

కం। "తలరఁగ రేణుక క్రథన, ప్రలిహ ప్రరుజాశ్వకుంత" (ఆది. ౨-100)

ఉ। "నక్షత్రి యుతుండుగా శశి ప్రకాశ జయోన్నతమైన యష్టమిన్-"
(ఆది. ౫-94)

కం॥ "నం, శితవ్రతులుమ్, విప్రవరులు- చేసిరి ధర్మ" (ఆది. ౫-96)
"నం, శితవ్రతులు విప్రవరులు- చేసి'' రని వేమూరు వారి వ్రాఁత ప్రతిలో పాఠాంతర మున్నది.

కం॥ "అమ్మవి ....... .. ...
ప్రవరు పృథూత్సంగ తలముపై వడిఁ బడియెన్''- (స. ౧-142)

పద మధ్యాంతములందు 'న, ల,' లను 'ణ ళ' లనుగా నుచ్చరించు నాచారము నన్నయ నాఁటికిఁ జాల తగ్గినట్లు తోఁచుచున్నది. ఆతని భారతమున 'న ల'లు న ల లుగానే కనిపించును. కాని యాతని తరువాతి శాసనములలోఁ గ్వాచిత్కముగ నైన న ల లు, ణ ళ లుగా వ్రాయఁ బడుట కానవచ్చుటచే నా యుచ్చారణ మింకను గొంతకాలము సాగిన దనియే చెప్పవచ్చును.

భీమణొజ్జలు (S I I V. 76 A. D. 1197)

సంధులు :-

1. "చిన్నయ సూరి ప్రథమేతర విభక్తి శత్రర్థక చు వర్ణంబు లందున్న యుకారమునకు సంధి వైకల్పిక మని చెప్పి నన్నడిగె, నా కొఱ కిచ్చె మొదలగునవి వుదాహరించెను. కాని కొఱకున్, కున్ అను వానిలోని ఉకారమువలె నన్ను లోని ఉకారము విభక్తి సంబంధమైనది కాదు. నా శబ్దమున కాదేశముగా వచ్చినది నన్ను. దీనిమీఁది విభక్తి 'ను'. దీని ఉకారము లోపించునప్పుడు నన్నున్ అగును. నన్నులోని ఉకారము ప్రకృతి సంబంధమైన దగుటచేఁ బై సూత్ర మిచ్చట వర్తింపదు. అట్లు వర్తించె నేని రామున్ + అడిగెన్ = రా మడిగెన్ అని యేల కాఁ గూడదు ?'' అని ఆంధ్ర భాషా శాసనమునఁ జెప్పఁ బడినది. (సంధి. 19 సూ) దీనినిబట్టి నీ నా, తన శబ్దము లకు నిన్ను. నన్ను, తన్ను అనునవి యాదేశముగా వచ్చుననియు, నిందలి యుకారము ప్రకృతి సంబంధమైన దగుటచేఁ బ్రథమేతర విభక్తి విధి యిచ్చట వర్తింప నేర దనియుఁ దెలియుచున్నది. కాని సూరి కాని మఱి యెవ్వరు కాని నీ, నా, తన శబ్దములకుఁ బై రూపము లాదేశముగా వచ్చు నని యెచ్చటను జెప్పియుండలేదు. చిన్నయ సూరి "నన్నును, మిమ్మును, నిన్నును, మిమ్మును, తన్నును, తమ్మును" అను సిద్ధ రూపములను రూపసాధన ప్రక్రియ చూప కుండనే యాచ్ఛిక పరిచ్ఛేదమున (9,10,12) నుదాహరించి యుండెను అందుచే 'నన్నును' మున్నగువానిలోని న్ను మ్ము లు ద్వితీయా 'ను' ప్రత్యయ మునకే పూర్వాగమములుగ సూరిచే నిర్దేశింపఁ బడె నవియు నప్పు డందలి ఉకారము విభక్త్యుకారమే యగు ననియు భావింపవచ్చును. దీనినిబట్టి చూచి నచోఁ బ్రథమేతర విభక్తి సూత్రము కొఱకున్, కున్ అనుచోట్ల వలెనే యిచ్చటఁ గూడ వర్తించును. దాని ననుసరించి నన్నున్ + అడిగె = నన్న డిగె- నన్ను నడిగె అను రెండు రూపము లేర్పడును. కేతన ఆంధ్ర భాషా

భూషణమున (58 పద్య) నన్ను, నిన్ను, తన్నుల మీఁది ద్రుత మచ్చుపరమగు నప్పుడు లోపించు నని తెల్పి 'న న్నడిగె' వంటి రూపములను సాధించెను.

న్ను మ్మూ ర్హ్రస్వ శ్చాదే రమి శసిచ (ఆం. శ. చిం. హలంత. 15) అన్యతర లుక్చ యుక్తస్య (6) ఏతయో ర్బహుత్వే మః (18) అను ఆం శ. చింతామణి సూత్రములచే నను, నిను, మము, మిము అను రూపము లేర్పడును. వీని కచ్చు పర మగుచో సంధికాదు. ననున్ + అడిగె = నను నడిగె వంటి రూపములే కాని 'న నడిగె' వంటి రూపములు సిద్ధింపవు. ఈ విషయమునే చిన్నయ సూరి "ఙద్దక్కారంబుతోఁ బదాది స్వరంబు కూడుచో ఙద్దకు లోపంబు లే" దని తెల్పి (ప్రకీ. 9) అట్టైత్తె, న న్నడిగె మున్నగు వాని నుదాహరణముగా నొసంగెను. ఇట్లు సూరి చెప్పుట గుర్తింపక ప్రౌఢ వ్యాకరణ కర్త "ద్విత్వ రహితంబగు ద్వితీయా విభక్తి యుకారమున కచ్చు పరమగుచో సంధి రాద" ని (ప్రౌ. వ్యా పుట 95) పునరుక్తిగా వచించెను.

పీ. నా. తన శబ్దములకు ద్వితీయా విభక్త్యేక వచనమున నిన్నును, నన్నును, తమ్మును అనునవి పూర్ణ రూపములు నన్నయ భారతమునఁ గొన్ని చోట్ల నిన్, నన్, తన్ అనువానినే ద్వితీయా విభక్త్యేకవచన రూపములుగా వాడియుండెను. 'నిన్ గఱపె బుద్ధి' (ఆది. ౬-45) తన్వినుచున్న వారలకు' (ఆది. 3-9) నిన్నున్, నన్నున్, తన్నున్ అను వానినుండి కవిభల్లట సూత్రముచే (ఆ. శ. చిం. హలన్తము 24) నిన్, నన్, తన్ అను రూపములను సాధింపవచ్చు నని ఆం. వ్యా. సం. పర్యస్వము తెలుపుచున్నది. పుట 210.

కర్మధారయంబునందు పేర్వాది శబ్దముల కచ్చు పరమగునపుడు టు గాగమము విభాష నగు నని బాలవ్యాకరణమును, సామాన్యాధికరణ్యేషూదన్తనాం టుగాగమోఽచిస్యా త్తని ఆం. శ. చింతామణియుఁ జెప్పుచున్నవి. నన్నయ భారతమున పేర్వాదుల కచ్చు పరమైనప్పుడు టుగాగమము వచ్చిన రూపములు కానరావు.

3. నన్నయ భారతమునను అప్పటి శాసనములందును గూడ ఉత్తరమించు అను ధాతువు కనఁబడుచున్నది. (అర. ౧-2; ४-3) విజయాదిత్యుని మొదటి ర్యాలి శాసనమున దక్షిణమించి అను రూపము కూడ నున్నది. శ్రీ చిలుకూరి నారాయణరావు గారు పడు, చేయు అను ధాతువులు పరములైనప్పుడు ప్రథమా విభక్తి ముపర్ణము మీఁది ఉత్వమునకు లోపము వచ్చు ననియు

మిగిలిన మకారమునకుఁ బూర్ణబిందువు బహుళముగా నగు ననియుఁ జెప్పి కొన్నియెడల నా పూర్ణబిందువునకుఁ గూడ లోప మగునని ఉత్తరమించి, దక్షిణమించి యనున వుదాహరణములుగా నిచ్చిరి. (ఆం. భా. చ. 1338) ఇచ్చట మువర్ణమునకు లోపముగాఁ జెప్పనక్కఱ లేదనియు, ఉత్తరా, దక్షిణా యను అకారాంత స్త్రీలింగ శబ్దముల తుదిదీర్ఘములు హ్రస్వములు కాఁగా ఉత్తర, దక్షిణ అను రూపములు వచ్చుననియు, ఉత్తర + మించి అనఁగా ఉత్తరను మించి అను నర్థము స్పష్ట మనియు శ్రీ గంటి జోగి సోమయాజి గారు ఆంధ్ర భాషా వికాసమున వ్రాసియున్నారు. (పుట 215.) విజయాదిత్యుని మొదటి ర్యాలి శాసనమునందే తూర్పించి అను రూపము రెండు మాఱులు ప్రయోగింపఁ బడియున్నది. (a) పశ్చిమతః కోరు మిల్లి నారన పెద్దేరిచేవి మొల్లి మొననుండి తూర్పించి వచ్చిన. (b) ఉత్తరతః అడ్డపుం ద్రోవ దక్షిణము తలనుంచి తూర్పించి పోయిన. వీనిని బట్టి 'ఉత్తర మించు' మున్నగు ధాతువులు ఉత్తర + మించు అను వాని కూడికచే నేర్పడ లేదనియు, ఉత్తరము, దక్షిణము, తూర్పు మొదలగు వానికి 'ఇంచు' అను ప్రత్యయమును జేర్పఁగాఁ గలిగిన వనియుఁ దెలియుచున్నది. ఉత్తరమించు, దక్షిణమించు అనువానిలో మువర్ణకము మీఁదనే ఇంచు చేరినట్లు తోఁచు చున్నది. ఉత్తరమించి అనఁగా నుత్తర దిక్కుగాఁ దిరిగి అని అర్థము. ఇచ్చట దాఁటు అను నర్థమున 'మించు' అనునదియే వాడఁ బడినదని తలంచినచో, ఉత్తరము + మించు అను పదములలోని యొక మకారము (Haplology) అను దాని ననుసరించి లోపించిన దని భావింపవచ్చును. అప్పుడు 'ఉత్తరమించి' అను రూప మేర్పడునుకాని తూర్పించు అను రూపమున తూర్పు + ఇంచు అను విభాగము స్పష్టముగాఁ గానిపించు చుండుటచే దాని సామ్యమున ఉత్తరము + ఇంచు అనియే ఉత్తరమించు అను పదమును విడఁదీయుట యుక్తముగాఁ దోఁచుచున్నది. సంస్కృతమున ఉత్తరా శబ్ద మున్నను దానికిఁ దెలుఁగున "మత్తర" యను ప్రయోగ మెచ్చటను గానవచ్చుట లేదు. "ఉత్తర" యనునది తెలుఁగున నక్షత్ర పదము గానే వాడఁబడు చున్నది. (ఉత్తర చూచి యెత్తర గంప) అందుచే ఉత్తర + మించి అని పై పదమును విడఁదీయుట వ్యాకరణానుగుణ మయ్యును అసహజముగా గోచరించును.

4. అను, మను అను ధాతువులు తద్ధర్మ క్రియాజన్య విశేషణములుగా వాడఁబడు నప్పుడు వాని తుది ఉకారము వైకల్పికముగా లోపించును. నన్నయ భారతమున అను లోనిఉకారమునకు లోపము వచ్చిన చోట్లు అనేకములున్నవి.

అపత్య శోక మ న్వన విధిలోన ముంచిన - ఆ. ౪, 37
అప్సరస ఘృతాచి య న్పదమలాంగి ఆ. ౫. 195
దుర్వాసుఁ డన్విద్ధ మునియు ఆ. ౫. 17
రిపుల న్కడిఁది విషాహుల దర్పం బుడిగించెద ఆ. ౮-192
గిరివ్రజ మన్పురంబు - సభా. ౧-172.
పొగడఁగ మన్మహా మతులు పొందు గతుల్ ఆ ౨.149.

బలవంతుల బల మఱఁగా, మఱవక మన్ బ్రమానిపాట - ఆ 176-౮.
"అను" అను తద్ధర్మ విశేషణమున కచ్చు పరమగు నప్పుడు ఉత్వ లోపమును నకారమునకు ద్విత్వమును గనఁబడు చున్నవి.

విలసత్కూప ఘనవల్లి యన్నిష్ట పళి నూది యున్నదాని - ఆ. 3-140
నందివి యన్నేటి తరంగలం బెనచి - ఆది. ౮. 79.

దీనిని ద్రుతద్విత్వసంధికి లక్ష్యముగాఁ జెప్పరాదు ఏలయన ఉత్వము లోపింపఁగా మిగులు నకారము ద్రుతము కాదనుటకుఁ బై యుదాహరణములే తార్కాణము. నన్నయ భారతమున నెచ్చటను అన్ తరువాత పరుషము సరళమైన్న రూపములు కానరావు.

చను ధాతువునకు తద్ధర్మ ప్రథమ పురుషైక వచనమున "చనును" అను రూప మేర్పడును. ప్రత్యయమైన "ను" ద్రుత మగుటచే లోపించుట సహజమే. నన్నయ భారతమున నొక్క చోటఁ బ్రకృతిలోని ఉకారము కూడ లోపించిన రూపము కానవచ్చు చున్నది.

విప్ర పతికి మూఁడు వేఁదఁ జన్వరములు. స. ౨-263.
వేఁదఁ జనునని యర్థము.

5. అత్తున కచ్చు పరమగు నపుడు సంధి బహుళముగా నగును, అనఁగా గొన్ని చోట్ల సంధియైన రూపములే యుండు నవియుఁ, గొన్ని చోట్ల సంధి లేని రూపములే యుండునవియుఁ, గొన్నిచోట్ల సంధి వైకల్పికముగా నగుటచే రెండు రూపము లుండునవియు నర్థము. కాని చిన్నయ సూరి సంధి వైకల్పికముగా నగునని చెప్పిన కొన్ని చోట్ల నన్నయ భారతమున సంధి లేమియే కనవచ్చు చున్నది.

వైకల్పిక సంధి :-

పార్థు నరిగి నెడక మనము నరిగి యతని - ఆది. ౬-142.

అ(ధ్రువ మున్నతంబు లయి నెద లెక్కుచు - అర-౩-312.

అలసి నెద, దప్పినెద నాఁకలి తృష్ణయు నైన యెడల - అర-౨-74.

ఇంద్ర తనయుఁ డున్న యెడకు వచ్చె - అర. ౧-345.

వధియింను శెంతయు -- అర. ౧-274.

ఓప కఱచుచు - అర. ౨-13

మిన్నక యలయుచు - అర. ౨. 26.

కారణముగ నెంత యెఱుక గలవారును అర. ౧-32.

ఎంత యోటు వడిన నంతియ - అర. ౨-62.

సకల వృద్ధరాజు లొద్ది నర్థ రాజ్య మిచ్చితి ఆది ౮-66.

పాండు నృప సూనుల యొద్దకు అర. ౧-11

మద్బంధు జనుల యొద్దఁ - బెట్టి చట్టరమ్ము అర. ౨-63.

దానవే నీ తల్లి దండ్రు లొద్ద - అర. ౨-132.

కల యను దాని కచ్చు పరమై నప్పుడును మేనకత్త పరమగు నపుడును సంధి లేని రూపములే కనఁబడు చున్నవి.

దృఢ కఠిన తనుఁవు గల యాతని కిం దదర. ఆది. ౭. 211.

ఆదిగఁ గల యయ్యేనిమిది పర్వములను ఆది. ౧-47.

తన మేన యత్త నందనుఁ డపుత్త్రికుఁడైన ఆది. ౫-17.

సాత్వతిఁ దమ మేన యత్తను ముదంబునఁ జూడఁగఁ గోరి స. ౨-55.

స్త్రీ వాచక తత్సమ సంబోధ నాంతములకు వలెనే యవధార ణార్థములకును అచ్చు పరమగు నపుడు సంధి లేదు.

అరిగి ముందఱున్న యంద యుండి -- ఆది. ౬-153.

అరిగిన చోటిక యరుగుద మని వారి - అర. ౧-56.

మీతోన యరుగు చెంతు మనిరి - అర. ౧-36.

చిన్నయ సూరి ఆది యవి శబ్దంబుల యత్తునకు వృత్తివి లోపంబు బహుళం బుగా నగునని సూత్రించెను. బహుళ గ్రహణముచే ఉదంతములగు తద్ధర్మ విశేషణములకు మీఁద లోపము కలుగదు. ఇదంతములగు తద్ధర్మ విశేషణము లకు మీఁద లోపము నిత్యము. మిగిలిన చోట్ల లోపము వైకల్పికము.

నన్నయ భారతమున భూతార్థక క్రియాజన్య విశేషములకును, వర్తమాన కాలక్రియల యందు వచ్చు ఉన్నాను బంధమునకును, పరమగు అది అవి శబ్దముల అత్తునకు మాత్రమే లోపము వైకల్పికముగాఁ గనవచ్చుచున్నది. మిగిలిన చోట్ల లోపము తోడనో యడాగమము తోడనో కూడిన రూప మొక్కటే కానఁబడు చున్నది.

విచారావ సరాప్తికిన్ వియప మైనది అర. ౧-257

మధ్యమ నీవు చెప్పిన యది కార్యము. అర. ౧-267

అడవులు నేఱులు నవి నీ పడసిన యవి యట్టె. ఆది. ౭-40.

ఏర్చుచున్న యది మహీధరుండ. అర - ౧-139.

పెరుఁగు చున్నది తత్ప్రయంవరము చేయు చున్నవాఁడు వాఁడు ఆది. ౭-35.

వార్త యంద జగము వర్తిల్లు చున్నది స. ౧-50

అతి విస్మలంబై యొప్పుచున్న యది. అ. ౨. 31

అట్టి, ఇట్టి, ఎట్టి అను వానికిని షష్ఠీ బహువచన మందలి లకారమునకును బరమగు అది, అవి శబ్దములలోని అకారమునకుఁ గూడ లోపము కలుగును.

విమానంబులు విట్టివే. స. ౧-".

జనంబుల దయిన స. ౨-71.

నరదేవోత్తముల దైన స. ౧-25.

వాని, వారి, వీరి, దాని అనువానికి అది, అవి శబ్దములు పరమగు నపుడు వాని యందలి అత్తునకు లోపము కలుగును.

నీవు వారి దయిన నేర్పెఱింగి - స - ౧-25.

దానిది కల రూపెఱుంగ - ఆది. ౪-30.

సమాసమున ఇత్వము వచ్చిన తోడకు (తోడి) అది అవి శబ్దములు పరములగు నప్పు డందలి అత్తునకు లోపము కలుగును.

మాతోడి దేమి

దాని తోడి దేమి. ఆది. 3- 148.

పెద్ద మొదలగు అకారాంత విశేషణములకును, నా, మా, నీ, మీ, తన అను వానికిని పరమగు నప్పుడు అవి అది,శబ్దముల అత్తునకు లోపము కలుగదు. అప్పుడు యడాగమము వచ్చును. చిన్నయసూరి మతమున నిచ్చట సంధి వైకల్పికము.

పేర్వంబు కాక యది నీ యదియే అ. 7-40

రాజ్యంబు, నీ యది దమయంతి నాయది అర. ౨-223.

అందుఁ బెద్ద యదియైన యంబ ఆది. ౪. 211.

నన్నయ భారతమున ఉండునది అను విధ్యర్థక రూపమునకు బదులు ఉన్నది అను రూపము కూడఁ గనఁబడు చున్నది.

దుర్జన యోధవరుల కడ నుండ కున్నది. ఆది. ౩-206.

మేలుగాఁ బడసి యూళ్ళను నున్నది. ఆది. ౬-267.

పర ప్రయోగ మాయలు గల వెఱింగి మది నుండునది. అర. ౧-200.

అగు ధాతు క్త్వార్థక రూపమైన అయికి సముచ్చయ రూపమైన ఉ పరమగు నపుడు సంధి లేదు కాన అయియు అనురూపము కలుగ వలెను. కాని యిది నన్నయ భారతమున అయ్యు అను రూపముతోఁ గనఁబడు చున్నది. అనఁగా 'అయి' యందలి ఇకారము లోపించుటయు, యకారము తరువాతి యకార ముతోఁ గూడి ద్విత్వము నొందుటయు సంభవించు చున్నది.

దానికి శివుఁడు ప్రత్యక్ష మయ్యు ఆది. ౭-35.

చక్ర ధరుండయ్యు జలరుహ నాభుండు

గాండీవ ధరుఁడయ్యుఁ బాండవుండు - ఆది. ౮-261.

ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగునని బాల వ్యాకరణము చెప్పు చున్నది. కాని నన్నయ భారతమున కిషష్ఠి తప్ప మిగిలిన ఏమ్యాదుల కచ్చు పరమగు నప్పుడు సంధి లేని రూపములే కనఁబడు చున్నవి. అచ్చు ప్రతులలో ఏమి, అది అనువాని కచ్చు పరమై నప్పుడు సంధి యైన రూపములు కలవు కాని వ్రాఁత ప్రతులలో నచ్చటఁగూడ యడాగమము వచ్చిన రూపములే కనఁబడు చున్నవి.

నా బంధు లందఱు మనంబున నేమనారు - ఆది. ౫-29.

వ్రాత ప్రతులలో నిచ్చట ఏమినారను పాఠమే యున్నది.

ఏమని తలఁచు నొకో బుద్ధి విష్టులఁ దానున్ అర. ౧-238.

ఏమి దలంచునొకొబుద్ధి నిష్టులఁదానున్ అనునది వ్రాఁతప్రతి యందలి పాఠము.

శప్తుఁడై యదేల సంభవించె. ఆది. ౪. 260 అచ్చు ప్రతి.

శప్తుఁ డౌట యేల సంభవించె నని వ్రాఁత ప్రతి పాఠము.

ఆంధ్ర శబ్ద చింతామణిలో "నిత్య మనుత్తమ పురుష క్రియాస్వితః" అని యుత్తమ పురుష కంటె భిన్నములైన ప్రథమ మధ్యమ పురుష క్రియల యిత్తునకు సంధి నిత్యముగా నగునని చెప్పఁబడినది. చిన్నయసూరి మధ్యమ పురుష క్రియలం దిత్తునకు సంధియగుననియుఁ గ్రియా పదములం దిత్తునకు సంధి వైకల్పిక మనియుఁ జెప్పి యుండెను. ప్రథమ పురుష క్రియల యిత్తునకు సంధి నిత్యమని చింతామణియు, వైకల్పిక మని బాల వ్యాకరణమును జెప్పుచున్న వనుట స్పష్టము. నన్నయ రెండు చోట్లఁ దప్ప మిగిలిన యన్నిచోట్లఁ బ్రథమ పురుష క్రియల యిత్తునకు సంధియే చేసి యుండెను.

క్రమము వడసి యొక్క సమయంబు సేసిరి
యొనర దాని తెఱఁగు వినుము తల్లి! ఆది. ४. 264.
అందుఁ గొంద ఱధిక హాస్యంబు చేసిరి
యడవి నేమి సేసె దవిరి కొందఱు - అర. ౨. 102.

పై రెం డుదాహరణము లందును బ్రథమ పురుష క్రియలు పాదాంత మందును, వాక్యాంత మందును నుండుటచే నన్నయ సంధి విరహము కావించెను గాని యట్టిచోట్ల సంధి చేయుటయే యతని కభిమత మని యూహింప వచ్చును. "వాక్యావసానమున సంధి లేమి దోషము కా దనియు, నట్టి సంధి విరహము కావ్యములలోఁ బాదాంతము లందే చూపట్టు ననియు, జెప్పినవాఁడు చిన్నయసూరి చింతామణిలో నిట్టి యభిప్రాయ మెచ్చటను బ్రకటింపఁబడి యుండలేదు. అందుచే వాక్య పదాంతముల సంధి చేయమి చింతామణి కభిమతము కాదు. నన్నయకును ఆ ప్రక్రియ యిష్టమైనట్లు తోఁపదు.

"సర్వ తీర్థాభి గమనంబు సర్వవేద
సమధి గమము సత్యంబుతో సరియుఁ గావు
ఎఱుఁగు మెల్ల ధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు." ఆ. ४. 95.

అను పద్యమున ముద్రిత ప్రతులలో సంధి లేనట్టి రూపమే కానవచ్చు చున్నది. కాని వ్రాఁత ప్రతులలో ద్వితీయ పాదాంతమున గావ యని యేవార్థకముతోఁ గూడిన రూపమే చూపట్టు చున్నది. ఏ వార్థకము తరువాత సంధి చేయకుండుటే నన్నయ మతము. అందుచేఁ బై రెండు ప్రయోగములు, నిత్యమనుత్తమ పురుష క్రియా స్వితః అను చింతామణి సూత్రమునకు విరుద్ధములు. నన్నయకుఁ

ప్రథమ పురుషైకారమునకు వైకల్పికముగా సంధి చేయుటయే యభిమత " మను నభిప్రాయమును కీ. శే. చిలుకూరి నారాయణరావు గారాంధ్ర భాషా చరిత్రమున వెల్లడించి యున్నారు. (పుట 1603-1604). " సర్వ తీర్థాభి గమనంబు " అను పద్యమున " ఇందు సరియుఁ గావ " అని దిద్ది సంస్కర్తలు టిప్పణములో " సరియుఁ గావు " అను దానిని పాఠాంతరముగాఁ జూపిరి. సరియు = సమానము సైతము కావు అని చార్థక శబ్దముచే నర్థము చేయనగును గాన "సరియుఁ గావ " అను నవధారణార్థ ఘటిత పాఠము సుసంగతము కాదు. నా యొద్దనున్న తాళపత్ర ప్రతులు రెండింటను సరియుఁ గావు అను పాఠమే వెలయుచున్న " దని శ్రీ కళా ప్రపూర్ణ వ. చిన సీతారామస్వామి శాస్త్రిలుగారు ఆం. వ్యా. సం. సర్వస్వమున (పుట 440) వ్రాసియున్నారు. మఱియుఁ బై పద్యమునఁ ద్వితీయ పాదాదిని " ఎఱుఁగు " మిత్యాదిగా అచ్చు కనఁబడుచున్నది. ' కావ ' యని యేవార్థక సహిత పాద మున్నను అచ్చట యడాగమ సహిత రూప ముండవలయును గాని అజాదియైన రూప ముండరాదు. అందుచే వాక్య పాదాంతము లందు సంధి విరహము నన్నయ కభిమతమే యని తోఁచుచున్నది. " ఇచట సంధి యనఁగా బరరూప సంధియే కాదు. సంహితలోని యకారాగమ రూప సంధి కార్యము, సరళా దేశాదికము వాక్యావసానమున మానినను మానవచ్చును. " (ఆం. వ్యా. సం. సర్వస్వము - 438) పై విచారణమును బట్టి ప్రథమ పురుష క్రియల యిత్తునకు సంధి చేయుటయే నన్నయ కభీష్ట మనియు, వాక్య పాదాంతము లందు మాత్రమే రెండు మూఁడు చోట్ల నాతఁడు సంధి విరహము పాటించె ననియు భావింప వచ్చును.

అచ్చు పరమగునపుడు ఏని శబ్దము నందలి ఇత్వమునకు లోపము వైకల్పికముగాఁ గలుగు చుండును.

తిరముగా నిష్టంబు దీర్చితే నిందు - అ. ౫. 145.
ఎందే నిట్టి సభ చూచి యెఱుంగుదురే - స. ౧-57.
వేల్పు లెల్లం గుమారు సేనాపతిం గా నెందే నభిషేకించి రట్టి
తైజసం బను తీర్థంబు - అర. ౨. 267.
నాకు నీ వెన్నండేని నవమానంబు దలంచితి - ఆది. ౨. 154.
ఇతని నెద్దియేని నొక్క యపూర్వంబయిన దాని నిర్మింప
నియోగింపు మనిన - స. ౧-4.

పై ప్రయోగములను బట్టి యేని ద్రుత ప్రకృతిక మనియే వ్యక్తమగు చున్నది. ఆది. ४-127. ఏయ్యేనియు నొక్క స్త్రీ యందు; . ఇట్లేని యివ్వనవాస క్లేశం బెన్నఁడును మనకుఁ బాయనేరదు. (అర. ౧-266) అను ప్రయోగము లందు దానికి సముచ్చయ గతమైన ఉ పరమైనప్పుడు యడాగమము చేయఁ బడినది. అందుచే నీ విషయము సందిగ్ధముగా నున్నది.

చిన్నయసూరి ఏమ్యాదు లందును, క్రియా పదము లందును గల యిత్తు నకు వైకల్పిక సంధి విధించెను. మధ్యమ పురుష క్రియలయం దిత్తునకు నిత్యముగా సంధి యగు ఐయు. క్త్వార్థ కేకారమునకు సంధి కామియు సూచించెను. ఇకారాంతములైన యితర పదములకు సంధి కా దనియే యతని భావము. నన్నయ భారతమున ఓటమి, ఆనతి అనువాని కచ్చు పరమైనప్పుడు సంధి చేయఁ బడినది.

ఓట మెదఁద లేక యున్నవాఁడు అర. ३-63.

ఆన తిచ్చి నట్ల ఆది. ౧-117.

నన్నయ భారతమున రెండు మూఁడు చోట్ల ద్రుతద్విత్వ సంధి కనవచ్చుచున్నది.

ధైర్యశక్తి కిన్నరుదుగ. అర. ౧-322. ఇది వ్రాఁత ప్రతులలోని పాఠము. ముద్రిత ప్రతులలో నిది ధైర్య శక్తి కప్డరుదుగ అనియు, ధైర్య వృత్తి కప్డరుదుగ అనియు మార్పఁ బడినది.

ఎన్నఁడు న్నేని మోఘము గాదు దిగ్ధరణీ రపీందు లెఱుంగఁ గాన్
(ఆది. ౭-141)

ఇచ్చట ఎన్నడున్ + నేని అనియే విడఁదీయ వలెను. యతి స్థానము కూడ నీ విషయమును ధ్రువపఱుచు చున్నది. మఱియు నన్నయలో ఏని అనుదానికి నేని అనురూపము కూడఁ గనఁబడు చున్నది. కావున నిది ద్రుత ద్విత్వ సంధికి లక్ష్యము కాఁజాలదు.

మకారము పరమైనపుడు ప్రాస స్థానము లందుఁ గొన్ని యెడల ద్రుతము నకు మకార మాదేశ మగుచున్నది.

కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు (ఆది. ౫ 138)

చేసె పమ్మహానది దీర్ఘికా సరసీ నదంబులు నిండఁగాన్ - అర. ३-113.

చిన్నయ సూరి గసదవాదేశ సంధి సందర్భమున నా యా దేశము వచు. ననుటకుఁ దెనుఁగుల మీఁది తెనుఁగు పదములనే యుదాహరణముగా నిచ్చెను

నన్నయ భారతమున నచ్చు టచ్చట సంస్కృతము మీఁది తెనుఁగు పదములకును, దత్సమముల మీఁది తత్సమ పదములకును గూడ నీ యాదేశము కనఁబడు చున్నది.

గురులలోనఁ బరమ గురువు దల్లియ (ఆది. ౬-252.)

చోర భయ వర్జితముగా ధారుణి వాలింతె. (సభా. ౧-41.)

ముద్రిత ప్రతులలో నిది ధారుణిఁ బాలింతె అనునట్లు దిద్దఁ బడినది.

అట, ఇట, ఎట, అట్లు, ఇట్లు, ఎట్లు, అంత, ఇంత, ఎంత, అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు, ఏమి, పెద్ద, పలు, నెఱి, కల, ఒప్పు, ఒండు అనువాని మీఁదఁ బరుషములకుఁ గసడదవలు వచ్చును.

దుర్యోధనుండు దుర్బుద్ధి యని యేమి సెప్పవలయు (అర. ౧-390.))

ఏమి గారణంబున నయోనిజ యయ్యె (ముద్రిత ప్రతిలో ఏమి కారణంబున ననియే యున్నది). (ఆది. ౬-4.)

ఇచ్చట తెనుఁగు పదము మీఁది సంస్కృత పరుషమునకు గసడదవాదేశము కలిగినది.

బలము పెద్ద గలిగి - (ఆది. ౬-287 )

ప్రొద్దునేఁడు పెద్దవోయె - (ఆది. ౬-290)

పెద్దగాలంబు - అర.3-81

పలుదెఱంగుల పిండివంటలు - ఆది.౬-288

ఒప్పుగొనుము వీనినుర్వీశ యనిసుతు విచ్చి గంగ - (ఆది. ४-168)

నెఱిగురులున్ విలోలసిత నేత్రయుగంబును-(ఆది ౬-73)

మఱి దీని కలదెఱంగు వినగనిష్టమేని - (ఆది. ౬-254)

ముద్రితప్రతిలోనిది కలతెఱంగనియే యున్నది.)

ఇది యేమి దెఱఁగు దీనికి మొదలెయ్యది - (ఆది. ౬-263)

ఇందుండఁగా దేగుదమ యొండుగడకని ముంద

తేనెంత సెప్పిన నెన్నండు వినద - (ఆది. ౬-247)

చేద్వడు. వీద్వడు, కిద్వడు అను వానిలో వకారమునకు వాదేశమైనది. తోడ్కొను, వీడ్కొను అను వానిలో కకారమునకు గాదేశము కన్పడుటలేదు. గసడవాదేశ మిచ్చట నొక్కవకారమునకు మాత్రమే నియతమై యుండుటకుఁ గారణము తెలియదు.- "నన్నయ భాషలో గసడదవాదేశము రావలసినచోట్ల

నిత్యముగా వస్తుంది. రాగూడనిచోట్ల రానేరాదు." (త్రిలింగ రజతోత్సవ సం. పుట 669. శ్రీ గిడుగు సీతాపతిగారు)

నన్నయ భారతములోఁ బ్రశ్నార్థకములపైని, క్త్వార్థకములపైని, షష్ఠీ విభక్తిరూపములపైని, క్రియాజన్య విశేషములపైని కోల్పడు, తోడ్కొను మొదలగు ధాతువులందును, అవధారణార్థకమైన అకారముపైని గసడదవా దేశము రాదు.

ఆమ్రేడితము పరమగు నపుడు విభక్తి లోప మగును. ఇంచుక, నాఁడు అనువానిలో నంతిమాక్షర లోపము కానరాదు.

అలయక నాఁడు నాఁటికి లతాంగి (ఆది. ౮-183)

సమాసమున కడు శబ్దమున కచ్చుపరమగు నపు డందలి డకారము నకు ద్విరుక్త టకారమగును. సమాసము కానప్పుడు 'డు' అట్లే నిల్చి పోవును. కడు ద్రుతప్రకృతికము కావున నచ్చు పర మగునపుడు ద్రుతము దానితోఁగూడును.

క్షితినాథ కడు నకయణాన్వితులై నీ తమ్ములు (ఆది. ౧-84)
కడు నధికుతోడఁ దొడరినఁ బొడిచిన నొడిచినను (స. ౧-123)
కడు నెండ యెక్కినంతకు నుడుగక యచ్చనుప నకచి
(అర. ౨-108)

ఇట్టియెడ కడు-అవ్యయ మని చెప్పుట యుక్తముగా నుండును.

మూఁడు, రెండు, ఇరు, నలు అను వానికి సమాసమునఁ గ్రొత్త శబ్దము నకువలెనే తొలి యచ్చు మీఁది వర్ణములకు లోపమును మీఁదిహల్లునకు ద్విత్వమును గలుగును. మూఁడు శబ్దము లుప్తశేషము హ్రస్వమగును.

"మున్నూటయేఁబండ్రు వీరభటులును" (ఆది. ౧-81)
"పదపడి రెన్నాళ్లు నొక్కపగలున్ రేయున్" (ఆది. ౧-68)
"ఇన్నూఱు శ్లోకంబులు గలిగి" (ఆది. ౧-64)
చిత్రరథుఁడను వాఁడు నన్నూఱు గంధర్వ హయంబుల నిచ్చె
(స. ౨-113)

నెఱ + వగ అను దానియందు వలెనే యింవలి ద్విత్వము సమీకరణము వలనఁ గలిగినట్లు తోఁచుచున్నది.

నెఱ + వగ; నెఱ్వగ; నెవ్వగ
ఇరు + నూఱు = ఇర్నూరు; ఇన్నూఱు
నలు + నూఱు = నల్నూరు; నన్నూరు

ఎనిమిది, తొమ్మిది అనువానికి ఎనమ, తొమ్మ, (తొంబ) అనునవి మూల రూపములని తలంపవచ్చును, అందుచేతనే ఎనమండ్రు, తొమ్మండ్రు అను రూపములు కనవచ్చుచున్నవి. వీని కుత్తరపదములు పరమగునప్పుడు తొలి యచ్చుమీఁది యక్షరములకు లోపమురాదు. మీఁది హల్లునకు మాత్రము ద్విత్వమగును.

తొమ్మ + నూట = తొమ్మనూ్నట
ఎనమ + నూట = ఎనమనూ్నట
ఇరువదియొక్క వేయు నెనమనూ్నట డెబ్బది రథంబులు
(ఆది. ౧-81)

నాలుగువేలుం దొమ్మనూ్నఱు శ్లోకంబులు గలిగి (ఆది. ౧-48)
నన్నయ భారతమునఁ గర్మధారయమందు ము వర్ణమునకు పుంపులు వచ్చిన రూపము లున్నవా లేవా యను విషయము సందిగ్ధముగా నున్నది.

ముద్రిత ప్రతులందు-బలితంపు రక్కసు (ఆది. ౬-214)
లోకనాథ యిట్టి లోక విరుద్ధంపు వరము (ఆది. ౭-260)
వీని పుట్టిన పాపంపువేళ (ఆర. ౧-49)

పరుసంపురాలపైఁబడి తీవ్రవేదన (అర. 3-300)
అని పుంపులతోఁ గూడిన రూపములు కానవచ్చుచున్నను గొన్ని తాళపత్ర ప్రతులలో బలియుఁడౌ రక్కసు, పాపంబు వేళ అను పాఠాంతరములు కనఁ బడుచుండుటయు, మిగిలిన రెండు రూపములందుఁ గూడ విరుద్ధంబు వరము, పరుసంబు రాలపై అను రూపము లుండె ననుకొనుట కవకాశ ముండుటయు నా సందేహమునకుఁ గారణము కాని నన్నయ కాలపు శాసనములందును దత్పూర్వశాసనము లందును గూడ పుంపులతోడి రూపములు కనవచ్చుచుండు టచే నవి నన్నయ కవిమతములే యని చెప్పవచ్చును.

మిరియమ్ముబోళ - మంగిపొగరాజు లక్ష్మిపురశాసన.

( A. D. 685-705 )

లోహపుదివియ - కుపమ ద్రాక్షారామ శిలాశాసన.

(క్రీ. శ. 1055. S. I. I. IV-1010)

తపిన యున్నవ నల్లనైన దీర్ఘపుఁదనువును జూచి (ఆది. ౪-253) నన్నయ భారతములోఁ దత్పురుష సమాసమున ము వర్ణమునకుఁ బుంపులు వచ్చిన రూపములు లేవు

దమయంతి కట్టిన పుట్టంబుచెఱఁగు (అర. ౨-68)
అమరలోకంబు వేశ్యలమైన మాకు (అర. ౧-363)

చిన్నయసూరి అంద్వాదుల కలిగాగమంబు సమాసమునం దగునని చెప్పెను. నన్నయ భారతమున అలికి బదులు ఉల అను నాగమము కనవచ్చుచున్నది. ఇది సర్వత్ర స్థలార్థమునే సూచించుచున్నది. ఈ ఉలగాగమము మీఁదనే కొన్ని చోట్ల షష్ఠీవిభక్తి కుప్రత్యయము చేరుచున్నది. అందులకు, ఎందులకు అనువాని కిప్పుడు అందుకొఱకు, అందునిమిత్తము మొదలగు నర్థములు కలవు. నన్నయ భారతమున నవి అక్కడికి, ఇక్కడికి, ఎక్కడికి అనునట్లు స్థలార్థముననే వాడఁబడినవి.

"నలసారము సంసార మఖిలదుఃఖావహము భయనికేతన మతిచం
చలము పరాధీనం బిందుల జీవనమేల నమ్మెదురు తత్త్వవిదుల్."

(ఆది. ౬-245)

ఇచ్చట విందుల అనఁగా ఈ సంసారమందలి యని యర్థము.

అరుంధతీ సహితుండై వసిష్ఠుఁడిందుల వసియించె (అర. 3-227) అనుచోట ఇందుల అనునది సప్తమ్యర్థమున వాడఁబడినది. (ఇందులన్). 'ఉల' అనునది 'లో' అనుదాని పూర్వరూపమని కీ. శే. చి. నారాయణరావు గారు వ్రాసియున్నారు. (ఆం. భా. చ. 1354)

అందలి మునులెల్ల నాతనికి సర్వదమనుండను నామంబుఁ జేసిరి.
(ముద్రిత ప్రతిలోని పాఠము) అందుల (వ్రాతఁప్రతి) (ఆది. ౪-64)
"అర్జునుం జూచి యందుల మునులిట్లనిరి." (ఆది. ౭-147)
"ఎందుండి వచ్చి తండులకు వడిన్" (ఆది. ౪-6)

"ఇందుల కాఁపుల విందఱఁ దొల్లి యిల్వరున ప్రేంగుచున్న"
(ఆది. ౬-264)

'ఏమికారణంబున విందులకు వచ్చి తని యడిగిన" (ఆది. 131-213)

"శంతనుండు దానింజూచి వీ వెందులదానవు (ఆది. ౪-147)"

"ఎందుండి వచ్చి తిందుల కెందుల కేగెదు మహామునీశ్వర"
(ఆది. ౪-23 )

తత్సమములు :-

సంస్కృతములో అకారాంత పుంలింగములై తెలుఁగున మహద్వాచకములగు పదముల కుత్వమును డుజ్జును కలుగుట మనమిప్పుడు చూచుచున్నాము. (చిన్న. బాల. తత్స. 21, 22) నన్నయకుఁ బూర్వ ముత్వము లేని రూపములును (రాముణ్ణు) స్తు మంతములైన రూపములును (సత్యదిత్యున్) డు, డుజ్వరహితములైన రూపములును (మహేన్ద్రిన్-పాతకు) ఉండిన ట్లిదివఱకుఁ దెల్పఁబడినది. నన్నయ ఉత్వముచు డుజ్జును గల రూపములనే భారతమున స్వీకరించెను కాని యీ క్రింది అపవాదములు కానవచ్చుచున్నవి

దూత ఉత్వము-డుజ్జులేని రూపము

నీవు మా కమలంగ దూతవై (అర. ౨-34)

అనిలుఁడను దూత పోయి తోడ్కొనియుఁ దెచ్చెఁ (అ. 3-'56.)

అసుర శబ్దమునకు అసుర, అసురుఁడు అను రెండు రూపము లున్నవి.

ఆ య్యసుర విన్నెలింగె (ఆది. ౧-132)

ఈ యగ్ని దేవుఁ డసురకు (అ-౧-133)

మూర్ఖ, వృద్ధ అనువానిలో నుత్వము కలదు డుజ్జు చేరుట వైకల్పికము.

నీవు మూర్ఖవు శిశుపాల-స.౨-24

ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే స- ౨-24

వృద్ధు కొడుకు పలుకు విని-అర. ౧-208

తరుణీ శబ్దము నందలి తుది ఈ కారము హ్రస్వము కాఁగా తరుణి యను రూ మేర్పడును. నన్నయ భారతమున (ఆది. ౮-175) తరుణియు లోప నాడిరి ముదంబున అని తరుణియ అను రూపము కానవచ్చుచున్నది. తత్సమమ మీఁద ఇయ వచ్చిన రూపమిది యొక్కటే: గద్దియ..లొట్టియ మొదలగు మఁ

కొన్ని ఇయాంత శబ్దములు కూడ నన్నయ భారతమున నున్నవి.

పదివేల మొదవులు పదివేల గద్దియల్ అర. ౧-344.

బలిమిఁ గొనిన ధనము పదివేలు లొట్టియల్- స. ౧-267

"ఏదంత తాచ నామ్నామన్యత్రస్యామియాన్తానా" మని చింతామణియు, (అజం. 82) "ఇయకుమారులుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగ్గాఁగు" నని బాలవ్యాకరణమును (అచ్చి. 23) జెప్పుచుండుటచే ఇయాంత రూపములే ప్రాచీనము లనియుఁ దరువాత నవి ఎదంత రూపములను గూడఁ బొందఁ జొచ్చెననియుఁ దెలియు చున్నది. కేతన యాంధ్ర భాషా భూషణమున"మల్లెయు లంజెయు గద్దెయు నొల్లెయు నను పగిది పలుకు లొప్పవు కృతులన్" (176 పద్య) అని ఎదంత రూపములను నిరసించెను. కేతననాఁటి కా రూపములు కవి సమ్మతములు కాకుండెను కాఁబోలును. అహోబలుఁడు కేతన పద్యము నుదాహరించి "ఇ తీదానీన్త నానాముక్తిస్తు విస్మృలైవ" (అహో. 348 పు) అని కేతన మతమును ఖండించెను. తరువాతి కవులు ఎదంత రూపములను వాడి యుండుటచే నాతఁడట్లు ఖండనము కావించి యుండును నన్నయ భారతమున ఇయాంత రూపములే బహుళముగా నున్నవి. అర. ౨-345 వచనమున 'ఇరువది వేల గద్దెల పసిండియు' ననుచోట మాత్రము గద్దెయను ఎదంత రూపము కనవచ్చుచున్నది. వచనాంతర్గత మగుటచే నిది యెంత వఱకుఁ బ్రామాణికమో తెలియరాదు.

ఉకారాంత పుంలింగములు, మహద్వాచకములు, కొన్ని డుమంతములుగను, కొన్ని వువర్ణాంతములుగను, కొన్ని ఉభయములుగను గనవచ్చు చున్నవి. వసు, మను శబ్దములకు డుమంత రూపములు లేవు. అవి సర్వత్ర వువర్ణాంతములు గానే ప్రయోగింపఁ బడినవి.

రాహు శబ్దమునకు వువర్ణ రహితముగాఁ గూడ ప్రయోగము లున్నవి.

రాహు పర్వంబు గాకయ భానుఁబట్టె. స. ౨-298.

శంతను, శ్వేతకేతు, స్థాణు, పూరు శబ్దములకు వువర్ణముతోఁ గూడిన రూపములు లేవు. శ్వేతకేత్వాదులకుఁ దరువాత నట్టి రూపములు కలిగినవి. గురు, ప్రభు శబ్దములపై డుజ్జును, వువర్ణమును గూడఁ జేరుచుండును.

ఉద్య ద్ధ్వాంతారాతి ప్రభుండై తనరుచు. ఆది. ౬-79.

అని సకల రక్షణ ప్రభువులై-ఆది. ౧-2

గురుని గురుతనూజఁ గొలిచి-ఆది. 3-110.

గురులలోనఁ బరమ గురువు దల్లియ ఆది. ౭-252.

కద్రూ శబ్దము కద్రువ యగును.

స్త్రీ వాచకమైన జరత్కారు శబ్దమునకుఁ బ్రథమ యందు వు వర్ణము వచ్చును. ప్రథమేతర విభక్తులందు దానికి మహత్తు నందువలెనే రూపములు కల్గును.

జరత్కారున్ మదీయానుజన్-ఆది. ౨-153.

అమహద్వాచకములైన అకారాంత శబ్దములకు మువర్ణము చేరును. చరిత్రాది శబ్దములకు ము ప్రత్యయము చేరుట వైకల్పికము. శరణరూప శబ్దములకు ము ప్రత్యయము చేరనప్పు డుత్వము వచ్చును. శరణు, రూపు.

శరణన్నఁ గాచుచు ఆది. ౧-7

దానిది కలరూపెఱుంగ నవనీపతి యుత్సుకుఁడయ్యె ఆది. 8-29.

చిన్నయ సూరి తరంగ శబ్దమును జరిత్రాదులలోఁ జేర్చెను. కాని నన్నయ భారతమున సిద్ధ సమాసములం దిది యెచ్చటను మువర్ణ రహితముగా వాడఁబడి యుండలేదు.

నందిని యన్నేటి తరంగలన్-ఆది. ౮-79

అను ప్రయోగమును బట్టి యది యాచ్ఛిక స్త్రీ సమమే యనఁ దగియున్నది. అందుచే దీనిని జరిత్రాదులలోఁ జేర్పరాదు.

నన్నయ భారతమున అర్ఘ, ధర్మ, శబ్దముల అత్వమున కుత్వమును దానిపై వు వర్ణకమును వైకల్పికముగా గనవచ్చు చున్నవి.

అవని యరాజకంబయిన యప్పుడ భూప్రజలందు సర్వధ
ర్మవులఁ దొలంగు దేవముని ముఖ్యులు వాయుదు రోలిన వృష్టిలే
దవు మఱి యర్ఘువుల్ దఱఁగు నెందును- ఆది 8-219.

సభా. ౧-271 వ పద్యమున 'అర్ఘులోలిఁ బెరిఁగె నవనీశు లెల్ల' అను చోట అర్ఘులని వు వర్ణక రహిత ప్రయోగము కూడఁ గనవచ్చు చున్నది. కాని 'అర్ఘువోలిఁ బెరిఁగె' అని ప్రాఁత ముద్రణము లందున్నదని ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వమునఁ జెప్పఁబడి యున్నది (పుట 597)

చిన్నయ సూరి మిత్ర పాత్రాదులు మహద్వాచకంబులు వైకల్పికముగాఁ బుంలింగతుల్యంబు లగునని చెప్పెను. (బాల. తత్స. 18) నన్నయ భారతమున నవి పుం లింగ తుల్యము లగుట నిత్యము. మిత్రము, పాత్రము అను ప్రయోగ ములు నన్నయ భారతమునఁ గానరావు.

పరాశరాత్మాం భోరుహ మిత్రుఁగొల్చి (ఆది. ౧-22)
పాత్రునాపస్తంబసూత్రు (ఆది- ౧-9)
ఇచ్చునది ధనము పాత్రునకు (ఆది- ౩-204)
భార్గవ దౌహిత్రుఁడు పాత్రుఁడీ యదువు (ఆది- ౩-196)
చుట్టములం గడుఁ గూర్చు మిత్రులన్ (ఆది- ౨-198)

హంస శబ్దము సర్వత్ర స్త్రీ సమముగా వాడఁబడినది.

అంతరిక్షముననుు హంస లెల్ల -అర౨ -13
కలహంస పలికిన పలుకుల గణియించి అర- ౨-26

ఉరగ శబ్దమున కేక వచనమున 'ఉరగము' అను రూపమును, బహువచనమున ఉరగములు, ఉరగులు అను రెండు రూపములును గనఁబడు చున్నవి.

అంత వయ్యురగులు నమృతంబుపయోగింపం గానక (ఆది- ౨-122)
ఉరగములకు శాపం బిచ్చెన్ (ఆది- ౨-36.)

హలంతములు :-

నన్నయ భారతమున జకారాంతములైన ఋత్విక్, భుక్ఛబ్దములకు ఋత్విక్కు, భుక్కు అను రూపములు లేవు. ఋత్విజుఁడు, భుజుఁడు అను రూపములే కనవచ్చు చున్నవి. భుక్ఛబ్దమునకు వ్యస్తప్రయోగము లేదు.

ఋత్విజుండని విచారించి పూజించితే- (స- ౨-11)
స్నాతకుండును ఋత్విజుండును. (స- ౨-4)
భిక్షాభుజులు; భూభుజులు (అ- ౮-111)

జగచ్ఛబ్దమునకు జగము అను రూపమే కాని జగత్తు అను రూపము లేదు. పరీక్షి దాదులగు తకారాంత మహద్వాచకములకు పరీక్షితుఁడు అవి ఉత్వ డుజ్జులు వచ్చిన రూపములే కనఁబడు చున్నవి.

మరుతుల యంశమున (ఆది- 3-81)

ముత్, సంపత్ శబ్దములకు ముదము, సంపద అను రూపములే కాని ముత్తు, సంపత్తు అను రూపములు లేవు.

నకారాంత నపుంసక లింగములగు జన్మ, ప్రేమ, కర్మ, పర్వ శబ్దములు జన్మము, ప్రేమము, కర్మము, పర్వము అను రూపములు పొందును. ము వర్ణము లోపించిన ప్రేమ మున్నగు రూపములు నన్నయ వాసి యుండ లేదు. మహిమన్ శబ్దము నందలి తుది నకారము లోపింపఁగా మిగిలిన రూపమే ప్రథమైక వచన రూపమగును. మహిమము వంటి ముపర్ణకముతోఁ గూడిన రూపములు నన్నయ భారతములో లేవు

మహేంద్ర మహిమతో - (ఆది- ౧-8)

అశ్విన్ శబ్దము అశ్వినులు అని బహువచనాంతము గానే కనవచ్చుచున్నది. మహద్వాచకంబులగు సాంత శబ్దముల కంతలోపంబేని, ద్వితీయైక వచనాంత తుల్యత్వంబే నగునని బాలవ్యాకరణము చెప్పుచున్నది. (తత్స 81.) నన్నయ భారతమునఁ గొన్ని సకారాంత శబ్దములకు సకారము మీఁదనే ఉత్వడుజ్ఞులును, గొన్నిటికి సలోపించిన పిమ్మట నుత్వడుజ్ఞులును గలుగుచున్నవి.

"ప్రచేతసు పుత్త్రి" ఆది- ౧-21
భాసుర యమరియ మాభిరాము సోమశ్రవసున్ (ఆది- ౧-87)
మఱి యంగిరసుఁడను మానస పుత్త్రునకు (ఆది- ౩-66)
దుర్వాసుఁడన్ సిద్ధమునియు వచ్చె (ఆది- ౫-17)
పూరు పురూరవు లట్లు భగీరథ రఘుపతుల యట్లు (అర- ౨-285.)

ఊర్ధ్వరేత శ్శబ్దమునకు ఊర్ధ్వరేతుఁడు, ఊర్ధ్వ రేతసుఁడు అను రెండు రూపములు కనఁబడు చున్నవి.

'భూరితేజు లందఱును నూర్ధ్వరేతసులైనన్' (ఆది-౩-60.)
ఉత్తమాశ్రమ నిష్ఠితుఁ డూర్ధ్వ రేతుండైన (ఆది- ౪-32).

సకారాంత నపుంసక లింగముల తుది సకారము లోపించును. ఉపధయందకార మున్నచో ముపర్ణకమును, ఉకారమున్నచో వు వర్ణకమును జేరుచుండును ఇం దుపథములైన శబ్దములకు స లోపించగా మిగిలిన రూపమే ప్రథమైకవచన రూపమగును. జ్యోతి; సదంబు- (స. ౨-15) శిరము; మనము; ఆయువు. సదస్సు, శిరస్సు, ధనుస్సు జ్యోతిస్సు వంటి రూపములు నన్నయ భారతమున లేవు.

చిన్నయ సూరి "సాంతంబుల తుది సకారంబునకు లోపంబు బహు

కంబుగా నగు" నని వయః ప్రభృతులకుఁ దప్ప మిగిలినవానికి రెండు రూపములు నుండునని చెప్పియున్నాఁడు.

హనుమత్ శబ్దమునకు నన్నయ భారతమున హనుమంతుఁడు, హనుమ అను రెండు రూపములు కనవచ్చు చున్నవి.

విద్రనున్న ధర్మ నిర్మలు హనుమంతుఁ జూచి (అర- ౩-319)

గుహాశయనుండైన హనుమ యను కపి పెలుచన్ (అర- ౩-314).

హనుమత్ శబ్దమునందలి తకారము లోపింపఁగా హనుమ యను రూప మేర్పడినది.

ఔపవిభక్తికములు.

నన్నయ భారతమున ఇ, టి, ంటి, తి అను నాలుఁగౌపవిభక్తిక ప్రత్యయములతోఁ గూడిన రూపములును గానఁబడుచున్నవి. వీనిలో ఇ అను ప్రత్యయముతోఁ గూడిన రూపముల సంఖ్య చాల హెచ్చుగా నున్నది.

నీరు శబ్దమునకు ఇ అను ప్రత్యయముతోఁ గూడిన రూపములే అధికముగా నున్నవి. కొన్నిచోట్ల రు వర్ణమునకు టి ఆదేశముగా వచ్చిన రూపములు కూడఁ గనఁబడుచున్నవి.

ఒక యేడు నీటిలో నేక పొందబున విల్చి (ఆది- ౩-201. ముద్రితప్రతి)

ఇక్కడఁ గూడ నీరిలో అనురూపమే యుండుట కవకాశ మున్నది. నీటి అను రూపము నన్నయ తరువాత వాడుకలోనికి వచ్చియుండును.

పాఁడి శబ్దము పాలు శబ్దము యొక్క ఔపవిభక్తిక రూపమని ఆం. భా. చరిత్ర చెప్పుచున్నది. (పుట 133). ఊఌ్లు, ఎంగిల్లు, మొసదులు మున్నగు శబ్దములలో ల,రలు జకారముగా మాఱినట్లు కనఁబడుచుండుటచే నట్లే పాలు పాఁడుగా మాఱియుండు ననియు, దాని కుపవిభక్తి ఇ చేరఁగా పాఁడి అను రూపము కలిగె ననియు, అదియే ప్రథమైక వచనమునఁ గుదురుకొనె ననియుఁ దత్కర్త యభిప్రాయము. కాని పాఁడి అందలి అర్ధబిందువున కాకరము కనవచ్చుట లేదు.

నన్నయ భారతమున ఏమిటి, ఏటి అను ఏమి శబ్దము నౌపవిభక్తిక రూపములు రెండు తెఱఁగులుగాఁ గానవచ్చుచున్నవి.

ఎఱిఁగి యెఱిఁగి వారి నేటికి వారింపదు. (ఆది- ౩-5).

ఇన్ని దినములయ్యె నేటికి నా తోడ (స- ౨-92).

నీ కూర్మియు నీ యలుకయు నా కవి యేమిటికి ? (స- ౨-67).

ఏమి అనుదానికి హళ గన్నడమున ఏమ్ అను రూపమున్నది. దానికి టి చేరఁగా 'ఏంటి' అయి, తరువాత ఏఁటి అను రూపమేర్పడినది. ముద్రిత ప్రతులలో నర్ధబిందువు లేని రూపములే కనఁబడు చున్నవి. ఏమిటి అనునది తరువాత నేర్పడిన రూపము.

ఇప్పు డౌపవిభక్తికములుగా నున్న శబ్దములు కొన్ని నన్నయ భారతమున ననౌపవిభక్తికములుగాఁ బ్రయోగింపఁ బడియున్నవి.

వినయమున ద్రోణు రూపు మన్నన నమర్చి (ఆది- ౫-232).
అంత నెంతయుం బ్రొద్దునకుఁ దెలిసి (అర- ౧-192).
ఎల్లవారును జూడంగ విట్టి బయల నెట్లు సంగమ మగు (ఆది- ౩-42).
ఎదురను దవ్వులఁ జూచిన పౌరవులెల్ల (అర- ౨-169).

ఎదుట, బయట అను రూపము లప్పుడు లేవు.

ఎన్నఁడు, కన్ను, కాలు, కేలు, ఒడలు, నెత్తురు, పగలు, ముల్లు, వ్రేలు, కొలను, అను శబ్దము లిప్పు డౌప విభక్తికములు. నన్నయ భారతమునఁ గూడ నివి యున్నవి. కాని వీని యౌపవిభక్తిక రూపములు ప్రయోగింపఁబడి యుండలేదు.

విభక్తి ప్రత్యయములు :-

డు ము వు ప్రథమైక వచన ప్రత్యయములు. డు బిందు పూర్వకమై యుండును. ఇది తమ్ముఁడు, అల్లుఁడు, పాఱుఁడు, బలియుఁడు, మమమఁడు మొదలగు మహద్వాచకములైన తెలుఁగు శబ్దములందుఁ గూడఁ గనఁబడుచున్నది.

అట్టి, ఇట్టి, ఎట్టి అనువాని తరువాతఁ గూడ బిందుపూర్వక డు వర్ణము చేరు చున్నది అట్టిఁడు; ఇట్టిఁడు; ఎట్టిఁడు. ఇవి పై శబ్దములతోఁ గూడిన వాఁడు లోని వా లోపింపఁగా మిగిలిన రూపములవలెఁ గనఁబడుచున్నవి. కలఁడు (కలవాఁడు) అనునది కూడ విశ్లేషింపడినదే.

సనత్కుమారాదుల యట్టిఁడ యనఘ మూర్తి. (ఆది- ४-168).
తొంటి భార్గవుండు వింట విట్టిఁడే యని (ఆది- ౫-230).

వు వర్ణము ఉకారాంత పులింగములపఁ బ్రథమైక వచనమందు వచ్చును. ఋతువు - మనువు - వసువు.

అకారాంతములైన అర్థ ధర్మ శబ్దములకుఁ గూడనిది చేరుచున్నది. అప్పుడు వాని తుది అకారము ఉకారముగా మాఱును - ధర్మువు, అర్థువు. లు ప్రథమా బహువచన ప్రత్యయము.

అదంతములును దీర్ఘ పూర్వ లోపధములు నగు మహత్తుల మీఁది లు వర్ణమునకు రువర్ణము వచ్చును. లోపథములు కానివియు, దీర్ఘ పూర్వ లోపధములు కానివియు నగు శబ్దములకుఁ గూడఁ గొన్నియెడల బహువచన లు వర్ణమునకు రు కానవచ్చు చున్నది.

అల్లురు అట్టిరు, ఇట్టిరు, నెయ్యురు, మల్లురు.

నీ యల్లురఁ బాండు పుత్త్రుల (ఆది- ౮-53).

పేసలు వెట్టిన యట్టిరెరి (ఆది- ౪-17).

భూరులెందు నీయట్టిరే (స- ౧-236).

బంధులకు నెయ్యురకున్ హృదయ ప్రియంబు గావించె (స- ౧-16).

ఱు కూడఁ గొన్నిచోట్లఁ బ్రథమా బహువచన ప్రత్యయముగాఁ గనఁబడు చున్నది.

పలుకులఁ జెయ్వులఁ బాండవులకుఁ బ్రీతిగలయట్లు యుండుదు-
(ఆ- ౮-21).

అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు,- అనువాని యందలి తుది ఱు వర్ణము బహువచన ప్రత్యయమే. వీని కేకవచనమునందు రూపములు లేవు.

పగఱున్, చూపఱు అను ప్రయోగములు కూడ నన్నయ భారతమునఁగలవు. చూపఱు వలెనే పగఱున్. ప్రథమా బహువచనమున పగఱు అను నట్లుగా నుండవచ్చును. కాని దానికిఁ బ్రయోగ మెక్కడను గనఁబడలేదు.

"కడఁగి చెఱుచుఁ బగఱ (స- ౨-144)." ఱ

చూపఱ సాల్వమహీశు విక్రయం బొనరఁగ నల్గడం బొగడుచుండిరి.
(ఆ- ౪-206).

అనుచోట బహువచనమున ప్రథమా విభక్తిలో చూపఱ అను రూపము వాడఁ బడినది.

చూచి చూపఱు ప్రభూతాశ్చర్యులై రచ్చటన్.- అనుచోట చూపఱు ) అనియే యున్నది. (ఆది- ౬-30.)

శబ్దరత్నాకరమున చూపఱు శబ్దము (చూపు + వారు) అని విడఁదీయఁబడినది. నన్నయభారతమునఁ గల పెక్కండ్రు- మఱందండ్రు- కొండఱు అను ప్రయోగములను బట్టి యప్పుడు డ్రు కూడ బహువచన ప్రత్యయముగా వాడఁబడు చుండినట్లు తెలియు చున్నది. 'డురు' అనునదియే ఉత్వలోపముచే 'డ్రు' అయి యుండును. వాఁడునకు బహువచన రూపమైన వాండ్రు నన్నయ భారతములో లేదు. వారు అనునదియే ప్రథమపురుష బహువచన సర్వనామ రూపముగాఁ గనవచ్చు చున్నది.

రలడాంతములగు శబ్దముల తరువాతఁ జేరిన బహువచన లు వర్ణము వానితో సమీకరణమునుజెంది ళ్లు గా మాఱుచున్నది. అది వికిపోయి ళులు రూపముతోఁ గూడఁ గనవచ్చు చున్నది

"ఆర్ద్రీ కృతములైన యంగళుల నొప్పె" (ఆది- ౬-148)
పదపడి రెన్నాళ్ల నొక్క పగలున్ (ఆ. ౧-68)
వారల కన్నీళ్లు దుడుచుచు (ఆది- ౬-259.)
చెలువ రెండు పాళ్లు సేయు మొనర (ఆది- ౭-221)

ముద్రిత ప్రతులలోఁ బెక్కుచోట్ల డు వర్ణము బహువచన లు వర్ణముతోఁ జేరి సమీకరణమ్ము నొంది 'ళ్లు' వర్ణముగా మాఱిన రూపములు కనఁబడు చున్నవి. నన్నయ కాలమునను దత్పూర్వమునళ్లువర్ణాంత రూపములును డ్లు వర్ణాంత రూపములునుగూడ శాసనములలో నున్నవి. (తాడ్లరేవు.- నందంపూఁడిశాస. రట్టగుళ్లు- చిలంకూరుశాస.) ళ్లు వర్ణాంత రూపములను నన్నయ యంగీకరింప లేదనియు, డ్లు వర్ణాంతములే యతనికి సమ్మతములనియు శ్రీ గంటి జోగి సోమయాజిగారు తెల్పి యున్నారు. (ఆం. భా. వి. 403)

ఏఱు శబ్దమునకు బహువచనమున ఏఱులు అను రూపమునే కాని ఏళ్లు అను రూపమును నన్నయ వాడి యుండలేదు.

కళ్, గళ్ అను బహువచన ప్రత్యయములు తెలుఁగున కులు, గులు అను రూపములతోఁ గూడఁ గనఁబడు చున్నవి. కళ్ ప్రత్యయము చేరుట వలన నిష్పన్నమై యనుచిత విభాగముచే నేర్పడిన శబ్దములలోఁ గొన్ని అకారాంతములుగను, గొన్ని ఉకారాంతములుగను నిల్చినవి. ఉ కారాంతముల చివర కులు రూపము కన్పట్టును : కొలఁకులు. అకారాంతముల మీఁద కలు రూపము చూపట్టును. చిలుకలు, ఎలికలు.

"కొలంకులకు మహా నదులకుం జొచ్చిన." (అర- 3-270)

"నాలుఁగు వలఁకుల నవఘన జాలంబులు "(అర- ४-135)

"పెనఁగిన మ్రాఁకుల కొమ్మలమీఁద" (ఆది- ४-20)

"మెఱుఁగు.లొక పుట్టలో నున్న నెఱుఁగ కేను." (అర- ३-179)

మెఱుము అను నేక వచన రూపమునకు కులు చేర్పఁగా వచ్చిన బహు వచన రూపము మెఱుఁగులు. 'ము' బిందు రూప మొందినది. మఱువు, మఱుఁగు యొక్క రూపాంతర మనియు. మఱుఁగు అనునది మఱుఁగులు అను బహు వచన రూపమున లు మాత్రమే బహు వచన ప్రత్యయ మనుకొని విడఁదీసిన ఏకవచన రూపమనియు ఆం. భా. చ. లోఁ జెప్పఁబడినది. (1381). లేదా మఱు ధాతువు మీఁదఁగు వర్ణము చేరఁగా మఱుఁగు అను రూప మేర్పడి యుండును. ఏమఱు అను ధాతువులో విది స్ఫురించు చున్నది

అతగులచే ద్రుపదుఁ డనవహితుఁడై పట్టువడ- (ఆది- ౬-68) అత గులు అనునది అతనుయొక్క బహువచన రూపమై యుండుననియు, అనుచిత విభాగముచే అతగు అను నేకవచన రూపమును, దరువాత అతగుఁడు అను రూపమును నేర్పడె ననియు నందే తెల్పఁ బడినది. లోకమున అతగాఁడు, ఇతగాఁడు వంటి ప్రయోగములు వినఁబడు చున్నవి. సర్వనామముల మీఁదఁ గూడఁ దద్ధిత ప్రత్యయ మిందుఁ గాన వచ్చుచున్నది. అతఁడు + కాఁడు అను దానిలోని డుజ్ఞు లోపించుటచే అతగాఁడు అను రూప మేర్పడి యుండును. అతగుఁడు అనునది అతగాఁడు యొక్క రూపాంతరమవి సందేహింపఁదగి యున్నది.

ఎగ్గులాడి యారెకుల నయంబు లేక (ఆది- ४ - 262) ఆరెకులను దానికి ఆరె యనునది యేకవచన రూపమై యుండును. ఆరె యనునది మహా రాష్ట్ర దేశమునకుఁ బేరు. మహారాష్ట్రులు మున్ను తలారులుగా నుండిన కతమున ఆరెకులు అను బహువచన రూపమునుండి అనుచిత విభాగముచే నేర్పడిన ఆరెకుఁడు అను పదమునకుఁ దలారి యను నర్థ మేర్పడినది.

మే అనఁగా శరీరము. దీనికి వేఱే బహువచన రూపము (మేలు) లేదు. మేను శబ్దము బహువచనరూపమే దీనికివి బహువచన రూపము. కొన్ని బహువచ నాంత రూపములపై-మరల బహువచన ప్రత్యయములు చేరుట కలదు.

"సుందరి నాకోడం(డ్రురె యం దభ్యర్చితవు నీవ" (స- ౨-257)

"ఓలిన మేలుగాఁ బడసి యూళ్లల నున్నది." (ఆది- ౬-267)

"ఒక్కసతికిఁ బతులు పెక్కండ్రు దగు టిది" (ఆది-౭-25)

వారలు, వీరలు మీరలు మున్నగునవి కూడ బహువచనముపై బహువచన ప్రత్యయము చేరిన రూపములే.

చింతామణిలో "కూర్చి లనునయోభవేద్ద్వితీయాతు" అని కూర్చి, ల, ను, ని అనునవి ద్వితీయా విభక్తి ప్రత్యయములుగాఁ జెప్పఁబడినవి. ని, ను ల మీఁది యచ్చు వైకల్పికముగా లోపించును. నన్నయ భారతమున న్ అనునదియే పెక్కుచోట్ల ద్వితీయా విభక్తి ప్రత్యయముగా నున్నది. అందు, కూర్చి అను ప్రత్యయము లేదు. గుఱిచి, గుఱించి అనునవి ముద్రిత ప్రతులలోఁ గనవచ్చు చున్నవి. గుఱించికి బదులు వ్రాఁత ప్రతులలో గుఱిచి అను రూపమే వ్రాయఁ బడి యున్నది అందుచే గుఱిచి అనునదే నన్నయ కభిమతమని చెప్పవలెను తమిళమున కుఱి యనఁగా గుఱి. దీనికి చు, ఇంచు చేరఁగా గుఱిచి. గుఱించి అను రూపము లేర్పడినవి. గుఱించి కంటె గుఱిచి ప్రాచీనము. గుఱిచి యనగా లక్ష్య ముంచి అని యర్థము.

"ఆశ మీకు పుత్త్రిఁదంబుజ సంభవు గుఱిచి భక్తితోఁడ"(ఆది-౨-168)

"సూర్యు గుఱిచి జపము చేయుచున్న" (అర- ౧-42)

"ఈశ్వరు గుఱించి యుగ్రతపంబు సేసిన" (అర- ౪-52)

జడంబు ద్వితీయకుం- బ్రథమ బహుళముగా నగునని బాలవ్యాకరణము- (కార- 24)

నన్నయ భారతము న నీ క్రింది ప్రయోగములోఁ బ్రాణివాచకమైన నాగము ద్వితీయకుఁ గూడఁ బ్రథమ వాడఁ బడినది.

"అమ్మదనాగ మెదిర్చి క్రమ్మఱించిన పరికాఁడు వోలె" (ఆది- ౪-206)

చేత, చే, తోడ, తో అనునవి నన్నయ భారతమున ద్వితీయార్థమున వాడఁ బడి యున్నవి.

బ్రహ్మచే నను జ్ఞాతుండై- (ఆది- ౧-39)

బ్రహ్మచేత నిర్మింపంగఁ బడిన భువన సంప్లవంబిది- (అర- ౪-41)

ఇష్టార్థ సిద్ధి కరుణతోడఁ జేయునట్లు (ఆది- ౧-33)

కదు వేడ్కతో వినత గోరె (ఆది- ౨-3)

నృపలక్ష్మితో నవనిరాజ్య భరంబు దాల్చిన (ఆది- ౨-234)

తల్లిచే విడివఁ బడితి (ఆది- ४-102)

చేత, చే అనునవి పంచమ్యర్థమందు వాడఁ బడినవి.

తక్షకు చేతఁ గుండలంబులుగొవి (ఆ- ౧-113) - నుండి

ధర్మనందనుఁ డహర్పతి చేత వరంబు పేర్మితోఁ బడసి-వలన

(అర- ౧-44)

అర్జునుం డమరులచేత దివ్యాస్త్ర తతులు వడసి- (అర- ४-35)

ఉపయోగమున నాఖ్యతకు తోఁ దోడ వర్తకము లగును.

ధౌమ్యుతో వేద మంగ యుతంబుగాఁ జదివెన్ ధనంజయుతో

ధనుర్వేద మిమ్ముగ నభ్యసించె- (ఆది-౮-227)

ధనుర్వేద మగ్నివేశుల తోడ నర్థిఁ గఱచి (ఆది- ౭-5)

చేసి అను క్త్వార్థక రూపము తృతీయా విభక్త్యంతములకే తృతీయార్థమునందుఁ జేరుచుండును.

భారత భారతీ శుభ గభస్తి చయంబులఁ జేసి- కరణార్థము- చేత

(ఆది- ౧- 22)

చెఱిచెన్ ఘనుఁడద్దఁ జేసి భీముఁడున్- (అర- ४-18) చేత

ద్వాపరంబున రెండు పాదములఁ జేసి నడచు- (అర ౩-338) తో

నీలి కుళాభిరక్షణ స్ఫురణన చేసి సుస్థిరతఁ బొందు

ఇచ్చట నేవార్థకము పై చేసికి వ్యస్తప్రయోగము- (ఆది- ౨-46) వలన.

నన్నయ భారతమున మై. మెయి అనునవి కూడఁ ద్వితీయార్థమున జడవాచకముల తరువాత వాడఁబడుచుండును.

తెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్ - (ఆది- ౧-16)

పూవులఁ జందనంబుఁ జనునె బలిమిమైఁ గొనితాల్ప- (స- ౧-181).

జడ వాచకములకుఁ దృతీయార్థమున న్ అను ద్వితీయా ప్రత్యయము కూడఁ జేరుచుండును.

బలిమి నీయవి భూమి వలయపతుల నుక్కడఁ గించుచు.

(ఆది-౧-7)-(తో)

భక్తి నెప్పుడు ధరణీసురోత్తములఁ బూజలఁదనుప్పుదు: (ఆది- ౧-138)
ఉదంత జడము తృతీయకు నవర్ణక మగును.

మనసిజ రాగంబునఁ బెనగిన యిట్టిది లేదిని జూచి. (ఆది- ౭-49).
తన యుదయ ప్రభావమున దవ్వుగఁ జోపి (ఆది- ౧-5).

సమానాన్వయము గల శబ్దము లనేకము లున్నప్పుడు తో. తోడలు తుదిపద మునకే చేరుచుండును. ఇట్టిచోట్ల వానికి వ్యస్తప్రయోగము కలదని చెప్ప వచ్చును. పూర్వపదములు షష్ఠ్యంతములును సముచ్చయ సహితములునై యుండును.

> ఆపగా తనూజుఁ డఖిల బాంధవులయు బ్రాహ్మణులయుఁ
> దోడ భానునిభుఁడు. (ఆది- ४-216).
> తాపసులు తమ యగ్నిహోత్రంబులయు నపాకఫల పుష్ప
> తరునదీ రమ్యతపోవనంబులయుఁ దోడ సదృశ్యులైనం (అర- ౨-101)

కొఱకు. కయి చతుర్థ్యాస్తః అని ఆంధ్ర శబ్దచింతామణి.

నన్నయ భారతమున కొఱకు అను ప్రత్యయము కానరాదు. కై. కయి అను నవి ప్రయోగింపఁబడినవి. కు + అయి అను వాని కలయిక వలన నివి యేర్పడినట్లు కనఁబడుచున్నది.

అనఘ మామామ శకుని నా - కై కదంగి (స- ౨-172). అనుచోట అచ్చునకే యతి వేయఁబడినది. అయి అనఁగా నిచ్చట - కూడి లేక సహాయపడి యని యర్థము.

> చైద్యునకై పూని సన్నద్ధులై యున్న (స- ౨-38).
> అన్యులకయి యన్యులు జూదంబాడుట యెంతయు విషమంబు. (స- ౨-175).

నన్నయ భారతమున పొంటెన్ అనునది చతుర్థీ విభక్తి ప్రత్యయముగాఁ గనఁ బడుచున్నది. తమిళ కన్నడములందు పూను అను నర్థమున పూణ్ అను ధాతువున్నది. తమిళ మలయాళములందు పుణరు అనియు, కన్నడమున పొణర్ అనియు దీనికి రూపాంతరములున్నవి దీని నుండియే భూతకాలమున మధ్యమ పురుషైకవచనమున పొంటివి అనురూప మేర్పడెననియు, వి లోపిం [illegible]కి ఏన్ చేర్పఁగా పొంటేన్ అగుననియు, పూనితేన్ అః

దీని యర్థ మనియు, పొంబెన్ అనునది పొంచేన్ యొక్క రూపాంతర మనియు ఆం. భా. చరిత్రమున (1388) వ్రాయఁబడినది. ఇది మొదట మధ్యమ పురుష క్రియారూపమే యైనను గ్రమముగా నన్ని పురుషములందును పొడఁబడుచు విభక్తి ప్రత్యయముగా మాఱెనని చెప్పవచ్చును.1

విప్రుల మంత్రులఁగా నొనరించితె కార్యసంప్రయోగము పొంబెన్.
(సభా. ౧-26)

పొంబెన్ అనునది తద్ధర్మ క్రియాజన్యవిశేషణములపైఁ గూడవాడఁ బడినది.

నాజన్మంబు సఫలంబు సేయుదు నఘములు వాయ పొంబె -
(ఆది. ౮-144)

పతి నన్వేషించు పొంబె నరిగెదు - (అర- ౨-120).
నన్నయ తదర్థమను పదమును జతుర్థ్యర్థమున వాడి యున్నాఁడు.

నీ తదర్థంబులై నిఖిల వేదంబులు వర్తిల్లి - (స- ౧-258).
'నీ కొఱకై' యని యర్థము,

నా తదర్థ మాచరింపుము బ్రహ్మచర్య వ్రతంబు - (అర- ౧-275)
'పట్టి వలన కంటె ఇతి పంచమీ' అని ఆంధ్ర శబ్ద చింతామణి. నన్నయ భారత మున పట్టి యనునది కానరాదు.

---

1. "పొందు ధాతువు భూతార్థ మధ్యమ పురుష ప్రత్యయము మీఁద ఏన్ చేర్చి పొంబెన్ అను రూపమును సులభముగా సాంధింపవచ్చును పొందితివి. పొందితి + ఏన్. ఉచ్చారణ త్వరలోఁ బరుషత్వమునొంది యిది మొదట పొంచేన్ అనియు, తరువాత పొంబెన్ అనియు రూపములను బొందెనని భావించుట సుకరము. కార్య సంప్రయోగము పొంబెన్ = కార్య సంప్రయోగమును బొందితివేని, నకార తకార సంయోగమున టకార మేర్పడుట హ్రస్వాచ్చులు గల ధాతువుల మీఁదనే కాన్పించుచున్నది. కను విను, అను ఇత్యాదులు కంటివి, వింటివి, అంటివి, ఇత్యాది రూపములను బొందుచున్నవి. దీర్ఘ పూర్వను వర్ణాంతము లిట్లగుటలేదు. పూను-పూనితివి- పూంటివి వంటి రూపము మృగ్యము. పేను-పేనితివి. కావున హ్రస్వాచ్చు గల పొందు ధాతువే పొంబెన్ అను విపరిణామమున కెక్కువ అను కూలముగాఁ దోఁచును" అని ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము గారభిప్రాయ పడుచున్నారు.

వలన అను ప్రత్యయము దిగర్థకమైన వలను శబ్దము నుండి యేర్పడినది. ఇది అపాయ భయ త్రాణ గ్రహణ వారణ సందర్భము లందు వాడఁ బడుచుండును.

ఇట్లు దుర్యోధనుండు సేయు నపాయంబుల వలనం బాయుచు - (ఆది. ౩-15) (వారణము)

కచుండు శుక్రువలన సంజీవని వడసి - (ఆది- ౩-128) (గ్రహణము)

పాండుకుమారుల రాష్ట్రంబు వలనఁ బాపి-(స- ౨-212) (అపాయము)

కశ్యపువలనఁ జరాచర భూతరాశి యెల్ల నుద్భవించె - (ఆది- ౩-59) (భవనము)

ఆపదల వలనం బ్రజల సముద్ధ రించితి - (అర- ౧-39) (త్రాణము.)

ఈ వలన ప్రత్యయముపై నొక్కొక్కప్పుడు తృతీయా ప్రత్యయమైన చేసి చేరుచుండును.

క్రోధంబు వలనంజేసి లజ్జయు వృత్తంబునుం జెడు - (అర- ౨-312). అన్యార్థాది యోగజమైన పంచమికిని, నిర్ధారణ పంచమికిని కంటె వర్ణక మగును.

అట్టిరాజుల కిపకారంబు సేయునంతకంటె మిక్కిలి పాతకం బొందెద్ది - అన్యార్థాది యోగజము. (ఆది. ౨-175)

పురుషుకంటె మున్ను పరలోకమేగిన సతియ నోచినదియు సతులలోన అన్యార్థాది యోగజము (అర. ౨-280)

యాగ శతంబులకంటెఁ బ్రయాగ నివాసము విశేషము- (అర- ౨-280) నిర్ధారణ పంచమి.

కంటెకుఁ బూర్వము సాధారణముగా ద్వితీయాది విభక్త్యంగ రూపమే కానఁబడుచుండును. నన్నయ భారతమునఁ గొన్నిచోట్ల దానికి ముందు న ఆగమము కనవచ్చు చున్నది.

"నుతజల పూరితంబులగు నూతులు నూఱిటి కంటె సూనృత
వ్రత! యొకబావి మేలు మఱి బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతు వది మేలు తత్క్రతు శతంబున కంటె సుతుండు మేలు త
త్సుత శతకంబు కంటె నొక సూనృత వాక్యము మేలు చూడఁగన్."
(ఆది. ४-93)

కంటె ఒకొక్కప్పుడు క్రియాజన్య విశేషణముల మీఁదఁ గూడఁ గానవచ్చును.

ఎలుకచేఁజచ్చు కంటె నీ జ్వలన శిఖలఁ గ్రాఁగి పుణ్యలోకంబులఁ గాంతుమేము. (అది. ౮-93.)

ఇట్టిచోట భావార్థక టవర్ణము లోపించునని ప్రౌఢ వ్యాకరణము.

కంటె అనునది కు + అంటెన్ అనువాని కలయికచే నేర్పడినది. కు అనునది చతుర్థీ విభక్త్యర్థమున వాడఁబడు షష్ఠీ ప్రత్యయము. అంటెన్ అనునది అకిన్త, అకిన్తా, అక్కిన్త, అక్కిన్తా అను కన్నడ మందలి పంచమీ విభక్తి ప్రత్యయముల రూపాంతరము. లేదా ఈ ప్రత్యయమును దెలుఁగు సంప్రదాయమును బట్టియే యన్వర్థము కావింప వచ్చును. కు + అంటెన్: కు + అంటి. ఒక వస్తువు సరస మఱొక వస్తువు నంటునట్లు సమీపముగా నుంచుటచే వాని తారతమ్యము తెల్ల మగును. కావున నిది యా యర్థమున వాడఁబడునని చెప్పనగును. ఇందు 'కు' అను న దొక్కచే కొన్నిచోట్ల కంటె అను నర్థమున వాడఁబడినది.

విత్తరక్షకుఁ గడుమేలు వృత్తరక్ష - (అర- ४-130). విత్తరక్షకంటె

నీవ యెల్లవారికి నత్యున్నతుఁడవు. (అర- ౨-237) ఎల్లవారికంటె

ఉండి అను క్త్వార్థకము కూడఁ బంచమ్యర్థమున వాడఁబడుచుండును.

ఇది సాధారణముగా సప్తమీ విభక్త్యంతములకుఁ జేరుచుండును.

బ్రాహ్మణుండు ద్రుపదు పురమునుండి చనుదెంచి- (ఆది- ౭-2).

హరు శిరంబునం దుండి భువనైక వందిత సురనది. (అర- ౩-83).

అంత నడవినుండి వన్యఫలంబులు గొనివచ్చి విభాండకుండు. (అర- ౩-102).

భూమిదేవి పీఠిలో నుండి వెలువడి- (అర-౩-122) (ఇచ్చట ఉండి, లో తరువాత వచ్చినది.)

కోలెన్ అను ప్రత్యయము కూడ నన్నయ భారతములోఁ బంచమ్యర్థమున వాడఁబడు చుండును. ఇది కొల్, కోల్ అను ద్రావిడ ధాతువు నుండి పుట్టినది. కొలచు (to measure) అను తెలుఁగు ధాతు విందుండి పుట్టినదే. దీని నుండి కొల అను విశేష్య రూపము కలిగినది. కన్నడమున నిది కొలె అను రూపముతో నుండును. ఇదే క్రమముగా కోలె అను విభక్తి ప్రత్యయముగా మాఱి, ద్రుతాంత మైనది. ఇది సప్తమ్యంతములగు కాలార్థ వాచకపదములపైఁ జేరుచుండును.

"నాఁటం గోలె ద్విజిహ్వులు నాఁ బరఁగిరి. (ఆది. ౨-122.)"

(కాల వాచకముపై)

దాని శరీర సౌగంధ్యంబు యోజనంబునం గోలె జనులకు

నేర్పడు నట్లుగా (ఆది. 3-41.) (అధ్వ వాచకముపై)

నన్నయ భారతమున 'వలన' అను నర్థమున 'కృతమున', అను మాట వాడఁబడి యున్నది.

నీ కృతమునఁ గౌరవాన్వయ మకిల్బిష కీర్తిఁ బ్రకాశితంబగున్

(నీ వలన నని యర్థము) (అర. ౧-51.)

కొన్ని ప్రతులలోఁ '.నీ కతమునఁ గౌరవాన్వయ మకల్మష కీర్తి' అను పాఠాంతరము కనఁబడు చున్నది.

"నీ కతమున నా దాస్యము ప్రాకటముగఁ బాయు ననిన పలుకు."

(అ. ౨-50.)

"అథ లోపల, కి, కు యొక్కాన్యా" అని చింతామణి.

"కు యొక్క లో లోపల షష్ఠి" అని బాల వ్యాకరణము.

యొక్క అనునది నన్నయ భారతమునఁ గానరాదు. ద్వితీయా విభక్తిలోని ను ప్రత్యయమే కొన్నిచోట్ల ని గా మాఱినట్లు, షష్ఠీ ప్రత్యయమైన కు ప్రత్యయమే కొన్నిచోట్ల కి గా మాఱును. అందు చేతనే కాఁబోలుఁ జిన్నయ సూరి దానిని వేఱుగాఁ బేర్కొని యుండలేదు.

షష్ఠీ విభక్తిలో సంబంధార్థమున అ, ఇ అను వర్ణములు చేరుచుండును.

"హంసల నడ బెడంగుఁ జూచి." (అ ౨-12.)

"దాని శరీర సౌరభము దాని విలోల విలోకనంబులున్." (అది. ४-171.)

"తన కుల బ్రాహ్మణు." అది. ౧-9 )

అ, ఇ వర్ణములు పరమగు నప్పు డేక వచనమునఁ దత్పూర్వము నగాగమము కనవచ్చు చుండును. ఇ వర్ణమునకు వెనుక నుండు నకారము శబ్ద గతమైనదే. (రామన్-రామని-రాముని) అ వర్ణమునకు వెనుక నుండు నగాగమము ప్రకృతి భావ నివారణార్థమై వచ్చి నట్టిది.

"ఎల జవ్వనంబున విలసనమును" - (అది 3-27.)

ఇట్టివి బహు ప్రయోగములు కలవు.

సంబంధార్థమున నెట్టి ప్రత్యయమును జేరని ప్రయోగములు కూడఁ బెక్కుగలవు.

"ఆ రాజు గుణములు నా కెఱింగించి నట్టులు" (అర. ౨-22.)

"అనిన విని హంస పలుకులు" (అర. ౨-16 )

"అత్త పసి కవిల గద్దంబును" (అర. ४-253 )

చిన్నయసూరి "సమాసవిభక్తికి లోపం బగు" నను సూత్రమిట్టి ప్రయోగములను గూర్చి చెప్పినదే. (బాల. స. 25.)

డుమంత శబ్దముల లోని డు లోపింపఁగా మిగులు నుదంత రూపములు కూడ సంబంధార్థమునఁ గనఁబడు చున్నవి. లేదా ఇచ్చట ని - ఆగమమునకు లోపము కల్గినదని చెప్పవచ్చును గౌతముని శిష్యులు = గౌతము శిష్యులు. ఆంధ్ర శబ్ద చింతామణి ని-ఆగమము వికల్ప మని చెప్పుచున్నది " టాది విభక్తౌ విర్నే త్యేకే "

ప్రసిద్ధుఁడై పరఁగు గౌతము శిష్యులరు (ఆది. ౫-210.)

తమిళమున కు, క్కు అనునవియు, గన్నడమున కె, గె అనునవియుఁ జతుర్థీ విభక్త్యర్థమున వచ్చు ప్రత్యయములు. తెనుఁగు నందలి కు ప్రత్యయము కూడ వీని రూపమే. ఇదియును దఱుచుగా జతుర్థ్యర్థముననే వాడఁబడు చుండును. కాని తెలుఁగు వ్యాకరణ కర్తలు దీనిని షష్ఠీ విభక్తి ప్రత్యయముగాఁ బేర్కొని యున్నారు.

కు ప్రత్యయము చతుర్థ్యర్థముననే కాక పెక్కితరార్థము లందుఁ గూడ వాడఁబడు చుండును.

"చిరముగ బ్రహ్మకుం దపము చేసి" - (ఆది. ౨-128.)

బ్రహ్మను గూర్చి. బ్రహ్మ నుద్దేశించి అని యర్థము.

" శ్రీకృష్ణునిం గని సహాయత్వంబునకుం బ్రార్థించిన " - (ఆది. ౧-42.)

సహాయత్వము కొఱకని యర్థము.

"అగ్ర జన్మలకు ననుగ్రహమున. .....అగ్రహారంబు లిచ్చుచు"-(ఆది. ౧-7.) (సంప్రదా నార్థము)

"తీర్థ గమన ఫలంబు యజ్ఞములకు విశేషంబు." (అర .౨-243.) కంటె.

"అనుచుఁ బాంచాలు పురం బాసన్నంబుగాఁ జనుదెంచు నంతకు

ముందఱ చని" - (ఆది. ౬-69.) కంటె.

"అందొక విప్రుండుండి కుత్తుకకు డిగక" (ఆది. ౬-62.)

(కుత్తుక లోనికి)

సర్పకుల ప్రళయంబునకు వెఱచి (ఆది. ౨-127.) వలన వెఱచి- భయార్థము.
శతాపరాధంబులు నిండునంతకు పీఁ దన్యుల చేత నప్రతిహతుఁడు. (స. ౨-60.)
నిండు నంత వఱకని యర్థము.

ఈ యపరాధంబు నాకు సహింప వలయు (ఆది. ౫-21.)
నా యందు నని యర్థము.

నాకు సనామ యయినదాని వివాహంబు గావలయు. (ఆది. ౨-150.)
నేను - ప్రథమార్థము.

ఇది నాకుఁ దొల్లి వరియింపఁ బడిన భార్య. (అర. ౧-130.)
నాచే - తృతీయార్థము. నా కొఱకు అని చతుర్థ్యర్థమైనఁ జెప్ప వచ్చును.
అక్కచున కే శోకింప కెట్లుండుదున్-(ఆది. 3-118) కొఱకు-చతుర్థ్యర్థము.
ఇతని యోగంబు మనకుఁ జేయకునికి మానుషంబె. (అర. ౧-55.)
మనము - ప్రథమార్థము.

మన మిప్పుడు ఎడ. మీఁద. పై అని వాడుచోట్ల నన్నయ భారతమున కు ప్రత్యయము కనవచ్చు చున్నది. ఇది అలుగు. కూర్చు. ప్రీతులగు. సంతసిల్లు. సంతోషించు అను ధాతువులతో నన్వయము కలిగి యుండును.

శుక్రుండు యయాతి కలిగి. (ఆది-3-187) యయాతిపై
గురు భుజుండ నాకుఁ గూర్తేని - (అర. 3-377) నా యెడఁ బ్రియ పడుదు వేని.

ధర్మ నందనున కతి ప్రీతుం డై - (అర. ४-133.) ధర్మనందను నెడ.
అమ్ముదితకు సంతసిల్లి యధిక విభూతిన్. అర. ౨-329. ముదిత యెడ.

సహించు. అనుగ్రహించు. మెచ్చు. మార్కొను. కరుణించు అను ధాతువుల కర్మపదములకు కు ప్రత్యయము వాడఁబడుచుండును.

యయాతి గర్వంబునకు సహింపక (ఆది. 3-211)
అని పౌష్యునకు ననుగ్రహించి (ఆది. ౧-101 [1])
ఇంద్రుండు దానికిం గరుణించి అర. ౧-86

---

1. అనుగ్రహించు అను నామధాతువు అనుగ్రహము + ఇంచు అనునట్లు విఱుగును ఈ విభాగము నన్నయ నాఁటి కెల్లరకును పరిచితమై యుండును పౌష్యునకు + అనుగ్రహము + ఇచ్చు (ఇంచు) అని యర్థము చెప్పినచో నన్వయము సరిగాఁ గుదురును. ఇచ్చుట ఇంచునకు అనుగ్రహమే కర్మ లేదా ఇంచుధాతువు ద్వికర్మక మనియు దాని ముఖ్యకర్మ ద్వితీయా విభక్తిలోను, అముఖ్యకర్మ షష్ఠీవిభక్తిలోను ఉండుననియుఁ జెప్పవచ్చును.

హరి కిభంబులు మార్కొనునయ్య యెయ్యెడన్ - (అర. ४-88)
ఇచ్చట హరితో నని తృతీయా విభక్తిని గూడ వాడవచ్చును.

నీ వర్ణధర్మ ప్రతిపాదనంబునకుఁ దపంబునకు మెచ్చితి. (ఆది. 3-24)
మనమిప్పుడు కు ప్రత్యయము వాడు పెక్కుచోట్ల నన్నయ ప్రథమావిభక్తి వాడుచుండును. అట, ఎట, ఇట, అక్కడ, ఇక్కడ, ఎక్కడ అను నవ్యయములను గూడ నతఁడు కు ప్రత్యయ విహీనముగానే ప్రయోగించుచుండును.

తచ్ఛీకరాంబుకణముల చల్లని గాడ్పునపడి - (ఆది. 6-23) గాడ్పునకు
క్రచ్చఱ వేటవచ్చి (ఆది. 6-27). వేఁటకు
ఈ మహాకార్యంబు గడఁగ నున్నవారము (ఆది ౮-251)
(కార్యమునకు)
ధరణిఁగల రాజులిట యెవ్వరు వచ్చినవారు లేరు (అర. ౨-184)
ఎటయేనియుం బోయెద (అర. ౨-77)
మృగం బమ్మతోన యిటవచ్చె. అది యెక్కడం బాతె (ఆది. ౨-167)
తద్భావంబున నెక్కడం గదలనేరకున్నవాఁడ (అర. ౨-125)
ఇచ్చట సప్తమ్యర్థమున ద్వితీయ వాడఁబడినది.

నన్నయ భారతమునఁ గర్తృపదప్రథమకు షష్ఠి వాడఁబడు చుండును.

నీ యెఱుఁగని యవియుఁగలవె నీరజనాభా స. ౧-133
అతని పుట్టిన విధమెట్టు చెప్పు స. ౧-133

లో, లోపల అను షష్ఠివిభక్తి ప్రత్యయములు అందు అనునర్థమున వాడఁబడు చుండును.

మఱి యాతఁడె వేల్పులలోపలఁ బెద్ద (నిర్ధారణ) ఆది. ४-92
క్రంచఱ నీరిలో ముంచుచు నెత్తుచు ఆది. ४-166
అబ్ధాదిలో నడఁగి ఆది. ౬-165
అని తమలోఁ బలుకుచున్న సమయంబున విదురుం దేతెంచిన-
అర. ౧-56 (తమలోఁదామని యర్థము.)

లో అను ప్రత్యయము మీఁద సప్తమీ విభక్తి ప్రత్యయములైన అందు, న అను నవియుఁబంచమీ ప్రత్యయమైన ఉండి అనునదియుఁ జేరుచుండును.

"సుందరి ! మా యిద్దరలో
నం దెవ్వరి వలతు చెప్పుమా ! యనవుడుఁ బా

ర్ణెందపుళి చూచి మీలో
నందెవ్వఁడు వొడిచి యొడిచె నతవిన వలతున్" (ఆది. ౮-110)
'జంభకుఁడను వాని భూరిబలుని పుత్త్రిఁబోరిలోన నొడిచి'
(స. ౧-246)

'భూమిదేవి నీరిలోనుండి వెలువడి (అర. 3-122)
"అంద్వింందు నాస్తు సప్తమి" అని చింతామణి.
నన్నయ భారతమున అందు అనుదానికి వ్యస్తప్రయోగము కూడఁ గలదు. అది యంతవఱకు స్థలార్థకమైన యవ్యయముగా నుండి యప్పుదే సప్తమీ విభక్తి ప్రత్యయముగా నేర్పడుచుండె నని యూహింపవచ్చును.

పెద్దలు చెప్పుదురు. అట్టియందు గోవిందుండు స్త్రీ వధయును
గోవధయును జేసె (స. ౨-42)
అరిగి ముందఱున్న యంద యుండి (ఆది ౬-153) (స్థలార్థకము)
జనమేజయు సర్పయాగంబు నం దయ్యెడు సర్పకులప్రళయము.
అర్పయక ధర్మశాస్త్రముల యందుఁ బురాణములందుఁ జెప్ప
(ఆది. ౫-90)

నన్నయ భారతమున అందు వివిధార్థములందు వాడఁబడినది.

అతిథివై వచ్చి నీవు మాయందుఁ గుడిచి (అర. 3-390)
ఇదియును స్థలార్థమందే వాడఁబడినట్లు తోఁచుచున్నది.
అంశుమంతుండు నిజపుత్త్రిఁడగు దిలీపునందు రాజ్యభరముఁబూన్చి
(అర. 3-72) దిలీపునిపై-దిలీపునిమీఁద.

తాల్మియందుఁ ఋషివినిఁబోని దాని (ఆది. ౫-34) తాల్మివిషయమున
నారదు వచనంబున ద్రౌపదియందు సమయక్రియ (ఆది. ౧-34)
(ద్రౌపదీవిషయమున)

అవివేకియందుఁ బ్రయుక్తంబులైన సుభాషితంబులుం బోలె.
(అర. ౧-313) అవివేకియెడ - అవివేకి విషయమున
శుచులయందెల్ల నత్యంతశుచివై పాత్రులయందెల్లఁ బరమపాత్రుండవై
ఆది. (౧-143) నిర్ధారణార్థము

ఇందు అనుదానికి ఉల అను ప్రత్యయము చేరినచో నది విశేషణమగును. దానిపై న్ అను ప్రత్యయము చేరఁగా మరల నది సప్తమ్యర్థము నొసంగును.

వసిష్ఠుఁడిందుల వసియించె (అర. ౩-227)

ఈ ప్రదేశము నం దని యర్థము.

న అను ప్రత్యయముకూడ అందు అను నర్థమునందే వాడఁబడును.

తెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్ (ఆది. ౧-16)

నా బంధు లందఱు మనంబున నేమినారు (ఆది. ౫-29)

న అను ప్రత్యయము ద్వారా, తరువాత అను నర్థములందుఁ గూడఁ గనఁబడుచున్నది.

ఇహిలోకమున కరిగె భూవివరమునన్ (ఆది. ౧-102) ద్వారా

కౌరవాన్వయ పరిక్షయమున నుదయించి (ఆది. ౨-164) తరువాత

పొందు ధాతువు కర్మపదమునకు 'నన్' అను ప్రత్యయము వాడఁబడుచుండును.

మనోరాగంబునం బొంద (ఆది. ४-191)

దేవత్వంబునం బొంది విశుద్ధజ్ఞానులయి ముక్తు లగుదురు (ఆది. 3-221)

తృతీయా పంచమ్యర్థములందు వలెనే సప్తమ్యర్థమునఁగూడ న్ అను ద్వితీయావిభక్తి ప్రత్యయము వాడఁబడును.

పితృకార్యములఁ బితృపిండ యజ్ఞక్రియ లడఁగె (ఆది. ౧-140)

ఈ మునిపల్లె నుండు టిదియేల (ఆది. ४-53)

ద్వితీయా ప్రత్యయమైన న్ అనునది తృతీయాద్యర్థములందుఁ జేరునప్పు డౌపవిభక్తిక ప్రత్యయముల తుది ఇకార మకారముగా మాఱును.

ప్రభాత సమయం బక్కాలనఁ గృతస్నానులయి (ఆది ౬-224)

ఒండుచోటం దపంబు సేయుచుండె (ఆది ౫-188)

వడినసుర వాతముక్కునముక్కున నుఱుగక రక్తప్రవాహమొలుకఁగ (ఆది. ౬-214)

ఓ యామంత్రణంబునం దగునవియు దానికిఁ బురుషనీచ స్త్రీపురుషామంత్రణములందు యి, పి, రి వర్ణంబులు విభాష నంతాగమంబు లగు నవియు వ్యాకరణము చెప్పుచున్నది,

నన్నయ భారతమున నివి యెచ్చటను గావవచ్చుటలేదు.

సర్వనామములు :-

ఏను, నేఁను అనున విప్పు డుత్తమ పురుషైక వచన సర్వనామములు. నన్నయ భారతమున ఏను అనురూపమే విరివిగా వాడఁబడినది. ముద్రిత ప్రతులలోఁ గొన్నిచోట్ల నే నను రూపము కనఁబడు చున్నది. కాని వ్రాఁత ప్రతులలో నట్టిచోట్ల ఏను అనియే వ్రాయఁబడి యున్నది. అందుచే నన్నయ కీరూపమే యభిమతమని చెప్పనగును.

సభాపర్వమున ద్వితీయాశ్వాసమున (122)

భానుప్రభులగు పాండుమ
హీనాథాత్మజుల లక్ష్మియెల్లను నీకున్
నే నపహరించి యిత్తు ధ
రానుత!.........—"

అను పద్యమున నీ కున్నేనపహరించి అను ప్రయోగమున్నది. ఇచ్చట నన్నయ ఏను అను శబ్దమునే వాడియుండినచో ద్రుతద్విత్వసంధిని జేసెనని చెప్పవలయును.

ఏము, మేము అనునవి ఉత్తమ పురుష బహువచన రూపములు-

"లోకానుగ్రహంబుగా నీరోషంబు విడువుము. నే మసమర్థులమై క్షత్రియులచేత వధింయింపంబడిన వారము గాము" (ఆది- ౭-140)

అను చోట 'నేము' అను రూపము ముద్రిత ప్రతులలోఁ గనఁబడు చున్నది. వ్రాఁత ప్రతులలో "విడువు మే మసమర్థులమై" యనియే వ్రాయఁబడి యున్నది.

మధ్యమ పురుషైక వచనమున నీవు, ఈవు అను రెండు రూపములును వాడఁ బడినవి ఈరు, మీరు అనునవి బహువచన రూపములు. వీనిపైని, ప్రథమ పురుష బహువచన రూపములైన వారు, వీరు అను వానిపైని, 'లు' అను బహువచన ప్రత్యయము కనఁబడు చున్నది ఈరలు, మీరలు, వారలు, వీరలు, యుష్మదస్మదాత్మార్థకముల కుత్తరపదము పరమైనప్పుడు కొన్ని చోట్ల దుగాగమము కనఁబడు చున్నది. నీదుకులంబునకుఁ దగఁగఁ బ్రతోదము గొని (ఆది. ౬— 54) నీదు భరము (అర. ౧-274) నాదు రోదనంబు (ఆది ౭-269)[1] ఉత్తరపదములగు

1. ఈ దు ఆగమ మనుట సరికాదనియు, నది సంబంధార్థక షష్ఠీ ప్రత్యయ మనియు ఆం వ్యా. సం. సర్వ. (పుట 1177) నఁ జెప్పఁబడినది

"అది, అవి" యనువాని మీఁదఁ గొన్నిచోట్ల అగు, అయిన, అను అగు ధాతుక్రియాజన్య విశేషణములు వాడఁబడి యున్నవి.

నాదగు దుష్కర ఘోరతపంబు సరియుఁగావు. (ఆది- 3-210)
వర్తమాన కాలక్రియా జన్య విశేషణములకు వాఁడు, అది అనునవి చేరుటచే వర్తమాన కాలక్రియా రూపము లేర్పడు చున్నవి.

చేయు, ఉండు అను నుదంత తద్ధర్మ విశేషణములకు వాఁడు, అది అను సర్వనామములు చేరుటచే విధ్యర్థక రూపము లేర్పడును. చేయువాఁడు = చేయవలెను; ఉండునది = ఉండవలెను; 'ఉండునది' అనుదానికి 'ఉన్నది' అను రూపాంతరము కలదు.

కొన్నిచోట్ల అది, తాను అను సర్వనామము లూఁత పదములుగా వాడఁబడు చుండును అట్టిచోట్ల వానిని దొలఁగించినను అర్థభంగము కలుగదు.

"అది పర్వంబది వినఁగానొప్పు భారతాద్యంబగుచున్-" (ఆది- ౧-35)

"హస్తిపురంబది రాజధానిగాన్" (ఆది- ౫-6)

"విషవ్యపగతమైన జీవమది వచ్చు నుపాయము-" (ఆది- ౧-149)

"వచ్చి తానుగ్రశ్రవసుఁడను సూతుఁడు" (ఆది- ౧-27)

ఏక వచనమునందే పూజార్థమందును నిందార్థ మందును గూడ 'వీరు' అను ప్రథమ పురుష బహువచన సర్వనామము వాడఁబడి యున్నది.

"వీరు కుంతీ మహాదేవులు-" (ఆది- ౭-237)

"వీరెవ్వరయ్య ద్రుపద మహారాజులె-" (ఆది- ౬-89) నిందార్థము.

అది, వాఁడు, వీఁడు అను సర్వ నామములు భారతమున నీచార్థమునఁ గాక సామాన్యార్థముననే వాడఁ బడి యున్నవి ద్రౌపది, దమయంతి మున్నగు వారిం జెప్పునప్పుడు నన్నయ 'అది' అను సర్వనామమును వాడు చుండును, ఎవ్వఁడు, ఎవ్వరు, ఏయది, ఎద్ది అనునవి వివిధార్థములందు వాడఁబడి యున్నవి.

"అస్త్ర విద్యలు గఱచి నాదైన యిష్టమొగిన తీర్పంగ నిందెవ్వఁ డోపు నవిన- ( ఆది- ౫-244 ) ప్రశ్నార్థకము.

"ఏయది హృద్య మపూర్వం
బేయది యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘ విబర్హణ
మేయది యక్కథయ వినఁగ నిష్టము మాకున్." ( ఆది. ౧-29. )

( సంబంధార్థము )

ఎవ్వఁడు, ఎవ్వరు అను సర్వనామములు 'ఏవి' అను దానితోఁగూడి ప్రయోగింప బడి యున్నవి

"శాంతుఁడయి యెవ్వఁడేనిఁ గృతాంతకుఁగడవంగనొల్లండ
యట్టి యత్యుగ్ర తేజుఁడగు వసిష్ఠ మహాముని" (ఆది- ౭-91)

ఎవ్వరు + ఏని = ఎవ్వరేవి అనుదానికి స్త్రీ పురుషోభయ సూచకముగా ఎయ్యేని అను రూపము కనవచ్చు చున్నది. ఎవ్వరులోని తొలియచ్చు మీఁది వర్ణములు లోపింపఁగా ఎకారము దీర్ఘమైనది. ఏ + ఏని; ఏయేని; ఎయ్యేని.

"ఇవి యెయ్యేనియు నొక్క ధనుర్వేద విదుండైన బ్రాహ్మణు
నపత్యంబులగు. (ఆది ౫-188 )

"నీవెయ్యేని నొక్కవేల్పు నారాధించి తవ్వేలుపు." (ఆది- ౫-18)

(సంబంధార్థము)

ఎయ్యేనియు నొక్క స్త్రీ యందు జన్మింపంబోయెదము (ఆది- ౪-127)

ఎవ్వఁడను సర్వనామ మొక్కొ అనుదానితోఁ గూడి యాశ్చర్యమును, ఓ అను దానితోఁ గూడి సందేహమును వెల్లడించును. ఎవ్వరు అను సర్వనామము ఎవ్వరైనను, ఎల్లరును అను నర్థములందు వాడఁబడి యున్నది.

"దానిఁ బిహితంబుగ నెవ్వరుఁ జేయనేర్తురే" (ఆది. ౭-219.)

ఎవ్వరైనను.

"అజయ్య వీర్యుఁడని నెవ్వరికిన్." (అర- ౪-47)ఎల్లరికిని.

సంఖ్యా వాచకములు :-

నన్నయ భారతమున 'ఒక' అనునది విశేషణముగా మాత్రము వాడఁబడును. దీనికి ఒక్క అనునది రూపాంతరము. ఆది పర్వ సప్తమాశ్వాసమున (36) ముద్రిత ప్రతులలో ఒక్క కొఱవిసేతఁ బట్టుకొని యను రూపమున్నది. వ్రాఁత ప్రతులలో నిచ్చట ఒక్కొ కొఱవి అను రూపము వ్రాయఁబడినది. ఇది

వచనమం దుండుటచే నిట ఒక్కఁ. ఒక్కొఁ. అను వానిలో నేదైన నుండ వచ్చును. కాని నన్నయ ఒక్కొండు, ఒక్కొక్కళ్ళు, పదునొకండు అను రూపములను వాడినట్లు తాళపత్రప్రతుల వలనఁ దెలియ వచ్చుటచే నతనికి ఒక్కొఁ అను రూపము కూడ నభిమత మే యై యుండునని యూహింప వచ్చును. పైని సూచింపఁబడిన ప్రయోగము తప్ప దీనికి వే ఱొండుప్రయోగము కానరాదు.

ఒక శబ్దమునకు మహదమహన్మహతీ వాచక రూపములు భిన్నములుగా నుండును.

| మహత్ | | మహతీ | అమహత్ |
|---|---|---|---|
| ఏక | బహు | ఏక | ఏక |
| ఒక్కరుఁడు | | ఒక్కత | ఒకఁడు |
| ఒక్కరుండు | ఒకళ్లు | ఒక్కతి | ఒక్కఁడు. |
| | | ఒక్కతె | |
| ఒక్కొరుఁడు | ఒకొళ్లు | ఒక్కర్తు | ఒక్కొండు |
| | | | ఒండు. |

నన్నయ మహద్వాచకము నందు ఒక్కరుఁడు అను రూపమునే కాని ఒకఁడు అను రూపమును వాడఁడు. దాని నతఁ డమహద్వాచకమందే వాడు చుండును. మన మిప్పు డమహద్వాచకముగా వాడు ఒకటి యను రూప మతని కభిమత మైనట్లు తోఁపదు.

ముద్రిత ప్రతులలో మహద్వాచక మందు ఒకఁడు అను రూపమును, అమహద్వాచక మందు ఒకటి అను రూపమును గనఁబడు చున్నవి. కాని వ్రాఁత పతులలో నవి యట్లు లేవు.

"విఖ్యాతుఁ బూజితుఁ జేయు మొక్కనిఁ గౌరవాన్వయ వర్ధనా।
(స- ౨-4-).ముద్రితప్రతి.
"విఖ్యాతుఁ బూజితుఁ జేయు మొక్కరు" (వ్రాఁతప్రతి)
"అది నపరాధ మొక్కటియైన నదియు". (అర- ౧-219) ముద్రితప్రతి.
"అఁయ నపకార మొకఁడైన నదియు" - పాఠాంతరము-
వ్రాఁత ప్రతులందలి పాఠమిదే-

ఒకటన్, ఒక్కటన్, ఒక్కొటన్ అనునవి నన్నయ భారతమున ఒకే సమయమం దను నర్థమున వాడఁ బడినవి.

ఒందు అను దానికి అన్యము- ఒకటి అను నర్థములు శబ్దరత్నాకరములో నున్నవి. నన్నయ భారతమున విది వ్యస్తముగాను, సమస్తము గాను గూడ అన్యమను నర్థనము నందే వాడఁబడి యున్నది.

ఈ వ్యాధి యొంటఁ దీరదు- (ఆది- ౮-218.) అన్యమున నని యర్థము.

ఆమ్రేడితము పరమైనప్పుడు మాత్ర మది ఒక్కటి యను నర్థమునఁ గనఁబడు చున్నది.

ఒందొంటిన్- "ధర్మార్థ కామము లొందొంటి బాధింపకుండ"- (సభా. ౧-25)

"తమలో విత్యంబు నొందొంటి తోడం బెనంగి పోరుచుండ" (ఆది- ౨-68.)

'ఒందు' శబ్దము సాధారణముగా నమహదర్థమందే కనఁబడుచున్నది. దానికి 'ఒరు' అనునది చేరునప్పుడు మాత్ర మది మహదర్థమునఁ గూడ వాడఁబడినది.

"చిత్రాంగదులు సహింపక యని నొందొరుఁ దాఁకి-" (ఆది. ४-193)

'ఒందు' తరువాత 'ఒరుఁడు' అనుదాని బహువచన రూపము కూడఁ గనఁబడుచున్నది.

"ఉఱగులును నమృతోపయోగ కుతూహలంబున నొండురులన్ గడవ స్నాతాలంకృతులై" (ఆది- ౨-120.)

'ఒందు' శబ్దమునకుఁ బరమగు 'ఒందు' శబ్దము కాని ఒరుఁడు' శబ్దము కాని ప్రథమా విభక్తి యందెచ్చటను గావరావు.

"అని యిట్లు గంగా వసువు లొందొరులు సమయంబు సేసికొని" (ఆ. ४-131) అనుచో 'ఒరులు' అనునది ప్రథమా విభక్తి యందుఁ గన వచ్చుచున్నది. కాని వ్రాఁత ప్రతులలో "ఒందొరులకు సమయంబు చేసికొని" యని షష్ఠీ విభక్తి రూప మున్నది.

'ఒందు'నకు, 'ఒందులు- ఒండ్లు' అనునవి బహువచన రూపములు. 'ఒరుఁడు' 'ఒరులు' అను పదములు వ్యస్తముగా వాడఁబడు నప్పు డితరు లను నర్థమందే కనఁబడుచున్నవి. నన్నయ భారతమున 'కొందొక' అను రూపము కలదు. దీనికి కొంత, ఒకానొక అను నర్థము లున్నవి.

"తొల్లి దేవేంద్రుండు కొండొక కాలం బదృశ్యుండై"- (ఆది. ఒ-24)
కొంత-

"బాలుఁ డొక్కండు కొండొక కోల సేతఁ బట్టుకొని". (ఆది-ఒ-260)
ఒకానొక.

'ఒకొండు + ఒక = 'ఒకొండొక' అనుదానియం దూనిక ప్రథమాక్షరము నుండి రెండవ యక్షరము మీఁద పడఁగాఁ గ్రమముగా మొదటి యక్షరము లోపించుటచేఁ 'గొండొక' అను రూప మేర్పడి యుండును.

'ఎక్కటి అను పదము ఒక్కఁడే- అసహాయుఁడై అను నర్థమున వాడఁబడినది. కళ యైన దీని తరువాతఁ బరుషములకుఁ గసడదవాదేశము కనఁబడుచున్నది.

"ఎద గల్గఁ గొనిపోయి యెక్కటి సంపిన" (ఆది- ఒ-278 )

'ఎక్కటి కయ్యం' మనుచోట నీ శబ్దము విశేషణముగాఁ గానఁ బడు చున్నది. 'ఒక్క శబ్దమునకుఁ బూరణార్థమున మొదలిటి, మొదలింటి అను రూపములు వచ్చును. 'మొదటి' అనుదానికి నన్నయ భారతమునఁ బ్రయోగము లేదు. 'ము' అనుదానికి 'తల్' అను ప్రత్యయము చేరగా 'ముదల్', 'మొదలు' అను రూపము లేర్పడినవి. 'మొదలింటి' అనునది దాని యౌపవిభక్తిక రూపము.

"మొదలిటి సంపదలతో సమూలంబ చెడున్". (స. ౨-202)

రెండు అనునది సంఖ్యా విశేషణముగను, విశేష్యముగను కూడ వాడఁ బడును రెండునకు 'ఇరు' అనునది మూల రూపము దీనికి 'ఇను' అనునది రూపాంతరము. 'ఇరు' అను విశేషణము తరువాత వచ్చు విశేష్య మెప్పుడును బహువచనాంతముగనే యుండును. 'ఇను' తరువాత 'మడుంగు.' 'మాఱు' మున్నగు పరిమాణ పర్యాయార్థక పదములే వచ్చుచుండును ఇవి యెప్పుడును ఏకవచనమందే యుండును. 'ఇను,' 'ఇరు' అనునవి రూపాంతరములే యైనను వీనిలో నొకదానికిఁబదు లింకొక దానికిఁ బ్రయోగము లేదు.

"ఇరుగడలం దుల విడి తూఁపఁగ -" (ఆది- ४-94.)

"దీనికి వినుమడుం గగుం బ్రతిబలముం గవినప్పుడు నా రూపం బనఘా"- (అర- ३-345.)

"ఈ రెండు కారణముల మురారాతియ యర్ఘ్యమునకు నర్హుఁడు"
(స- ౨-26-) (సంఖ్యావిశేషణము).

"దర్పులు నాకిన నాలుకలు రెండుగా వ్రయ్యుటం జేసి" (ఆ- ౨-122)
(విశేష్యము).

రెట్టి యనఁగా రెండురెట్లు- "దానికి రెట్టి గోధనము" (అర- 3-344.)

రెండునకు 'నెల.' 'నాఁడు' అనునవి పరమైనపుడు బిందుపూర్వక డు వర్ణము లోపించి న కారమునకు ద్విత్వము కలుగును. ఈ మార్పు వర్ణసమీకరణముచే నేర్పడును.

రెండు + నెలలు; రెండ్నెలలు; రెన్నెలలు.

"పదపడి రెన్నాళ్ల నొక్క పగలున్ రేయున్"- (ఆది- ౧-68.)

రెండునకు ఇద్దఱు, ఇరువురు అనునవి మహన్మహతీ వాచక రూపములు.

మూఁడు సంఖ్యా విశేషణముగను, విశేష్యముగను (అమహద్వాచకము) వాడఁబడును.

"మూఁ దగ్నులు ప్రత్యక్ష మైన యట్లు" (ఆది- 3-181)
"తురగముల్ మూఁడు" (ఆది- ౧-80.)

మూఁడున కుత్తర పదంబు పర మగునప్పుడు డుఙ్లోపమును, లుప్త శేషము దీర్ఘమునకు హ్రస్వమును, మీఁది హల్లునకు ద్విత్వమును వచ్చును.

ముమ్మడుగు; ముయ్యేడు.

"మఱి దాని ముమ్మడుఁ గనీకినీ సమాఖ్య నొనరు." (ఆది- ౧-80 )

'ముప్వురు' అనునది మూఁడునకు మహన్మహతీ వాచకము.

నాలుగు నకు నాల్గు రూపాంతరము. ఇవి విశేష్యమునకు ముందును వెనుకను గూడ వాడఁబడును.

పూర్వపదముగా వాడఁబడు 'నాలుఁగు' శబ్దము 'నలు' అను రూపాంతరమును బొందును.

"వీఁకఁ బఱతెంచి నలుగడఁ దాఁకిన" (ఆది- ౮-200)

'నలువురు', 'నల్వురు' అనునవి మహన్మహతీ వాచక రూపములు.

నన్నయ భారతమున 'ఐదు' అనుటకు 'ఏను' అను రూపమే కనఁబడుచున్నది.

"వేయునేను నూట డెబ్బది యైదు శ్లోకంబులు గలిగి" (ఆది- ౧-54)
ఆది-౧-44; ఆది 1-56; మున్నగు చోట్ల ముద్రిత ప్రతులలో 'ఐ' దను పదము చూపట్టు చున్నది. కాని వ్రాఁత ప్రతులలో 'ఏ' నని యే యున్నది.
ఏను కళయే కాని ద్రుతప్రకృతికము కాదు.

"ఏను ప్రకారంబు లయితి"- (ఆది- ౭-274.)

"నాలు గేన్ పాకి కుట్టుల నీఁడె" (ఆది- ౫-218) సరళాదేశము లేదు.
'ఏవురు' అనునది మహన్మహతీ వాచక రూపము.
'ఏగురు' అని ముద్రిత ప్రతులలో నొకచోటఁ గనవచ్చు చున్నది.

"గురు వచన స్థితి మన కేగురకును విది వత్నిగాఁ దగుం గావున"
(ఆది- ౭- 214)

వ్రాఁత ప్రతులలో నిచ్చట "ఏవురకును ... ... దవుం గావున" అని యున్నది. 'ఆఱు' నకు 'ఆర్వురు' అనునదియు, 'ఏను' నకు 'ఏర్వురు' అను నదియు మహన్మహతీ వాచక రూపములు.

'ఎనిమిది' అమహద్వాచక రూపము దీనికి 'ఎన్మిది' అనునది రూపాంతరము. 'ఎనమండ్రు' అనునది మహన్మహతీ వాచక రూపము.

సమాస పూర్వపదమైన ఎనిమిదికిఁ గొన్నిచోట్ల 'ఎనమ' అను రూపము కనఁబడుచున్నది. దీనిపై హల్లునకు వైకల్పికముగా ద్విత్వము కలుగును.

ఇరువదియొక్క వేయు నెనమన్నూట డెబ్బది రథంబులు. (ఆది-౧-81)
'తొమ్మిది'కి మహన్మహతీ వాచక రూపము తొమ్మండ్రు.
ఎనిమిదికి ఎనుమ వలెనే తొమ్మిదికి తొమ్మ అను రూపము కనఁబడుచున్నది.

తొమ్మిది వేలుం దొమ్మన్నూట యెనుబది నాలుఁగు శ్లోకంబులు గలిగి
(ఆది- ౧-34).

పది అమహద్వాచక రూపము. పదుండ్రు మహన్మహతీ వాచక రూపము. పదికి 'ఏసి' పరమగునప్పుడు 'పదినేసి' అను రూపము కల్గును. ముద్రితప్రతిలో (ఆది ౮-2) పదేసివేలు దాసీజనంబు లను రూప మున్నది-కాని వ్రాఁత ప్రతులలోఁ 'బదినేసి' అనియే కనఁబడు చున్నది-

వరుసఁ బదినేసి బాణము లరుదుగ నేసితి (అర- ४-81)

నేఁటి వాడుకలో పదకొండు అను రూపము కనఁబడుచున్నది. ముద్రిత ప్రతులలో "పదునొక్క" (ఆది- ౧-43) అను దువర్ణముతోఁ గూడిన రూపము లున్నవి. కాని వ్రాఁత ప్రతులలో "పదవకొండు" అను దవర్ణము తోడి రూపములే చూపట్టుచున్నవి. పదకొండు అను వ్యావహారిక రూపము దీని రూపాంతరమే. నన్నయ భారతమునఁ గనఁబడు నితర సంఖ్యా రూపము లీ క్రింద నొసంగఁబడు చున్నవి.

| | |
|---|---|
| అమహద్రూపము. | మహన్మహతీ రూపము. |
| పంద్రెండు, పదియురెండు | |
| పదుమూఁడు | పదుమువ్వురు |
| పదునాల్గు, పదునాలుఁగు | |
| | పదియేవురు |
| పదియాఱు | పదియార్వురు. |
| పదియేడు. | |
| పదునెనిమిది. | |
| | ఇరువదుండ్రు (ముద్రితపాఠము) |
| | ఇరువండ్రు (వ్రాఁతప్రతిపాఠము) |
| ముయ్యేడు | |
| ఇరువదియొక్క. | |
| ఇరువదిమూఁడు | |
| | ఇరువదియేడ్వురు |
| ముప్పది | ముప్పండ్రు |
| | ఫలువండ్రు |
| ఏఁబది (అర. ౨-220) | ఏఁబండ్రు |

ఏను పెక్కుచోట్ల కళగానే కన్పట్టుచున్నది. దీని తరువాతఁ బరుషములకు గజడదబాదేశము లేదు. ఏను + పది అనుచోఁ దొలియచ్చు మీఁది వర్ణము లోపించుటయు, ఖుప్తశేషములకుఁ బరుషము పరమైనప్పుడు నుగాగమము వచ్చుటయు ఏఁ బది యందలి అర్ధబిందువునకు హేతువులై యుండును.

అఱువది
డెబ్బది

దెబ్బదియేను

నూఱు　　　　　　　　　　　　నూర్వురు

'నూఱు'నకు 'ఏసి' పరమగు నపుడు వ్రాఁత ప్రతులలో 'నూఱునేసి' అను రూపము కనఁబడుచున్నది. ముద్రిత ప్రతిలో నూఱేసి అనురూపమే యున్నది. (ఆది. ౮-2) ఇది నన్నయకు సమ్మతముకాదు.

ఇతర సంఖ్యావాచక పదములు చేరునప్పుడు 'నూఱు' 'నూటగా' మాఱును. ఇది 'నూఱు' శబ్దమునుండి యేర్పడిన తృతీయాసప్తమీ రూపముకాదు. కళ. దీని కచ్చు పరమగునప్పుడు యడాగమము కనఁబడుచున్నది. బహువచనాంతము లైన వంద, వేయి, లక్ష మున్నగు శబ్దముల కితరసంఖ్యా వాచకములు పరమగు నప్పుడు బహువచన లు వర్ణమునకు అ చేరుచున్నది. అట్లే నూటి అనుదానికి అ చేరఁగా నూట అను రూపమేర్పడినట్లు తోఁచుచున్నది. ఈ అకారము సముచ్చయార్థమున వచ్చినట్లు గోచరించుచున్నది. నూట + ఎనిమిది; నూఱును ఎనిమిదియు. ఇను, ము (మూఁడు), నలు, ఏను, ఎనమ, తొమ్మ మొదలగు శబ్దముల తరువాతఁగూడ నూఱు శబ్దము సమాసమున బహువచ నాంతమును జెందక నూట అను రూపముతోనే కనఁబడుచున్నది.

నూటతొంబదియేడ్వురను

ఇన్నూఱు

మున్నూఱు

నన్నూఱు

నన్నూటయిరువదినాలుఁగు

ఏనూఱు

ఆఱునూఱు

వే, వేలు　　　　　　　　　　　　వేవురు

వేయి శబ్దమునకు వే అనునది మూలరూపము. దీనిపై సముచ్చయార్థకమైన ఉ చేరుటచే వేయు అను రూపమేర్పడినది. దీనిమీఁదనే యితర సంఖ్యావాచకములు చేరుచుండును.

వేయు నూట యా...

రెండువేల వెనమన్నూఱుడెబ్బదినాలుఁగు

మూఁడువేలవేనూ...

అఱువది వేవురు
ఎనుబదియెన్మిది వేవురు

తొమ్మిది కోట్లు
అఱువదికోట్లుంబదివేలు

ఇతర సంఖ్యావాచకములు చేరునప్పుడు సముచ్చయమునకు బదులు అకారము చేరు తీరు తరువాత నేర్పడినది. (అఱువదికోట్ల పదివేలు) నన్నయ భారతమున నూఱునకు వంద అను పర్యాయ పదము కానరాదు. మహన్మహతీ వాచకములను జెప్పునప్పుడు సంఖ్యాపదములపై మంది, గురు అను వానిని చేర్చుట యాధునిక వ్యవహారము. నన్నయ నాఁడు 'వురు' అనురూపమే కాని 'గురు' అనునది కానరాదు.

పూరణార్థమున సంఖ్యా వాచకములకు మన మిప్పుడు 'అవ' అను ప్రత్యయము చేర్చుచుందుము. నన్నయ భారతమునఁ గూడ ముద్రిత ప్రతులలో నీ రూపము కానిపించును. కాని యవి యేవియు యతి ప్రాసాది స్థలములం దుండవి హేతువుచేతను, వ్రాఁత ప్రతులలో 'అగు, అవు' అను రూపములతోనే కానఁబడుచుండుటచేతను నన్నయకు 'అగు, అవు' అనునవియే సమ్మతములని చెప్పవచ్చును.

నాలుగునకు నాలవు అనునది పూరణార్థక రూపము. 'గు' లోపించినది.

"సర్వమనోజ్ఞము నాలవు పర్వము నాఁదగి" (ఆది. ౧-41)

'అన్ని' అనునది సర్వ పర్యాయమైన అమహద్రూపము. 'అందఱు' అనునది మహన్మహతీ వాచకము. నన్నయ భారతమున 'అందొఱు' అను రూపము కూడఁ గానఁబడుచున్నది.

"అందొఱకు నిట్టు లన్నియె ద్రుపద విభుఁడు." (ఆది. ౭-252)
"దుర్యోధనాదులు దురాధర్షు లందొఱును మనకు" (అర. ౧-269)
"వేదశ్రీతో మునికోటి దా రున్న వీకుఁ దందొఱకును బ్రీతి"
మధ్యాక్కర. (అర. ౨-255)

'ఇన్ని' అమహద్వాచకము., 'ఇందఱు' మహన్మహతీ వాచకము
'కొన్ని' Do. 'కొందఱు' Do.

'పలు' అనునది 'అనేక' శబ్ద పర్యాయ పదము. ఇది యెప్పుడును విశేష్యమునకు ముందే ప్రయోగింపఁ బడును. ఇందలి ఉకారము వైకల్పికముగా

లోపించును. పలుమఱు; పల్మఱు. 'పలువురు' మహన్మహతీ వాచకము. 'పెక్కు' అనునది కూడ ననేక పర్యాయమైన విశేషణమే. దీనికి విశేష్యము తరువాతఁ గూడఁ బ్రయోగమున్నది. 'పెక్కులు,' 'పెక్కుల్' అనునవి బహువచన రూపములు. 'పెక్కండ్రు' మహన్మహతీ రూపము. దీనిపై మరల 'రు' అను బహువచన ప్రత్యయము చేరిన రూప మున్నది.

"ఒక్క సతికిఁ బతులు పెక్కండ్రు రగు టిది" (ఆది. ౭-25)

పెక్కురను రూపము నన్నయ వాడియుండలేదు.

'ఎల్ల' శబ్దము ద్రుతాంతంబైన అవ్యయం బనియు దాని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగము లే దనియుఁ జిన్నయ సూరి వ్రాసి యుండెను. (సంధి. 25)

'సర్వ' పర్యాయంబైన 'యెల్ల' శబ్దమునకు సప్తమియు నసమాసంబున విశేష్యమునకు ముందు ప్రయోగంబును జూపబడి" నవిప్రౌఢ వ్యాకరణకర్త దానిని సవరించెను.

" ఎఱిఁగె సకల శాస్త్రంబుల నెల్ల యందు నధిక సాత్త్వికుఁ డాస్తికుఁ డనఁగ జనులు " - (ఆది. ౨-162.)

" ఏవగింపక చేకొనుం డిదె యెల్ల యందును ధర్మ సద్భావ మొక్కవి" (సభా-౨-236.)

మున్నగు చోట్ల నన్నయ భారతమున 'నెల్ల' శబ్దమునకు అందు అను సప్తమీ విభక్తి ప్రత్యయము చేరుట చేతను, దాని తరువాత యడాగమము వచ్చుట చేతను అది అవ్యయము కా దనియుఁ గళ యనియుఁ గొందఱి యభిప్రాయము. 'ఎల్ల' యను ప్రథమాంతమునకు సాకల్యాతిశయార్థమున 'ఉన్' చేరఁగా 'ఎల్ల + ఉన్'; 'ఎల్లన్ ' అను రూప మేర్పడె ననీ ఆం. వ్యా. సం. సర్వస్వము (పుట 332) చెప్పుచున్నది.

'ఎల్ల' శబ్దమునకు 'ఎల్లరు', 'ఎల్లవి' అను మహ దమహదర్థములు రెండును గలవు.

" త్రేతాగ్ను లెల్లను దేజరిల్లమిఁ జేసి - (ఆది ౧-140.) (అమహదర్థకము)

" కొడుకుల నెల్ల నెత్తికొని క్రమ్మరు చుండును. " (మహదర్థకము) (ఆది. ౨-42.)

'ఎల్ల' శబ్దము ద్రుతాంత మైన యవ్యయమే యనియు, దీనికి విభక్తి ప్రత్యయములు చేర వనియు, 'ఎల్ల యందు' అనుచోట 'అందు' అనునది విభక్తి ప్రత్యయము కాక దేశ (స్థల) వాచకముగా వాడఁబడిన దనియు, దాని ముందు ద్రుతము లోపించిన దనియు శ్రీ చిలుకూరి నారాయణరావు గారి యభిప్రాయము. 'అందు' నకు స్థల వాచకముగాఁ బ్రయోగము లున్నవి. కావున నీ యభిప్రాయమే యెక్కువ సమంజసముగాఁ గానవచ్చుచున్నది. 'ఎల్ల' శబ్దము షష్ఠీ విభక్తితోఁ గూడిన పదమునకు సంబంధించి యున్నప్పు డెప్పుడును దాని తరువాతనే వాడఁబడును.

"ఇట బాలవృద్ధుల కెల్ల భయంబుగా" (స. ౨-65.)
"ఇన సన్నిభ పీని కెల్ల నీకుఁ డ వౌటన్" (స. ౨-221.)

మహన్మహత్యర్థము లందు నన్నయ 'యెల్ల' శబ్దము తరువాత 'వారు' అను సర్వనామము చేర్చుచుండును.

"వినినం గొనియాడిన నెల్ల వారికిన్" (ఆది-౧-72.)

'ఎల్లరు' అనునది నన్నయ భారతమునఁ గనరాదు. సర్వ, సర్వపర్యాయ పూర్వ మైన విశేష్యముల తరువాతఁ గూడఁ గొన్నిచోట్ల నన్నయ 'ఎల్ల' ప్రయోగించుచుండును.

"ఇచ్చి సర్వజను లెల్లను భోజన దాన మొనరఁ జేసి" (ఆది. ౫-158.)
"సర్వభూత వర్గం బెల్లన్" (ఆది. ౫-95)
"సకలరాజ లోకంబు నెల్ల" (ఆది. ౮-211.)
"అఖిల లోక నివాసు లెల్ల" (అర. ౩-60.)

క్రియలు :-

నన్నయ తత్సమములు అచ్చికములు నైన రెండు రకముల క్రియలను వాడెను. ఆంధ్ర శబ్ద చింతామణిలో "ఉపకృతి పరిణతి సంవృతి భేదా త్త్రివిధా క్రియా" అని తత్సమ క్రియలు మూఁడు విధములుగా విభజింపఁ బడినవి. సంస్కృత కృదంతరూపముల 'కించుక్' ప్రత్యయము చేరఁగా నేర్పడునవి ఉపకృతిక్రియలు. సంస్కృత ధాతువుల తుద నుండు 'ఇ, ఉ, ఋ, ఌ, అయ్, అవ్, అర్' అను రూపములను బొందిన పిమ్మట 'ఇంచుక్కు' చేరఁగా నేర్పడు క్రియలు పరిణతి క్రియలు. ఎట్టి మార్పును లేని (అహతాకారము లైన) సంస్కృత ధాతువుల 'కించుక్కు' చేరఁగా నేర్పడు క్రియలు సంవృతి క్రియలు. ఈ మూఁడు

విధములైన క్రియలను నన్నయ భారతమున నున్నవి. "భవతి క్రియా పదానాం త్రివిధానా మించు గాగమః" అని చింతామణి. కొన్ని ధాతువుల 'కించుక్కు' నకు బదులు 'ఇల్లు' అను ప్రత్యయము చేరుచున్నది. అనురాగిల్లు, వర్ధిల్లు, గర్జిల్లు, ఇట్టివి సాధారణముగా నకర్మకములే యై యుండును. ఇంచు గంతములలో సకర్మకములు నకర్మకములు కూడ నున్నవి. తత్సమ ధాతువుల స్వార్థ ప్రేరణ రూపములందు భేదములేదు. ముద్రిత ప్రతులలో 'వధింపించు', 'నివర్తింపించు' 'పరివర్తింపించు' అని ప్రేరణమున 'పు' ఆగమముగా వచ్చిన రూపములు మూఁడు నాలుఁగు కనఁబడుచున్నవి.

స్వార్థమున 'ఇల్లు', 'ఇంచు' అను ప్రత్యయములతోఁ గూడిన అచ్చిక ధాతువులు కూడఁ గొన్ని యున్నవి. వీని సంఖ్య చాల తక్కువ. అలించు, ఓసరిల్లు, కొన్ని చోట్ల 'ఇల్లు' నకు బదులు 'ఇలు' అను రూపము వాడఁ బడినది. 'ఓసరిలు'.

ప్రేరణమున 'వించుక్కు' చేరిన అచ్చిక ధాతువు లనేకము లున్నవి. కొన్ని సంస్కృత ధాతువులకుఁ జేరు 'ఇంచుక్కు' న 'కియుడాగమము' కనిపించుచున్నది. 'ధరించు, ధరియించు', కొన్ని అచ్చిక క్రియలకు భూతకాల ప్రథమ పురుషైక వచనమునఁ జేరు 'ఎ' కారమునకుఁ గూడ 'వియుడా'గమము చూపట్టుచున్నది. 'అనియెను'.

కొన్ని క్త్వార్థక రూపముల పైని, వ్యతిరేక క్త్వార్థకముల పైని, తుమున్నర్థకముల పైని, విశేష్యముల పైని 'ఉండు' 'కొను', 'పుచ్చు', 'వైచు', 'అగు', 'కొల్పు', 'చేయు', 'రేగు', 'చను' మొదలగు ధాతువులు చేరుటచే నేర్పడు శబ్ద పల్లవ ధాతువులు నన్నయ భారతమునఁ బెక్కు గలవు.

ఉదా। "కట్టికొను", "ముట్టికొను", "కొనియాడు", "తోడితెచ్చు", "మిన్నకుండు", "తగులవైచు", "విన్ననగు", "నెలకొను", "కదచను", "పీద్వడు" "చుట్టుముట్టు", "నలిరేఁగు".

అరుగు, ఎగయు, ఎత్తు, ఏఁగు, అగు, ఏర్పడు, చను, చొచ్చు, పుచ్చు, తాఁకు, తలకొను, నెగయు, పడు, పోవు, ఎత్తు మొదలగు ధాతువులకు "తెంచు" అను ధాతువును జేర్చి నన్నయ వాడుచుండును. ఈ "తెంచు", "తెచ్చు" యొక్క రూపాంతరము. ఇది ధాతువు తెలుపు కార్యము పూర్ణప్రాయ మగుటను గాని, అభిముఖ మగుటనుగాని సూచించును.

చిన్నయ సూరి "అరుగ్వాదులకు 'తెంచు' అభ్యాగతి ననుప్రయుక్త మగు" వని తెల్పియుండెను. (క్రియా. 111.)

చెప్పి, అడిగి అను క్త్వార్థక రూపములపై 'పుత్తెంచు' అను శబ్ద పల్లవమును వాడుట కవిత్రయము వారి రచనలలోఁ గనఁబడు చున్నది ముద్రాపకులు కొన్ని చోట్ల నిట్టి రూపములను మార్చి వేసినారు.

"దమయంతి——కేశిని యను దానిం బిలిచి . బాహుకుం డను
వాఁ డెవ్వఁడో——వాని కడకుం బోయి యెఱింగి రమ్మని
పంచిన నది వోయి బాహుకుం గని దమయంతి నీ కుశలం బడు
గఁ బుత్తెంచె" (అర. ౨-185.) (ముద్రిత పాఠము)- వ్రాఁత ప్రతులలో "అడిగి పుత్తెంచె" "అడిగి రమ్మని పుత్తెంచె" అను రూపము లున్నవి.

నన్నయ భారతమునఎగఁద్రోచు, ఒడంబడు, తోడితెచ్చు, ఈడంబోవక, తడఁబడు, మిన్నక, తొడి, ఉఱఁడు, ఉఱక, ఉఱదె, మున్నగు రూపములు కానవచ్చుటచే నాతని కాలమునకు ముందు ఎగు, ఒడు, తోడు, ఈడు, తడు, మిన్ను, తొడు, ఉఱు మొదలైన ధాతువు లుండెనా యని సందేహము తోఁచుచున్నది. అట్లుండి నచో నతని నాఁటికి వానినుండి పుట్టిన కొన్నిరూపములు మాత్రమే మిగిలిన వని చెప్పవలయును. లేదా పైవాని యందలి కొన్నిటి నిష్పత్తి క్రమము నీ విధముగా నూహింప వచ్చును. ఎగఁద్రోచు-ఎగయు + త్రోచు. 'యు' లోపించు టచే నిది 'ఎగత్రోచు' అనురూప మేర్పడును. 'ఎగ' అకారాంతముగా నుండు టచే నిది తుమున్నర్థక మను భ్రాంతిచేఁ దరువాత నుగాగమమును సరళాదేశ మును గలిగియుండును. ఎగఁ ద్రోచు. ధాత్వాదులకు ధాతువు లను ప్రయుక్తము లగుటచే శబ్ద పల్లవ ధాతువులేర్పడును ఇప్పటి నాది శబ్దముచే శబ్ద పల్లవముల పూర్వాంగము ధాతువే యయి యుండవలె నను నియమము లేదు. అందుచే ఎగఁ బ్రాకు. ఎగఁద్రోచు మున్నగు వాని యందలి ఎగ - ఎక్కుట అను నర్థము గల అవ్యయమైన నై యుండ వచ్చును.

ఒడంబడు ఒడలు + పడు. అంత్య వర్ణము లోపముచే నొడఁబడు' అను రూప మేర్పడును. శరీరార్థకము లైన 'మే', 'మెయి' అనునవి 'కొను' ధాతు వను ప్రయుక్తము కా గా నంగీకారమును సూచించును. 'మే కొను', 'మెయికొను' సంస్కృతిమున 'అంగీకరించు' ఇట్లేర్పడినట్లు తోఁచును (అంగము = మేను) "మేకొను" సామ్యమున ఒడఁబడు పుట్టి యుండును.

"తోడి తెచ్చు" లోని "తోడి" సహార్థకమైన 'తోడ' లేక "తోడు" కావచ్చును. " తొడు " ధాతువునకును దీనికిని సంబంధము లేదు. "తోడు" నుండి తొడవు (నగ) అను కృదంత మేర్పడి యుండును.

తడఁబడు- తడయు + పడు. అంత్య వర్ణము లోపముచే " తడఁ బడు " అను రూప మేర్పడును ఆలస్యము చేయు, మాటలలో విలంబనము చేయు, పనిలోఁ దొట్రుపడు అనునవి దీని యర్థములు.

నన్నయ భారతమునందుఁ గనవచ్చు నన్నికాలము లందలి క్రియారూపములు నీ క్రింద నొసంగఁ బడుచున్నవి.

వర్తమాన కాలము :-

వర్తమానకాల క్రియాజన్య విశేషణములపై సర్వనామములను జేర్చుటచే వర్తమాన కాల క్రియారూపము లేర్పడుచున్నవి

ప్రథమ పురుష

| ఏకవచనము | | బహువచనము |
|---|---|---|
| వచ్చుచున్నవాఁడు | మహత్తు | వచ్చుచున్నవారు |
| వచ్చుచున్నది | మహతి | వచ్చుచున్నవారు |
| వచ్చుచున్నయది | అమహత్తు | వచ్చుచున్నయవి |

'చున్న'కు 'అది' పరమైనప్పుడు యడాగమము వచ్చిన రూపములే నన్నయ భారతములో హెచ్చుగా నున్నవి. అత్తునకు లోపము వచ్చిన రూపములు కూడ ముద్రిత ప్రతులలోఁ గొన్ని కానఁ బడుచున్నవి.

"వార్త యంద జగము వర్తిల్లుచున్నది." (స. ౧-50)

మధ్యమ పురుష

| | | |
|---|---|---|
| వచ్చుచున్నవాఁడవు | మహత్తు | వచ్చుచున్నవారలరు |
| వచ్చుచున్నదానవు | మహతి | .. |
| — | అమహత్తు | — |

అమహద్బహువచనమునకు మధ్యమపురుషలోఁ బ్రయోగములు కాన రాలేదు.

ఉత్తమ పురుష

| | | |
|---|---|---|
| వచ్చుచున్నవాఁడను | మహత్తు | వచ్చుచున్నవారము |
| వచ్చుచున్నదానను | మహతి | .. |
| .. | అమహత్తు | .. |

వచ్చుచున్నాఁడు, వచ్చుచున్నారు, వచ్చుచున్నావు, వచ్చుచున్నారు, (మధ్య.పు. బహువచ.) వచ్చుచున్నాను, వచ్చుచున్నాము వంటి రూపములు నన్నయ భారతములో లేవు.

భూతకాలము :-

భూతకాలమున క్రియారూపములు రెండు విధములుగా నేర్పడును

1. భూతకాల క్రియాజన్య విశేషణమునకు సర్వనామములు చేర్చుటచేత 2. ధాతువునకు భూతకాల ప్రత్యయములు చేర్చుటచేత

(ప్రథమపురుష)

| | ఏక. | | బహు. |
|---|---|---|---|
| (1) | వచ్చిన వాఁడు.<br>వచ్చిన అతండు | | వచ్చిన వారలు<br>వచ్చిన వారు |
| | వచ్చిన యది. | —మహతి— | వచ్చిన వారలు<br>వచ్చిన వారు |
| | వచ్చినయది | అమహత్తు | వచ్చినయవి |
| (2) | వచ్చెను (ఎను) | | వచ్చిరి (ఇరి) |
| | వచ్చెను (మహతి) | | .. |
| | వచ్చెను (అమహత్తు) | | వచ్చెను |

కను, విను, చెడు, పడు, మను మొదలగు ద్విలఘు ధాతువులకు 'ఎను' పరమగునప్పు డియుడాగమం బగు. వాని కది రావి రూపములు నన్నయ భారతములో మృగ్యములు.

మధ్యమ పురుష

| | | | |
|---|---|---|---|
| (1) | వచ్చినవాఁడవు | | వచ్చినవారలరు |
| | వచ్చినదానవు | (మహతి) | వచ్చినవారలరు |
| | వచ్చినదానవు | (అమహత్తు) | వచ్చినవారలరు |

ఒక్క 'వచ్చినవాఁడవు' అను రూపమునకుఁ దప్ప మిగిలిన వానికి నన్నయ భారతమునఁ బ్రయోగములు లేవు.

(2) వచ్చితివి (మహన్మమహత్యమహత్తులు) వచ్చితిరి.

ఏక వచన రూపము నందలి 'వి' వర్ణమునకు లోపము వైకల్పికము. వచ్చితి.

ఉత్తమ పురుష

| | |
|---|---|
| (1) వచ్చిన వాఁడను | వచ్చినవారము |
| వచ్చినదానను (మహతి) | వచ్చినవారము |
| వచ్చిన దానను (అమహత్తు) | .. |

(2) వచ్చితివి (మూఁడు వాచకములందు) వచ్చితిమి.

తద్ధర్మము :

ధాతువుపైఁ గొన్ని ప్రత్యయములను జేర్చుటవలనఁ దద్ధర్మ క్రియా రూప మేర్పడును. ఇవి భవిష్యదర్థమును గూడ సూచించును.

ప్రథమ పురుష

| ఏక | బహు |
|---|---|
| (1) వచ్చును – మహత్తు – వచ్చెడును } వచ్చెడివి } | { వచ్చుదురు, వత్తురు, వచ్చెదరు |
| వచ్చును – మహతి – .. | వత్తురు – వచ్చెదరు. |
| వచ్చును – అమహత్తు – .. | { వచ్చును, వచ్చెడును, వచ్చెడివి |

చు వర్ణంబు తోడి దుగ్గకారంబు తకారం బగును. ద్విత్వ చువర్ణము తోడి దుగ్ధకారము ద్విత్వ తకార మగును. వింటు సున్న మీఁది తురు, దురు ల లోని ఉకారము లోపించును (అనుభవింత్రు) అనుకొను. మున్నగు మ వర్ణాంత ధాతువులపై దురు – ద్రు – ద్రు గా మాఱు చుండును.

(2) తద్ధర్మ క్రియాజన్య విశేషణములపై సర్వనామములను జేర్చుట వలనఁ గూడఁ దద్ధర్మ క్రియా రూపము లేర్పడును.1

| | |
|---|---|
| వచ్చువాఁడు, వచ్చెడువాఁడు | వచ్చువారు, వచ్చెడువారు, |
| వచ్చెడు నది (అమహత్తు) | వచ్చెడునవి. (అమహత్తు) |

1. "నన్నయభట్ట భారతభాగ పద్యములలోఁ దద్ధర్మార్థకము లగు ఎడు, ఎడి,, అనువానితో నున్న రక్షించెడి, రక్షించెడు అను సంస్కృత సమ ధాతుజ విశేషణము లగపడవు" చింతామణి విషయ పరిశోధనము పుట 67.

మధ్యమ పురుష

వత్తువు - వచ్చెదవు. వత్తురు - వచ్చెదరు.

వీనిలోని వు వైకల్పికముగా లోపించును. వచ్చెదవు లోని వు లోపించి నప్పుడు దకారమున ఉత్వము కలుగును. వత్తు-వచ్చెదు. వు లోపించిన రూపములే ప్రాచీన తరములైనవి.

ఉత్తమ పురుష

(1) వత్తును - వచ్చెదను. వత్తుము - వచ్చెదము

దు, ఎద అను ప్రత్యయములతోఁ గూడిన యీ రూపములు భవిష్యత్తద్ధర్మార్థములందే కాక వర్తమాన, సాతత్య భూత తాచ్ఛీల్యార్థము లందుఁ గూడ వాడఁ బడుచుండును.

"ఏను జర యను రక్కసి విప్పురమున చదుకమును బాయ కుం
డుదు సంతతంబు" (సభా-౧-150.)

ముద్రిత ప్రతులలో "ఏమేమ, మున్ను పూజింపుదుమ రుద్రు-

విం దని వేడ్క" (అర. ౨-255) అని దు అను ప్రత్యయమునకు వెనుక నున్న చు- పు వర్ణముగా మాఱిన రూపము కనఁబడుచున్నది. నన్నయ కీ మార్పు సమ్మత మైనట్లు తోఁపదు. వ్రాఁత ప్రతులలో (మధ్యాక్కర) "ఏమేము, మున్ను పూజింతుమ రుద్రుని విం దని వేడ్క" "ఏమేము, మున్నుపూజింతుమ రుద్రు-విం దనుచు వేడ్క" అను పాఠములు కనిపించు చున్నవి. కాని వీనిలో మధ్యాక్కర లక్షణములు పరిపోవుటలేదు. 'ఏమేమ మున్ను పూజించె, దము రుద్రు, విందని వేడ్క అని సరిచేసినచో పద్య లక్షణమునకుఁ గాని నన్నయ భాషా ప్రయోగ విధానమునకుఁ గాని వైరుధ్యము సంభవింపదు. లేనిచో నొక యింద్ర గణము స్థానమున నన్నయ జగణము వాడె వని యనుకొన వలసివచ్చును.

(2) వచ్చు వాడను (మహత్తు) - వచ్చువారము
వచ్చుదానను (మహదమహత్తులు)
వచ్చుదానను

భవిష్యత్కాలము :-

భవిష్యత్కాల క్రియా రూపములకును దద్ధర్మ కాల క్రియా రూపముల కును అర్థమునందు భేద మంతగాఁ గన్పింపదు.

తు మున్నర్థక రూపమునకు కలానుబంధము చేర్చినచో భవిష్యత్కాల క్రియాజన్య విశేషణ మేర్పడును. దాని కీ క్రింది ప్రత్యయములను జేర్చినచో భవిష్యత్కాల క్రియారూపములు కలుగును.

| | | | |
|---|---|---|---|
| ప్రథమ. | దు- | మహత్. | రు (మహదమహత్తులు) |
| | దు- | (మహతీ. అమహత్) | రు |
| మధ్యమ. | వు- | | రు |
| ఉత్తమ. | ను- | | ము |

నన్నయ భారతమున కలఁడు. కలరు అనునవి భవిష్యత్కాల సూచకములుగాఁ గాక సామర్థ్యార్థ ద్యోతకములుగా వాడఁబడి యున్నవి.మఱియు నవి స్వతంత్రమైన యన్వయము కలిగి తుమున్నర్థకముల కవ్యవహిత పరముగాఁ గాక వేఱుచోట్ల వాడఁబడియున్నది.

"పరశురాముఁ డొండెఁ హరుడొండె నపుఁ డొండె
గాక యొరులు గలరె కర్ణునోర్వ
బలిమి భీముఁడొండె బలదేవు డొండెఁ గా
కొరులు నరులు శల్యు నోర్వఁ గలరె"

కేతన పలుకును, పలుకుదురు మున్నగువాని భవిష్యత్కాల క్రియలుగను, అడిగెడున్- అడిగెదరు మున్నగునవి వర్తమానకాల క్రియలుగను నుదాహరించెను. అతనిదృష్టిలోఁ దద్ధర్మకాలక్రియలు వేఱుగా లేవు. దీనిని బట్టి కలానుబంధమును భవిష్యత్తున వాడు నాచార మప్పటి కింకను స్థిరపడ లే దని తెలియుచున్నది.

భవిష్యత్కాల క్రియాజన్య విశేషణములకు ఈ క్రింది సర్వనామ రూపములను జేర్చుటచే నుత్తమపురుష యందలి క్రియా రూపము లేర్పడుచున్నవి.

| | | |
|---|---|---|
| మహత్తు | వాఁడను | వారము (అమహదమహత్తులు) |
| మహతి | దానను | |
| అమహత్తు | దానను | |

నన్నయ భారతమున ఈఁగలవాఁడను, కావంగలవారము, చేయంగలవారము అను కలానుబంధము తోడి రూపములు కనవచ్చుచున్నవి.

ప్రార్థనార్థకములు :—

ధాతువుల కేకవచనమున ము వర్ణకమును, బహువచనమున డుడ్డు ను జేర్చుటవలనఁ బ్రార్థనార్థక రూపము లేర్పడును. మువర్ణకమునకుఁ

గొన్నిచోట్ల లోపము కలుగును. ఈ ము ద్రుబ్జు లు చేరునప్పుడు చువర్ణాంత ధాతువుల చకారము పకార మగును. (అనుబంధ ప్రార్థన యోర్ణౌ వ్యతిరేకాది కేచ చోః పస్స్యాత్". క్రి. 15. అని చింతామణి )

ఉపసంహరింపుము; విస్తరింపుము

ఉపయోగింపుఁడు; ప్రసాదింపుఁడు

ప్రసాదింపుఁడు

ద్విత్వ చు వర్ణముతో ముగియు ఇచ్చు, తెచ్చు మున్నగు ధాతువుల చ్చువర్ణమునకు ముద్రుబ్జు లుపరమగునపుడు లోపముకలుగును. మువర్ణకమునకు ద్విత్వము వచ్చును. అనతిమ్ము; అనతిండు; పుచ్చు ధాతువు విషయమున నీ మార్పు కలుగదు. పుచ్చుము.

కొన్ని ధాతువుల ప్రార్థనార్థక రూపము లీ క్రింద నొసంగఁ బడుచున్నవి.

అగు – కమ్ము

పోవు – పొమ్ము – పొండు

కొను – కొమ్ము (కొనుము – కొన్ము – కొమ్ము) కొండు.

కాచు – కావుము.

చనుదెంచు – చనుదెమ్ము.

వచ్చు (వర్)– రమ్ము – రండు.

లేచు – లెమ్ము.

సైఁచు – సైపుము.

చెప్పు – చెపుము.

చూ, చుమ్ము, చూవె, చువ్వె అనునవి ప్రార్థనార్థమున వాడఁబడినవి. ఇచ్చట చూ అనునది ధాతువై యుండును. దానికి ము చేరఁగా ఊ హ్రస్వ మగుటయు, ము ద్విరుక్త మగుటయు సంభవించినది. ప్రార్థనార్థమున 'ఎ' అనునది చేరఁగా వ కారాగమము కలుగుటచే, చూవె అను రూపమును. ఈ హ్రస్వమై వ కారము ద్విరుక్తము కాఁగా చువ్వె అను రూపమును నేర్పడినవి చూ అనుచోట ము లోపించినది. సంప్రార్థనమున ము ద్రుబ్జు లకు-అ, ఆ, అమ్మ, అయ్య అనునవి చేరుచుండును. చెపుమ, నిశ్చయింపుమా, చెప్పు మయ్య, నిలువుండ, చెప్పుఁడయ్య, అయ్యా, అమ్మ, ఏ అనునవి చేరునప్పుడు ము వర్ణకమునకు వు వచ్చును. ధాతువు తుది ఉత్వ మత్వ మగును. చెప్పవయ్య

వినవమ్మ: ఒనర్పవే. ఆంధ్ర శబ్ద చింతామణిలో "సంప్రార్థనార్థకాదీత్" (క్రి. 43) అవి సంప్రార్థనార్థకముల మీఁద దీర్ఘమైన ఈ వచ్చునని చెప్పఁబడినది. దీనికి నన్నయ భారతమున నొక్కటే యుదాహరణ మున్నది. అది యైనను వ్రాఁత ప్రతులలో భిన్నముగాఁ గనఁబడుచున్నది.

"అన్నసాధకుం బిలిచి యెన్నండును వరునకు నంధకారంబునఁ
గుడువం బెట్టకుమీ యని పంచిన" (ఆది- ౫-227)

కుడువం బెట్టకు మని యనునది వ్రాఁత ప్రతులందలి పాఠము.

ధాతువునకు కుము, కుఁడు, కుండు చేర్చినచో వ్యతిరేక ప్రార్థనార్థక క్రియ లేర్పడును. ఈ ప్రత్యయములు పరమైనప్పుడు ధాతువు తుది ఉకారమున కకార మగును.

పెట్టకుము; ఏయ కేయకుము.

కేతన తోపించాకుము, పంచాకుము మున్నగు అకుమ్ ప్రత్యయముతోఁ గూడిన వ్యతిరేక ప్రార్థనార్థక క్రియలను విషేధించి యుండెను.

"దము" అను ప్రత్యయము చేర్చుట వలన ఉభయ ప్రార్థనార్థక క్రియా రూపము లేర్పడును. 'దము' లోని ద కారము ధాతువుల తుద నుండు చు,ంచు లతోఁ గలసి తకారముగను, 'చ్చు'తోఁ గలసి 'త్త' కారముగను మాఱు చుండును. పూజింతము, పుత్తము, ఉడిగింతము, తెత్తము.

ఉండె అనునది ఉండవిమ్ము అను నర్థమునఁ గనఁబడుచున్నది.

లాట్టు రుజ్జు నకు ద్రుతాంతములగు నెడు త వర్ణములగు ననియు, వాని ద్రుత మున కచ్చు పర మగు నపుడు మకార మగు ననియుఁ, జిన్నయ సూరి చెప్పి నాఁడు. (క్రి. 26-28)

కేతన ఆంధ్ర భాషా భూషణమున

"దీవెన కెడమయుఁ గాతయుఁ
గావుతయును దెనుఁగు కవుల కబ్బంబులలో
శ్రీ వెలిఁగెడ మధిపుఁడు మే
ల్గావించుం గాత మేలుగావుత యనఁగన్".

అని యాశీరర్థమున ఎడమ, కావుత, కాత అనునవి కలుగునవి తెల్పి యుండెను. ఈ పద్యమే ముద్రిత ప్రతులలోఁ బాఠభేదములతోఁ గానఁబడు చున్నది.

ముద్రిత భారత ప్రతులలో నాశీర్వార్థములందు ద్రుతాంతములైన ఎడు. త, ప్రత్యయములే కనఁబడుచున్నవి. చిన్నయ సూరి వ్యాకరణ సూత్ర మును బట్టి యవి యట్లు మాఱె ననియుఁ, బూర్వపు వ్రాఁత ప్రతులలో 'ఎద మవి' అను రూపములే కావి 'ఎడుమవి' అను రూపము లెక్కడను లే వనియు శ్రీ గిడుగు వేంకట సీతాపతి గారు త్రిలింగ రజతోత్సవ సంపుటమునఁ దెల్పి యున్నారు. (పుట- 666-667)

"అపాండవం బయ్యెద మవి....అట్లుగా నుండెద మని" (ఆది- ౧-52)
"నీకు సంజీవని పవిసేయ నుండెద మవి" (ఆది- ౩-132)
"నా యొద్దన యుండెద మవి" (ఆది- ౪-161)
"పునర్దర్శనం బయ్యెద మవి" (ఆది- ౫-136)
"ఉత్తముఁడై పొందెద మంచు" (ఆది- ౭-181)
"భవత్పునర్దర్శన మయ్యెద మరుగుం దవి"- (స- ౨-283)
"నీ యూరు యుగళంబు భగ్నం బయ్యెద మవి". (అర- ౧-103)
"నీ కీర్తి నిత్యంబై శబ్దబ్రహ్మంబు కలయంత కాలంబును
వర్తిల్లుచుండెద మని శిబికి వరం బిచ్చి" (అర- ౩-237)

అనునవి వా రిచ్చిన వ్రాఁత ప్రతులలోవి పాఠములు. ముద్రిత ప్రతులలో. పై యుదాహరణము లన్నియు 'ఎడుమవి' అను రూపముతోనే యున్నవి.

నన్నయ భారతమునఁ దద్ధర్మకాల ప్రథమ పురుషైకవచన రూపమునకు కాక చేర్చుటచేఁ గూడ నాశీరర్థము సూచింపఁ బడి యున్నది.

"నా చేత నుపదేశంబు గొన్నవారికిఁ బనిసేయుం గాక" (ఆది-౩-132)
కొన్నిచోట్ల 'ఎడు' వర్ణకాంతమైన తద్ధర్మ క్రియారూపము కూడ నా శీర ర్థమును సూచించుచున్నది.

"అవిలుఁడు పక్షయుగ్మము .... ... నీ కభీష్టముల్ ఘనముగఁ
జేయుచుండెదు జగన్నుత". (ఆది- ౨-56.)
"మన్మనోవిలయకు నీ ప్రమద్వరకు నిర్విష మయ్యెదు నేఁడు
మీ దయన్" (ఆది- ౧-148.)

"తద్ధర్మక్రియాజన్య విశేషణములపై అది, వాఁడు, వారు అను సర్వ నామములను చేర్చుట వలనను, తుమున్నర్థకములకు వలయున్ అను దానిని జేర్చుట వలనను విధ్యర్థకక్రియారూప మేర్పడును.

అనుష్ఠించునది- చేయువాఁడు.

రక్షింపవలయును- వర్జింపవలయును.

ఉండునకు విధ్యర్థమున 'ఉన్నది' అను రూపముకూడఁ గనఁబడుచున్నది. (ఉదాహరణము లిదివఱ కొసంగఁబడినవి). ఉండునకు 'ఉను' అనునది పూర్వరూపము. దానికి 'అది' చేర్చుటవలన 'ఉన్నది' అను రూపమేర్పడి యుండును. ఉనుచు (ఉండునట్లుచేయు) అను ప్రేరణార్థక రూపము కనఁబడు చున్నది. తుమున్నర్థకములపై వలవదు, చనదు, కాదు, రాదు అను వ్యతిరేకార్థక క్రియారూపములను జేర్చుటచే నిషేధార్థక క్రియ లేర్పడును.

( మసలవలదు: శోకింప వలదు; అవమానింపఁగారాదు; తప్పంజనదు; తీర్పరాదు.

నన్నయ భారతమునఁ గ్రియాపదములపై నే యే ప్రత్యయాదు లే యే యర్థములందుఁ జేరుచున్నవో యీ క్రింద సూచింపఁ బడుచున్నది.

| | | | |
|---|---|---|---|
| ఓ, ఓటు | సందేహార్థము | అరుగునో, | తలంచిరో |
| ఒకో, ఒక్కో | ఆశ్చర్యార్థము | ఎఱుఁగునొకో, | చేయునొక్కో |
| .. | ప్రశ్నార్థము | వినరొకో; | ఎఱుఁగనొక్కో |
| ఎ | ఆశ్చర్యార్థము | క్రమ్మరించునె యితఁడంచు | |
| ఎ, ఏ | ప్రశ్నార్థము | నియోగించితే, | ఒనరించితె |

ప్రశ్నార్థకైకారము పర మగునపుడు చను మొదలగు ను వర్ణాంత ధాతువు లందలి ఉకారము లోపించును- చనునే, చన్నే.

ఉండు ధాతువు ఉన్నె అను రూపమును గూడఁ బొందును.

ఉండునే; ఉను + ను + ఎ = ఉన్నె.

| | | |
|---|---|---|
| అయ్య | ప్రశ్నార్థము | అలుగుదురయ్య. పోలునయ్య. |
| ఏమి, ఏల | ప్రశ్నార్థము | ఏమితపం బొనరించితి (ఆది.౩-208) |
| ఏటికి, | ఏమిటికి | ఏలవృద్ధరాజు లెడపేసిరో (ఆది-౬-142) ఇన్ని దినములయ్యె నేటికి నా తోడ విభపురేశ పలుకవు- (స. ౨-92) |
| ఏమి | ఆశ్చర్యార్థము. | దుర్బుద్ధి యని యేమి చెప్పవలయు (అర. ౧-390). |

కా = కదా ప్రశ్నార్థము సమయాతిక్రమము సేయ సమకట్టరుగా
(అర- ౧-97)

కా— (ఇత్యర్థము) ఎప్పటి యట్ల కా వగచి (ఆది- ౭-208)
కా వగచి- (ఆది-౭-270)

దీని తరువాతఁ బెక్కుచోట్ల వగచు ధాతువే కనఁబడుచున్నది.

ఏవార్థక అకారము (తప్పక- బొత్తిగా)- మెచ్చఁడ; ఏను మీ దాన గావ; అగునకాదె.

కాఁదె, (కదా !)- ఆస్తీకుం డను బ్రాహ్మణుండ కాఁదె యుడిగించె
(ఆది- ౧-158.)

వ్యతిరేక క్రియలు :-

వ్యతిరేకార్థక క్రియా రూపములు సాధారణముగాఁ దద్ధర్మ మం దుండును. అ అనునది వ్యతిరేకార్థమును సూచించు ప్రత్యయము. ఇ పరమగు నప్పుడు ఇంచులోని చకారము వకారముగను చు వర్ణాంత ధాతువు లందలి తుది చకారము వకారముగను మాఱును. వ్యతిరేకార్థమున నీ క్రింది ప్రత్యయములు చేరును.

| | | | |
|---|---|---|---|
| ప్రథమ. | డు | (మహత్) | రు (మహన్మహతీ) |
| | దు | (మహతీ - అమహత్) | వు (అమహత్) |
| మధ్యమ పురుష: | వు | | రు |
| ఉత్తమ పురుష: | ను | | ము |

ఉదా: ఎఱుఁగఁడు-అలింపరు-చేయరు-జీవింప నేరదు - పోలదు - సమ కూరదు - చేయవు - ఎఱుంగన్. (ఏను) - విశ్వసింపము.

వ్యతిరేక తద్ధర్మ క్రియాజన్య విశేషణములపై వాఁడు, వారు మున్నగు సర్వనామములను జేర్చుటచేఁ గూడ వ్యతిరేకార్థక క్రియ లేర్పడును.

ప్రథమ పురుష : ఒల్లకున్నవాఁడు - లేవి యది.
మధ్యమ పురుష : తప్పని వాఁడవు.
ఉత్తమ పురుష : కదఁగ కున్న వారము.
వ్యతిరేక క్రియ యర్థత్రయ బోధకం బగును.
పలుకదు సఖులతో లలితాంగి అర—౨- 26. వర్తమాన.
నలుఁగాన మిచ్చనంబున అర—౨- 106 భూతము.

నలువ కాని నళినదళనేత్ర వరియింప దప్పె - అర్త - 52. భవిష్యత్తు. వ్యతిరేక తద్ధర్మ క్రియలపై 'అగు' ధాతు రూపము లనుప్రయుక్తము లగు చుండును.

ఒప్పదయ్యెడున్ - (వర్త-ప్రథమ) నమ్మనేర నయ్యెదను (వర్త-ఉత్తమ)
కానదయ్యె; పడదయ్యెన్ (భూత, ప్రథమ)
చేయరైరి; వారింపరైరి (భూత - ప్రథమ - బహు)
ఎఱుంగనైతిన్ (భూత - ఉత్తమ)
వృష్టి లేదవు (ఆది. ౪-249) (తద్ధర్మ ప్రథమ)

చిన్నయసూరి భూతంబున లజీ కి లిదర్థంబగు నగు ధాతు వనుప్రయుక్తమగు నని తెల్పెను. ఈ ప్రయోగములను బట్టి లిదర్థమైనదే కాక లాదర్థమైన అగు ధాతువు కూడ ననుప్రయుక్త మగునని తెలియుచున్నది. వ్యతిరేక క్త్వార్థకములపై ఉండు ధాతు రూపములు చేరుటచేఁ గూడ వ్యతిరేక క్రియ లేర్పడును.

పలుక కుండెన్ - మిన్నకుండిరి.

ఇప్పుడు యువర్ణాంతములుగా నున్న త్రోయు, మెఱయు మొదలగు ధాతువులు కొన్ని నన్నయ భారతమున చువర్ణాంతరములుగాఁ గనఁబడు చున్నవి.

భార్గవు నుద్యన్నయనములు మెఱచు చున్నను. (అర. ౩-177.)
మిన్న మిడుఁగురులై రెండు మెఱచు చున్న (అర. ౩-179.)
తృష్ణఁ బాతురు సుతుల్ (అర. ౧-25.)
గంగ మడువునఁ ద్రోపించె (ఆది. ౫-171.)

మెఱయు, కుఱియు, ఇఱుకు, మొదలగు ధాతువులు నన్నయ భారతమున నంతర్భావిత ప్రేరణములుగాఁ గనఁబడు చున్నవి.

ఖగేంద్రుఁ డిఱికికొని గగనపీథిం బఱచెన్ (ఆది. ౨-69.)ఇఱికించుకొని
పాండవ ధృతరాష్ట్ర సుతులు—తమ తమ విద్యల మెఱసి రెల్ల జనులు
మెచ్చి పొగడ -( ఆది. ౬-11.)మెఱయించి,
దేవర్షి గణంబులు వాతవి పయిం బుష్పవృష్టి కురిసి భీష్ముండని పొగడిరి.
కురియించి ( ఆది. ౪-190.)

ప్రేరణార్థమునఁ గొన్ని ధాతువులకు చు, ఇంచు అను ప్రత్యయములు చేరిన రెండు రూపములును గనఁబడు చున్నవి.

క్రమ్ముఱుచు - క్రమ్మఱించు

అమ్మదనాగ మెదిర్చి క్రమ్మఱించిన పరికాఁడ పోలె. (ఆది. ४-206.)

దీనిం గ్రమ్మఱింపు మనిన. (ఆది-౧-99.)

ధర్మనందనుఁడు గ్రమ్మఱిచెన్ యదువీర కోపముల్. (అర. ३-170.)

పూయు, కట్టు, తొడు, తొడుగు, ఉడుచు, ఏయు మొదలైన ధాతువులలోఁ దత్తత్కర్మ పదము లంతర్భావితములై యుండును. ఇవి సుప్రసిద్ధములై వాడుకలో నా ధాతువులతో సంతత సంబంధము కల్గి యుండుటచే వానిని జెప్పక విడిచినను అర్థావగతికి భంగము కలుగదు.

పొలుపుగఁ బూసి, కట్టి, తొడి భూరి విభూతి ప్రకాశితంబుగా - (ఆది. ౮-174.)

పాంచాల కౌంతేయు లొండొరులన్ మార్కొని యేయు నప్పుడు. (ఆది-౬-85.)

ఉడువను, గట్టను, దొడువఁ, బూయ ననుభవింపఁ గలుగు టది యేమి పురుషార్థ మయ్యొ (సభా. ౨-121.)

పల్కు, ప్రణమిల్లు, తొడఁగు, కడంగు, తలఁగు, విహరించు మున్నగు ధాతువులు నన్నయ భారతమున సకర్మకములుగాఁ గనఁబడు చున్నవి.

నృపతిఁ గన్యక యిట్లని పల్కెఁ బ్రీతితోన్ (ఆది. ४-172.)

పరాశర సుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్ (ఆది. 1-76.)

అగ్ని హోత్రమునకు నగ్నులు విహరింపుమని పంచి (ఆది. ౧-129.)

ఇచ్చట విహారము చేయు అను నర్థము కాదు. విభాగించు అను నర్థము చెప్ప వలెను.

నీవ కావె తలఁగితి దానిన్ (అర. ३-19.) (తొలఁగించితి)

దీని నంతర్భావిత ప్రేరణ మని చెప్పవచ్చును.

ఈ రెంటిలో నీ కెయ్యది యిష్టంబు దానిన కడంగుము. (అర. ౨-223)

కొను, పూన్చు మున్నగు ధాతువులు ద్వికర్మకములుగా వాడఁబడినవి.

కద్రువ గరుడుని వినతనుం బనులు గొనుచున్నంత (ఆ. ౫-47.)

రాజ్య భారంబంతయు భరతుం బూన్చి (ఆది. ४-108.)

చేయించు ధాతువు నముఖ్య కర్మమున కిప్పటివలెఁ దృతీయా విభక్తి కాక ద్వితీయా విభక్తియే కనఁబడు చున్నది.

విదితముగ విన్నుఁ జేయించెదఁ గ్రతువు (అర. ౩-189.) వీచే నవి యిప్పటి ప్రయోగము.

తుమున్నర్థకములకుఁ బదు ధాతు రూపములను జేర్పఁగా నేర్పడు కర్మణ్యర్థక క్రియా రూపములు నన్నయ భారతమునఁ బెక్కు కనఁబడు చున్నవి. తరువాతి కవుల గ్రంథములలో నిట్టి కర్మణి ప్రయోగము లంతగాఁ గనిపింపవు.

దానములను - బ్రహ్మచర్యములను బడయఁ బడిన పుణ్య ఫలము. (ఆది. ౧-71.)

వాఁడు తనయుం డనఁబడునే. (ఆది. ౩-199.)

ఒరుల చేతం జేయఁబడుటం జేసి నాకుఁ బాతకంబు లేదు. (ఆది. ౬-272.)

ధారుణి నట్టి యపూర్వ సభారచనలు వినఁగఁ జూడఁబడ వెవ్వరిచేన్ (సభా. ౨-139.)

తడయక ఘోర దర్శన సుదర్శన పావకుచే దహింపఁ గాఁబడి (అర. ౧-198.)

నన్నయ భారతమున తొట్టు ధాతువు యొక్క క్త్వార్థక రూప మొక్కటిమాత్రమే కనఁబడు చున్నది. దాని యితర రూపము లెచ్చటను బ్రయోగింపఁ బడియుండ లేదు.

హిమకరుఁ దొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండు భూపతుల్ (ఆది. ౧-14.)

భీముండు సింహబలుం దొట్టి సకల కీచకుల వధించుటయు. (ఆది. ౧-40.)

కొన్నిచోట్ల తద్ధర్మ క్రియలు భూతార్థమునను భూతకాల క్రియలు భవిష్యదర్థమునను వాడఁ బడినవి.

ఇట్లు సేయు నొక్కొ యిందుకులుఁడు (స. ౨-208.) చేసె నొక్కొ.

ఇందు లక్ష్య మెవ్వఁడేసె నాతని వరియింపు నెమ్మితోడ - ఏయు. (ఆది-౭-171.)

వలయు, పోలు అను ధాతువు లిప్పుడు తుమున్నర్థక రూపములపై సహ క్రియలుగా వాడఁబడు చున్నవి. నన్నయ భారతమున నవి స్వతంత్రముగాఁ దుమున్నర్థములకు ముందును వెనుకను గూడ వాడఁబడి యున్నవి.

సాధురక్ష వలయుఁ జేయ. (అర. ౧-30.)

ఒండొకపురి నుండఁగనేల వలసెఁ బురుహూతునకున్. (అర. ౪-76.)

దానిం దునియ నర్జునుండు బాణంబు నేయుటయు. (ఆది. 1-52)

నన్నయ భారతమున కలఁడు, కలరు, కలదు, కలవు అను స్వతంత్ర క్రియా రూపములు చూపట్టుచున్నవి.

నీవు బుద్ధి కలవేని వీరిని విడిచి - (అర. ౩-391.)

ఇది వడిగలదు మనసు కంటె గాడ్పు కంటె. (ఆది. 1-114.)

ఇవి 'కలు' ధాతువు నుండి యేర్పడినవి. ఈ ధాతువు కలిగియుండు నను నర్థమున వాడఁబడి యున్నది. చిన్నయ సూరి కలుగు నక స్త్యర్థంబు నందు లట్టు పరంబగు నప్పుడు కల యగునని చెప్పెను. (క్రియా. 104.)

పై ప్రయోగము లందుఁ 'గల' యస్త్యర్థమున వాడఁబడి యుండలేదు. అది సకర్మకము, వ్యతిరేకార్థక క్రియ లందు వలె వాని యందుఁ బ్రత్యయములకు ముందు అకారము కనఁబడు చున్నది.

నన్నయ వ్రాసిన యీ క్రింది క్రియల యర్థ మిప్పటి యర్థము కంటె వించుక భిన్నముగా గోచరించు చున్నది.

బంధించు నట్టి శక్తి యెట్టులయ్యె నీకు. (అర. ౪--108.) అగు = కలుగు.

విజయుండు నేను నయి - (అర. ౧-395.) అగు = కలయు-

అపాయంబు సేయంగా వగచి (అర. ౨-14.) కాన్ = కాఁబోలు నని;

వారిరుహ నేత్ర మదన ప్రేరితమై లజ్జ యురివి. (అర. ౨-42.)

ఉరివి = విడుచు; ఈ ధాతు విప్పుడు కానరాదు.

దుర్యోధనుండు దుష్కార్య మెత్తి (ఆది. ౩-12.) ఎత్తు = పూను.

గర్వంబు నొడిచి యున్నవాఁడ యుత్తముండు. (అర. ౩-260.)

ఒడుచు = విడుచు.

లోని సహజవైరి వర్గంబు నొడిచినవాఁడ యొడుచు వెలుపలి

యహితతతుల (ఆది-౩-206.) - ఒడుచు = ఓడించు.

ఈ ధాతువున కీ యర్థములం దిప్పుడు ప్రయోగము మృగ్యము.

పౌష్య మహాదేవిం గానక (ఆది. ౧-95.) కాను = కాంచు = చూచు.

అఱుచులకుఁ గానఁ గా దనవద్యా (ఆది. ౧-96.)
స్వయంవరం బను శబ్దంబు వినం గానక (అర. ౨-103.)
ఇచ్చట వినం గానక యనఁగా వినక యని యర్థము.
అనలాస్త్ర మట్లు వక్షముఁ గొనిన (అర. ౧-162.)
కొను = నాఁటు = కొట్టు.
మన మిప్పు డిద్వనంబునఁ బదుమూఁడు మానములు సలిపితిమి.
(అర. ౧-266.) చలుపు - కడపు.
ఆయుధంబులున్న వలనికి దృష్టులు సలుపుచు (స. ౨-250.)
చలుపు = ప్రసరింపఁ జేయు.
నాల్గు పర్వముల వినంగఁ జాలి (ఆది. ౧-51.)
చాలు = తగు = ఒప్పు.
మాంధాతృఁ డను నామంబు చేసిరి. (అర. ౩-203.) చేయు = పెట్టు.
వరుఁడు దక్కొన నేర్చునే తన్ను ముచ్చిలన్. (ఆది. ౪-79)
తక్కొను = పూనుకొను, తఱకొను అను ధాతువే సమీకరణముచేఁ
దక్కొను అను రూపమును బొంది యుండును.
జలధారావలి నెల్లం దత్తణంబ వట్టఁగఁ జేసెన్ (అర. ౪-67.)
వట్టు = శుష్కించు.
ఇప్పు డిది పోవు ధాతువుతోఁ గూడ వాడఁబడు చున్నది. వట్టిపోవు.
వలచు అనఁగాఁ గోరు - కామించు అను నర్థము లున్నవి.
ధర్మ హీనుండగు రాజును బ్రజ వలవదు. (అర. ౧-207.)[1]

నన్నయ భారతమున తుమున్నర్థకములపై దీని అమహద్వ్యతిరేక తద్ధర్మ రూపము తఱచు వాడఁబడు చుండును. (వలవదు) అచ్చట దీనికి రాదు, తగదు, అను విషేధార్థము కలుగును. ఈ వలవదే క్రమముగా వలదు, వద్దు అను రూపములను బొందినది.

నీ వారులకు నీ యమృతం బీ వలవదు. (ఆది. ౨-111.)
మీ యాన తిచ్చినట్ల మసల వలవదు. (ఆది. ౧-117.)
మసల నక్కఱ లేదు అను నర్థ మిచ్చటఁ గనఁబడు చున్నది.
ఈ పర్వత వివరము దెర్చి విగుర్వింపుము. (ఆది. ౬-273)

1. వలయు ధాతువునకు ఆవశ్యక మగు- విహితమగు వను నర్థము లున్నవి. -తక్షకుండను దుష్టోరగంబు సేసిన విఘ్నంబువలన నింతమసల వలసె (ఆది. ౧-117.) వలయు ధాతువునుండి యేర్పడిన వ్యతిరేకార్థక రూపములు లేవు అప్పుడు దానికి వలచు అగును. వలవదు అను రూప మిట్లేర్పడినదే. కోరు కామించు అను నర్థము కల వలచు ధాతువు దీనికంటె భిన్నమైన దని తోఁచుచున్నది. ఇది యకర్మకమైనది. వలచు (కోరు)సకర్మకము. "మీ యాన తిచ్చిన యట్ల మసల వలవదు" (ఆది. ౧-117.)

శ. ర. వ విగుర్వించు అనఁగాఁ విఱుచు + విఱుచు = చక్కఁగా విఱుచు అను నర్థ మొసంగఁ బడినది. ఈ యర్థము సమంజసము గాలేదు. అది దేశ్య క్రియ యనుట కూడ నాలోచనీయమే. సంస్కృతమున గుర్వీ అను ధాతువు ఉద్యమనే అను నర్థము నం దున్నది. ఉద్యమన మనఁగా నెత్తుట లేక ప్రయత్నించుట.

వించెన్ సుర దుందుభి నాదంబులు. (అర. ౨-217.) వించు = విని పించు. ఖినుచు అను రూపాంతరము కూడ నున్నది. "దివ్యవాణి దా వినిచె ధరాధి నాథునకు" (ఆ. ४-104.) ఇది విను ధాతువు ప్రేరణార్థక రూపము. )

నభశ్చర ముఖ్యులెల్ల నీ కరుణయ వేచి మండ్రు. (ఆది. ౨-46.)

వేచు = కాంక్షించు; ఇటనిది సకర్మకముగా వాడఁ బడినది.

అసమాపక క్రియలు :-

నన్నయ భారతము నందలి అసమాపక క్రియలకును నేఁటి గ్రంథము లందుఁ గాననగు నసమాపక క్రియలకును భేద మంతగాఁ గానిపింపదు. విశేష ములు మాత్రమే యిచ్చటఁ బేర్కొనఁ బడుచున్నవి.

ఉదంత మగు ధాతువే తద్ధర్మ క్రియాజన్య విశేషణముగాఁ గూడ వాడఁ బడును. అను, మను, విను అనువాని తుది యుత్వమున కొక్కొక్క ప్పుడు లోపము కలుగును. నన్నయ భారతమున అనులోని ఉత్వము లోపించిన రూపము లనేకము లున్నవి. లుప్త శేషములగు అన్, మన్ మున్నగునవి ద్రుత ప్రకృతికములు కావు. వాని తరువాతఁ బరుషములకు సరళాదేశము రాదు.

గిరివ్రజ మ న్పురంబులో - (స. ౧-118.)
అన్కొఁతురు (ఆది. ౩-66.)
అన్తెలంగు (ఆది. ౮-73.)

అన్- అనుదాని కచ్చు పరమగుచోఁ దుది నకారము ద్విరుక్త మగును.

అన్నిష్ట సఖి నూదియున్న దాని (ఆది. ౩-140.)

ధాతువునకు అన్ అను ప్రత్యయము చేర్చినఁ దుమున్నర్థక రూపము వచ్చును. దీనిపై మరల అగు ధాతు తుమున్నర్థకములైన కాన్, కన్ అనునవి చేరు చుండును.

"సర్వము నిర్వహింపఁగన్" (ఆది- ౨-9.)

"అమరారులచేఁ గ్రమ్మఱంగ నమృతము గొనియెన్" (ఆది- ౨-17)

"ఆత్మగుణోత్కర పరికీర్తనముఁజేయఁగా నుచితమె-(ఆది- ౨-113)

ఇచ్చట చేయఁగా ననఁగాఁ జేయుట యని యర్థము. ఇట్లు తుమున్నర్థక రూప ములు పెక్కుచోట్ల భావార్థమున విశేష్యములుగా వాడఁబడు చుండును.

"అమలిన తారకా సముదయంబుల నెన్నను ... విధాతృనకైనను
నేరఁబోలునే." (ఆది- ౧-19.) ఎన్నుటయని యర్థము.

"సుగతికిఁజనుఁగాక యేల శోకింపంగన్"- (ఆది- ౩-116)శోకించుట. చేదర్థక, తుమున్నర్థకరూపము లొక్కొక్కచో దానంతర్యార్థకములుగాఁ గూడ వాడఁబడు చుండును.

"పన్నిదంబు సఱచిన వినత యయ్యశ్వంబుదాసి". (ఆది- ౨-33)
చఱచిన యనంతర మని యర్థము.
"అయ్యిరువురుఁ బంపఁగాఁ బెఱికి యెత్తె ననంతుఁడు
తద్గిరీంద్రమున్" (ఆది-౨-10.)

భావార్థక రూపములు సముచ్చయ పరకములై ఆనంతర్యద్యోతకము లగును. అనుటయు = అనిన యనంతరము.

క్రియా రూపములకు ఏని అను ప్రత్యయము చేర్చినచోఁ జేదర్థక రూప మేర్పడును. ఈ ఏని యందలి తుదిఇత్వము కొన్నియెడల లోపించు చుండును.

"గురుభుజాండ నాకుఁ గూర్తేనిఁ జేయకు
మయ్య యిట్టి చెయ్వులనఘ" యింక- (అర- ౩-377)

తద్ధర్మార్థక విశేషణములకు నాఁడు అను పదము చేర్చినచోఁ జేదర్థక మేర్పడును.

"నీవు దీని కొడంబడవి నాఁడు రజ్జు విషాగ్ని జలంబులం
బ్రాణపరిత్యాగంబు సేసికొందు." (అర-౨-48.)
"రావి నాఁడు రండెఱింగి"- (అర- ౨-157.)

ధాతువులకు అకచేర్చినచో వ్యతిరేక క్త్వార్థకము లేర్పడును. ఇవి కళలు. వీని పైఁ గొన్నిచోట్ల ద్రుతము కనఁబడు చున్నది.

"ఆధారము లేకను సంతానచ్ఛేదంబున వ్రేలెదము." (ఆది- ౨-142)
"కాఱడవి పఱచు మృగముల నూఱడకన్ దిగిచి." (ఆది- ४-19.)

అవ్యయములు :-

కొన్ని విశేషణములకును, విశేష్యములకును కన్, కాన్ అను అగు ధాతు తుమున్నర్థక రూపములు చేరుటచే నవ్యయత్వము కలుగు చున్నది.

"రాజసూయంబు తిరంబుగా నొనరించి. (సభా-౧-84.) విశేషణ.
ప్రబోధించికొనియె బెడఁగుగ నంతన్- విశేష్యము.

కొన్ని విశేషణములకును, అవ్యయములకును దరువాత కన్, కాన్ అను తుమున్నర్థక రూపములకు బదులు నన్నయ సప్తమీ ప్రత్యయమైన 'నన్' అను దానిని జేర్చు చుండును.

"పాడి మొదవులను అగ్ని సాక్షికంబున నిచ్చిన." (ఆది- ౮-2)
"దీని ననుకూలంబున నుపయోగించి." (ఆది- ౮-239.)
"ఆనందముఁ బొంది నిర్భయమునన్ శయనింతురె" (ఆది- ౬-186.)
"ముందట నాసన్నంబునన్ గొలను గలుగ వలయు. (అర- ౩-313.)

ఏకాంతము, ప్రత్యేకము, ఏకతము. తథ్యము, మున్నగునవి అవధారణార్థక మైన అ ప్రయత్యముతోఁ గూడి అవ్యయము లగును.

'తథ్యమ సమకూరు భారతకథా శ్రవణాభిరతిన్.' (ఆది- ౧-15.)
'దాని కడకుఁ బ్రత్యేకంబ ధర్మ వాయువాసవాశ్వినుల్ ప్రీతులై
వచ్చి' (ఆది- ౭-258.)
"తాను నతఁడు నేకతమ యుండి" (ఆది- ౭-254.)
నా కారణమున ఋత్విజుఁ డే కాంతమ నరకగతికి నేగెను.
(అర-౩- 220.)

సుఖము, పరమార్థము. అను శబ్దములు యథాతథముగా నవ్యయములుగా వాడఁ బడినవి.

'జరయు రుజయు నెఱుఁగ కమర భావమున సుఖంబు జీవింతు
రచె' (ఆది- ४-158.)
'సుఖ మేగి వనంబున నుక్కి కష్టమే.' (ఆది- ౬-267.)
'హస్తి పురంబునకుం జని యందు సుఖంబుండి-(ఆది-౫-86.)

ఇట్టి చోట్లఁ దృతీయకుఁ బ్రథమా విభక్తి వాడఁబడిన దని యైనఁ జెప్పనగును.

'బహు యాగంబుల ఫలంబు పరమార్థ మగున్- (ఆది- ౧-18)
'విపుల ధర్మారంభ సంసిద్ధియగుఁ బరమార్థంబ యాశ్రమమున
(ఆది- ౧-71)

'పరమార్థముగా, నిజముగా నని యర్థము.'

మాత్రా శబ్దము విభక్త్యంతమై అవ్యయముగా వాడఁబడినది.

"వీని మాత్రకు నాలుగేన్ పాడికుఱ్ఱల నీఁడె" (ఆది- ౫-218.)
"ధ్యాన మాత్రన చేసి వేదములు సర్వ శాస్త్రములు ... చట్ట వచ్చి పొందె" (అర- ౩-204)

ఇహపరములను సంస్కృతావ్యయములను నన్నయ విశేష్యములుగా వాడి యుండెను.

'చెదు నిహముం బరంబు విది సిద్ధము గావుచెఱింగి- (ఆది- ౧-138)

ఉపమావాచక మగు పోలెన్ అను నవ్యయము సాధారణముగా నవధారణ సముచ్చయాంత పదముల మీఁదనే కనఁబడును.

'విలుకడ వడసిన క్రొమ్మెఱుంగుఁ దీఁగయుం బోలె' (అర- ౧-359.)
'నీవు మా చుట్టమవ పోలె నెమ్మితోడ' (ఆది- ౨-144.)
'పూర్ణ హిమ మయూఖుఁడ పోలెన్' (ఆది- ౩-125.)

పోలె అనునది అట్లు అనుదానిపైఁ గూడఁ గనఁబడుచున్నది.

"అభిహితంబగు శబ్దంబు నట్ల పోలె (ఆది- ౩-127)

ఆదిపర్వషష్ఠాశ్వాసము నందలి 206 వ పద్యమున 'విధమున పోలెన్' అను ప్రయోగమున్నది.

యథాశక్తి, యథాక్రమము మున్నగు నవ్యయీభావ సమాసములు నన్నయ భారతమున విభక్త్యంతములుగా వాడఁబడినవి.

అమ్మను లడిగిన యథాక్రమంబున సవిస్తరంబుగాఁ జెప్పందొడంగె (ఆది- ౧-77)

నేఁడు, అఁట, అంట అను పదములు వాడఁబడు చోట్ల నన్నయ అట్టె అను అవ్యయమును వాడి యుండెను. ద్విత్వ టకారము నందలి జడ్డకు లోప మగుటయుఁ గలదు.

నలువ కావి నలినదళనేత్ర వరియింప దట్టె - (అర- ౩-52)
అతఁడు మీకుం బ్రియ శిష్యుఁడటె అమిథ్యావచనా. (ఆది- ౫-240)

కాక అను నవ్యయము ఆశీశ్శార్థములందు క్రియల తరువాత వాడఁబడును.

నాచేత నుపదేశంబు గొన్న వారికిఁ బవిసేయుంగాక- ఆది- ౩-132.

కాక కాకేమి అను పదములు కదా, కాఁబోలు అను నర్థములందు వాడఁబడినవి.

అశుచి భావంబునం గాకేమి యప్పరమ పతివ్రత మదీయ
దృష్టిగోచరం గాకున్న దయ్యె (ఆది- ౧-97)
అతఁడు సుగతికిఁ జనుఁగాక యేల శోకింపంగన్. ఆది (-౩-116.)
చనుంగదా ; అని యర్థము.

న అను తద్ధిత ప్రత్యయము చేరఁగా నేర్పడు విశేష్యములు సప్తమ్యంతములై అవ్యయములుగా వాడఁబడును.

నీ యుక్కను బీరముఁ జూచెదఁ జక్కన నిలుమనుచుఁగడు
విజృంభించి వడిన్. (ఆది- ౬-203.)
అప్పోలఁతి వారి నల్లన పుట్టిన యప్పుడ. (ఆది- ४-150.)

ఇట్టి రూపములపై నొక్కొక్కప్పుడు అయి. అను క్త్వార్థక రూపము కూడఁ జేరుచుండును.

ఏగించెదఁ జక్కనై నిలుము (ఆది- ౬-294.)

కడు, చుట్టు, పల్మఱు అను శబ్దములు ద్రుతాంతములై యవ్యయము లగును.

ఈ యున్న పౌష్య ప్రోలికిఁబోయి కడుం బెద్ద దవ్వు వోయిన యట్లు.
(ఆది- ౧-116.)
విక్రమోర్జితుఁడయి దాని చుట్టు విడిసెన్ జతురంగ మహా
బలంబులతోన్- (అర- ౧-151)
నమ్మక పల్మఱుఁ జూచి (ఆది- ౮-77)

పెద్ద, తద్ద అనునవి యవ్యయములుగాఁ గూడ వాడఁబడును. అట్టియెడ వాని తరువాత సముచ్చయము చేరుటయుఁ గలదు.

"ప్రొద్దు నేఁడు పెద్ద వోయె". (ఆది. ౬-290)
"పెనఁగిన సుర భూరుహములఁ బెద్దయుఁ బెడఁగై "- (ఆది- ౨-70)
"కొండుక యయ్యును దద్ద గుణములందుఁ బెద్ద యయ్యె-"
(ఆది-౩-70)
"ఒక్కరున పుచ్చితిఁ దద్దయు వేడ్కన్" (అర- ౨-287)
"అయ్యిద్దరును దద్దయు సంతసిల్లి (ఆది- ౨-4)

"తరతరంబ" ను నవ్యయ మెప్పుడు నవధారణార్థక చిహ్నము తోడనే వాడఁబడును.

కద్రూ గర్భాండంబులు తరతరంబ యవిసిన. (ఆది- ౨-4)

కొన్నిక్రియల క్త్వార్థక రూపములు అవ్యయములుగా వాడఁబడినవి.

కడుకొని ప్రోయించె నురగ కాయోత్థితమై (ఆది-౨- 215)
"బెదరినట్లు కనుకవిన్ బఱచిరి. (ఆది- ౩-200)
ఇది యిట ద్రుతాంతముగాఁ గూడఁగనఁబడు చున్నది.
వేఁట నెపమునఁ గొనకొని కణ్వాశ్రమమునకున్ వచ్చి-
(ఆది-౪-73)
క్రోధ వర్ధితుండు గుఱుకొని తేజంబు దాల్చి-(అర-౧-222)
మీ యనురాగమునఁజేసి మిగిలి వెలింగెన్- (అర- ౧-8)
పదంపడి యేబండ్రు కూఁతులుం బుట్టిన. (ఆది- ౩-61)
తోడ అనునది వెంబడి యను నర్థమున వ్యస్తముగా వాడఁబడినది.
అగ్నిహోత్రములు బంధులు శిష్యులు తోడ రాన్- (అర-౧-11)
అంతలు, ఎంతలు, ఇంతలు అనునవి కన్నడమున నేకవచన రూపములు. అనుచిత విభాగముచేఁ దెలుఁగువారు అంత, ఇంత, ఎంత అను రూపములను గ్రహించినట్లు కనఁబడుచున్నది. ఇవి బహువచన లు ప్రత్యయముతోఁ గూడి విశేషణములుగా వాడఁబడినవి.

భార్యాసమేతుఁడై యున్నవాని కెంతలయ్యును నాపద లెఱుక పడవు
(అర- ౨-73)

ఇట్లు అనుదానిపై అని అను క్త్వార్థకముకూడఁ గనఁబడు చున్నది. నిక్కము వకు పీఠిలో నేదో యొక టున్నఁజాలును.

నాగపతుల నెల్ల నిట్లని స్తుతియించె (ఆది- ౧-103)

ఒండెన్, అను నవ్యయము పాక్షికార్థమున వాడఁబడును. ఇది ఒండు + ఏన్ = ఒండేన్ అనుదాని రూపాంతరము.

"పరశురాముఁ డొండెఁ హరుఁడొండె నరుఁడొండెఁగాక యొరులు
గలరె కర్ణు నోర్వ" (ఆది- ౬-203)

ఎల్లి, నిన్న, నేఁడు, ఎల్లుండి, అను కాలవాచకము లవ్యయములే అట, ఇట, ఎట, ఎక్కడ, అక్కడ, ఇక్కడ అనునవి కూడ నవ్యయములుగా వాడఁబడినవి.

ఏవి అనునది నన్నయ భారతమున వివిధార్థములందుఁ గనఁబడుచున్నది.

చేదర్థము :-

"గురుభుజాండ, నాకుఁ గూర్తేని". (అర- ౩-377)

"నీవు బుద్ధి గలవేని వీరిని విడిచి నీ ప్రాణంబులు రక్షించుకొనుము".

అయినప్పటికిని (అర- ౩-391)

"అది సంజీవితం బయ్యె నేనియు ...పరీక్షితుండు సంజీవి

తుండు గా నోపఁడు-" (ఆది. ౩-192)

"పగలుఁ గని పైచి రేనియు మృగకులంబుఁ గని సహింపరు

రాజులు-" (ఆది- ౫-55)

ఐతే- సంబంధార్థము :-

"నీ వెప్పుడేని నన్ను నప్రియంబులు వలుకు దప్పుడ నిన్నుఁ

బాసి పోదు". (ఆది. ४-149.)

ఐన- ఎవ్వరైన.

"ఎయ్యేనియు నొక్క- ధనుర్వేద విదుండైన బ్రాహ్మణు నపత్యంబు

లగు నని" ( ఆది.౫-188. )

"ఎద్దియేని నొక్క- యపూర్వం బైన దాని." ( సభా.౧-4. )

ఐనచో :- "ఇది మునికన్య యేని" ( ఆది.४-30. )

ఎడల-చో:- జరయు రుజయు దైవవశంబున నయ్యేనేని-" (ఆది.౩-193)

కూడ:- "అన్యుల న్మనమున నేనియుం దలఁప

అవధారణార్థము :-మిన్నకేనిఁ దపము సేయుచున్నయట్టు వలుక కున్నవాఁడు"

మిన్నకయ- (ఆది- ४-262)

ఏని అనుదానికి నేని యను రూపము కూడఁ గనఁబడుచున్నది.

"కచుండు నేనియున్ రాఁడు" (ఆది. ౩-112)

అందుల, ఇందుల అనువాని పైని, అప్పు డిప్పు డెప్పు డను వాని పైని, విభక్తి ప్రత్యయములు కనఁబడుచున్నవి.

ఉదాహరణము లిదివఱ కొనంగఁ బడినవి.

నన్నయ భారతమున మహి కి మెయి అనునదియు అన్యుఁడు అను దానికి అన్నుఁడు అనునదియు వికృతులుగా వాడఁబడినవి

పుట్టి మెయిఁ గృష్ణ ద్వైపాయనుఁ డనఁ బరఁగి (ఆది- ౩-45)

భవదీయ వంశపరిపాటి మెయిన్ (ఆది- ౪-118)
అసుర లగ్నుల పోలెన్ (ఆది- ౮-113)
సాయం ప్రాతలయందు వైశ్వదేవంబు సేసి-అనుచోట సాయంప్రాత లను ప్రయోగ మున్నది. (అర- ౧-31)

కొన్నిధాతువు లున్న వున్నట్లుగానే కృదంతము లగును. లేదా వానికి ఉ చేరిన దని చెప్పవచ్చును.

అదలు, చదువు, నుడువు, నోము, పట్టు, పలుకు, పోరు, బొంకు, కుంటు;
"కర్ణ గాంధారుల కలుపులు" (స. ౨-312)

కొన్ని ధాతువులకు అ చేర్చుట వలనఁ గృదంత రూపము లేర్పడును. నడు + అ = నడ; ఎండు + అ = ఎండ; ప్రయ్యు + అ = ప్రయ్య; పుట్టు + అ = పుట్ట; అడపు + అ = అడప.

"అ" వర్ణము చేరునపుడు ధాతువుల చివరనుండు సరళములు పరుషము లగును.

అలుగు + అ = అలుక; కడఁగు + అ = కడఁక; వండు + అ = వంట; ఎఱుఁగు + అ = ఎఱుక; వీఁగు + అ = వీఁక; ఓడు + అ = ఓట; పాడు + అ = పాట;

కొన్ని ధాతువులు కృదంతములుగా మాఱునపుడు వానియందలి తొలి హ్రస్వాచ్చు దీర్ఘ మగును. విను; వీను; మన్; మాను

కొన్ని ధాతువులకు అము అను ప్రత్యయము చేరును.

ఓడు + అము = ఓటము(సరళము పరుషమైనది) విక్కు + అము = విక్కము (విక్కువము రూపాంతరము.)

వ్యతిరేక భావార్థమున ధాతువులకు అమి అనుప్రత్యయము చేరును. తేజరిల్లు + అమి = తేజరిల్లమి; నేరు + అమి = నేరమి; కాను + అమి = కానమి; విను + అమి = వినమి; వెలువడు + అమి = వెలువడమి;

అమి చేరునపుడు ధాతువుల తుది చకారము ప కార మగును.

తలఁచు + అమి = తలఁపమి; రక్షించు + అమి = రక్షింపమి.

కొన్ని ధాతువులకు ఇ అను కృత్ప్రత్యయము చేరును.

ఈఁగు + ఇ = ఈఁగి;కుఱు = కుఱి-గుఱి; నో(నొప్పు) = నొప్పి. దీనికి నోవు, నొవ్వు అను రూపములు కూడఁ గలవు. భావార్థమునందు ట వర్ణ మగును.

దీనికి దు అనునది పూర్వరూపము. ఈ రెండును నన్నయ భారతమునఁ గాన వచ్చుచున్నవి.

"షడరత్ని ధనుర్ధరుఁ డె
య్యెడ నజితుఁడు గాన వాని హీనుంగాఁ జే
యుద్దు నాకుఁ జతుర్వర్గము = చేయుట
వడయుడు............" = వడయుట.

నాలవ పంక్తిలో వడయుడు అనుటకు వ్రాఁత ప్రతులందు వడయుట అను రూపము కానవచ్చుచున్నది.

"ఇది సిద్ధము గావు దెలింగి"- (ఆది- ౧-138.)

ఇది వ్రాఁత ప్రతులలో కావుదెలింగి అని వ్రాయఁబడియున్నది.

ఈ క్రింది ధాతువులకు పు అను ప్రత్యయము చేరుచున్నది. ఇది పర మైనపుడు కొన్ని ధాతువుల తుది వర్ణము లోపించును.

మోయు + పు = మోపు; కాను + పు = కానుపు; చూచు + పు = చూపు
తూఱు + పు = తూర్పు; పనుచు + పు = పనుపు = పంపు: త్రోచు + పు = త్రోపు- (స-౨- 41) తనర్పు + పు = తనర్పు (ఆది- ౨-10.)

కొన్ని కృత్ప్రత్యయములును అవిధాతువులకుఁ జేరుట వలన నేర్పడినరూపములును ఈ క్రిందఁ జూపఁబడుచున్నవి.

అలమరు + అట = అలమట (చింత)
వ్రందు, వందు + అఱ = వందఱ- "వచ్చి వ్రందఱ లాడెన్-"
(ఆది. ౨-100.)

కలుగు + ఇమి = కలిమి.
వ్రేలుచు + ఇమి = వ్రేలిమి.
తాలు + ఇమి = తాలిమి.
ఉను + కి = ఉనికి, ఉన్కి; పూను + కి = పూన్కి
మను + తల = మందల "ఆశ్రమంబున నోడించి సాల్వరాజు మందల విడిచి" (ఆది. ४-211) మనుగడతో లేక జీవనముతో విడిచి అని యర్థము. ఈ యర్థమున దీని తరువాత 'విడుచు' ధాతు వనుప్రయుక్తమై యుండునని శబ్దరత్నాకరము.

ము(న్)+తల్=(ముదల్) మొదలు.
చను+ప=చనుప (సార్థము).

పుట్టు+వు=పుట్టువు
కొలుచు+వు=కొలువు
నగు+అవు=నగవు
తగు+అవు=తగవు
కాను+ఇక=కానిక
పోవు+క=పోక
వచ్చు+(వర్)క=రాక
మఱచు + కువ = మఱకువ.
(అర. ౧-327).

ఉలియు+వు=ఉలివు
ఒప్పు+ఇదము=ఒప్పిదము

తద్ధితాంతములు :—

మతుబర్థమున 'అరి' యగును.

సూన+అరి=సూనరి. "ఒక్కొక్కని సూనరి వోలె వధించి"
(సభా- ౧-118).

జాల+అరి=జాలరి. "తనువు మీఁగ్రాల వల్చు జాలరిదాన"
(ఆది- ౩-40).

"నవర్ణకంబు గుణవచనంబులగు వల్లాదుల కగు" (తద్ధిత-౬).

వెల్లన; విన్నన; ఎఱ్ఱన; ఒయ్యన; చులుకన; అల్లన;

న వర్ణకంబు కొన్నిచోట్ల మతుబర్థంబున వాడఁబడియున్నది. 'ఒకా నొకచో మతుబర్థంబున న వర్ణంబు చూపఁబడెడి' (ప్రౌఢ. వ్యా. తద్ధి.19)

"ఇట్టి దివ్య తేజంబున వాఁ డధమాన్వయమునఁ బుట్టునె
చెపుమా" (ఆది- ౬-58) (దివ్యతేజము గలవాఁ డని యర్థము. 'దివ్య తేజము వాఁడు' వంటి ప్రయోగములు కూడఁ గానవచ్చుటచే న వర్ణము ఆగమముగా వచ్చిన దని చెప్పవచ్చును.)

చెవుడు మున్నగు వానికి మతుబర్థమున 'టి' వర్ణకం బగును. చెవిటి.

శబ్ద రత్నాకరమున దీనికి కన్నవిటి శబ్ద సామ్యమున చెవి+అవిటి అని పద చ్ఛేదము చూపఁబడినది. చెవుడునకు మతుబర్థమున 'ఇ' చేరిన దనియు అప్పుడు పరళము పరుషముగా మాఱిన దనియుఁ గూడఁ జెప్పనగును.

కఱ - కిఱటి

"కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే" (ఆది- ४-71)

'కఱటి' యనఁగా వంచకుఁడు-కిరినుఁడు అని యర్థము. 'కఱ' శబ్దమునకు నలుపు, మఱక అను నర్థములు శబ్ద రత్నాకరమున నీయఁబడినవి. 'కఱకు' మున్నగు శబ్దముల సామ్యమున దీనికిఁ గారిన్య మనియు నర్థము చెప్పనగును. అది కలవాఁడు 'కఱటి'.

చిన్నయ సూరి "మగటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యము" లని చెప్పెను. (తద్ధి-8).

దానిని బట్టి మగ + ంటిమి = మగఁటిమి అను రూప మేర్పడినది 'మగన్' శబ్దమునకు ఉపవిభక్తి యైన 'టి' చేరఁగా 'మగంటి' యైన దనియు దానికి 'మి' లేక 'ఇమి' అను తద్ధిత ప్రత్యయము చేరఁగా 'మగఁటిమి' యయ్యె ననియుఁ జెప్పవచ్చును.

'' ఉక్క + ఇస = ఉక్కిస (పొడిదగ్గు) (అ- ३-191).

"మతుబర్థమునఁ బుంస్త్వ-స్త్రీత్వములందు కా, కత్తియ వర్ణంబు లగు" నని బాలవ్యాకరణము (తద్ధి-11).

నన్నయ భారతమున కత్తె-కత్తియ ప్రత్యయములతోఁ గూడిన రూపములు కనఁబడలేదు.

తాపికాఁడు :- "తాన చోరులకుఁ దాపికాఁడై" (ఆది- ४-262).

పరికాడు :— "అమ్మదనాగ మెదిర్చి క్రమ్మరించిన పరికాఁడు వోలె" (ఆది- ४-202)

నేర్పుకాఁడు-కా- (ఆది- ౬-32)

కొఱ + ఁత = కొఱఁత; కొఱంత (స్వార్థము)

ముది + మి = ముదిమి; ముసలితనము, భావార్థము

ఒండు + టి = ఒంటి (అంత్య వర్ణమున కాదేశము)

"టి వర్ణకం బొండు నంత్యవర్ణకంబునకు భావంబునం దగు" (ప్రౌ. వ్యా. తద్ధి. 15)

నన్నయ భారతమునందలి యితర తద్ధితాంతములు:

పలుఁగుఁదనము - తనము - (ఆది- ३-203)

పేదఱికము- ఱిక (స- ౧-61)

నన్నయ విశేషణములు : వాక్య నిర్మాణ పద్ధతి :—

సాధారణముగా విశేషణము లేవైనను దెలుఁగున విశేష్యములకు వెనుకనే వాడఁబడుచుండును. సంస్కృతమున నట్లుకాక కవులు వానిని విశేష్యములకు ముందును వెనుకను గూడ యథేష్టముగా వాడుచుందురు. అన్వయ క్రమము చెప్పుకొనునప్పుడు విశేషణము లన్నిటిని ఒక్కచోఁ జేర్చి వాని తరువాత విశేష్యమును గూర్చుకొన వలయును. సంస్కృత కవుల వలె నన్నయ విశేషణములను విశేష్యములకు ముందును వెనుకను గూడ వాడుచుండును.

1. "వారిజభవనిభుఁడు లోకవంద్యుఁడు వచ్చెం
బారాశర్యుఁడు ధర్మశ
రీరుఁడు కృష్ణాజినోత్తరీయుఁడు ప్రీతిన్" (అర- ౧-272).

2. "పూరి చేతో రుచిరాబ్జబోధనరతుం డగు దివ్యుఁ బరాశరాత్మ జాం
భోరుహమిత్రుఁ గొల్చి మునిపూజితు భూరి యశో
విరాజితున్". (ఆది. ౧-22).

3. అతులశౌర్యుఁ డనిలతనయుఁ డమిత వాహినీ పదాహతి........ ........
భూనుతయశుండు (సభా- ౧-244).

నన్నయ తత్సమ విశేష్యములనదుమఁ గ్రియాజన్య విశేషణమునకుఁ దచ్ఛబ్దాను ప్రయోగము చేసిన విశేషణములను గూడఁ గూర్చుచుండును.

'సాంబుఁడు సాల్వచమూపతిన్
క్షేమవృద్ధి యనువాని నకృత్రిమ సాహసోద్దాముఁ దాఁకె' (అర- ౧-155)
'అతిప్రమాణతురగంబు నెక్కినవాని మహాతేజస్వి నొక్క
దివ్యపురుషుం గని' (ఆది- ౧-106).

ఒక్కొక్కప్పుడు తుది విశేషణము తరువాత భవత్యర్థము (అగు. అవు. ఔ. ఐన) చూపట్టు చుంచును. భవత్యర్థవ్యవహితములగు విశేషణములు ప్రథమా విభక్తిలో వాడఁబడును.

'విగతాఘుఁ డైన యా భృగునకు' (ఆది- 3-70)
'అతిరుచిరాగతుం డయిన యాతనికిన్ (ఆది- ४-17)

విశేషణములు భవత్యర్థ వ్యవహితములై యుండునప్పుడు విశేష్యము సాధ్య సమాసాంతర్గతమై కూడఁ జూపట్టుచున్నది.

'పరమేష్ఠి కల్పుఁడగు, నప్సరాశరు సమాగమమున' (ఆది- ३- 43)
'శంకరవిభుఁ డగు విప్రు భయంకరకోపాగ్ని యొక్కొ' (ఆది-౧-112)

భవత్యర్థకంబు సన్నిహిత విశేషణమునకును దానిముందు విశేషణంబుల 'కయి' పదంబును గానం బడును.

'అమల సువర్ణ శృంగఖురమై కపిలంబగు గోశతంబు' (ఆది- ౧-15)
'సాత్యవతేయ విష్ణుపదసంభవమై విబుధేశ్వరాబ్ధిసం
గత్యుపశోభితం బయి జగద్వితంబగు భారతీయ భా
రత్యమరాపగౌఘము..............' (ఆది- ౧-72)
'అనిల జవాశ్వయుక్తమయి...........' (స- ౨- 84)

కొన్ని చోట్ల సన్నిహిత విశేషణములకు భవత్యర్థకము చేరకుండుటయుఁ గలదు.

'ఆర్తిహరక్రియాభిరతుఁడై, కృత సన్నిధియై ప్రదక్షిణా
వర్త శిఖాగ్రహస్తముల వహ్ని' (ఆది- ౧-228)

సన్నిహిత విశేషణము లొండు రెండింటి 'కయి' పదానుప్రయోగంబును ముందు విశేషణములకు సముచ్చయార్థమును గనఁబడుచున్నవి. ఇట్టియెడ భవత్యర్థం బుండనే యుండదు.

ఉరుతర దావ పావక శిఖోత్కలిత శ్వసనంబులన్ సితే
తరగతి తీవ్ర తిగ్మకర ధామ సహస్రములన్ బహు ప్రవా
హ రహిత నిమ్నగాతతులునై కడు దీర్ఘములై నిదాఘ వా
సరములు సర్వజీవుల కసహ్యము లయ్యె........... (ఆది- ౮-230).

"అయి" పదాను ప్రయోగము లేనిచో విశేషణము లన్నిటికేనిఁ దుది విశేషణమునకేని సముచ్చయార్థము విభాషను ప్రయోగింపఁబడును.

'విపుల ప్రతాప సంభావిత శక్తిశౌర్యులు నపార విషోత్కట కోపవిస్ఫుర
త్పావక తాపితాఖిల విపక్షులు నైన మహానుభావులు. (ఆది- ౧-106).

సముచ్చయార్థము లేమికి:

'అతిమానుష మత్యద్భుత మతిదుష్కర మయిన కేశవార్జునకృతి',
(ఆది. ౮-318).

ఇట్టియెడఁ గొన్నిచోట్ల నాద్యవిశేషణమునకు మాత్ర "మయి" పదాను ప్రయోగము చూపట్టుచున్నది.

"కడుఁ జనువాఁడునై పురుషకారియు దక్షుఁడు నైన మంత్రి"
(స. ౧-31).

ధాతుజవిశేషణ వ్యవధానమున విశేషణము లన్నింటి'కయి' పదం బనుప్రయుక్త మగును.

"అనిన ననివృత్తులై పుణ్యచరితులై యాత్మప్రబోధ విహిత
చిత్తులై సర్వధర్మార్థ విదు లయి తృప్తిఁ దనరెడు రాజర్షి వరులకును.
(అర. ౧-134.)

ధాతుజ విశేషణ వ్యవధానమునఁ దుది విశేషణమున 'కయి'పదాను ప్రయోగమును ముందు విశేషణములకు సముచ్చయార్థమును గనఁబడు చున్నది.

"చారు సువర్ణ హాసి నవ చంపక భూషయు, సిందువార ము
క్తా రమణీయయున్, వకుళదామ వతంసయునై,.... ....
తన ముందట నున్న మాద్రి నంభోరుహ నేత్రఁ జూచి"
(ఆది. ౫-14.)

"ఘోర వికార సన్నిహిత కోప ముఖంబులు, దీప్తవిద్యుదు
ల్కా రుణ దారుణాక్షములునై ......రక్షరతి నున్న యుగ్ర
భుజంగముల రెంటిని గాంచి చెచ్చెరన్" - (ఆది. ౨-102)

భవత్యర్థకము గాని, 'అయి' పదాను ప్రయోగము కాని లేకయే పెక్కు విశేషణములు వాడఁబడు చుండును.

"పరమాస్త్రైక విశారదుల్, బలయుతుల్, పాంచాల కౌంతేయు
లొండొరులన్ మార్కొని." (ఆది. ౬-85.)

"పుత్త్రి వత్సలుఁడు మిత్ర వీర్యాత్మజుం డార్యుండుఁ ధృతరాష్ట్రుఁ
డాదరించి" (సభా. ౨-157.)

కొన్నిచోట్లఁ దుది విశేషణము తరువాత భవత్యర్థకమునకు బదులు 'నాఁ బరఁగి' అనునది కనవచ్చు చున్నది.

"ఆయుష్యం బితిహాస వస్తు సముదాయం బైహికాముష్మిక
శ్రేయః ప్రాప్తి నిమిత్తము....న్యాయైకాంతగృహంబు నా ( బరగి"
(ఆది. ౩-11)

"పరమ తపోనిధి యాయావర వంశోత్తముఁడు నియమ వంతుఁడు లోకో
త్తరుఁడు జరత్కారుఁడు నాఁ బరఁగిన ముని."
(ఆది. 3-138)

కొన్నియెడల విశేషణము 'ఐయి' పదాను ప్రయోగముతోఁ గూడి క్రియల తరువాతఁ గనఁబడు చున్నవి.

"శ్రీ మహాభారతాఖ్యా నాఖ్యామృత సూతి యొప్పు
నిఖిలాఘధ్వాంత విధ్వంసియై". (ఆది. ౩-21)

కొన్నిచోట్ల విశేషణమే క్రియాపదము స్థానమున వాడఁబడును. అప్పు 'డగు' ధాతువు నధ్యాహారము చేసి కోవచ్చును. అట్టియెడ విశేషణము లెప్పుడును విశేష్యము తరువాతనే వాడఁ బడును.

"పాలిత దుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు" (స. ౨-21)
ఇమ్మనుజేంద్రుఁ డింద్ర దనుజేంద్రుల కంటె మహా విలాస సౌఖ్యమ్ములఁ
బెద్ద". (స. ౧-7.)

కొన్నియెడల విధేయ విశేషణ మొక్కటే బహువచనాంత మయి పెక్కు విశేష్యములతో నన్వయించును.

"ఇది దక్షిణా పథంబున కిదియు విదర్భా పురమున, కిది కోసల కిద్ది
యుజ్జయినికిఁ దెరువులు." (అర. ౨-69.)

అది ప్రథమ విశేష్యము తరువాత వాడఁబడి యేకవచనాంతముగాఁ గూడఁ గనఁబడుచున్నది.

"పది దినంబులు భీష్ముఁ డాహవ భారకుండు, గురుండు పంచ దివసంబులు, గర్ణుడున్ దివసద్వయంబు, దినార్ధమం దుదిత తేజుఁడు శల్యుఁడు
(ఆది. ౧-67)

సాధారణముగా విశేష్యమునకు వలెనే విశేషణమునకును లింగ విభక్తి వచనము లగు చుండును. కాని కొన్నిచోట్ల విశేషణముల ద్వితీయాదులకుఁ బ్రథమా విభక్తి చూపట్టు చున్నది.

"ఆచార్యుఁడు ద్రోణునకు శిష్యుఁడ" - (ఆది. ౫-237)
"ధీరమతి విదురుతోఁడ విచారింతము". (స. ౨-124.)
"పరమమైన తీర్థంబు శ్రీ పర్వతంబు నందు దేవహ్రదం బాడి
(అర. ౨-276).

సర్వనామ సంఖ్యాభిధాన. తద్విశేష్యములలో ముందు ప్రయోగింపఁబడు -దాని ద్వితీయాదులకుఁ బ్రథమ కనఁబడు చున్నది.

"వీరుఁడు ధర్మజుండు పదివేవురు విప్రుల కొప్ప" (స. ౧-14.)
"పదునాలుగు వేలు గజంబులన్" (స. ౨-111)

వ్యస్తమై నప్పుడు 'సర్వ' పర్యాయమైన 'ఎల్ల' శబ్దము విశేష్యములకుఁ దరువాతనే ప్రయోగింపఁ బడును. అప్పుడు పూర్వ ప్రయుక్తములైన విశేష్యములకే ద్వితీయాది విభక్తులు గోచరించును.

"శుచులయం' దెల్ల నత్యంత శుచివై పాత్రులయం'దెల్లఁ బరమ
పాత్రుండవై పూజ్యులయందెల్ల నగ్ర పూజ్యుండవై. (ఆది. ౧-143)
"నాగ లోకంబున కెల్ల మహాక్షోభంబు గావించి" (ఆది. ౧-113)

మహ ద్విశేషణమైన 'ఎల్ల' కును, సంఖ్యా వాచకములకును గొన్నియెడల నమహత్కార్యము చూపట్టు చున్నది.

"పాత్రుల యం దెల్ల (పాత్రుల యం దెల్లరి యందు- అనుటకు")
బ్రాహ్మణు లతి పుణ్యు లెనిమిది వేలు సమిద్ధ మతులు యతులు పది 'వేలు.

"మూఁడు కోట్ల దానవులు" (అర. ४-55)

గుణవాచక ధాతుజ విశేషణములు కొన్ని యెడల నవయవ విశేష్య పూర్వకములై యవయవితో సమసించును.

"తనువు మీన్ పోలవల్చు జాలరి దాన" (ఆది. ३-40.) ధాతుజ.
"తల వడంకుచు నుండు తన పితృవరుల" (ఆది. ౨-151)
"ఒడలు తెల్లని తురగోత్తము వాలంబు" (ఆది. ౨-34.)

ద్వితీయాంత విధేయ విశేషణమునకుఁ బ్రథమ విభాష నగును.

"భయ రహితా దాని నెఱుఁగు బ్రాహ్మణ కులుఁగాన్ " (ఆది. ౨-60 )

"ఎవ్వనిం బ్రాకట ధర్మ తత్త్వ విదు బ్రాహ్మణ ముఖ్యుఁ బురో
హితుండుగాఁ జేకొను వారము " (ఆది. ౭-155.) ప్రథమ.

అగు ధాతు తుమర్థ రూపము లేకుండఁ గూడ విధేయ విశేషణములు కనఁబడు చున్నవి.

"ధూమకేతన హతిఁ జేసి చేసె నతి దాంతుఁ (భవజ్జనకు) గృతాంత
నికేతనాతిథిన్" (ఆది. ౧-125.)

విశేష్యము లందు మధ్యమ పురుష సర్వనామ మున్నను విషణము ప్రథమ పురుష యందే చూపట్టు చున్నది.

"అనుపమ శౌర్యవంతులు ననంత బలాఢ్యులు నీవు నీ జనా
ర్దనుఁడును సాంబచారణులు దర్పక వీరుఁడు నుండ- (అర. ౩-165)

స్త్రీ సమంబు లయిన విశేషణములయు ము వర్ణకాంత విశేషణములయు బహు వచనమున నేక వచనము కనవచ్చు చున్నది.

"కులిశ ధార లుత్కుంఠితం బయ్యె " (ఆది. ౨-81)

" గీతంబుల్ మహారమ్య మయ్యెన్ " (ఆది. ౫-127)

విశేషణములు కొన్ని యెడల విశేష్య లక్షకము లగును.

"దేవతల కప్రియంబులు కావించి మనుష్య లధమగతు లగుదు
రిలన్ " - (అర. ౨-50.) అప్రియములు = అప్రియ కార్యములు.

"దెప్పరములు పల్కఁగాఁ దగునె " (సభా. ౨-255)

దెప్పరములు = దెప్పరపు మాటలు.

కొన్ని అవ్యయములు విశేషణములుగా వాడఁ బడినవి.

"ప్రణమిల్లి కరంబు భక్తితోన్" (ఆది. ౧-76.)

" కరము నిరోధ మది " (ఆదిఁ ౨-76.)

నన్నయ ధాతుజ విశేషణములకుఁ దచ్ఛబ్దానుప్రయోగము చేసి వానిని విశేష్యముల తరువాత నధికరణాత్మకములుగా (appositional) వాడుచుండును. అతని రచనలో నిట్టివాని సంఖ్యా అధికముగాఁ గాన వచ్చును.

"అతని కూఁతురు సుకన్య యనునది ". (అర. 3-176.)

"ద్రౌపదేయులను బాంధవామాత్యులను సుఖసుప్తులైన
వారి వధించుటయు" (ఆది. ౧-51)

అట్టి, వంటి, బోటి, పోని అనునవి యౌపమ్యమును సూచించు విశేషణములుగా వాడఁ బడినవి.

ఇవి యెప్పుడు నుపమాన వాచకముల తరువాతనే ప్రయోగింపఁ బడును. అట్టికి ముందుండు నుపమానము షష్ఠీ విభక్త్యంతమై యుండును.

ఉదా: వాని యట్టి; తన యట్టి

వంటి, బోంట్లకు ముందుడు నుపమానములు ద్వితీయాంతములో షష్ఠ్యంతములో యై యుండును.

మీ బోట్లు; మిము బోంట్లు;
నీ వంటి; నిను వంటి;
"శృంగి య న్వాఁడు కార్చిచ్చు నట్టి శాపంబు నీ కిచ్చె"
(ఆది. ౨-180)

'కార్చిచ్చు వంటి' యని వ్రాఁత ప్రతులందలి పాఠము.

పోనికి ముందుండు నుపమానము ప్రథమాంతమై సముచ్చయార్థము తోడనో అవధారణార్థకము తోడనో కూడియుండును.

కొన్నియెడల సముచ్చయార్థకముపై మఱియొక ద్రుతంబును గానఁబడు చున్నది.

రెండవ మన్మథుండునుం బోని వాని నలుం గని (అర. ౨-33)
మనోజ రాజ్యలక్ష్మినిం బోని దాని (ఆది. ४-28)
తరుణ శశిరేఖయుం బోని దాని (ఆది. ४-47)
అనంత విలాసంబున జయంతుండ పోని దుష్యంతు నెఱింగి
(ఆది. ४-28)
వరుణేంద్రు దేవియ పోని దాని (ఆది. 3-140)
నాయకరత్నంబునుం బోని రాజమహేంద్రపురంబునందు
(ఆది. ౧-7)

కొన్నిచోట్ల నా యుపమానము ద్వితీయాంతమై యుండుటయుఁ గలదు. ఇచ్చట బోని యనఁగాఁ బోలిన యని యర్థము.

పృథివి బోని దానిఁ బృథ యను కన్యకన్ (ఆది. ౫-34)
తన్ను వోని దానిఁ దన్వి కోమలి (ఆది. ४-233)

వాక్యనిర్మాణము :-

నన్నయకుఁ బూర్వ ముండిన శాసనములలోఁ బెక్కు వాక్యములందు సమాపక క్రియ లేకుండె ననియు, నందు విశేషణములో తచ్ఛబ్దాను ప్రయోగ ముతోఁ గూడిన ధాతుజ విశేషణములో క్రియాకార్యము నొనరించుచుండె ననియు, "పాతకున్ను అగు అశ్వమేధంబున ఫలంబు అగు" మున్నగు వాక్యములలోఁ గనవచ్చు 'అగు' అను సమాపక క్రియను బట్టి యప్పు డప్పుడే సమాపక క్రియను వాడు నలవాఁ టేర్పడుచుండె ననియు నిదివఱకుఁ దెల్పఁ బడినది. నన్నయ భారతమునఁ గూడ సమాపక క్రియలు లేని వాక్యములు కొన్ని కానఁబడు చున్నను అతఁడు పెక్కు వాక్యములలో నగు ధాతు రూపము ననుబంధముగాఁ జేసి యా లోటు పూర్తిచేయుటకు యత్నించె ననియే చెప్పనగును.

అవసర మాప్తికున కయ్యె నిప్పు డంబుజనేత్రా (ఆది. ౨-218)
సర్వసంపదలు చేకొనఁగాఁ దఱి యయ్యె (స. ౧-97)
ఉత్తమ క్షత్త్రియుం డేల యొరుల నడిగి వేఁడు వాఁడగు
( అర. 3-365 )
ఈ సైన్య విరోధంబున కియ్యది నిమిత్తం బగునో యనిన
(అర. 3-80)
తమ చేసిన సమయంబు సలుపక యేల వచ్చువా రగుదురు
(అర. ౧-73)

'అగు' ధాతువు లేని ప్రయోగములు :-

ప్రకటిత భూత సంతతికి భర్తవు నీవ (ఆది. ౧-142)
ధర్మజు యువరాజుఁ జేసె రా జే నేమి సేయువాఁడ- (ఆది. ౬-100)
నిండు మనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణా
ఖండల శస్త్ర తుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీ
రెండును రాజులందు విపరీతము- (ఆది. ౧-100)
పాలిత దుర్జయుండు శిశుపాలుఁడు బాలుఁడు- (స. ౨-22)

యాగ శతంబు కంటెఁ బ్రయాగ నివాసము విశేషము- (అర. ౨-280)
హరి విషయాభిలాషము గారణముగ నెంత యెఱుక గల
వారును దుర్వార వికారముఁ బొందెదువారు (అర. ౧-32)

ఈ పద్యమునందలి వాక్యము కూర్పు "దీనికి వక్రమ్ము వచ్చువాన్డు ......... బారనాసి వేవురు పాఱ జమ్పిన వాన్డు" (రామేశ్వర స్తంభశాస.) అను శాసన వాక్యము నందలి కూర్పును బోలియున్నది.

స్వయంవరోత్సవంబు నపుడు చూడఁగనిన వారు దృష్ట
గనిన ఫలంబెల్లఁ గనినవారు. (ఆది. ౭-159) అనువాక్యము కూడ నట్టిదే.

కొన్నియెడల ధతుజ విశేషణ పూర్వకమైన విశేష్యమే క్రియా కార్యము నొవరించు చుండును.

ఇది నా చేసిన మర్యాద (ఆది. 4-271). ఈ వాక్యము కపిలేశ్వర పుర శాసనమునందలి "బెజయిత్త భటరళ విల్పిన దత్తి" యను వాక్యమును బోలి యున్నది.

ఏమి, ఏ అను ప్రశ్నార్థకములతోఁ గూడిన వాక్యములం 'దగు' ధాతు రూప మధ్యాహార్య మగుచుండును.

ఇదియంతయు నేమి, నా కెఱింగింపుండు (ఆది. ౧-117)
తత్కులం బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము
( ఆది. ౧-125 )
పరాఙ్ముఖ భావము పొందఁ బాడియే (ఆది. ౧-142)
దాశార్హుండు పూజార్హుఁడే (స. ౨-8)

ఇట నీ ప్రశ్నార్థకములు వ్యతిరేకార్థ వ్యంజకములుగాఁ గనిపించుచున్నవి. కొన్ని వాక్యములందుఁ దుమున్నర్థక రూపములే భావార్థక ద్యోతకములై విశేష్యముల వోలెఁ గర్తలుగా వాడఁబడుచుండును.

అమలిన తారకా సముదంబుల నెన్నను, సర్వ వేద శా,
స్త్రముల యశేష పారము ముదంబునఁ బొందను ... ...సము
ద్రము దఱియంగ నీదను విధాతృన కైనను నేరఁ బోలనే-

ఎన్నుట, పొందుట, ఈదుట అని యర్థము.

అచ్యుతు నర్చితుఁ జేయఁ బాడియే (స. ౨-10)
చేయుట యని యర్థము.

వరము లడుగు మిచ్చెద మీ మెచ్చు గడవ నగునె (అర. 3-279)

"మహద్బహుకర్తృకక్రియకు ఏకవచనము విభాష నగును" (ప్రౌ.వ్యా.)

తన యెఱిఁగిన యర్థం బొరుఁ డనఘా యిది యెట్లు చెప్పు మని
యడిగినఁ జెప్పని వాఁడును సత్యము చెప్పని వాఁడును ఘోర
నరక పంకమునఁ బడున్ (ఆది. ౧-136)

మహత్వమూహార్థక శబ్ద మమహత్కార్య యుక్త మయ్యును దాని విశేషణ క్రియలు మహత్కార్య యోగ్యములు విభాష నగును.

ముని నికాయ మెల్ల నతనిఁ బూజించిరి (ఆది. ౧-17)

గీర్వాణప్రభుఁ డాదిగ గీర్వాణగణంబు కాలకేయులతోడన్,
గర్వించి రణముసేసి రఖర్వ పరాక్రములు గడిమిఁ గడు నుద్ధతులై
(అర. 3-41)

ఆత్మార్థం బభిహితం బగునపుడు తల్లింగ సంఖ్యాభిధాయి వచనంబు ధాతు విశేషణంబుల కగును.

రాజ్యశ్రీ మనచేఁ గొని కౌరవుఁ డేమని తలఁచు నొకొ బుద్ధి నిష్ఠులు
దానున్ (అర. ౧-238)

తమ్ములుఁ దానును బాదచారియై (స. ౨-84)

నహార్థమున యుష్మ దస్మ దర్థంబు లభిహితంబు లగునపుడు క్రియలు తత్కర్తృకములు విభాషనగు.

"విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీ విషాదియున్"
విషాదితో నని యర్థము (ఆది ౨-63)

ప్రథమ మధ్యమ పురుషములకుఁ జెందిన పదములు కర్తలైనచోఁ గ్రియ మధ్యమ పురుషయం దుండును.

"మోహాంధుండు భీష్ముండుఁ గేశవః నీవుం గడగుండు నాకునెదురై"
(సభా. ౨-63)

ప్రథమోత్తమ పురుషములకుఁ జెందిన పదములు కర్తలైనచోఁ గ్రియ యుత్తమ పురుషయం దుండును.

"కవ్వడియును నేను భీముఁడు జయింతుము" (స ౧-63)

"మహానీరధిఁ గంటి నేను నమ్మాతలియున్" (అర. ౪-59)

ఉత్తమ మధ్యమ పురుషలకుఁ జెందిన పదములు కర్తలైనచోఁ గ్రియ యుత్తమ పురుషయం దుండును.

"ఏను నీవు నుపయోగింతము" (ఆ. ౬-223)

ఒక్కొక్కచో సమాస పూర్వపదము వ్యవహితోత్తర పదములతో నన్వయించు చుండును.

"రాహు కంఠము తెగి దేహము ధరణిఁ బడియె" (ఆది. ౨-19)

రాహు కంఠము తెగి రాహు దేహము ధరణిఁ బడియెనని యర్థము.

"ఒక్కొక కన్నును, చెవియును జెక్కను, జను, బొడ్డు, మూపుఁ జెలువగు చేయున్"

"బ్రక్కయు గుఱువును గాలును నక్కజముగ మనుజ శకలమై యుదయించెన్." (స. ౧-144)

"ఒక్కొక" అనునది ప్రతి విశేష్యము తోడ నన్వయించును.

'రాహు కంఠము తెగి' యను వాక్యమున 'తెగి' యను క్త్వార్థకము హేత్వర్థమున వాడఁ బడి యుండుటచే నదియును బడియెనను క్రియయును భిన్న కర్తృకములగుట సంభవించెను. లేనిచో నవి రెండును సమానాశ్రయములు కావలసినవే.

సంస్కృతమున యః సః, యత్,తత్, యావత్ తావత్, యదా తదా, యథా తథా అను సంబంధార్థకములతోఁ గూడిన వాక్యములు తఱుచుగాఁ గనఁబడుచుండును. అందు యదాది శబ్దములున్నచోఁ దదాది శబ్దము లొక్కొక్కతఱి నధ్యాహార్యము లగుచుండును. ఆంగ్లమున నీ యదాది శబ్దములకు (Relative Pronouns) అని పేరు. దానిని బట్టియే తెలుఁగున నట్టివానికి సంబంధ బోధక సర్వనామములను పేరు గలిగినది. తెలుఁగున నిట్టివానితోఁ గూడిన వాక్యము లధికముగాఁ గనిపింపవు. ఏది హృద్యమో అది నాకుఁ జెప్పు మనుట కిప్పుడు హృద్యమైనది చెప్పు మని మనము వ్రాయుచుందుము. పూర్వపు శాసనములలో "దేవి" "తేని." యనువానితో నారంభించు వాక్యము లంతములందు గనిపించును. ఇవి "స్వ దత్తాం పరదత్తాం వా యో హరేత వసుంధరాం" అని శాసనాంతములందు కనఁబడు శ్లోకమున కనువాదము లని

చెప్పఁదగినవి. క్రమముగా నిట్టి వాక్యములలో దేనికి బదులు "దీని" అను సర్వనామమును వాడుట పరిపాటి యైనది బాపట్ల తాలుకా చేఁబ్రోలు నందలి నాగేశ్వరస్వామి యాలయమునఁ గల యాహవమల్ల దేవుని శాసనములో (1008) "వేంగి నాటి కెవ్వరు రాజు లైరి వారుం బూర్వ్వ స్థితిం దప్పక పాలించువా రను సంబంధ బోధక సర్వనామములతోఁ గూడిన వాక్యమొకటి కనవచ్చుచున్నది. శాసనములందలి యిట్టి వాక్యములను, సంస్కృతమునందలి సంప్రదాయమును అనుసరించి నన్నయ సంబంధ బోధక సర్వనామములతోఁ గూడిన వాక్యములను గొన్నిచోట్ల వ్రాసియున్నాఁడు. అతని తరువాత నిట్టి వాక్యముల కూర్పు క్రమముగాఁ దగ్గిపోయినది.

"చదలఁ బక్షు లామిషం బెట్లు భక్షించు నట్లు దివిరి యెల్లవారును....
భక్షింతు రర్థవంతు-" (అర. ౧-27) యథా తథా
"ఎంత యోటువడిన నంతియ జూదంబునందుఁ దగులుఁ జలము
నతిశయిల్లు" (అర. ౨-62) యావత్ తావత్
"ఏవాని నెఱింగిన సర్వజ్ఞాన సంపన్ను లగుదు రట్టి మోక్ష ధర్మంబుల
చెప్పుటయు" (ఆది. ౧-56) యాని తాని
"నీ కభివాంఛిత మెయ్యది దానిఁ జెపుమ" (ఆది. ౧-109) యత్ తత్.
"ఏయది హృద్య మపూర్వం బేయది....అక్కథయ వినఁగ నిష్టము
మాకున్"(ఆది. ౧-109)

"సుందరి మా యిద్దరిలో నందెవ్వరి వలతు (వారి) చెప్పుమా యనవుడుఁ
బూర్ణేందు ముఖి చూచి మీలో నందెవ్వఁడు (అధ్యాహార్యము) వాడిచి
యొడిచె నతనిన వలతున్" (ఆది. ౮-110) యం తం.
"నాకు నీ వెన్నండేని నవమానంబు దలంచితి నాఁడ నిన్నుం బాసి
పోవుదు"(ఆది.౨- 154) యదా తదా
"నీ వెయ్యేని నొక్క వేల్పు నారాధించి తవ్వేల్పు నీ కోరిన పుత్త్రఫల
మిచ్చు". (ఆది. ౫-18)

ఎవ్వఁడు, ఎన్నఁడు మున్నగు వానికి ఏని నను నవ్యయము చేర్పఁ బడుచుండును. ఎయ్యేని అను శబ్దము ప్రయోగము కూడఁ గానవచ్చుచున్నది. కర్మణి ప్రయోగము తెలుఁగునకుఁ గాని యితర ద్రావిడ భాషలకుఁ గాని

సహజము కా దనియు, నది సంస్కృతానుకరణమునఁ దెలుఁగులోఁ బ్రవే శించె ననియు, నిది వఱకుఁ జెప్పఁబడినది. నన్నయకుఁ బూర్వపు శాసనము లలో నట్టి వాక్యములు నాలు గైదు కంటె నెక్కువ కనఁబడలేదు. నన్నయ సంస్కృత సంప్రదాయము ననుసరించి కర్మణ్యర్థకములైన వాక్యములను, అసంపూర్ణ వాక్యములను అచ్చ టచ్చట భారతమున వ్రాసియుండెను.

1 వాఁడు తనయుం డనఁ బడునే ? (ఆది-౩-199.)

2 ధృతరాష్ట్రి పట్టిచే సభఁ దలపట్టి యీడ్వఁబడి ' పాపకర్ముచేఁ బరి ధాన మొలువంగఁబడి (అర- ౧-136.)

3 దీనిఁ గాల్పఁ గడఁగి యెగువఁబడితి ముంద ఱింద్రు పంచిన మహా దారుణాంబుధరశతంబు చేత (ఆది- ౮-238.)

4 అం దెఱుఁగఁ బడిరేని వెండియుం బంద్రెండేండ్లు వనవాసంబు- (సభా- ౨-278)

5 ఉదుగక యొలువంగఁ బడియు మున్నపనీతమైన వస్త్రంబు నట్టి వలువ (సభా. ౨-231)

6 ఒరులచేతం జేయం బడుటం జేసి (ఆది- ౬-272)

7 ధారుణి నట్టి యపూర్వ సభా రచనలు వినఁగఁ
జూడఁ బడ వెవ్వరిచేన్ (సభా. ౨-139)

8 పరమ సుఖోపాయంబునఁ బర సంపద చేకొనంగఁ బడునేని (స. ౨- 142)

పడు ధాతువు నుప్రయుక్త మొనరించునపుడు కూడఁ దుమున్నర్థకమునకు మీఁద అగు ధాతు తుమున్నర్థక రూపమును జేర్చుట కలదు. (5 6) తుమున్నర్థకము మీఁద వాడఁబడిన 'పడు' ధాతువు తత్పూర్వ తుమున్నర్థక రూపములతోఁగూడ నన్వయించును. (8)

నన్నయ తరువాతి కాలమునఁ గర్మణ్యర్థక వాక్యముల వాడుక తగ్గినది. ఆధు నిక కాలమున నాంగ్లభాషా ప్రభావముచే నట్టి వాక్యముల రచన యధికముగా గోచరించుచున్నది.

కర్తృపదములకుఁ జేఁ జేత పర్ణకంబులు చేర్చి సంస్కృత త ప్రత్యయాంత రూపములను గూడ నన్నయ కర్మణ్యర్థమున వాడుచుండును.

"బ్రహ్మ చేత నను జ్ఞాతుండై" (ఆది.౧-30.)
"కర్ణుచేతఁ బ్రత్యాఖ్యాతుం డయి క్రమ్మఱి వచ్చుటయు".
(ఆది. ౧-42)
"శ్రీకృష్ణుచేతఁ బునర్జీవితుండైన పరీక్షితుని జన్మంబు." (ఆది. ౧-60)
"తక్షకుచేత నపహృత కుండలుండనై" (ఆది. ౧-117)

ఇచ్చటఁ గర్తృపదము సమాసపూర్వపదమైన త ప్రత్యయాంతముతో నన్వయించుచున్నది. ఇట్లు సిద్ధసమాస మధ్యగత పదములతోఁ దద్భిన్న పదముల కన్వయము గల ప్రయోగము లింకను బెక్కుచోట్లఁ గానఁబడుచున్నవి.

"బహు వేద ఘోషములఁ జేసి నిరస్త సమస్త కిల్బిషోత్కరు లగు చున్న ధన్యులు" (అర. ౧-)

"శుద్ధోదకంబులఁ బ్రక్షాళిత పాణి పాద కమలుండై" (ఆది.౧-97)
"ఆ ముచ్చు లారెకుల చేత ననుధావ్యమానులై"- ఇచ్చటఁ గర్మణ్యర్థమున శానచ్ ప్రత్యయము వాడఁబడినది. మన మిప్పుడు చు వర్ణముతోఁ గూడిన శత్రర్థకమును వాడుచోట నన్నయ తఱచు తచ్ఛబ్దానుప్రయోగముతోఁ గూడిన తద్ధర్మ క్రియాజన్య విశేషణమును వాడుచుండును.

"కుండలంబులం దేరంబాని వనంబులో నొక్కరుండ చనువాఁ డెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచువాని నొక్క దివ్యపురుషుం గని." (ఆది. ౧-93) = ఒక్కరుండ చనుచు అని యిప్పటి పద్ధతి.

"మిమ్ము వీడ్కొని చనువాఁడ నెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచువాని నొక్క దివ్యపురుషుం గని" (ఆది. ౧-117) వీడ్కొని చనుచు "సంతోషించి చనువాఁ డెదుట నొక్క జలాశయంబు గని"-
(ఆది. ౧-102)చనుచు.

"దేవలోకంబున కరుదెంచువా రెదుర ద్వాపరంబుతో వచ్చు కలిం గని" (అర. ౨-) అరుదెంచు.

కలఁడు, వలవదు, ఏయు ధాతురూపములు మున్నగు పదము లిప్పుడు తుమున్నర్థములకు వెనువెంటనే వాఁడబడుచుండును. నన్నయ భారతమున వీనికి వ్యవహితమైన ప్రయోగము కానఁబడుచున్నది.

దానిం దునియ నర్జునుండు బాణంబున నేయుటయు.(ఆది ౧-52.)
వలవదు పీని యింటఁ గుడువన్ మనకు (అర-౨-341.)
పితృ సంకల్పము సేయఁగ సుతుల కవశ్యంబు వలయు (స.౧-93.)
హరుఁ డొండెఁ నరుఁడొండెఁగాక యొరులు గలరె కర్ణు నోర్వ (ఆది. ౭-202)
నన్నయ రచనలోఁ బెక్కుచోట్ల సముచ్చయైవార్థకములు కానవచ్చు చుండును. అవి లేకపోయినను అచ్చట అర్థమునకు భంగముండదు.

> దుర్వాసుఁ డన్ సిద్ధమునియు వచ్చె (ఆది. ౫-17.)
> సత్యంబుతో సరియుఁ గావ (ఆది. ౪-95.)
> ఇట్టి చరితంబులు గలవుం గావున (ఆది. ౭-279.)
> అనఘ వినఁగ వేడ్కయైన యదియు (స. ౧-252.)
> అవినయ బుద్ధివై హరికి నర్ఘ్య మయోగ్యమ యంటి పీవు మూర్ఖవు.
> (స. ౨-24)

నన్నయ వచనములు క్త్వార్థకాదులగు నసమాపక క్రియలతోఁ గూడి యతిదీర్ఘ ములైన యేకవాక్యములుగా నుండును. అతఁ డిట్టి వాక్యములలోనే మధ్యమధ్యఁ బ్రత్యక్ష వచనములను (Direct Speech) జొప్పించు చుండును. ఈ ప్రత్యక్షవచనములు మాత్రము పలుచోట్ల నలఁతియలఁతి వాక్యములతోఁ గూడి ముద్దు లొలుకుచుండును. వాక్యాంతములందు విరమణ చిహ్నములు లేని కత మున నచ్చు పరమైనప్పుడు సంధియో యడాగమ నగామములో కలుగు చుండును.

1. అని కద్రువ వినతం జూచి "చూడవె యల్ల యతి ధవళంబైన యశ్వంబునందు సంపూర్ణచంద్రు నందు నల్లయుం బోలె వాల ప్రదేశంబునందు నల్లయై యున్నయది"యనిన విని వినత నగి "నీ వే కన్నులం జూచితే యక్కఁ యెక్క డిది నల్ల. యీ యశ్వరాజ మూర్తి మహాపురుష కీర్తియుం బోలె నతినిర్మలంబై యొప్పుచున్నయది" యనిన విని నవ్వి వినతకుఁ గద్రువ యిట్ల నియె. (ఆది. ౨- 31.)

2 మాండవ్యుండను బ్రహ్మర్షి తొల్లి మహీవలయంబునం గల తీర్థంబు లెల్ల నేకచారి యయి సేవించి యొక్క నగరంబున కెడగలుగు నడవిలో నాశ్రమంబు గావించి తద్ద్వార వృక్షమూలంబున నూర్ధ్వబాహుం డయి మౌనవ్రతంబునం దపంబు సేయుచున్న నన్నగరంబు రాజు నర్థంబు ద్రుచ్చిలి

కొని ముచ్చు లారెకులచేత ననుధావ్య మాను లైమాండవ్యు సమీపంబునం బాఱి యయ్యాశ్రమంబులోఁ డాసిన వారి వెను దగిలి వచ్చిన యారెకు లమ్మునిం గని రాజధనాపహారులైన చోరులు నీ యొద్దన పాఱి రెట వోయి రెఱుంగు దేనిఁ జెప్పు మనిన నమ్ముని మౌనవ్రతుండు గావునఁ బలుకకున్న నయ్యా శ్రమంబులోఁ జొచ్చి వెదకి ధనంబుతోడ నా ముచ్చులం బట్టికొని.

(ఆది. ౪-261.)

వచనములో ముగియని వాక్య మొక్కొక్కప్పుడు తరువాతి పద్యము లోనికిఁ గొనసాగుట కనిపించును.

వ. "చ్యవనుండు నాఁ బరఁగె నమ్ముని కుమారుని.
కం. సముదిత సూర్య సహస్రోపమ దుస్సహతేజు జగదుపప్లవసమయా
సమదీప్తి తీవ్రపావక సముఁ జూచుచు నసుర భస్మసాత్కృతుఁ
డయ్యెన్" (ఆది. ౧- 131.)

నన్నయ తనకుఁ బూర్వమం దున్న శాసనములను, గన్నడ వాఙ్మయమునందలి కావ్యములను ఆదర్శములుగా గ్రహించి తత్సమ పద బహుళమైన రీతి నవలంబించెను. అతని రచనలోఁ జిన్నవియుఁ బెద్దవియు నైన సిద్ధసమాసము లధికముగాఁ గనిపించుచుండును. " అఱపొఱడు కుఱుచ చేతులు " వంటి అచ్చిక సమాసములు కూడ లేకపోలేదు. కాని వాని సంఖ్య చాలఁ దక్కువ. (నన్నయ కవిత యందలి దేశి లక్షణము లను భాగమున వివరము లొసంగఁ బడెను ) నన్నయ యిది యేమి నిమిత్తంబు (ఆది. ౨-163) అను దానిని బహువ్రీహి సమాసమువలె వాడియుండెను. ఏమినిమిత్త మనఁగా = ఏమి కారణము కలదని భావము. కాని యీ సమాసము కూర్పు వ్యాకరణ సమ్మతమైనది కాదు."అందు కేమి నిమిత్త" మని యర్థము చేసికొనవలయును. " ఏమి తెఱంగు " అనునది కూడ నిట్టిదే.

నన్నయ భారతమున కవిల గద్దము, కవిల జడలు అను సమాసములు కనఁబడు చున్నవి. చిన్నయ సూరి కపిల గద్ద మనింద్య గ్రామ్య మని సూచించెను. నన్నయ వాడిన యీ సమాసము ప్రాస స్థానమున నున్నది. అచ్చటఁ గపిలశబ్దభవ మైన కవిల రూపమే యుండవలయును. చిన్నయ సూరి ప్రాసవిషయమును గమనింపక వి-పి యనుకొని యీ సూత్రమును గావించి యుండును.

" అవసరజ్ఞుం డయి వ్యాసుఁ దేతెంచె నంత నత్తపసి
కవిల గడ్డంబును గవిల జడలును గవిల కన్నులను
దవిన యన్నువ నల్లనైన దీర్ఘపుం దనువును జూచి".... (ఆది. ४-253)

'సుర కరువలి' యను సమాసమునందలి సుర శబ్దము దేశ్యమే కాని సంస్కృతము కాదు. (సుర. ఉభ. దే. వి. గాలిసుడి శ. ర.) నన్నయ 'కటకంర' శబ్దము నొకచో వాడెను. (అర- ౧-32) [కటకంరా షమియింపుము] ఇది అవింద్యగ్రామ్య మని చిన్నయ సూరి చెప్పియుండెను. ఇది గర (శ) కంఠ శబ్దభవ మని ప్రౌఢ వ్యాకర్త యభిప్రాయము (సంజ్ఞా 19). ఈ యున్న పౌష్య ప్రోలికి (ఆది. ౧-118) అనుచో 'ఈ యున్న' అను సమాసమునందలి 'ఈ' యను నిర్దేశవాచకము ఈ సమీపమున అను నర్థము నొసంగుచున్నది.

ఈ విధముగా నన్నయ తనకుఁ బూర్వము శాసనములందును దనకాలమున శిష్ట వ్యవహారమునందును గల ప్రయోగముల బాగుగాఁ బరిశీలించి యుచితములును శ్రుతిసుభగములు నని తోఁచిన వానిని గ్రహించి యట్లు లేని వానిని బరిహరించి, సంస్కృతమునుండి బహు శబ్దములను గ్రహించి, వానిని దెలుఁగున వాడుట యెట్లో నిశ్చయించి భారత రచనమునకుఁ బూనుకొనెను. ఈ పని మహాప్రతిభా వంతులకుఁ గాని యన్యులకు సాధ్యమైనది కాదు. ఈ కార్యమున నన్నయ చూపిన సామర్థ్యమే యతని "విపుల శబ్దశాసన" బిరుదమున కర్హునిఁ గావించెను. అతఁడు కావించిన ప్రయోగములు శ్రవణానందములును లాక్షణికములు నై తరువాతి వారికిఁ బరమ ప్రమాణము లయ్యెను. అందుచేతనే

"ఆ మూఁడు పర్వములలో
నా మాన్యుఁడు నుడువు తెలుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్క సు
ధీమణి మొదలైన తొంటి తెనుఁగు కవీంద్రుల్." (అప్ప. పీఠిక. 47)

## 12. నన్నయ భారతము నందలి ఛందస్సు :

నన్నయకుఁ బూర్వము తెలుఁగున మాత్రాగణ బద్ధములై పండితారాధ్య చరిత్రమునఁ బాల్కురికి సోమనాథునిచేఁ బేర్కొనఁ బడిన పదముల వంటి పదము లుండి యుండవచ్చు ననియు, మధ్యాక్కర, తరువోజ, సీసము, ఆటవెలఁది, మొదలైన జాత్యుపజాతి వర్గములకుఁ జెందిన పద్యములు విరివిగా నుండెడి వనియు, క్రీ. శ. పదవ శతాబ్ది నుండి యక్షరగణబద్ధము లైన చంపకోత్పల మాలాది వృత్తములు కూడ నందు వ్రాయఁబడుచుండె నని కామసాని గూడూరు శాసనము వలనను (క్రీ. శ. 1000), కందము కూడ వాడుకలో నుండె నని "ప్రబంధ రత్నావళి"లో సర్వదేవాదులవిగా నుదాహరింపఁబడిన పద్యముల వలనను, దెలియుచున్న దనియు, నన్నయకుఁ బూర్వ మందలి ఛంద స్సను భాగమునఁ జెప్పి యుంటిని. భారత రచన కారంభించుటకు ముందు నన్నయ వ్యవహార మందును దనకుఁ బూర్వ మున్న శాసనము లందును గల దేశ్యపదములకు స్థిరమైన రూప మొసంగియు, సంస్కృత పదములను దెలుఁగున వాడు కొనుటకుఁ దగిన నియమము లేర్పఱిచియుఁ బద సంపదను జేకూర్చుకొన్నట్లే మహాకావ్య రచనోపయోగ్యమైన ఛంద స్సంపదను గూడఁ జేకూర్చు కొన వలసి వచ్చెను. ఈ విషయమున నతనికిఁ గన్నడ భాషలో నంతకుఁ బూర్వమే పంపాదులచే రచింపఁ బడిన విక్రమార్జున విజయాది కావ్యములు మార్గదర్శకము లయ్యెను. కన్నడ కవులు సంస్కృతము నందలి మత్తేభ శార్దూలవిక్రీడితాది వృత్తములను గ్రహించి యందుఁ దమ భాషకు సహజమైన ప్రాస నియమమును జేర్చి కావ్యము లందు వాడుకొని యుండిరి కన్నడమున నవర్ణ యతి నియమమును బాటించు నాచారము లేమిచే నా విషయమున సంస్కృత వృత్తములకును వారి వృత్తములకును భేదమే కానిపింపదు. కొన్నిచోట్ల వారు సంస్కృత వృత్తముల పేర్లుమార్చి వానికిఁ గ్రొత్త పేర్లుపెట్టియుండిరి.సంస్కృతమున 'మానిని, కవిరాజ విరాజితము, మత్త కోకిల, అంబురుహము' అను నామములతో నున్న వృత్తములు వారి కావ్యములలో వరుసగా 'మంజరి, హంసగతి, మల్లికామాల, నాగరంజిత' యను పేర్లతోఁ గానఁ బడుచుండుటయే యిందుకుఁ దార్కాణము.

నన్నయయు నా కాలము నందలి యితరకవులును గన్నడ కవుల మార్గములఁ ననుసరించి సంస్కృతము నుండి వృత్తములను గ్రహించి వాని యందుఁ

దెలుఁగు ఛందమున కనుగుణముగా యతి ప్రాసలను జేర్చి రచన చేయఁ దొడం గిరి. మానిన్యాదు లగు వృత్తములను నన్నయ కన్నడ కవులు పెట్టిన క్రొత్త పేర్లతోఁ గాక సంస్కృత మందలి పూర్వ నామముల తోడనే వ్యవహరించి యుండెను.

పంప భారతము నందలి యీ క్రింది పద్య సంఖ్యను గమనించినచో నతఁడు సంస్కృతము నుండి యెన్ని వృత్తములను గ్రహించెనో యెన్ని దేశీయ పద్యములను వాడియుండెనో వ్యక్తము కాఁ గలదు.

| | | | |
|---|---|---|---|
| శార్దూల విక్రీడితము | 17 | తరళ | 8 |
| మత్తేభము | 204 | మహా స్రగ్ధర | 7 |
| ఉత్పలమాల | 140 | పృథ్వీ వృత్తము | 2 |
| చంపకమాల | 409 | మాలిని | 2 |
| మల్లికామాల | 8 | ద్రుత విలంబితము | 1 |

ఇవి గాక హరిణప్లుత ఖచరప్లుతములు, హారిణి, శిఖరిణి, మందా క్రాంతము, మున్నగు నితర వృత్తములు కూడ నందుఁ బ్రయోగింపఁ బడినవి. మాత్రా గణములతోఁ గూడిన జాత్యుప జాతులలోఁ గందము నాతఁడు చాల విస్తారముగ వాడి యుండెను. పిరియక్కర (9), ఉత్సాహము (1), అక్కర (2), రగడ (3) మున్నగు నవి కూడ నందందు గోచరించును.

దీనిని బట్టి పంపకవి తన కావ్యమున దేశీయ పద్య భేదముల కంటె సంస్కృతము నుండి గ్రహించిన వృత్త భేదములనే హెచ్చుగా వాడి యుండె నని తెలియుచున్నది. నన్నయ కూడ విస్తృ సీసము, కందము, ఆట వెలఁది, తేటగీతి, మధ్యాక్కర, తరువోజ, మున్నగు మాత్రా ఛందోభేదములను వాడుచు సంస్కృత వృత్తములను పైతము విరివిగ వ్రాసియుండెను. అతని భారతమున రగడలు లేవు. పంప భారతమున లేని ఆట వెలఁదులు, తేటగీతులు, సీసములు, తరువోజలు కానఁ బడును.

సంస్కృతము నందలి వృత్తములను గ్రహించి వానిని సంస్కృత లక్షణములతోనే [illegible] సహజములైన యతి ప్రాసల నందుఁ జొప్పి[illegible] చూడ నీ విషయమున [illegible] కన్నడ కవుల యడుగు



జాదలనే యనుసరించె నని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. అతఁడే యే పద్యము లెన్నెన్ని వ్రాసెనో క్రిందఁ దెలుపఁబడుచున్నది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | | | | 581 |
| శార్దూలము | - 18 | | వనమయూరము | - | 1 |
| మత్తేభము | - 61 | | అంబురుహము | - | 1 |
| ఉత్పలమాల | - 164 | | రథోద్ధతము | - | 1 |
| చంపకమాల | - 240 | | మణిభూషణము | - | 1 |
| మత్తకోకిల | - 26 | | లయగ్రాహి | - | 3 |
| తరళ | - 25 | | దండకము | - | 1 |
| స్రగ్ధర | - 1 | | కందములు | - | 1219 |
| మహాస్రగ్ధర | - 2 | | ఆటవెలఁదులు | - | 195 |
| మాలిని | - 7 | | ఉత్సాహము | - | 4 |
| పృథ్వీ | - 5 | | మధ్యాక్కరలు | - | 39 |
| | | | సీసములు | - | 251 |
| ద్రుత విలంబితము | - 1 | | తేటగీతి | - | 177 |
| మాలిని | - 2 | | తరువోజ | - | 12 |
| కవిరాజ విరాజితము | - 2 | | మధురాక్కర | - | 1 |
| వసంత తిలకము | - 3 | | | | 2,487 |
| స్వాగతము | - 2 | | గద్యములు | - | 1,496 |
| తోటకము | - 1 | | మొత్తము | - | 3,983 |
| పద్మకము | - 1 | | | | |
| | 581 | | | | |

దీనిని బట్టి పంపని వలె నన్నయయు దేశీయ పద్య భేదముల కంటె సంస్కృత వృత్త భేదములనే యధికముగా వాడినట్లు తెలియుచున్నది. (8.24) ఇరువురును గూడ వృత్తములలోఁ జంపక మాలలను జాతులలోఁ గందములను హెచ్చుగా వ్రాసి యుండిరి.

నన్నయ పృథ్వీ వృత్తము నైదుచోట్ల వాడి యుండెను.

ఆది.౨-166; ౫-62; 168, ౭-103 అరణ్య. ౨-355.

సమస్త భువనా శ్రయాపి వయనే త్యనిత్యో దయా.

I U I   I I U   I U I   I I U   I U U   I U

జ   స   జ   స   య   వ.

'జసౌ జస యలా వసుగ్రహ యతిశ్చ పృథ్వీ గురుః' వృత్తరత్నా. అది సంస్కృతమున నిందు 9 వ యక్షరము యతిగాఁ జెప్పఁ బడినది. నన్నయ గణములను సంస్కృతము నందు వలెనే వాడెను గాని యతి స్థానమును 9 వ యక్షరము నుండి 12 వ యక్షరమునకు మార్చెను. కవి జనాశ్రయ కావ్యాలంకార చూడామణు లందును, అనంతుని ఛందో దర్పణము నందును (౨-85) నన్నయ ననుసరించి దీని యందు 12 వ యక్షరమే యతిగాఁ జెప్పఁ బడినది. కవి చింతామణిలో మాత్రము 13వ యక్షరము యతిగా నిర్దేశింపఁ బడియున్నది. శ్రీనాథుఁడును, పెద్దనయుఁ బృథ్వీ వృత్తములో యతి విషయమున సంస్కృత నియమమునే పాటించిరి.

చతుర్ముఖ విలాసినీ శయ విలాస పంకేరుహ-స్రుత (నై ష. ౨-144)
సుధీ మధుర వాక్సుధా సుముఖ నాగమాంబా సుతా. (మను. ४-122)

పృథ్వీ వృత్తమున మధ్యాక్కరలో వలె 6 గణము లుండును. నన్నయ మధ్యాక్కరలో నైదవ గణము మొదట యతి వేయుచుండును. అది 12 నుండి 16 వఱకు నేయక్షర మైనను గావచ్చును. యతి విషయమునఁ గూడ నా రెంటికిని పామ్యము కల్పించుటకే కాఁబోలు. నన్నయ పృథ్వీ వృత్తమున యతి స్థానమును మార్చి యుండెను.

నన్నయ పద్మక వృత్తము నొక్కసారి వాడెను. (ఆది. ౬-227.)
కొడుకు-పల్కి-వి వి కూడ ధనాక దురాత్ముఁడై.

III UII IUI IUI IUI U
న భ జ జ జ గ

అతఁ డిందు 8 వ యక్షరమున యతి వేసెను. అప్పకవ్యాదు. లీ పద్యమును జూచి యుండియు 11వ యక్షరమును యతిగా నేల చెప్పిరో తెలియదు.

నకలితంబు నభజాజ గణంబులు గాంతమై
సకల దిగ్విరమణంబులు సన్నుతమై చనన్. ౨-77 అనంతుని ఛం.
నభజజా గ గణయుక్తిఁ బినాకి విరామక ప్రభవమై (అప్ప. పుట 237.)

ఇది యష్టి చ్ఛందమునకుఁ జెందిన వృత్తము. మేదిని యనునది కూడ నీ ఛందమునకుఁ జెందినదే. తిక్కన స్త్రీ పర్వమున దానిని వాడియుండెను.

మనమున నిట్టి పీ కగునె మత్సరంబు వత్సా! (స్త్రీ. ౧-152.)

అతఁ డందు 11 వ అక్షరమునకే యతి వేసెను. లాక్షణికులుకూడ దానికి 11 వ అక్షరమునే యతి స్థానముగఁ జెప్పియున్నారు.

వగణముతో జకార భగణంబులన్ జకార
ప్రగుణిత రేఫయున్ గురువు భాతి గాఁగ నోలిన్
దగ నవ తార విశ్రమము దండిగా నొనర్పన్ (అనం.౨-80)
మానినీ వృత్తమును నన్నయ రెండుసార్లు వాడియుండెను.
(ఆది.౪-20 ; ౮-91)

తమ్ములుఁ దానును ధర్మతనూజుఁడు తత్క్షణ సంభృత సంభ్రముఁడై (౮-91)

U I I U I I U I I U I I U I I U I I U I U
భ భ భ భ భ భ భ గ

అమ్మునినాథ వరేణ్యునకున్ వినయమ్మున మ్రొక్కి సమున్నత పీ

ఇందు 13 వ యక్షరమున నొక్కచోటనే యతి వేయఁబడినది. నన్నిచోడుఁడు కుమారసంభవమునఁ గూడ నిట్లే వాడియుండెను,

ఆనన లీల సుధాకర బింబ నవాంబురుహంబుల చెల్వగుటన్
వేనలి కృష్ణ భుజంగ కలాపి సవిస్తర భాసురమై చనుటన్. (౭-9)

తిక్కన కొన్నిచోట్ల 13 వ యక్షరమునకే యతి వేసినను గొన్నిచోట్ల మూఁడు యతులను బాటించినాఁడు,

జూదము నప్పుడు సర్వ జనంబులు చూచి భయంపడి యిప్పనియి (ఏకయతి)

కుంతియుఁ గాంతి యి7- గుర్వఁగఁ దేజము13- గుందక వహ్నులు 19-క్రూర శిఖా (యతిత్రయము)

పై నీయఁబడిన యుదాహరణములలో నన్నయ నన్నిచోడులు కూడఁ బ్రథమ పాదమున మొదట నేడవ యక్షరముపై యతి వేసిరి. కాని తరువాత దానిని గొనసాగించి యుండలేదు.

కవిజనాశ్రయమందును ఛందోదర్పణము నందును యతి త్రయమే చెప్పఁబడినది.

కారకముల్ క్రియ- గన్గొన నేడుభ- కారము లొక్క- గ- కారముతో
(కవిజ.)

క్రొన్నెల పువ్వును-గోఅల పాగయుఁ- గూర్చిన కెంజడ -కొప్పునకున్
(ఛందోదర్ప-ద్వి-103.)

అప్పకవి యీ లక్షణములను, దిక్కన పద్యములను, జూచియు నన్నయ పాటించిన యతి విధానమునే చెప్పియున్నాఁడు. అతఁడు రెండుపద్ధతులను సూచించి యుండవలసినది.

రాజిలు సప్తభముల్గము విశ్వవి13 రామము మానివి యందు భరద్వాజ.
(४-పుట 248.)

నన్నయ కవిరాజవిరాజితము నాదిపర్వమున నొక్కమాఱును, అరణ్య పర్వమున నొక్కమాఱును వాడియున్నాఁడు.

(ఆది. ४-21 ; అరణ్య. ౨-89.)

చవిచవి ముందట నాజ్యహవిర్ధృత సౌరభ ధూమలతా తతులన్.

| I I • | I ∪ I• | I ∪ I• | I ∪ I• | I ∪ • | I ∪ I• | I ∪ I• | I ∪ |
|---|---|---|---|---|---|---|---|
| న | జ | జ | జ | జ | జ | జ | వ |

ఇందు 14 వ యక్షరమున నొక్కచోటనే యతివేయఁ బడినది. తిక్కన స్త్రీ పర్వముననే యొకపద్యమున నన్నయ ననుసరించి యొక్క యతినే వేసి మఱియొకదాన మూఁడు యతులను వేసియున్నాఁడు.

అనయము లోలతమై విషయ ప్రచయం బను దుస్తర పంకమునన్
(స్త్రీ ౧-55.)

అనవుడు విట్లను -నన్నరపాలున
కాతఁడు మోక్షము- నర్థిజగన్ (స్త్రీ.౧-51)

లాక్షణికు లందఱును గవిరాజవిరాజితమునకు యతిత్రయమునే నిర్దేశించినారు. అప్పకవి నన్నయ పద్యమును జూచియు నిందుమాత్రము యతి నిర్ణయమునఁ గూడఁ బూర్వ లాక్షణికులనే యనుసరించినాఁడు.

కలయఁగ నొక్క- వ-కారము నాఱు జ
కారము లున్నము- గాటముగా (అప్ప.४. ఆశ్వా. పుట 249.)

దీని గతియు వృషభగతి రగడ గమనము వలెనే యుండును. నన్నయ యతి విషయమునఁ గూడ నీ రెంటికిని సామ్యము కూర్ప యత్నించి నట్లున్నది.

ఈ విధముగా యతిస్థానవిషయమునఁ బై నాలుగు వృత్తములలో నన్నయ పద్ధతికిని ఇతరుల పద్ధతికిని గొంత భేదము కానిపించుచున్నది. అన్య వృత్తములలో గణ యతి ప్రాసల విషయమున నతని పద్ధతికిని దరువాతి వారి పద్ధతికిని వ్యత్యాస మేమియుఁ గానరాదు.

జాత్యుపజాతులు :

నన్నయ యరణ్యపర్వమున నర్జునుఁడు శివుని స్తుతించు సందర్భమున నొక్కచో దండకము వాడియుండెను. (అర. ౧-325.)

ఇందుఁ బెక్కు తగణములును జివర నొక్క గురువును నున్నవి కావ్యాలంకార చూడామణిలో "కృతి నాది న స హంబు లొండెం దకారంబు లొండెం బ్రకల్పించి యా మీఁద నెల్లం దకార ప్రధానంబ గుర్వంతమై క్రాల నిచ్చానురూపావధిం బేర్మి నిర్మించుచో" (౮-3) అని దండకలక్షణము చెప్పి యుండెను.

అప్పకవియు నిట్లే చెప్పెను. (४-256) అనంతుని లక్షణములోఁగూడ వ్యత్యాసము లేదు. (౨-135) నన్నయ తకారాదియు గుర్వంతము నైన దండకమునే చెప్పెను.

అక్షరగణములతోఁ గాక మాత్రాగణములతోఁ గూడి యుండునవి జాత్యుపజాతు లనఁబడును. జాతులందు వృత్తములలో వలెఁ బ్రాసనియమ ముండును. ఉపజాతులలోఁ బ్రాస నియమము లేదు. జాతులు సంస్కృత జాతు లనియు దేశ్య జాతు లనియు రెండురకములు. కందము సాంస్కృతిక జాతికి జెందినది. అక్కర, తరువోజ, ద్విపద మొదలగునవి దేశ్యజాతులు. ప్రాసనియమములేని సీసము,ఆటవెలఁది, తేటగీతి. మున్నగునవి యుపజాతులు. నన్నయ వృత్తములే కాక జాత్యుపజాతులకుఁ జెందిన పద్యములు కూడఁ బెక్కు వాడియుండెను.

నన్నయ రచించిన భారత భాగమునఁ గల మొత్తము పద్యముల సంఖ్య 2,487. అందు కందములు 1,219. అనఁగా నతఁడు రచించిన పద్యములలో నించుమించు సగము కందపద్యములే. అప్పకవీయ చతుర్థాశ్వాసమునందలి266వ

పద్యములో సహజ కందపద్య లక్షణము చెప్పఁబడి యున్నది. ఆర్యాగీతియు సహజ కందపద్యమును సమానములే.

> సముదీరిత పథ్యాకందము కన్నను నొక్క గురువు దాకించినచో-
> క్షమ నార్యాగీతి యగు న్గమలాప్రాణేశ ! సహజకందం బదియే.
> (అ. ౪-349)

> ఆర్యా ప్రాగ్దల మంతేఽ
> ధిక గురుతా దృక్పరార్ధ మార్యాగీతిః (వృత్తరత్నా)

ఆర్యకుఁ బ్రథమ తృతీయ పాదములందుఁ బండ్రెండేసి మాత్రలును, ద్వితీయ చతుర్థ పాదములందు వరుసగాఁ బదునెనిమిది, పదునైదు మాత్రలును ఉండును. ఇందలి ప్రాగ్దళమున కంతమున నొక గురువు చేర్చినచో నార్యాగీతియం దర్ధభాగ మేర్పడును. అనఁగా నార్యాగీతిలోఁ బ్రథమ తృతీయపాదములందుఁ బండ్రెండేసి మాత్రలును, ద్వితీయ చతుర్థ పాదములం దిరువదేసి మాత్రలును ఉండును. ఇది సరిగాఁ దెలుఁగునందలి కందపద్యమునే పోలి యున్నది. అప్పకవి యందు చేతనే "సహజ కందం బదియే" యని చెప్పియుండెను. నన్నయ వాడిన కందము లన్నియు నిట్టివే. అప్పకవీయమునఁ గందపద్యభేదములును, ఛందో దర్పణమున నార్యా భేదములును జెప్పఁబడియున్నవి. విన్నకోట పెద్దన, పథ్య, ఆర్య. గాథ, అనువానిని మాత్రమే సూచించి యూరకుండెను. (ఒ-25-27) ఆర్యాగీతితో సమానమైన సహజకందమున కొక్క దానికే మన వాఙ్మయమునఁ బ్రయోగ మధికముగాఁ గానవచ్చుచున్నది.

నన్నయ తరువోజలు పండ్రెండుచోట్ల వాడియుండెను. ఇవి దేశ్యజాతి వర్గమునకుఁ జెందినవి. రెండు ద్వివద పాదములు కూడినచో నొక్క తరువోజ పాదమగును. ఇందు ప్రాస ముండును. ఒక్కొక్క పాదమున మూఁడేసి యతు లుండును. ఈ తరువోజ యను పదము ధ్రువాపదము నుండి యేర్పడినట్లు కనఁబడు చున్నది. 1'ధ్రువ పద' దరువద, తరువద, తరువోజ అని దీని రూపాంతరములు. కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక యందు ధ్రువాపద ప్రబంధములను జెప్పినాఁడు; వన్ని చోడుఁడు దీనిని 'తరువద' యని పేర్కొని యున్నాడు. (ఇ-61)

---

1 తెలుఁగు కవుల చరిత్ర- పుట 27.
తరువోజను గూర్చి నన్నయకుఁ బూర్వము ఛంద స్సను భాగమునఁ జెప్పఁబడినది.

తెలుఁగున లభించిన పద్య శాసనములలో మొదటిదైన యద్దంకి శాసనమున నొక తరువోజ యున్నది. అందలి లక్షణమునే నన్నయ కూడ ననుసరించినాఁడు.

అనవరతవ్రతా- యాస ఖేదమున- నతికృశంబగుచున్న- యంగంబునందుఁ
దనరి యేర్పడ సిరల్- దద్దయు ముదిమి- దల వడంకుచు నుండు- తన పితృవరుల (ఆది ౨-151)

నన్నయ యుత్సాహవృత్తములను నాలుగుస్థలములలో వాడి యుండెను. ఇదియును దేశ్యజాతి వర్గమునకుఁ జెందినదే. దీనిమీఁద నొక గీతమును గూర్చినచో నది యంతయుఁ గలసి విషమ సీస మగును. ఇందుఁ బాదపాదమునకు నేడు సూర్య గణములును నొక్క గురువును ఉండును ప్రాస నియమము కలదు పంచమ గణాద్యక్షరము యతిస్థానము.

అతులశౌర్యుఁ డనిలతనయుఁ- డమిత వాహినీ పదా
హతి ధరిత్రి దలర నిట్టు- లరిగి పూర్వ దిఙ్మహీ
పతుల చేత రత్న రజత - భర్మ తతులఁ గొనియె భూ
నుతయశుండు వేలువేల- నూలుకోట్ల సంఖ్యలన్. (స.౧-244.)

మధ్యాక్కరలుకూడ దేశ్యజాతులకుఁ జెందినవే. ఆంధ్ర వాఙ్మయమున పూర్వకవులలో నన్నయ, యెఱ్ఱనలు తప్ప మఱెవ్వరు నీ పద్యమును వాడియుండ లేదు. ఎఱ్ఱనయైన నారణ్యపర్వ శేషముననే కాని తన యన్యకృతులలో దీనిఁ బ్రయోగించి యుండలేదు.

యుద్ధమల్లుని బెజవాడ శాసనములో నైదు మధ్యాక్కర లున్నవి. కవిజనాశ్రయకారుని నుండియు లాక్షణికు లెల్లరు నీ పద్యమునకుఁ దమ తమ గ్రంథములలో లక్షణము చెప్పియున్నారు. కన్నడ భాషలోఁ గూడ యక్కర లున్నవి. బహుశః అందుండియే యివి తెలుఁగునకు వచ్చి యుండ వచ్చును. అందును ఇందును గూడ నివి యైదువిధములు. నామములందు మాత్ర మించుక భేద మున్నది.

| తెలుఁగు | కన్నడము. |
| --- | --- |
| మహాక్కర- 7 గణ- | పిరియక్కర |
| మధ్యాక్కర- 6 గణ - | దొరెయక్కర. |

మధురాక్కర- 5 గణ.- నడువణక్కర.
అంతరాక్కర- 4 గణ.- ఎడెయక్కర.
అల్పాక్కర- 3 గణ.- కిరియక్కర.

మహాక్కర, అంతరాక్కర, అల్పాక్కర, అనువానికిఁ గన్నడమునఁ గల పిరియక్కర, ఎడెయక్కర, కిరియక్కర, అనుపేర్లు సమానార్థకములు గానే యున్నవి. కాని మన మధ్యాక్కర, మధురాక్కరలకును అందలి దొరెయక్కర, నడువణక్కర అనువానికిని పేర్లలో వ్యత్యాసము గోచరించుచున్నది. కన్నడమునందలి పేర్లే తెలుఁగువానికంటె నెక్కువ యన్వర్థములై యున్నవి. గణసంఖ్యను బట్టి యైదక్కరలలో నడుమ నున్నదానికి వారు నడువణక్కర యని పేరు పెట్టుకొనిరి. తెలుఁగునందలి మధ్యాక్కరకును దీని కివి నామసామ్య మున్నది. కాని లక్షణసామ్యము లేదు. గణసంఖ్యను బట్టి కన్నడమున నడువణక్కరకు వలెఁ దెలుఁగున దీనికిఁ బంచాక్కరల మధ్య స్థితి కుదురకున్నది. ఆ లెక్కను బట్టి యిది రెండవ దగుచున్నది. పోనీ యతిస్థానము సరిగా మధ్య నుండుటచే దానికి మధ్యాక్కరయను పేరు వచ్చిన దనుకొందమన్న నన్నయయుఁ దత్పూర్వులును వేసిన యతి యట్లు మధ్య భాగమునఁ గాక యైదవ గణము మొదటఁ గానిపించుచున్నది. అందుచే దానికి మధ్యాక్కర యను పేరు గల్గుటకు వేఱు కారణ మూహింపవలయును.

దొరెయక్కర యనఁగా సమభాగములు గల అక్కర యని యర్థము. అందు (తెలుఁగుమధ్యాక్కరలో) ఁ బాదమున రెండింద్రగణములు ఒక సూర్య గణము గల రెండు సమాన భాగము లుండును. అందుచే నా పేరు కన్నడమున దానికి సరిపోయినది. ఇట్లే కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు మధ్యాక్కర నామమును సార్థకముగా సమర్థించుచు సింహావలోకనమున (పుట 37) మధ్యాక్కర యను పేరిలోని మధ్య పదము మంచి ప్రయోజనము కలదనియు, నది యా పద్యపాదమును జదువు నప్పుడు మధ్యమమునకుఁ గత్తిరించి చదువ వలె ననుటకు జ్ఞాపకమనియు వ్రాసియున్నారు. స్త్రీల పాటలలో

U I I U I I U I
అంతట రాముల వారు
U I I U I I U I
అంగన సీతను గూడి
సంతస మందుచు వేగ
స్వపురమునకుఁ జనుదెంచి

ఇత్యాదిగాఁ గలవి కొన్ని యున్నవి. ఇందలి రెండేసి చరణములను గలిపి చూచినచో సరిగా మధ్యాక్కర లక్షణము సరిపోవును. ఆ పాటలలో నట్టి చర ణములు వందల కొలఁదిగా నుండును. కాని పద్యము నాలుగు పాదములు కలి దిగా నుండ వలెనను సంస్కృత సంప్రదాయము ననుసరించి యందలి యెని మిది చరణములను నాల్గు పాదములు గల యొక పద్యముగాఁ జేసి దానికి మధ్యాక్కర యని పేరు పెట్టుట సంభవించినది.

ఇట్లు రెండేసి దళముల నొక్కొక్క పాదముగాఁ జేయు విధానము తరు వోజ, రగడ, సీసము మున్నగు పెక్కు దేశీయ పద్యములలో గానఁ బడుచునే యున్నది. మధ్యాక్కర, మధురాక్కర అనువానిని దప్ప మిగిలిన యక్కరలను దెలుఁగు కవు లెవ్వరును వాడి యుండలేదు. నన్నయ 39 మధ్యాక్కరలను ఒక మధురాక్కరను వ్రాసి యుండెను. అరణ్య పర్వ తృతీయాశ్వాసము నందలి 299వ పద్యమునకు ముం దక్కర యను పేరున్నది. కాని యదియు మధ్యాక్కర యను నుద్దేశముతో వ్రాయఁ బడినదే.

అక్కరల విషయమునఁ దెలుఁగు కన్నడము లందు లక్షణములోఁ గూడఁ గొంత వ్యత్యాసము కనఁబడు చున్నది. తెలుఁగున సూర్యేంద్ర చంద్ర గణము లుండుచోటఁ గన్నడమున క్రమముగా బ్రహ్మ విష్ణు రుద్ర గణములు వాడఁబడు చుండును. తెలుగున హగణ ∪।, నగణములు ।।। రెండే సూర్య గణములు. కన్నడమున నీ రెంటితో పాటు గగ, సగణములు కూడ బ్రహ్మ గణములుగాఁ బరిగణింపఁబడును. నల, నగ, సల, భ, ర, త, లను నాలు గణములను దెలుఁగున నింద్ర గణములు. కన్నడమున మ, సగములు కూడ విష్ణు గణ సంజ్ఞతో నొప్పారును. అట్లే చంద్ర గణముల విషయమునఁ దెలుఁగు నందలి నలగ, నలల, నగల, నగగ, సలగ, సలల, భగురు, భల, రగ, రల, తగ, మలఘు, సగల గణములే కాక మగ, సగగ, గణములు కూడఁ గన్నడమున రుద్ర గణములుగా భావింపఁ బడును. ఈ విధముగా గణ పరిగణమునందే తెలుఁగు కన్నడము లందుఁ గొంత భేదము కానవచ్చు చున్నది.

తెలుఁగు నందలి మధ్యాక్కరయుఁ గన్నడ మందలి దొరెయక్కరయు సమాన లక్షణము గలిగి యున్నవి. కాని దొరెయక్కరలోని తుది బ్రహ్మ గణము గుర్వంతముగానే యుండవలె నను నియమ మున్నది. అనఁగా గగ,

సగణములలో నేదైన నొకటి కావలయును. నాగవర్మ ఛందోఽంబుధిలో దొరె యక్కరలకు లక్ష్యములుగా నిచ్చిన పద్యములలో మధ్య నున్న బ్రహ్మ గణములు కూడఁ గొన్ని గగములుగానో సగములుగానో కనఁబడు చున్నవి. ఇతరాక్కరలలోఁ బాదాది నుండ వలసిన బ్రహ్మ గణము లన్నియు ద్రిమాత్రాకములుగానే యున్నవి. ఇంకఁ గన్నడమున విష్ణుగణము లందలి 4,5 మాత్రలు గల గణములే యక్కరలలో వాడఁబడు చుండును. కావున నవి తెలుఁగు నందలి యింద్ర గణములతో సమానములే యగును.

కన్నడములో పిరి యక్కర ద్వితీయ చతుర్థ పాదము లందలి యాఱవ గణము బ్రహ్మ గణమే యై యుండ వలెనను నియమ మున్నది. కవి జనాశ్రయమున 'అమరఁ బ్రావళ్ల రెండునాఁ జెలఁగ్గి నాల్గు చోట్ల విరతి యాదిత్యు మీఁద అమరపతి రెండు మూఁడు నాల్గైదు నాఱగు తావులనిల్పి సొబగు మీఱ నమరఁ జేయుచుఁ జంద్రు నేడగు చోట నదికిన యేడు గణముల లోనఁ గ్రమము తప్పక యప్పాటఁ బెద్దయక్కర మొప్పఁ గవి జనాశ్రయుఁడు చెప్పె.' జాత్యధి 25. అని చెప్పఁబడిన మహాక్కర లక్షణములో నీ నియమము కానవచ్చుట లేదు. కావ్యాలంకార చూడామణి యందు రెండవ నాల్గవ చోట్ల నర్కుం డయిననుం దనర్చుచుండ ౮-53 అనియు, ఛందో దర్పణమున 'రెంటను నాలుగు నగు వాసరంబున నర్కుఁడైన నాదరంబున వెద సొచ్చు.' (3-40) ననియు, నప్ప కవీయమున "రెండవ చోట, నాల్గవ చోటఁ జిత్ర భాను గణంబు గదియుచుండు". (४-276) ననియు, రెండు నాలుగు చోట్ల నింద్ర గణమునకు బదులు సూర్య గణమైన నుండవచ్చు ననియు సూచింపఁ బడినది. ఇదియైనఁ బై కన్నడ లక్షణమునకు భిన్నముగానే యున్నది.

ఆంధ్ర లాక్షణికు లందఱును మధ్యాక్కరకు లక్షణము సమానము గానే చెప్పియున్నారు. అందఱును జతుర్థ గణాదినే యతి స్థానముగా నిర్ణయించినారు. "ఎఱ్ఱా ప్రెగ్గడ వెనుక లాక్షణికు లందఱు మూఁడవ (నాల్గవ) గణము పైని యతినే చెప్పినారు. ఒక్క కవి జనాశ్రయ కారుఁడు 5 వ గణము పైని యతి చెప్పి యున్నాఁడు. కావుననే యా ఛందస్సు ప్రాచీనత కిది యొక లక్షణముగాఁ గనఁబడు చున్న" దని తెలుఁగు కవుల చరిత్రమున 49 వ పుటలో నెందుండియో యుద్ధరింపఁ బడిన భాగమున వ్రాయఁబడి యున్నది. ఇది పౌరపాటు కవి జనాశ్రయమున నట్లు చెప్పఁబడి యుండలేదు. అన అందలి లక్షణమున

యతిప్రసక్తియే లేదు. లక్ష్యమును బట్టి చూచిన నందును యతిస్థానము చతుర్థ గణాదినే యని స్పష్టము కాఁగలదు.

"సురరాజు - సురరాజుఁ - గూడి - సూర్యుతో నొదఁబడి మఱియుఁ
గర మొప్ప విప్పాట నాఱు గణములు మధ్యాక్కరంబు" - జాత్య. 26.

నన్నయకుఁ బూర్వ మందలి బెజవాడ శాసనములోని మధ్యాక్కరలలోఁ బంచమ గణము మొదటనే యతి వేయఁ బడినది. దాని ననుసరించి నన్నయ కూడ నా చోటనే యతిని బాటించి యున్నాఁడు. దీనిని బట్టి నన్నయకుఁ బూర్వ మా పద్యమున యతి యచ్చటనే యుండెడిదని నిశ్చయింప వచ్చును. తిక్కన మధ్యాక్కరలు వ్రాసి యుండ లేదు. ఎఱ్ఱన చతుర్థ గణాదినే యతివేసియున్నాడు. అందుచే నన్నయ యెఱ్ఱనల నడిమి కాలమున నీ పద్యము నందలి యతి స్థాన విషయమునఁ గొంత మార్పు కలిగెనని తోఁచు చున్నది. లాక్షణికు లందఱును మాఱినదియు నెఱ్ఱన యనుసరించినదియు నగు పద్ధతినే యాదరించి యున్నారు. ఆఱు గణము లున్న పాదమున నైదవ గణము మొదటఁ గాక నాల్గవ గణము మొదట విశ్రమ స్థాన ముండుటయే యుచితముగా నుండునను భావము కూడ నీ మార్పునకు హేతువై యుండ వచ్చును.

తెలుఁగునఁ బుస్తక ముద్రణము సుమా రొక శతాబ్ది క్రిందనే యారబ్ధ మైనది. అంతకుఁ బూర్వము భారతాది గ్రంథము లన్నియు వ్రాఁత ప్రతులు గానే యుండెను. అప్పటికే తెలుఁగునఁ బ్రసిద్ధములైన లక్షణ గ్రంథము లన్నియుఁ బ్రచారమున కెక్కియుంటచే ముద్రణ సమయమునఁ బండితులును, అంతకు ముందు లేఖకులును లక్షణ గ్రంథోక్త లక్షణానుగుణముగా భారతాది గ్రంథము లందుఁ బెక్కు మార్పు లొనరించి యున్నారు. అందుచే నన్నయ వ్రాసిన సరి యైన పాఠ మేదో తెలిసికొనుట కొన్నిచోట్ల దుష్కరముగా నుండును. మధ్యాక్కరల షయమున నిట్టి మార్పులు కొన్ని జరిగినట్లు వ్రాఁత ప్రతులను బట్టి తెలియుచున్నది. నన్నయ వ్రాసిన మధ్యాక్కర లందలి కొన్ని పాదములలో గణముల తీరు లక్షణము కంటె నించుక భిన్నముగా గోచరించుచున్నది.

నన్నయ వ్రాసిన మధ్యాక్కరల సంఖ్య 39. అనఁగా 156 పాదములు. వీనిలో నీ క్రింది 16 పాదములలో గణ భేదము కనఁబడు చున్నది.

1. తను మధ్య తానొక్క కన్యక సురనదీ తటమున నన్ను - ఆ. ४-141.
2. భూపాల నీకు నిక్కోమలి యందుఁ బుట్టిన సుతుఁడు. - ఆ. ४-176.

3. నీ పరోక్షంబున రాజు గావలయు. నెమ్మి నెక్లేఁగ - (ఆది. ४-176.)
4. తన దివ్యశక్తి నప్పాశముల విడిచి తన్మనినాథు - (ఆ. ౫-122.)
5. నం గురుకుల హాని కరుఁడై ధారుణీనాథ నీ సుతుఁడు - (స. ౨-181.)
6. అమరంగ ధర్మువు రక్షించుఁ బ్రీతి నని శత్రు లందు - (అర. ౧-225.)
7. కలుగు లెటిఁగియు పాయ పూర్వమునఁ గడఁగి తత్సిద్ధి - (అర. ౧-234.)
8. చలితుఁడై విజనాథుఁ దరిగినఁ దోన చవియె నన్వార్త - (అర. ౨-148.)
9. ఏమేము మున్ను పూజింతుము రుద్రు నిందవి వేడ్క - (అర. ౨-255.)
10. పదుంద్రఁ బోలెడు సుతులనూ ర్వురఁ బడయఁ గ వలతొ - (అర. ౨-348.)
11. పదుంద్ర నూర్వురకెనయగు సుతులఁ బడయం గ వలతొ-(అర. ౨-348.)
12. అరుణ సరోరుహ దళ మృదు లంబులైన యిత్తరుణి-(అర. ౩-299. )
13. పరఁగ నా కారణమున నిట్టి దుఃఖ భారము దాల్చె - ( Do. )
14. అరిగె సీతాను దిక్కునకు నీ యనుజుఁ డనిలవేగమున - (అర. ३-373.)
15. మాయ మార్గుఁడగు వాని గమనవేగంబు మందమై యుండ-(అర. ३-386.)
16. తోనేఁగె నుత్తరము మించి ధర్మ విత్యుఁడు ధర్మజుండు. - (అర. ४-3.)

పై వానిలో 3, 9 సంఖ్య గలవి వ్రాఁత ప్రతుల లోని పాఠములు. అచ్చు ప్రతులలో నవి

"నీ పరోక్షంబున రాజు గావలె నెమ్మి విక్లేఁగ
ఏ మేమ మున్ను పూజింపుదుము రుద్రు నిందవి వేడ్క."

అను మాదిరిగా నున్నవి. ఇందలి 'కావలె, పూజింపుదుము' వంటి ప్రయోగములు నన్నయ భారతమున మఱెచ్చటను గానవచ్చుట లేదనియు, కావలయు, పూజింతుము, అనియే నన్నయ వాడి యుండెననియు, నైదాఱు వ్రాఁతప్రతులలో నీపాఠములే యున్నవనియు, నందుచే ముద్రాపకులుతరువాతి కవుల ప్రయోగముల ననుసరించి గణ భేదము తొలఁగించుటకై వానిని పై విధముగ దిద్ది యుందురనియు శ్రీ గిడుగు వెంకట సీతాపతిగారు ఛందో దర్పణమునకు ముం దుపోద్ఘాతములో వ్రాసి యున్నారు. (పు. 51) అందుచే వానిని గూడ గణ భేదమున్న పాదములుగానే గ్రహింప వలయును.

ఈ 16 పాదములలోఁ గొన్నిటి వర్థమునకుఁ గాని నన్నయ భాషా ప్రయోగ పద్ధతికిఁ గాని వైరుద్ధ్యము లేకుండ స్వల్పమైన మార్పుచేసి లక్షణాను గుణముగ సవరించుట కవకాశ మున్నది.

1. తను మధ్య తానొక్క కన్య సురనదీ తటమున నన్ను (కన్యక)
4. తన దివ్యశక్తి న ప్పాశముల విచ్చి. తమ్మనినాథు (ముల విడిచి)
5. నం గురుకుల హానికరుఁడు ధారుణీ నాథ పీ సుతుఁడు (కరుఁడై)
7. కలుగుబె ఱింగియు పాయ పూర్వము కడఁగి తత్సిద్ధి (ఱిఁగియు. పూర్వమున)
9. పదుగురఁ బోలెడు సుతుల నూర్వురఁ బడయంగ వలఁతొ (పదుంర్ర)
10. పదుగుర నూర్వుర కెనయగు సుతులఁ బడయంగ వలతొ (పదుంర్ర)
11. చలతుఁడై నిజనాథుఁ దరిగి నందోన చనియె నన్వార్త (దరిగినఁ దోన)
15. మాయావి యగు వాని గమనవేగంబు మందమై యుండ. (మాయ మార్గుఁ డగు వాని గమన వేగంబు)

(కొన్ని ప్రతులలో విట్లే యున్నది. అర. పుట 130.)

16. తోనేఁగె నుత్తర మించి ధర్మనిత్యుఁడు ధర్మజుండు (ఉత్తరము మించి)

అరణ్య పర్వము నందలి ప్రథమా శ్వాసములోని 2 వ వచనమున 'ఉత్తర మించి యరిగిన' అను ప్రయోగ మున్నది. ఈ 9 పాదముల విట్లు సవరించినను మిగిలిన వాని లోని గణభేదమునకైన సమాధానము చెప్పవలసి యున్నది.

2. లి యందు (ఇంద్ర గణమునకు బదులు జగణము వాడఁబడి యున్నది.)
9. మురుద్రు. ( Do. )
12. దులంబు ( Do. )
3. గావలయు (ఇంద్ర గణమునకు బదులు భలము వాడఁ బడినది.)
14. పీ యనుజా ( Do. )
6. అమరంగ ధర్మువు రక్షించుం బ్రీతి నని శత్రు లందు - అవి యుండె నని తలంచిన 3 వ చోట సూర్య గణమునకు బదులు గగము వాడఁబడిన వైరుద్ధ్య మొక్కటి మిగిలి ఇంద్ర గణమునకు జగణము వాడఁ బడెనను నది తొలఁగి పోవును.

13. "మున నిట్టి" సూర్య గణమునకు బదులు సగణము వాడఁబడినది. దీనిని "మున నిటులు దుఃఖ" అని సవరించినచో గణ భగంము తొలఁగును.

నన్నయ కన్నడ లక్షణము ననుసరించెనని చెప్పినచో నిందుఁ గనఁబడు సూర్య గణములకు సంబంధించిన వ్యత్యాసమును సరిపెట్టుకొనవచ్చును.

కన్నడమున గగ, సగణములు కూడ బ్రహ్మగణము లగుటచేతను, అవి మన సూర్య గణముల వంటివే యగుటచేతను. మధ్యాక్కరలోని 3 వ గణము గగ మైనను సగణ మైనను లక్షణ విరోధ ముండదని తలంప వచ్చును. ఐనచోఁ దుది బ్రహ్మగణము గుర్వంతముగా నుండవలెనను కన్నడలక్షణమును నన్నయ యేల యనుసరింప లేదను నాక్షేపము కలుగవచ్చును. సంస్కృతములో వలెఁ గన్నడమున నైతము లఘువైనను బాదాంత వర్ణము నవసరమైనప్పుడు గురువుగాఁ బాటింపవచ్చును గావున నన్నయ యీ విషయమున నా పద్ధతి ననుసరించె నని చెప్పినచోఁ బై యాక్షేపము పరాస్తమైపోవును. కీ. శే. చేకుమళ్ళ రాజగోపాలరావుగారు చెప్పిన యీ యుక్తి వలన సూర్య గణములకు సంబంధించిన వైరుధ్యము మాత్రమే తొలఁగిపోవునుగాని, యింద్రగణములకు సంబంధించిన చిఁకను విలిచి పోవును. సూర్య గణముల విషయమునఁ గన్నడమును, ఇంద్రగణముల విషయమున మఱొక పద్ధతిని నన్నయ యనుసరించె నని చెప్పుట యుక్తముగా నుండదు.

బ్రహ్మశ్రీ వఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు నన్నయ మధ్యాక్కర లందలి గణవిరోధమును దొలగించుటకై యొక క్రొత్త పద్ధతిని సూచించినారు. అది కేవలము బెజవాడ శాసనము నందలి మధ్యాక్కరలు లిఖింపఁబడిన పద్ధతిపై నాధారపడి నట్టిది. శాసనములం దర్ధాను స్వారము లుండవు. దానికి బదులు పూర్ణాను స్వారములే వ్రాయఁబడుచుండును. పూర్ణాను స్వారము తరువాత జడక్కర మున్నచో నది పూర్ణాను స్వారమే యనియు, నద్విరుక్తమైన హల్లున్నచో నది యర్ధానుస్వారమే యనియు భావింపవలయును. అట్లే బిందు పూర్వక బ వర్ణమును గణములరీతిని బట్టి మ వర్ణముగాఁ బరింప వలయును. ఈ పద్ధతికి శాసనములలోఁ జాల నుదాహరణములు కన్పట్టును. బెజవాడ శాసనమునఁ గల మధ్యాక్కర లన్నిటిని బ్రస్తరించి యం దింద్ర గణము లుండవలసిన స్థానమున వచ్చు గణముల నన్నిటిని ఇంద్ర గణములుగను, సూర్య గణము లుండవలసిన స్థానమున వచ్చు గణముల నన్నిటిని సూర్యగణములు

గను భావింప వలెనని శ్రీ శాస్త్రిగారి వాదము. దీనినిబట్టి నల, నగ, సల భ, ర, తలే కాక

1 నగ - తెలవారం - గొరగల్గా - వలియంబ (య్యా) - కవిమల్లం-

2 స - భక్తుడై - కామంగ (డ్డం)

3 జగ - ఫలంబుపే - మతంబునం.

4 యల - సుతుణ్డొణ్డు.

5 జ - బయన్న.

6 జల - తెరంగును - క్రమంబున

అను వాటిని గూడ నింద్ర గణములుగాను

1 గగ - మల్లం - అర్థిన్ - గామం - ట్టించెం - మల్లం

2 వ - కామర (ప్వా)

3 జ - మతంబు

అను మూఁడింటిని గూడ సూర్య గణములు గాను పాటింపవలయును. ఇట్లు పాటించినను (గావలయు, నీ యనుజా) అను చోట్ల భలముండుటకు నవకాశ ముండదు. జల, జగ, ము లింద్ర గణములుగా నుండ జగణము కూడ నింద్ర గణముగా నుండుటయు, నదే మరల సూర్య గణముగా నుండుటయు సంభవించు చున్నది. అదిగాక యీ క్రొత్త గణముల కొక్క మధ్యాక్కరలోఁ దప్ప నింద్రగణ ముండవలసిన యితర పద్యములలో నెక్కడను వినియోగ మున్నట్లు కన్పడుటలేదు. 'బయన్న' యను దానిని 'బైయున్న' యని గ్రహించినచో తగణ మేర్పడును గావున జగణ మింద్ర గణములనుండి తొలఁగిపోవును. అప్పుడది యొక్క సూర్య గణమే యని చెప్పవచ్చును కాని 2, 8, 12 పాదములందు జగణ మింద్రగణముగా వాడబడి యుండుటచే దానికి సమర్థన ముండఁజాలదు. అందుచే నీ పద్ధతి కూడ నన్నయ మధ్యాక్కర లందలి వైరుధ్యమును తొలఁగించుటకుఁ బనికి వచ్చుట లేదు.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు దేశియందలి ఛందస్సాహితీ రీతుల న్యాసమున మన లాక్షణికు లేర్పఱిచిన మాత్రాగణ ప్రస్తారమునకు దేశి రచన లన్నియు లొంగుట లేదనియుఁ దమిళచ్ఛందో (దః) ఫక్కి కొంత విష తరమైన దగుటచే దాని కవి లొంగవచ్చుననియు సూచించి యున్నార

అందుచేఁ దమిళము నందలి గణములను బ్రస్తరించి యేయే 2, 3, 4, 5 అక్షరములతోఁగూడినవి, లేక 3 నుండి 8 మాత్రలతోఁ గూడినవి యెన్ని యెట్లు వచ్చునో పరిశీలించి చూతము. తెలుఁగు కన్నడములందు సూర్యగణములలో రెండు మూఁడక్షరములును, మూఁడు నాలుగు మాత్రలును, ఇంద్ర గణములలో మూఁడు నాలుగక్షరములును నాలుగైదారు మాత్రలును చంద్ర గణములలో నాలుగైదక్షరములును నైదాఱేడెనిమిదిమాత్రలు నుండుట కవకాశ మున్నది. గురు లఘువులకు బదులుగాఁ దమిళమున నేర్, నిరై లను నవి కలవు. నేర్ అనునది యొక లఘువు కాని గురువు కాని కావచ్చును. వీనిపై నర్ధమాత్రా రూపములైన హల్లులు చేర్చినప్పుడు సైతమివి నేర్లేయగును. అనఁగా నేర్ అనునది యీ క్రింది విధముగా నుండ వచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| న I (1) | నన్ U (1½) | బ్రాకెట్లలోనివి మాత్రలు. |
| నా U (2) | నాన్ (2½) | |

ఈ నాలుగు విధములైన నేర్లకు వెనుక నొక లఘువు చేర్చినచో నవి నిరైలగును. అందుచే నిరై యనునది కూడ నాలుగు విధములుగాఁ గన్పడు చున్నది.

నన II (2) ననన్ IU (2½)

ననా IU (3) ననాన్ IU (3½)

రెండు నేర్లతోఁ గూడిన గణములు.

II IU. UU. UI (తేమాగణములు)

| | |
|---|---|
| నన II | నన్నన్ UU |
| ననన్ IU | నన్నా UU |
| ననా IU | నన్నాన్ UU |
| ననాన్ IU | నన్న UI |
| నాన UI | నాన్నన్ UU |
| నానన్ UU | నాన్నా UU |
| నానా UU | నాన్నాన్ UU |
| నానాన్ UU | |

ఇందలి గల, గగములు కన్నడమున బ్రహ్మగణములు గాను గలము తెలుఁగున సూర్య గణము గాను గ్రహింపఁబడినవి.

నేర్ + విరై తోఁ గూడిన గణములు.

III న — ఇందలి న, స, గణములు కన్నడమున బ్రహ్మగణములు.
UII భ — భ, ర, గణములు కన్నడమున విష్ణుగణములు. తెలుఁగున
IIN స — నింద్ర గణములు. కూవిళంగణములు.
UIU ర

విరై + నేర్‌తోఁ గూడిన గణములు.

III న
IIU స — పుళిమాగణములు.
IUI జ
IUU య

విరై + విరై తోఁ గూడిన గణములు

IIII నల — ఇందలి నలము, నగము తెలుఁగు కన్నడములం
IIIU నగ — దింద్ర విష్ణు గణములలో నున్నవి.
IUII జల
IUIU జగ — కురువిళమ్ గణములు.

నేర్లు మూఁడింటితోఁ గూడిన గణములు.

III న — ఇందలి భరతలు తెలుఁగున . వింద్రగణములు.
UUU మ — కన్నడమున విష్ణు గణములు.
IUI జ — నగణము కన్నడమున బ్రహ్మ గణము.
UIII భ — తెలుఁగున సూర్య గణము.
UIU ర — మగణము కన్నడమున విష్ణు గణము.
IUU స
IUU య
UUI త

ఒకవిరై, 2 నేర్లతోఁ గూడిన గణములు :

IIII నల; IUII జల; IIUU సగ; IUUU యగ IIIU నగ; IUIU జగ; IUUI యల; IIUI సల ఇందు నల, నగ, సల లు తెలుఁగున వింద్ర గణములు కన్నడమున విష్ణు గణములు. సగ ము కన్నడమున విష్ణు గణము.

2నేర్లు 1 వి రైతోఁ గూడిన గణములు :

| | | |
|---|---|---|
| IIII | నల | |
| IUII | జల | ఇందలి నల, నగములు తెలుఁగున వింద్రగణములు. |
| UUII | తల | కన్నడమున విష్ణు గణములు. |
| UIII | భల | |
| IIIU | నగ | |
| IUIU | జగ | |
| UUIU | తగ | |
| UII | భగ | |

1నేర్ 2 విరైలతోఁ గూడిన గణములు:

| | | |
|---|---|---|
| IIIII | - చంద్ర - రుద్ర | |
| IIIIU | - .. | ఇందలి గణము లేవియుఁ దెలుఁగు కన్నడము లందలి ఇంద్ర విష్ణు గణములలో లేవు. |
| IIUII | - .. | |
| IIUIU | - .. | |
| UIIII | - | |
| UIIIU | | |
| UIUII | | |
| UIUII | | |

ఇంద్ర విష్ణు గణములకు సమానమైన త్రి చతురక్షర గణములు పై గణములలోఁ జాలఁ గానవచ్చు చున్నవి.

ఉదా :— జల, జగ, జ, య, తల, భల, తగ, భగ తెలుఁగింద్ర గణములలోలేని మ, నగ గణములు కన్నడమందలి విష్ణు గణములలో నున్నవి. ఈ రెండింటిలోను లేని పై జల, జగ, జ మున్నగు వానివి అజవము నుండి గ్రహించినచో మొత్తమింద్ర గణములు 16 అగును.

ఇట్లే ద్విత్రాక్షరములతోఁ గూడిన గగ స గణములను గూడ సూర్య గణములుగా గ్రహింప వచ్చును.

ఇట్లువమునందలి యీ గణములను మనసులో నుంచుకొని నన్నయ మధ్యాక్కరలను వ్రాసియుండె నన్నచోఁ బై పాదము లందలి వైరుధ్యము లన్నియుఁ దొలఁగి పోవును. అదియును గాక అద్దంకి శాసనమందలి తరువోజ

I U I I I I U U

లోని "గొఱల్చియ" (జల) యను చోటను, బెజవాడ శాసనమందలి 'గొరగల్గ' (సగ) అనుచోటను గల గణ భంగములు కూడఁ దొలఁగి పోవును. కాని యీ పద్ధతి యందును గొంతలోపము లేక పోలేదు. నాలుగు మాత్రలు గల సగణమును సూర్యగణముగా గ్రహించి జగణము నింద్రగణముగా నేల గ్రహింప వలెననియు. జల, జగ ము లింద్ర గణములుగా నుండఁగా జగణముకూడ నింద్ర గణముగా నుండవచ్చునా యనియు నాక్షేపము రావచ్చును. రెండు నేర్లను బ్రస్తరింపఁగా II, IU, UU, UI అను నాలుగు గణములు వచ్చినవి. లఘ్వాదులైన గణముల మొదట నింకొక లఘువు చేర్పవలెనను సంప్రదాయము ననుసరించి పై వాని నుండి III, IIU, UU, UI, యీ గణము లేర్పడు చున్నవి. ఇందులో సగణ మున్నది. కావున దీనిని సూర్య గణములలో గ్రహింప వలె నని మొదటి దాని కొక విధముగా సమాధానము చెప్పవచ్చును. రెండవ దానికి జగణము నొక్కదానినే యింద్రగణముగా గ్రహించి జల, జగ ముల నింద్రగణముల నుండి తొలఁగింప వచ్చుననుట కంటె వేఱు సమాధానము కానరాదు. అప్పుడు అద్దంకి శాసన మందలి గొఱల్చియ (జల) నిరాధారము కావలసి వచ్చును. ఇంద్రగణముల విషయమున నింత విశాల దృష్టి గల నన్నయ వీని నా గణములు వాడ వలసిన సీసాది పద్యములలో నొక్కచోట నైన నేల వాడలేదనుటకును సమాధానము లేదు.

ఇంక నన్నయ మధ్యాక్కర లందలి గణ వైరుధ్యమునుదొలఁగించుటకు శ్రీ గిడుగు వెంకట సీతాపతిగారు చెప్పిన యుక్తిని బరిశీలింతము. మహాక్కరకు లాక్షణికులు చెప్పిన లక్షణములలో మొదట నున్న సూర్యగణము కాక 2, 4 వ చోట్లఁగూడ నైచ్ఛికముగా సూర్య గణము లుండ వచ్చునని తెల్పఁబడి యున్నది. అట్లే మధ్యాక్కరలోఁ గూడ యతిస్థానమునకుముందున్న నాలుగు గణములలో సూర్యగణము మూఁడవ గణముగానే యుండవలసిన యక్కఱ లేదనియు నది యీ నాలుగు గణములలో నెచ్చటనైన నుండవచ్చుననియు వారి యూహ.

2. భూపాల, నీకు ని, క్కోమలి, యందుఁ, బుట్టిన, సుతుఁడు;
7. గలుగుటె, ఱింగియు, పాయపూర్వ,మునఁ గడఁగి త,త్సిద్ధి
(ఈ పద్ధతి ప్రకారము 'న' తొలఁగింప నవసరములేదు.)
6. అమరంగ, ధర్మువు, రక్షించుఁ . బ్రీతి, నవి శత్రు, లందు;
11. చలితుఁడై, నిజ నాథుఁ. డలిగినఁ, దోన, చనియె న, న్వార్త;
12. అరుణ స, రోరుహ, దళమృదు; లంబు, లైన యి, త్తరుణి;
13. పరఁగ నా, కారణ, మున నిట్టి, దుఃఖ, భారము, దాల్చె;
14. అరిగెనీ, శానుది, క్కునకునీ, యనుజుఁ డనిల వే, గమున;
16. తోనేగె, నుత్త,రము మించి, ధర్మ ని,త్యుఁడు ధర్మ, జుండు;
3. నీ పరో, క్షంబున, రాజు గా, వలయు, నెమ్మి నె ట్లీఁగ;
8. ఏమేము, మున్ను పూ,జింతుము రుద్రు నిందని. వేడ్క:

ఈ విధముగా సూర్యగణము స్థానము నైచ్ఛిక మొనరించినచోఁ బైని పేర్కొనఁ బడిన వైరుధ్యమంతయుఁ దొలఁగి పోవును. కాని యుద్ధమల్లుని బెజవాడ శాసనము నందలి యైదు మధ్యాక్కరలలో లాక్షణికులు చెప్పిన్య వరుసయే తప్పక కనఁబడుచున్నది. ఎఱ్ఱన మధ్యాక్కరలలో నా వరుసయే యున్నది. నన్నయ వాడిన 156 పాదములలో 146 పాదములం దావరుసయే పాటింపఁ బడినది. ఈ పది పాదములలోనే యీ స్వాతంత్ర్య ముండనేల యనుచో దానికి సమాధానము చెప్పఁజాలము. ఇది యైచ్ఛిక ప్రకారమగుటచేఁ దఱుచుగా నెల్లరును నిత్యమైన పద్ధతినే యవలంబించు చుండిరని చెప్పుకొన వలయును. ఈ పద్ధతి వలన ' గౌరగగ్లా. కొరులింద్య. వికిసి, బృన్దంబు, గౌవియుణ్డు. వార ' ను బెజవాడ శాసనమునందలి పాదములోని గణభంగము మాత్రము రక్షిత మగుటలేదు. అట్టి సంప్రదాయము ననుసరించినప్పుడే దానికి రక్షణ మేర్పడును. లేదా గౌఱల్చియ యను పదమునందలి .పాదము లోని 'ల్చి' అనుదానిని వలెనే ల్గా అను దానిని గూడఁ దేల్చిపలుక వలెనని చెప్పవలసి వచ్చును.

## నన్నయ సీసములు :

కవిజనాశ్రయ మందు సీసము ప్రధానముగా రెండు తెఱంగులుగా విభజింపఁబడినది. విషమసీసము, సమసీసము. ఇందు సమసీసము అవకలి సీసము,

ప్రాసనీసము. అక్కలిప్రాసనీసము. వడిసీసము. అక్కలి వడిసీసము అని యైదు విధములు. ఇట్లు సీసము మొత్తమూఱు విధములగుచున్నది. కావ్యాలంకార చూడామణిలోఁ గూడ సీస భేదము లిట్లే వివరింపఁబడినవి. అనంతుఁడు ఛందోదర్పణమున సీసములు దశ విధములని చెప్పియున్నాఁడు.

1. సమ సీసము— యతులు ప్రాసములుయథేష్టముగావాడఁబడును (సామాన్యముగ నందఱు వ్రాయునది.)
2. ప్రాసనీసము:— సీస పాదములు నాల్గింటను, గీతి బేసి పాదము లందును బ్రాసనియమము పాటింపఁ బడును. యతులు వేయఁబడును.
3. వృత్త ప్రాసనీసము:- సీస పాదములు నాల్గింట వృత్తములందువలెఁ బ్రాసము వేయఁబడును.
4. సర్వతః ప్రాసనీసము: అన్ని పాదములందు నొకే ప్రాస నియమము కలిగి యుండును, అనగా 24 చోట్ల నొకచే ప్రాసాక్షరముండును.
5. అక్కలి ప్రాసనీసము: సీసమునందలి 8 అర్ధ పాదములందును గీతి నాలుగు పాదములందును. మొత్తము 12 చోట్ల నొకచే ప్రాసాక్షరము కలిగియుండును.
6. వడి సీసము :— అన్నిచోట్ల యతి నియమ ముండవలెను. పాదాది వర్ణముతో మైత్రి గల యక్షరములే పాదము పొడవున యతిస్థలమందు రావలెను.
7. అక్కలి వడిసీసము :- అన్నిచోట్ల యతినియమము కలిగి యుండును కాని యే యతి కయ్యదియే ప్రత్యేకముగా నుండును.
8. అవకలిప్రాస సీసము: అన్నిచోట్ల ప్రాస యతి నియమ ముండును.
9. విషమసీసము :- ఉత్సాహము గీతమును గలసి యుండును.
10. సర్వ లఘు సీసము:- ఇందింద్ర గణములకు బదులు పంచ లఘు గణములు వాడఁ బడును.

ఇందలి 2, 5, 6, 7, 8, 9 సంఖ్య గలవి కవిజనాశ్రయ మందును, కావ్యాలంకార చూడామణి యందును గూడ నున్నవి. కాని యందలి యక్కలి

ప్రాస సీసమున సీసము నాల్గు పాదము లందును, గీతము నాలుగు పాదము లందును నొకచే ప్రాసాక్షర మున్నఁ జాలును. ఛందో దర్పణమున సీస పశ్చి మార్థము లందుఁ గూడ నా ప్రాసాక్షర ముండ వలయునని చెప్పఁబడినది. కవి జనాశ్రయ కావ్యాలంకార చూడామణులలో విషమ సీసము తప్ప మిగిలిన యైదును సమసీస భేదములుగాఁ జెప్పఁ బడినవి. కాని సమ సీసము వేఱుగా జెప్పఁబడి యుండలేదు. వృత్త ప్రాస సీసము కూడ నందుఁ గానరాదు. 'వృత్తంబునకు వలెవెలయు నాల్గడుగుల' అను సీస భేదముల పేర్లను దెల్పు సీసము కవి జనాశ్రయ మందును ఛందో దర్పణ మందును గూడ నున్నది. (కవి. జాత్య. 18. ఛందో.3-24)ఇందు "యతులు ప్రాసంబు లిష్ట సంగతుల నడవ నదియె సమ సీస మలరు". నని సమ సీసమును గూర్చి చెప్పఁ బడినది. నిజమునకు దానికి కవి జనాశ్రయములో లక్ష్యము లేదు. దానిని బట్టి విషమ సీసము కాక మిగిలిన యైదును సమ సీసములే. అందుచే ననంతుని ఛందము నందలి పద్యమే లేఖకులు కవిజనాశ్రయమునఁ జొప్పించి నట్లు తోఁచు చున్నది.

అప్పకవి సీసము సమము, విషమము, అని రెండు తెఱంగులని చెప్పి యందు సమ సీసము మరల నాఱు విధము లగుటచే మొత్త మేడు విధములైన సీసములను చెప్పెను. కాని యితని లక్ష్యములకును సామరస్యము కుదురుట లేనందున నాతని యభిప్రాయము స్పష్టముగాఁ దెలియ వచ్చుట లేదు.

1. సమ సీసము—యతియైనఁ బ్రాసమైన యథేచ్ఛముగా వాడ వచ్చును.
2. సర్వతః ప్రాస సీసము—అనంతుని సర్వతః ప్రాస సీసము.
3. అక్కిలి ప్రాస సీసము—ఆఱు పాదము లందుఁ బ్రాస ముండ వలెను.

| | |
|---|---|
| ఇదియే క్రొత్త ముద్రణమున వృత్త ప్రాస సీసమని పేర్కొనఁ బడినది. | ఇది యనంతుని ప్రాస సీసమునకు సరిపోవు చున్నది. |

4. వడి సీసము : మొదట నే యతి యుండునో ఆ యతినే పాద మంతటఁ గొనసాగింప వలయును. అప్పకవి యిచ్చిన లక్షణమున నీ నియమము పాటింపఁబడి యుండలేదు. (అప్ప. ४-340) ఈ వడి సీసమును, అనంతుని అక్కిలి వడి సీసమును సమానములే.

5. అవకలి వడి సీసము : పద ఖండము లందుఁ బ్రత్యేక యతులు వాడ వల యును. అనంతుని అక్కలి వడి సీస మిదియే. అప్ప కవి యిచ్చిన లక్షణమున నీ నియమము కానరాదు. (అప్ప. ४-341) ఇందు 12 చోట్ల ప్రాసయతి వేయఁ బడినది. ఇది అనంతుని అవకలి ప్రాస సీసమునకు లక్ష్యము కాఁదగి యున్నది.

6. విషమ సీసము : ఉత్సాహము తుద గీతము చెప్పవలెను.

7. సర్వ లఘు సీసము : పాద మంతయు లఘువులు గానే యుండవలయును.

అప్పకవి యిట్లేడు సీస భేదములు తెల్పి

"సప్త విధము లివియ శబ్ద శాసనుండు పంచ మామ్నాయ ఫక్కిలోఁబల్కెఁగావి కడమ కవు లాఱు సీసముల్ విడిచిపెట్టి చెలఁగి సమసీస పద్యమే చెప్పినారు."

(అప్ప. ४-34)

అని నన్నయ భట్టు తాను జెప్పిన యేడు విధముల సీసములను జెప్పె ననియుఁ దక్కిన కవులం దాఱింటిని విడిచి మిగిలిన సమ సీసము నొక్క దానినే వాడి యుండిరనియుఁ జెప్పినాఁడు. కానినన్నయ భారతములో నీ యేడు విధములలో మూఁడు విధములు మాత్రమే కనవచ్చు చున్నవి.

1. అవకలి ప్రాస సీసము. 2. అక్కలి వడి సీసము. 3. వృత్త ప్రాస సీసము. వృత్త ప్రాస సీస మాది పర్వమున రెండు చోట్ల నున్నది. (౨-21, ౩-27) ఈ రెండింటిలోఁ గూడ సీస పాదము లందలి పూర్వార్ధముల లోనే కాక పశ్చిమార్ధములలోఁ గూడఁ బ్రాసాక్షరము కాన వచ్చు చున్నది. అనంతుఁడు వృత్త ప్రాస సీసమున సీస పాదములు నాల్గింటఁ బ్రాసాక్షర మున్నఁ జాలునని చెప్పినాఁడు. అక్కలి ప్రాస సీసమున సీస పాద పూర్వ పశ్చిమార్ధము లెనిమిదిం టనే కాక గీత పాదములు నాలుగింటను కూడ నొకే ప్రాసాక్షర ముండ వలెను. నన్నయ గీతము లందుఁ బ్రాసాక్షరమును బాటించ లేదు.

దీనిని బట్టి నన్నయ వాడిన సీసములలో వృత్త ప్రాస సీసము కంటె నెక్కువ నియమములును, అక్కలి ప్రాస సీసము కంటెఁ దక్కువ నియమము

లను గానఁ బడుచున్నవి. సీస గీతము లందుఁ గల యతి ప్రాసములను బట్టి సీస పద్యములను 16 రకములుగా వింగడింప వచ్చును.

| | | | |
|---|---|---|---|
| 1. సీ. యతి.<br>గీ. యతి. | 2. సీ. యతి<br>గీ. ప్రాస | 3. సీ. యతి.<br>గీ. యతి, ప్రాస. | 4. సీ. యతి<br>గీ. ప్రాస, యతి. |
| 5. సీ. ప్రాస.<br>గీ. యతి. | 6. సీ. ప్రాస<br>గీ ప్రాస | 7. సీ. ప్రాస.<br>గీ. యతి, ప్రాస. | 8. సీ. ప్రాస.<br>గీ. ప్రాస, యతి. |
| 9. సీ. ప్రాస, యతి.<br>గీ. యతి. | 10. సీ. ప్రాస, యతి<br>గీ. ప్రాస | 11. సీ. ప్రాస, యతి<br>గీ యతి, ప్రాస. | 12. సీ. ప్రాస, యతి.<br>గీ. ప్రాస, యతి. |
| 13. సీ. యతి, ప్రాస.<br>గీ. యతి. | 14. సీ. యతి, ప్రాస<br>గీ. ప్రాస. | 15. సీ. యతి, ప్రాస.<br>గీ. యతి, ప్రాస. | 16. సీ. యతి ప్రాస.<br>గీ. ప్రాస, యతి. |

ఇందు 1 వ సంఖ్య గలది అనంతుని అక్కిలి వడి సీసము. అప్పకవి అవకలి వడి సీసము. 6 వ సంఖ్య గలది అనంతుని అవకలి ప్రాస సీసము.

సీస పాదములు ప్రధానముగా నాలుగు రకములు. (1) 8 చోట్ల యతి నియమము కలవి. (2) 8 చోట్ల ప్రాసనియమము కలవి. (3) పూర్వార్ధముల ప్రాసము, పశ్చిమార్ధముల యతి కలవి. (4) పూర్వార్ధముల యతి, పశ్చిమార్ధ ముల ప్రాసము కలవి.

ఇట్లే గీతములు కూడ ప్రధానముగ నాలుగు రకములు. (1) 4 పాదము లందును యతి నియమము కలవి. (2) 4 చోట్ల ప్రాస నియమము కలవి. (3) బేసి పాదము లందు యతి, సరి పాదము లందు ప్రాస కలవి. (4) బేసి పాదము లందు ప్రాస, సరి పాదము లందు యతి కలవి.

ఈ రెండును గలసి నప్పుడు పైవి పేర్కొనఁ బడిన 16 భేదము లేర్ప డును. వీనిలో నన్నయ 13 భేదములను వాడి యున్నాఁడు.

1. సీ. యతి / గీ. యతి } (158)

2. సీ॥ యతి / గీ॥ ప్రాస | ఆది- ౨-21; ౮-25; అర. ౨-110. (3)

| | | |
|---|---|---|
| 3. సీ॥ యతి<br>గీ॥ యతి ప్రాస | ఆది- ౮-82; అర- ౨-344. | (2) |
| 4. సీ యతి<br>గీ॥ ప్రాస, యతి | సభా- ౧-46; ౧-188 | (2) |
| 5. సీ। ప్రాస<br>గీ॥ యతి | ఆది- ౧-33; ఆ. ౮-164. స- ౨-121 | (3) |
| 6. సీ॥ ప్రా.<br>గీ॥ ప్రా. | | (33) |
| 7. సీ॥ ప్రా.<br>గీ॥ యతి. ప్రాస. | ఆది- ౮-115. | (1) |
| 8. సీ॥ ప్రా<br>గీ॥ ప్రాస. యతి | ఆది- 3-156; ౫-166; అర-౩-46, అర-౩-80 | (4) |
| 9. సీ॥ యతి. ప్రాస<br>గీ॥ యతి | ఆది-౧-80; ౩-23; ౮-4; ౮-139; ౭-186; ౮-261. స- ౧-65; ౯-107; ౨-65; ౨-30. అర- ౪-68; ౪-77; ౪-128. ౧-122; ౧-210. | (15) |
| 10. సీ॥ యతి. ప్రాస<br>గీ॥ ప్రాస | ఆది- ౨-83; 3-14; ౪-84; ౮-70. అర- ౧-102. | (5) |
| 11. సీ॥ ప్రా. య.<br>గీ। యతి, ప్రాస. | | (21) |
| 13. సీ॥ యతి, ప్రాస<br>గీ॥ యతి. | అర- ౧-191. | (1) |
| 16. సీ॥ ప్రాస, యతి<br>గీ॥ ప్రాస యతి | అర- ౨-26; ౨-94. | (2) |

12. సీ॥ ।యతి, ప్రాస
గీ। ప్రాస,యతి

14. సీ॥ ప్రాస, యతి
గీ। ప్రాస.

15. సీ॥ ప్రాస,యతి
యతి, ప్రాస.

అను నీ మూఁడు విధములను నన్నయ భారతమునఁ గాన వచ్చుట లేదు.

ఈ 251 సీసపద్యములో నాటవెలఁదులతోఁ గూడినవి 225. తేటగీతులతోఁ గూడినవి 26. కందుకూరు శాసనమందలి సీసములోని కొంత భాగము భ్రష్టమైపోయినది. లభించిన సీసపాదములను బట్టి చూచినచో నందు నన్నయ పాటించిన యతినియమమున్నట్లు కనఁబడుట లేదు.

1. శ్రీ విరవద్యుణ్డు – స్తుత్తజాతసముణ్డు యతి
   శివపదవరా (వరరాజ్య) స్సేవితుణ్డు. యతి

2. విలుదు నన్నృతరిపు – బలుదు నాహవరావ ప్రాస
   రణ్డయోధ్యసి ఘూవ నుణ్డ గణతి – ప్రాస

ప్రథమ పాద పూర్వార్ధమున యతియు ద్వితీయ పాద పూర్వార్ధమున ప్రాస యతియు నున్నవి. అట్లే పశ్చిమార్ధ ములందొక చోట యతియు రెండవ చోట ప్రాసయు కానఁ బడుచున్నవి. నన్నయ సీసములలో నిట్టి వ్యత్యయ మెచ్చటను గానరాదు. అతఁడు పూర్వపశ్చిమార్ధములందు యతియో, ప్రాసయో, యేదియో యొకటియే వేయుచుండును. చాళుక్యభీమ మహారాజు ధర్మవర శాసన మందలి సీసములో నన్నయ నియమములన్నియుఁ గానవచ్చుచున్నవి. అందలి 12 చోట్లను బ్రాసయతియే వేయఁబడినది. సీసముచివర నాటవెలఁది వ్రాయఁబడినది. కందుకూరి శాసనములోని సీసము తరువాతఁ గల గీతమును గూర్చి యేమి చెప్పుటకును వీలు లేకున్నది. అందు మొదటి యాఱక్షరములను జివర ఏడక్షరములను మాత్రము గుర్తింపఁబడినవి.

తని పక్షపాతి .... .... .... ....
.... .... ... ....
.... .... .... ....
.... ... విభవగౌరవేంద్ర.

ఆరంభమును బట్టి చూచినచో నది యాటవెలఁదియుఁగాదు. తేట గీతియుఁ గాదు. అంతమును బట్టి చూచినచో నది యా రెంటిలో నేదైనఁ గావచ్చును. క్రీ. శ. 1065 లోని సోమల దేవి దీర్ఘాసి శాసనము నందలి సీసమునకుఁ జివర నాటవెలఁది యున్నది. ఇందలి సీస పాదములలో వేరర్ధముల యందును ఆట వెలఁదిలో మూఁడు పాదము లందును బ్రాస యతి వేయఁ బడినది.

సోమల, దేవి గు, ణారామ, జగదేక

యను ద్వితీయ పాద పూర్వార్ధము నున్నదాని నున్నట్లు చూచినచో యతియే తప్పినట్లు కానఁబడును. సోమలదేవిని శ్యామలదేవిగా మార్చినచో యతి కుదురును. కాని మిగిలిన యేడర్ధము లందువలెఁ బ్రాసయతి కానేరదు. అన్నింటఁ బ్రాసవేసి యొక్కచోట మాత్రమే యతి వేయుట నన్నయ పద్ధతి కాదు. అట్లే ఎత్తుగీతి యందలి మొదటిపాదమున

కనక రుచిర రచిత కల్పావనీరుహ

యనుచో యతియు, మిగిలిన మూఁడు పాదములందుఁ బ్రాస యతియుఁ గానఁబడు చున్నవి. ఇదియు నన్నయ పద్ధతికి విరుద్ధమే.

నన్నయకుఁ బూర్వమునను బరమునను గల శాసనములలో సీసము చివర నెత్తుగీతిగా నాట వెలఁదియే వాడఁ బడినట్లు కానిపించు చున్నది. నన్నయ భారతమునఁ గల 251 సీసములలో 225 సీసముల తరువాత నాట వెలఁదియే వాడఁబడి యున్నది. దీనినిబట్టి చూడ నన్నయకుఁ బూర్వ మాట వెలఁదియే సీసముల తరువాత నెత్తుగీతిగా వాడఁబడుచుండె ననియు, దానితో పాటు తేటగీతిని కూడ నెత్తుగీతిగా వాడు సంప్రదాయమును నన్నయయే యారంభించె నేమో యనియు సందేహము పొడము చున్నది. కవిజనాశ్రయమున 'నాలుగు పదములఁ జెలువగు నొక గీతితోడ సీసం బలరున్.' (జాత్య-12) అని చెప్పఁబడినది. కావ్యాలంకార చూడామణిలో సీసముల చివర నాట వెలఁదియుఁ దేట గీతియుఁ గానఁబడు చున్నవి. ఛందో దర్పణమునఁ గూడ నీ సందర్భమునఁ గవిజనాశ్రయములోని లక్షణమే యుద్ధరింపఁ బడి యున్నది. (3-22) అప్పకవి "వాసి చరణములు నాలుగుచేసి, తుదిని గీత మొకటి చెప్పఁగ నయ్యెన్ సీస" (४-336) మని తెల్పి యుండెను. దీనిని బట్టి యీ లాక్షణికుల యభిప్రాయమున సీసము తరువాత నాట వెలఁది తేట గీతులలో నేది యైనను వ్రాయ వచ్చునని స్పష్టపడు చున్నది. నన్నయ భారతము నందలి లక్ష్యము ననుసరించియే వారట్టి నిర్దేశము నొనరించి యుందురు.

పద్మకవి (941) జినేంద్ర పురాణము నందలిదనియు, సర్వదేవుని (953) విరాటము నందలి దనియు వర్ణన రత్నావళిలో నుదాహరింపఁబడిన సీసములలోఁ గూడ నన్నయ సీస నియమములు కానవచ్చుటలేదు. పద్మకవి

సీసము నందలి పాదార్ధము లెనిమిదింటిలో యతియుఁ బ్రాస యతియుఁ గూడ నున్నవని చెప్పవచ్చును. దానిచివరఁ దేటగీతి యున్నది. ఇందలి బేసి పాదములలో యతి వేయఁ బడినది. ఇందలి గీతముకూడఁ దేటగీతియే. ద్వితీయ పాదమునఁ బ్రాసయతియుఁ జతుర్థ పాదమున యతియుఁ గావఁ బడు చున్నవి. సర్వదేవుని సీసపాదార్ధములలోను, గీత పాదములలోను యతియో ప్రాసయో యథేచ్ఛముగా వేయఁబడినవి. ఇందలి గీతము కూడఁ దేట గీతియే. ఈ రెండు పద్యము లందు యతి విషయమున నన్నయ పాటించు నియమములు కాన రాకుండుటయు, నెత్తు గీతులుగా, నాటవెలఁదులు కాక తేటగీతులు చెప్పఁ బడుటయు వాని ప్రాచీనతను సందేహాస్పద మొనరించు చున్నవి.

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో

"తన పాదంబులు నాలుగు
మొనసిన పై గీతి పాదములు రెండునుగా
విను మూఁడై సీసమునకుఁ
జను నడుగులు వ్రాలు వళ్ళు సరి యిన్నిటికిన్ (ఠ-36.)

అని సీసము నందు మొత్తమాఱు పాదము లుండునని చెప్పినాఁడు, దీనిని బట్టి చూడ పూర్వము సీసపద్యము నాలుగడుగులుగా వ్రాసెడివారని తోఁచు చున్నది. నన్నయ సీసపద్యపాద పూర్వపశ్చిమార్ధములందును గీతము నందలి సరి బేసి పాదము లందును బాటించు సమాన యతి నియమము కూడ నీ విషయమును బలపఱచు చున్నది. కవి జనాశ్రయ మందును, ఛందోదర్ప ణమునందును, 'నాలుగు పదములఁ జెలువగు నొకగీతితోడ సీసం బలరున్.' జాత్య 12. అని గీతి చతుష్పాదిగా నుండఁ దగునని సూచింపఁ బడినది, ఇట "నాలుగు పదముల" ననునది సీసమునకుఁ గూడ నన్వయింప వచ్చును' కాని కవి జనాశ్రయమున గీతుల లక్షణమును జెప్పునప్పుడు.

శ్రీ దయితాధి పాన
యోదయ వల నవ త్ర
యోదిత మైన నెత్తు
గీదియ యొప్పుఁ గృతుల- (జాత్య. 20).
సూర్యుఁడొకని మీఁద సురరాజు లిద్దఱు
దినకర ద్వయంబు తేటగీతి. (23)

అని నాలుగు పాదములలో నొక పాదము యొక్క లక్షణమే చెప్పఁబడుటచేఁ దత్కర్త యుద్దేశమున గీతి చతుష్పాది యనియే వ్యక్తమగు చున్నది. ఆట వెలఁది తేటగీతుల రెండేసి పాదములు కూడినచోఁ గొంచెె మించు మించుగా నొక్క సీసపాదముతో సమానము లగును. అందుచేఁ బై సీస పాదముల నాల్గింటితో సమానముగా గీతిని గూడ మొదట రెండు పాదముల గానే వ్రాయు చుండిరని తోఁచుచున్నది.

నన్నయ గీతి పాదములలోఁ గూడ సీస పాదములందువలెనే నాల్గింట యతియో, ప్రాసయో లేక బేసి పాదముల రెంటను సరిపాదముల రెంటను యతియో ప్రాసయో కూర్చుచుండును.

సీసగీతి పాదములందు నన్నయ పాటించిన నియమముల విషయమున ముద్రిత ప్రతులలో నక్కడక్కడ నుల్లంఘనము కానవచ్చుచున్నది. ఇట్టి యుల్లంఘనము గల చోట్లు చాలఁ దక్కువ. నన్నయ బుద్ధిపూర్వకముగా నట్టి యుల్లంఘనముఁ జేసి యుండఁడు. లేఖక ముద్రాపక ప్రమాదము వలన నవి గ్రంథమునఁ జొచ్చియుండును. వ్రాఁతప్రతులను బరిశీలించినచో వానిలోఁ బెక్కింటికి సరియైన రూపములు కానవచ్చును. ముద్రిత ప్రతులలోఁ గూడ నూటికి 99 పద్యములలో నా నియమములు కానవచ్చు చుండుటయు, నుల్లంఘ నము గల కొన్ని పాదములకు వ్రాఁతప్రతులలో లభించిన పాఠములం దవి సరియైన రూపములతో గోచరించుటయు, నన్నయయే యీ యుల్లంఘనము బుద్ధి పూర్వకముగా నొనర్చి యుండఁడనుటకు హేతువులు. నియమోల్లంఘ నము చూపట్టు పాదముల నిచ్చట నుదాహరించెదను.

1. అప్పురుషుం డింద్రుండయ్యె క్షమైరావతంబు గోమయ-మమృతంబు నాగ
.... .... ... ... .... .... యును విధాతయు వారి యనువయించు
.... .... .... ... .... .... రాత్రంబు ద్వాదశా రములు గలుగు
.... .... .. . .... .... .... మారు లయ్యార్వురు మఱియు
బుతువు. (ఆది. ౧- 118)

ఇందలి 1, 3, 4 పాదముల పశ్చిమార్ధములలో యతియు 2 వ పాదము పశ్చిమార్ధమునఁ బ్రాసయుఁ గలవు.

2. (ఆది ౨-83)

బ్రహ్మణ్యుఁడగు కశ్యపబ్రహ్మవరమున, వినతకుఁబుట్టిన-యనఘమూర్తి
ఇంద్రుఁడై పరఁగిన- యిద్ధతేజు
అరంగ మ్రింగిన- ఘోరవీరు
కొని దివిఁ బఱచిన- యనిలవేగి.

ఇచ్చటఁ గూడ మూఁడు చోట్లఁ బ్రాసయతి యుండఁగా నొక్క-చోట మాత్రము యతి వేయఁబడినది. 'ఇంద్రుఁడై పరఁగిన రుంద్ర (సాంద్ర) తేజుఁ' దని నన్నయ వ్రాసి యుండును.

3. (ఆది. ౨-130).

జనమేజయునిచేయు సర్పయాగమునకు విఘ్న మందఱము గా వింత మతఁడు .

ధర్మార్థి గావున ధారుణీసురులమై. యడుగుద మీ క్రతు వుడుగు మనియు ఈ సీసమున సర్వత్ర వడినియమముండ వలసినది. కాని ద్వితీయ పాద పశ్చిమార్ధమునఁ బ్రాసయతి కనఁబడుచున్నది. వ్రాఁత ప్రతులలో దీనికి "యడుగుదమిష్టి పేయకు మటనియు" అను పాఠమున్నట్లు శ్రీ గిడుగు వేంకట సీతాపతిగారు వావిళ్ళ రజతోత్సవ సంచికలోఁ దెల్పియున్నారు. (671) వావిళ్ళ వారి భారత ప్రతిలోఁగూడఁబుట క్రింద నీ పాఠము సూచింపఁ బడినది. ఇదియే నిజమైన పాఠముగాఁ గనఁబడుచున్నది.

4. (ఆది. ౨- 186).

"ధరణి యెల్లను రక్షించు ధర్మచరితు,
నా పరీక్షితు రక్షించి యతనిచేత
నపరిమిత ధనప్రాప్తుఁడ నగుదుఁ గీర్తి
యనుధనము ధర్మువు నాకుఁ గొనుట యుఱదె"

ఇందుఁ దుది పాదమున మాత్రము ప్రాస యున్నది. మిగిలిన మూఁడు పాదములలో యతి వేయఁబడినది 'యను ధనము ధర్మువును నాకు నందుటుఱదె' అని దీనిని సవరింప వచ్చును.

5. (ఆది. ౩-224)

"సకలధర్మ విదుండవు- సర్వలోక
వర్తనము లెఱింగిన పుణ్యకర్త వీవు
నెయ్యమొనరంగ నొనరింపుమయ్య నాకు;
వెలయఁ బుణ్య లోకంబులు గలవె యవిన."

ఇందు మొదటి పాదమునఁదక్క మిగిలిన యన్ని పాదములందుఁ బ్రాసయతి వేయఁబడినది. 'సకల ధర్మ విదుండవు- సకలలోక' అని యీ పాద ముండఁ దగును.

6. (ఆది. ౬-52).

"కదఁగి సూతుఁడు పుత్త్రకుఁ గౌఁగిలించు
కొని తదీయ మూర్ధాఘ్రాణ మొనరఁజేసి
యంగ రాజ్యాభిషేకార్థమైన శిరము
దడిపె వెండియు హర్షాశ్రు తతులఁజేసి."

ఇందలి రెండవ పాదమునఁ బ్రాసయతి యుండ నాల్గవ పాదమున యతి కని పించు చున్నది.

7. (ఆది. ౬-198).

"అధిక వీరుండు రక్కసుఁ - డరుగుదెంచు
నని మనంబున భయమంది - వనజనేత్ర
వీరి సుఖ సుప్తులై యున్న - వారి నిద్ర
పెడఁగ బోధింప నోప నా - కడిమి వినుము.

మొదటి పాదమున యతి కలదు. మూఁడవ పాదమునఁ బ్రాసయతి యున్నది.

8. (ఆది. ౭-111)

"ఎట్టి రాజులను మహీసురోత్తము లెదు
రరుగుదెంచునప్పు డధికభక్తి
నెరఁగి ప్రియము పలికి- తెరువిత్తు రిట్టిద
ధర్మ మీవు దీనిఁ దలఁప వెట్టు"

మూఁడవ పాదమున మొదట 'నెరఁగి' యనుటకు 'తెరలి' యను పాఠాంతర మున్నది. అదియే సరియైన పాఠమై యుండును.

9. (సభా.౧-25).

"మీ వంశమున వర - దేవోత్తములదైన-
ధర్మవిదుండవై - ధర్మార్థకామంబు-
కాల విభక్తముల్ - గాఁ జేసి సేవించె-
యిమ్ముల నవర రా - త్రమ్ములం దెప్పుడు"-

1. 2. 4. పాదముల పూర్వార్ధమందుఁ బ్రాసయతి వేయఁబడినది. 3 వ పాదమున వడినియమము పాటింపఁ బడినది.

(10. సభా. ౧-135).

"అతిసమర్థుండు బృహద్రథుఁ డనువాఁడు
మగధాధినాథుఁ డున్మార్గదూరు"

.... .... .... .... ....

.. .... .... .... ....

సమరంగఁ బెండ్లియై సమమైన ప్రీతి న
య్యిరువురయందు భోగేచ్ఛ సలిపి."

ఇందలి పూర్వార్ధములు వడి నియమము కలవి. నాల్గవ పాదమున మాత్రము ప్రాస యతి కనఁబడు చున్నది. పెక్కు వ్రాఁత ప్రతులలో 'నమరంగఁ బెండ్లియై ననుపమ ప్రీతి న' అను పాఠాంతర మున్నది. ముద్రిత ప్రతులలో నీ పాఠము పుట యడుగునఁ జూపఁబడినది. (పుట. 259 - వేమూరు వెంకట కృష్ణయ్య & Sons). ఇదే సరియైన పాఠము.

11. (సభా ౧-271)

కురువీర నీ ధర్మ పరిపాలనంబున, నే గుణ సంపద నీ విశుద్ధ

........ ........ ........ ........

........ ........ ........ ........

వహ్నియు భయమును, వఱపును గఱవును
నాదిగాఁగల యెగ్గులఁదఁగెఁబురమి.

ఇందన్ని పూర్వార్ధములందుఁ బ్రాసనియమముండ వలయును. చతుర్థ పాదమున వడినియమమే కనఁడుచున్నది.

12. (సభా. ౨-242.)

"తే. సాక్షియును ధర్మదర్శియు - సాక్ష్య విధులు
దప్పఁగాదు తప్పినను నధర్మయుక్తి
వరుణపాశసహస్రంబు - వానిఁ గట్టి;
పాయునేఁటేఁట నొక్కొక్కఁ డాయతముగ

రెండవపాదమున యతి వేయఁబడినది. 4 వ పాదమునఁ బ్రాస యతి వేయఁబడినది.

13. (అరణ్య ౧-42.)
"హితుఁడైన తనపురో - హితునుపదేశంబు
పేర్మితోఁ జేకొని - ధర్మ సుతుఁడు
........ ....... ........పూజించి భాగీరథీజలంబు
........ ....... .......ననవరతావధానమున నొడిచి
...... ....... .........సూర్యాదినామముల్ సూర్యగుఱిచి

ఇందలి పాదములన్నియుఁ బ్రాసయతి నియమము కలవి. తృతీయ పాద పశ్చిమార్ధమునఁ బ్రాసయతిలేదు. అఖండ యతి యున్నది. పుటయడుగున

'ననవరతానుభావముగ నొడిచి. (అర. 6 పుట) అను పాఠాంతర మొసంగఁబడినది. ఇందును యతి భంగము చూపట్టుచున్నది.

14. (అర. ౧-102)
"సీ........ ... ....
........ .......

"తే. ఘోరవనమున వీరుఁ గిమ్మీరుఁ డను సు
రారి నిశ్చల ఘన భీకరాంగుఁ బట్టి
పోర వధియించినట్టి సమీరజునకు
భూరిభుజునకు మ్రొక్కెను వారు గలరె.

ఈ తేటగీతి సర్వత్ర ప్రాసనియమము కలది. రెండవపాదమున యతి వేయఁబడినది. దీనికి 'రారినిశ్చల భీకరాకారుఁబట్టి' అనుపాఠాంతర మున్నది. ఇదియే సరియైన పాఠము కావచ్చును. ఇట్లున్నచోఁ బ్రాసయతి నియమము మాత్రమేకాక సమాన ప్రాసాక్షర నియమముకూడఁ బాటింపఁబడిన ట్లగును. నన్నయ సీస పాదములలో నిట్టి ప్రాసాక్షర నియమమును రెండుచోట్లఁ బాటించియుండెను. (ఆది.౨-21,3-27)

15. (అర. ౧-188.)
వరకు పాశాంకుశ కరవాల శూలముద్గరములు నా మీఁదఁ దెరలఁగురిసె
.... .... .... ....
వెఱవక సాల్వుండు - వెండియు నా మీఁద

ఈ సీస పాదములందు సర్వత్ర ప్రాస యతినియమ ముండవలెను. మూఁడవ పాదము పూర్వార్ధమున మాత్రము యతి వేయఁబడినది.

16. (అర. ౨-230.)

సీ. . .. ....

ఆ॥ కడుఁబ్రసిద్ధ మిదియుఁ - గర్కోటకువిఁ దమ
యంతిఁబుణ్య మూర్తి - యైన నలుని
నుత చరిత్రుఁడైన - ఋతుపర్ణుఁ గీర్తింపఁ
గలి భయంబు లెల్లఁ - గ్రాగు నధిప.

ఒక్క మూఁడవపాదమునఁ దప్ప మిగిలిన మూఁడు పాదములందును వడి నియమము పాటింపఁబడినది. వ్రాఁత ప్రతులలో 'ఋజు చరిత్రుఁడైన, ఋషి చరిత్రుఁడైన', అనుపాఠములున్నవని శ్రీ గిడుగు వేంకట సీతాపతిగారు రజతోత్సవ సంపుటము 672 పుటలోఁ దెల్పియున్నారు. నన్నయ యీ పాఠములలో నేదో యొకదానిని వ్రాసియుండును.

17. (అర. ౩-162.)

సీ॥ .... ... ....

ఆ॥ ఆచరించుచున్న నీచ దుర్యోధనాదులకు వర్ధనమును నలఘులైన
పాండు నందనులకు దండితారుల క్షవర్ధనము నిట్లు సేయఁదగునె విధికి.

ఇందలి తుదిపాదమునఁ దప్ప మిగిలిన పాదములందుఁ బ్రాసయతి వేయఁబడినది. 'ర్ధనము నిట్లు సేయఁజనునె విధికి' అని యున్నచో నియమ భంగము తొలఁగిపోవును.

18. (అర. ౪-119.)

"సీ॥ ... ...

ఆ॥ గలశ భవుఁ డగస్త్యుఁడలిగి యత్యుగ్రహి
వగు మనియును శాప మొగిన యిచ్చె
మునివరేణ్యు శాపమునఁ జేసి యిప్పాట
నవయుచున్నవాఁడ నాఁటగోలె."

తుది పాదమున యతియు మిగిలినపాదములందుఁ బ్రాసయతియుఁ గనఁబడుచున్నవి.

19. (అర. ౪-128.)

"సత్య క్షమా దమ-శౌచ దయా తపో
దానశీలంబు లెందేనిఁగాన

నగునట్టివాఁడు బ్రాహ్మణుఁడగు సుఖము దుః
ఖంబునై నెడ విమోహమునుబొంద
కునికియ వ్వానికి-ను త్తమంబగు వేద్య
మనిన నీ చెప్పిన యగ్గుణములు
క్రియ శూద్రునందుఁ గల్గిన నతం డుత్తమ
ద్విజుఁడు గానేర్చునే-నిజమువిడిచి."

ఇందలి పశ్చిమార్ధములలో రెండింటఁ-బ్రాసయతియు, రెండింట వడినియమమును గనఁబడుచున్నవి. రెండవపాదమున ఖ విసర్గ పూర్వకమగుటచే హకారమునకు యతివేయఁబడినది. దీనిని 'ఃఖ మునునై నెడలి మోహమును బొంద' అనియు, మూఁడవపాదమున బశ్చిమార్ధమును 'మనిన నీ చెప్పిన గుణము లివ్వి' అనియు సవరింప నవకాశమున్నది.

20. (అర. ౧-49.)
"వీని పుట్టిన పాపంపు వేళఁబెక్కు-
దుర్నిమిత్తముల్ పుట్టిన నిర్ణయించి
యేను చెప్పితిఁ దొల్లియు వీనిచేత
నెట్టుఁగౌరవులకు నెగ్గు వుట్టు ననియు."

మొదటిపాదమందొక్క-చోటనే యతినియమ మున్నది. తక్కి-న మూఁడు పాదములఁ బ్రాసయతి కనవచ్చుచున్నది.

21. (అర. ౨-262.)
"క్షత్త్రి వధనైన పాపంబు గ్రాగవలయుఁ
గడఁగి నాకును సద్గతి గలుగ వలయు
నివియుఁ బుణ్యతీర్థంబులై యిద్ధరిత్రిఁ
బరఁగుచుండగవలయు మీ కరుణఁజేసి."

రెండవపాదమున యతియు నాల్గవ పాదమునఁ బ్రాసయతియుఁ గనవచ్చుచున్నవి. రెండవదానిలో దలల కభేద ప్రాసమని చెప్పుకొన్నచో నీ భంగము నివర్తిత మగును.

22. (అర. ౪-31.)
"ఆ నీవు సూచుచుండ-నీ యిష్టుఁడిమ్మణి
మంతుఁ డిపుడ తనదు ముదము పేర్మి
నన్ను నుఱక యుమిసె నా మీఁద నిట్టి యి
ద్దనుజుఁడీల్గ నొక్క- మనుజుచేత."

నాల్గవ పాదమున నొక్క-చోటనే ప్రాసయతి యున్నది.

23. (అర. ౮-180.)

ఆ॥ పాంచజన్యరవము- పంచమహాశబ్ద
రవము( జెల(గె దిశలు-చెవుడు వడ(గ
నొలసి జనుల దీవనలు మించె రమ్యమై
గరుడ కేతనంబు గ్రాలె(జదల."

తుదిపాదమున నొక్క-చోటనే వడినియమము పాటింప(బడినది. రెండవ పాదమున 'రవము-చెవుడు' అని ప్రాసయతి కన(బడుచున్నది.

24. "ఆ॥ ఎంతమోటువడిన-నంతియ జూదంబు
నందు(దగులు(జలము నతిశయిల్లు
నేమిసేయుదాన-నిది యెగ్గునకు మూల
మని లతాంగి దుఃఖితాత్మ యగుచు."

మొదటిపాదమున( బ్రాసయతియు మూ(డవపాదమున వడినియమము గలవు.

25. (అర. ౨-150.)

"ఆ॥ నైషధేశ్వరుండు నలు( డిప్పు డసమర్థు(
డగుట(జేసి తమ్ము నమ్మ లెఱు(గ
కుండ మందు(గాన యుమ పభాంతరముల
కరిగి యిట్టులను(డు వరుప మీరు." 'యురుపభాంతరముల' అని పాఠాం.

రెండవ పాదమున యతినియమము కలదు. నాల్గవదానిలో( బ్రాస వళి కన(బడుచున్నది. దీనికి 'అరిగి యరిగి యిట్టు-లను(డు మీరు' అను పాఠాంతరమున్నది. ఇదియే సరియైనది కావచ్చును.

26. (అర. ౨-179.)

"ఆ॥ వాని(జూచి నలు(డు-తా నల్గి శాప మీ
నున్న( గలి యెఱిగి- విన్ను(బొంది
యహివిషంబుచేత-నవికంబు దగ్ధుండ
నైతి వింక నాకు-నలుగ వలదు."

మొదటిరెండుపాదములలోఁ బ్రాస వళియుఁ దుదిపాదములలో వడి నియమమును గానవచ్చుచున్నవి. ఇట్లుండుట నన్నయకు సమ్మతముకాదు.

పైని సూచింపఁబడిన నియమభంగములలోఁ బెక్కు లేఖక ప్రమాదములు గానఁబడుచున్నవి. మిగిలిన వానినిగూడ సులభముగా సవరింప నవకాశమున్నది. వ్రాఁతప్రతుల సాహాయ్యమున నీ లోపములను దొలఁగింపవచ్చును.

యతి ప్రాసలు :

కవిజనాశ్రయమునఁ బదియును, గావ్యాలంకార చూడామణిలోఁ బంద్రెండును, ఛందోదర్పణమున నిరువది నాలుగును, అప్పకవీయమున నలువది యొక్కటియును యతిభేదములు చెప్పఁబడియున్నవి. దీనినిబట్టి కాలక్రమమున యతుల సంఖ్య పెరిఁగినట్లు కన్పించుచున్నది. అనంతుఁడును అప్పకవియుఁ దత్పూర్వము చెప్పఁబడిన యతులందే స్వల్పభేదములను బురస్కరించుకొని క్రొత్తపేర్లు కల్పించి యతుల సంఖ్య ననవసరముగాఁ బెంచిరనియుఁ జెప్పవచ్చును. పై లాక్షణికులలో నందఱి కంటె నెక్కువ సంఖ్యగల యతుల చెప్పిన వాఁ డప్పకవి. నన్నయ భారతమున నీ యతి భేదములలోఁ గొన్ని మాత్రమే కానఁబడుచున్నవి. నన్నయ పాటించిన యొందు రెండు యతుల కప్పకవీయమున లక్షణము కానవచ్చుటలేదు. నన్నయ భారతమునఁ జూపట్టు యతివిశేషముల నిచ్చట నుదాహరించెదను.

1. ఋవళి - రి-రీ రె-రే లకును ఋత్వమునకు యతిచెల్లును.

ఋత్విజులందఱి విచారించి పూజించితే వసుదేవుఁ డుండంగ వసుమతీశ (సభా. ౨-11)

అప్పకవీయము, సర్వలక్షణ సారసంగ్రహము, లక్షణ శిరోమణి, కవి జన సంజీవని అను లక్షణ గ్రంథములందీ యతి కీ సీస పాదము లక్ష్యముగా నొసంగఁబడినది. దీని ననంతుఁడు రీవళి యని పేర్కొనెను. (౧-88)

2. ఋత్వసంబంధవళి : 'సౌరిదిఁ గాదులఁ గల వట్రుసుడుల కెల్ల
ఋత్వ మిత్రంబు లగు నచ్చు లెనయ నైదుఁ
జెల్లుహయలును స్వరమైత్రి చెందునపుడు.
(అప్ప. ౩-26).

మధ్యా. ఇందుండు మీ నని కృష్ణమృగ చర్మకృతకు శాసనము. (అర. ౩-97).

అనంతుఁడు ఋత్వసంబంధ ఋత్వ సామ్య వడులను గలపి ఋకార స్వరూపయతి యని పేర్కొనెను.

3. అతని వంశమున వా రతిధన లుబ్ధులై

కృతవీర్య ధనమెల్లఁ గ్ల ప్తిసేసి -(ఆది. ౬-132)

ఇందలి పశ్చిమార్ధమున కృ-క్ల అను వానికి యతి వేయఁబడినది. శ్రీనాథుఁడు దీనినిబట్టియే కాశీఖండమున

ఘృత పయోరాశి సంక్లప్తావధిక మైన (౭-281).

అనుసీస పాదమున ఘృ-క్ల అనువానికి యతి వేసియుండెను. ఈ యతి నప్పకవి చెప్పియుండలేదు.

అనంతామాత్యుఁడు.

ఘన లకారంబ యగును ఌకార విరతి

క్లప్తిలేదు శౌరిగుణావళికి ననంగ (౧-90).

అని ఌకారమునకును ఇకారసహిత లకారమునకును యతి చెప్పెను. కాని యీ లక్షణమునకు లక్ష్యము లెచ్చటను గానవచ్చుట లేదు. నన్నయ శ్రీనాథుల ప్రయోగములు కానవచ్చుటచే ఋకార ఌకారములకు యతి చెల్లునని చెప్పవచ్చును. దీనినే ఌకారయతి యని పేర్కొన నగును.

4. ము విభక్తిక యతి.

"పున్నపుంసక తత్సమంబుల కడపలఁ
దత్సమానాంధ్ర దేశ్యశబ్దముల తుదలఁ
గదిసిన మకార శృంగముల్ కావ్యములను
బొసఁగు ము విభక్తి యతులనఁ బుపుబు భులకు."

అని అప్పకవి దీని కిచ్చిన లక్షణము. అనంతుఁడు దీనిని బోలికవడి యని పేర్కొనెను. (3.70) నన్నయ ఈ యతి నియమమును సర్వత్ర పాటించి యుండెను. అతఁడొక్క విభక్తి ముకారమునకుఁ దప్ప నితర ముకారములకు పుపుబుభులతో యతి వేయఁడు. దీనికిఁ గారణ మిది యనకుఁ జెప్పఁబడినది.మన మిప్పు డమహద్వాచకములకుఁ బ్రథమా విభక్త్యేకవచనమునఁ జేర్చు 'ము' కారము నన్నయకుఁ బూర్వము 'మరబు, కలబు, నాగబు,' అను వట్లు బుకార ముగాఁ గాన వచ్చుచుండెను. నన్నయ భారతమున నారూపములు కానిపింపవు.

బహుశః తనకుఁ బూర్వము శాసనములలో బు, ంబు, ము అనువానితో ముగియు వివిధ రూపములు చూచి యాతఁడు ము కారముతో ముగియు రూపమునే శిష్ట రూపముగా స్థిరపఱిచి యుండును. ఈ ముపర్ణమే యిప్పుడు ంబు. మ్ముగాఁ గూడ వ్రాయఁబడు చుండును. ఈ విధముగా విభక్తి ముకారమునకు బుకారమునకును గల యభేద మెఱింగిన వాఁడు కావుననే నన్నయ వానికి మాత్రమే యతి మైత్రి పాటించెను. తరువాతి కవులీ నియమమును సడలించి యన్ని ముకారములకును పు ఫు బు భు లతో యతిమైత్రి సంఘటించిరి. అప్పకవి యిందలి భేదమును సూచించుటకై యొకదానికి ము విభక్తిక యతి యనియు వేఱొక దానికి ము కార యతి యనియు భిన్ననామము లొసంగెను.

కం. "బోరన ద్వానగ్నిసూక్త- ములతో నెసఁగెన్" (ఆది. ౨-39).
కం. "భూసుత ధాన్యంబు బీజ-ములు వణిజాలకున్" (సభా. ౧-43).
తే. పురము వెలి మూఁడహోరాత్ర-ములు వసించి (అర. ౨-65).
నన్నయ కేవల ము కారయతి వెచ్చటను వాడి యుండలేదు.

6. పెఱయతి : ధాతువు లించుగాగమముతోఁ గూడినపుడొక్క-వ్యంజనముకే. యతి వేయవలె నని యప్పకవి యభిప్రాయము. అనంతుఁడు కూడ నీ యభి ప్రాయమునే వెల్లడించెను.

"అంచిత తిలకము శౌరి ధ
రించె ననఁగ జగణమధ్య రేఫ విరతియౌ
నంచిత తిలకము హరి ధరి
యించె ననఁగ భిన్న విరతి నిత్యము వచ్చున్ (౧-122).

ఇచ్చట స్వరమైత్రి కూర్చుట వారికి సమ్మతము కాదు. కాని నన్నయ భార తము నందలి యీ క్రింది ప్రయోగమున స్వరమైత్రి కూడఁ గనఁబడు చున్నది.

ఉ. వీరలు దైవశక్తి ప్రభ వించిన వారగుటేమి సందియం
బీ రమణీయకాంతి నుపమింపఁగ వేల్పుల కాక యిట్టి యీ
(ఆది. ౫-151)

ఇందు మొదటి పాదమున వ్యంజనమునకును రెండవ పాదమున స్వరమునకును యతి వేయఁబడినది. నన్నయ కీ రెండును నభిమతములే

కావచ్చును. కాని స్వరమైత్రి పాటించినందు కీ యొక్క ప్రయోగమే కనఁబడుచున్నది. పద్మ పురాణ ద్వితీయాశ్వాసమున.

ఇరవుగఁదా ధారగొని భుజించుట యొప్పున్. (11-93).

అను చోటఁ గూడ స్వరమైత్రి చూపట్టుచున్నది.

ఎక్కటియతి : యతి విషయమునఁ గొన్ని యక్షరముల కితరాక్షరములతో మైత్రి యుండదు. వానికవే యతులుగాఁజెల్లును. అట్టియతికెక్కటి యతి యని పేరు. అప్పకవియు చిన్నకోట పెద్దనయు దీని నేకతరయతి యని పేర్కొనిరి. ఈ యతికి లక్ష్యములగు నక్షరములను జెప్పుటలో లాక్షణికులందు భిన్నమతములు గోచరించుచున్నవి.

"మరఱలవ" ములన నేన

క్షరములు తమ తమకె వళ్ళు కమలాధీశా" ‌। కవిజనా. (సంజ్ఞా. 72)

కావ్యాలంకార చూడామణి కూడ నీ యక్షరములనే పేర్కొనెను.

"మరవలఱ లేకతర వళు
లరయఁగఁ దమతమక కవుల యను మతి వళులై. (కావ్యా. ౬-43).
ధర నెక్కటి వళ్ళై తగు
శర మఱ వలు-" (ఛందో. ౧-118).

మహివిరేఫాక్షరంబును మఱి శశాంగ
నామక ఱ కారమును సవర్ణంబులయ్యుఁ
గావ్యముల యందు నొకటి నొక్కటిఁ గలయక
తమకుఁ దామయె యగు నేకతర యతులన. (అప్ప. ౩-85).

లళ లకును. ప. ఫ. బ. భ. వ లకును నన్నయ భారతమున యతి వేయఁబడి యుండుటచే నాతని మతమున మ. ర. ఱ. లు మూఁడే యేకతరయతి చెల్లు నక్షరములని చెప్ప వచ్చును.

"వేద ముఖమున వబయోరభేద యనుట వలన వ బలొక్కటొక్కటి
విలుచు విరతి
కవని లడలకు లళలకు నట్ల కలిమిఁ జేసి తమలోన నవియును
జెల్లుచుండు" (అప్ప. ౩- 87).

అని వబలకును, లడళకును అభేదయతి యనుపేర యతి చెల్లునని అప్పకవి చెప్పి యుండెను. అభేద వర్గయతి యను మఱొక పేరు పెట్టి ప ఫ లకుఁ గూడ వ తో యతి చెల్లునని నుడివి యుండెను. అనంతుఁ డీ రెండు యతులను సంగ్రహించి అభేద యతి యను పేరఁ బేర్కొని యుండెను, అతఁ డభేదవర్గ యతిని వేఱుగాఁ బేర్కొని యుండలేదు.

"ప్రకట పకార వకార
ద్వికముఁనకుం జను నభేద విరతి-" (౧-126).

లళలకు

"లలిత కృశోదరంబు తరళ త్రివళీయుత రోమరాజియున్"
(ఆది. ౪-43).

ప ఫ బ భ వ లకు

"వల్లభ తక్షకాధము నెపంబున సర్పము లెల్ల నగ్నిలో." (ఆది ౧-125).
ఇచ్చట నెవంబున అనియే పాఠమనియు, శ్రీనాథుఁడు 'చివురు కెమ్మోవి చిఱుగాటు నెవము గాక'. (నైష. I-47) అని నెవమని ప్రయోగించి యుండెననియు శ్రీ విశుదవోలు వెంకట రావుగారు అప్పకవీయ పీఠికలోఁ (పుట. 16) జెప్పి యున్నారు.

"వ్రత యొక బావిమేలు మఱి బావులు నూఱిటి కంటె నొక్కసత్"
(ఆది. ౪-93).

రంగకవియు నప్పకవియు నభేదయతి కీ పాదము నుదాహరించి యుండిరి. కొందఱు బావి యను చోట వాపి యను పాఠాంతరమును సూచింతురు. ఇది, యభేద యతి నన్నయ కభిమితము కాదని చెప్పుటకై తెచ్చిపెట్టినట్లున్నదే కాని సహజముగా లేదు.

కం॥ బ్వాలలోపలఁ బెద్ద ధర్మ-వు నసత్యమునన్.... (ఆది. ౫-92.)
మత్త॥ వీరు వారను నట్టి బుద్ధి వి-భేద మెన్నఁడు లేదు గాం (ఆది. ౮-29)
కం॥ పీనోన్నత కుచము వోలె- వెలిఁగెడి దానిన్ (అర. ౩-292).
సీ॥ వేణి సరస్వతి- పెన్న యైరావతి-(సభా. ౧-71).
చం॥ ర్వతము గ్రహించునట్లు తన- బాహుల వాని గ్రహించి పోర న
శక (అర. ౧-311).

ముద్రిత ప్రతిలో గసడదవాదేశము ననుసరించి ప కారమున కాదేశముగా వచ్చిన వ కారమున కభేదయతి పెక్కెడలఁ గానవచ్చుచున్నది.

తే॥ పరఁగ నవి మనయందు వీ-ద్వడియె నిన్ను (అది. ४-227).

సీ॥ పరలోకమునఁ బుణ్య-పరుల లోకంబులు, వదయుఁ
జతుర్వర్గ-ఫలము సూవె. (అది. 2-60).

ఆ॥ భార్యనొడ్డి యోటు-వడిన భర్త (సభా ౨-208).

7. సరస యతి :

"హయ లత్వమునకు శషసలు
నయవర్తన చ ఛ జ ఝ లకు నలి మధ్యమ వ
ర్గ యుతాను నాసికము ని
శ్చయముగ ద్రుతమునకుఁజెల్లు సరస వళు లనన్" (అప్ప. ३-105).

అనంతుఁడు (౧-107) కవిజనాశ్రయ కారుఁడు (సంజ్ఞా. 74) కూడ దీనిని బేర్కొని యుండిరి. కావ్యాలంకార చూడామణిలో నిదియే యితరేతర వర్గజ వళి యను పేర నొసంగఁ బడియున్నది. వీ రూష్మ ఋజుయతులను గూడ నిందే సంగ్రహించిరి.

కం॥ జ్వలన జ్వాలావలీఢ-శలభము వోలెన్ (ఆ. ౨-97).

ఉ॥ చారిత ధాతునిర్ఝర వి-శాలశిలోచ్చయ సంచయాభమై (ఆ. ౬-77).

చ। అనిలజుఁ డుగ్రుఁడై ద్రుపదు-హస్తి ఘటావళి వశ్వసంహతిన్
(అది. ౬-78).

చ॥ జగతిఁ బ్రసిద్ధుఁడై వెలయు-సంవరణుండ మదీయ పుత్రికిన్
(ఆ. ౭-68).

ఉ॥ జంబుల వోలె వెల్వడియె-శైలవిశాల గుహాలినుండి నా(ఆ.౬-175)

చం॥ ర్ణవవృత భూమిలోఁగల వ-నంబుల హంస బలాకసారసా
(ఆ, ౬-231)

ఉ॥ ధ్యాపుర నాయకుండు జల-జాప్తకులైక విభూషణుండు, వి
ద్యా పరమార్థవేది శర-దబ్జ సముజ్జ్వల కీర్తిచంద్రికా (సభా. ౧-83)

సీ। అవి పంచె నన్ను నె-య్యమున నో నాకట్టి (సభా. ౦-107)

చం॥ అనిల జవాశ్వయుక్తమయి-హాటకరత్న విచిత్ర శార్ఙ్య కే
తన . (సభా. ౨-84)

ఉ॥ హమ్మల విల్చుకో లఱదె-యన్యులె వారలు కౌరవేశ్వరా ।
(సభా. ౨-121)

చం॥ హితపురి భూరి వప్రము ప-యిం బరపెన్ సురవైరులంత సు
ద్ధతులయి (అర. ౪-82)

(దీని నప్పకవి ఋజా యతి యని పేర్కొనెను.)

మహాస్రగ్ధర : హతులై నానా విధోపా-యనములుగొని సౌ-హార్ద్ర
వాంఛన్ జయశ్రీ (ఆది. ౫-38)

సంయుక్త యతి ।

వర కృతులను సంయుక్తా
క్షరములలో నెద్దియైనఁ జను వడి యిడఁగా (కవి- సంజ్ఞా 71).

నన్నయ భారతములో నీ సంయుక్త యతి సందర్భమున మఱికొన్ని విశేషములు కానవచ్చు చున్నవి.

(i) క్షకారమునకు క, ష లకు సంబంధించిన యే యక్షరముతో నైన యతి మైత్రి పాటింపవచ్చును. కాని నన్నయ కకారమునకు సంబంధించిన యక్షరము తోడనే యతి వేయుచుండును.

ఉ॥ క్షేత్రమునం బ్రకామగతి-ఖేలన నొప్పి సహాశ్వసేనుఁడై
(ఆది. ౧-107)

ఉ। ధ్వాంత క్రూర కుఠారలూన విఖిల-క్షత్త్రోరు కాంతారుఁడై (ఆ.౧-78)

శా॥ క్షోణీచక్ర భరంబు గ్రక్క-దలది-క్కు-ల్ మ్రోయఁగా నార్పి య
క్షీణోత్సాహ సమేతులై రయమునన్-గీర్వాణులుం బూర్వగీ
ర్వాణ- (ఆది. ౨-12)

ఉ॥ ఆ విధి నొక్క-బాల సహ-కార మహీజముక్రింద నుజ్జ్వల
త్పావక (సభా. ౧-137)

చ। క్షయగతులైన విప్ర గత-గర్వమునన్ మగధేశ్వరుండు
విశ్చయ (సభా. ౧-160)

మ॥ క్షణ దానం బొనరింపు మీ క్షణమవి-ఖ్యాతంబుగా వంగరాం
(అర. ౧-253)

ఉ॥ క్షత్త్రియ ధర్మముల్ సుగతి-కారణముల్ విపులార్థమూలముల్
(అర. ౧-247)

అరణ్య పర్వమున

ఆ। క్షమయ తాల్మి యుండఁ-జనదెల్ల ప్రొద్దుఁ దే
జంబ తాల్చి యుండఁ-జనదు పతికి
సంతత క్షముండు-సంతత తేజుండు
నగుట దోషమందు-రనఘమతులు. (౧-217.)

అను చోటను

క్షత్త్రి చరిత్రుఁడై పరఁగు-సత్త్వమునన్ మఱి నీ సవిత్రికిన్. (3-136)

అనుచోటను క్షకారములోని షకు జ.న లతో సరసోష్మ యతులు చెప్పఁబడినవి. ఇట్టి యతి క్షకారమునకు నన్నయ మఱెచ్చటను వేసియుండలేదు. 'క్షమయ తాల్చియుండఁగా దెల్లప్రొద్దు.' అని మొదటి దానిని సవరింపవచ్చును. రెండవదానికి సత్త్వమునన్ అనుటకు బదులు గర్భమునన్, గర్వమునన్ అను పాఠాంతరములు ముద్రిత ప్రతులలో చూపఁబడియే యున్నవి.

(11) జ్ఞ కు నణలతో యతిమైత్రి చెల్లినచో తద్భవవ్యాజ విక్రమమనియు, క ఖ గ ఘ లతో యతిమైత్రి చెల్లినచో విశేషవళి యనియును, అప్పకవి పేర్లు పెట్టెను. ఈ రెండును నన్నయ భారతమునఁ గానరావు. అందు జ్ఞకు చ ఛ జ ఝ శ ష స లతో మాత్రము యతి మైత్రి కూర్పఁబడి యున్నది. తద్భవ వ్యాజయతిని అనంతుఁడు కూడఁ జెప్పియుండెను. (౧-113)

ఉ॥ జ్ఞానము సర్వభూతహిత- సంహిత బుద్ధియుఁ జిత్తశాంతియున్ (ఆది ౧-157)

ఉ॥ అమ్మనుజేంద్రుఁ డైన నలుయజ్ఞము ధర్మజు రాజసూయ-య
జ్ఞమ్ముఁ బ్రయాగఁజేసిన ప్ర-జాపతి యజ్ఞముఁ బాశపాణి-య
జ్ఞమ్మును గృష్ణయజ్ఞము వి-శాకరు యజ్ఞము నీ మనోజ్ఞ య
జ్ఞమ్మును నొక్క రూప వెల-సన్మహిమం గురువంశవర్ధనా (ఆది. ౨-225)

తే॥ జా మదగ్న్యుండు నిర్మల- జ్ఞానదృష్టి (అర. 3-128).

(111) రకారము రెండవ హల్లుగా నుండు సంయుక్తాక్షరములలో నన్నయ యెప్పుడును బై హల్లునకే యతిమైత్రి కూర్చుచుండును. తరువాతి కవులు రకారమునకుఁ గూడ యతి వేయుచుందురు.

చం॥ క్రమమున వంశక ర్తలన-గామహినొప్పిన యస్మదీయ-వం (ఆది. ౧-14)

చం॥ ద్రముఁ దఱియంగ నీదను వి-ధాతృని కైనను నేరఁబోలునే. (ఆది. ౧-19)

మ॥ వ్రతసంపన్నుఁడ కారణంబ దనుజ -వ్యాపాదితుండై న-న (ఆది. ౩-118)

ఉ॥ శ్రీ సతివోని కుంతియును -జెల్వగు మాద్రియుఁ దోడరాఁగ బా (ఆది. ౫-47)

తర వ్రతతి నోర్చిన వీ రులుగ్ర తపంబు సేసినవారు- న
ద్గతికి (సభా. ౧-191)

ఉ॥ ద్రాయితు సూర్యతేజు నిష-ధ ప్రభు నన్నలుఁజూచి పద్మప (అర. ౨-219)

చం॥ వ్రతములు లేనివారు నుప-వాస పరాఙ్ముఖులైనవారు-దు
ర్మతులు— (అర. ౨-283)

సంయుక్తాక్షరమున రేఫమును పూర్వాంగముగా నుండునపుడు క్రింది హల్లును జడ్డక్కరముగా వ్రాసి రేఫమును వలపలి గిలకతో సూచించుట యాంధ్రమునందలి ప్రాచీన లిపి సంప్రదాయము. అందుచే నట్టి సంయుక్తాక్షరమునకు యతి వేయవలసి నప్పుడు నన్నయ రేఫముతోఁగాక పరహల్లుతోడనే యెప్పుడును యతి మైత్రి కూర్చుచుండును. ధర్మ, కర్మ మున్నగు శబ్దములను బూర్వము ధమ్మఁ, కమ్మఁ అని వ్రాసెడివారు. తరువాత దాని విప్పటివలె ధర్మ, కర్మ అని వ్రాయుపద్ధతి యేర్పడినది. దానితో రకారమునకు యతి వేయు సంప్రదాయము కూడ నారబ్ధమైనది. దీనినిబట్టి లేఖన పద్ధతికిని యతి మైత్రికిని గల సంబంధము వ్యక్తమగుచున్నది.

చం॥ ర్వర తపో విభవాధికున్ గురు - పద్య విద్యకు నాద్యు వం (ఆది. ౧-21)

చం। ర్తనముల నొప్పుదాని విధి - తంబగుదాని సభాంతరంబులన్ (ఆది. ౩-10)

చం ర్థవ వృత భూమిలోఁగల వ-నంబుల హంస బలాక సారసో (ఆది. ౬-231)

మ। ర్దమ దోర్దండ పటుప్రహారజనిత - ధ్వానంబు బ్రహ్మాండ భాం
(సభా. ౧-202)

చం॥ ర్మదుఁడయి వీఁడు నన్ను నవ- మానితఁ జేసెడి సర్వ ధర్మనం
(సభా. ౨-219)

మ। ర్వారవృత్తి రథంబులెక్కి- యు-వంధ్య విక్రమ మేర్పడన్.
(అర. ౨-222)

కం। ర్యమ్ములకు బాసి బ్రహ్మ- హత్యా వ్రతముల్ (అర. ౩-277)

క్ష్మ మున్నగు త్రిహల్కములగు నక్షరములకు యతి వేయవలసినప్పుడు నన్నయ సాధారణముగా నందలి తుది హల్లునకే యతి మైత్రి కూర్చుచుండును.

ఉ। క్ష్మీ మహనీయ సౌఖ్యముల- మేలుగ నందు మనింది తేందు పా-
(ఆది. ౪-53)

ఉ॥ క్ష్మీవిభవంబు తోడ నుప-మింప సమంబులు గా వశేషరా (స. ౨-114)

ఉ॥ క్ష్మీ ధరమూర్తి యెంతయును- మెచ్చె మనంబునఁ దద్విభూతికిన్.
(స. ౨- 162)

చ ర్జవినిర్ముక్త నిశాతసాయక శతా- గ్ర చ్ఛిన్నమై దైత్య దా. (అర. ౧-185)

ఉత్సా క్ష్మీ జయాభిరామ ధర్మ- మిత్ర మిత్ర విద్వదం. (అర. ౧-401)

ఉ॥ క్ష్మీ యుత యయ్యె బంధులకు- మిత్రులకున్ హృదయ ప్రియంబుగన్.
(ఆది. ౨-219)

ఉ॥ క్ష్వాకు కులోద్భవుండు బల-వంతుఁ దనంత యశుం డవార్య వీ
(అర. ౩-200)

ఈ క్రింది పాదములో మాత్ర మీ నియమునకు విరుద్ధముగా యతి మైత్రి కానఁబడు చున్నది.

క్ష్మీ జయాభిరామ ధర్మ-శీల మిత్ర విద్వదం (సభా. ౨-321)

ఈ పద్యమే యించుకమార్పుతో నరణ్య పర్వ ప్రథమాశ్వాసాంతమునఁ గూడ వ్రాయఁబడి యున్నది. అచట 'ధర్మమిత్ర మిత్ర విద్వదం' అను పాఠ మున్నది. అదియే సరియైనదిగాఁ దోఁచు చున్నది.

vi. సంయుక్తాక్షరముల నుచ్చరించునప్పుడు తుది హల్లు తోడనే యచ్చును గలిపి యుచ్చరించుచుందుము. కావున దానికే యెక్కువ ప్రాధాన్యము న్నట్లు

తోఁచును. రేఫ మున్న చోట్లఁ దప్ప మిగిలిన సంయుక్తాక్షరములకు యతివేయు నప్పుడు నన్నయ సాధారణముగా రెండవదానికే యతిమైత్రి కూర్చును మొదటి హల్లునకు యతివేసిన చోట్లుకూడఁ గొన్ని లేకపోలేదు.

మ॥ త్వవమున్ సంతతదానశీలతయు శ-శ్వత్సాధుసాంగత్యమున్.
(ఆది- ౧-12).

చం। త్కర రుచిరంబులై సకల-గమ్య సుతీర్థములై మహా మనో
(ఆది- ౧-23).

సీ। .... .... .. భవనమెప్పాట వె-ల్వడఁగఁబోల.
(ఆది-౧-114).

* చం। స్థితి గురు దేవకార్యములు-చేయఁగఁబూను చెఱింగి వంచనో
(ఆది- ౧-121)

ఉ స్త్రీజిత వైరివీర కుల-దీప మృడ ప్రియవిష్ణువర్ధనా (ఆది-౧-111)

*చం॥ స్థిరతయు నోషధీ రస వి-శేషత యుం గలదుత్త మంబు మం
(ఆ- ౨-10).

చ। స్ఫురణన చేసి సుస్థిరతఁ- బొందుఁ బురందర సర్వలోక సుం
(ఆది- ౨-46).

*మ ధ్వజినీపాత భరంబునం దలకఁగా-ధాత్రీ ధరాహీంద్ర-మూ
ర్ధజ రత్నప్రకరంబు లున్నతగ జేం-ద్రి స్యందన ప్రోల్ల స
ద్ధ్వజవాతాహతిఁ దూలఁగా జలద బృం-దంబీక్రియన్ పర్వతి
గ్విజ యార్థం బరిగెం గురు ప్రభుఁడు దో-ర్వీర్య ప్రకాశార్థియై."
(ఆది- ౫-36).

*సీ॥ వ్యాసపురస్కృతా-వని దేవ వివహంబు (ఆది- ౬-7).

*చ॥ ధ్యమ సమకూరు భారత క-థా శ్రవణాభిరతిన్ మదీయచి
త్తము- (ఆది- ౧-15).

*ఉ॥ ద్యం బరముం బరాశర సు-తుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్.
(ఆది- ౧-76).

*కం॥ స్తుతుల కతి ప్రీతి మాన-సుఁడ నైతి నని (ఆది- ౧-109)

*కం॥ జ్వలన జ్వాలావలీధ -శలభమ పోలెన్. (ఆది- ౨-97.)

*సీ॥ సన్మునీశ్వరుఁడు వి-శ్వామిత్రుఁ డతి ఘోర. (ఆది- ४-36).

* వ్యూహము వ్రచ్చుచోట మఘ-వుండును వానికి మార్కొ-నంగ-ను
త్సాహము సేయఁ దన్న లఘు-సారుల ధీరులు సాహసుల్-నిరు
త్సాహులు ద్రోహులై యెదిరి - చత్తురొ మందురొ మానవేశ్వరా
(ఆ- ౮-46)

*జ్వలన శిఖాళియున్ విజయు - సద్విశిఖాళియుఁ జుట్టుముట్టి నం-
(ఆది- ౮- 263)

స్త్రాక యశుండు ధేనువుల-ధర్మవిధిన్ మణిముద్రికాద్యలం (స-౧-14)
స్మేరమనస్కులై జనులు-మెచ్చి విజద్యుతి చూచుచుండగా.(స- ౧-22)
ద్వాపుర నాయకుండు జల-జాప్తకులై కవిభూషణుండు-వి
ద్యాపరమార్థవేది శర-దబ్జ సముజ్జ్వల కీర్తి చంద్రికా
* స్నాపితసర్వలోకుఁడు త్రి-శంకు నరేంద్ర సుపుత్త్రిఁ డున్నతిన్.
(స- ౧-83).

*మ్నాయ లలామ నీ కెనయె-మానవ నాథులు మానుషంబునన్.
(స- ౧-97)

మత్త॥ ద్వారకాపురనాథ కేశవ-దైత్య భేది భవత్పదాం (స. ౨-286)
తర॥ క్తము ప్రజాక్షయ కారణంబని - తద్దయున్ భయ మందుచున్.
(స- ౨-310)

ఉ॥ ద్వావిశేషులు వైరివీరులఁ- దక్కవిత్తురె పోరులన్-(అర- ౧-46).
*మ॥ స్వర తేజం-బ్రభుఁగాంచి సంజయుఁడుసంజాతప్రమోదాత్ముఁడై.
(అర- ౧-65).

చం॥ ల్కలములు గట్టి కూరలను-గాయలుఁబండులు భోజనంబుగా.
(అర- ౧-94).

*ఉ॥ న్యాయ విదుండు కామ్యకవ-నంబున ధర్మజు నొద్దనుండి మై
(అర-౧-91)

*చం॥స్థితిఁజనితీర్థసేవనము-సేయుమువీకు నభీష్టసిద్ధిగన్.(అర.౨-283)
*ఉ॥ విత్త్యమ్మను జేయకేల మతి-దప్పితి మేరువుఁ గొల్వనేటికిన్.
(అర-౩-21).

చం॥ దుష్కృత విధ్వవర్తనన్ సకల-పార్థివ జైత్రు మహోద్ధతాసుహృత్,
(అర- ౩-74.)

చం॥ స్మితముఖులై రి బ్రాహ్మణ స-మేతులు ధర్మ సుతాదులచ్చటన్.
(అర- ౩-375)

చం॥ త్కార రవముల్ మహీరుహశి-ఖండములందు శిఖండి తాండవాం.
(అర- ౪-137).

య, వ, ధ, న అనునవి క్రింది యక్షరములుగా నున్నపుడే సాధారణముగాఁ బై నియమమునకు వ్యత్యయము కానవచ్చుచున్నది. అట్టివాని కుదాహరణములు * అనుగుర్తుతో సూచింపఁబడినవి.

9. పరరూపయతి : ఇది యుభయ యతులలో నొకటి. 'శకం ధ్వాదులకు నుభయముం జెల్లు' నని యప్పకవి నుడివి యుండెను. ఉభయమనఁగా స్వరమైత్రియు వ్యంజనమైత్రియు నని యర్థము. వేదండ శబ్దమునుగూడ నప్పకవి శకంధ్వాదులలోఁ జేర్చెను. నన్నయ వేదండ శబ్దమున కొకచోట స్వరమైత్రి కూర్చి యున్నాఁడు.

మత్త। వైరి వే
దండ గండ విదారి ఘోరత-రాసి భాసి భుజార్గళా

పెక్కురు లాక్షణికు లీ పద్యము నీ యతికి లక్ష్యముగా నుదాహరించినారు.

10. ప్రాది యతులు : ఉపసర్గలలో ప్ర అనునది మొదటి దగుటచే వానికి ప్రాదులను పేరుకలిగినది. ఈ యుపసర్గలచ్చులతో కలిసి యుండునప్పుడు స్వరమైత్రియు హల్మైత్రియుఁ గూడ నుండును. ఇదియు నప్పకవి చెప్పిన యుభయ యతులలో నొక్కటి నన్నయ సాధారణముగా హల్మైత్రియే పాటించుచుండును. అతఁడు స్వరమైత్రి పాటించిన చోట్లు కూడఁ గొన్ని యున్నవి.

చం॥ శాస్త్రముల తెఱం గెఱింగితి ను-దాత్తరసాన్విత కావ్యనాటక క్రమములు
(ఆది. ౧-10.)

ఉ॥ భా, రత్యమ రావగౌఘము ని-రంతర సంతత పుణ్య సంపదున్నత్య భివృద్ధి
(ఆది. ౧-72.)

ఆ॥ మదు గనికినీన-మాఖ్య నొనరు - (ఆది. ౧-80.)

ఉ॥ మ్నాయము నాహితాహుతి స-మంచిత దక్షిణ లిచ్చి తన్పుచుం.(ఆ. ౧-89.)

కం॥ అ, పేక్షించుచు నుండు వా డ-భేద్యుఁడు మాయా (ఆది. ౧-98.)

చం॥ వ్యపగతమైన జీవమది-వచ్చు నుపాయము సేయరాకొ్క నా.
(ఆది. ౧-149.)

సీ॥ బ్రహ్మర్షి గణ సము-పాసితుండై సర్వ. (ఆది. ౧-27.)
చం॥ మదవక చేయు మీ వని స-మర్పణ చేసెఁ బ్రభుత్వ మేర్పడన్.
(ఆది. ౨-42.)

కం॥ వి, రాసంబగుఁ బాయు నుఁగ రక్షో భయముల్ (ఆది. ౨-123.)
వసంత తిలక । ప్రారంభ శిష్ట పరి-పాలన సక్త రాజా. (ఆది. ౨-239.)
కం। ప్రియ పత్నులు నిఖిల జగద-భీష్ట చరిత్రల్ (ఆది. 3-83.)
కం అ, భ్యుదితుండై - నిర్గమించె బుధసుతుఁడు కచుం (ఆది. ౩-126.)
కం శంకా, పేతంబై ధర్మచరితఁ - బెరుఁగుచు నుండెన్ (ఆది. ౪-9.)
కం। స, ముల్లసన సుగంధి యగుచు - మునివరు మీఁదన్. (ఆది ౪-40.)
కం। మహిళుగాఁ జేసి తతి స-మర్థత వెలయన్ (ఆది. ౬-49 )
సీ॥ .... .... ... దానికి శివుఁడు ప్ర-త్యక్షమయ్యె. (ఆది. ౭-35.)
ఉ। అ, త్యంత మదాభి భూతుఁడగు - ధర్మవు దప్పఁ బ్రియం బెఱుంగఁడే.
(ఆది. ౩-58)

కం॥ ప్ర, తీక్షించుచు నుండె సురవ- దీతీరమునన్. (ఆది. ౩-264.)
ఉ॥ యు, ద్ధమ్మున నోర్చు నాతని ను-దగ్ర మహా భుజశక్తి యేర్పడన్.
(సభా. ౧-161.)

కం॥ వి; రాకృతులు ధరిత్రి లోని-రాజులు వీకున్ (సభా. ౨-93.)
ఆ॥ రక్తనేత్రుఁడై ప-రాక్రమమున (సభా. ౨-269.)
కం॥ అ, పార్థీకృత జన్ముఁడగుట-రమార్థ మిలన్. (అర. ౧-28. )
కం॥ మనమున మన్నించి శుభ స-మగ్రునిఁ జేయం (అర. ౧-360.)
మధ్యాక్కర : ప్రీతిని దచ్చరితంబు వినఁగ న-భీష్టమిందనిన- (అర. ౨-317.)
కం॥ దుర్మతివై తిం కెన్నఁ డిది స-మాప్తిం బొందున్. (అర. ౩-258.)
మత్త. అ, భ్యంతరంబున నుద్ధత ప్రతి-పక్ష వీరుల నేను వి
ర్జింతు (అర. ౩-353.)

మత్త. అ, త్యంత వీరుల ... ప్రతాప బలోద్ధతిన్ (అర. ౩-353.)
ఈ క్రింది యుదాహరణములందు స్వరమైత్రి పాటింపఁబడినది.
అనఘ, యుపనేత ... నిరంతరాధ్యాపకుండు (అర. ౪-48.)



ఆ। వి. -రర్థకంబు సూపె - యవని మీఁద (ఆది ౮-31)
ఉ॥ ఆ విపినాంతరంబున వి-రంతర విష్ఠ ననంత మోక్షకాం (స. ౧-137.)
ఆ। వి. -రాగసుంద సద్గు-ణాన్వితుండ. (సభా. ౧-185)
ఆ॥ అ ప్రమాణ మను దు-రాత్మకులకు. (అర. ౧-232.)
ఆ॥ అమ వివేక మది య్ప-పార్థకం బగుఁ గాదె. (అర. ౪-128.)

11. నిత్య సమాస విశ్రాంతి : రెండు పదములు కలిసిన సమాసమున నా పదము లేర్పాటుగాఁ గానఁ బడనిచో నందలి ప్రాణ సంధులకు నిత్య సమాస విశ్రాంతియు నఖండ యతియు నగునని యప్పకవి చెప్పి యున్నాఁడు. రూపఱు, పెంపఱు మున్నగు శబ్దములందు సంధియైన చోటఁ గూడ నుభయ యతులు చెల్లునని చెప్పి యతఁడు దానికి దేశ్య నిత్య సమాస యతి యనియు, దేశ్యాఖండ యతి యనియుఁ, బేర్లు పెట్టినాఁడు. అనంతుఁ డీ రెంటిని గలిపి నిత్య సమాస యతి యని పేర్కొని దీనిపేరే అఖండ యతి యని చెప్పినాఁడు. (౧-101.) కవి జనాశ్రయమున నఖండ యతియు, (సం-66) కావ్యాలంకార చూడామణిలో ఆదేశ దేశీయ వళులును (౨-64, 69) జెప్పఁబడి యున్నవి.

i. రాయణునట్లు వాసన ధ-రామర వంశ విభూషణుండు - నా
రాయణ భట్టు వాఙ్మయ ధు-రంధరుండున్ దన కిష్టుఁడున్ సహా. (ఆది-24)
ఈ పద్యము కొన్ని వ్రాఁత ప్రతులలో లేదని తెలియుచున్నది.
మహా స్రగ్ధర:
రమణుల్ దుర్వారవాతా-రయమున నరనా-రాయణుల్ దాఁకి రల్కన్ (ఆది ౨-22.)
ఇచట వ్యంజన మైత్రియే పాటింపఁ బడినది.

ii. సీ॥ నన్ముసీశ్వరుఁడు వి-శ్వామిత్రుఁ డతి ఘోర -
వ్యంజన మైత్రి. (అ. ౪-36.)
సీ॥ శమ హీనుఁడై న వి-శ్వామిత్రు చేసిన (అ. ౨-94 వ్యంజన.)
iii. కాకోదర సంహతిన్ హుతవ-హోగ్ర సమగ్ర శిఖా చయంబులన్.
స్వర మైత్రి. (ఆది. ౧-124.)
సీ॥ .... .... .... ఉన్న వీరుండు వృ-కోదరుండు. (ఆది. ౩-194)
ఉ॥ దామోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని -యుక్తమ కా కిది యేమి దోసమే.
(సభా. ౨-18)

కాకోదర, దామోదర, వృకోదర శబ్దముల నప్పకవి నిత్య సమాసములలోఁజేర్చి యుండలేదు.

iv. కం॥ తనియఁగ ధనమిచ్చు జామ - దగ్న్యుఁడు రాముం (ఆది. ౫-197.)
జమత్ + అగ్ని = జమదగ్ని అని వ్యుత్పత్తి కావున నిచ్చట స్వర మైత్రియే పాటింప వలయును. కాని నిత్య సమాసముగఁ బరిగణించుటచేఁ గాఁబోలు నన్నయ యిట వ్యంజనమునకే యతి వేసినాఁడు.
కం। దారుణ పరశువున జామ-దగ్న్యుఁడు రౌద్రా (అర. ౨-260.)

v. ద్వారములన్ మహారుధిర -ధారలు బోరన నొల్కి- మాంస పం
కారుణ .... .... వ్యంజన మైత్రి (ఆది. ౬-302.)
ద్వే అరే (పార్శ్వే) యస్య తత్ ద్వారమ్. పృషోదరాదీని యథోపదిష్ట మితి సూత్రేణ ద్విశబ్దాంతస్య ఇకార లోపః. అకారా దేశః. (అప్ప. పుట 153.)

vi. సీ। సాంగంబు లగుచుండ -సకల వేదములు - (ఆది. ౪-168 )
అంగములతోఁ గూడినది సాంగము. ఇచ్చట నన్నయ వ్యంజన మైత్రి పాటించినాఁడు. అప్పకవి దీనిని నిత్య సమాసములలోఁ బేర్కొని యుండలేదు.

vii. కామ సంభోగముల న దే-కాంత గృహము (ఆది. ౮-74 )
అప్పకవి దీని నుదాహరించెను. ౩-48.)
సీ। .... .... ... .... క్రాలుచునుండ నే-కాంత యోగ
వ్యంజన మైత్రి. (అర. ౩-319.)

viii. అవివేకం బెఱిఁగించి తిందఱకు దా-శార్హుండు పూజార్హుఁడే.
(సభా. ౨-8. స్వర మైత్రి.)

ix. జనవియుఁ బేర్మి ద -శార్ణరాజ (అర. ౨-150.)
ప్రవత్సర, కంబల, వస, నార్ణ, దశానామృణే-వార్తికము. అనుదాని చొప్పున ఋకారమున కిచ్చట వృద్ధి వచ్చినది. దశ + ఋణ = దశార్ణ.
ఋ = అర్ (వృద్ధి) నన్నయ వ్యంజన మైత్రియే పాటించినాఁడు.

x. ఆ॥ సాంబుఁ బాయు మనుచుఁ-జారుదేష్ణుం దర్గి. వ్యంజన మైత్రి.
(అర. ౧-159.)

xi. పా. రావార రవంబువోలె - వనివార్యములై. స్వరమైత్రి (అర. ౨-55.)
అప్పకవి దీనిని నిత్య సమాసములలోఁ జేర్చి యుండలేదు.

నన్నయ శరాసన బాణాసన శబ్దములకు స్వరమైత్రియే పాటించి నాఁడు.

ఉ॥ బా, ణాసన బాణ భాసిత మ-హాభుజుఁడై విహరించుచుండె - వి

చ్చా సదృశంబు. (ఆది. ౫-47.)

కం॥ శ, రాసన గురు భూరి సత్త్వ- నసిత కృశాంగున్. (ఆది. ౫-212.)

పై యుదాహరణములఁ బట్టి చూడ నిత్య సమాసము లందు వ్యంజన మైత్రి పాటించుటయే నన్నయ కెక్కువ యభిమతమని తోఁచుచున్నది.

అప్పకవి నఞ్ సమాస యతిని వేఱే చెప్పక నిత్య సమాస యతి యందే చెప్పెను. కవిజనాశ్రయ కావ్యాలంకార చూడామణి ఛందో దర్పణములం దిది పేర్కొనఁ బడలేదు. కూచిమంచి తిమ్మకవి దీనిని సర్వ లక్షణ సార సంగ్రహమునఁ బ్రత్యేకముగాఁ బేర్కొనెను. (పుట. 132) నన్నయ కిట్టి చోట్ల స్వర మైత్రియే యభిమతము. నాకానారత శబ్దముల యందు మాత్ర మతఁడు వ్యంజన మైత్రి పాటించినాఁడు.

ఉ॥ ఆశ్రిత పోషణంబున న-నంత విలాసమునన్ మనీషి - వి

ద్యా (ఆది. ౧-6.)

కం॥ అ, నల్ప క్రోధులయి తాఁకి -రార్చి కడంకన్. (ఆది. ౨-95.)

ఉ। ఇన్నర లోక భోగము ల-నేకము లందుము నీవు నావుడున్ (ఆది. ౩-161.)

చం॥ అసదృశ యౌవనం బిది య-నన్య ధనంబగు నొక్కొనాకు వి

కృ-సుమ. (ఆది. ౩-170.)

కం। అ -నాకులమై నిలుచుటయుఁ ద-దాప్తులఁ బ్రజలున్. (ఆది. ౪-245.)

మ॥ వత దోర్దండ విముక్త చక్ర నిహతిన్-నా కద్విషన్మస్తక

ప్రతతుల్ వ్యంజన మైత్రి. (ఆది. ౨-24 )

న విద్యతే అకం (దుఃఖ) మత్రేతి నాకః- (అప్ప. పుట. 150.)

ఉ॥ ప్రతా, నమ్ములఁ గ్రేణి సేయుచు న-నారతమున్ విలసిల్లుఁ దత్పురిన్.

వ్యంజన మైత్రి. (ఆది. ౮-71.)

క్యఙ్ ప్రత్యయాంతము లందు నన్నయ వ్యంజనమునకే యతి వేయు చుండును. అప్పకవి గూడ దీనినే యంగీకరించుచు వీనియం దకారము లున్నవని భ్రమించి నిత్య సమాస విశ్రాంతులు వేయరాదనియు శబ్ద సూత్రము వలన వానికే దీర్ఘములు వచ్చినవి గాని యందు లోపల నత్తులు లేవవియుఁ జెప్పి యుండెను.

(అప్ప. ౩-189.)

ఉ॥ కుమా, రాయిత శక్తిశాలి ధృత-రాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న
త్యాయుత. (అర. ౫-6.)

ఉ॥ ఇం, ద్రాయితుఁ డాంబికేయుఁ డుచి-త స్థితిఁ బూజితుఁ జేసె నాత్మని
శ్శ్రేయస (అర. ౧-92.)

ఉ॥ ఇం, ద్రాయితు సూర్యతేజు విషధ ప్రభు నన్నలుఁ జూచి పద్మ ప
త్రాయత (అర. ౨-219.)

అప్పకవి యుష్మదస్మ చ్ఛబ్ద యతులు, నిత్యయతులు, పంచమీ విభక్తి విరామములు, కాకుస్వర ప్లుతవళులు, అను వానిని గూడ నుభయ యతులుగాఁ బేర్కొని యచ్చట స్వర వ్యంజనములకు రెండింటికి యతి మైత్రి కూర్ప వచ్చునని తెల్పి యుండెను. కవి జనాశ్రయమునఁ బ్లుత యతి పేర్కొనఁ బడినది. కాని దానికి లక్ష్యము లేదు. (సం. 70.) కావ్యాలంకార చూడామణిలో ద్వ్యక్షర త్ర్యక్షర ప్లుతాక్షర వళులలోఁ బ్లుతాక్షరవళి చెప్పఁ బడినది. అనంతుఁడు కాకు స్వర యతిని బ్రత్యేకముగాఁ జెప్పి యుండెను. పై లాక్షణికులు వీని నుభయ యతులుగాఁ జెప్పినను నన్నయ యొక్క స్వరమునకో వ్యంజనమునకో మాత్రమే యతి వేసినట్లు కనఁబడు చున్నది.

నిత్యయతి : నన్నయ ఏవి, నేవి యను రెండు శబ్దములను వాడి యుండెను. నేవి యనుచో నేయను దానికి హల్మైత్రి పాటించుట సహజము. ఏవి యని వాడి వప్పుడెల్ల నాతఁడు స్వర మైత్రియే కూర్చు చుండును.

ఎన్నఁడు

న్నేని మోహముగాదు దిగ్ధర-ణీ రవీందు లెఱుంగఁగాన్ -
(ఆది. ౩-141.)

నీవును జూచితట్టి పథ-నేవి వినంబడ దే యుగంబులన్. (స. ౨-95.)

పై రెండు చోట్ల నేవి యనురూపమే వాడఁ బడినది.

తే. ఓపు

దేవిఁ బెండిలి యగుమ యీ-యింతిఁ బ్రీతి. (ఆది. ౮-144.)

ఆ॥ ఎఱిఁగి యెద సహించు-నేవి భార్య (అర. ౨-159.)

కాకు స్వర ప్లుతయతులు.

కం॥ ఏ యంద విలిచినవిగా, వే యిక్కాలత్రయ ప్ర-వృత్తులతోడన్.
వ్యంజన మైత్రి. (ఆది. ४-243.)

కం॥ తపోమహి. మా యిన్ని దినంబులేల-మసలితి చెపుమా.
వ్యంజన. (ఆది. ౧-116.)
కం॥ ధీ యుత యని పలికి మఱచి-తే మునినాథా. వ్యంజన. (ఆది. ౮-316.)
ఉ॥ చ. న్నెనలినాక్షులందు మది-విల్పఁగ నంచును మందహాస గ
ర్వానను (ఆ. ౮-179.)
యుష్మ దస్మ చ్ఛబ్దయతి : దీని నప్పకవి యుభయ యతులలోఁ బేర్కొనెను.
కం॥ త్రస్తాత్ములమైన యస్మ-దాదుల కెల్లన్. (ఆది. ౩-218) వ్యంజన మైత్రి.
అప్పకవి యీ పద్యము నుదాహరించెను. (ఆది. ౩-125.)

పంచమీ విభక్తి విరామము:

క్రతువున యాజకోత్తముల -కంటెఁ బ్రసిద్ధులు సర్వవిద్యలన్. (ఆది. ౨-226.)
అప్పకవి దీని నుదాహరించెను (౩. 240)
బోరన అనునెడ నన్నయ వ్యంజనమునకే యతి వేసెను.

బో. రనఁ గీర్తించిరి. సంతత స్తుతి పదా-రావంబు రమ్యంబుగన్.
(ఆది. ౨-235.)

ఇప్పుడు కొఱకు, కై అనునవి చతుర్థీ విభక్తి ప్రత్యయములుగాఁ బరిగణింపఁ బడుచున్నవి. కై యనునది కు + అయి (బ) అను వాని కూడిక. నన్నయ యందుచే విట స్వర మైత్రియే పాటించును.

తే। అనఘ మా మామ శకుని నాకై కడంగి. (సభా. ౨-174)

ప్రత్యేక యతి: 'ఉత్తర పదాద్య లిపి లోప మొదవుచుండు తఱిని బ్రత్యేక యతి నాఁగ దనరుచుండు.' నని యప్పకవి ప్రత్యేక యతిని బ్రత్యేకముగాఁ బేర్కొనెను. అనంతుఁడు దీనిని 'దియతి' యని చెప్పినాఁడు. (౧-123) నన్నయ కూడ నిట్టి యెడల వ్యంజనముకే మైత్రి పాటించు చుండును.

ఉ॥ దా. నిదికల రూపెఱుంగ నవ-నీపతి యుత్సుకుఁ డయ్యె నాత్మలోన్.
(ఆ. ४-30.)

ఆ। అహిత మాచరించి-నదియు లేదు. (సభా. ౧-285.)

ఇచ్చట స్వర ప్రధాన వడి యనియే గ్రహింప వలెను. ఇచ్చట సంధి జరిగినది కాని అకారము లోపింప లేదు.

అఖండ యతి-: 'అప్పకవి కఖండ యతి యిష్టము లేకపోవుటచే దానిని బరిహరించుటకై 12 ఉభయ యతులను గల్పించెను. అతఁడు చెప్పిన యుభయ యతి భేదముల జాతికిఁ జెందని యఖండ యతులు కూడ నన్నయలోఁ గొన్ని

కానవచ్చు చున్నవి. అందుచే నది యతనికి సమ్మతమే యని చెప్ప వచ్చును.

చూచె మనంబునఁ దలంచు-చుండెద నేనున్. (ఆది .౫-137. మన్మథ ఉగాది సంచిక 132)

దీనికిఁ ' తుఁజొలయక 'యేనున్, సుందరి యేనున్ ' అను పాఠాంతరము లున్నవి. (ఆది. పుట 128.) వేమూరి వారి ప్రతిలోఁ జొలయక యను నదొక్కటే ప్రధాన పాఠముగా నున్నది.

ధృతి, మంతులుఁ బొందుదురు, భేద - మదిగావున మీ. (ఆది .౮-114) (మన్మథ ఉగాది 172)

ముద్రిత ప్రతులలో భేదమతి యని పాఠ మున్నది.

సీ॥ వేల్వంగ సమకట్టి - వెలువడ నున్న
సుందర శ్యామాంగు - సురరాజ కరికరా ...
నలినాక్షి యందొక్క - నాగ కన్యక ....
కొవి నాగ పురమున - కొనరంగఁ జని రమ్య ....

ఈ సీసమున 8 పాదార్ధము లందును యతి నియమమే పాటింపఁ బడినది. పూర్వార్ధములు మూఁడిట యతి నియమము కలదు. నాల్గవ దానిలో నన్నయ ప్రాస యతి వేసెనని చెప్పుట యతని మతమునకు విరుద్ధము. అందుచే నిచ్చట నాల్గవ పాదమున నఖండ యతి సిద్ధము.

ఎదలో, నిశికొని యేకాగ్రబుద్ధి - నిష్ఠాత్ముండై. (ఆది. ౫-116.) మన్మథ ఉగాది.

వేమూరి వారి ప్రతిలో నేకాంతమునన్. అనునది ప్రధాన పాఠముగా ముద్రింపఁ బడినది.

కం॥ పర్వం, బకడున్ మేలనఁగ శాంతి - పర్వము వెలయున్. (ఆది. ౧-57.)
పర్వంబు + అ (వివార్థము) పర్వంబ. దీనికిఁ బాఠాంతరము లేదు.
ఇట నఖండ యతి కాదనుటకు వీలు లేదు.

సీ॥ నీల జీమూతంబు లీల నాక్షేపించి; నల్లనై తోఁచెంచు-నల్ల గృహము.
గల హిడింబుం డను బలితంపు రక్కసు చెలియల నాతండు
వెలయ మీకు (ఆది. ౬-211.)

ఇచ్చట నల్లనై తోఁచెంచునట్టి గృహము అను పాఠాంతరమును సూచించి యఖండ వళి యున్నదని అప్పకవీయ పీఠికలో గిడుగు వారు వ్రాసి

యున్నారు. కాని యీ సీసమున నన్నయ యెల్ల యెడలఁ బ్రాస నియమమును బాటించుటచే నా పాఠము నన్నయ కభిమతమైనది కాఁజాలదు. నల్లనై తోఁచు నల్ల గృహము అనునదియే సరియైన పాఠము.

తక్కర రవముల్ మహీరుహ శిఖాంతము లందు శిఖండి తాండవాం
తర. (అర. ४-137.)

మహీరుహ శిఖండములం దను పాఠాంతర మున్నది. వేమూరి వారి ప్రతిలో నిదొక్కటే పాఠము.

చం. తాలసుఁ డయ్యెఁ గామికి నయంబున నుండఁ దలంపఁ బోలునే.
(అది ४-214.)

మనంబున నొందను పాఠాంతరము కలదు. అప్పు డఖండ యతియు బిందు యతియు నని చెప్పవలయును. కాని నన్నయ యెక్కడను బిందు యతి వాడియుండ లేదు.

అందుచే స్వర ప్రధాన వడితోఁ గూడిన పై పాదమే సరియైనదని తోఁచు చున్నది.

ఇం. ద్రా వరజాది మిత్రులు నమర్షముఁ బొందిరి ధార్తరాష్ట్రులున్.
(స. ౨- 33.)

దీనికి మిత్రు లసహత్వముఁ బొంది రను' పాఠాంతరము కలదు. వేమూరి వారి ప్రతిలోని ప్రధాన పాఠ మిదియే. మొదటి పాఠమున మవర్ణ (మఁద్ర) విరామము నఖండ యతియు నున్నవి. నన్నయకు మవర్ణ విరామ మభిమతము కాదు)

సీ॥ .... .... .... దాన శీలంబు లెందేనిఁ గాన
.... .... .... దుఃఖంబునై నెడ విమోహమును బొంది
.... .... .... మనిన నీ చెప్పిన యగ్గుణములు.
.... .... .... ద్విజుఁడుగా నేర్చునే నిజము విడిచి.
(అర. ४-128.)

ఈ పాదార్థములలో రెండింటఁ బ్రాసఁ యతియు రెండింట వడి నియమమును గలదు. ఇట్లు వేయుట నన్నయ కభిమతము కాదు. రెండవ పాదమును ' దుఃఖమునునై నెడ ' అనియుఁ దృతీయ పాదమును ' మనిన నీ చెప్పిన గుణము లెల్ల.. అనియుఁ సవరించినచో నియమోల్లంఘనము తొలఁగి పోవును. రెండవ

పాదమును యథా తథముగాఁ జూచినచో ః|ఖ కు ముందున్న విసర్గమునకును హకారమునకును యతి వేయఁబడిన దని చెప్ప వలయును. ఇట్టి యతి నన్నయ మఱెచ్చటను వేసియుండ లేదు.

స్వరమైత్రి, స్వరప్రధాన వర్గయతులు నన్నయ పిరివిగా వాడియుండెను. వాని కుదాహరణము లనేకములుగా నున్నవి. బిందుయతులు, తద్భవవ్యాజ విశేష వళులు, అనుస్వారసంబంధ యతులు, అనునాసికాక్షర యతులు, ముకార యతులు, మ వర్ణవిరామములు, అంత్యోష్మసంధి వడులు, వికల్ప విరమణ ములు, రాగమ విభాగ నామా ఖండ ప్లుతయుగ విశ్రామాదియతులు నాతఁడు వాడి యుండలేదు. అతఁడు ప్రాసయతులు వాడెను. అప్పకవి చెప్పిన యతి వియతి యాతని రచనలో సర్వత్ర కానఁబడును.

ప్రాస విశేషములు : అప్పకవి ప్రాస భేదములు ప్రధానముగా పదునేడు చెప్పి పైని శబ్దాలంకారములగు నేడు విశేష ప్రాసములు తెల్పియుండెను. (సుకర ప్రాసము, దుష్కరప్రాసము, ద్వంద్వ ప్రాసము, త్ర్యక్షరప్రాసము, చతుష్ప్రా సము, అంత్యప్రాసము, అనుప్రాసము ) అనంతుఁడు సుకర ప్రాసము తప్ప మిగిలిన యాఱు విశేష ప్రాసములు పేర్కొని ప్రధాన ప్రాసములు పండ్రెండు చెప్పినాఁడు. అప్పకవి చెప్పిన యేడువిశేష ప్రాసము లలోఁ జతుష్ప్రాసముతప్ప మిగిలిన యాఱును గవిజనాశ్రయ కావ్యాలంకార చూడా మణులలో నున్నవి. ఈ రెండు గ్రంథములలో లఘవ ఋ క్రాంత ప్రాసములని ప్రధాన ప్రాసభేదములు మూఁడే చెప్పఁబడి యున్నవి. ఈ మూఁడింటికి లక్ష్యలక్షణములను దెల్పు మూఁడు పద్యములు రెండు గ్రంథము లందు సమానముగా నున్నవి. (కవిజ. సంజ్ఞా 90, 91, 92. కావ్యాలంకార. ఉల్లా. 85, 86, 827). అవి యెవరు రచించినవో తెలియదు.

యతుల వలెనే ప్రాసములు కూడఁ గాలక్రమమునఁ బెరిఁగినవి. కవి జనాశ్రయ కావ్యాలంకార చూడామణులలో మూఁడు ప్రాస భేదములే చెప్పఁబడి దఁగా ఛందోదర్పణమునఁ బండ్రెండును, అప్పకవీయమునఁ బదునేడును దెల్పఁ బడినవి. పెద్దన, అనంతుఁడు, కవిజనాశ్రయకర్త నన్నయకుఁ దరు వాతి వారయ్యు నాతని రచనలో నున్న ప్రాస విశేషములను గూడ సరిగాఁ బరిశీలించినట్లు కనఁబడదు. అప్పకవి వానినెల్లఁ బరిశీలించి యితర కవుల రచనలలోని విశేషములు కూడఁ జేర్చి మొత్తము పదునేడు ప్రాసభేదములను జెప్పినాఁడు. అందుఁ బెక్కు నన్నయ రచనలోఁ గూడఁ గానఁబడుచున్నవి.

i. ఋయుతాయుతములు: వట్రుసుడిస్వరమే యగుటచే దీనితోఁ గూడి యున్న వ్యంజనమున కదికాక యిత రాచ్చులతోఁ గూడిన వ్యంజనముతోఁ బ్రాసవేయవచ్చును. అచ్చు భిన్నమైనను వ్యంజన సామ్యమున్నఁ జాలును.

ఆ॥ సకల జీవరాశి- సుకృత దుష్కృతఫల (ఆది. ४-260)

ఉ॥ ఆ ధృతరాష్ట్రి చేసిన .. ....
భాధృతి నొప్పుచున్న సభ
(సభా. ద్వి-162).
ర్యోధనుఁ దర్థిఁ జూపఁగ ....
క్ష్మీధర మూర్తి యెంతయును.

ii) ఖండాఖండప్రాసము: అనంతుఁడు దీనినర్ధ బిందు ప్రాసమని పేర్కొనెను. అర్ధబిందు పూర్వకములై నట్టియుఁ గానట్టియు నక్షరములకుఁ బ్రాస వేసినచో నది ఖండాఖండ ప్రాసమగును. అప్పకవి యాదిపర్వమునుండి యీ క్రింది పద్యము లుదాహరించెను.

కం॥ "పీఁకఁ బఱతెంచి నల్గడఁదాఁ కినఁ గడు నలిగి ఘోరతరశరహతిన
మ్మూకను విరియఁగ నర్జునుఁడాఁకతమున నేసె నుగ్రుఁడై రణభూమిన్
(ఆది. ౮-200).

వేమూరివారి ప్రతిలో మూకశబ్దము సార్ధబిందుకముగనే యున్నది. శబ్దరత్నాకరము దానిని సార్థబిందుకముగనే గ్రహించినది. అట్టిచోఁ బై పద్యము ఖండాఖండ ప్రాసమునకు లక్ష్యముకాఁ జాలదు.

కం॥ ఆ పన్నగముఖ్యులఁ దన, వీఁపునఁ బెట్టుకొని పఱచి విపినములు మహా
ద్వీపములు గిరులు, సకల దిశాపాల పురములుఁ జూపెఁ
జనివారలకున్- (ఆది. ౨-44).

వేమూరివారి ప్రతిలో వీపు శబ్దము నిర్బిందుకముగనే యున్నది. శబ్దరత్నాకరమున నది సార్ధబిందుకముగనే గ్రహింపఁ బడినది. (పృష్ఠ శబ్దమున కర్థము వీఁపు).

ఆ॥ పీఁక దఱిగి కాందిశీకులైరి. (ఆది. ౨-89). పీకు అని వేమూరి వారి ప్రతి. ఈ యతికి అప్పకవి ఆది పర్వమునందలి దని

"తీఁగయుయ్యెల నూఁగుఁ జల్లని తియ్యమామిడి మోకలం
దాఁగుఁ బువ్వుల తేనె పోనలఁ దారుఁగేతకిఁ జేరుఁబు

న్నాగ పూగ మహాగ వీధుల నాట్యముల్పచరించు నా

భోగనాగలతాగృహంబుల భోగముల్గను వేడుకన్." (అప్ప. 3-307).

అను పద్యమును గూడ నుదాహరణముగా నొసంగెను. కాని యది యాది పర్వమునఁ గానరాలేదు.

నన్నిచోడుని కుమారసంభవమున దీర్ఘముమీఁది యఱసున్నలు నెఱ సున్నలగుటయు, నట్లు పూర్ణ బిందు పూర్వకములైన యక్షరములకు సంస్కృతము నందలి పూర్ణబిందు పూర్వకములైన యక్షరములతోఁ బ్రాస వేయుటయుఁ గానఁబడును.

కం॥ "పోండిగ నగజ తపశ్శిఖ మూండు జగంబులను దీవ్రముగఁ బర్విన బ్ర
హ్మాండము గాఁచిన కాంచన భాండము క్రియఁదాల్చెఁద త్ప్రిభాభాసితమై
(6-157).

సోమల దేవి దీర్ఘాసి శాసనమున(1065).

కూంతు పరియె పోల్పం గాంతలెందు.

అను చోటఁ గూడ నట్టి ప్రాసము చూపట్టుచున్నది. నన్నయ యిట్టి పూర్ణార్థ బిందు ప్రాస వెచ్చటను వాడియుండలేదు. దీర్ఘముమీఁది యర్ధ బిందువు నాతఁ డర్ధ బిందువుగనే యుంచును గాని నిండు సున్నగాఁ జేయఁడు.

రేఫశ్లిష్టమైన వ్యంజనమును జడ్డక్కరముగా వ్రాసి రేఫను వలపలి గిలకతో సూచించుట తెలుఁగునందలి ప్రాచీన లిపి సంప్రదాయము. ఇట్టి యెడ నన్నయ తరువాతి కవులు కొందఱు, ముఖ్యముగా శివకవులు, వలపలి గిలకను విడిచిపెట్టి జడ్డక్కరమునకు మాత్రమే ప్రాసమైత్రి పాటించి యుండిరి. కన్నడమున నిట్టి ప్రాసకు శాంత ప్రాసమని పేరు.

కం॥ "నమ్మిన భక్తుఁడు
బమ్మయ .... .... ....లో
కమ్ము .... ....
ధర్మమ్ము శివతత్త్వ సారము. (444).

నన్నయ యిట్టి ప్రాస వెచ్చటను వాడి యుండలేదు.

iii సంయుతాసంయుత ప్రాసము

రలలతోఁ గూడియుండు హల్లుల కవిలేని నట్టి హల్లులతోఁగూడఁ బ్రాస వేయుటకు సంయుతా సంయుత ప్రాసమని పేరు. అప్పకవి యాది పర్వమునుండి యీ క్రింది పద్యము నుదాహరించెను.

క్షత్రియ వంశ్యులై ధరణిఁగావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియ వైశ్య శూద్రు లనఁగాఁ గల నాలుగు జాతులన్ స్వచా
రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితుకాచిన యట్లు రామ మాం
ధాతృ రఘుక్షితీశులు ముదంబునఁ గాంచిరె యే యుగంబులన్.
(అప్ప. 3-316).

మాంధాతృ శబ్దము ఋ కారాంతము కనుకఁ ద కారము క్రిందనున్నది వట్రు సుడియే కాని క్రారవడి కాదని యాతఁడు సూచించెను. వేమూరివారి ప్రతిలో రామమాంధాత్ర రఘుక్షితీశు లను పాఠమున్నది. "అనఙృతో ద్వంద్వే" అను పాణినీయ సూత్రమును బట్టియు, దాని ననువర్తించు "ఉర్ద్వంద్వే రః" అను చింతామణి సూత్రమును బట్టియు, "మాంధాతృ రఘుక్షితీశ" అను పాఠమే యుచితమని తోఁచుచున్నది ఏల యనఁ బై పాణినీయ సూత్రమునుబట్టి ఋకారాంత పదముల ద్వంద్వములో నుత్తర పదము పరమై యుండగాఁ బూర్వ శబ్ద ఋకారమునకే "అనఙ్" వచ్చును. కాని అన్నియు ఋకారాంతములు కాక యొకటి కావి కొన్నికావి ఋకారాంతములై యున్నంత మాత్రమున నది రాఁజాలదు. చింతామణిలోని ఉః అను దానిని బట్టి ఋకారమునకే ఆదేశము విధింపఁబడినట్లు తోఁచినను "అనఙ్స్యాదృతో ద్వంద్వే రేఫశ్చారి కవేర్మతే" అను నథర్వణుని వివరణమును బట్టి ఋకారాంత పదద్వంద్వములోవచ్చు అనఙ్ లోని అ కారమునకే ఁకారాదేశము వచ్చునని స్పష్టమగుచున్నది. రామ మాంధాతృ రఘుక్షితీశు లను సమాసమున నొక్క మాంధాతృ శబ్దమే ఋకారాంతము అందుచే నిచ్చట అనఙ్ రాదు. అప్పుడింక రా దేశ ప్రసక్తియే లేదు. "క్షత్త్రియ వంశ్యలై జగతి మిత్యాదిపద్యపద్యే చతుర్థపాదే మాంధాతృపదస్య సంయుతాసంయుత ప్రాసత్వేన ఋకారాంతత్వమేవ, నసరేఫత్వ" మను నహోబలుని వ్యాఖ్య కూడ నీ విషయమునే ధ్రువపఱుచుచున్నది. (అప్పకవీయ వివరణము. పుట 312).

iv. వర్గాక్షరము లనునాసికాక్షరములు పరములగు నపుడు తమ వర్గమునకుఁ జెందిన యనునాసికములుగాఁ గాని తృతీయాక్షరములుగాఁ గాని మాఱుచుండును.అందుచే "సానునాసిక ములౌ వర్గ హల్లులవుఁ దృతీయములు వికల్ప ప్రాసమై యెలర్చు." నని యనంతుఁడు వికల్ప ప్రాసమును జెప్పినాఁడు. అప్పకవి కూడ నీ ప్రాసమును వేర్కొనవి యుండెను.

అగ్నిహుతిఁ జేసి మానవ
భుగ్నివహము మరణ బాధఁ బొందించుచు మూఁ
డగ్నుల యొద్దను నాలవ
యగ్ని యనన్ వెలుఁగుచున్న యమ్ముని నాథున్. (ఆది ౩-152).
అనుచోట నన్నయ వికల్ప ప్రాసమును వాడి యుండెను.

v) పాణినీయ సూత్రముల ననుసరించి న, స ల కాదేశముగా వచ్చు ణ, ష, ళలకును ప్రాసము వేయవచ్చును. దీని కుభయ ప్రాసమని యప్పకవి పేరు పెట్టెను. అనంతుఁ డుభయ ప్రాసమును బేర్కొనెను గాని దాని స్వరూపము వేఱు. (౧-53) వందు కొఱకు వింత- యిండ్లకుఁ బోకు కృ.

ఆ॥ "దుర్ణయమున శకుని-కర్ణదుశ్శాసనుల్. (ఆది. 3-12)
ఇచ్చట దుర్ణయమున అనుటకంటె దుర్నయమున అని యనుటయే యుక్తము. "దురష్షత్వణత్వయోః ప్రతిషేధోవక్తవ్యః" అను సూత్రము ననుసరించి దుర్నయమను రూపమే సాధువగును.

"దుర్నిమిత్తముల్ పుట్టిన- నిర్ణయించి" (అర ౧-99).

vi) ప్రాస స్థలములందు ద్రుతమునకు మకారము పరమగుచో మకారమా దేశముగా వచ్చును (ప్రౌఢ. సంధి. 22) అప్పుడు ద్విత్వ మ్మకార మేర్పడును. ఈ ద్విత్వమ కారమునకును సహజమైన ద్విత్వ మకారమునకును ప్రాసము వేయవచ్చును దీని కనునాసిక ప్రాసమని పేరు. అప్పకవి దీనిని

తమకుఁ దాము ద్విత్వంబులై తనరు నవియుఁ
బూర్ణ బిందులు దాపలఁ బొరయు నవియుఁ
గలసి యనునాసిక ప్రాసములను పేర
నమ లమరుఁగావ్యముల యందుఁ దమకుఁ దాము. (అప్ప.తృతీ. 340.)
అని నిర్వచించెను. అందు ద్విత్వ మకారమునకు

తమ్ములను మల్లికా కుసు
మమ్ముల మరువాది పత్ర మాలికలను, భ
క్తిం మురహరు పూజలు
సం మదమున సలుపఁ గలుగు సకలార్థంబుల్. (అప్ప. 3-342.)

అను స్వరచిత పద్యము నాతఁ డుదాహరణముగా నొసంగెను. భక్తిన్ + మురహరు అను నప్పుడు ము బిందు పూర్వక మగుటకు హేతువు కనఁబడదు. ప్రౌఢ వ్యాకరణ సూత్రమే యిచ్చట నుచితముగా నున్నది. దానిని బట్టి భక్తి మ్మురహరు అను రూపమేర్పడును. నన్నయ యిట్టి ప్రాసమును మూఁడు నాల్గు చోట్ల వాడి యున్నను అప్పకవి యాతని పద్యముల నుదాహరించి యుండ లేదు.

లయగ్రాహి : క్రమ్మని లతాంతముల-కుమ్మొనసి వచ్చు మధు
పమ్ముల నుగీతవిన-దమ్ము లెనఁగెం జూ (ఆది. ౫-138.)

లతాంతములకున్ + మొనసి = లతాంతముల కుమ్మొనసి.

మత్త. అమ్మ సీశుని వాసశక్తి .... .... .... మే
ఘమ్ము లెల్ల కెలంకులన్ .... .... .... ప్రమో
దమ్ముగా .... .... .... .... ... వృష్టిఁజే
సెమ్మహానది దీర్ఘికా సరసీ నదంబులు నిండఁగాన్ (అర. 3-113)

చేసెన్ + మహానది = చేసె మ్మహానది.

ఉ॥ ఇమ్ముగ పర్వలోక ... .... .... బిం
బమ్మన మద్భువంబయిన .... .... కర్ణరం
ధ్రమ్మను నంజలిం దగిలి .... .... లోకవం
ద్యమ్మనిముఖ్య

ఈ పద్య మీ విధముగా ద్విత్వ మకార ప్రాసముతోఁ గొన్ని చోట్లఁ గన్పట్టు చున్నది. (వేమూరి వారి ప్రతి. F. N. 14.)

ఇంబుగ. బింబున. ధ్రంబను. ద్యుం బరమున్. (ఆది. ౧-76.)

అను పాఠమే వేమూరి వారి ప్రతిలోఁ బ్రధాన పాఠముగ నున్నది. ఇట్లున్నచోఁ బై యతి కిచ్చటఁ బ్రసక్తియేలేదు. వంద్యున్ + పరమున్ = వంద్యుం బరమున్ అగును గావున నిది సంధి గత ప్రాస మగును. పర్వ లక్షణ సార సంగ్రహ మునఁ బై పద్యమునకు –

ఇమ్ముగ, బింబున, ధ్రంబను, ద్యుంబరమున్ అను పాఠము సూచింపఁ బడినది. ఈ పాఠమే సరియైనచో నది యప్పకవి చెప్పిన ప్రాస మైత్రి ప్రాసము నకు లక్ష్యము కాఁజాలును.

"గట్టి బిందువు మీఁది బకారమునకు. జమిలిమా ప్రాసమైత్రి నాఁ
బరఁగుచుండు." (అప్ప. ౩-343.)

vii. థధలకును, దధలకును, టడలకును, ప్రాస మైత్రి కలదని అప్పకవి యుదాహరణములు చూపెను. ఇట్టి ప్రాసకు స్వవర్గజ ప్రాస మని పేరు. ఆది పర్వము నందలి యీ క్రింది పద్యము నాతఁ డుదాహరించెను. రంగ రాట్ఛందమునఁగూడ నిది కలదు.

కాదన కిట్టి పాటి యుపకారము తక్షకుఁడేకవిప్ర సం
బోధనఁజేసి చేసె నృప పుంగవ, (ఆది. ౧-124.)

దీనికి "సంపాదనఁ జేసి చేసె నృప పావన" అను పాఠాంతరము కలదు. ఇది కల్పితము వలెఁ గానవచ్చు చున్నది.

ఏ దక్షౌహిణు లెన్నఁ బాండవ బలం బేకాదశాక్షౌహిణుల్
రూడిం గౌరవ సైన్యము (ఆది. ౧-69.)

వేడుక నమ్మని ముందటఁ బాడితి మాడితిమి పెక్కు పరిహాసంబుల్
రూడిగఁ బలికితి మెట్లున్ (౧-156.)

పై రెండు చోట్ల రూఢి యనుటకు బదులు రూడి అను రూపము కావ వచ్చుచున్నది రూఢి శబ్దమునకు రూడి యనునది తద్భవముగా గ్రహించినచో నిందుఁ బ్రాస విశేష మేదియు నుండదు.

తమిళమున క, చ, ట, త, ప, వర్గము లందలి యను నాసికములకుఁ దప్ప మిగిలిన యక్షరముల కన్నిటికి నొక యక్షరమే గుర్తుగా నుండును. ఉచ్చారణ ములోఁ గూడ నందు వర్గము లందలి మొదటి నాలు గక్షరములకును భేదము కానరాదు. అందుచే నందువర్గ ప్రాస మేర్పడెను కర్ణాటకమునఁ గూడఁ బ్రాచీన కాలమం దీ ప్రాస ముండెడి దనుటకు కవిరాజ మార్గము నందలి

సకల జన వినుత నంశ
మఖ సదృశ విశాల వివిధ విభవోదయ నం
ప్రగత గుణగణ ననరి బల
విఘటన నం శంఠననుణవ నారాఘ వనం.

అను పద్యము తార్కాణము వర్గ ప్రాసమే కాక యందు సమీప ప్రాస మను పేర మఱియొక ప్రాసము కూడఁ జెప్పఁ బడినది. దీనిని బట్టి శషలకుఁ బ్రాసము వేయవచ్చును.

శశధర బింబాననె యం
ఋషకేతన కేతనాభ తను తన మవతం

బిస విశదవర్ణె యంకం
దొసదం బసదొళగె జనక తనయ రమణువం.

ఈ సమీప ప్రాసమును గన్నడమున నర్వాచీన శైవ కవులు తప్ప మిగిలిన వా రంతగాఁ బాటించి యుండలేదు. తెలుఁగున నన్నయ వాడక పోయినను దరు వాతి కవులు పలువురు శసలకుఁ బ్రాసమైత్రి పాటించి యున్నారు.

ఆంధ్ర వృత్తరత్నాకరమున వర్గప్రాసము వివరింప బడియున్నది.

కం। సుకవీశ్వర వాగ్దేశ్వరి
సుఖ దంబగు నిగమశిఖరసూక్తులు మోక్షో
పగమములు దయా ధర్మము
లఘనాశకము లన నివి యుదాహరణంబుల్.

దీని కం దుమామహేశ్వరమునుండి యీక్రింది పద్యములక్ష్యముగా నొసంగఁ బడినది

కం॥ మాకంద ఫల రసంబుల
నాఁకలి గొనిమేము గ్రోల నా కొమ్మలలో
చీఁకటిలోన పుడొకచిలు
కేగతితో మోవిగఱచె నెఱుఁగనె చెలియా.

(సింహావలోకనము - పుట. 36.)

Viii రేఫమునకును ఋకారమునకును బ్రాస వేసినచో నది ఋ ప్రాస మగును అనంతుడు కూడ దీనిని బేర్కొనెను. (౧-43.)

ఆ॥ గారవమున నిచ్చి - యా ఋషి తోడఁ బుత్తెంచె. (ఆది. ౩-86.)

కం॥ ఆ ఋషి కుమారు కట్టిన
చీరలు నతి మృదులములు విచిత్రములు. (అర. ౩-104.)

ix. సంధి గత ప్రాసము : సంధి వశమున మార్పు చెందిన యక్షరములకు సహజములైన యట్టి వర్ణములతో యతి చెల్లించినచో నది సంధిగత ప్రాస మనఁ బడును. (అప్ప. తృతీ 372.)అనంతుఁడు కూడ దీనిని బేర్కొనెను.

(౧-59.)

సందిగ్ధమైన యర్థము
నిందఱ సన్నిధిన యడిగి యుంద యెఱుంగన్

సుందరిఁ బాంచాలేంద్ర సు
తం దోడ్కొని రమ్ము పొమ్ము తడయక యవినన్. (స. ౨-211.)

లయగ్రాహి :

కందళిత పుష్ప మకరంద రసముం దగులు
చుం దనుపు సౌరభము నొంది జన చిత్తా. (ఆది. ౫-139.)

కం౹ కిందము శాపము డెందము
నం దలఁపక శాప భయమునన్ మాద్రిగడున్ (ఆది. ౫-142.)

x. అభేద ప్రాసము :- లళలకును, ల, ద, ళ కును బ్రాసమైత్రి పాటించినచో నభేద ప్రాస మగును. దీనిని గవి జనాశ్రయ, కావ్యాలంకార చూడా మణులు లదళ ప్రాస మనియు, ఛందోదర్పణము ప్రాస మైత్రి ప్రాస మనియుఁ బేర్కొన్నది. (౧-40) అనం.

ప్రల్లదుఁడైన యొక్క కులపాంసను చేసిన దానఁ దక్కులం
బెల్లను దూషితం బగుట .... ... ... ...
వల్లభ .... .... .... అగ్నిలోఁ
ద్రెళ్ళఁగ సర్పయాగ మతి ధీయుత. (ఆది. ౧-125.)

ప్రల్లద మేది యిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రి తుల్యుఁడై
త్రెళ్లడు .... (సభా. ౨-69 )

తే॥ క్షత్త్రివధనైన పాపంబు - గ్రాగ వలయుఁ
గడఁగి నాకును సద్గతి- గలుగ వలయు
నివియుఁ బుణ్య తీర్థమ్ములై - యిద్ధరిత్రిఁ
బర్గఁగు చుండంగ వలయు మీ-కరుణఁజేసి. (అర. ౨-262).

ఇందులో నాల్గవ పాదమునఁ బ్రాసయతి కలదు. రెండవ పాదమునఁ గూడఁ బ్రాసయతియే యుండుట నన్నయ నియమమున కనుగుణముగా నుండును. ఇచ్చట గ- గ లకు వడినియమము పాటింపఁ బడిన దన్నచో నా నియమము నకు భంగము వాటిల్లును.

xi. లఘు యకార ప్రాసము:

"ప్రకృతి భావంబుఁ జెందిన ప్రాణములకు
మొదలి యంతస్థములు ప్రాసములకు నిలుచు"

నఱమఱలు లేక లఘు యకారాహ్వయముల. (అప్ప. ౩-361).

"మాయీ దాస్యము వాయు న
పాయము సేయుండు నన్నుఁ బనుపుం డిష్టం
బే యది దానివ తెత్తు న
జేయుఁడనై యమరవరులఁ జేకొని యైనన్" (ఆది. ౯-52).

"నాయెదురఁ జక్కనై యని
సేయఁగ భార్గవునకును శచీవరునకుఁ గొం
తేయుఁ దగు విజయునకుఁగా
కాయత భుజశక్తి నొరుల కలవియె ధరణిన్. (ఆది. ౭-198).

ధ్యేయుఁడవు సకలలోకస్థేయుండవు నమ్రులకు విధేయుఁడవు నయో
పాయజ్ఞుఁడ విజ్జగముల, నీ యెఱుఁగని యవియుఁ గలవె నీరజనాభా
(సభా. ౧-105).

ఉ॥ "నీయనుజాల్ ధనుర్ధరులు .... కౌ
షేయక పాణు లత్యమల .... ....తే
జోయుతుఁ డెల్ల తీర్థములు .... ల
క్ష్మీ యుత ।" (అర. ౨-302).

రేఫ ఱకారములకు నన్నయ ప్రాసవేసి యుండలేదు.
(ప్రాసవైరము అప్ప ౩-344).

సమసంయుతాక్షర ప్రాసములు సర్వత్ర కానఁబడుచుండును గావున వాని కుదాహరణముల నొసఁగి యుండలేదు.

"తలరఁగ రేణుక క్రథన, ప్రలిహ ప్రరుజాశ్వకృంత పదనఖలను ర
క్షల గులిశనిశాత నఖావలిఁ బక్షీంద్రుండు వచ్చి వందఱలాడెన్".
(ఆది. ౨-100).

ఇందలి ప్రథమ పాదములోని క్రథన యందలి క్ర ను దేలఁ బలుక వలయును. లేనిచో గణ భంగమగును. కొన్ని వ్రాఁత ప్రతులలో కుధన అను పాఠాంతర మున్నది. (F.N. పుట. 37).

అప్పుడు గణ భంగ ప్రసంగముండదు. కాని మూలమున క్రథవేన చ ఖూరేణ తపనేన చ ఖేచరః. (ఆది. 28-18).

అను పాఠ మొక్కటే యన్ని ప్రతులందుఁ గానఁబడుచున్నది. రేఫముతోఁ గూడిన యిట్టి ద్విత్వములను దేలఁబలుకుట తరువాతి కవుల కావ్యములం దచ్చటచ్చట గోచరించుచున్నది.

సంస్కృతమునఁ బదములు వ్యస్తములుగా నున్నను, సమస్తములుగా నున్నను సంయుక్తాక్షరములకుఁ బూర్వమందుండు లఘువులు తప్పక గురువు లగు చుండును.

ఉదా "హృదయమివ స్ఫుటితం మహాగృహస్య." (మృచ్ఛ. తృతీ 22)
"మైత్రేయ క్షిప నిగడం పురాణ కూపే." (మృచ్ఛ. సప్త 8).
"వియుక్తా కాంతేన స్త్రియ ఇవ న రాజన్తి కకుభః."
(మృచ్ఛ. పంచ. 25).

ఇచ్చట స్ఫు, క్షి, స్త్రి యను సంయుక్తారక్షములకుఁ బూర్వమందున్న లఘువులు గురువులే యైనవి. లేనిచో గణభంగ మగును. కర్ణాటకుల కీ పద్ధతి సమ్మతము గాదు. సంస్కృత సమాసము కానప్పుడును, ఏక పదము కానప్పుడును లఘ్వక్షరము తరువాత రేఫేతర సంయుక్తాక్షరము వచ్చునట్లుగా శబ్దములనే కూర్పరాదని వారు చెప్పియుండిరి. ఒకే రేఫ సంయుక్తాక్షరము నకు ముందు లఘ్వక్షర మున్నను దోషము కాదని వారి మతము[1] నన్నయ కూడఁ దన రచనలో నీ మార్గమునే యవలంబించెను.

రేఫేతర సంయుక్తాక్షరములకుఁ బూర్వము లఘువుండు నట్లుగా నాతఁ డెచ్చటను బదములను గూర్పఁడు. రేఫేతర సంయుక్తాక్షరముతో నేదైనఁ బదము నాతఁ డారంభించు నప్పుడు తత్పూర్వమందు గురువే యుండునట్లు చూచుచుండును. అందుచే నా యక్షరములు గురువులా లఘువులా, తరువాతి వాని నూది పలుక వలెనా తేల్చి పలుక వలెనా యను ననుమానమునకే యవ కాశముండదు. రేఫ సంయుక్తములైన యక్షరములు వ్యస్తపదముల మొదట నున్నచోఁ దత్పూర్వము లఘు వుండవచ్చును. అప్పు డది లఘువే

1. కం॥ "పరపద పూర్వం ద్విత్వా
క్షరమాగిరె పూర్వ పదద చరమం హ్రస్వా
క్షరమాగె సంధి దోషం
నరేఫ మిదిరాగె శిథిలమిందను సరిపర్"
(శబ్దమణి దర్పణము. సంధిదోష ప్రకరణము.)

యగును గాని గురువు కాదు. సంస్కృత సమాసములందును అద్రుచు, విద్రుచు మున్నగు వానిలోఁ దప్ప మిగిలిన యేక పదములందును రేఫ సంయుక్తాక్షరములకుఁ బూర్వ మందున్న లఘువులు తప్పక గురుత్వమును గాంచి తీరును. ముద్రిత ప్రతులలో నెచ్చటనైనఁ బై నియమమునకు విరుద్ధములైన ప్రయోగములు కావిపించినచో నవి లేఖక పరిష్కర్తృ ప్రమాద జనితములైనవే కాని నన్నయ బుద్ధిపూర్వకముగా వాడి నట్టివి మాత్రము కావని తలంపవలయును.

చం॥ "అలసత యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభు మ్రోల నున్న"
(ఆ. ౪-43).

సీ। "కడుఁ బ్రశస్తములు సక్షత్త్రివంశ్యులకుఁ గాంధర్వరాక్షసములు
ధర్మయుక్తి.

ఈ నియమమును దెలుఁగు కవు లెవ రెవరెంత వఱకుఁ బాటించిరో చెప్పుచు కీ. శే. ప్రభాకర శాస్త్రిగారు "తెలుఁగు కవితలోని దేసి తన" మను వ్యాసమున నిట్లు వ్రాసి యున్నారు. (సింహా. 41).

"ప్రాచీన కర్ణాట కవు లీ నియమమును సరిగాఁ బాటించిరి. నన్నయ పాటించెను. నన్నిచోడుఁడు పాటించి నట్లున్నాఁడు. కాని తరువాతి కవులు మఱికొంత స్వాతంత్ర్యము వహించినారు. తిక్కనాదుల రచనలలోనే రేఫేతర సంయుక్తాక్షరముల పూర్వము లఘువు లుండునట్లు రచన లున్నవి. కాని యీ సంయుక్తాక్షరమునకు శైథిల్యము కల్పించి పూర్వాక్షరము లఘువుగానే యుండునట్లు చేసిరి. తిక్కన తర్వాతి కవీశ్వరు లీ పద్ధతిని బాహాటముగాఁ బాటించిరి".

నన్నయకుఁ బూర్వము తెలుఁగున దేశీయచ్ఛందోరీతులే హెచ్చుగా గోచరించు చుండెను. కన్నడమునఁ బంపాదులు కావించిన రచన ననుసరించి యాతఁడు తెలుఁగునఁ గూడ సంస్కృత పద్ధతులనే హెచ్చుగాఁ బ్రవేశ పెట్టి యుండుటచే నాదేశీయ రీతులు కొంచెము వెనుకఁబడి పోవుటయు, సంస్కృత వృత్తాదులు ప్రాబల్యము పొందుటయు, సంభవించెను. అట్టి కవితకే విస్తర కవిత యని లాక్షణికులు పేరు పెట్టిరి. తెలుఁగకవిత యాశు మధుర చిత్ర విస్తరములని నాల్గు రకములు. అలసాని పెద్దన తాను జతుర్విధ కవితా

విశారదుఁడ నని చెప్పుకొని యున్నాడు. తెలుఁగున విస్తరకవితకుఁ బ్రాచుర్యము కలిగించినవాఁడు నన్నయభట్టే. ఇందలి ప్రధాన లక్షణముల నీ క్రింది విధముగా వివరింప వచ్చును.

ఇందు దేశిరచనా భేదములన్నియును గాక సీసము, తరువోజ, గీతము, మధ్యాక్కర, మధురాక్కర మున్నగునవి కొన్నియే గ్రహింపఁ బడినవి. సంస్కృత వృత్తములలోఁ బూర్వకవులు వ్రాసిన వన్నియు గ్రహింపఁ బడినవి.

పద్యములన్నియుఁ జతుష్పాదములుగా నుండును. ఈ పద్ధతి సంస్కృతమునుండి యనుసరింపఁ బడినదే. అంతకు ముందు దేశీయ వృత్తము లనియత పాద సంఖ్య గలవై యుండెడివి[1].

సంస్కృత శ్లోకములుకూడఁ జతుష్పాదములైనవే. కాని యందలి రెండు మూఁడు పాదములు విడఁబడి యుండును. కన్నడ కవులును, ఆంధ్ర కవులును బద్యమునకు నాలుగు పాదము లుంచుట యను సంస్కృత నియమమును బాటించినను అందు రెండు మూఁడు చరణములను విడఁబఱిచి యుంచుట యను నియమమును బాటింపరైరి.

పాటలు పదములు మున్నగు వాని యందలి సంప్రదాయము ననుసరించి సీస గీత్యాదులలోఁ బ్రాసయతికూడ యతి భేదముగా గ్రహింపఁబడినది. అసలు ప్రాస యతి రెండు పాదముల నొక్క పాదముగాఁ గలుపుట యను సంప్ర దాయమున కనుగుణముగా నేర్పడి నట్టిదే.

చంపకమాలాది వృత్తములను, సీస గీతాది పద్యములను గావ్యములందు యథేష్టముగా వాడుట కవకాశమున్నను అందుఁ గొన్నిటివి గొన్ని రసభావాదులను మాత్రమే వ్యక్తము చేయుటకు వాడుట యెక్కువ యౌచిత్యభాసురముగా నుండును. సాధారణముగాఁ జంపకోత్పలములు లాలిత్యమును, శార్దూల మత్తేభము లౌద్ధత్యమును జక్కగా సూచించును. అందుచే శాంత కరుణ

1. తెలుగు కవుల చరిత్ర. పుట 51.
మనకు లభ్యములగుచున్న శాసనములలోని మధ్యాక్కర, తరువోజ అను దేశీయ వృత్తములలోఁగూడ నాలుగు పాదములే కానఁబడు చున్నవి. అంతకుఁ పూర్వమవి యెట్లుండెనో చెప్పుట కూహ తక్క నాధారాంతము లేదు.

శృంగారాది రసములను బోషించు చోట్లఁ జంపకోత్పలములను, వీరరౌద్రాదులను బోషించు చోట్ల శార్దూల మత్తేభములను వాడుట యుక్తము. మహాకవుల రచనలలో నప్రయత్నముగనే యిట్టి వృత్తౌచిత్యము గోచరించు చుండును. కాళిదాసు మేఘసందేశమున మందాక్రాంతమును, రతివిలాపమున వియోగినీ వృత్తమును వాడియుండుట యా సందర్భములం దెంతయో యుత్కర్షావహమై యొప్పారినది. తెలుఁగు కావ్యములందు వృత్తములలోఁ జంపకోత్పల మాలలును శార్దూల మత్తేభములును విరివిగా, వాడఁబడుచుండును. తక్కిన మత్తకోకిలా తరళాస్రగ్ధరాదులకు విరళమైన ప్రయోగము మాత్రమే కాననగును నన్నయ భారతమున నక్షరచ్ఛందమునకుఁ జెందిన సాంస్కృతిక వృత్తములు మొత్త మైదువందల యెనుబది తొమ్మిది వాడఁబడి యున్నవి. ఇం దిరువది మూఁడు వృత్తభేదము లున్నవి. వీనిలోఁ జంపకోత్పల శార్దూల మత్తేభ వృత్తముల సంఖ్య (240 + 184 + 18 + 61) = 503. మిగిలిన యెనుబది యాఱు వృత్తములలో మత్తకోకిలములు 26. తరలలు 25. మాలినులు 7. పృథ్వీవృత్తములు. 5. లయగ్రాహి వసంత తిలకములు మూఁడేసి. మహాస్రగ్ధరా, మానినీ, కవిరాజ విరాజిత స్వాగతములు రెండేసి. స్రగ్ధర, తోటకము, పద్మకము, ద్రుతవిలంబితము, వనమయూరము, అంబురుహము, రథోద్ధతము, మణిభూషణము, దండకము ఒక్కొక్కటి. వృత్తములలో నన్నయ చంపకమాలల నెక్కువగా వాడి యుండెను.

మాత్రాచ్ఛందమునకుఁ జెందిన జాత్యుపజాతులలో నన్నయ భారతమున కందపద్యముల సంఖ్య చాల నెచ్చు (1219). సీసములు 251. ఆటవెలఁదులు 195. తేటగీతులు 177. మధ్యాక్కరలు 39. మధురాక్కర 1. తరువోజలు 12. ఉత్సాహములు 4. మొత్తము జాత్యుపజాతుల సంఖ్య 1898. వృత్తములును జాత్యుపజాతులును గలసి 1898 + 589 = 2487. గద్యములు 1496. గద్యపద్యముల మొత్తము = 3983. ఇవిగాక 13 ఆశ్వాసాంత గద్యలు. 12 ప్రక్షిప్తములు, ఒక సంస్కృత శ్లోకము. (4009)

నన్నయ యే పద్యము నెట్టి సందర్భములో వాడెనో యిదమిత్థమని నిర్ణయింపఁజాలము కాని యీ విషయమునఁ గొన్ని సూచనలు చేయుటకు మాత్ర మవకాశ మున్నది. ఈ సూచనలు ప్రయోగ బాహుళ్యమును బట్టియే చెప్పఁబడిన వగుటచే వానియం దెడనెడ నతివ్యాప్త్యవ్యాప్తులు గోచరింప వచ్చును.

సంస్కృత కావ్యములలో సాధారణముగా సర్గమంతయు నొకే వృత్తములో వ్రాయఁబడు చుండినను చివరమాత్ర మొండు రెండు భిన్న వృత్తములు గోచరించును. తెలుఁగున నాశ్వాసమంతయు నొకే వృత్తమున వ్రాయు నాచారము లేదు. ఒక్క ద్విపద కావ్యములలో మాత్ర మాద్యంతము ద్విపదచ్ఛందమే గోచరించును. మిగిలిన కావ్యములలో మాత్ర మాద్యంతము నాశ్వాసములు వివిధ వృత్త పద్యములతోడను, గద్యముల (వచనముల) తోడను గూడియుండును. చంపకోత్పలములు, శార్దూల మత్తేభములు, కందములు, గీతములు, సీసములు అనునవి విరివిగా వాడఁబడును. మిగిలిన స్రగ్ధరా, తరలా, మత్తకోకిలాదులు క్వాచిత్కముగఁ గనఁబడుచుండును. ఆశ్వాసాంతములందు మాత్రము కృతిభర్తృపరముగా వ్రాయఁబడు పద్యములలో విశేష వృత్త ప్రయోగము చూపట్టుచుండును. నన్నయ భారత భాగమునఁ గూడ నన్ని ఆశ్వాసముల చివర రాజరాజును సంబోధించు పద్యములున్నవి. ఇవి యొకటి రెండు చోట్ల మాత్రము మూఁడేసి యున్నను (అది ౧; సభా. ౨) మిగిలిన చోట్ల రెండేసియే వ్రాయఁబడి యున్నవి. వీనిలో నొకటి కంద పద్యము, రెండవది విశేష వృత్తము.

| | | | |
|---|---|---|---|
| ఆదిపర్వము | ౧. | ఉ. | కం. తోటకము. |
| | ౨. | | కం. వసంత తిలకము. |
| | ౩. | | కం. మత్తకోకిల. |
| | ౪. | | కం. ద్రుతవిలంబితము. |
| | ౫. | | కం. వనమయూరము. |
| | ౬. | | కం. మాలిని. |
| | ౭. | | కం. స్వాగతము. |
| | ౮. | | కం. మత్తకోకిల. |
| సభాపర్వము | ౧. | | కం. అంబురుహము. |
| | ౨. | రథోద్ధత. | కం. ఉత్సాహము. |
| అరణ్య | ౧. | | కం. ఉత్సాహము. |
| | ౨. | | కం. పృథ్వీ. |
| | ౩. | | కం. వసంత తిలకము. |

ఇందు తోటకము, ద్రుత విలంబితము, వనమయూరము, అంబురుహము, రథోద్ధతము అను నైదును ఆశ్వాసాంతములఁ దప్ప మఱెచ్చటను వాడఁబడి యుండలేదు. మాలిని, స్వాగతము, వసంత తిలకము, పృథ్వీ వృత్తము, మత్తకోకిల, అనునవి ఆశ్వాసాంతము లందును, గ్రంథమందును గూడ వాడఁబడి యున్నవి. స్రగ్ధర, మహాస్రగ్ధర, మావిని, కవిరాజవిరాజితము, పద్మకము, మణి భూషణము, లయగ్రాహి, దండకము, అనునవి గ్రంథమున నక్కడక్కడ నొండు రెండేసి సార్లు మాత్రము వాడఁబడినవి. తరల యిరువది యైదు చోట్లఁ గానఁబడు చున్నది.

జాతులలోఁ గందములు 1219 సార్లును, మధ్యాక్కరలు 39 సార్లును, ఉత్సాహము 4 సార్లును, వాడఁబడి యున్నవి. అన్ని యాశ్వాసముల యంత మందును రాజరాజును సంబోధించు పట్ల నొక్కొక్క కంద పద్య మున్నది. రెండు చోట్ల (సభా. ౨.; అర. ౧.) నుత్సాహములు కూడ నాశ్వాసాంతములుగా వాడఁబడినవి. గ్రంథమున 39 మధ్యాక్కరలును ఒక్క మధురాక్కరయు గోచరించు చున్నవి ఉపజాతు లెవ్వియు నాశ్వాసాంతములందు వాడఁబడి యుండలేదు. గ్రంథమున 251 సీసములు, 195 ఆటవెలదులు, 177 తేటగీతులు, 12 తరువోజలు కానఁబడు చున్నవి. ఆశ్వాసాంతములందు వింత వృత్తములను వాడవలయునను నుద్దేశముతో నన్నయ యన్ని యాశ్వాసముల చివర నొక్కొక్క కంద పద్యముతో పా టొక్కొక్క వింత వృత్తమును గూడ వాడియున్నాఁడు. సభాపర్వమున ద్వితీయాశ్వాసాంతమున మూఁడు పద్యము లున్నవి. అందొకటి కందము. ఒకటి రథోద్ధతము, మఱొకటి యుత్సాహము. ఆదిపర్వ ప్రథమాశ్వాసాంతమున నొక కందమును, నొక తోటకమును వ్రాయుచు నన్నయ వానికి ముందొక ఉత్పలమును గూడ వాడియున్నాఁడు. ఆదిపర్వ షష్ఠాష్టమాశ్వాసముల చివరను, సభాపర్వ ద్వితీయాశ్వాసము చివరను, ఆశ్వాసాంతములకు ముందున్న కంద పద్యములలో రాజరాజునకు సంబంధించిన యొండు రెండు సంబోధనలు కనవచ్చు చున్నవి. అనఁగా

నా మూఁడు కందములను గొంతవఱకుఁ గథా సంబంధులు * గాను మఱి కొంతవఱ కాశ్వాసాంత సంబంధులు గాను ఉన్నవన్న మాట.

కందము : నన్నయ దీని నాశ్వాసాంతము లందును, నీతి ధర్మము లను దెల్పు సందర్భము లందును వాడుచుండును. ఉదా. కణికనీతి_ఆది. ౬.; సభాపర్వమున నారదుఁడు ధర్మజుని రాజనీతి విషయముల నడుగు సందర్భము- (ఆది. ౨ - 72, 73. ఆది. ౩ - 203, 205, ఆది. ౪_80, 81, 82, 86, 87, 181. ఆది. ౬_180, 181. అర. ౧_6, 23, 27, 28.

ఉత్సాహము: ఇది రెండు చోట్ల నాశ్వాసాంతమందు వాడఁబడి యున్నది. (సభా.౨;అర.౧.)గ్రంథమున నిదిరెండుచోట్లవ్రాయఁబడినది.అందొకటి కౌరవ పాండవులు గురుదక్షిణార్థమై ద్రుపదునిఁ బట్ట నరిగిన సందర్భముననుు, (ఆది- ౬ - 65), ఇంకొకటి భీముఁడు పూర్వ దిఙ్మహీపతుల నోడించి వారిచే రత్న రజతాదులఁ గొన్న సందర్భము నను (సభా. ౧ - 244.) కానఁబడుచున్నది. పై రెండు సందర్భములందు నుత్సాహవృత్త ప్రయోగము సాభిప్రాయమై యచ్చటి పాత్రల యుత్సాహమును జక్కగా వ్యక్తము చేయుచున్నది.

మధ్యాక్కర : దీనిని నన్నయ నాఁ డెట్లు చదివెడివారో తెలియదు. ఇప్పుడు పలువురు దీనిని వచన తుల్యముగానే పఠించు చుందురు. దీనిగతి వేగవంతమై యుండక మిక్కిలి మందముగా నుండును. నన్నయ దీనిని దుఃఖక్లేశములను వర్ణించు సందర్భముల నెక్కువగా వాడుచుండును.

---

* కం ॥ అని యిట్లు పాండు నృపనందనుల చరిత్రంబు సెప్పి దా వైశంపా యనుఁడు జనమేజయున కని, జనవినుత చరిత్రపాత్ర సౌజన్య నిధీ (ఆది ౬-307).

కం ॥ జనమేజయ జనపాలున కనఘ చరిత్రునకుఁ బ్రీతుఁడయి వైశంపా యనుఁడాదిపర్వకథ యెల్లను నిమ్ముగఁ జెప్పెనని విలాస మహేంద్రా. (ఆది. ౮-321).

కం ॥ అని యిట్లు సభాపర్వంబున కథ జనమేజయునకు ముగి వైశంపా యను చెప్పిన విధమంతయు మనునిభ శుభ చరిత నిత్య మహిమాశ్రీ (సభా ౨-318).శయా)

ఆది. ౪-102; ౪-176; ౪-253; ౬-165; ౬-269; ౭-121. 122; ౮-133; అర. ౧-200; ౧-393; అర. ౨-117; అర. ౩-299; అర. ౪-3; ౪-103 కథనము నకును. ఆది. ౨-184; ౩-19; ౪-141; ౭-137; సభా-౨-182; అర. ౨-148; అర. ౩-206; ౩-331; వర్ణనమునకును. ఆది. ౭-98; అర. ౨-169; ౨-255; ౩-97; సంప్రశ్నమునకును సభా. ౧-81; అర. ౨-317; గూడ నది యా యా పందర్భములందు వాడఁబడి యున్నది.

సీసమును నన్నయ యీ క్రిందిప్రయోజనములకై వాడుచుండును.

(a) వర్ణనమునకు : ఆది. ౧-9; 31; 33; 140; ఆది. ౨-83; 99; 164; ఆది. ౩-9; 27; 38; 110; 140; 150; 182; ఆది. ౪-23; 84; 216; ఆది. ౫-3; 15; 34; 124; ఆది. ౬-11; 26; 148; 178; 201; ఆది. ౭-60; 72. 94; 159; 167; 194; 234; ౮-76; 82; 139; 185; 221; సభా. ౧-9; 12; 84; 271; సభా. ౨-6; 27; 41; 116; 119; 299; 303; అర. ౧-102; 191; 210; 215; 222; 300; 345; 349; 379; అర. ౨-26; 29; 102; 193; 196; అర. ౩-38; 103; 290; 318; 355.

(b) కథాకథనమునకు : ఏదైనఁ గ్రొత్త కథను జెప్పఁబోవు నప్పు డాతఁడు దానిని సాధారణముగా సీసము తోడనే మొదలు పెట్టుచుండును. ఆది. ౧-27; 118; 129; ఆది. ౨-180; ఆది. ౩-12; ఆది. ౩-23; ఆది. ౪-36; 150; ఆది. ౫-17; 136; 185; 195; ఆది. ౬-211; 228; ఆది. ౭-5; 35; 132; 221; 226; సభా. ౧-135; అర. ౧-122; అర. ౩-3; 14; 61; 250; 259; అర. ౪-35; 119.

(c) ఫలశ్రుతి చెప్పుటకు: ఆది. ౧-71; అర. ౨-230.

(d) ఆత్మగతములు వివరించుటకు: ఆది. ౧-114; ౨-157.

(e) వస్తువులయు, వ్యక్తులయు, స్థలములయుఁ బేర్లు చెప్పుటకు; ఆది. ౩-66; 70; ఆది. ౪-54; ఆది. ౮-176; 221; సభా. ౧-20; 71.

(f) ఒకని యందలి బహు గుణముల నుగ్గడించుటకు: ఆది. ౬-278; ఆది-౭-41; సభా. ౧-258; సభా. ౨-65.

(g) రసహీనమయిన విషయములను విస్తరించుటకు: ఆది. ౫-85; ఆది. ౬-264; అర. ౧-56.

(h) సంబోధన పూర్వకమైన సంప్రశ్నమునకు; అర. ౨-81; 132
నన్నయ శాంత శృంగార కరుణరస పూరితములైన సందర్భములకు జంపకోత్పలములను; వీర రౌద్రరస పూరిత సందర్భములకు మత్తేభ శార్దూలము లను ప్రాయికముగా వాడు చుండును.

స్రగ్ధరా మహాస్రగ్ధరల నతఁడు వీర రౌద్ర సందర్భముల యందే వాడు చుండును. ఆది. ౨-22; ఆది. ౫-38; ఆది. ౬-79;

తరలా మత్తకోకిలా వృత్తములు వేగముగా నడచు వృత్తములు. నన్నయ వీనిని దఱుచుగా సంభాషణ సందర్భములందు వాడుచుండును. ఆది. ౧-153; అర. ౨-222; అర. ౩-352; 353; 362; సభా. ౧-191; (తరల) ఎవరైన నొరులకుఁ దమ్ముఁ గూర్చి నివేదించు నప్పుడు నన్నయ తరలా వృత్తము వాడుచుండును. ఆది. ౩-142; ఆది. ౫-51.

లయగ్రాహి : (ఆది. ౫-138; 139;) అర. ౧-40. కవిరాజ విరాజితము (ఆది. ౫-21; అర. ౨-87) అను వాని నతఁడు కేవల వర్ణనమునకై వాడెను.

అర్జునుఁ డీశ్వరుని స్తుతించు సందర్భమున దండకము చెప్పఁబడినది. (అర. ౧.)

మానిని; మాలిని; పద్మకము; స్వాగతము; మున్నగు వాని నతఁడిట్టి సందర్భమున వాడునని చెప్పుటకు వీలు లేకున్నది. ఏదైన వింత సంఘటనము జరిగి నప్పు డాతఁడు మాలిని వాడుచుండును.

ఆది. ౨-81; ఆది. ౫-127; ఆది. ౮-196; 234; సభా. ౨-75.

నన్నయ రచించిన భారత భాగమున ఆశ్వాసాంత గద్యలు 13 గాక 1496 వచన భాగము లున్నవి. అతని పద్యములును గద్యములును గొంచె మించు మించుగా 5:3నిష్పత్తిలో నుండును. రసహీనమైన శుష్కవిషయమును జెప్పవలసి వచ్చి నప్పుడును, ఈ క్రింద సూచింపఁబడిన యితర సందర్భము లందును అతఁడు వచనమునే వ్రాయుచుండును. అతఁడు సీసములను వచనము లను సమాన సందర్భములందు వాడునని చెప్పవచ్చును. అతని వచనములు ధారాశుద్ధి గలిగి శ్రుతి పేయములుగా నుండును. గురు పద్య విద్యకు వలెనే గద్య విద్యకును అతఁడే ఆద్యుఁడని చెప్పుటలో నతిశయోక్తి యుండదు. ఆది

సభా పర్వములలోఁ గంటె నరణ్య పర్వమున నాతఁ డెక్కువ వచన భాగము లను వాడి యుండెను. ఆ పర్వము నందలి వస్తువు స్వభావమే యం దెక్కువ వచన భాగముల వ్రాయుటకుఁ గారణమైనది. అందు నలోపాఖ్యానము, సౌగంధికాహరణము, అజగరోపాఖ్యానము మున్నగు మూఁడు నాలుగు ఘట్టములు తప్ప మిగిలిన దంతయుఁ దీర్థముల పేర్లు, వానిని సేవించుటవలనఁ గలుగు ఫలములు, యుద్ధములు అను శుష్క విషయములతోఁ గూడి యుండును.

(a) వర్ణనమునకు ఆది. ౧-8; ఆది. ౨-27; ఆది. ౩-155; ఆది. ౪-4; ఆది. ౬-132; ఆది. ౭-281; సభా. ౧-13; 68; 79; సభా. ౨-140; 212; అర. ౧-152; 201, 295; 350; 364; అర. ౨-141; అర. ౩-77; 195; 311; 337.

(b) కథాకథనమునకు; ఆది. ౧-66; 86, 150; 156; ఆది. ౨-137 ఆది. ౩-13; ౩-26; ౩-169; ౩-195; 201; 221; ఆది. ౪-192; 257; ఆది. ౫-57; 152. ఆది. ౬-159; ఆది. ౭-51; 112; 114; 129; 275; సభా. ౧-8; 112; 272; సభా. ౨-44; 243; అర. ౧-107; 150; 179; 207; 230; 276; 378; 396; అర. ౨-58; 127; 185; 265; 335; అర. ౩-85; 120; 186; 203; 221; 298.

(c) వస్తువులయుఁ వ్యక్తులయుఁ బేర్లు చెప్పుటకు; వంశవృక్షముల వివరించుటకు; ఆది. ౧-32; 34; 36; 38. 40; 42; 44; 46; 48; 50; 52; 54; 56; 60; 62; 64; ఆది. ౨-4; 212; ఆది. ౩-63; 65; 67; 69; 71; 80 ఆది. ౪-2; 113; 115; ఆది. ౫-75; 107; సభా. ౧-235; 243; 283; 292. సభా. ౨-113; 117; అర. ౨-252; 259; 263; 267; 275; 314; అర. ౩-173.

(d) పూర్వ మొకసారి చెప్పిన కథను బునరుక్తము చేయుటకు; ఆది. ౧-117; ఆది. ౪-238; ఆది. ౬-277; అర. ౧-140; అర. ౪-52.

(e) పూర్వాపర కథా సందర్భములఁ గలుపుటకు; ఆది. ౫-73; ఆది. ౩-134; ఆది. ౭-208; అర. ౧-307; 328; 366; అర. ౨-30; అర. ౩-184; 322; 330.

(f) సంభాషణమునకు; ఆది. ౨-31; ఆది. ౫-21; 61; అర. ౧-307; 328; 366; అర. ౩-184; ౩-330.

(g) హేతువాద వివరణమునకు: సభా. ౨-216; 219; అర ౧-266.

(h) ఆధ్యాత్మిక ధర్మశాస్త్ర విషయ వివరణమునకు; అర. ౧-22; 31; 33; 218,

ఈ విధముగా నన్నయ తన నాఁటికిఁ బ్రచారమున నున్న దేశీయ ఛందము నందలి పద్యములు కొన్ని గైకొని, వానిని సంస్కృత వృత్తముల వలెఁ జతుష్పాదులుగా నొనర్చియు, సంస్కృత ఛందము నందలి వృత్తములు కొన్ని గ్రహించి వానియందు దేశీయ సంప్రదాయాను గుణముగా యతి ప్రాసలఁ జొప్పించియు. నెడనెడ వచన భాగముల ననుసంధించి వైవిధ్యము చేకూర్చియుఁ జంపూ ప్రబంధముగా భారతమును రచించెను. ఒకేచోట వరుసగా నాలుగైదు పద్యములు చెప్పు నప్పు డాతఁడు తఱుచుగా వృత్త వైవిధ్యమును బ్రదర్శించు చుండును. (ఆది. ౨-223; 228.) ఆస్తీకుఁడు జనమేజయుని స్తుతించుట (ఆది. ౮-43; 48.) వశిష్ఠుని మరణ ప్రయత్నము (ఆది. ౬-116; 122.) అతఁడు రసభావాను గుణముగను, వస్తు గౌరవాను గుణముగను బద్యగద్యములు రచించుచు, రసోచితములైన వృత్తములను స్వీకరించు చుండును. ఆశ్వాసాంతములందుఁ దప్ప గ్రంథభాగమున నాతఁడు వింత వృత్తముల నెక్కువగా వాడి యుండలేదు. భాషయందు వలెనే ఛందము నందును, అతఁడు దేశి మార్గములకు సమన్వయము చేకూర్చి సర్వజనామోదము సంధింప యత్నించెను.

---

## 13. నన్నయ చిత్రించిన రాజరాజు :

రాజరాజు నలువది సంవత్సరములకుఁ బైఁగాఁ జాళుక్య సామ్రాజ్యమును బరిపాలించి యుండెను. ఆ పరిపాలన కాలమున జగద్ధితమునకై యాతఁ డొనరించిన మహా కార్యము లెన్నో యుండవచ్చును. కాని యవి యన్నియు నొక యెత్తు; ఆంధ్ర వాఙ్మయమున కాతఁడు గావించిన సేవావిశేష మొకయెత్తు. కావ్య గీతీ ప్రియుఁడైన యా మహారాజు ప్రేరణ ప్రోత్సాహములే లేకుండినచో నా కాలమున నాంధ్ర భారత మవతరించుట కవకాశమే లేక యుండును. ఈ విధముగా నాతఁ డాంధ్రులకు, నాంధ్ర భాషకు నాంధ్రదేశమునకుఁ గలిగించిన మేలింతింత నరానిది. స్వార్థ రహితమైన యీ సేవ కారణముగా నాతఁడు గాంచిన ఫలితమును నపారమైనదే. ఏల యన నాంధ్ర భారత రచనారంభ మాతని కీర్తి చంద్రిక కనవరత శరత్కాలమై యపరిమితౌజ్జ్వల్యము నావహించు చున్నది.

రాజరాజు నన్నయ నాంధ్రమున భారతము రచింపుమని కోరెనే కాని దానిని దన కంకితము చేయుమని కోరియుండ లేదు. నన్నయయు నా మహా కావ్యము నతని కంకితము చేసినను జేయక పోయినను, అవతారి కారంభమున నతని గుణగణములను వర్ణించుటేకాక యాశ్వా సాద్యంతములం దర్థవంతములైన యనేక విశేషణములచే నతని సంబోధించి శౌర్య త్యాగ నయ క్షమా వివేకాదులగు నతని గుణములకును, నిర్మలమైన కీర్తికిని అక్షర రూపమైన మూర్తి తీర్చి దిద్దినాఁడు. ఆ త్రిలింగభాష మా దివ్యమూర్తి యాంధ్రజనుల మ్రోల సాక్షాత్కరించుచునే యుండును.

శాసన కావ్య కర్తలు శాసనములలో నా యా రాజేంద్రులను గూర్చి పలువిధములుగాఁ బ్రశస్తి వాక్యములను రచించు చుందురు. ఈ ప్రశస్తులలో సాధారణముగాఁ గులాచార యశః శౌర్య త్యాగ శీలాదుల వర్ణనమును, "కీర్తి, ప్రజారాగ, ప్రతా, పాజ్ఞా, నయ, క్షమా, వివే, కారి పురీదాహ, ధర్మసంగ్రామ" ప్రభృతులగు విశేషగుణముల ప్రశంసయుఁ గనవచ్చు చుండును. ఒక్కొక్కప్పుడం దా రాజునకు విరుద్ధములైన శత్రువుల గుణ గణములను విస్తరించి, యట్టివారి నవలీలగా జయించుటచే నతనికిఁ గలుగు నుత్కర్షను సైతము ప్రదర్శింప వచ్చును.

"అథవా తద్వీరుద్ధస్య వర్ణయిత్వా బహూన్ గుణాన్
తజ్జయం నాయ కోత్కర్ష వర్ణనం చ మతం క్వచిత్"
(ప్రతాప. నాయక-68)

రాజరాజ నరేంద్రుని కోరుమిల్లి దాన తామ్ర శాసన మిందుకు దృష్టాంతము. భారతమున నన్నయ కావించిన రాజరాజ వర్ణనము కూడఁ బలువిధముల శాసనములందలి ప్రశస్తి వర్ణనమును దలఁపించు చున్నది. ఇందు యథార్థ గుణవర్ణనము తోపా టనుస్యూతముగాఁ దద్వంశీయులు వహించుచు వచ్చిన బిరుదులను, లాక్షణికులు నాయకుని కుండవలె నని చెప్పిన సాంప్రదాయిక లక్షణములను, గొన్ని గోచరింప వచ్చును. కవితావశమున నిందచ్చటచ్చట నతిశయోక్తులు చొచ్చుటకును నవకాశము లేకపోలేదు. ఇట్లని యందలి విషయమంతయు నభూత కల్పనగాఁ బరిగణించుట మాత్ర ముచితము గాదు. అలంకారాసక్తిచే నరుదెంచునట్టి యతిశయోక్తుల నెఱుంగుట కంత కష్టపడ నవసరములేదు. అట్టివానిని గొన్నిటిని దొలఁగించి చూచినచో నన్నయ నిర్మించిన రాజరాజు నిర్మలమూర్తి మనకు సుస్పష్ట రేఖలతో సాక్షాత్కరించి తీరును. నన్నయ నిత్య సత్య వచనుఁడును, మితభాషియు నగుటచే నాతని వర్ణనములం దట్లు వర్జనీయములైన విషయము లంతగా గోచరింపవు.

నన్నయ వర్ణించిన రాజరాజు గుణగణములలో నెల్లఁ బ్రముఖములైన వాతని తేజః శౌర్య పరాక్రమములు. అతఁడు విక్రమాదిత్య విభుఁడు, విభాకర తేజుఁడు, వీరావతారుఁడు, మృగరాజ పరాక్రముఁడు. అన్యరాజ తేజోజయశాలియైన యాతని శౌర్య మప్రతిమానమైనది. నిజభుజ విక్రమముచే నాతఁ డరాతి రాజ నివహముల నోడించి యపరాజిత భూరి భుజా కృపాణ ధారాజల శాంత శాత్రవ పరాగుఁడై యొప్పారెను. "నిస్త్రింశజిత వైరివీర, దండితాహితవీర, పరంతప, రిపుప్రలయ ప్రతాప, విక్రమోద్వేజితాహిత, జితారి, విరోధిప్రళయాంతక, భూరిప్రతాప పరిభూత విరోధి వర్గా" మున్నగు సంబోధన లాతఁడు వైరివీరుల నిర్జించుట యందుఁ జూపిన సామర్థ్యమును వేయి విధముల వక్కాణించు చున్నది. నన్నయ రాజరాజు శౌర్య పరాక్రమముల నింత యధికముగా వర్ణించుట కేవల స్తోత్ర ప్రియత్వముచేఁగాదు. ఆ మహారాజు తాను రాజ్యమును బరిపాలించిన నాలుగు దశాబ్దుల కాలములో మూఁడు నాలుఁగు సారులైన వైరివీరుల నిర్జించి నష్టప్రాయమైన సింహాసనమును మరల సంపాదించు

కొనవలసి వచ్చెను.విమలాదిత్యుఁడు క్రీ.శ. 1019లో మరణింపఁగా వెనువెంటనే రాజరాజు చాళుక్య సింహాసనము నధిష్ఠింప వలసి యుండెను. కాని యాతఁడు తరువాత మూఁడేండ్ల వఱకును దాయాదులయు శత్రువులయు విరోధముచేఁ బట్టాభిషేకము నిర్వర్తించుకొనఁ జాలక పోయెను. ఈ దాయాదు లెవ్వరను విషయమున భిన్నాభిప్రాయము లున్నవి. రాజరాజు సవతి తమ్ముఁడైన విజయాదిత్యుఁడే తండ్రి మరణానంతరము చాళుక్య సింహాసన మాక్రమించి రాజరాజున కాటంకము కల్గించెనని శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగా రభిప్రాయ పడుచున్నారు.[1] శ్రీ భావరాజు వేంకట కృష్ణారావు గారప్పటికి విజయాదిత్యుఁడు బాలుఁడై యుండె ననియు, శైశవమునందే యాతని హృదయ క్షేత్రమున రాజ్యకాంక్ష మొలకెత్తె నని తరువాతి కాలపు శాసనము లేవియు సూచించుట లేదనియుఁ దెల్పి, యిమ్మడి చాళుక్య భీముని దాయాదులైన రాజమార్తాండ కంఠిక విజయాదిత్యుల సంతతి వారైన విరవద్యపుర పిఠాపుర చాళుక్యులే కాక కళింగములోని సర్వసిద్ధి చాళుక్యులుకూడ వేంగీ సామ్రాజ్యమునకై రాజరాజుతోఁ బోరాడి యుందు రనియు, నా యదను చూచుకొని కళింగ రాజైన మధు కామార్ణవుఁడు సైతము రాజరాజు నెదిరించి యుండు ననియు సూచించి యున్నారు.[2] వీరిలో నెవ్వరు విరోధించినను వారి నోడించి పాఱఁద్రోలువఱకు రాజరాజు పట్టాభిషిక్తుఁడగుట కానుకూల్య మొదవి యుండలేదు. అతఁడు "వైరి వేదండగండ విదారి ఘోరతరాసి భాసి భుజార్గళుఁడై" ఘోరాజిముఖమున విజయ ప్రమదా సమాలింగన సౌఖ్యము ననుభవించుటకు మూఁడేండ్లు పట్టెను. ఈ విషయమునే కోరుమిల్లి తామ్రశాసనమున బేతనభట్టు "రాజద్రాజన్య సేవ్యమైన పృథివీ రాజ్యలక్ష్మిని రాజరాజు భుజబలముచే భరించె" నని చెప్పి యున్నాఁడు.[3] కోదండ పార్థుఁడును, బరాక్రమ ప్రియధాముఁడును నగుట చేతనే రాజరాజు సింహాసనమునకు వచ్చియు రాకముందే సంఘటిల్లిన యీ వైరి విరోధమును నిరసించి జగద్వలయ భాసుర సముద్యత్తేజుఁడును, వీరశ్రీ పవిత్రాశ్రిత భూరిస్థిరబాహుదండుఁడునై విజయ వైభవమునందఁ జాలెను.

---

1. The Eastern Chalukyas of Vengi P-218, 219.
2. రాజరాజ నరేంద్రుఁడు. పు. 100.
3. రాజద్రాజన్య సేవ్యాం మభృత భుజబలా ద్రాజ్యలక్ష్మీం పృథివ్యాః.

ఇట్లాతఁడు "నిత్యలక్ష్మీ జయాభి రాముఁడై" క్రీ. శ. 1022 వ సంవత్సరమునఁ బట్టాభిషేక మహోత్సవమును నిర్వర్తించుకొనఁ జాలెను. తరువాత నాతఁడు సుమారెనిమిది సంవత్సరముల కాలము "నానావనినాథ కిరీట తటీ విలసద్రత్న సంఘటిత పద కమలుఁడై" సామ్రాజ్యమును సర్వజనాను రంజనముగాఁ బరిపాలించెను. ఇంతలో నాతని యదృష్టచక్రము నేమి మరల నథోగామి కావలసి వచ్చెను. చాళుక్య సింహాస నాక్రమణమునకుఁ దగిన సమయ మెప్పు డరుదెంచునా యని యెదురు చూచుచున్న విజయాదిత్యుఁ డొక విప్లవమును లేవఁదీసి, రాజరాజును సింహాసనభ్రష్టు నొనరించి, 1031 జూన్ 27 వ తేదీని విష్ణువర్ధన విజయాదిత్యుఁడనుపేరఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. ఈ సందర్భమున నాతనికిఁ బశ్చిమ చాళుక్య చక్రవర్తియైన రెండవ జయసింహుని సాహాయ్య సంపద చేకూరి యుండును. కొంచె మించు మించుగా నీకాలముననే చెందియుండు కలిదిండి తామ్రశాసనము పశ్చిమ చాళుక్యులు వేంగిపైఁ గావించిన దండయాత్రను సూచించు చుండుట యిందుకు దార్కాణముగా నున్నది. రాజరాజు ధైర్యామర ధరణీ ధరుఁడయ్యును బ్రబలమైన శత్రుధాటి కాగలేక సాయమర్థించుటకై చోళ రాజధానియైన గంగాపురి కరిగెను. రాజేంద్రచోళుఁ డాతని ప్రార్థన నంగీకరించి రాజరాజ బ్రహ్మ మహారాజు, ఉత్తమ చోడ చోడకోన్, ఉత్తమ చోడమిలాన్ ఉదైయాన్, అను మువ్వురు సేనానాయకుల యాధిపత్యమునఁ బెద్దసైన్యమును వేంగిదేశమునకుఁ బంపెను. ఆ సేన వచ్చి పశ్చిమ చాళుక్య సైన్యమును కలిదిండియొద్దఁ దాఁకెను. ఈ యుద్ధమున నే పక్షమునకు విజయము చేకూరెనో చెప్పఁజాలము. ఏలయన నం దిరుపక్షములందలి సేనానాయకులును వీరస్వర్గ మలంకరించిరి. కాని తరువాత రాజరాజు యుద్ధ నిహతులైన యా చోళ సేనాపతుల మువ్వురికి స్మారక చిహ్నములుగా మూఁడు దేవాలయములు నిర్మించి యుండుటచేఁ జోళుల తోడ్పాటుచే నాతఁడు సింహాసనమునఁ బునః ప్రతిష్ఠితుఁ డైన ట్లూహించుట కవకాశము కలుగుచున్నది. ఇట్లు వీరోగ్రాజి విజయుఁడై యాతఁడు పోయిన సింహాసనమును మరల సంపాదించి యేడెనిమి దేండ్ల కాలము రాజ్య మొనరింపఁ జాలెను. ఈ సమయమునఁగూడ నాతని కప్పుడప్పుడు పశ్చిమ చాళుక్యులవలన నలజడి కలుగుచునే యుండెను.

క్రీ॥ శ॥ 1042 లో రెండవ జయసింహుఁడును దరువాత రెండేండ్లకు రాజేంద్ర చోళుఁడును దివంగతు లగుటచే త్రైలోక్యమల్ల ఆహవమల్ల సోమే

శ్వరుఁడును రాజాధిరాజును గ్రమముగాఁ బశ్చిమ చాళుక్య చోళ సింహాసనముల నధిష్ఠించిరి. వేంగి విషయము కారణముగా వా రిరువురికిని మరల యుద్ధ మారంభ మాయెను. ఈసారి చోళులు నిర్విరామముగా దండయాత్రలు సల్పు చుండినను లెక్కచేయక పశ్చిమ చాళుక్యులు వేంగి రాజ్యమునందలి చాల భాగము నాక్రమించుకొనఁ జాలిరి. రాజరాజు పూర్తిగా రాజ్యభ్రష్టుఁడు కాక స్వల్పభాగమును మాత్ర మేలుచుండినట్లు క్రీ. శ 1047 లో వేయఁబడిన ద్రాక్షా రామ భీమేశ్వరాలయము నందలి యొక శాసనము వలనఁ దెలియుచున్నది. (ARE 183 of 1893). వేంగిదేశ మట్లు పరాధీనమై పోవుటకు సహింపఁజాలక చోళచక్రవర్తియైన రాజాధిరాజు పశ్చిమ చాళుక్యుల నెదిరించుటకై నాలుగైదు సార్లు పెద్దసేనలను బంపెను. ఆ సేనలు పశ్చిమ చాళుక్యసేనల నోడింపఁజాలి నను వేంగిదేశమును మాత్రము వారి బారినుండి తప్పింపలేక పోయెను. చోళ సేనలుకూడఁ దన కే విధముగను దోడ్పడలేక పోవుటచూచి పశ్చిమ చాళుక్యు లతో నింకను బోరు సల్పుచుండుచో నున్న రాజ్యముకూడఁ బోవునేమో యను భయముచే రాజరాజు క్రీ. శ. 1051 లో వారితో సంధి చేసికొనెను. ఈ సంధి వలన రాజరాజు తనరాజ్యమును దాను సంపాదించినను బశ్చిమ చాళుక్యచక్రవర్తి సార్వభౌమత్వము నంగీకరింపవలసి వచ్చెను. ఈ సందర్భమువనే యాహవ మల్ల సోమేశ్వరుని ప్రధానులలో నొకఁడును, నన్నయ భట్టారకుని సహాధ్యా యుఁడును నైన నారాయణభట్టు పశ్చిమ చాళుక్యుల ప్రతినిధిగా రాజరాజు కొలు వున కరుదెంచుట సంభవించెను. క్రీ. శ. 1051-52 లో రాజరాజాతనికి నందమపూఁడి గ్రామము నగ్రహారముగా నొసంగెను. అతఁడు భారతరచన మున నన్నయకు వలెనే రాజకీయ వ్యవహారములలో రాజరాజునకును గొంత తోడ్పడి యుండవచ్చును.

వేంగి దేశమును బశ్చిమ చాళుక్యుల బారినుండి కాపాడుటకై చోళ చక్రవర్తి ప్రయత్నము లొనరించుచునే యుండెను. ఆ ప్రయత్నముల వలన నేమియు లాభము కలుగకుండుటయే కాక కొప్పం యుద్ధరంగమునఁ గలిగిన పరాజయమునకు ఫలముగాఁ జోళులు గంగవాడి రాష్ట్రమునుగూడ గోల్పోవలసి వచ్చెను. దానితో రాజరాజునకుఁ జోళుల సాయముపై నాశ సన్నగిల్లెను. అందుచే నాతఁడు క్రీ. శ. 1061లో మరణించువఱకును బశ్చిమ చాళుక్యుల సామ్రాజ్యమునకు లోఁబడియే యుండవలసివచ్చెను. అతని మరణానంతరము

విజయాదిత్యుఁడు బలవంతముగా సింహాసనము నాక్రమించి తన కుమారుఁడైన శక్తివర్మ నందుఁ బ్రతిష్ఠించెను. పశ్చిమ చాళుక్యులతో సంధి కావించు కొన్న పిమ్మటనే రాజరాజు కొంత ప్రశాంతముగా రాజ్యమేలఁ జాలుటయు, నాతని ప్రేరణమున నన్నయ భారతాంధ్రీకరణమునకుఁ బూనుటయు సంభవించి యుండును.

ఈ విధముగా రాజరాజు పరిపాలించిన కాలమంతయు యుద్ధములతోనే కడచి పోయెను. అతఁడు చోళుల సాహాయ్య మర్థించిన మాట సత్యమే యైనను దాను గేవలము వారిపై నాధారపడి యూరకుండలేదు. సమయము చిక్కినప్పు డెల్ల నాతఁడరాతుల నపారధైర్య సాహసములతో నెదిరించి పోరాడుచునే యుండెను. ఆయుద్ధములో నాతఁడు ప్రదర్శించిన ధైర్యశౌర్య పరాక్రమముల నెఱింగిన వాఁడు కావుననే నన్నయ వాని నాశ్వాసాద్యంత పద్యములలో నంత విస్తృతముగా విసుగులేక వర్ణించి యున్నాఁడు. రాజరాజు రణరంగముల వీర రసావతారమో యన విహరించి "పరిమండలంబుల ధరణిపతుల నదిమి కప్పం బుల ముదముతోఁ గొనుచును బలిమి నీయని భూమివలయ పతుల నుక్కడఁ గించుచు, దిక్కులఁ దన యాజ్ఞ వెలిఁగించుచు" భీతుల శరణన్నఁగాచుచుఁ బరరిపు లలనాననకమల హరిణ లాంఛన మూర్తి" యై నిర్వక్ర పరాక్రమమున వర్తిల్లిన వాఁడే కాని సామాన్యుఁడుకాఁడు. అతని పరాక్రమమును వర్ణించుచు నన్నయ వాడిన విశేషణము లన్నియు నీ విషయమునకు సాక్ష్యములై యున్నవి. నందమపూఁడి శాసనమున నన్నయ రచించిన

"యస్యస్ఫార భుజాకృపాణ దళితారాతీభ కుంభస్థల
ప్రోన్ముక్తామల వృత్త మౌక్తికచయ స్సంగ్రామ రంగాంతరే
ధత్తే వీర రసక్రియాభినయన ప్రస్తావనాలక్ష్మితాం
వీరశ్రీ రచితాంజలి ప్రవిసరత్పుష్పోప హారశ్రియః".

అను శ్లోకము కూడ నాలంకారికమైన యతిశయోక్తితోఁ గూడియున్నను నన్నయకు రాజరాజు భుజబలమునఁ గల ప్రత్యయమును . చక్కఁగాఁ బ్రతి పాదించుచున్నది.

రాజరాజు వీర్యవిక్రమాది తీవ్రగుణములకే కాక దానదయా సౌజన్యాది మృదుగుణములకుఁ గూడఁ గూడలియై వ్యసన వివర్జితమైన యకలంక చరిత్ర సంపదచే నఖిల జగజ్జేగీయ మానుఁడై విరాజిల్లుచుండెను "అఖిల జగజ్జేగీయ

మాన నానా గుణరత్న రత్నాకరుఁడు గుణధాముఁడు, బుధనుత సుగుణా ధారుఁడు, గుణరాజితుఁడు, భూరిగుణ రత్న భూషణుఁడు, రాజసూరి సభాంతర భ్రాజిత సద్గుణుఁడు" మున్నగు విశేషణము లిందుకుఁ దార్కాణములు. అతనికిఁ గరం బిష్టంబులై యుండు నేను వస్తువులలో సంతతదానశీలతయు, శశ్వత్పాధు సాంగత్యమును బేర్కొనఁబడియున్నవి. "అగ్రజన్ములకు ననుగ్రహమునఁ జారుతర మహాగ్రహారంబు లిచ్చుచు, దేవభోగముల మహా విభూతిఁ దనరఁజేయుచు" నాతఁడు దానవినోదియై తనరారు చుండెను. అతఁడు కరుణా రస పూర్ణుఁడు. కృపారస బంధురుఁడు. దయాలాప చతురాస్యుఁడు. ధర్మ దయార్ద్ర నిబద్ధ బుద్ధి ఆతనిసౌజన్య మింతిం తనరానిది. సంతతమైన క్షమయు సకలజనానందకరమైన సౌజన్యమును నాతనికిఁ బెట్టని యాభరణములు. వినయ మాతనికి వెన్నతోఁబెట్టిన విద్య. సత్యధర్మములాతనికి సంతతారాధ్యములు. నిత్య సత్యధన ధన్యుఁడనియు, వినయ సత్యనిత్యోదయుఁ డనియు, సత్యోదితుఁ డనియు, నిత్యనిరంతర ధర్మమతి యనియు నన్నయ యాతనిఁ బలుసార్లు వర్ణించియున్నాఁడు. నిరవద్యుఁడై, విమలవిచారముల కునికిపట్టై, జగత్పావన శుభచరితచే నిఖిల ధరా దేవ స్తుత్యుఁడై, యాతఁడు ధరణీ తలమున కపూర్వ మండనమై భాసిల్లెను. ఇన్నిగుణముల కాలవాలమై యుండిన కతముననే నన్నయ యాతని నాది రాజ విభుఁడని ప్రశంసించి యుండెను.

వైదిక ధర్మమునెడను దదను బంధులగు యజ్ఞ యాగాదుల యెడను రాజరాజునకుఁ గల ప్రీతి యపారమైనది. "పరమ ధర్మవిదుఁడు, నిత్య ధర్మ ప్రారంభుఁడు, ధర్మనిరతుఁడు, ధర్మధురంధరుఁడు, ధర్మవిశారదుఁడు ధర్మనిత్య ప్రారంభవిభాసి,ధర్మవిచారోద్దాముఁడు"మున్నగు విశేషణములందు నన్నయవాడిన ధర్మపదమునకుఁ బ్రధానముగా వైదిక ధర్మమనియే యభిప్రాయము. వేద ప్రోక్తములగు ధర్మములలో వర్ణాశ్రమ ధర్మాను సరణమును, యాగాదికర్మా చరణమును బ్రధానములైనవి. రాజరాజు సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమ నొప్పారి, నల నృగ భగీరథ రామ చరిత్రాభి రాముఁడను ప్రశస్తి వహించి మించెను. ఆదిక్షత్ర చరిత్రుఁడను విశేషణముకూడ నీయర్థమునే సూచించుచున్నది. "బహుభాషల బహువిధముల బహుజనముల వలన వినుచు భారత బద్ధ స్పృహులగు వారికి నెప్పుడు బహుయాగంబుల ఫలంబు పరమార్థ మగు" నని యాతఁడు చెప్పుటలో నతనికి యాగాది కర్మాచరణమునెడఁ గల

యభినివేశము తేటతెల్లమగుచున్నది. యాగాచరణమున కగ్రజన్ముల తోడ్పాటవసరము వేదసంరక్షణము వారి యధీనమై యున్నది. అందుచేతనే "బ్రాహ్మణా వేదపాలకా" అను నానుడి యేర్పడినది. వేదరక్షణ వైదిక కర్మాచరణములతో విప్రవరేణ్యులకున్న సంబంధమును బురస్కరించుకొని రాజరాజు వారియెడ భక్తిప్రపత్తులు కలిగి మెలఁగుచుండెను. ధరణీ సురవర పుర భూజరాజమై, విప్రకులమునెల్లఁ బ్రోచుచు వ్యారానంగు నాళీఃపరంపరలు నిత్యవివృద్ధి చేకూర్చుచుండ (ధరాదేవాళీః పరంపరా వర్ధిత నిత్యోదయుఁడు) నాతఁడు సంతతాభ్యుదయుఁడై చెన్నారుచుండెను. వేదముల తరువాతఁ బ్రమాణభూతములైనవి స్మృతులు. శ్రుతి చోదితములైన ధర్మములనే స్మృతులు స్పష్టముగా బోధించుచుండును. అట్టి స్మృతికర్తలలో మనువు ప్రధానుఁడు. అతఁడు వైదిక ధర్మములను స్మృతిరూపమున నిబంధించుటయే కాక యట్లాచరించి తరువాతి రాజుల కందఱికి నాదర్శప్రాయుఁడై వర్తిల్లెను. రాజరాజు మనుమార్గుఁడై, మనునిభశుభ చరిత్రుఁడై యొప్పారెననుట యాతని వైదిక మార్గానుసరణ తత్పరతకే దృష్టాంతము. చతుర్యుగములందును ధర్మముత్తరోత్తర పరిహీణమై సన్నగిల్లుచుండును. హనుమంతుఁడు భీమునకుఁ జతుర్యుగా చార వర్తనములఁ జెప్పు సందర్భమున "కలియుగమునందు ధర్మము బలమఱి వర్తిల్లు నేకపాదంబున" నని కలియుగ స్వరూపమును దెల్పియుండెను. కలియుగము దురితముల కాలవాలము. చళుక్య మన్మథుఁడైన రాజరాజు "ఘన దురితానుబంధ కలికాలజదోష తుషార సంహతిన్ దన యుదయ ప్రభావమున దవ్వుగఁ జోపి, జగజ్జనాను రంజన మగు రాజ్య సంతత నిశాంత విభూతితో" ధర్మదయార్ద్రవిబద్ధ బుద్ధియై వర్తిల్లెను. నన్నయ యాతని 'కలికాల భరత' యని సంబోధించెను. దుష్యంత కుమారుఁడైన భరతుఁడు ద్వాపర యుగమునందుండిన వాఁడు. నన్నయ యాదిపర్వ చతుర్థాశ్వాసమున (109) నాతని

> "భరతుఁడశేష భూభువన భారధురంధరుఁడై వసుంధరం
> బరఁగి యనేక యాగములఁ బాయక భాస్కర జహ్నుకన్యకా
> సురుచిర తీరదేశముల సువ్రతుఁడై యొనరించి భూరి భూ
> సురులకు విచ్చె దక్షిణలు భూరి సువర్ణగవాశ్వహస్తులన్"
>
> (అర. 3-340)

అని వర్ణించి యుండెను. ఈ పద్య మాతని వైదిక ధర్మాచరణ ప్రవణత్వ మును బహూ విధముల వ్యక్తము చేయుచున్నది. రాజరాజు కలికాల భరతుఁ డనుటలో యుగభేద మున్నను అతఁడు యాగాది వైదిక కర్మాచణ తత్పరుఁడై భరతునివలె వర్తించె నను నర్థము స్ఫురించు చున్నది. నందమపూఁడి శాసన ములో నన్నయ నయశాలియైన రాజరాజు మనుమార్గమున క్షితి తలమును సంరక్షించుచుండఁ బ్రీతులై ప్రజలు నిజచరిత్ర పవిత్ర తోయములచేఁ గలికాల కలంక పంకమును బ్రక్షాళించు చుండిరని వ్రాసి యుండెను. దీనివలన రాజరాజు కలియుగముననే వర్తించినను అప్రతిమానమైన ధర్మాభిలాషచే లోకమున యుగాంతర ధర్మములఁ బ్రతిష్ఠించి కృతకృత్యుఁ డయ్యెనని తెలియు చున్నది.

రాజరాజు విద్యా వివేకములకు నిధానము. వివేక విభ్రాజిత, వివేక చతురానన, విద్యా విలాస మున్నగు విశేషణము లిందుకు నిదర్శనములు. విమల ధీ రమణీయుఁడైన యా మహా రాజు సాహిత్యమునందే కాక శాస్త్రము లందును నిష్ణాతుఁడై వాణీ లీలాస్పదుఁడు, సరస్వతీ విలసన్ముఖాంభోజుఁడు నని ప్రశస్తి కెక్కి యుండెను. అతఁ డనేక పురాణములు వినెను; ఉదాత్త రసాన్విత కావ్య నాటక క్రమములు పెక్కు చూచెను; అర్థ ధర్మశాస్త్ర ముల తెఱం గెఱింగెను; జగత్పరిపూజ్యములైన యీశ్వరాగమములందు భక్తిమై హృదయము నిల్పెను. మహా భారత శ్రవణ మన్న నాతని కెంతో యాసక్తి. ఇట్లు శాస్త్ర సాహిత్యములం దారితేఱి కావ్య గీతీ ప్రియుఁడై యలరారుటయే కాక యా రాజేంద్రుఁడు రాజనీతి యందును, నిఖిల రాజ విద్యల యందును నిపుణుఁడై, గంధసింధురహయ శిక్షారూఢ దక్షుఁడై, రాజ లోకమున కొజ్జబంతియై రాజిల్లుచుండెను. నయబంధుర, నిఖిలరాజ విద్యా నిధి, నృపవిద్యాపారగ, రాజవిద్యాపారగ, పార్థివ విద్యాధర మున్నగు విశేష ణము లీ విషయములను వెల్లడించుచున్నవి.

రాజరాజు స్వయముగా విద్వాంసుఁడై యుండుటచే మనీషి విద్యా శ్రమ తత్వవిత్త్వమున నేర్పరియై కవి పండితుల నుచిత విధమున సత్క రించు చుండెను. "విద్వానేవవిజానాతి విద్వజ్జన పరిశ్రమ"మ్మను నానుడి యున్నదే కదా ! శిష్టజన బృందమును, గవిపండిత సమాజమును, బంధు మిత్ర వర్గమును నాతనిచే వివిధములైన మన్ననలఁ బడసి యాతని సౌజన్య మును రసజ్ఞతను గొనియాడు చుండిరి. కవీంద్ర సమాజ సురద్రుమ, సూరి

విధాన, బుధజన చింతామణి, శిష్ట పరపాలన సక్త, విశిష్టాంభోజ మిత్ర, సుహృన్నిధాన, మిత్రవిద్వదంభోజ వనపయోజ మిత్ర, బాంధవాంభోజ వన ద్యుమణి యను విశేషణము లాతని విద్వత్కవి పోషణమును, బంధుప్రీతిని విశదము చేయుచున్నవి.

విద్యా వివేకములకు నిధియై యాంతర సౌందర్యమున నలరారుటయే కాక రాజరాజు కాంతి దీప్తులకు నిధానమై, యపూర్వ దేహ సౌందర్య విశేషముచే నపర మన్మథుఁ డన నొప్పారు చుండెను. "రాజ మనోహరుఁడు, తుహిన కరుఁడురు కాంతిన్" అను విశేషణము లాతని సౌమ్యమైన యాకృతిని, కాంతినిధీ, దీప్తినిధీ యను సంబోధన లాతని శరీర కాంతి సంపదను వెల్లడించు చున్నవి. యువతీ మదనుఁడు, భువనైక సుందరుఁడు భావభవ నిభ సుభగుఁడు, మన్మథా కారుఁడు, తరుణావతారుఁడు మున్నగు విశేషణము లనన్య సామాన్యమైన యాతని రూప వైభవమును జెప్పక చెప్పుచున్నవి. కుమార విద్యాధరుఁ డను విశేషణమునకు కుమార విద్యను – కౌమారతంత్రమును ధరించిన వాఁడు, కౌమారతంత్రము నెఱింగిన వాఁడు లేక కుమారస్వామి దేవతాకమైన మంత్రమును ధరించిన వాఁడు– దాని నుపాసించువాఁడు అను నర్థము వ్యాఖ్యానమునఁ జెప్పఁబడి యున్నది. కాని యీ పదము బాల గంధర్వుఁడను పదమువలె రాజరాజు శరీర సౌందర్యమును గళాప్రీతిని వెల్లడించు చున్నదని చెప్పుటయే యుచితముగాఁ దోఁచుచున్నది. ఇట్లు రూపగుణోపేతుఁడైన యీ చాళుక్య మన్మథుఁడు వివిధ విలాసముల ననుభవించుచు "భూరి సంపదఁ దలపూవు వాడని భోగియై" నిరంతరానందమునఁ గాలము పుచ్చుచుండెను. "పూర్వ దిక్పతిభు విలాస, వాసవమూర్తీ, హరినిభ విభవ విభాసమాన, నిరంతరానందమతీ" యను విశేషణము లీ విషయమును వ్యక్తము చేయుచున్నవి. రాజరాజు పార్వతీపతి పదాబ్జధ్యాన పూజా మహోత్సవము నం దధికమైన ప్రీతి కలవాఁడు. "మృడప్రియుఁడు, మఖారి దయాలబ్ధ సుస్థిరైశ్వర్యుఁడు మున్నగు విశేషణము లీ యంశమును స్థిర పఱుచుచున్నవి. వేంగి చాళుక్యు లందఱికివలె నాతనికిని దక్షవాటీ భీమేశ్వర దేవుఁడు కుల దైవము. భీమేశ్వర కృత నిత్య ప్రసాదుఁడని నన్నయ యాతని వర్ణించి యుండెను. "జగత్పరి పూజ్యములైన యాశ్వరాగమములం దాతఁడు భక్తిమై హృదయము నిల్పి" పురారాతి పూజనా సక్త మతియై కాలము పుచ్చి

యుండెను. ఇట్లని యాతఁడు వీరశైవుఁడని మనము నక్కాఁబ భావింపలేదు. వైదిక ధర్మ మన్నను, వర్ణాశ్రమాచారము లన్నను, వైదిక కర్మాచరణ మన్నను ఆతని కింతింతనరాని ప్రీతి. వేద విప్రు లాతనికిఁ బరమ పూజ్యులు. వేదశాస్త్రముల యభివృద్ధికై యాతఁ డనేక దానము లొసంగి యుండెను. వేంగీ చాళుక్య సింహాసనము నధిష్ఠించిన రాజులందఱును బరమ బ్రహ్మ ణ్యులు; పరమ భట్టారకులు; పరమ మాహేశ్వరులు. "కుబ్జ విష్ణువర్ధ నాదులు కొందఱు పరమ భాగవతు లగుదురు గాక. అంత మాత్రమున వారు వైదికాచార పరాయణులు కాకపోలేదు. అది రాజచాళుక్య వంశమర్యాద. వేంగీశ్వరులు బౌద్ధ ధర్మోపాసకులపై, జైనమునులపై, శ్రావకులపై ఆద రాభిమానములు చూపి యా యా ధర్మములను బోషింతురు గాక. దాన ధర్మములను జేయుదురు గాక. సంఘారామములను, జినవసతులను నిర్మించి భూదానాదులు కావింతురు గాక" పరమ బ్రహ్మణ్యులును బరమ మాహేశ్వరులును నై తీరవలయును. "బ్రాహ్మణ ధర్మ మవలంబించి పరమ బ్రహ్మణ్యుఁడు కానినాఁడు, ఈశ్వరాగమములందు మనసు నిల్పి పరమ మాహేశ్వరాచార పరుఁడు కాని నాఁడు రాజ చళుక్య వంశజుఁడు వేంగీ సింహా సనముపైఁ గూర్చుండరాదు అనర్హుఁడతఁడు"(రాజరాజనరేంద్రుఁడు పుట.94).

ధరణీ రక్షణమున రాజరాజు కడుంగడు దక్షుఁడు. రత్నాకర పరివృత సకల ధరాకాంతుఁడైన యాతఁడు నిఖిలమహీవలయోద్వహ బాహుమండలుఁ డును, నిఖిల మహీరక్షామణియునై నిజవంశ లాంఛన మందలి వరాహమూర్తి వలె భువనోద్ధరణ మొనరించి యుండెను. నన్నయయు విష్ణుమూర్తీ, విష్ణు సన్నిభ, నారాయణమూర్తీ, నారాయణఖ్యా యని సంబోధించి యాతని భువ నోద్ధరణ దక్షతను, విష్ణ్వంశ సంభూతత్వమును ధ్వనింపఁ జేసియుండెను.

రాజరాజ నరేంద్రుఁడు "విలస చ్చాళుక్యాన్వయ పయోధి శశి". ఉత్తమ చాళుక్యుఁడు, వరచళుక్యాన్వయాభరణుఁడు, శ్రీమచ్చళుక్య వంశశిఖామణీ, విలసచ్చళుక్యకుల తిలకుఁడు, చళుక్య మన్మథుఁడు" అని నన్నయ పలుచోట్ల నాతని వర్ణించి యున్నాఁడు. ఈ చాళుక్యులు శైవులైన బ్రాహ్మణోపేత క్షత్త్రియులని కీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారు రాజరాజ నరేంద్ర పంచి కలో నిరూపించి యున్నారు. (పుట. 77) వీరు మానవ్యసగోత్రులనియు,

హారీతీ పుత్త్రిలనియు, మాతృగణ పరిపాలితు లనియు, స్వామి మహాసేన పాదాను ధ్యాతు లనియు శాసనములు వర్ణించుచున్నవి. నన్నయ కూడ రాజ రాజనరేంద్రు నొక్కచో మానవ్యసగోత్ర పవిత్ర యని సంబోధించి యున్నాఁడు. విమలాదిత్యుని రణస్థిపూఁడి శాసనము నందును దరువాతి రాజరాజ నరేంద్రుని శాసనము లందును విజయాదిత్యుఁడు త్రిలోచన పల్లవునితోడి యుద్ధమున మర ణించిన పిమ్మట నంతర్వత్నియైన యాతని మహాదేవి పురోహితునితోఁ గూడ ముడివేము నామ కాగ్రహారమున కరిగి తద్వాస్తవ్యుఁడైన విష్ణుభట్ట సోమ యాజిచే దుహితృ నిర్విశేషముగా నభిరక్షితయై విష్ణువర్ధనునిఁ గనె ననియు, నామె యా కుమారునికి మానవ్యసగోత్ర హారీతీ పుత్త్రాది ద్విపక్ష (స్వక్షత్త్రి) గోత్రక్రమోచితములైన కర్మలు చేయించి యతనిఁ బెంచి పెద్దగావించె ననియుఁ జెప్పఁబడి యున్నది. "విష్ణువర్ధనుని కా పేరును హారీతీపుత్రగోత్ర సంజ్ఞయు మాతామహ సమానుఁడైన విష్ణుభట్ట సోమయాజి వలనఁ గలిగె నని యూహింపఁ దగియున్న"దని కీ. శే. జయంతి రామయ్య పంతులుగారు వ్రాసియున్నారు. (రాజ. న. సం. 76) దీనినిబట్టి చాళుక్యులు పితృపరంపరను బట్టి మానవ్య సగోత్రమునను మాతామహ కల్పుఁడైన విష్ణు భట్టసోమయాజిని బట్టి హారీతీ పుత్త్ర గోత్రమునకును జెందిన వారని తెలియు చున్నది కాని యిట్లనుకొనుట కొక యాటంకము గోచరించుచున్నది. చాళుక్యులకుఁ బూర్వులైన కదంబుల శాసనములలోఁ గూడ వారు మానవ్యసగోత్రు లనియు, హారీతీ పుత్త్రి లనియు, స్వామి మహాసేన మాతృ గణాద్ధ్యాతాభిషిక్తు లనియు వ్రాయఁబడియున్నది. (మృగేశవర్మ కదలు కళని తామ్ర శాసనము). అందుచే కీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారు "బహుశః చాళుక్యులు మానవ్యసగోత్రులును, హారీతీ పుత్త్రిలునైన కదంబులను జయించుటచేత వారి వలెనే వీరును మానవ్య గోత్రుల మనియు హారీతీ పుత్త్రిల మనియుఁ జెప్పుకొని యుండి రేమో"యని సంశయమును వెలిబుచ్చి యున్నారు. (రాజ. న. సం. 76) వారి కా గోత్ర సంజ్ఞ గలిగిన తెఱఁగున కీ యూహ తక్క వేఱా ధార ములు కానవచ్చుటలేదు. చాళుక్య రాజులలోఁ బలువురికి విష్ణువర్ధన బిరుద నామము కలదు. నన్నయయు రాజరాజును విష్ణువర్ధన భూపతీ యని రెండు మూఁడు చోట్ల సంబోధించి యున్నాఁడు. విష్ణుభట్ట సోమయాజిచే వర్ధితుఁడై చాళుక్య వంశకర్తయైన విష్ణువర్ధనుని బట్టి యా వంశము వా రా నామమును దాల్చి యుందురు.

రాజరాజు నన్నయను భారతము నాంధ్రీకరింపు మని కోరు సందర్భమున "హిమకరుఁదొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండు భూపతుల్ క్రమమున వంశకర్తలనఁగా మహి నొప్పిన యస్మదీయ వంశ" మని చెప్పి తమది చంద్ర వంశమని సూచించి యున్నాఁడు. విమలాదిత్యుని రణస్థిపూఁడి శాసనమున భీమనభట్టు చాళుక్య వంశ క్రమమును జంద్రుని నుండియు వర్ణించి యుండెను. దానినిబట్టి బేతన నన్నయ భట్టులు గూడఁ జాళుక్యులను జంద్రవంశ సంభూతులుగానే పేర్కొని యుండిరి [1] "రాజరాజేంద్రుని మనుమఁ డగు వీరచోడుని చెల్లూరి శాసనమునఁ గూడ నట్లే వ్రాయఁబడి యుండెను." "కాని వేంగీ దేశమును పాలించిన కుబ్జవిష్ణు వర్ధనుఁడు మొదలు విమలాదిత్యుని వఱకును 26 గురు చాళుక్యరాజులు పరిపాలనము చేసి శాసనములు వ్రాయించి నను వానియం దెచ్చటను జాళుక్యవంశము చంద్రవంశాంతర్గతమని చెప్పఁబడి యుండలేదు. పశ్చిమచాళుక్యుల శాసనములలోఁ గూడ నీ రీతి వంశ వర్ణనము కానరాదు పదునొకండవ శతాబ్దిలో విమలాదిత్యుఁడు సూర్యవంశీయుఁడని వ్యవహరింపఁ బడెను. రాజరాజచోడ మహీపతి కూఁతురగు కుందవాంబాదేవిని వివాహమాడిన పిమ్మటఁజాళుక్య వంశము చంద్ర వంశాంతర్గతమైనదిగా భీమన భట్టుచేఁ దొలుఁదొల్త నభివర్ణింపఁబడె" నని వ్రాసి (రాజ. న. సం. 75.) కీ. శే. వీరభద్రరావుగారు "ఈ రాజవంశముల వారును వారి బాంధవులును బ్రాహ్మణులలోఁ గలసిపోయిన పిమ్మట వారికడ భృత్యులుగా నుండువారు తమతమ పుత్త్రికుల కా పేరులను-అనఁగా చోడరాజు, చాళుక్యరాజు, వల్లభరాజు, గంగ రాజు మొదలగు నామములను బెట్టుటచే వారి సంతతివారు దానిం దెలిసికొనక వారిని సూర్య వంశపు రాజులని, చంద్ర వంశపు రాజులని వ్యవహరింప నారంభించిరి. కొంతకాలమునకు వీరలున్నత పదవులను బొందిన తోడనే యిటీవలి కవివర్యులు కొందఱు వీరిని గూడ సూర్యవంశపు రాజులని, చంద్ర వంశపు రాజులని తమ కృతులలో స్తోత్ర పాఠములు విన్పించిరి. వీనిని సత్యమని తత్సంతతుల వారును అజ్ఞానులైన ప్రజలును విశ్వసింప నారంభించి" రని తెల్పియుండిరి. (పుట. 103) దీనినిబట్టి చాళుక్యులు చంద్రవంశాంతర్గతులగుట

1. పిత్రోర్వంశ గురూబభూ వురతులా యస్య స్ఫురత్తేజసా
సూర్యా చంద్రమసా నిరస్తతమసా దేవా జగచ్ఛతుషీః (కోరుమిల్లి శా.)
యస్సోమవంశ తిలకః శకవత్సరేషు - నందమపూఁడి శాసనము.

బేతన భట్టాదులచేఁ గల్పితమైన కథయేకాని సత్యము కాదని వారు తలంచి నట్లవగత మగుచున్నది. ఇందలి యాథార్థ్యమును నిరూపించి తెల్పుట కవ కాశము లేదుకాని యొక్క విషయము మాత్రము వారి యూహను బలపఱుచు నట్లుగాఁ గానఁ బడుచున్నది. నన్నయ పెక్కుచోట్ల రాజరాజు కులమునుగూర్చి ప్రస్తావించి యున్నాఁడు. ఆదిపర్వ షష్ఠాశ్వాసాంతమున నొక్కచోట మాత్ర మాతఁడు "శీతాంశువంశప్రకాశి" యను సంబోధనము వాడి తక్కిన చోట్ల నెల్లఁ జంద్ర పర్యాయమైన రాజశబ్దమునే ప్రయోగించి యున్నాఁడు. "రాజకులైక భూషణుఁడు, రాజకులాగ్రగణ్యుఁడు. రాజవంశవార్ధి చంద్రుఁడు, రాజకుల శేఖరుఁడు, రాజాన్వయతిలకుఁడు, రాజకులోత్తముఁడు, రాజవంశ రత్నము" మున్నగు విశేషణము లిందుకుఁ దార్కాణములు. స్పష్టముగాఁ జంద్ర శబ్దమునో తత్పర్యాయమైన మఱే శబ్దమునో వాడక యిన్నిచోట్ల నాతఁడు రెండవ యర్థమునకుఁ గూడఁ దావిచ్చు రాజశబ్దమును వాడియుండుట కీ. శే. వీరభద్రరావుగారి యూహ సత్యమేమో యను సందేహమును గలిగించుచున్నది.

చాళుక్యులసలు క్షత్త్రియు లగుదురా కాదా యను విషయము కూడ సందేహాస్పదముగనే యున్నది. బిల్హణకవి విక్రమాంకదేవ చరిత్రమున నొక్కచోటఁ జాళుక్య వంశమును విష్ణుపాద సంజాతయైన సురాపగతోఁ బోల్చి యుండుటచే నందుఁ జాళుక్యులు పాదజులనెడి విషయము ధ్వనించు చున్నదని కొంద ఱభిప్రాయ పడుచున్నారు.[1] బిల్హణుఁ డీ యుపమానమున నింత యంతరార్థము నిమిడ్చెనో లేదో చెప్పఁ జాలము. అదిగాక క్రీ. శ. 8వ శతాబ్దికిఁ బూర్వమే చాళుక్యులు క్షత్త్రియులై యుండు రనుటకు విశ్వసనీయములైన నిదర్శనములు లభించు చున్నవి. క్రీ.శ. 543 నాఁటి బాదామిదుర్గ శాసనములోఁ జాళుక్య వల్లభేశ్వరుఁడు (పులకేశి 1) తాను శ్రౌత విధానముచే నశ్వమేధాది యజ్ఞముల నాచరించి యున్నట్లు చెప్పుకొని యున్నాఁడు.[2] నేరూరు తామ్ర శాసనమున నాతని కుమారుఁడైన మంగళేశుఁడతఁ డశ్వమేధమునే కాక యగ్నిష్టోమ వాజపేయ పౌండరీక బహుసువర్ణ యాగములనుగూడ నిర్వర్తించి

---

1. Eastern Chalukyas of Vengi page 9.
2. అశ్వమేధాది యజ్ఞానాం యజ్వా శ్రౌత విధానతః.

వట్లు వ్రాయించి యున్నాఁడు.[1] ఈ యాగములను ద్విజులు అందును ముఖ్యముగా బ్రాహ్మణక్షత్రియులు తప్ప నితరు లాచరించుటకు వీలులేదు. ఇది యిట్లుండ క్రీ. శ. 7వ శతాబ్ది పూర్వార్ధమున మన దేశమున కరుదెంచిన చైనా యాత్రికుఁడైన హ్యూన్‌త్సాంగ్ రెండవపులకేశి క్షత్రియుఁడని స్పష్టముగాఁ దెలిపి యున్నాఁడు. (Huien Tsang's Travels, Watters II. Page 239- He was kshatriya by birth and his name was Pu - lo - Ki - She) దీనిని బట్టి క్రీ. శ. 7 వ శతాబ్దిలోఁ జాళుక్యులు క్షత్రియులుగాఁ బరిగణింపఁ బడుచుండిరని నిశ్చితముగాఁ దెలియుచున్నది.

రాజరాజు విమలాదిత్య తనూజుఁడనియు, విమలాదిత్యాగ్ర తనూజుఁడనియు, కులదీపుఁడనియు, వంశవర్ధనుఁడనియు నన్నయ రెండు మూఁడు చోట్ల వర్ణించి యున్నాఁడు. విమాలాదిత్యుని కుమారులైన రాజరాజ విజయాదిత్యులలో రాజరాజే జ్యేష్ఠుఁడనుట నిర్వివాదమే యైనను ఆ సోదరులకు వయోభేదమంతగా లేకపోవుట చేతను, విజయాదిత్యుఁడు కూడఁ దండ్రి యనంతరము రాజగుటకు యత్నించుట సహజమగుట చేతను, అగ్రతనూజుఁడగుటచే సర్వథా రాజరాజే రాజ్యార్హుఁడని చెప్పుటకోయన నన్నయ విమలాదిత్యాగ్ర తనూజ" యను సంబోధనము నుద్దేశ పూర్వకముగా వాడినట్లు తోఁచుచున్నది. చతుర్థాశ్వాసాంత పద్యములలో నాతఁడు రాజరాజును "సమస్త భువనాశ్రయ సత్యాశ్రయ కులశేఖర" యని సంబోధించి యున్నాఁడు. సమస్త భువనాశ్రయ బిరుదము మండదాన శాసనమునఁ బ్రతిగ్రహీతయైన అంకయకుఁ గూడ వాడఁబడి యున్నది. (సమస్త భువనాశ్రయ బ్రహ్మ మహారాజ ఇతి ప్రసిద్ధాయ) అంకయను బ్రహ్మ మహారాజ పదవీ భాజితు నొనర్చునప్పుడే రాజరాజతని కీ సమస్త భువనాశ్రయ బిరుదముకూడ నొసంగి యుండును. సమస్త భువనాశ్రయ బిరుదము కళ్యాణీ చాళుక్యుల శాసనములలోనేకాని తూర్పు చాళుక్యుల శాసనములలోఁ దఱుచుఁగాఁ గానరాదు. అది వారు సాధారణముగా వహించు బిరుద పరంపరలోనిది కాదు. రెండవ అమ్మరాజ విజయాదిత్యుఁ డొక శాసనములో (JAHRS II 247) (సః శ్రీ సమస్త భువనాశ్రయ శ్రీ విజయాదిత్య మహారాజ పరమేశ్వరః) అని యా బిరుదమును

1. I. A. VI page 161 అగ్నిష్టోమ వాజపేయ పౌండరీక బహుసువర్ణాశ్వమేధావభృథస్నాన పవిత్రీ కృతః శరీరః వల్లభో వల్లభః.

వాడుకొని యుండెను. అతని తరువాత మరల నెవ్వరు నా బిరుదమును ధరించి యుండలేదు. సత్యాశ్రయకుల శేఖర బిరుదముకూడ నిట్టిదే. అది కళ్యాణీ చాళుక్యులు తఱచుగా ధరించుచుండు సత్యాశ్రయ కులతిలక బిరుదమునకు రూపాంతరము. ఈ బిరుదమును ధరించుటకుఁ గళ్యాణీ చాళుక్యుల కెంత యధికారముకలదో రాజరాజునకుఁగూడ నంతే యధికార మున్నది. ఏల యన వారివలె నీతఁడును బాదామి చాళుక్యరాజ్య స్థాపకుఁడైన ప్రథమ సత్యాశ్రయ పులకేశి సంతతిలోని వాఁడే. కాని యీ పై రెండు బిరుదములను గలపి వాడుకొన్న వారు తూర్పు చాళుక్యరాజులలో నొక్క రాజరాజు తక్క నింకెవ్వరును గానరారు. క్రీ. శ. 1052 వఱకు నతఁడు చోళులతోఁగలసి పశ్చిమ చాళుక్యులతోఁ బోరాడుచుండినను దరువాతఁ దనరాజ్యమునందలి చాల భాగమును వా రాక్రమించు కొనుటచే నింక లాభములేదని నిశ్చయించి పశ్చిమ చాళుక్యరాజు సార్వభౌమత్వము నంగీకరించుచు నాతనితో సంధి గావించు కొనెను. నూత్నసిద్ధమైన యీ స్నేహమునకుఁ దార్కాణముగా నతఁడు పశ్చిమ చాళుక్యులకు సర్వసామాన్యమైన యా పై రెండు బిరుదములను ధరించి యుండును. ౯జవంశీయు లెవ్వరును ధరింపని యా బిరుదముల నాతఁడట్లు వాడుకొనుటకుఁ గారణాంతరము కానఁబడదు. దీనినిబట్టి భారత రచనము క్రీ. శ. 1053 తరువాతనే జరిగియుండునని భావింపవచ్చును.

ఈ విధముగా నన్నయ రాజరాజు పితృవంశమును సూచించు బిరుదముల భారతాశ్వాశాద్యంత పద్యములలో నెడనెడ వాడియుండినను మాతృవంశమునకు సంబంధించిన దొక్కటియు నెచ్చటను వాడి యుండలేదు. అతని మాతా మహునిఁగాని, మేనమామనుగాని, తల్లినిగాని, భార్యనుగాని యాతఁడెచ్చటను బేర్కొనకపోవుటకుఁ గారణము తెలియదు. "కుందవాంబా కుమార! అమ్మంగదేవీప్రియ! మొదలుగాఁగొన్ని సంబోధనల నాతఁడు వాడుట కవకాశము లేకపోలేదు. శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారు సూచించి నట్లా చివరి రోజులలో "చోళభూపతుల రాజనీతి చాళుక్య చూడామణికి హితవు గాకుండెఁ గాఁబోలును." ప్రభు చిత్తవృత్తి కనుగుణముగా నన్నయయు వందు చేతనే యాశ్వాసాద్యంత పద్యములలో నెచ్చటను వారి ప్రసక్తి తెచ్చినవాఁడు కాఁడు.

నన్నయ రాజరాజునకు వాడిన సంబుద్ధ్యంతములలోఁ గొన్ని పర్వరాజ సామాన్యములైనవి కలవు. "రాజమార్తాండ, రాజకంఠీరవ, పరగండభైరవ,

వైరివీరరసవైద్య, త్రిభువనాంకుశ, రాజనారాయణ, పరగండభేరుండక, బిరుదాంక భీమ, రాజసర్వజ్ఞ" మున్నగున విట్టివే. నన్నయ తనకుఁ బూర్వము చాళుక్యరాజులచే వేయింపఁబడిన శాసనము లన్నింటితోఁ బరిచయము గలవాఁడగుటచే నందలి కొన్ని విశేషణములను రాజరాజునకుఁగూడ వాడి యుండెను. మొదటి విజయాదిత్యుఁడు దాల్చిన బిరుదములలో "విక్రమరామ" యనున దొకటి. దాని ననుసరించియే నన్నయ రాజరాజును "పరాక్రమ రాఘవ" యని సంబోధించెను. ఐదవ విజయాదిత్యుఁడు వహించిన "నిరవద్య" యను బిరుదము రాజరాజునకుఁగూడ వాడఁబడినది. శక్తివర్మ చళుక్యచంద్రుఁడను బిరుదము వహింపఁగా నన్నయ దాని నించుక పొడిగించి రాజరాజును విలసచ్చాళుక్యాన్వయాంభోధి సంపూర్ణశశీ" యని సంబోధించెను. రాజనారాయణ, నారాయణాఖ్య యను బిరుదములు రెండవ అమ్మరాజు దాల్చిన రాజనారాయణ బిరుదమునకును, రాజసర్వజ్ఞ బిరుదము పాశ్చాత్య చక్రవర్తియైన యాఱవ విక్రమాదిత్యుఁడు వహించిన రాయసర్వజ్ఞ బిరుదమునకును రూపాంతరములే. ఇట్లే బిరుదాంకభీమ, త్రిభువనాంకుశ బిరుదములుకూడ రాజరాజు క్రొత్తగా ధరించినవి కావు. విమలాదిత్యుఁడు సైతము వానిని వహించియుండె ననుటకు శాసన నిదర్శనము లున్నవి. (రణస్థిపూఁడి, 14) కలిదిండి శాసనమున రాజరాజు పరగండ భైరవవిభుఁడని కీర్తింపఁ బడినాడు. నన్నయ భారతమున దానినేకాక దానితో సమానార్థకమైన పరగండభేరుండక బిరుదమును గూడ రాజరాజునకు వాడి యున్నాఁడు. ఈ బిరుదము లన్నియు రాజరాజు పరాక్రమమును, ఆభిజాత్యమును, అరినిరసన దక్షతను వెల్లడి చేయుచున్నవి.

ఈ విధముగా నన్నయ వాడిన విశేషణముల వలన రాజరాజు శరీర సౌష్ఠవమును, పరాక్రమస్ఫూర్తియు, హృదయ సంపదయుఁ జక్కఁగా వ్యక్తము చేయఁబడుచున్నవి. ఉత్తముఁడైన భూపతి కుండవలసిన గుణవిశేషము లన్నియు నాతనియందుఁ బుంజీకృతములై యున్నవి. అందుచేతనే యాతని పాలనమునఁ బ్రజ లత్యంత ప్రీతులై యతనికి నిరంతర మహాభ్యుదయమును వాంఛించుచుండిరి. భూవినుత పుణ్యావరేణ్య, సప్తసముద్ర ముద్రితాఖిల వసుధాజన గీతకీర్తి, భూజన పూజ్యమాన, లోకజనస్తుత్య, ధరిత్రీజనమత చారిత్ర మున్నగు విశేషణములు జనులకు రాజరాజు నెడఁగల భక్తిప్రీతులను సూచించుచున్నవి. చోదేశుఁడైన మధురాంతకుఁడుకూడ నాతని గుణగణములను

వంశగౌరవమును విని సంతోషించి తన కూఁతురైన యమ్మంగదేవి నాతవి కగ్రమహిషిగా నొసంగెనని కలిదిండి తామ్రశాసనము చెప్పుచున్నది. (పత్రుశ్రుత్వా పరితుష్య వంశవినయ త్యాగాభిమానోన్నతిం ప్రజ్ఞావిక్రమ సత్యశౌర్యపటుతా శౌర్యక్షమాదీన్య సౌ చోడేశో మధురాంతకః స్వతనయా మమ్మంగ నామాం సతీం చాలుక్యాభరణస్య చాగ్ర మహిషీం స్నేహేన యస్యాకరోత్) దీనివిబట్టి యా చోడరాజు మేనల్లునికిఁ గూఁతునిచ్చుట కేవల బంధుప్రీతిచేఁగాక గుణగౌరవము చేతనే యని తెలియుచున్నది. అతఁడెంత గొప్పవాఁడైనను ఆత్మగౌరవమునకు హానికరమని తోఁచినచో రాజరాజు సంబంధము నంగీకరించియే యుండక పోవును. అతఁడభిమాన మహార్ణవుఁడు. నన్నయ వాడిన విశేషణములలో నెల్ల నిది రాజరాజు వ్యక్తిత్వము నెంతో సూటిగా, విశదముగాఁ బ్రకటము చేయుచున్నది.

రాజరాజు గుణసంపద కలరి, త్యాగ గరిమకు మెచ్చి పండితులును, కవులును నతవి బహువిధములఁ బ్రస్తుతించుచుండిరి. అందుచేఁ దుషార సుధాహార హీర సన్నిభమైన యాతవి నిర్మలకీర్తి సర్వ జగత్పరిపూరితమై జన నేత్ర చకోరములకు శారద చంద్రికవలె ననూనప్రీతి సంధించు చుండెను. నన్నయ యాతవి కీర్తిని బలుచోట్ల మహోత్సాహముతో వర్ణించియున్నాఁడు. "విశుద్ధ యశశ్శరదిందు చంద్రికారాజిత, సర్వలోక విభ్రాజిత శుభ్రకీర్తి పరిపాండుర సర్వదిగంతరాళ, శుభయశః పరిశోభిత, శీతద్యుతి విశద యశః ప్రసర ద్యోతిత సర్వలోక, మహాయశో రాజహంస, పయోజినీ వనరమ్య దిఙ్ముఖ, శారద నీరద నీహారహార విభశుభకీర్తి, హారాహిరాజవర హంసతుషార కుంద స్ఫారద్యశః ప్రసర పాండురిత త్రిలోక" యను శ్రుతి సుభగములైన సమాసములలో రాజరాజు కీర్తివలె నన్నయ యుత్సాహమును ద్యోతిత మగు చున్నది.

తమ ప్రభువులను గావ్య నాయకులతో నభేదాధ్యవసాయము కల్పించి వర్ణించు నాచారము కన్నడ కవులలో విరివిగా నున్నది. పంపఁడు విక్ర మార్జున విజయములోఁ బెక్కుచోట్ల నరికేసరికిని అర్జునునకును నభేదము పాటించి యుండెను. తెలుఁగు కవులలో నన్నిచోడుఁడు కన్నడ కావ్యము లందలి పెక్కితర సంప్రదాయములను వలెనే యీ సంప్రదాయమునుగూడ నను కరించి యుండెను. కుమార సంభవమున నాతఁడు శివునకును మల్లికార్జును

నకు నభేదము కల్పించిన తావులు చాలనున్నవి. నన్నయ యట్లభేదకల్ప నము చేసినచోట్లు లేవుకాని యుత్తములైన చంద్రవంశపు రాజుల వర్ణించుపట్ల నాతఁడు రాజరాజును దృష్టియం దిడుకొని వర్ణించెనేమోయని సందేహింపఁ జేయు పద్యము లనేకములున్నవి. భరతునిగూర్చి యాతఁడు వర్ణించిన పద్య మింతకుముందే యుదాహరింపఁబడినది. జనమేజయుఁడు శ్రుతశ్రవసు నను మతంబున సోమశ్రవసుఁ దనకుఁ బురోహితునిఁ గావించుకొని, వాని నభీష్ట సత్కారంబుల సంతుష్టునిఁజేసి తదుపదేశమున యాగము లొనరించుచు రాజ్యము చేయుచుండెనను సందర్భమున నన్నయ వ్రాసిన పద్యము సరిగా రాజరాజును వర్ణించు చున్నట్లున్నది[1]. దీనికి సంస్కృత భారతమున నాధారము లేకుండుట యీ విషయమును మఱింత బలపఱుచు చున్నది. పరీక్షితుఁడు తక్షకవిషాగ్ని దగ్ధుఁడై పరలోకగతుఁడైన పిమ్మటఁ బురోహిత పురస్సరానేక భూసురవరులు యథావిధిఁబరలోకక్రియలు నిర్వర్తించిరని చెప్పి మంత్రులు జనమే జయునితో,

ఆయుష్మంతుఁడవై ల
క్ష్మీయుత బాల్యంబునంద మీ యన్వయ రా
జ్యాయత్త మహీభారం
బాయత భుజ నీవు దాల్చి తభిషిక్తుఁడవై (ఆది. ౨-201)
పెంచితి ధర్మమార్గమునఁ బ్రీతియొనర్చుచు ధారుణీప్రజన్
మంచితనేక యాగముల మానుగ దక్షిణలిచ్చి విప్రులన్
వించితి సజ్జనస్తుతుల నిర్మలమైన యశంబు దిక్కులన్
సంచితపుణ్య! సర్వగుణ సంపద నెవ్వరు నీ సమానులే. (201)

యని పల్కిరి. ఈ పద్యము లర్థ భావముల పరిపాటి ననుసరించి చూడ నన్నయ రాజరాజుతోఁ జెప్పుచున్నట్లున్నవి. సర్పయాగమును నివా రించు నుద్దేశముతో నాస్తీకుఁడు జనమేజయ సర్పసదనమున కరిగి యాతని స్తుతించిన యీ క్రింది పద్యములు విమలాదిత్యుని మరణానంతరము తన సింహా

1. ఆయత కీర్తితో వివిధ యాగములన్ సురధారుణీ సురా
మ్నాయము నాహితాహుతిని సమంచిత దక్షిణలిచ్చి తన్పుచుం
జేయుచు నుండె రాజ్యము విశిష్ట జనస్తుత వర్ధమాన ల
క్ష్మీయుతుఁ డుత్తముండు జనమేజయుఁ డాది నరేంద్ర మార్గుఁడై
(ఆది. ౧-89)

సనాధిరోహణమున కొటంకము కలిగించిన దాయాదులను శత్రువులను నిర్జించి వైభవమునఁ బట్టాభిషిక్తుఁడైన రాజరాజును గూర్చి నన్నయ పల్కినట్లున్నవి.

రజనీనాథ కులైక భూషణుఁడవై రాజర్షివై ధారుణీ
ప్రజనెల్లం దయతోడ ధర్మచరితం బాలించుచుం దొంటి ధ
ర్మజు నాభాగు భగీరథున్ దశరథున్ మాంధాతృ రామున్ రఘున్
విజయుంబోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారీక్షితా ! (ఆది. ౨-224)
కువలయంబున వారికోరిన కోర్కికిం దగ నీవు పొం
దవ కులంబు వెలుంగఁబుట్టి దృఢంబుగా నృపలక్ష్మితో
నవని రాజ్యభరంబు దాల్చిన యంతనుండి మఖంబులం
దివిరి యిష్టధనంబు లిచ్చుటఁ దృప్తులైరి మహాద్విజుల్.(ఆది.౨-225)

"నల నృగ భగీరథ రామ చరిత్రాభిరామ" అని నన్నయ రాజరాజు నరణ్యపర్వ తృతీయాశ్వాసాదిని సంబోధించిన విశేషణముతో నిందలి మొదటి పద్యమును బోల్చి చూచినచోఁ బైని చెప్పఁబడిన విషయమునందలి యాథార్థ్యము తేటతెల్లమగును. ఇట్లే నన్నయ దుష్యంతుని, నహుషుని వర్ణించిన (ఆది. ౩-93 ; ఆది. ౪-8) పద్యములుకూడ రాజరాజును స్ఫురణకుఁ దెచ్చుచున్నవి.

ఈ సందర్భమున నారణ్యపర్వ శేషమునందలి యాశ్వాసాద్యంతములం దెఱ్ఱన రాజరాజునుగూర్చి వ్రాసిన సంబోధనాంత విశేషణములను నన్నయవాడిన వానితోఁ బోల్చి చూచుట యసంగతముగా నుండదు. ఎఱ్ఱన నన్నయవలె రాజరాజునుగాని యాతని గుణ విశేషములను గాని ప్రత్యక్షముగా నెఱింగిన వాఁడు కాఁడు. ఆంధ్ర భారతావతారణ పుణ్యమున నన్నయతో భాగము పంచుకొన్న వాఁడగుటచేతను, నన్నయ స్తుతికిఁ బాత్రుఁడైన వాఁడగుట చేతను రాజరాజునెడ నాతనికిఁ గొంత యభిమానమో యాదరమో యుండవచ్చును. నన్నయ యాశ్వాసాద్యంతములందు వ్రాసిన పద్యములును, శాసనము లందాతనిఁ గూర్చి నన్నయాదులు వ్రాసిన శ్లోకములును దప్ప నాతని కతని గుణగణములను గూర్చి యెఱుంగుట కన్యాధారములు లేవు. ఈ కారణముచే రాజరాజును గూర్చి యాతఁడు వాడిన విశేషణము లన్నియు నన్నయ వాడిన వానికిఁ బర్యాయ రూపములో ప్రతిబింబములో యనఁదగిన యట్లున్నవి. ఈ క్రింది విశేషణములను

బోల్చి చూచినచో నెఱ్ఱన, నన్నయ వాడిన విశేషణముల నెంత సన్నిహితముగా ననుసరించెనో తెలియనగును.

| | ఎఱ్ఱన | నన్నయ |
|---|---|---|
| ౫. | శ్రీ యువతీప్రియ | |
| | నృప నారాయణ | రాజ నారాయణ |
| | బిరుదాంక భీమ | బిరుదాంక భీమ |
| | రమణీయగుణ శ్రీయుత | గుణరాజిత |
| | నిర్మలధర్మ పరాయణ | నిత్యనిరంతర ధర్మమతీ |
| | రవితేజ | విభాకరతేజ |
| | రాజకుల తిలక | రాజాన్వయ తిలక |
| | భువన విరాజిత సితకీర్తి | జగత్పరిపూజిత కీర్తివిభాసి |
| | దివిజరాజ విభవ | హరినిభ విభవ |
| | నిర్వ్యాజ పరాక్రమ | |
| | సకల ధరాజన సంపూజ్య | భూజన పూజ్యమాన |
| | ధర్మరక్షణ దక్ష | ధర్మ ధురంధర |
| | సర్వ లోకాశ్రయా | సర్వ లోకాశ్రయా |
| | సౌమ్య భావోదయా | విమల విచార |
| | నిత్య సత్యోన్నతీ | |
| | గర్వితోద్యద్భుజాకల్ప కల్పోల్ల సత్ సర్వ సర్వంసహాచక్ర | నిఖిల మహీవలయోద్వహ బాహం |
| | చక్రాయుధా | విష్ణుమూర్తీ |
| ౬. | శ్రీ లలిత మూర్తి | |
| | సుమహచ్చాళుక్య వరేణ్య | శ్రీ మచ్చాళుక్య కులశిఖామణి |
| | పుణ్య చరిత్ర | |
| | విచిత్రా లంకారోజ్జ్వల కవితా లాప కలాప | కావ్య గీతిప్రియ |
| | సంతతా స్మేరమతీ | సంతతానంద మతీ |
| | విమల క్షాత్త్రగుణోన్నత | |
| | విమలాదిత్యాత్మ జన్మ. | విమలాదిత్య తనూజ |
| | విలసత్కమలా రమణీకర కమలోజ్జ్వల విమలాంబుజ రేణురాగ విలసితవక్షా । | |

| | | |
|---|---|---|
| | భూసుర కదంబ సురభూరుహ | ధరణీ సురవర సురభూజ రాజ |
| | వికాసోద్భాసిత | |
| | కృపారస విపాక | కరుణా రసపూర్ణ |
| | సుగుణైకోల్లాస | భూరిగుణ రత్నభూషణ |
| | హరహాస మృగలాంఛన మృణాళీ | |
| | హాసి నవకీర్తి వినదాకలిత లోకా | విశుద్ధయశశ్శర దిందుచంద్రి కారాజిత సర్వలోక |
| ౩. | శ్రీకర సోమాన్వయ రత్నాకర హిమధామ | శీతాంశు వంశప్రకాశీ |
| | ధార్మికాంచిత వినయోత్సేక | వినయసత్య విత్యోదయా |
| | భువనైకవీర | |
| | మహాకావ్య రసప్రయోజనారూఢమతీ | |
| | వీరావతార | వీరావతార |
| | విమలాచార | విమలాచార |
| | మహోదార | |
| | శుభ విచార | విమల విచార |
| | సుజన మందార | విశిష్టాంభోజ వనమిత్ర |
| | నవకీర్తి మౌక్తిక హార | శుభ యశః పరిశోభిత |
| | హరపదాబ్జ మధుకరాత్మ విహారా | పురారాతి పూజనాసక్తమతీ |
| | అమిత వైభవ | హరినిభ విభవ |
| | లోభ మోహ భయాది దుర్లభ | వ్యసన వివర్జిత |
| | మంజు విభ్రమ వికాసి విలాసినీ జన పంచబాణ | యువతీ మదన |
| | నిరంతరానమ దశేష నృపాల మౌళిపినద్ధ ముగ్ధమణి ప్రభా క్రమ సమర్చిత విస్ఫురత్పద కాంతి నిర్జితపంకజా | నానావనినాథ కిరీటతటీ విలస ద్రత్న సంఘటిత పద కమలా । |
| ౪. | చరమ యుగ చలితధర్మ ... భరత చతుర చరిత | |
| | ధీగుణ లీలాప... | ...మల ధీ ర...యుఁడు |
| | పరిచిత నయ... | |



వితర వివరణైక దాన వినోదా　　దాన వినోదా
కరివర హరి కూర్మ క్ష్మా ధరాధీశ
తులోద్ధరణ గుణ ధురీణోద్దండ
బాహార్గళాగ్ర స్ఫురిత నిఖిల గోత్రా
భోగ భాగ్యైక భోగా
దరణ సుక్షిత మూర్తీ
ధర్మ తంత్రానువర్తీ　　　ధర్మనిరత

నన్నయ వ్రాసిన విశేషణములఁ జూచియే ఎఱ్ఱన తన యాశ్వాసాంత పద్యములఁగూర్చె ననుట కేమియు సందేహములేదు. నన్నయ వాడని యొండు రెండు విశేషణము లందు లేకపోలేదు. కాని యవియైనను రాజులనుగూర్చి కవులు సామాన్యముగా వాడునట్టివే కాని క్రొత్తవి కావు.

నన్నయ యాశ్వాసాద్యంత పద్యములలో వాడిన విశేషణ పరంపరచే రాజరాజు రూపగుణ విక్రమాదుల కక్షరమైన రమ్యమూర్తి తీర్చి దిద్దినాఁడు. వాని నన్నిటిని గలిపి చదివినచో నిరవద్యమైన, సర్వరాజ లోకాదర్శమైన, రాజరాజు పవిత్ర చరిత్రయు, రూప సౌష్ఠవమును, బరాక్రమాదిగుణసంపదయుఁ బ్రత్యక్షములై తీరును. ఆంధ్రభారత రచనకు నన్నయను బ్రేరేచి యా రాజ చంద్రుఁడు కాంచిన మహాఫల మిదియే. ఆంధ్రవాణి దాల్చిన యాద్య కావ్య మూర్తితో నాతని యుజ్జ్వలకీర్తి మూర్తియు నాంధ్ర లోకమున నజరామరమై నిల్చి పోయినది.

———

# 14. చాళుక్యుల కాలమునాఁటి రాజకీయ మత సాంఘిక పరిస్థితులు:

చాళుక్యయుగమునందలి శాసనములనుబట్టియు. నన్నయ భారతము నందలి యవతారిక, ఆశ్వాసాద్యంత పద్యములు మున్నగు వానిని బట్టియు, గ్రంథాంతరమున నాతఁ డెడనెడస్వతంత్రములుగా వ్రాసిన భాగములనుబట్టియు నా కాలమునాఁటి రాజకీయ మతసాంఘిక పరిస్థితులను గొంతవఱకుఁ దెలిసికొన వచ్చును. నన్నయకును రాజరాజునకును మాతృ భాషయెడను, బంచమ వేదమను ప్రసిద్ధిగాంచిన భారతేతిహాసము నెడను సహజముగాఁ గల యాదర గౌరవములను బెంపొందించి పై పరిస్థితు లాయితిహాసము నాంధ్రముననిర్మించు టకును నిర్మింపఁ జేయుటకును వారికిఁ దగిన ప్రోద్బల మొసంగియుండ వచ్చును. మొత్తము మీఁద క్రీ. శ. 11వ శతాబ్దిలో నొక్క యాంధ్ర దేశముననే కాక యావద్భారత దేశమునను బరిసరప్రాంతములందునుగూడ మహాభారతము నెడ శ్రద్ధాభక్తు లతిశయించినట్లు కనఁబడుచున్నది. దక్షిణమున రాజరాజు ప్రేరణచే నన్నయ యీ యితిహాసమును దెనుఁగు చేయ నారంభించుట యెల్ల రెఱింగినదే. ఉత్తరమునఁ గాశ్మీర మహాకవియు బహుగ్రంథ ప్రణేతయు నైన క్షేమేంద్రుఁడు కొంచెమించుమించుగా నా కాలముననే (క్రీ. శ. 1050) మహా భారతమును భారతమంజరి యనుపేర సంగ్రహీకరించి యుండెను. క్రీ. శ. 11వ శతాబ్ది యారంభమునందే జావాద్వీపపుఁ బండితులు సంస్కృత భారతమును దమ భాషలోని కనువదించుకొన్నట్లు తెలియుచున్నది. దానిని బరిశీలించి పరి శోధనలు కావించిన డచ్చిపండితుల నివేదికలలో నందలి ఆది విరాట, ఉద్యోగ, భీష్మ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థాన, స్వర్గారోహణపర్వము లెనిమిది మాత్రమే లభించుచున్నట్లు ప్రకటింపఁ బడినది.[1] Dr. H. H. Juynboll అను నాయన జావా భారత ప్రతిని రోమను లిపిలోఁ బరిష్కరించి డచ్చిభాషలోని కనువదించి యున్నారు. పై మూఁడు కార్యములును గొంచె మించుమించుగా నేకకాలమున జరిగియుండుట క్రీ. శ. 11వ శతాబ్దిలో మహా భారతమును సర్వజన సులభముగా నొనరించి పున రుద్ధరించుటయందుఁ గల్గిన యావశ్యకమును జెప్పక చెప్పుచున్నది.

---

1. Prolegomena భండార్కరు ప్రతి-పుట 25

రాజకీయ పరిస్థితులు :

చాళుక్యయుగమున నాంధ్రదేశమునకు వేఁగిదేశమని పేరు. దానిని పాలించినవారు వేఁగీశ్వరులని వ్యవహరింపఁబడుచుండిరి. వేఁగిదేశమున కుత్తరమున కళింగ-ఒడ్డ రాజ్యములును, దక్షిణమున చోళసామ్రాజ్యమును విలసిల్లుచుండెను. చోళసామ్రాజ్యమున చోళ, తుండీర మండలములని రెండువిషయములుగా విభజింపఁబడిన సకల ద్రావిడ దేశమును జేరియుండెను. చోళరాజుల కొకప్పుడు తంజాపురమును, మరొకప్పుడు కాంచీపురమును రాజధానులుగా నుండెను. రాజరాజ చక్రవర్తి యనంతరము దానికిఁ దంజాపురమున కుత్తరమున నుండిన గంగైకొండ చోళపురము రాజధాని యయ్యెను. వేఁగిదేశమునకుఁ బశ్చిమోత్తరముగాఁ గర్ణాట రాజ్యముండెను. కర్ణాట దేశమున కప్పుడు కుంతలరాజ్యమనియు, రట్టపాడి యనియు వ్యవహార నామములు. దానికికుంతలమను పేరు శాతవాహనుల నాఁటినుండియు వచ్చుచున్నది. అది సుమారు రెండువందలయేఁబది యేండ్ల కాలము రాష్ట్రకూటుల పాలనమున నుండుటచే దానికి రాష్ట్రకూట శబ్దభవ మైన రట్టపాడి యను పేరు కూడఁ గల్గెను. దానిని మొదట వాతాపిచాళుక్యులును, పిమ్మట రాష్ట్రకూటులును, దరువాతఁ గళ్యాణి చాళుక్యులును బరిపాలించిరి. ఈ కళ్యాణిచాళుక్యులనే చారిత్రకులు పశ్చిమచాళుక్యులని పిల్చుచుందురు. కర్ణాటచోళ సామ్రాజ్యములకు నడుమ గంగవాడి, నొలంబవాడి యను గాంగులయు నొలంబులయు రాజ్యము లుండెను. ఇప్పటి మైసూరురాష్ట్రములోని దక్షిణ భాగమునకుఁ బూర్వము గంగవాడి యనుపే రుండెను. ఉత్తరార్కాడు సేలంజిల్లాలలోని కొంత భాగమును, మైసూరు రాష్ట్రమునందలి కోలారు జిల్లాయును గలసి నొలంబవాడి యని పిలువఁ బడుచుండెను. నేఁడు కథియవాడు సురాష్ట్రములని పిలువఁబడుచున్న ప్రాంతము నప్పుడు సౌరాష్ట్ర శక లాట గుర్జరులు సామంతులై యేలుచుండిరి. క్రీ.శ. 973వ సంవత్సరము ప్రాంతమున రెండవతైలపదేవుఁడు రాష్ట్రకూట రాజులలోఁ దుదివాఁడైన రెండవకక్క-రాజును మాన్యఖేటము నుండి వెడలఁగొట్టి కుంతల రాజ్యసింహాసనముపైఁ జాళుక్యరాజ్యలక్ష్మిని సుస్థిరముగఁ బ్రతిష్ఠించెను. ఈ సమయముననే పై సౌరాష్ట్ర శకలాట గుర్జరులు స్వతంత్రులగుటకు యత్నించిరి. ఉత్తరమున మాలవాధీశులైన పరమారులు విజృంభించుచు నదను చిక్కి-నప్పుడెల్లఁ గుంతలసామ్రాజ్యమును గబళింపఁ జూచుచుండిరి. పై శకలాట సౌరాష్ట్రాదు లుత్తరమున మాలవాధీశుల చేతను, దక్షిణ

మునఁ గుంతల చాళుక్యులచేతను అదుమఁబడుచు నొకప్పుడు కుంతలచాళుక్యుల కును మఱియొకప్పుడు పరమారులకును నరిగాపులై వర్తించుచుండిరి.

చోళచక్రవర్తులకును వేంగిచాళుక్యులకును జిరకాలమునుండి సంబంధ బాంధవ్యము లుండినట్లు తోఁచుచున్నది. అరింజయవర్మ పట్టమహిషియైన కుందవాదేవి చాళుక్యభీముని కూఁతురఁట! ఈ చాళుక్యరాజు బహుశః రెండవ చాళుక్య భీముఁడై యుండవచ్చును. అరింజయవర్మ కుమారుఁడైన సుందర చోళుఁడు (954 - 969) తనకూఁతునకు కుందవాంబ యని పేరిడెను. ఆమె చోళ రాజరాజునకు సోదరి. చోళ రాజరాజు తన కుమార్తెకు మఱలఁ గుందవాంబ యని పేరుపెట్టెను. ఆమె విమలాదిత్యున కగ్రమహిషి యయ్యెను. ఆ పుణ్యదంపతుల కుమారుఁడే రాజరాజ నరేంద్రుఁడు. చోళచక్ర వర్తులును గర్ణాట దేశరాజులును రాజ్యవిస్తరణాభిలాషచే నిరంతర మొండొ రులతోఁ బోరాడుచునే యుండిరి. చోళులతోఁ దమకుఁ గల సంబంధ బాంధవ్య ములనుబట్టి వేంగీరాజులు వారికి సహాయులై యరుగుట సంభవించుచుండెను. ఈ విధముగాఁ గర్ణాట రాజులకును వేంగీ చాళుక్యులకును గూడఁ గులక్రమాగత మైన వైరము సాగుచుండెను.

వేంగీ చాళుక్యులకును గుంతల చాళుక్యులకును విరోధము కలుగుటకు మఱియొక కారణముకూడ నున్నది. క్రీ. శ. 945లో రెండవ చాళుక్యభీముఁడు మరణించెను. అతనికి దానార్ణవుఁడు. అమ్మరాజ విజయాదిత్యుఁడు. నృప కాముఁడు అను మువ్వురు కుమారులుండిరి. తండ్రిమరణానంతర మమ్మరాజు జనప్రార్థితుఁడై రాజమహేంద్రుఁడను బిరుదనామముతో సింహాసనమధిష్ఠించెను. అగ్రమహిషి కుమారుఁడైన దానార్ణవునికిని అతని మిత్రులకును ఈ పట్టాభి షేకము సమ్మతము కాకుండెను. ఎట్లయిన నమ్మరాజును సింహాసన భ్రష్టునిఁ గావించి తాను రాజు కావలెనని దానార్ణవుఁడు ప్రయత్నించుచుండెను. ఇది యిట్లుండఁగా గుణగవిజయాదిత్యుని తమ్ముని (యుద్ధమల్లుని) మనుమని కుమారుఁడైన బాడప మహారాజు వేంగీరాజ్యమును సంపాదింపనెంచి యప్పుడు కర్ణాట దేశము నేలుచుండిన మూఁడవ కృష్ణ భూపాలు నాశ్రయించెను. "వేంగీ శ్వరులకు రాష్ట్రకూట చక్రేశ్వరులు కులవైరులు. ఆ కులవైరము రాష్ట్రకూట రాజ్యస్థాపనముతో మొలకెత్తి వేళ్లపాతుకొని, మ్రానయి, మహావృక్షమయ్యెను." (రాజరాజనరేంద్రుఁడు-పుట 8) కృష్ణభూపాలుఁడు బాడపునకు సాయముచేయు

తలంపుతో నాంధ్రదేశముపైకి దండెత్తెను. అమ్మరాజాతని నెదిరించుటకై కళింగమునకుఁ బోఁగా నాయదను చూచుకొని దానార్ణవుఁడు వేంగీ సింహాసనము నాక్రమించెను. ఈ విధముగా నలువైపుల శత్రువు లెదుర్కొన్నను వెనుదీయక అమ్మరాజు వారినెల్లర నోడించి యిరువదియైదేండ్లు రాజ్యమేలెను. తుదకాతఁడు దానార్ణవుని తోడనే యుద్ధమొనరించుచు వీరస్వర్గము నలంకరించెను.[1] దానార్ణవుఁడు శ్రీ విష్ణువర్ధన మహారాజను నభిషిక్త నామముతో వేంగీ సింహాసనము నధిష్ఠించెను. ఈ సమయముననో అంతకు ముందుగనో బాదపుఁడు కృష్ణానది దక్షిణభాగము నాక్రమించి వేఁగీశ్వరుఁడను నామముతోఁ బట్టము కట్టుకొనెను. అందుచే దానార్ణవునికి బాదపునికిఁ బోరు సంఘటిల్లెను. ఆ యుద్ధమున బాదపుని కతని పట్టమహిషి సోదరుఁడును, తెలుఁగు చోడవంశమునఁ బుట్టిన వాఁడును మహామాండలిక రాజన్యుఁడు నగు జటాచోడ భీముఁడు తోడ్పడెను. దానార్ణవుని కతని తల్లివంక చుట్టములైన మొదటి కామార్ణవుఁడు, వినయాదిత్యుఁడు నను కళింగరాజులు తోడైరి. ఆ యుద్ధమున జటాచోడుఁడు పై కళింగరాజులను, దానార్ణవునిఁ దత్సోదరుఁడైన నృపకామునిఁ గూడ నోడించి సంహరించెను. తరువాత బాదపుఁడు కూడ మరణింపఁగా జటాచోడభీముఁడు "స్వభగినీపదమై"న యాంధ్రమండలమును వశముచేసికొని వేంగీశ్వరుఁ డయ్యెను. ఈ విధముగాఁ జాళుక్య సామ్రాజ్యము జ్యేష్ఠ కనిష్ఠశాఖలకుఁ జెందిన చాళుక్యుల కెవ్వరికిఁ దక్కకుండ యొక దుష్ట మహామాండలికుని వశమయ్యెను. అతఁడు పరిపాలించిన యిరువది యేఁడేండ్ల కాలమును అరాజకమై యుండె ననియే శాసన కావ్యకర్తలు వర్ణించి యుండిరి.[2] తరువాత దానార్ణవుని కుమారుఁడైన శక్తివర్మ చోళచక్రవర్తియైన రాజకేసరివర్మ సాయమున జటాచోడ భీమునోడించి క్రి. శ. 999 లోఁ బైతృక రాజ్యసింహాసనము నధిష్ఠించెను అతఁడు మహాపరాక్రమశాలి శక్తిత్రయ సంపన్నుఁడు. అందుచేతనే యొకవంక దాయాదులును, ఇంకొకవంక ద్రోహబుద్ధులైన సామంతులును, మఱియొకవంక సామంత దాయాదులకు బాసటగా వచ్చిన కర్ణాట చాళుక్యుల సైన్యములును విశేషక్లేశము కలిగించు చుండినను జంకక అతఁడు పండ్రెండేండ్లును స్థిరముగా రాజ్యపాలనము చేయఁజాలెను. దాయాదులు బహుశః బాదపుని యొక్కయుఁ

1. రాజరాజనరేంద్రుఁడు పుట 9.

2. అనుదార్ణవా దాసీద్దైవ దుశ్చేష్టయా తతః
సప్త వింశతి వర్షాణి వేంగీమహీ రనాయకా" రణస్థిపూడి శాసనము.

దతోదరుఁడైన తాళరాజు యొక్కయు సంతతికిఁ జెందినవారై యుందురు కర్ణాటరాజ దండనాథుఁడైన బయలు నంబి యను బ్రాహ్మణ చమూపతి యొకఁడు వేంగిదేశముపై దండెత్తి కమ్మరాష్ట్రములోని రెండు దుర్గములను దగ్ధమొన ర్చించి చేఁబ్రోలు నందలి మహాసేను నర్చించుట కరిగినట్లు తెలియుచున్నది.[1] శక్తివర్మ యనంతర మాతని యనుజుఁడు విమలాదిత్యుఁడు క్రీ శ. 1011 లోఁ జాళుక్య సింహాసనమునఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. ఈ పట్టాభిషేకము సైతము నిరంతరాయముగా జరిగియుండినట్లు తోఁపదు. అతఁడు నలువంకలఁ జుట్టు ముట్టిన శత్రువుల సంహరించి పిమ్మటనే పట్టాభిషేకము జరుపుకొనవలసి వచ్చెను.[2] రణస్థిపూఁడి కోరుమిల్లి శాసనములలో నప్రతిమానమైన యాతని పరాక్రమ విశేషము వర్ణింపఁబడి యున్నది. పట్టాభిషేక సమయమున నాతని కాటంకము కలిగించిన శత్రువులలో దాయాదులైన బాదప తాళ రాజుల కుమారులు కూడ నుండి యుందురు. అతఁడు క్రీ. శ. 1014 మొ 1043 వఱకుఁ గర్ణాట దేశమును బరిపాలించిన రెండవ జయసింహ మహారాజు నోడించె ననియు,[3] సార్వభౌమ ధరణీశ్వరు లాతనికిఁ బెక్కు మదపుటేనుఁగుల నుపాయనముగా సమర్పించి రనియు[4] భీమనభట్టు రణస్థిపూఁడి శాసనమున వర్ణించియున్నాఁడు. అతఁడు జయసింహునితోఁ గావించిన యుద్ధము క్రీ. శ. 1017-19 ల నడుమ జరిగియుండును. అతనికి మదపుటేనుఁగుల నుపాయనముగా నిచ్చిన వారు సార్వభౌమ ధరణీశ్వరులని చెప్పఁబడుటచే నుత్తరమునందలి మాళవాధీశులై యుందురని శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారు సూచించి యున్నారు. (రాజరాజ పుట. 19) వారు కుంతల చాళుక్యులకుఁ గుల వైరులు. వారిలో భోజుఁడు క్రీ. శ. 1010 వ సం.రమున పట్టాభిషిక్తుఁడై క్రీ. శ. 1063 వఱకుఁ బాలించియుండెను. అతఁడు విమలాదిత్యునకును రాజరాజునకును గూడ సమ కాలికుఁడు. జయసింహ వల్లభునికిఁ బూర్వుఁడైన రెండవ తైలపదేవుఁడు భోజుని పెదతండ్రియైన వాక్పతి ముంజరాజు నోడించి చెఱఁబెట్టుటయేకాక యాతఁడందుండి తప్పించుకొని పోవుటకు యత్నించు చుండఁగాఁ జూచి పరాభ వించి చెట్టుకొమ్మ కురి తీయించి చంపెను ముంజరాజు తరువాత నతని

1. రాజరాజ నరేంద్రుఁడు -పుట 15.
2. విమలాదిత్య దేవాఖ్యస్తతస్తస్యానుజో దధాత్ మహీమండల సామ్రా జ్యం విజిత్య విజయీరిపూన్ 10 శ్లో. కోరుమిల్లి.
3. దుస్సాధనాధిక విరోధి గజేంద్ర సంఘ...17 వ శ్లోక.
4. యస్సార్వభౌమ ధరణీశ్వర నీతకల్ప......18 వ శ్లోక. రణస్థిపూఁడి

తమ్ముఁడు సింధురాజును, అతని పిమ్మటఁ దత్పుత్రుఁడైన భోజరాజును మాళవ సింహాసన మధిష్ఠించిరి. భోజుఁడు రాజ్యమునకు వచ్చినప్పటి నుండియుఁ గుంతల చాళుక్యులకుఁ బ్రతీకారము చేయఁదగిన యద నన్వేషించు చుండెను. ఆ సందర్భముననే యతఁడు విమలాదిత్యునితోడి మైత్రి నభిలషించి యతనికి మదపుటేనుఁగుల నుపాయనముగాఁ బంపియుండును. విమలాదిత్యుని కాలముననే శక, లాట, గూర్జర, సౌరాష్ట్రాదులు స్వాతంత్ర్యమునకై పెనఁగు లాడుచు మాళవాధీశుఁడైన భోజున కలజడి కలిగించి యుందురు. విమలా దిత్యుఁడప్పు డతనికిఁ దగిన సాహాయ్యమంపి వారి నడఁచివేయుట కధికముగాఁ దోడ్పడి యుండును. రణస్థిపూఁడి శాసనమందలి,

సౌరాష్ట్రాన్దారయంతీ నిశిత పరశుధారాయ మానా శకానాం
లాటానాం గుర్జరాణా మథ భవతి మనోహారిణీవల్లభా వా
ఘూ రాన్స్వస్థాన్విధత్తే సుకృతవ దఖిలాన్ స్వైర మన్యాన్విభీత్యా
కాష్టాంతం తత్త్వపః శ్రీరివ నయతి రణే శౌర్య సంపద్యదీయా

అను శ్లోక మీ విషయమునే సూచించు చున్నట్లు తోఁచుచున్నది.

రెండవ తైలపునకును ఆంధ్రదేశమున కుత్తరమున నుండిన చేది దేశ మును బాలించు కాల చుర్యులకును సన్నిహిత సంబంధ ముండెను. చేది దేశా ధీశుఁడైన లక్ష్మణ రాజదేవునికిఁ దైలపుఁడు దౌహిత్రుఁడు. కుంతలరాజ్య స్థాపనమునం దతనికిఁ దాత మిక్కిలి తోడ్పడి యుండును. లక్ష్మణరాజదేవుని తరువాత రెండవ యువరాజ దేవుఁడు కాలచుర్య సింహాసన మధిష్ఠించెను. కర్ణాటక చాళుక్యులకు దగ్గఱి బంధువులై యుండుటవలనఁ గాలచుర్యులు వారి కులవైరులైన మాళవాధీశులకు శత్రువులైరి. వాక్పతి ముంజరాజు రెండవ యువరాజ దేవుని యుద్ధమునందుఁ బలుసార్లో డించెను. ఈ కారణముచే వాక్పతి ముంజరాజునకును అతని యనంతరము మాలవరాజ్యము నేలిన సింధు రాజ భోజ నృపతులకును గాలచుర్యులతో విరోధమును వేంగి చాళుక్యులతో మైత్రియు నేర్పడి వృద్ధినొందెను. పరమార వేంగి చాళుక్యులును, గర్ణాట చేదీశ్వరులును యుద్ధసమయములం దొండొరులకు సాహాయ్య మొనరించుకొను చుండిరనుట కనేక దృష్టాంతము లున్నవి. 1

---

1 రాజరాజ నరేంద్రుఁడు - శ్రీ శా. వేంకట కృష్ణారావుగారు.

రణస్థిపూఁడి శాసనమునాఁటి (1019) కి విమలాదిత్యుఁ డింకను పరమ మాహేశ్వరుఁడుగనే యుండెను. తరువాత నాతఁడు శ్రావకుఁడై వైరాగ్యమున రాజ్యమునుగూడ విసర్జింప నిశ్చయించెను. రాజరాజునకు యుక్త వయస్సు వచ్చిన తక్షణమే యాతఁడు రాజ్యభార మతని భుజస్కంధములపై మోపి తాను సింహాసనమును త్యజించెను. నాఁటి నుండియు వేంగీ సింహాసనమునకు త్యాగ సింహాసన మను పేరు కలిగెను.[1] విమలాదిత్యుఁడు రాజ్య పరిత్యాగము చేసిన వెంటనే రాజరాజు పట్టాభిషిక్తుఁడగుట కవకాశ మేర్పడకుండెను. సుమారు మూఁడేండ్ల కాలము వేంగీ సామ్రాజ్య లక్ష్మికై దాయాదులు పలువు రొండొరు లతోఁ బోరాడు చుండిన ట్లూహింపవచ్చును. రాజరాజు మహాపరాక్రమము ప్రదర్శించి దాయాదుల నెల్లర నోడించిన పిమ్మటఁ గాని పట్టాభిషేకము చేసి కొనుట కవకాశము లేకపోయెను. విజయ వైభవ శోభితుఁడైన రాజరాజు నప్పుడు వేంగీ రాజ్యలక్ష్మి స్వయముగా వరించి తన గుణగ్రహణ పారీణతను వెల్లడించెను. "గుణ లుబ్ధయేవ మాలాధరయా దత్తాపతిం వరయా" అను కలిదిండి శాసనమునందలి వాక్య మీ విషయమును సూచించు చున్నది. బేతన భట్టు కోరుమిల్లి శాసనమున "రాజద్రాజన్య సేవ్యామభృత భుజబలా ద్రాష్ట్యలక్ష్మీం పృథివ్యాః" అని రాజరాజు భుజబలముచే రాజ్యలక్ష్మిని సంపాదించెనని చెప్పి యున్నాఁడు.

విమలాదిత్యు ననంతరము రాజరాజు నెదిరించిన దాయాదు లెవ్వరను విషయమున భిన్నాభిప్రాయము లున్నవి. అప్పుడు రాజరాజు నవతి తమ్ముఁడైన విజయాదిత్యుఁడు కళ్యాణి చాళుక్యరాజైన రెండవ జయసింహునియు, ఒడ్డ కళింగ రాజులయు సాహాయ్యమున సింహాసన మాక్రమించి యుండు ననియు, నందుచే రాజరాజు చేయునదిలేక తన మేనమామయు చోళచక్రవర్తియు నైన రాజేంద్రచోళు నాశ్రయింప నాతఁడు తగిన సైన్యము నంపి శత్రువులనోడించి రాజరాజును వేంగీ సామ్రాజ్య పీఠమునఁ బ్రతిష్ఠించి యుండుననియు శ్రీ నేల టూరి వేంకట రమణయ్య గా రభిప్రాయ పడుచున్నారు. అనంతపుర మండ లము నందలి కొత్త శివరము, మడకశిర అను తాలూకాలలోని చోళశాసనముల వలన రాజేంద్ర చోళుఁడు తన పదవ విజయరాజ్య సంవత్సరమున (1012–43) విక్రమ చోళచోళియ వరాయన్ నాయకత్వమున నొక పెద్ద సేనను వేంగీ

1. "త్యాగసింహాసనాసీనః"- కలిదిండి తామ్ర శాసనము 26 వ. కోరుమిల్లి తామ్రశాసనము.

రాజ్యమునకుఁ బంపె ననియు నా సేనానాయకుఁడు వేంగిరాజును బలాయిత్తు నొనరించి, జయసింగుని కుటుంబమును నాశనముచేసి, ఒడ్డ తెలింగ కళింగు లను యుద్ధమున నోడించె ననియుఁ దెలియ చుండుట వారి యూహల కాధారము. చోళియ వరాయన్ విజయము పొందిన యనంతరమే (1022) రాజరాజు పట్టాభిషిక్తుఁడగుటను బట్టి యా పారిపోయిన వేంగి రాజాతఁడు కాఁడనియు జయ సింహాదుల తోడ్పాటుచే వేంగిరాజ్యము నాక్రమించిన విజయాదిత్యుఁడై యుండు ననియు నూహించుట కవకాశము లున్నవి.

శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారు విమలాదిత్యుని మరణ సమయ మునకు విజయాదిత్యుఁడు రాజరాజు కంటెను వయసునఁ జిన్నవాఁడై యుండె ననియు, నాతని హృదయ క్షేత్రమున శైశవమునందే రాజ్యకాంక్ష మొలకెత్తి నట్లు చెప్పుటకు శాసనాధారము లేమియుఁ గనవచ్చుట లేదనియు, రాజరాజు శీలమును, మనస్తత్వమును బట్టి చూడ నాతఁడు సవతి తమ్ముని యువరాజపద వికిఁ బట్టముకట్టి యుండునని యూహింప వచ్చుననియు, నందుచే రాజరాజున కా సమయమున విరోధులై యుండినవారు విజయాదిత్యుని కంటె భిన్నులై యుందురనియుఁ దెల్పియున్నారు. (రాజరాజు పుట. 100) ఈ విరోధు లెవ్వరు? రెండవ చాళుక్య భీముఁడు వేంగీ సింహాసనము నధిష్ఠించినప్పుడు యుద్ధ మల్లుఁడు, రాజమార్తాండుఁడు, కంఠిక విజయాదిత్యుఁడు మున్నగు దాయాదుల నందఱ నడఁచి రాజ్యమునుండి వెడలఁగొట్టెను. వారును వారి సంతతివారు నప్పటి నుండియు వేంగీరాజ్యపీఠమును నూతన రాజధిష్ఠించి నప్పు డెల్లఁ గొంత యలజడి కలిగించుచునే యుండిరి. బాదపతాళరాజులు యుద్ధ మల్లుని సంతతివారు. నిరవద్యపురమును (నిడుదవోలును) రాజధాని చేసికొని పాలించిన చాళుక్యులు రాజమార్తాండుని సంతతివారై యుండవచ్చును. వారును సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజు లను నభిషేక నామమును ధరించిరి. కంఠిక విజయాదిత్యుని కోవకుఁ జెందినవారు పిఠాపురమును రాజధానిగాఁ జేసి కొని యా ప్రాంతమును బాలించి యుండిరి. పైని పేర్కొనఁబడిన చాళుక్య సంతతి వారే కాక సర్వసిద్ధి చాళుక్యులు కూడ వేంగీ సామ్రాజ్యమునకై రాజ రాజుతోఁ బోరాడి పరాజితులై యుందురు. వారికిఁదోడు కళింగరాజ్యమును బాలించు చుండిన మధుకా మార్ణవుఁడుకూడ రాజరాజునకు విరోధియై యాతని పట్టాభిషేకమున కాటంకము గలిగించి యుండెను.

రాజేంద్ర చోళదేవుఁడు సేనలను బంపి, రాజరాజు శత్రువుల నోడించి, యతని వేంగిసింహాసనము నధిష్ఠింపఁజేసె నను వృత్తాంతమునుగూడ శ్రీ వేంకట కృష్ణారావుగారంగీకరించి యుండలేదు. అతఁడు కొంత సేనాసాహాయ్య మొన రించినమాట నిజమే యైనను రాజరాజే సాటిలేని శౌర్య పరాక్రమములతో సమ రాంగణమున శత్రువుల సంహరించి స్వశక్తిచే సింహాసనము సంపాదించె ననియు ఖడ్గైక సహాయుఁడై శత్రువుల జయించి యాతఁడు పరగండ భైర వుఁడను బిరుదమును వహించి యుండె ననియు వారు చెప్పుచున్నారు. (పుట 104). తనకొఱకు గంగాజలములను గొనివచ్చు దండనాథుని కూలాతోత్కల వంగ కళింగాధిపతులు ప్రతిఘటించిరని విని రాజేంద్రచోళుఁ డాతనికి సాహాయ్య మొనరించుటకై పెద్ద సేనతో గోదావరి వఱకరిగి యమ్మంగదేవికి వివాహము చేయు నుద్దేశ్యముతోఁ దా నచ్చట నాగి, దండనాథులను మాత్రము తూర్పునకుఁ బంపె ననియు, వారు శత్రువులను జయించి భాగీరథీ జలములను గొనిరాఁగా వానిని గోదావరీ పావనోదకముతోఁ గలిపి, తనరాజధానికిఁ గొనిపోయి, వాని నొక పవిత్ర కుండమున నింపి, దానికి గంగయి కుండమను పేరిడి యుండె ననియు వారి యభిప్రాయము. క్రొత్త శివరము, మడకసిర తాలూకాలలోని శాసనముల వలన చోళయవరాయన్ ధాటి కాగలేక పలాయితుఁ డయ్యెనని తెలియుచున్న వేంగిరాజు విషయమును వారు తడవి యుండలేదు. అతఁడు రాజరాజు సవతి తమ్ముఁడైన విజయాదిత్యుఁడే యై యుండుననుట సమంజస ముగా గోచరించు చున్నది.

చోళులకును గర్ణాట చాళుక్యులకును జిరకాలము నుండి పోరాటము సాగుచుండెను. విమలాదిత్యుని మరణానంతరము వేంగిరాజ్యము శత్రుహస్త గతమై పోవుట చోళ చక్రవర్తియైన రాజేంద్రచోళుని కిష్టము లేకుండెను. అప్పటి రాజకీయ పరిస్థితులలో వేంగిరాజ్యమున కుండిన ప్రాధాన్యము నాతఁడు బాగుగా గ్రహించెను. కర్ణాట చాళుక్య చక్రవర్తియైన రెండవ జయసింహుఁడు కూడ నట్లే వేంగిరాజ్యము తమకుఁ గులక్రమాగత శత్రువులైన చోళుల చేతు లలోఁ బడకుండ నుండవలె నని యవిచ్ఛిన్నముగా యత్నించుచు విమలాదిత్యుని యనంతరము రాజరాజు సవతి తమ్ముఁడైన విజయాదిత్యుని పక్ష మవలంబించి యాతని సింహాసనాసీనునిఁ గావించి యుండును. రాజేంద్రచోళుఁడు శత్రువుల సంహరించుట, భాగినేయునికి సాయమొనరించుట, యను రెండు కార్యముల

నాకే యత్నమున సిద్ధించు నని తలంచి జయసింహుని సేనలను విజయాదిత్యుని సేనలను గలియుట కవకాశము లేకుండ వానివి వేఱువేఱుగా నెదిరించుటకై రెండు పెద్ద సేనలను బంపెను. అందు మొదటిది రట్టపాడి కరిగి, మూసంగి యుద్ధమున రెండవ జయసింహునిఁ బరాజితునిఁ గావించెను. ఈ పరాజయ ముతో జయసింహుని బలము తాత్కాలికముగా క్షీణించెను. అతఁడు వేంగి దేశమున కధికమైన సాహాయ్య మొనరించుట కవకాశము లేకపోయెను. అందుచే చోళయవరాయన్ నాయకత్వమున వేంగిపై వెడలిన రెండవ చోళసేన ధాటి కాగలేక విజయాదిత్యుఁడు పాఱిపోయి కళింగరాజు కొలువునఁ దల దాచు కొనెను.

కళింగము వేంగిసామ్రాజ్యము నందలి యొక సామంతరాజ్యము విజ యాదిత్యుఁడు కళింగరాజు కొలువున కేఁగి యూరకుండఁ డనియు, నా రాజు సాయముతో మరల వేంగిరాజ్య సమాక్రమణమునకై యత్నించు ననియు చోళ యవరాయన్ గుర్తించి తన సేనతోఁ గళింగముపై దాడి వెడలెను. అతఁ డను కొనినట్లే విజయాదిత్యుఁడు ఒడ్డ కళింగరాజు లొసంగిన సాహాయ్యముతో శత్రు వులను వెనుకకుఁ దరిమివేయ యత్నించుచుండెను. ఈ సందర్భమునందే చోళ యవరాయన్ ఒడ్డ కళింగ తెలింగ సేనల నోడించి యుండును. (కొత్తశివరము తామ్ర శాసనము.) వీర రాజేంద్రుని కన్యాకుమారీ చర్ల తామ్ర శాసనములను బట్టి (E. I. XVIII పుట 53. పుట 261.) రాజేంద్రచోళుని సేనానాయకులు కులూతోత్కల కళింగ వంగరాజులను జయించినట్లు తెలియుచున్నది. ఆ సేనా నాయకు లచ్చటినుండి గంగాతీరమున కరిగినట్లు కూడఁ జెప్పఁబడి యుండుటచే నీ పై విజయము రాజేంద్రచోళుని పదవ విజయరాజ్య సంవత్సరమున (క్రి. శ. 1021-22) జరిగె నని నిశ్చయింపవచ్చును. ఏల యనఁ జోళ సేనలు గంగాతీరమునకు దాడివెడలిన వృత్తాంతము క్రి. శ. 1022 లోని రాజేంద్ర చోళుని శాసనములలో నుదాహరింపఁ బడియున్నది. ఈ విధముగాఁ జోళ చమూపతులు గంగాతీరమునకుఁ బోవుటకు ముందు కులూతోత్కల కళింగ రాజులను జయించిన సమయమున చోళయవరాయన్ కళింగముపై దండెత్తిన సమయమున గొంచె మించుమించుగా నేకకాలముననే సంఘటిల్లె నని చెప్పుటకు వీలగుచున్నది.

చోళయవరాయన్ ఇతర చోళ సేనానులతో గంగాతీరమున కరుగఁగనే రెండవ జయసింహుని ప్రేరణమున నొడ్డరాజు తిరుగఁబాటు కావించెను.

ఈ వార్త విని గంగాతీరమున కరిగిన చోళసేనలకు వెనుకను ముందరను గూడ శత్రువుల యొత్తిడి కలుగు నేమో యను భీతిచే రాజేంద్రచోళుఁడు పెద్ద సేనతో వేంగీదేశమున కరుదెంచి గోదావరీ జలముల విహరించుచుఁ బరిస్థితులను బరిశీలించు చుండెను. ఇంతలో నుత్తరమున కరిగిన చోళ సేనలు గంగోదకములను గొని తిరిగి వచ్చుచు నడుమ మహీపాలు నోడించి గోదావరీ తీరమున నుండిన తమ చక్రవర్తిని గలిసికొనెను. అంత రాజేంద్రచోళుఁ డొడ్డరాజుపై దండెత్తి తమ్మునితోఁ గూడ నాతని సంహరించి యతని గజసేనలను వశము చేసికొనెను. ఈ విధముగా క్రీ. శ. 1022 నాఁటికి వేంగీరాజ్యమున శాంతి పరిస్థితులు నెలకొనెను. అంత రాజేంద్రచోళుఁడు తన కూఁతురైన అమ్మంగదేవిని రాజరాజున కిచ్చి వివాహ మొనరించి క్రీ. శ. 1022 ఆగస్టు 16 వ తేదీ నాతని పట్టాభిషేకము వతివైభవముతో జరిగించెను.

పట్టాభిషిక్తుఁడైన యనంతర మెనిమిదేండ్లు రాజరాజు వేంగీసామ్రాజ్యమును నిష్కంటకముగాఁ బరిపాలించెను. నిజ మహీమండల ప్రజలను బ్రీతితోఁ బెంచుచుఁ, బర మండలము లందలి ధరణీశ్వరుల నదిమి కప్పములు గ్రహించుచుఁ, దన యాజ్ఞ నలుదిక్కుల వెలయించుచు, విప్రకులమును బోషించుచు వారి కనేకాగ్రహారము లొసంగుచు, దేవభోగములను మహావిభూతితోఁ దనరఁ జేయుచు నాతఁ డాదిరాజ విభుఁడును మనుమార్గగామియునై సర్వజనానురంజనముగా రాజ్యము పరిపాలించెను[1]. కాని యీ ప్రశాంతి చిరకాలము సాగి యుండలేదు. విజయాదిత్యుఁడు రెండవ జయసింహుని సాహాయ్యమున రాజరాజును సింహాసనభ్రష్టునిఁ గావించి క్రీ. శ. 1031 జూన్ నెలలోఁ దాను వేంగీరాజ్యమునఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. రాజరాజు చేయునదిలేక చోళరాజు సాహాయ్య మర్థించి యుండును. రాజేంద్రచోళుఁడు వెంటనే రాజరాజ బ్రహ్మమహారాజను బ్రాహ్మణ సేనాపతి నాయకత్వమున ఉత్తమ చోడచోడకోన్, ఉత్తమ చోడమిలాడుడైయాన్ అను మఱి యిరువురు సేనానులతోఁ గూడ నొక పెద్ద సేన నల్లుని సాహాయ్యార్థమై పంపెను. ఆ సేన కర్ణాటసైన్యమును రాజమహేంద్రవరమునకుఁ జేరువనున్న కలిదిండి యనుచోటఁ దాఁకెను.

1. పృథ్వీ మిమాం యత్ర పృథు ప్రభావే రక్షత్యవర్గం షడరివారి వర్గః
దూరీకృతావ గ్రహ చోర రోగః ప్రజా లభంతే సఫలం త్రివర్గమ్.
—కోరుమిల్లి తామ్ర శాసనము.

ఆ యుద్ధమున విరుపక్షముల నున్న సేనాపులను సంహరింపఁబడిరి. ఏ పక్షము నకుఁ గాని విజయ మబ్బెనని చెప్పుటకు వీలులేదు. మొత్తముమీఁదఁ జోళ సేనలు పశ్చిమ చాళుక్యులను వేంగిరాజ్యమునుండి తఱిమివేయుటకాని రాజ రాజును సింహాసనముపైఁ బ్రతిష్ఠించుట కాని చేయఁజాలక పోయినట్లే గోచ రించుచున్నది. కలిదిండి యుద్ధానంతర మేమి జరిగెనో చెప్పఁజాలము కాని రాజరాజు మఱల వేంగీ సింహాసనము నాక్రమించినట్లు తెలియుచున్నది. ఏల యన నాతఁడు కలిదిండి రణరంగమునఁ బ్రాణములు గోల్పోయిన మువ్వురు చోళ సేనానులకును స్మారకములుగా మూఁడు దేవాలయములను గట్టించి యుండెను. ఆతఁడు సింహాసనమునఁ బునః ప్రతిష్ఠితుఁడైననే కాని యీ కార్య మొనరించుట కవకాశముండదు. ఆతఁ డెప్పుడెట్లు సింహాసనమును మరల సంపాదింపఁ జాలెనో తెలిసికొనుట కాధారములు లభించుట లేదు. బహుశః అది క్రీ. శ. 1035 లో జరిగి యుండు ననియు, రాజేంద్ర చోళుఁడు తన కుమారుఁడైన రాజాధిరాజు నాయకత్వమున మఱియొక పెద్ద సేననంపి యుండు ననియు శ్రీ నేలటూరి వేంకటరమణయ్య గారు సూచించు చున్నారు[1].

కలిదిండి తామ్ర శాసనమున బేతవభట్టు కర్ణాట చోళ సేనానాయకులకు జరిగిన సమరమును విశదముగా వర్ణించి యున్నాఁడు. ఆ వర్ణనమును జూడ నాతఁడా యుద్ధమును బ్రత్యక్షముగాఁ జూచి యుండెనేమో యను ననుమాన ముదయింపక మానదు. రాజరాజు యుద్ధమున వీరస్వర్గ మలంకరించిన చోళ సేనానుల స్మృత్యర్థమై శివాలయములను బ్రతిష్ఠించుటయే కాక "బలి నైవేద్యోప హారములకును, నృత్య సంగీత మంగళవాద్యములకును, ఖండస్ఫుటితనవ కర్మల కొఱకును[2], వేదాధ్యయన మొనరించు నేఁబది మంది బ్రహ్మచారు లకును శాస్త్ర శ్రోతలకును, అధ్యాపకులకును సత్రమున భోజన మొసంగుట కును, దేవాలయమున నేఁబది యిద్దరు వేశ్యలుండుటకును, గ్రామమున నూర్గు రేసి విప్ర వణి క్ఛూద్రులు నివసించుటకును వసతులు కల్పించి, కలిదిండి, కడ పట్లు, అవకూర్థు, అను గ్రామములను మూఁడింటిని దానము చేసినట్లు పై శాస నము వలనఁ దెలియుచున్నది.

---

1. The Eastern Chalukyas of Vengi Page 229.
2. మంగలోత్తుంగ సంగీత ఖణ్డస్ఫుటిత నవకర్మ బల్యుపహారాద్యర్థం
—కలిదిండి తామ్ర శాసనము

క్రీ. శ. 1035 లో వేంగీ సామ్రాజ్య సింహపీఠమునఁ బునః ప్రతిష్ఠితుఁడైన విమ్మటఁ గొంత కాలము వఱకును రాజరాజు సుఖముగా రాజ్యపాలనము కావించినట్లు తోఁచుచున్నది. ఇంతలో మఱలఁ బరిస్థితులు మాఱఁ దొడంగెను. క్రీ. శ. 1042 లోఁ బశ్చిమ చాళుక్య సార్వభౌముఁడైన రెండవ జయసింహుఁడును దరువాత రెండు సంవత్సరములకుఁ జోళచక్రవర్తి రాజేంద్రచోళుఁడును మరణించిరి. త్రైలోక్యమల్ల, ఆహవమల్ల సోమేశ్వరుఁడును, రాజాధిరాజ చోళుఁడును గ్రమముగాఁ గర్ణాట చోళ సింహాసనముల నధిష్ఠించిరి. వారిపట్టాభిషేకముతో "సుమారు పదియేండ్లుగాఁ జల్లారియున్న కరాట చోళ భూపతుల నడిమి వైరానలము మఱల మహోజ్జ్వలముగా ప్రజ్వరిల్లెను". అప్పుడు జరిగిన యుద్ధములోఁ బశ్చిమ చాళుక్యులు జయించి వేంగిని దమ యధీనములో నుంచుకొనఁ జాలిరి. ఆ కాలపు చోళశాసనములలో రాజేంద్ర చోళుని యనంతరము వేంగీ రాజ్యమును గళింగమునందలి కొంతభాగమును జోళులు గోల్పోయిరనియు, నవి శత్రువులైన పశ్చిమ చాళుక్యుల చేతులలోఁ జిక్కె నవియు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. (E I XXV.P. 262) పశ్చిమ చాళుక్య శాసనములు కూడ నీ విషయమును బల పఱుచు చున్నవి. క్రీ. శ. 1047 సంవత్సరమునకుఁ జెందిన హైదరాబాదు స్టేటు మ్యూజియము నందలి యొక "రికార్డు" సోమేశ్వరుని వీరావదానములను వర్ణించుచు నాతఁడు వేంగీకళింగ రాజుల నుగ్గునుగ్గు కావించెనని తెలుపుచున్నది. క్రీ. శ. 1044 వ సంవత్సరమునకుఁ జెందిన మఱియొక రికార్డులో సోమేశ్వరుని సామంతుఁడైన శోభనరసు వేంగీపురాధీశ్వర బిరుదము వహించినట్లు తెల్పఁబడి యున్నది1. దీనిని బట్టి సోమేశ్వరుఁడు వేంగి నూరక జయించుటయేకాక యచ్చటఁ దనప్రతినిధిని బాలకుఁడుగా నియమించెనని కూడ స్పష్టమగుచున్నది. ఈ విధముగా వేంగిరాజ్యమునందలి చాల భాగము పశ్చిమ చాళుక్యులచేతఁ జిక్కినను రాజరాజింకను గొంత భాగమును బాలించుచునే యున్నట్లు ద్రాక్షారామ భీమేశ్వరాలయము నందలి యొక శాసనమువలనఁ (1047) దెలియుచున్నది. (S. I. I.I.V 1008).

వేంగీ కళింగములు తమ చేతులనుండి జాఱి శత్రువుల వశమైనప్పటి నుండియు రాజాధిరాజు వానిని మఱల సంపాదించుటకై యత్నించుచు క్రీ. శ.

---

1. The Eastern chalukyas of vengi-page. 231.
ఇది వట్టి బిభీషికయే యని శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారు భావించుచున్నారు.

1054లో మరణించువరకు వలుకును పశ్చిమ చాళుక్యులపై నెడతెఱపి లేక దండయాత్రలు చేయుచునే యుండెను. క్రీ. శ. 1044లోఁ బశ్చిమ చాళుక్యులు వేంగినాక్రమించుకొని చోళసేన లెప్పుడు దండెత్తి వచ్చునో యను భయమునఁ బెద్ద సైన్యము నచ్చట సర్వసిద్ధముచేసి యుంచిరి. రాజాధిరా జపారమైన సేనా బలముతో నేగి పశ్చిమచాళుక్య సేనలను దన్నాడు (ధరణికోట) దగ్గర మార్కొనెను. ఈ యుద్ధమునఁ బశ్చిమ చాళుక్యులోడిపోయిరి. గండప్పయ్య గంగాధరుఁడు మున్నగు పశ్చిమచాళుక్య సేనానులు యుద్ధమున మడిసిరి. విక్రమాదిత్యుఁడు, విజయాదిత్యుఁడు, సంగమయ్య మున్నగు నితరసేనానులు భీతులై యుద్ధభూమినుండి పాఱిపోయిరి. చోళసైన్యము చాళుక్య స్కంధావార మును యథేచ్ఛముగాఁ గొల్లగొట్టి, పాఱిపోవుచున్న పశ్చిమచాళుక్య సేనలను వెంట నంటెను. ఈ సందర్భముననే యవి ప్రస్తుత హైదరాబాదు రాష్ట్రము నందలి కొల్లిపాకపైఁబడి దానిని దగులఁ బెట్టినట్లు తెలియుచున్నది. (S. I. I. IV. 827)[1]. చోళ సైన్యము లిట్లు విజయవైభవ సమేతములయ్యు శత్రువశమై యున్న వేంగీ రాజ్యము నాక్రమింపకుండుటకుఁ గారణము తెలియదు. మఱియు క్రీ. శ. 1046వ సంవత్సరము నందలి యొక శాసనము వలన (E. C. VII SK 323) సోమేశ్వరుని యధికారమున బనవాసి పాలించుచుండిన సింగణదేవరునను పాలకుఁడు చోళసేనల నరికట్టి కొల్లిపాకను గాపాడినట్లు తెలియుచున్నది. దీనినిబట్టి పశ్చిమచాళుక్యులు కొల్లిపాక దగ్గఱ దృఢముగా నిల్చి చోళసేనల వెనుకకు దఱిమినట్లూహింప నగుచున్నది. ఈ కాలమున రాజరాజేమి చేయుచుండెనో నిశ్చితముగాఁ దెలిసికొనుట కాధారములు లేవు.

పశ్చిమ చాళుక్యులు వేంగి నాక్రమించి విజృంభించుట చూచి రాజరాజు మఱల క్రీ. శ. 1050 ప్రాంతమునఁ జోళచక్రవర్తి సాయము నర్థించినట్లు కనఁబడుచున్నది. క్రీ. శ. 1050 నాటి తిరువైయారు శాసనమున పిశ్శైయార్ విష్ణువర్ధన దేవుఁడచ్చటి శివాలయమునకు 300 రాజరాజ మాడలు దానముచేసి నట్లు చెప్పఁబడియున్నది. (S. I. I. V. 520). ఈ విష్ణువర్ధనదేవుఁడు రాజరాజే. బహుశః అతఁడు చోళ చక్రవర్తి సాయము నర్థించుటకే యా సమయమున నచ్చటి కరిగి యుండునని తోఁచుచున్నది. రాజాధిరాజు

1. ఈ కొల్లిపాక నల్గొండ జిల్లాలోనిది కాదనియు నది మైసూరు రాజ్యము నకుఁ బడమట మలెనాడున హొన్నూరు జిల్లాలో నున్నదనియు, శ్రీ శా. వేం. కృష్ణారావుగారు చెప్పుచున్నారు (రాజరాజ పుట 120).

మరుసటి సంవత్సరమే వేంగిపైకి దండెత్తుటకూడ నీ విషయమును బలపఱచు చున్నది. క్రీ. శ. 1051 వ సంవత్సరమున నాతఁడు ధరణికోటలో నొక తమిళ పురాణ కావ్యమును (తమిళ పరణి) అంకితము పొందినట్లు తెలియుచున్నది. (S. I I. VII 1048). చోళసైన్యములు ధరణికోటనుండి రట్టపాడి సార్ధసప్త లక్షదేశము వైపు సాగి శిఱుతురై, పెరున్దురై, యను నదులను దాటి గుల్బర్గాజిల్లా యందలి ఏటగిరి యను చోట విడిసెను. అని మొదట ధరణికోట కరుదెంచుట చూడ వేంగిపై దాడి వెడలుటయే చోళ చక్రవర్తి యభిప్రాయమైనట్లు దెలియుచున్నది. అప్పుటఁ బశ్చిమ చాళుక్య సేనల ధాటి కాగఁజాలక కాఁబోలు నాతఁడు వారిని దలవని తలంపుగా మఱొక చోట నెందైన మార్కొను నూహతో రట్టపాడి వంకకుఁ బయనించి యుండును. ఈ సందర్భమునఁగూడఁ జోళసేనలు రాజరాజున కెట్టి సాహాయ్యమును గావింప లేక పోయె ననియే చెప్పవచ్చును.

రాజరాజున కింకఁ జోళులు వేంగిని బశ్చిమ చాళుక్యుల బారినుండి తప్పింప గలరను నాశ క్రమముగా సన్నగిల్లఁ జొచ్చెను. చోళుల నాశ్రయించుట వలనఁ గాని, పశ్చిమ చాళుక్యుల నెదిరించుటవలన గాని లాభము లేకపోవుటయే కాక యున్న స్వల్పరాజ్యముకూడఁ బోవునేమో యను భీతి యాతని కుదయించెను. పరిస్థితులు తన కనుకూలములగు వఱకుఁ బశ్చిమ చాళుక్యులకు లొంగియుండుట కంటె నుపాయాంతరము లేమిచే నాతఁ డాహవమల్ల సోమేశ్వరునితో సంధి చేసికొనెను. ఈ సంధిని బట్టి యాతఁడు పశ్చిమ చాళుక్యుల సార్వభౌమత్వము నంగీకరించుచు వేంగిరాజ్యమును బాలించుట కవకాశ మేర్పడెను. రాజరాజునకు ఆహవమల్లునకు ఈ కాలమున సుహృద్భావము వెలయుచుండె ననుటకు రెండు నిదర్శనములు కానిపించు చున్నవి. ఆహవమల్లుని ప్రధానులలో నొకఁడును నన్నయకు సహాధ్యాయుఁడును మహాపండితుఁడును అష్టభాషా విశారదుఁడును గవిశేఖరుఁడునైన నారాయణభట్టు వేంగీ దేశమునకుఁ బ్రతినిధిగాఁ బంపఁబడెను. క్రీ. శ. 1055-56 నాటి ద్రాక్షారామ శాసనమున నాతని పేరు కానవచ్చు చున్నది. (S. I I IV 1010)[1]. ఈతఁడు నన్నయ కాంధ్ర మహాభారత రచనమునఁ దోడై నట్లవతారిక యందలి

---

1. శకవర్ష 997 గు నేంట భీమేశ్వర దేవరకుం జక్రవర్తి త్రైలోక్య మల్ల దేవ ప్రధాని నారాయణభట్ల కూంతురు కుపమపెట్టిన etc.

'పాయక పాకశాసనికి' ఇత్యాది పద్యము వలన స్పష్టపడు చున్నది. రాజరాజు నకును సోమేశ్వరునకును సంధి సంబంధము కుదుర్చునెడc గూడ నాతcడు కొంతవఱకు సాహాయ్య మొనరించి యుండును. నందమపూcడి శాసనమున నన్నయ యాతనికి "జగదుపకరణః" అను విశేషమును వాడి యుండెను. (24 వ శ్లోకము) ఈ విశేషణ మాతcడు కావించిన రాజకీయములైన యుపకారములను గూడ ధ్వనింపc జేయుచున్నది. అతcడు రాజకీయముగను సారస్వతముగను జేసిన యుపకారములను స్మరించియే కాcబోలు క్రీ. శ. 1051-52 లో రాజరాజాతనికి నందమపూcడి గ్రామమును దానము చేసి యుండెను. ఆదిపర్వ చతుర్థాశ్వాసము చివరcగల యాశ్వాసాంత పద్యములలో నన్నయ రాజరాజును సత్యాశ్రయకుల శేఖరుc డనియు సమస్త భువనాశ్రయుc డనియు సంబోధించి యుండెను. రాజరాజు మంద తామ్రశాసనమునc బ్రతిగ్రహీతయైన అంకయ సమస్త భువనాశ్రయ బ్రహ్మ మహారాజని పేర్కొనcబడి యున్నాcడు[1]. అంకయ బ్రహ్మ మహారాజుగా నియమింపcబడి నప్పుడా పదవికి సమస్త భువనాశ్రయ బిరుదముకూడc జేర్పcబడి యుండును. ఈ బిరుదము తూర్పు చాళుక్యుల శాసనములలోcగూడ నక్కడక్కడ లేకపో లేదు కాని పశ్చిమ చాళుక్యుల శాసనములందే హెచ్చుగా గోచరించు చుండును. ఇట్లే సత్యాశ్రయ కులతిలక బిరుదముకూడc బడమటి చాళుక్యుల శాసనములందే వంశవర్ణన సందర్భమునc గానcబడు చుండును. సత్యాశ్రయ కులతిలక యన్నను సత్యాశ్రయ కులశేఖర యన్నను అర్థ మొక్కటే. ఈ బిరుదమును వహించుటకుc బడమటి చాళుక్యరాజులవలె రాజరాజుకూడ మిక్కిలి యర్హుcడే యైనను అది తూర్పు చాళుక్యుల శాసనములం దిం కెక్కడను గోచరింపక పోవుటచేతను, దీర్ఘ విస్మృతములైన యీ పై రెండు బిరుదములను గలపి రాజరాజు తప్పc దూర్పు చాళుక్యరాజు లింకెవ్వరును ధరించియుండక పోవుట చేతను దద్బిరుద ధారణమునc బ్రత్యేక ప్రాముఖ్య మున్నట్లూహింప వచ్చును. శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు చెప్పినట్లు(Eastern Chalukyas Page 238) పశ్చిమ చాళుక్య చక్రవర్తి సారభౌమత్వము నంగీకరించి నందుకు సూచనగా రాజరాజు వానిని ధరించియుండ వచ్చును.

తన రాజ్య కాలాంతము వఱకును రాజరాజు పశ్చిమ చాళుక్యులకు లోcబడియే యుండెను. అతనికిc దగిన సాహాయ్యము పంపి పశ్చిమ చాళుక్యుల

1. భారతి XX పుట 192.

వారినుండి రక్షించు సామర్థ్యము చోళులకు లేకపోయెను. వారు సోమేశ్వరునితోఁ దఱచుగా యుద్ధము లాచరించు చుండినను వాని వలన నెట్టి లాభమును గలిగి యుండలేదు. అది కాక రెండవ కుప్పం యుద్ధమున వారు పశ్చిమ చాళుక్యులచేఁ బరాజితు లగుటయే కాక యంతకు ముందు తాము సంపాదించిన గంగవాడి రాష్ట్రమును గూడఁ గోల్పోయి యుండిరి. ఇట్టి పరిస్థితులలోఁ జోళులు రాజరాజున కే విధమైన తోడ్పాటును గావింపఁ జాలక పోవుటలో వింత లేదు. అందుచే రాజరా జుపాయాంతరము లేక పశ్చిమ చాళుక్యులకు సామంతుఁడై యుండి పోవలసి వచ్చెను.

రాజరాజు సుమారు నలువదియొక్క యేండ్లు పాలించి క్రి. శ. 1062 లో మరణించి యుండెను. అతని మరణాంతర మతని సవతి తమ్ముఁడు విజయాదిత్యుఁడు బలిమిమై సింహాసనమును గ్రహించి తన కుమారుఁడైన శక్తివర్మను బట్టాభిషిక్తునిఁ గావించెను.

'పరోక్షే రాజరాజస్య భ్రాతుర్ద్వైమాతు రస్య యః
ప్రత్యగ్రహీన్మహీ రాజ్యశ్రియం వీరశ్రియా యుతః'

అను శ్లోకము వలన రాజరాజు మరణించిన వెంటనే సింహాసనము విషయమై కొంత యలజడి జరిగినట్లు కన్పించుచున్నది. ఈ విధముగా రాజరాజు పరిపాలనమున మొదటఁ గొన్ని సంవత్సరములును జివరఁ గొన్ని సంవత్సరములును దప్ప మిగిలిన కాలమంతయు యుద్ధములతోనే నడచి పోయెను. అతని సవతి తమ్ముఁడైన విజయాదిత్యుని సింహాసనాక్రమణాభిలాషయుఁ బశ్చిమ చాళుక్యుల సామ్రాజ్య విస్తరణాశయు సారవంతమైన వేంగి రాజ్యమును యుద్ధరంగముగా మార్చివైచెను. రాజరాజు దురదృష్టవశమున రెండు మారులు రాజ్యమును గోల్పోవుటయుఁ జోళుల సాహాయ్యముచే మరల దానిని సంపాదించుటయు సంభవించెను. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో (పుట 160) కీ. శే. చిలుకూరి నారాయణరావుగారు క్రి. శ. 970 నుండి 1070 వఱకు దేశమున శాంతి నెలకొని యుండెనని వ్రాసిరి కాని పై పరిస్థితులను బట్టి చూడ నా వ్రాఁత సత్యదూరముగాఁ గానుపించుచున్నది. కావ్యగీతీ ప్రియుఁడైన రాజరాజునకుఁ దన పరిపాలనారంభ కాలము నందును అంత్య కాలము నందును మాత్రమే సాహిత్య గోష్ఠి వినోదముల ననుభవించుటకుఁ గొంత యవకాశ మేర్పడెను. నారాయణభట్టు కర్ణాటక దేశమును వీడి వేంగీ దేశమునకు వచ్చిన

పిమ్మటనే అనఁగా 1052 తరువాతనే నన్నయభట్టు భారతాంధ్రీకరణమునకుఁ బూని యుండును[1]. అంతకు ముం దాతఁడు సంస్కృత మహాభారతమును బఠించుచు, వివిధములైన ప్రతులను సేకరించుచుఁ బాఠ పరిష్కారములను గావించుకొనుచు నా మహా కావ్యమునకుఁ బూర్వ రంగమును సిద్ధము చేసికొనుటలో నిమగ్నుఁడై యుండును.

పైని పేర్కొనఁ బడిన పరిస్థితులను బట్టి వేంగీ చాళుక్యులకును మాలవాధీశులైన పరమారులకును జిరకాలము నుండి మైత్రి యుండినట్లు కానిపించుచున్నది. మాలవా ధీశులలో వాక్పతి ముంజరాజు తరువాత నాతని తమ్ముఁడైన సింధురాజును అతని తిరువాతఁ దత్పుత్రుఁడైన భోజరాజును సింహాసనము నధిష్ఠించి సమర్థతతోఁ బాలించి యుండిరి. వారు ముప్పురును బండిత పోషకులు, కావ్యాలాప వినోదములం దాసక్తి కలవారు. వారిలో భోజుఁడు పలువురు విద్వాంసులను గవులను బోషించుటయే కాక స్వయముగాఁ బండితుఁడును గవియునై చంపూ రామాయణము, సరస్వతీ కంఠాభరణము, శృంగార ప్రకాశిక మున్నగు నుత్తమగ్రంథములను రచించి యుండెను. అతని కాలమున సంస్కృత భాష మూఁడుపూవు లాఱుకాయలుగా వర్ధిల్లెను. అతఁడు క్రీ.శ. 1010 నుండి 1063 వఱకును మాలవ రాజ్యమును బాలించెను. విమలాదిత్యునకు రాజరాజునకు గూడఁ నాతఁడు సమకాలికుఁడు. సంస్కృత భాషాభిమానియు, ఆ భాష యందు మహాకవియునైన యా మహారాజు కొలువున రామాయణ భారతాది గ్రంథముల ప్రతులు వ్రాయింపఁబడి సురక్షితములై యుండుననుటలో వింత లేదు. వేంగీ చాళుక్యులకును భోజునకును మైత్రి యవిచ్ఛిన్నముగాఁ గొనసాగి యుండుటచే నన్నయ సంస్కృత భారతమునకు సంబంధించిన కొన్ని ప్రతులను, అందును ఉత్తర వర్గమునకుఁ జెందిన వానిని, మాలవ రాజుల యాస్థానము

1. నందమపూఁడి శాసనమున నన్నయ నారాయణభట్టు వైదుషీ కవితా పాటవములనే కాని యతని వంశమును, తరముల నుండి యాతని వంశము వారనుభవించుచున్న మంత్రిత్వమును బ్రశంసించి యుండక పోవుటకుఁ గారణము లున్నవనియు, కుప్పం యుద్ధానంతరము నారాయణభట్టు కర్ణాటక దేశమున నుండ నిచ్చ గొనక రాజమహేంద్రుని వెంట నంధ్ర దేశమునకు వచ్చియుండెననియు, నన్నయభట్టు ప్రేరణము కూడ దానికిఁ గారణమై యుండు ననియు శ్రీ భావరాజు వేంకట కృష్ణారావు గారు 'రాజరాజ నరేంద్రు'డను గ్రంథమున వ్రాసి యున్నారు. (పుట 129.)

నుంచి తెప్పించుకొని యుండునని యూహించుట కవకాశము కలుగుచున్నది.

రెండవ చాళుక్య భీముని కాలము నుండియుఁ జాళుక్యులకును జోళులకును సంబంధ బాంధవ్యములు సాగుచుండెను. సుందర చోళుని తల్లియైన కుందవాంబ చాళుక్య భీముని కూఁతురఁట। ఈ బాంధవ్యము విమలాదిత్యుని నాఁటి నుంచియు మిక్కిలి సన్నిహిత మయ్యెను. విమలాదిత్యుఁడు, రాజరాజు, కులోత్తుంగుఁడు - ఈ ముువ్వురును గూడఁ జోళరాజుల కూఁతులనే పెండ్లి యాడిరి. తూర్పు చాళుక్య రాజులకు పశ్చిమ చాళుక్యుల వలన నొత్తిడి కలిగి నప్పుడెల్ల స్వరాజ్య రక్షణ కౌతుకముచే నేమి బాంధవాభిమానముచే నేమి చోళులు వారికి సాహాయ్య మొనరించుచునే యుండిరి. అందుచే విమలాదిత్యుఁడును రాజరాజును జోళ దేశమునకు బలుసార్లు రాకపోకలు చేసియుండిరి. అందుచే వారు చోళ రాజులు కావించుచుండిన కవితా కళా పోషణము నరయుచుఁ దెలుగు దేశమునఁ గూడ వివిధ కళలను బోషింపఁ దొడంగిరి. రాజరాజ చోళుని కాలమున దక్షిణ దేశమునఁ గలిగిన యభివృద్ధి యితింతని చెప్ప నలవికాదు. అప్పు డా దేశ మన్ని రంగము లందు నఖండమైన యభ్యుదయమును గాంచెను. రాజరాజ చోళుఁడు కేవల మొక్క రాజకీయ విషయము లందే కాక కళా కవితావిషయము లందుఁ గూడ మిక్కిలి యభిమానము ప్రదర్శించెను. అతఁడు శైవ మతోద్ధారకులగు అప్పార్, జ్ఞాన సంబంధ, సుందరం అను వారి భక్తి పూరితములైన గేయములం దత్యం తాదరము ప్రదర్శించు చుండెను. అఱువది మువ్వుర భక్తుల ప్రబంధములపై నాతఁడు చూపిన గౌరవ మపారమై యుండెను. కళలయం దాతనికిఁ గల యభిమానము వర్ణనాతీతము. నానా దేశముల నుంచి యాతఁడు నాట్య కర్తెలను గాయకులను మార్దంగికులను రప్పించి తంజాపురమున వారికి నిత్య వసతులు కల్పించెనని వాఁడఁట। అతఁడు తన రాజ్యమునఁ బెక్కు చోట్ల నాట్యశాలల నేర్పఱిచెను. ఆ కాలమున రాజరాజేశ్వరి నాటక మను పేరు గల యొక నాటకము తఱచు ప్రదర్శింపఁ బడుచుండెనట। రాజరాజ చోళుఁడు పెక్కు విద్యాలయములను స్థాపించి యా యా శాస్త్రము లందు నిష్ణాతులైన వారిని దగు రీతిని బోషించుచుండెను. అతని కుమారుఁడైన రాజేంద్ర చోళుఁడు కూడఁ బండిత చోళుఁడను కీర్తి గాంచి తండ్రి గౌరవము ననేక విధములఁ గాపాడెను. తమిళమున క్రీ. శ. 7, 8, శతాబ్దులలోనే పెరిందేవనారను కవి భారతమును దేశీయములగు వెంబా పద్యములలో రచించియుండెను. ఈ విధముగా సాహిత్య సేవఁ

చేయుచుండిన చోళ రాజుల కొలువున భారతాది గ్రంథముల ప్రతులు భద్ర పఱుపఁబడి యుండుట సహజము. నన్నయ చోళుల కొలువు నుండి కూడ కొన్ని భారత ప్రతులను, ముఖ్యముగా దాక్షిణాత్య వర్గమునకుఁ జెందిన వానిని దెప్పించుకొని యుండును.

క్రీ. శ. 7, 8 శతాబ్దుల నాఁటికే కన్నడమున సాహిత్యాలంకార రీతులతోఁ గూడిన యుత్తమ కవిత్వ ముదయించినది. అందు క్రీ. శ. 9 వ శతాబ్ది యందే కవితా పద్ధతిని నిర్ణయించు కవిరాజ మార్గము రచింపఁ బడినది. క్రీ. శ. 10 వ శతాబ్ది యందుఁ బంప, నాగవర్మ మున్నగు మహాకవు లందుఁ బ్రౌఢములైన కావ్యములను రచించి యా భాష కెంతయో పెంపు చేకూర్చిరి. అందు పంప రచించిన విక్రమార్క విజయమును, ఆదిపురాణమును ఆ వాఙ్మయమున కలంకారములుగాఁ బరిగణింపఁ బడుచున్నవి. ఇట్టి మహాకవులను బోషించుటయే యా దేశమును బాలించిన చాళుక్యుల (వీరు వేములవాడ చాళుక్యులని తెలియు చున్నది.) ప్రదర్శించిన వాఙ్మయాభిరుచికిని రసజ్ఞతకును దార్కాణముగా నున్నది. పశ్చిమ చాళుక్య రాజైన ఆహవమల్ల సోమేశ్వరుని కొలువునఁ బ్రధానిగా నుండిన నారాయణభట్టు మహాపండితుడు. కవి శేఖరుఁడు. దురదృష్ట వశమున నాతఁడు రచించిన గ్రంథము లేవియు లభ్యము లగుట లేదు. మహాభారతము నాంధ్రీకరింప సమకట్టిన తన సహాధ్యాయునికి నారాయణభట్టు పశ్చిమ చాళుక్యుల కొలువున నుండిన సంస్కృత భారత ప్రతులను దప్పక సమకూర్చి యుండును. ఇందుత్తర దక్షిణ వర్గములకుఁ జెందిన ప్రతులే కాక దేవనాగరీ ప్రతులు కూడఁ గొన్ని యుంపి యుండవచ్చును. ఈ రీతిగా నా కాలమున వేంగీ చాళుక్యుల కితర రాజులతోఁ గల రాజకీయ సంబంధములు గూడఁ గొంత వఱకు నన్నయ మహాభారత నిర్మాణమునకుఁ బ్రోత్సాహమును గలిగించి యుండునని చెప్ప వచ్చును.

వేంగీ చాళుక్యులు హిందువుల అర్థ ధర్మశాస్త్రము లందు వర్ణింపఁ బడిన పద్ధతి ననుసరించియే రాజ్యపాలనము సాగించినట్లు కానఁబడు చున్నది. రాజ్యమునకు రాజే సర్వాధికారి. అతఁడు తీర్థు లనఁబడు మంత్రుల సాహాయ్యమున రాజ్య పాలనమును నిర్వహించు చుండెను. మంత్రి, పురోహిత, సేనాపతి, యువరాజ, దౌవారిక, ప్రధానాధ్యక్షాదులు పదునెనమండ్రు నప్పుడు తీర్థులని పిలువఁ బడుచుండిరి. (E I IV page 307). వారందఱు నొక సంఘముగా నేర్పడి రాజ నీతిగ్రంథముల ననుసరించి రాజునకు వివిధ విషయములలో సలహా

లోనంగు చుండిరి. వీర విజయాదిత్యుని పాములవాక తామ్ర శాసనమున (క్రీ. శ. 1031) రాజ రాజప్పటికిఁ బం(డెండేండ్లు రాజ్యమును బాలించెనని చెప్పబడి యున్నది¹. అతఁడు క్రీ. శ. 1022 లోఁ బట్టాభిషిక్తుఁ డౌటచే విమలాదిత్యుఁడు రాజ్యపరిత్యాగము చేసిన పిమ్మటఁ బట్టాభిషిక్తుఁడు కాకయు రెండేండ్లు రాజ్యమును బాలించెనని యూహింప వలసి యున్నది. ఆ కాలమున విమలాదిత్యునిచే నియమింపఁ బడిన రాజ ప్రతినిధి వర్గము రాజ్యపాలనమును నిర్వహించి యుండు ననియు, నందు విమలాదిత్యుఁడు, యువరాజు, అమాత్య శిఖామణి (వజ్జియ ప్రెగ్గడ) సభ్యులుగా నుండి యుందురనియు శ్రీ భావరాజు వేంకట కృష్ణారావు గారు సూచించి యున్నారు. (రాజరాజ. పుట 95). బహుశః అప్పుడున్న యీ రాజప్రతినిధి వర్గము తీర్థు లనఁబడు మంత్రుల సంఘమే యని భావింప వచ్చును.

రాజ్య మంతయుఁ బరిపాలనా సౌకర్యమునకై విషయములుగా విభజింపఁ బడియుండెను. ఈ విషయముల నిప్పటి మండలములు లేక జిల్లాలతో సరిపోల్ప వచ్చును. పండరంగుని అద్దంకి శాసనమునఁ బం(డెండు బోయ కొట్టముల ప్రసంగ మున్నది. ఈ కొట్టములు కూడ విషయముల వలెనే దేశ విభాగములై యుండును. " కొట్ట మనఁగా దేశ విభాగమని యఱవమున నర్థము.! కోట యను పదము నుండి కొట్టము వచ్చి యుండునని, కోటయే ఒక భూభాగ పరిపాలనకు కేంద్ర మగుటచేత ఆ కోట క్రింద నుండు భూభాగమున కంతకు నా పేరే వచ్చి యుండునని విద్వాంసుల యభిప్రాయము (తెలుఁగు కవుల చరిత్ర పుట 36.) ఈ విషయము లెట్లు పాలింపఁ బడెనో చెప్పుట కాధారములు లేవు. సర్వ లోకాశ్రయుని చెందలూరు శాసనమున (E. I. VIII P 236-41) రాష్ట్ర పరిపాలన నియుక్తులైన కొందఱుద్యోగులు పేర్కొనఁబడి యున్నారు. అందు గ్రామేయకులతో పాటు నైయోగికులును, నైయోగిక వల్లభులును సంబోధింపఁ బడి యున్నారు. దీనిని బట్టి గ్రామ విషయ పరిపాలనకై నైయోగికులు నియమింపఁ బడుచుండి రనియు, వారిపై యధికారులకు నైయోగిక వల్లభులను పేరుండె ననియుఁ దెలియుచున్నది. కొన్ని చోట్ల మన్నెయులను నుద్యోగుల పేరుకూడఁ గానవచ్చు చున్నది. వారి యుద్యోగ విధు లెట్టివో తెలియదు. ఆ విధులను నిర్వర్తించి నందుకు వారికి జీతములు కాక కొన్ని గ్రామము లొసంగఁ బడుచుండెను (Cp 3 of 1921-22). తూర్పు చాళుక్యుల కాలపు శాసనముల నుండి యప్పటి గ్రామ పరిపాలనా విధానమును గూర్చి వివరము లంతగాఁ దెలియ వచ్చుట లేదు. అందచ్చ టచ్చట కొన్ని బంధములును కరములు (taxes) ను పేర్కొనఁ బడి

1. తస్య ముమ్మడి భీమస్య సుతః కృతమతి ర్మహాన్
రాజరాజా హ్వయో రాజా ద్వాదశాబ్దాన్ధరా మపాత్.

యున్నవి. కాని వాని స్వరూప స్వభావములందు వివరింపఁబడి యుండలేదు. కళాకణ్డుగుము, పశువారము (విప్పర్ల శాసనము) మున్నగున వట్టి పన్నులే యైయుండును. రాజరాజు మండతామ్ర శాసనమున దత్తమైన యా గ్రామమునకు యాచనము మాడ తప్ప మిగి లిన పన్నులన్నియుఁ దొలఁగింపఁబడినట్లు చెప్పఁబడినది (సర్వకర పరిహృత స్యాస్య యాచనము మాడ ఒక్కొ-ణ్డ). ఈ యాచనము మాడ యనఁగా నేమియో తెలియుట లేదు. సాధారణముగా శాసనము లన్నియు గ్రామేయకు లను, రాష్ట్రకూట ప్రముఖులను ఉద్దేశించి చెప్పఁ బడుచుండును. అందుచే గ్రామ పరిపాలనమున వారికిఁ గొంత భాగముండినట్లు తోఁచుచున్నది. (ప్రతి గ్రామమునందును దత్పరిపాలనా విధానమును బర్యవేక్షించుటకై గ్రామణి యనఁబడు రాజ ప్రతినిధి యొకఁడుండెను. శక్తివర్మ కాలమున నత్తిలి నాణ్డు విషయమునకుఁ జెందిన పభుబఱ్ఱు గ్రామమునకు గ్రామణియైన వాఁ డా యూర నుండిన నలికేశ్వరి నామశివాలయమునకు స్థానాధిపతియైన బాలసోమపండితుఁ డను శివాచార్యుని ప్రేరణమున స్వామి ద్రోహ మొనరించె ననియు, శక్తివర్మ యంత నాతని నా యుద్యోగము నుండి తొలఁగించి దానిని దన యెడ భక్తుఁ డును గృతక్లేశియు నైన దాదిభీమునకుఁ గొంత భూమితోఁ గూడ దత్తము చేసె ననియుఁ బభుబఱ్ఱు శాసనము వలనఁ దెలియుచున్నది. (ఆం. సా. ప. పత్రిక. II పుట 399-411). తొలఁగింపఁ బడిన యా గ్రామణి చేసిన రాజ ద్రోహ మెట్టిదో తెలియదు కాని యప్పటి పరిస్థితులను బట్టి యాతఁడు శక్తి వర్మ దాయాదులతోఁ జేరి యాతని పదచ్యుతునిఁ గావించుటకు యత్నించి యుండునని యూహింప వచ్చును. బ్రాహ్మణులకు, దేవాలయములకు, మత సంస్థలకు దత్తములైన గ్రామములలోఁ గూడ రాజునకు బాధ్యులై యుండు గ్రామణులను వధికారు లుండినట్లు తోఁచుచున్నది. వా రా గ్రామస్థుల నుండి పన్నులు వసూలు చేసి యా ప్రతిగ్రహీతల కిచ్చుచు, గ్రామము నందలి వ్యావసాయిక కార్యములను బరిశీలించుచు, సాధారణ పరిపాలనము నరిచూచు చుండిరి. ఇట్టి పద్ధతియే రాజ్యము నందలి యితర గ్రామము లందుఁ గూడ నుండుటచే రా జెప్పుడైనఁ గొన్ని గ్రామములను దానము చేసినప్పుడు పరి పాలనమున నెట్టి మార్పును లేకుండనే వానిని బ్రతి గ్రహీతల వశము చేయుట మిక్కిలి సుకరముగా సాగిపోవు చుండెను.

రాజాధికారుల పాలనమున నుండిన భూభాగమే కాక యప్పు డితర భూస్వాముల వశమున నుండిన భూభాగము కూడ విస్తృతముగా నుండెను. ఆ భూస్వాములు రాజవంశమునకు జ్ఞాతులుగనో వివాహాది బాంధవ్యములచే సంబద్ధులుగనో యుండినట్లు కనఁబడు చున్నది. ఎలమంచిలి, పిఠాపురము, ముదిగొండ మున్నగు ప్రాంతములఁ బాలించిన చాళుక్యులును, కొలను సరో నాథులును, కోన హైహయులును నిట్టి వారే. విశేషమైన రాజభక్తి ప్రదర్శించిన వారు పెద్దపెద్ద యుద్యోగులుగా నియమింపఁబడుటయేకాక యొక్కొక్కప్పుడు భూస్వాములుగాఁ గూడఁ జేయఁబడుచుండిరి. దీనిని బట్టి భూస్వామిత్వము నకుఁ గేవల మాభిజాత్యమును రాజబాంధవ్యమును మాత్రమే కాక పరాక్రమము, రాజభక్తి మున్నగు గుణవిశేషములు కూడఁ గారణము లగుచుండె నని తెలియు చున్నది. ఈ భూస్వాము లా భూభాగములపై సర్వాధికారములు వహించుచు రాజునకుఁ గప్పము కట్టుచుండిరి. ఈ భూస్వాముల వలనఁ జాళుక్య రాజులకుఁ బలు సమయములం దపకారమే జరుగుచుండెను. రాజులు సమర్థులైనప్పుడు వారు లొంగియుండి యసమర్థులైనప్పుడు తిరుగఁబాటు చేయుచుండిరి. వీరు తమతమ భూభాగములందుఁ బ్రతిష్ఠితులై రాజునకు శాశ్వత విరోధులుగా నేర్పడు చుండిరి. అట్టి వారిలో మొదటి యుద్ధమల్లుని సంతతి వారిని బ్రధానముగాఁ బేర్కొన వచ్చును. వా రవకాశము లభించినప్పుడెల్లఁ జాళుక్యులకుఁ గులవిరోధులైన రాష్ట్రకూటుల తోడను బశ్చిమ చాళుక్యుల తోడను గూడి వేంగీ రాజ్యముపై దండెత్తుచు రాజ్యము నంతను నిరంతర మంతర్యుద్ధములతో ముంచివైచిరి.

సాంఘిక పరిస్థితులు :

చాళుక్య యుగమున వర్ణవ్యవస్థ సుప్రతిష్ఠితమై యుండెను. రాజరాజ నరేంద్రుని వలెనే చాళుక్యరాజు లందఱును "సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహా మహిమ"తో నొప్పుచు నాదిరాజవిభులై విలసిల్లిరి. సహజముగా వర్ణవ్యవస్థ నంగీకరింపని బౌద్ధులును జైనులును గూడ నా కాలమునఁ గొన్ని స్వల్పములైన మార్పులతో దాని నవలంబించినట్లు కనఁబడు చున్నది. సంఘమున నూటికిఁ దొంబది మంది హిందూమతమునే యనుసరించుచుండిరి. ప్రసిద్ధములైన నాలుఁగు వర్ణములతోపాటు బోయలు, శబరులు మున్నగు నితరులు కూడఁ గొన్ని శాసనములలోఁ బేర్కొనఁబడి యున్నారు. కాని

వారు చాల వఱ కనాగరికులై యుండుటచే సాంఘిక జీవితమున వారి కత్యల్పమైన ప్రాధాన్యము మాత్రమే యుండెను.

సంఘమున బ్రాహ్మణు లగ్రస్థానము నాక్రమించి యుండిరి. వేద శాస్త్రముల నధ్యయనము చేసి యితరులకు బోధించుచు వైదికములైన యజ్ఞ యాగాది కర్మ లాచరించుచు వారు షట్కర్మ నిరతులై కాలము పుచ్చుచుండిరి. రాజులును, భూస్వాములును వారిని భక్త్యాదరములతో గౌరవించుచు వారి కుదారములైన ధన ధరణీ దానము లొసంగుచుండిరి. చాళుక్య యుగము నందలి శాసనములు పెక్కు దేవతలకో ధరణీ దేవతలకో దానము లొసంగు సందర్భమున వ్రాయింపఁబడినవే. బ్రాహ్మణు లాచరించు యజ్ఞయాగాదులచే దేవతలు తృప్తులై సకాలమున వర్షము కురియించి దేశాభ్యుదయమునకు హేతువు లౌదురని యప్పటివారు విశ్వసించు చుండిరి. రాజరాజును నన్నయ "మహాదాన తర్పిత ద్విజవరుఁ డనియు (ఆ-1) దయావర్ధిత ధారుణీ సురాన్వయుఁ డనియు (ఆ-1) ధరణీ సురవర సురభూజ రాజవియు (సభా ౨-320) ధరాదేవాశీః పరంపరావర్ధిత విత్యోదయుఁ డనియు(౧-162) నాశ్వాసాద్యంత పద్యములందు వర్ణించి యుండెను.

కొందఱు సమర్థులైన బ్రాహ్మణులు వైదిక కర్మాచరణ ప్రవణులయ్యు దేశ క్షేమమునకై రాజ్య పాలనమునఁ బాల్గొనుచుండిరి. పరిపాలనావిధానమున రాజునకుఁ దోడ్పడు తీర్థులనఁబడు మంత్రులలో ముఖ్యులైన వారు బ్రాహ్మణులుగనే యుండిరి. సభా పర్వ ప్రథమాశ్వాసమున నారదుఁడు ధర్మ రాజును రాజనీతి విషయము లడుగుచు,

> "అనఘుల శాస్త్ర విధిజ్ఞుల. ననురక్తుల బితృపితామహక్రమున వచ్చిన విపుల మంత్రులఁగా నొనరించితె. కార్య సంప్రయోగము పొందెన్". (స. ౧-25).

అని ప్రశ్నించి యుండెను. దీనికి మూలమవి చెప్పఁదగిన భారత మందలి శ్లోకమున[1] విప్రుల నను పదము కానరాదు. అది నన్నయ యమూలకముగాఁ గల్పించినది వలెనే కనఁబడుచున్నది. తన కాలమందలి పరిస్థితుల ననుసరించి యాతఁ డా విధముగా నా పదము నచ్చటఁ జొప్పించి యుండును.

1. కచ్చిదాత్మ సమావృద్ధాః శుద్ధాస్సంబోధన క్షమాః
కులీనాశ్చాను రక్తాశ్చ కృతాస్తే వీరమంత్రిణః-(సభా ౧-83).

ఆముక్తమాల్యదలో రాయలు చెప్పిన రాజనీతిలోఁ గూడ బ్రాహ్మణులనే మంత్రులుగా నియమింపవలెనని యున్నది. ఆ యాచారము చాళుక్యుల నాఁటి నుండియు, నంతకుఁ బూర్వము నుండియుఁ గూడ సాగి వచ్చు చుండెనని తోఁచుచున్నది. కొందఱు బ్రాహ్మణులు సైన్యమునఁ జేరి తమ ధీ పరాక్రమ విశేషములచే రాజుల మెప్పు వడసి సేనలం దత్యున్నత పదవులను బొంది యుండి రనుటకు శాసన దృష్టాంతములు చాలఁగలవు. గుణగ విజయాదిత్యుని కాలమున నాతనికి బహు సమరములందు విజయలక్ష్మిని గైవసము చేసిన సేనాపతులు విప్రవర్యులే. పండరంగుఁడును ఆతని తండ్రియైన కడెయరాజును ఆ కాలపు విప్రసేనానులలో ముందు పేర్కొనఁదగి యున్నారు. అద్దంకి శాసనమందును చాళుక్య భీమమహారాజు ధర్మవరశాసన మందును పండరంగుని పరాక్రమ విశేషములు లెస్సగా వర్ణింపఁ బడియున్నవి. వారు గాక యా కాలమ్మున వినయదిశర్మ, రాజాదిత్యుఁడు అను బ్రాహ్మణులు కూడ వేద వేదాంగములందుఁ బ్రవీణులయ్యు రాజునకు రణరంగములందుఁ గూడ విశేష సాహాయ్య మొనరించిరని తెలియుచున్నది. అయ్యపరాజు, బెజయరాజు అను పండరంగుని బంధువులును, ఆతని మనుమఁడైన కడెయరాజును, రంగాధికక్కరుఁడను నొక బ్రహ్మచారియుఁ బ్రథమ చాళుక్య భీముని కాలమున సేనానాయకులై విశేష ప్రశస్తి వహించి యుండిరి. శక్తివర్మ రాజ్యకాలమున నాతని నతిభక్తితో సేవించుచు నతని విజయములకెల్లఁ గారణభూతులై వర్తించినవారు బ్రాహ్మణ దండనాథులే. వారిలో వెన్నయశర్మ.పిణ్ణయభట్టారకుఁడు అనువారు మహా పరాక్రమవంతులు. పిణ్ణయ భట్టారకుఁడు చాళుక్యవంశ వర్ధన రక్షణహేతు ప్రభూతధ్వజదండుఁ డని ప్రశంసింపఁబడి యున్నాఁడు. శక్తివర్మ యాతని సేవకుఁ బరితుష్టుఁడై పెన్నేరు (పెనికేరు) మొదలైన నాలుగు గ్రామముల నాతనికి మాన్యములుగా నొసంగి యున్నాఁడు[1].

వేంగీ రాజ్యముననే కాక యా కాలమున చోళ కర్ణాట రాజ్యములందుఁ గూడఁ బ్రసిద్ధులైన బ్రాహ్మణ చమూపతు లనేకులుండిరి. బయలు నంబి యను బ్రాహ్మణ సేనాని రెండవ జయసింహునికి దక్షిణ హస్తమై వేంగీ

---

1 Elliot Collection Vol. I Page 348 – 358 ; Eastern Chalukyas of Vengi. Page 311.

రాజ్యముపై నాతఁడు సాగించిన దండయాత్రలలో విశేషమైన సాహాయ్య మాచరించెను. చోళ సేనల కధిపతియై వచ్చి కలిదిండి సంగ్రామమున వీర స్వర్గ మలంకరించిన రాజరాజ బ్రహ్మ మహారాజు బ్రాహ్మణ ప్రవరుఁడే. సేనానులుగాఁ గాక మంత్రులై పేరుగాంచిన బ్రాహ్మణు లా కాలమున ననేకు లుండిరి. వారిలో వజ్రామాత్యుఁడును (వజ్జియ ప్రెగ్గడ) నారాయణభట్టును ముందు పేర్కొనఁదగినట్టి వారు. నారాయణభట్టు తండ్రియుఁ దాతయుఁ గూడ గర్ణాటక రాజులకు మంత్రులై వారి యభ్యుదయమునకుఁ గారణభూతు లైరని తెలియు చున్నది.

ఆ కాలమున క్షత్త్రియులు రాజ్యపాల నాధికారమును వహించి యుండిరి. వారిలో సూర్య వంశస్థులని చంద్ర వంశస్థులని రెండు తెగ లుండెను. చోళరాజు లును పడమటి గాంగులును సూర్య వంశమునకుఁ జెందిన వారనియుఁ జాళుక్యు లును, హైహయులును, రాష్ట్రకూటులును జంద్ర వంశమునకుఁ జెందిన వార నియుఁ దెలియుచున్నది. ఆ కాలమున నుత్తర హిందూ దేశమున మిక్కిలి ప్రసిద్ధి వహించిన అగ్నికుల క్షత్త్రియుల ప్రసక్తి దక్షిణ దేశమున నెచ్చటను గానరాదు. చాళుక్యులకు సామంతులై భూస్వాములుగా నుండినవారు పలువురు వారి జ్ఞాతులైన క్షత్త్రియులే. వారు యుద్ధాసక్తులై యవకాశము దొరికినపు డెల్లఁ దిరుగఁబాటు చేయుచు నంతర్యుద్ధములకు దారి చూపుచుఁ జాళుక్య రాజులకు శాశ్వత విపత్కారణులై వర్తించిరి.

ఆ కాలమున వాణిజ్య వ్యాపార మంతయు వైశ్యుల చేతులలో నుండెను. వారు దేవాలయములకును మత సంస్థలకును విశేషముగా దానము లొసంగి యుండిరి. వైశ్య కులమున కా నాఁడు ప్రస్తుత పశ్చిమ గోదావరీ మండలము నందలి పెనుగొండ ముఖ్యస్థానమై యుండెను. ప్రతి పట్టణమునను వైశ్యులొక సంఘముగా నేర్పడి స్వకులము యొక్కయు వాణిజ్యము యొక్కయు నభ్యు దయమునకై పాటుపడు చుండిరని వైశ్య పురాణము (7-108) చెప్పు చున్నది. ఆ సంఘములకు నకరములని పేరు. అందలి సభ్యులు నకరములు లేక పెట్టి పట్టణ స్వాములు అని పిలువఁబడుచుండిరి. ఈ నకరము లన్నియు నొక సమాఖ్యగా నేర్పడి (Federation) యుండెననియు వానికిఁ బెనుగొండ మూల స్థానమై యుండె ననియుఁ బైపురాణముననే చెప్పఁబడి యున్నది. తెలిక వారికిఁ గూడ 'తెలిక వహ్నస' మను నిట్టి సంఘ మొకటుండె ననియుఁ గులోత్తుంగు

వికి వేంగీ రాజ్యమున ప్రతినిధిగా నుండిన రాజరాజ చోడ గంగు నుండి వారు పెక్కు హక్కులను బొందియుండి రనియు నొక శాసనము వలనఁ దెలియు చున్నది (E. I. VI Page 35. A. D. 1084)

మొత్తము జన సంఖ్యలోఁ జతుర్థ వర్ణజులే యధిక సంఖ్యాకులై యుండిరి. వ్యవసాయము వారి ముఖ్య వృత్తి. పశువులను బెంచుచుఁ బొలము దున్నుచు వారు జీవితము పుచ్చుచుండిరి. ఇప్పటివలె నప్పుడును వారిలో నుప శాఖలు మెండుగా నుండెను. సాంఘికాచార వ్యవహారము లందును జీవన విధానము నందును గల భేదమే యన్ని యుపశాఖ లేర్పడి యుండుటకు గారణము. పాలెవారు, తెలికవారు వ్యవసాయముచేఁ గాక కుల వృత్తు లచే జీవించు చుండిరి. శూద్రులలోఁ బలువురు సైన్యమునఁ జేరి దేశ రక్షణమునకై పాటు పడుచుండిరి. అట్టి వారిలోఁ గొందఱు తమ పరాక్రమ విశేషము చేతను నిశ్చలమైన రాజభక్తి చేతను రాజు మెప్పునకుఁ బాత్రులై గొప్ప గొప్ప పదవు లలంకరించుటయే కాక భూస్వామిత్వమును గూడఁ బడయుచుండిరి. వెలనాడులు, కొండ పడమటులు, చాగులు, పరిచ్ఛేదులు మున్నగు వారిట్లు సైనిక వృత్తిచే రాజు ననుగ్రహమునకుఁ బాత్రులై సామంతులును మహా మాండలికులు నైనట్టి వారే.

ఆ కాలపు సాంఘిక జీవితమును గూర్చి వివరము లెక్కువగాఁ దెలియవు. బహు భార్యాకత్వ మాచారముగా నుండినట్లు కనఁబడు చున్నది. చాళుక్య రాజులలోఁ బలువురి కిరువురు మువ్వురు భార్య లుండుట కలదు. భూస్వాములును ధనికులును రాజుల వలెనే బహు భార్యలనుగ్రహించు చుండిరి. ఆ కాలమున రాజుల కొలువు నందును దేవాలయము లందును వేశ్యలు విరివిగా వర్తించుచుండిరి. కలిదిండి శాసనమున రాజరాజు కట్టించిన యొక్కొక్క దేవాలయమున కేఁబది యిద్దరు వేశ్యలుండునట్లు వసతి కల్పింపఁ బడెనని చెప్పఁబడి యున్నది. కొందఱు ధనికులును, భూస్వాములును వారితో సంబంధము కలిగి వారి నుంపుడు కత్తెలుగా నుంచుకొను చుండిరి. అట్టి వారికి లంజ పెండ్లము లని పేరు. ఈ లంజ పెండ్లములు దేవాలయముల కనేకదానము లొనరించినట్లు పలుశాసనముల వలనఁ దెలియు చున్నది. రెండవ అమ్మరాజమహేంద్రునకుఁ బట్టవర్ధని కుల సంజాతయు నవవ్య రూప లావణ్య శోభితయు నైన చామెకాంబ యను భోగపత్ని యుండెను. ఆమె సంప్రార్థనమున నా మహారా జత్తిలి నాండు విషయములోని కలచుంబఱ్ఱు గ్రామము నర్హ్వనంది యను జైన మునికి

సర్వకర పరిహారముగా దానము చేసి యుండెను. (E. I. VII P. 177) కొందఱు రాజులు వేశ్యలను వివాహ మాడిరనుటకుఁ గూడ నిదర్శనము లున్నవి. మొదటి గొంకరాజు తన రాజ్యము నందలి యొకానొక దేవాలయమున నర్తకిగా నుండిన వేశ్యను (పాత్రను) బెండ్లి యాడెనఁట ! ఆ కాలమున వేశ్యావృత్తి పాప హేతువుగాఁ బరిగణింపఁ బడకుండెను. పలువురు వేశ్యలు నృత్య గానాది లలిత కళలం దారితేఱి ప్రజలను రంజింపఁ జేయు చుండిరి. వారిలోఁ గొందఱు మత విషయమున నిష్ఠగల్గి దైవభక్తి కాకరములై దేవాలయము లందు నృత్య గానములఁ బ్రదర్శించుట చేతనే కాక యమూల్యములైన దానము లొసంగుటచేఁ గూడ దేవునికి వరివస్య యొనరించు చుండిరి.

మతపరిస్థితులు :-

చాళుక్యు లాంధ్రదేశము నాక్రమించు నాఁటి కచ్చట హిందూ జైన బౌద్ధ మతములు మూఁడును బ్రచారమున నుండెను. వానిలో బౌద్ధమత మప్పటి కంది క్రమముగా క్షీణించినట్లు కనఁబడుచున్నది. ఒకప్పుడు సహస్రముల కొలంది బౌద్ధ భిక్షువులతో నిండియుండిన బౌద్ధవిహారములు తననాఁటికి శిథిలములును విజనములునై యుండెనని క్రీ. శ. 7 వ శతాబ్దిలో భారతదేశమును దర్శించిన హ్యూన్‌త్సాంగు వ్రాఁతల వలనఁ దెలియు చున్నది. ధర్మప్రచారమునకై కాక స్తూపాదులయందుఁ బాతిపెట్టఁబడిన బుద్ధుని శరీరావశేషములందలి భక్తిచే నచ్చటచ్చటఁ గొన్ని మఠములందు బౌద్ధభిక్షువులు నిల్చి యుండిరి. బౌద్ధమత ధర్మములకుఁ బెట్టని కోటలుగా నుండిన సుప్రసిద్ధములైన పంచారామములు కాలక్రమమునఁ దమ బౌద్ధ స్వభావమును గోల్పోయి హైందవ క్షేత్రములుగా మాఱిపోయినవి. కొన్నిచోట్ల బుద్ధుఁడు పూజింపఁ బడుచుండక పోలేదు కాని యాతఁడు బౌద్ధమత ప్రవర్తకుఁడుగాఁ గాక శ్రీ విష్ణు దశావతారములలో నొక్కఁడుగా భావింపఁ బడుచుండెను.

ఆ కాలమున జైనమతము జనసామాన్యమున బహుళప్రచారము గాంచు చుండెను. జైన శ్రావకులు తీవ్రముగా స్వధర్మమును బ్రచారముచేయుచు రాజ్యమునంతను జైనమతానుయాయిగా నొనరించుటకు యత్నించుచుండిరి. శిథిలములైన ప్రాచీన గ్రామస్థలములందుఁ గానిపించు నసంఖ్యాకములైన జైనవిగ్రహము లా కాలమున జైనమతమునకుఁ జెందిన మఠములు విస్తారముగ నుండె ననియుఁ బ్రజ లా మతము నందభిమాన మూని యర్థులనమ

దీర్థంకరులను బూజించుచుండి రనియుఁ దెలియుచున్నది. కొందఱు చాళుక్య రాజులును బ్రజలును జైన వసతులను, దేవాలయములను నిర్మింపఁజేసి వాని పోషణమునకై ధనమును, భూమిని దానము చేసినట్లు కొన్ని శాసనములవలనఁ దెలియు చున్నది. రెండవ చాళుక్య భీముని నాఁడు మహాసామంత దండనాథుల తోపాటు జైన శ్రావకులు కూడఁ జాళుక్య రాజవంశాభ్యుదయమునకు బాసటయై నిల్చిరి. రెండవ అమ్మరాజు విజయవాడ యందు రెండు జైన వసతులను గట్టించి తత్పోషణార్థమై తెనాలి తాలూకాలోని పెద గాదిలిపఱ్ఱు గ్రామమును దేవభోగముగా సమర్పించెను.[I] అతఁడు తన యుంపుడు కత్తె యైన చామెకాంబ ప్రేరణమున నత్తిలినాఁడు లోని కలుచుంబఱ్ఱు గ్రామము నద్దకాలి గచ్ఛలోని వలహారిగణమున కాచార్యుఁడైన అర్హనంది యను జైన మునికి సర్వలోకాశ్రయ జిన భవనమునకుఁ జెందిన సత్రము నిమిత్తమై, సర్వ కరపరిహారముగా దానము చేసిన సంగతి యిదివఱకుఁ జెప్పఁబడినది. మఱియు నతఁడు కటకాధీశుఁడును మహాసామంతాధిపతియు నగు దుగ్గరాజు విన్నపము ననుసరించి ఒంగోలు చెంత నున్న ధర్మవరమునఁ బ్రతిష్ఠించిన కటకాభరణజినాలయమునకు మలియంపూఁడి గ్రామమును సర్వకరపరిహారముగా దానము చేసెను. (E. I. XI పుట 47-56) (ఈ శాసనము జిన ప్రార్థనముతో నారంభించుచున్నది). ఈ జినాలయమునకు నందిగచ్ఛలోని యాపనీయ సంఘమునకుఁ జెందిన కోటిమడువ గణమున కధిపతియైన శ్రీ మాందిరదేవుఁ డాచార్యుఁడు. విమలాదిత్యుఁడు రాజ్యము చేయుచున్న కాలమున మూల సంఘములోని కొండకుందాన్వయమునకుఁ జెందిన నందిగణమునకు సంబం ధించిన వాఁడును, దిగంబర జైనసంప్రదాయావలంబియు, గొల్లాచార్యుని శిష్యుఁడు నైన త్రికాలయోగి సిద్ధాంతదేవ ముని విమలాదిత్యుని దర్శింప నెంచి యప్పుడు వేంగీ సామ్రాజ్యములోనే కలసియుండిన కళింగము నందలి రామ తీర్థమున కరిగి యచ్చట నివాస మేర్పఱుచుకొనెను. ఈ జైనాచార్యుఁడు మహా మహిమాన్వితుఁడై యొకప్పుడు బ్రహ్మరాక్షసునొకని లోఁబఱుచుకొని శిష్యునిగా గ్రహించె ననియుఁ, గామగ నూనెను గమ్మని నెయ్యిగా మార్చె ననియుఁ జెప్పుదురు. విమలాదిత్యుఁ డాతని యుపదేశము నాలించి, యతఁడు ప్రదర్శిం చిన దివ్య మహత్త్వముల కలరి, జినధర్మము నాశ్రయించి శ్రావకుఁ డయ్యెను.

I Masulipatam plates of Amma II C. P. 8 of M. E. R. 1909.

రణస్థిపూఁడి శాసన కాలమున కింకను ఆతఁడు పరమమాహేశ్వరుఁడే. తరువాతనే (1019) యతఁడు శ్రావకుఁడై వైరాగ్యమున రాజ్యము కూడఁ బరిత్యజించెను. ఆతఁడు జినధర్మము నవలంబించుట జైన ధర్మవ్యాప్తికిఁ బ్రబలహేతువయ్యెను. ఆ కాలమున జినమునులు పలువురు త్రికాల సిద్ధాంతయోగివలెనే సిద్ధాంత పారద్రష్టలును, జ్ఞాన నిధులునై యణిమాది సిద్ధులు గడించి మానవాతీతములైన మహామహిమలు ప్రదర్శించుచుండిరి. వారు ప్రదర్శించు నీ మహిమలే వారి ధర్మోపదేశముల కంటెను జనుల నత్యధికముగా నాకర్షించుచుండెను. అవి జనులను మూఢ విశ్వాసమునకు లోఁబఱిచి విద్యా సంస్కారవిహీనులుగ నొనరించు చుండెను. జైనధర్మములు సహజముగా నుత్కృష్టములే యైనను అప్పటి జైను లన్య ధర్మముల పట్ల నసహనము చూపుచుండిరి. ఈ విధముగా జైన మతము దేశమున నధిక ప్రచారము కాంచు చుండిన మాట సత్యమే యైనను అది యెన్నఁడును రాజ మతముగాఁ బరిణమింప లేదు. చాళుక్య రాజు లందఱును బరమ బ్రహ్మణ్యులును, బరమ మాహేశ్వరులునై శైవాచార సంప్రదాయముల నాదరించు చుండిరి. కొందఱు రాజులు జైన మతము నెడఁ గూడ నించుక యభిమానము ప్రదర్శించినను ఒక్క విమలాదిత్యుఁడు తప్ప మఱెవ్వరును శైవాచారము మజ్జగించి శ్రావకులై జిన ధర్మము నాశ్రయించి యుండ లేదు.

చాళుక్య యుగమున హిందూ మతమే జాతీయ మతమై యుండెను. శైవ వైష్ణవ మతశాఖలు రెండు నుండెను గాని శైవము వలె వైష్ణవ మంతగా నభ్యుదయమును బొందియుండలేదు. తూర్పు చాళుక్య శాఖకుఁ జెందిన తొలి రాజులు కొందఱు భాగవతులై విష్ణు నారాధించినట్లు తెలియుచున్నది. కుబ్జ విష్ణువర్ధనుని పేరే యాతని వైష్ణవాభిమానమును సూచించుచున్నది. కాని యా మత మచిర కాలముననే సన్నగిల్లి శైవమతమునకుఁ దా వొసంగెను. కొంచె మించుమించుగాఁ జాళుక్య రాజు లందఱును బరమ మాహేశ్వరులే. వారి శాసనములు పెక్కింట నీ బిరుదము కానవచ్చుచున్నది. వారు కట్టించిన యసంఖ్యాకములైన శివాలయములు వారి శివభక్తి విశేషమును శైవమత ప్రీతిని జాటుచున్నవి. రెండవ విజయాదిత్యుఁ డనఁబడు నరేంద్రమృగరాజు తాను శత్రువులపైఁ గాంచిన విజయములకు స్మారకముగా నూటెనిమిది శివాలయములను గట్టించి వానికిఁ దన పేరిమీఁదుగా నరేంద్రేశ్వరాలయములని పేరు

పెట్టెను. రెండవ యుద్ధమల్లుఁడు బెజవాడలోఁ గార్తికేయాలయమును నిర్మించెను. ప్రథమ చాళుక్యభీముఁడు దక్షారామమునందును జాళుక్య భీమ వరమునందును సుప్రసిద్ధములైన శివాలయములను గట్టించెను. కలిదిండి రణరంగమున మరణించిన ముగ్గురు సేనానుల స్మృత్యర్థమై రాజరాజు మూఁడు శివాలయములను నిర్మింపఁజేసి వాని పోషణమునకై కొన్ని గ్రామములను దానము చేసెను. అతఁడు జగత్పరిపూజ్యములైన యీశ్వరాగమములందు భక్తితో హృదయము నిల్పెననియుఁ, బార్వతీపతి పదాబ్జధ్యానపూజామహోత్సవ ప్రవణుఁడును బురారాతి పదాబ్జ పూజనాసక్త మతియునై (3-227) విలసిల్లె ననియు నన్నయ వర్ణించియున్నాఁడు.

దేశమునం దెల్లెడ శైవజైన మతములకు సంబంధించిన మత సంస్థలు విస్తారముగా నుండెను. రెండవ అమ్మరాజు కాలమున నిర్మింపఁబడిన జైన వసతులను గూర్చి యిదివఱకుఁ జెప్పఁబడినది. శైవమతములు జైన మతములకంటెఁ గూడ మిక్కిలి ప్రసిద్ధములై యుండెను. అందుఁ బెక్కు కాలాముఖ శాఖకుఁ జెంది యుండెను. శైవ మఠములలో నెల్ల మిక్కిలి పెద్దది బెజవాడయందు రెండవ విజయాదిత్యుఁ డనఁబడు నరేంద్రమృగరాజుచే నిర్మింపఁబడిన సమస్త భువనాశ్రయాపరనాముఁడైన శివుని దేవాలయమునకు సంబంధించి యుండెను. రెండవ యుద్ధమల్లుఁడు బెజవాడలోఁ దాను నిర్మించిన కార్తికేయాలయమునఁ గూడ నొక మఠమును గట్టించినట్లు యుద్ధమల్లుని బెజవాడ శాసనము వలనఁ దెలియుచున్నది. క్రీ. శ. 11 వ శతాబ్దిలోఁ జోళవేంగీ దేశములకుఁ గల సన్నిహిత సంబంధమును బట్టి పలువురు శైవ సన్న్యాసులు (గొరగలు) దక్షిణము నుండి వలసవచ్చి దక్షారామమున నెల కొనిరి. ఈ మఠములు జాతీయ జీవితమున మిక్కిలి ప్రముఖమైన పాత్ర వహించె నని చెప్పవచ్చును. సన్న్యాసులు తా మే మతమునకుఁ జెందినవారైనను కేవల జపతపోధ్యానములందే మగ్నులై యుండిపోక ప్రజల యభ్యుదయమునకై యనేక విధముల యత్నించిరి. వారు పేదలకు భోజన సౌకర్యము కలిగించుటకై సత్రాలయములు నిర్వహించిరి; బధిరపంగ్వంధాదుల చికిత్సకై వైద్యాలయములు నెలకొల్పిరి; వేదశాస్త్రాగమాదుల బోధించుటకై పాఠశాలలు నడపి యుండిరి. అందుచే నీ మఠములు కేవల మత ధర్మోప దేశసంస్థలుగనే కాక విద్యాసాంఘిక సేవా కేంద్రములుగాఁ గూడఁ బని

చేయుచుఁ బ్రజల యారోగ్య విజ్ఞాన వివర్ధనమున కెన్నియో విధముల దోడ్పడు చుండెనని చెప్పవచ్చును.

ఆ రోజులలో దేవాలయములకు జాతీయ జీవితమున నపారమైన ప్రాముఖ్యముండెను. అవి భగవదారాధనమునకుఁ గేంద్రములై యుండుటయే కాక విద్యాకళాపోషణమునకును దీనశ్రామిక జనరక్షణమునకును జాలతోడ్పడు చుండెను. భక్తులొసంగిన యుదారములైన దానములవలన విస్తారమైనభూమియు నసంఖ్యాకములైన పశువులను దేవాలయముల వశమందుండెను. అవి యా భూములను బండించుటకుఁ బలువురు కార్మికులను నియోగించుచు వారికి జీవనాధారము నొనర్చుచుండెను. ఇట్లే దేవాలయములందలి నిత్య నైవేద్యారాధన విధానమునకై పలువురు పూజకులను సేవకులను నియమింపఁబడు చుండిరి. దేవాలయములు పరమేశ్వరుని ప్రాసాదములుగా భావింపఁబడుటచే నవియు నా కారణమున రాజప్రాసాదములనే యనుసరించుచుండెను. అందుచే రాజప్రాసాద ములందు వలెనే దేవాలయములందుఁ గూడ సేవకులు డెబ్బది రెండు నియోగ ములక్రింద విభజింపఁ బడియుండిరి. అందు గాయకులు, నర్తకులు, వేదపురాణ పాఠకులు పలువురు నియమింపఁబడుచుండిరి. ఈ విధముగా దేవాలయములు విద్యాకళాపోషణ కేంద్రములై ప్రజా సంస్కృతి వివృద్ధికై యెన్నియో విధ ములఁ దోడ్పడుచుండెను.

ఆ రోజులలోఁ బుణ్యక్షేత్ర తీర్థయాత్రలుకూడఁ దఱుచుగా సాగు చుండెను. పంచారామములు, పాలకొలను, దక్షారామము, అమరావతి, చేబ్రోలు, బెజవాడ మున్నగు క్షేత్రములందలి దేవాలయములు విశేష సంఖ్యగల యాత్రికుల నాకర్షించుచుండెను. చేబ్రోలు నందలి మహాసేనుని యాలయ మా రోజులలో సాంవత్సరిక మైన జాతర కెంతయో ప్రసిద్ధి వడసి యుండెను. ఆ జాతర సందర్భమునఁ గార్తికేయుని విగ్రహము చేబ్రోలునుండి బెజవాడకును అచ్చటనుండి తిరిగి చేబ్రోలునకును నుత్సవపూర్వకముగాఁ గొనిపోఁబడుచుండె నని శ్రీ నేలటూరి వేంకటరమణయ్య గారు వ్రాసి యున్నారు. (E. Chalukyas. page. 291).

చాళుక్యులవలంబించిన శైవము వైదికమతానుబంధి యైనదే కాని తద్వ్యతిరిక్తమైనదికాదు. అందుచేతనే వేదాధ్యయనమును వృద్ధిచేయుట, వేద విప్రులను బోషించుట, వైదిక కర్మలను యథావిధిగా నాచరించుట వారికి

మిక్కిలి యభీష్టములైన కార్యములుగా నుండెను. వైదికధర్మమన్న వారికిఁ బ్రాణము. తద్రక్షణ వర్ధనములకై వారెన్నియోవిధములఁ బాటుపడిరి. నన్నయ రాజరాజునకు నిత్యధర్మప్రారంభ, ధర్మనిత, యను విశేషణములను వాడి యుండెను. ఇందుఁ బేర్కొనఁబడిన ధర్మము వైదిక ధర్మమే. వైదిక ధర్మమును రెండు ముఖ్యభాగములుగా విభజింపవచ్చును. ఒకటి యజ్ఞాది కర్మాచరణమునకుఁ బ్రాధాన్య మొసంగును. రెండవది జ్ఞానార్జనమునకుఁ బ్రాధాన్య మొసంగును. మొదటిదానికిఁ బూర్వ మీమాంసా మతమనియు, రెండవదాని కుత్తర మీ మాంసా మతమనియుఁ బేర్లు. ప్రతివేదమునందును మంత్రము లేక సంహిత, బ్రాహ్మణము, ఉపనిషత్తు అను మూఁడు భాగము లుండును. ఇందు సంహితా భాగము దేవతలను స్తుతించు మంత్రములతో నిండియుండును. యజ్ఞ యాగాది మత కర్మలందు వీనిని స్వరయుక్తముగాఁ బఠించుచుందురు. బ్రాహ్మణము లే యే కర్మలనెట్లు చేయవలయునో యందాచరింప వలసిన విధు లెట్టివో యేయే మంత్రముల నెచ్చటెచ్చట వినియోగింపవలయునో వివరించును. అందచ్చటచ్చటఁ బై కర్మలకు సంబంధించిన యితిహాసములు కూడఁ జెప్పఁబడు చుండును. ఉపనిషద్భాగమున బ్రహ్మ విచారము, పరమాత్మ జీవాత్మలకును, మానవునికిని ప్రపంచమునకును గల సంబంధము, సంస్కృతి మోక్షములు మున్నగు నాధ్యాత్మిక విషయములను గూర్చితెలుపఁబడును. వేదములందుఁ గాన వచ్చు నీ నిర్మాణక్రమమే యవి కర్మజ్ఞానములకు సంబంధించినవని స్పష్టముగాఁ దెలియవచ్చును.

బుద్ధుఁడవతరించుటకుఁ బూర్వము వేదోక్తములైన కర్మ కలాపముల కత్యంతమైన ప్రాధాన్యముండెను. బౌద్ధమతము కర్మప్రాధాన్యమును నిరసించి జ్ఞాన సన్న్యాసముల కధిక ప్రాముఖ్య మొసంగెను. బౌద్ధమత వ్యాప్తి ప్రచారములు సాగిన కొలఁది కర్మలకుఁ బ్రాధాన్యము తగ్గ మొదలిడెను. ఆ మతము దేశము నల్గడల వ్యాపించి యున్నప్పుడుకూడ శాతవాహనులు, ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, గుప్తులు మున్నగు వా రశ్వమేధాది యజ్ఞముల నాచరించుచునే యుండినట్లు చరిత్రవలనఁ దెలియుచున్నది. శాతవాహనుల రాజ్యకాలము బౌద్ధ మతవల్లరికి మధుమాసమని చెప్పఁదగియున్నది. ఆ రాజులు బౌద్ధమత మభిమానించిన వారైనను వైదికములైన యజ్ఞయాగాదులను వర్ణాశ్రమ ధర్మములను ఆదరించుచునేయుండిరి. నాగనీక భర్తయైన శాతకర్ణి I రెం డశ్వమేధ యాగ

ములను, అగ్న్యాధేయము, అప్తోర్యామము, అనారంభణీయము మున్నగు క్రతువులను నెన్నిటినో యాచరించెను. గౌతమీ పుత్ర శాతకర్ణి చాతుర్వర్ణ్య సంకరము నివారించి యుండినట్లు తెలియుచున్నది. యజ్ఞశ్రీ శాతకర్ణి కాలమున గృహపతులుకూడ యజ్ఞముల నాచరించుచుండినట్లు చినగంజాం శాసనము చెప్పుచున్నది. ఆ కాలమున భారతదేశమున కరుదెంచిన శకయవన పహ్లావాది విదేశీయులు కూడ బ్రాహ్మణులచే క్షత్త్రియులుగాఁ బరిగణింపఁబడి యార్య వైదిక మతమున కధికమైన ప్రాపునొసంగిరి. క్రీ. పూ. 300 నుండి క్రీ. శ. 300 వఱకును సుమారాఱు శతాబ్దుల కాలము రాజాదరముచే నేమి, బౌద్ధులు శిల్పకళా వాఙ్మయములకుఁ గలిగించిన యభ్యుదయముచే నేమి, బౌద్ధమతము నందుఁ బ్రజాసేవానైతికౌన్నత్యములకుఁ గల ప్రాధాన్యముచే నేమి ఆ మతము దేశమున నల్గడల వ్యాపించి రూఢ మూలమయ్యెను. కాని కాలక్రమమున మత పరిస్థితులలో మార్పుకలిగెను. ఆచార్య నాగార్జునుని మహాయాన పద్ధతి భక్తి మార్గమును లేవఁదీసెను. "బుద్ధుఁడొక పూజనీయుఁడైన దైవతముగా వెలసెను. ఈతని కెందఱో పరివార దైవతములును వారికి భార్యలుగా స్త్రీ దైవతములును సృష్టింపఁబడిరి. బోధిసత్త్వులు హిందువుల పురాణమునందలి మహర్షులుగా మునులుగా పరివర్తనము నొందిరి. బౌద్ధులు శాక్యమునికిని బోధిసత్త్వులకును విగ్రహములు కల్పించి యారాధింప మొదలిడిరి. ఇట్లు హిందూదేవతలకును బౌద్ధదేవతలకును భేదమేమో ప్రజలకుఁ దెలియరాకుండెను. రెండు మతములును గలసిపోయి బౌద్ధము యొక్క ప్రత్యేకత నశించెను." (ఆంధ్రుల చరిత్ర- సంస్కృతి- పుట-173) తరువాత బౌద్ధసంఘమునఁ బొడసూపిన వజ్రయాన మను నూతన విధానమునందుఁ దాంత్రిక పూజలు, రహస్యక్రియా కలాపము, మధుమాంస వినియోగము, శక్తిపూజలు మున్నగు వానికిఁ బ్రాచుర్యము కలిగెను. వీనితోపాటు బౌద్ధ సన్న్యాసి వర్గమునందుఁ జూపట్టిన నైతిక పతన మా మతవల్లరికిఁ బరశుప్రహారమై యచిరకాలముననే దానిని సమూలముగా నశింపఁజేసెను. క్రీ. శ. 7వ శతాబ్దిలో హ్యూన్‌త్సాంగు భారత దేశమును దర్శింప నరుదెంచునప్పటి కా మతము క్షీణప్రాయమై అస్తినాస్తివి చికిత్సకుఁ దావొసంగు చుండెను.

బౌద్ధమత విజృంభణము సాగమొదలిడి నప్పటినుండియు వైదికధర్మాను యాయులు తమ మతమును బునః పరిశీలన మొనరించి యందలి సత్యము

పహేతుకమని సిద్ధాంతీకరించుటకై యత్నము లొనరించుచునే యుండిరి. అట్టి వారిలో జైమిని మొదటివాఁడు. అతఁడు మీమాంసానియమముల నొక పద్ధతిలోనికిఁ దెచ్చి వానిని సమర్థించుటకై సూత్రములను రచించెను. అందు వేదమునందలి ప్రత్యంశమును సమర్థింపఁబడి యున్నది. దానికి క్రీ. పూ. ప్రథమ శతాబ్దికిఁ జెందిన శబరస్వామి భాష్యము రచించెను. ఇతర భాష్యములు కూడఁ గొన్ని వెలసిన మాట సత్యమే యైనను అవి లభ్యములగుటలేదు. శబర భాష్యమే తరువాతవచ్చిన మీమాంసాకర్తల కందఱికి నాధారమయ్యెను. క్రీ. శ. 7వ శతాబ్దిలోని వాఁడగు కుమారిల భట్టు వేదప్రామాణ్యమును బురోహితుల యాధిపత్యమును అంగీకరించి సూత్రభాష్యములు రెండింటికిని వ్యాఖ్యరచించెను. ఇందు మూఁడు భాగము లున్నవి. ఇందలి ప్రథమ భాగము శ్లోకవార్తికము. రెండవది తంత్రవార్తికము. మూఁడవది టుప్టీక. అతని తరువాత నతని యనుచరుడైన మండనమిశ్రుఁడు విధివివేకము, మీమాంసానుక్రమణిక యను గ్రంథములను రచించెను. క్రీ. శ. 850 నాఁటి వాఁడగు వాచస్పతి విధివివేకములోని భావములను 'న్యాయకణిక' యను గ్రంథముగా వెలయించెను. ప్రభాకరుఁడు శబరస్వామి భాష్యము ననుసరించి దానికి 'బృహతి' యను వ్యాఖ్య రచించెను. అతఁడు రచించిన ప్రకరణ పంచిక ప్రాభాకరశాఖా గ్రంథములలో నెల్ల ముఖ్యమైనది, అతఁడును మండన మిశ్రుఁడును గుమారిలుని శిష్యులని కొందఱు చెప్పుదురు. బృహతి యందలి శైలిని బట్టియు నందలి భావములనే కుమారిలుఁడనుసరించిన విధమును బట్టియుఁ గొందఱు ప్రభాకరుఁడు కుమారిలభట్టు కంటెఁ బూర్వుఁడని యభిప్రాయ పడుచున్నారు. కుమారిలుఁడాంధ్రుఁడనికొందఱును బౌద్ధమతము నుండి హిందూ మతమునకు మాఱినబీహారు బ్రాహ్మణుఁడని కొందఱును[2] జెప్పుచున్నారు.

"చారిత్రకముగా నైనను గాకున్నను వైజ్ఞానికముగాను త్తరమీమాంసకుఁ బూర్వతరమైనది కావున దీనికిఁ బూర్వ మీమాంస యని పేరు కలిగినది. వస్తుసత్య జ్ఞాన ముత్తర మీమాంసా విషయ మైనట్లే కర్మ పూర్వ మీమాంసా ప్రధాన విషయము. ఉపనిషత్తులు గాక వేద మంతయు ధర్మము లేక విధివత్కర్మను గూర్చి చెప్పును. అట్టి కర్మలలో ముఖ్యములైనవి యజ్ఞములు[3]" కుమారి

1. భావరాజు వేంకట కృష్ణారావు – రాజరాజ నరేంద్రుఁడు Page 132.
2, Elliot Hinduism and Buddhism. Vol II P. 110; 207;
8. భారతీయ తత్త్వ శాస్త్రము 125. Vol. IV.

లుఁడు శంకరాచార్యుని కించుక పూర్వుఁడని తెలియుచున్నది. అతఁడు మహా మేధావియై వేద వేదాంగములను, జైమిని సూత్రములను, దద్భాష్యములను బూర్తిగాఁ జదివి బౌద్ధమత గ్రంథములను దన్మతాచార్యుల యొద్దనే పఠించి యా మతమును ఖండింపఁ బూనుకొనెను.

" ప్రాయేణైవహి మీమాంసాలోకే లోకాయతైః కృతా
తమాస్తిక పథే కర్తు మయం యత్నః కృతో మయా."

అని యాతఁడు శ్లోక వార్తికమునఁ (1-10) దన నాఁడు ప్రచారములో నున్న లోకాయత మతావలంబు లొనరించు మీమాంసను (కర్మాదులకు సంబంధించిన సందేహములను) దొలఁగించి వారిని ఆస్తికమార్గానుయాయులనుగా నొన రించుటకై తాను యత్నము చేయుచున్నట్లు చెప్పి యున్నాఁడు. వేదము లపౌరు షేయము లనియు నంత కంటెఁ బరమ ప్రమాణ మింకొకటి లేదనియు వేదోక్త విధుల ననుసరించియే హిందూ జీవితము నియమింపఁ బడినదనియు, సంధ్యాది నిత్య కర్మలను యాగాది నైమిత్తిక కర్మలను అనుష్ఠించుట మోక్షమున కవసర మనియు, విధ్యుక్త కర్మాచరణము కంటె మోక్ష ప్రాప్తికి సులభ మార్గము లేద నియు నాతని సిద్ధాంతము. అతని రచనలయుఁ బ్రచార విధానములయుఁ బ్రభావ ముచే దేశమున వైదిక మతము నందును దదుక్తములైన కర్మల నాచరించుట యందును జనుల కాదరము పెంపొందెను. కుమారిలుఁ డాంధ్రుఁ డగుటచేఁ గాఁబోలు నాతని సిద్ధాంతముల కాంధ్ర దేశమున మఱింత యాదరమును బ్రాపును లభించెను. కుమారిలుని తరువాత నవతరించిన శంకరాచార్యులు జ్ఞాన ప్రాధా న్యము కల యుత్తర మీమాంసా సిద్ధాంతమును బ్రచారమునకుఁ దెచ్చెను. జ్ఞాన కర్మలు పరస్పర విరుద్ధములని చాటినట్లు కనిపించినను అతఁడు కర్మలను బూర్తిగా నిరసించి యుండలేదు. ఈ జన్మలోఁ గాని గత జన్మలోఁ గాని చేసిన సత్కర్మ వలననే సత్యాన్వేషణ శక్తి కలుగుననియు, వేదోక్త కర్మాచరణము చిత్తశుద్ధిని గలిగించి జ్ఞాన సంపాదనమునకుఁ బూర్వ రంగమై యొప్పారు ననియుఁ జెప్పి యుండెను. అందుచే నాతని వేదాంత మత ప్రచారము వలన వైదిక కర్మాచరణ విధానమునకు విశేషమైన యాటంకము కలుగక పోవుటయే కాక యొక విధమైన ప్రోత్సాహమే కలిగెనని చెప్పవచ్చును. ఈ విధముగా భట్ట పాదుని యొక్కయు నాచార్య స్వాముల యొక్కయు ననితర సామాన్యమైన ప్రచార ప్రభావము వలన బౌద్ధ మత విజృంభణముచేఁ గొంత వెనుకఁబడి

పోయిన వైదిక మతము పునరుద్ధృతమై రాజులయు జనులయు హృదయ క్షేత్రము లందు దృఢముగా వేరూని క్రమాభివృద్ధి నొందఁ జొచ్చెను.

చాళుక్య రాజుల పాలనముతో హిందూ మత పునరుద్ధరణ ప్రారంభము సమకాలిక మగుట సంభవించెను. ఆ రాజు లందఱును వైదిక కర్మలను వేద విప్రులను విశేషముగాఁ బోషించిరి. వారొసంగిన దాన శాసనములు పెక్కింట షట్కర్మ నిరతులును చతుర్వేద పారీణులునైన బ్రాహ్మణోత్తముల ప్రసక్తి కానవచ్చును. "అశ్వమేధావభృథస్నాన పవిత్రీకృత వపుషాం చాళుక్యానాం కుల మలంకరిష్ణోః సత్యాశ్రయవల్లభేంద్రస్య భ్రాతా కుబ్జ విష్ణువర్ధనః" అను మాట యా శాసనము లన్నింటిలో గోచరించును. వజ్జియ ప్రెగ్గడ గృహమున వటువులు నిరంతరమును గావించు వేదశాస్త్ర పఠనమును వినుటచే శుక శారికలు కూడ వానిని పఠించు చుండునని రణస్థిపూఁడి శాసనము చెప్పు చున్నది.[1]

(E. I. VI 347-361.)

అతని యింట నిత్య ముపాసింపఁ బడుచుండిన త్రేతాగ్నుల నుండి వెల్వడు ధూమములను "అహిత క్షోణీభృత్పుర దాహ ధూమములను" సమముగా నభ్రతలమున సంభేదములను గల్పించు చుండెనఁట। రాజరాజ నరేంద్రుని కోరుమిల్లి శాసనము నందలి ప్రతిగ్రహీత చీదమార్యుఁడు "హోమధూమ వినిర్గతామిత కలంకుఁడు. సప్తతంతు కృతయూప స్తంభ శోభితుఁడు". అతని గృహము పుణ్యులైన వటువులు వర్షించు సామగ్ర్యజుర్ఘోషణముల తోడను ఉభయ సంధ్య లందు విధివంతముగా హోమములు జరుగు సమయమున వెల్వడు స్వాహా వినాదముల తోడను బ్రతిధ్వనించుచుఁ గలిమలమును దూరముగాఁ దొలఁగించి వేయు చుండును. (28 I. A. XIV48-59) రాజరాజు పాలనము చేయుచుండగాఁ బ్రజలు ప్రీతులై "నిజపవిత్ర చరిత్ర తోయములచే" కలికాల కలంక పంకమును బ్రక్షాళించి వేయుచున్నారనియు, నారాయణభట్టు ప్రపితామహుఁడైన కంచన సోమయాజి "సదా పురోడాశపవిత్ర వక్త్రుఁ" డనియు నన్నయ నందం

1. "నిత్యాకర్ణనయా శశ్వద్వటుభిః పఠుభిః కృతే
వేదశాస్త్రాణి యద్ధామ్ని పఠంతి శుకశారికాః" 25.

పూఁడి శాసనములో వర్ణించి యున్నాఁడు. (17-21) మంద గ్రామదాన గ్రహీత యైన[2] అంకయ తంత్రి రామదేవుఁడు " స్వధర్మానుష్ఠాన పరుఁడై " విలసిల్లె నని మంద తామ్ర శాసనము నుడువు చున్నది. విజయాదిత్యుని మొదటి ర్యాలి శాసనమున " వేద విదుఁడును, వేదాంగ పారగుఁడును, మీమాంసా శాస్త్ర గురువును, షట్కర్మ నిరతుఁడును " నైన పంపన భట్టోపాధ్యాయుఁడు ప్రశంసింపఁబడి యున్నాఁడు. (J. A H. R. S. IX 24 - 30) ఇట్లే చాళుక్యుల యితర శాసనము లందు సైతము వారి వేద విద్యాభిమానమును గర్మాభిరతియు సూచింపఁబడుచున్నది.

శాసనములే కాక నన్నయ యవతారిక కూడఁ జాళుక్య కాలము నందలి వైదిక మత వికాసమును బ్రకటము చేయుచున్నది. రాజరాజు " ఘన దురితానుబంధ కలికాలజ దోష తుషార సంహతి " ని దన యుదయ ప్రభావముచే దవ్వఁగఁ ద్రోవుచుండెను. మను మార్గుఁడగు నతఁడు విప్ర కులము నెల్లఁ బ్రోచుచు వారి కమగ్రహమున ననేకాగ్రహారముల నొసఁగు చుండెను. భారత శ్రవణాభిరతిచే " అమల సువర్ణ శృంగ ఖురమై కపిలంబగు గోశతంబు నుత్తమ బహు వేద విప్రులకు దానము చేసిన తత్ఫలంబు " తథ్యముగా సమకూరు ననియు, బహు భాషలలో బహు విధములుగా బహు జనముల వలన వినుచు భారత బద్ధ స్పృహులగు వారికి " బహు యాగంబుల ఫలంబు పరమార్థ మగుననియుఁ జెప్పఁబడినది. పుణ్య ప్రదములైన కార్యములలో వేద విప్రుల కిచ్చు దానమును, యజ్ఞాచరణమును బ్రముఖములవి యా కాలము వారు విశ్వసించుట యందు స్పష్టముగా గోచరించు చున్నది. అర్జునుని తీర్థయాత్రా సందర్భమున మూలమందు లేకపోయినను నన్నయ వేంగీ దేశ ప్రసక్తిని దెచ్చి యది యనఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై ధరణీ సురోత్త మాధ్వర నిధాన పుణ్య సమృద్ధమై పొలుచు చుండె " (ఆది. 5-139) నని వర్ణించుట యీ విషయమును బలపఱుచు చున్నది. నన్నయభట్టు సంహితాభ్యాసుఁడును అవిరళ జప హోమ తత్పరుఁడునై విలసిల్లు చుండెనని యవతారిక యందుఁ జెప్పఁబడినది. దీనిని బట్టి యా కాలమున జైనాది

1. E. I. 300-309
2. భారతి. XX 177-93

మతములకుఁ గూడ పోషణ ప్రచారములు సాగుచున్నను వైదిక మతాభిమానమే విరివిగా నుండెననియు వేద చోదితములైన కర్మలు యథావిధిగా జరుగుచుండె ననియు వ్యక్తమగుచున్నది.

నన్నయ వైదిక మతోద్ధరణ – నన్నయ భారత రచన :

రాజరాజు తన యాస్థాన విద్వాంసుఁడైన నన్నయను మహాభారతాంధ్రీ కరణమునకుఁ బ్రోత్సహించుట యందును నన్నయ యుత్సాహమున దానిని రచింపఁ బూనుట యందును గల ప్రధానోద్దేశ మేమో పరిశీలింప వలయును. ఆది పర్వారంభము నందలి యవతారికలో రాజరాజు నుద్దేశములు కొంతవఱకు వివ రింపఁ బడియున్నవి. అందొకటి రాజ రాజునకు భారత శ్రవణమునఁ గల యాసక్తి. రెండవది యాతని వంశమునఁ బ్రసిద్ధులైన విమల సద్గుణ శోభితు లైన పాండవోత్తముల చరిత్ర యందు వర్ణింపఁ బడుట. మూఁడవది భారత శ్రవణాభిరతి కపిల గోశత దానము వలనను బహు యాగముల నాచరించుట వల ననుగల్గు ఫలము నొసంగఁ జాలుట. పురాణములు, అర్థ ధర్మ శాస్త్రములు, నన త్కావ్య నాటకములు, ఈశ్వరాగమములు మున్నగున వెన్ని చూచినను రాజరాజు నకు మహాభారతము నందలి యభిప్రాయము వినవలెనను నభిలాషయే పెద్దదై యుండెను. అట్లుండుటకుఁ గారణమే మిగిలిన రెండుద్దేశము లందును వివ రింపఁ బడియున్నది. ఇంత కంటె భారతాంధ్రీ కరణమునకై రాజరాజు నన్న యను బ్రేరేఁచుటకు వేఱు కారణము లవతారికలోఁ జెప్పఁబడి యుండలేదు. ఇంక, నన్నయ భారతాంధ్రీకరణమునకుఁ బూనుటకు రెండు కారణములు కానఁబడు చున్నవి. అందొకటి రాజాజ్ఞ; రెండవది జగద్ధిత బుద్ధి. "సారమతి" యిత్యాది పద్యములో "నన్నయ భట్టు తెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్" అని యాతఁడే చెప్పుకొని యున్నాఁడు. ఈ "జగద్ధితంబుగన్" అను మాటలోనే గంభీరార్థ మిమిడి యున్నట్లు తోఁచు చున్నది.

రాజరాజునకుఁ జోళులతో సన్నిహిత సంబంధ మున్నది. అతఁడు పలు మార్లు చోళుల కొలువున కరుగుటయు నచ్చోటి పరిస్థితులను బరిశీలించుటయు జరిగియుండెను. చోళులు వైదిక మతాభిమానులు. తమిళమున క్రీ. శ. 8, 9 శతాబ్దుల నాటికే పెరుందేవనార్ రచితమైన మహాభారతము వెలసి యుండెను. రాజరాజు చోళుల కొలువున కరిగినప్పుడు దానిని విని యుండుటలో నసత్య

ముండదు. కాని యా తమిళ భారతము యొక్క స్వభావ మెట్టిదో మనకుఁ దెలియదు. పల్లవుల కాలమునుండియు దక్షిణదేశమున దేవాలయముల యందు భారతమును బురాణముగాఁ జెప్పించు నాచార ముండె నని క్రీ. శ. 7 వ శతాబ్దిలోఁ బరమేశ్వరవర్మ యను నొక పల్లవరా జొక దేవాలయమున భారతము పురాణముగాఁ జదివి చెప్పిన వారికై యొక యూరిలో నొక భాగమును బ్రత్యేకించుచు వ్రాయించిన తమిళ భాషాశాసనము వలనఁ దెలియుచున్నది. చోళ రాజులు తా మేర్పఱిచిన వేద పాఠశాలలో భారత గ్రంథమును బఠనీయముగాఁ జేసినట్లు (M EP. R. 1919) లోఁ జెప్పఁబడి యున్నది. ఇవన్నియు రాజరాజునకు భారతముపై నభిమానాదరము లేర్పడుటకుఁ బ్రేరకములై యుండ వచ్చును.

తూర్పు చాళుక్యులకు జ్ఞాతులైన పశ్చిమ చాళుక్య రాజులు కూడ భారతము నాదరభావముతోనే చూచుచుండి రనుటకు నిదర్శనము లున్నవి. వేంగి దేశమునుండి కన్నడదేశమునకు వలసపోయిన కుటుంబములోని వాఁడగు పంప మహాకవి క్రీ. శ. 941లో అరికేసరి యను రాజున కంకితముగాఁ గన్నడమున భారతమును 'విక్రమార్జున విజయ' మను పేర రచించి యుండెను. ఇతర కవులు భారతమును గ్రహించి కొందఱు వర్ణనా చాతుర్యమును గొందఱు కథాకథన నైపుణ్యమును బ్రదర్శించినను మూలకథను బాడుచేయకుండ దక్షతతో నిర్వహింపఁగల నేర్పొక్క పంపనికే కలదని తలంచి పండితులు ప్రేరేపఁగా నతఁ డా గ్రంథమును రచింపఁ బూని నట్లవతారికలోఁ జెప్పఁబడి యున్నది.[1] దీనిని బట్టి యాతనికి ముందు కూడఁ గొందఱు భారతము నా భాషలోఁ దమ తమ యభిరుచుల కనుగుణముగా రచించినట్లు తెలియు చున్నది. పండితు లట్లు చెప్పినను పంపఁడు సైతము భారతమును యథా మూలముగా రచించినట్లు కనఁబడదు. అతఁడు తన ప్రభువైన అరికేసరి పరాక్రమాది గుణములను వర్ణించుట కనువుగాఁ గథనుమార్చి, యర్జునునికిఁ బ్రాధాన్య మొసంగుచు, వరి

1 "కతెపిరి దాదొడం కతెయ మెయ్‌గిడ పీయదె ముం నమస్త భారత మన పూర్వ మాగె నతె పేల్ద కవీశ్వర రిల్ల వర్ణకం కతెయొ ళొడంబడం పడెయె పేర్వొడె పంపనె పేల్గు మెందు పండితరె తగుళ్దు బిచ్చటిసె పేఱ లొడర్చిదె నీ ప్రబంధమం"
(విక్ర. 1-11)

కేసరి కతనితో నభేదాధ్యవసాయము కల్పించి కథను సాగించి యుండెను. ద్రౌపదిని బంచపాండవులు కాక యర్జునుఁ డొక్కఁడే వివాహమాడుట, అర్జునునకే తుదకుఁ బట్టాభిషేక మగుట యందలి ముఖ్య విషయములు. పాండవ కథతో నవ్యవహిత సంబంధము లేని కొన్ని యుపాఖ్యానము లందుఁ బూర్తిగాఁ దొలగింపఁబడినవి పంపకవి విక్రమార్జున విజయము చివర నొసంగిన విషయ సూచికను బరిశీలించినచో నీ విషయము వెల్లడియగును. మఱియుఁ బంపఁడు వైదికమతద్వేషి కాకపోయినను జైనమతాభిమాని యగుటచేఁ గొన్ని వర్ణనములను దన్మత సంప్రదాయాను గుణముగనే కావించియున్నాఁడు. వైదిక మతము నం దాదరాభి మానములు గలవారి కట్టివి కొంత వైముఖ్యమును అసంతృప్తిని గలిగించు నను టలో వింతలేదు. రాజరాజీ విక్రమార్జున విజయమును దాని స్వభావమును గూడ నెఱింగి సహజముగా వైదిక మతాభిమానము కలవాఁడగుటచే దాని యెడ నట్టి అసంతృప్తి వైముఖ్యములనే వహించి యుండును.

కన్నడ రత్నత్రయములో మూఁడవ వాఁడగు రన్న 'సాహసభీమవిజయ' మను నామాంతరము గల గదాయుద్ధమును రచించి పశ్చిమ చాళుక్య చక్రవర్తి యగు సత్యాశ్రయుని (997-1008) కంకితము కావించెను. ఇందుఁ బంచ పాండవులలో భీముని కధిక ప్రాధాన్య మొసంగఁబడినది మఱియు రన్న కూడ పంపనివలె జైనమతావలంబియే. ఇతఁడును రాజరాజున కించుక పూర్వుఁడై యేక దేశముగ నైన భారత వస్తువును గావ్యముగా రచించిన వారిలో నొక్కఁడు. ఇది సమగ్రమైన భారత కథ కాకపోవుట చేతను జైన మతావలంబి యగు కవిచే రచింపఁబడిన దగుట చేతను రాజరాజున కధికమైన ప్రీతి కలిగించి యుండకపోవుటలో వచ్చెరువు లేదు.

ఈ విధముగాఁ దన కాలమున నుండిన యితర రాజుల కొలువులలోఁ దన కతి ప్రీతిపాత్రమైన భారత కథయే యా యా దేశభాషలలో రచింపఁ బడుట రాజరాజునకుఁ దెనుఁగునఁ గూడ దానిని వెలయింపవలె ననునభిలాషను గలిగించి యుండును. మఱియు నవి కొన్ని యసమగ్రముగను గొన్ని దృష్టి భేదము తోడను రచింపఁబడి యుండుట దానిని సంపూర్ణముగా వ్యాసాభిప్రాయానుగుణముగా రచింపఁజేయ వలె ననుసంభ్రమమును గూడఁ గల్పించి యుండును. దీనికిఁ దోడు జైన మతానుయాయులు తమ మతమును గూర్చి నిరంతర ప్రచార మొనరించుచు నతిలోకములైన కొన్ని మహత్త్వములను

బ్రిదర్శించుచు సామాన్యజనుల నా వంక కాకర్షించు చుండుట యాతని మానస మున కారాటము కలిగించి యుండును. తన తండ్రి యితర చాళుక్య రాజు లందఱి వలెఁ బరమ బ్రహ్మణ్యుఁడును, బరమ మాహేశ్వరుఁడు నయ్యుఁ దుది రోజులలో జైనాచార్యుల బోధనల కగ్గమై శ్రావకుఁడుగా మాఱిపోవుట యాతఁడు కన్నులారఁ జూచిన విషయమే. అందుచే వైదిక మతమును సామాన్యజనులకుఁ గూడ సుబోధ మొనరించి వారికి దాని యెడ నాదరాభి మానములఁ బెంపుచేయఁగల ప్రయత్న మొకటి యవశ్యకర్తవ్యమై యుండెను. సంస్కృత భారత మున్నను ఆ భాష సామాన్యులకు దురవగాహముగా నుండుటచే నాతఁ డందలి విషయమును దేశభాష యైన తెనుఁగులో రసవద్రమణీయముగా జెప్పించి వారి చిత్తముల హత్తుకొనున ట్లొనరింప వలెనని చూచు చుండెను. నన్నయ వంటి సమర్థుఁడైన విద్వత్కవి లభించుటచే నాతని యభిలాష చరి తార్థ మగుట సంభవించెను. పవిత్రమైన యాతని యాశయ మొకవంకఁ దెనుఁగు భాషకును వేఱొక వంక వైదిక మతమునకును సమానముగా దోహద మొనంగి యతని కీర్తి చిరస్థాయి గావించెను.

వ్యాసుఁడు తొల్లి వేదంబు లేకీభూతములై యేర్పడకుండ వానిని ఋగ్యజుస్సామాధర్వములుగా విభజించిన మహనీయుడు. భగవద్గీతను బ్రహ్మ సూత్రములను రచించి కర్మ జ్ఞానములు రెండింటికి ఘంటాపథమును నిర్మించిన మనీషి. ఆతఁడు వేదవిజ్ఞానమునకుఁ బురుషావతారము. ఆతఁడు భారతము నే విధముగ నెట్లు రచించెనో నన్నయ కథారంభమునఁ జెప్పియున్నాడు. "అష్టా దశ పురాణంబులను ధర్మశాస్త్రార్థ తత్త్వంబులను జతుర్వేద వేదాంతాభిప్రా యంబులను జతుర్వర్గ వర్గానుబంధ బంధుర కథేతిహాసంబులను జతుర్యుగ మహర్షి రాజవంశ చరితంబులను చతుర్వర్ణాశ్రమధర్మ క్రమంబులను జతుర్ముఖ ప్రముఖ నిఖిల సురముని గణ పూజితుండైన శ్రీకృష్ణుని మాహాత్మ్యంబును బాండవాది భారతవీరుల మహాగుణంబులను దన విమల జ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుంగుచుండ.

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని. యధ్యాత్మ విదులు వేదాంత మనియు నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని కవి వృషభులు మహా కావ్య మనియు లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహమని యైతిహాసికు లితిహాస మనియుఁ బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయం బని మహిఁ

గొనియాడుచుండ

.................. .... ......... .విశ్వజనీనమై పరఁగుచుండ" భారతమును రచించెను. ఆ విషయము రాజరా జెఱుంగును. అందుచేతనే యాతఁడు నన్నయను భారతమును దెనుఁగున రచింపుమని చెప్పునప్పుడు—

"జనమత కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్."

అని నిర్దేశించి యుండెను. వ్యాసమహర్షి మహాభారతమున నే యర్థమును విశేషించి నిరూపించెనో యా యర్థము స్పష్టమగునట్లుగా దానిని దెనుఁగున రచింపవలెనని రాజరాజు కోరిక. వ్యాస రచితమైన భారతమును దెనుఁగున రచింపుమని సామాన్యముగా నడుగక వ్యాసమునిచేఁ జెప్పఁబడిన మహా భారత మందు బద్ధమై నిరూపితమైన యర్థమేర్పడు నట్లుగాఁ దెనుఁగున రచింపుమని యడుగుట యభిప్రాయ గర్భితమై యున్నది. అది పంప భారతమువలె నసమగ్రమును, మూల భిన్నమును, మతాంతరానుకూలమును గాక సమగ్రమును మూలార్థ ప్రతిపాదకమును వైదికమతానుగుణమును గావలెనని యాతని యభిప్రాయము. నన్నయ యాతని యభిప్రాయము ననుసరించియే భారత మును రచించెననుట కొంతటముల్లైన నిదర్శనము లనేకము లున్నవి.

వైదిక మత మైహికాముష్మికాభ్యుదయ దాయకమైన మతము. అందుఁ గర్మమార్గమైనను జ్ఞాన మార్గమైనను మానవుని మోక్షలక్ష్యమునకుఁ గొనిపోఁ జాలును. నన్నయ యందుఁ గర్మమార్గము ననుగమించినవాఁడు వలెఁ గాన వచ్చుచున్నాఁడు. కర్మమార్గమున వేదములకును దచ్చోదితములైన కర్మ లకును నధికమైన ప్రాధాన్యమున్నది. ఆ రెండును బ్రాహ్మణాధీనములైనవి. అందుచేఁ గర్మమార్గావలంబులకు వేదవైదికకర్మల వలె విప్రులును బూజ నీయులగు చున్నారు. నన్నయ భారతమున వేతత్ప్రశంస బహుస్థలముల గోచరించుచున్నది. వ్యాసుని భారతమునఁ గూడ నట్టి ప్రశంస లేకపోలేదు. కాని యందు లేనిచోట్లఁ గూడ నన్నయ యెట్లో ప్రసక్తితెచ్చి తత్ప్రశంస కావించియున్నాఁడు. వైదికమత ప్రతిపాదకముగా భారతము నాంధ్రీకరించుట తప్పక జగద్ధితము నాపాదించునని యాతని విశ్వాసము. ఆ విశ్వాసమే మూల మున లేని పట్టులలోఁ గూడ నతనిచే వేదములను వైదిక విధులను విప్రజను లను బ్రశంసింపఁ జేసినది.

1. "ప్రతిహత శత్రు విక్రముఁడు, పాండవవంశ వివర్ధనుండు సు
వ్రతుఁడు పరీక్షిదాత్మజుఁడవద్య విదూరుఁ డుదారకీర్తి-ని
ర్మిత వివిధాధ్వరుండు జనమేజయుఁ డన్ జనపాలుఁడు...."

(ఆది. ౧-82)

"జనమేజయః పారీక్షితః సహ భ్రాతృభిః కురుక్షేత్రే దీర్ఘ సత్రముపాస్తే"

(అధ్యా. ౩-1)

2. జనమేజయుఁడు సోమ్రశవునిఁ బురోహితుఁ గావించుకొని యాతని నభీష్టసత్కారంబుల సంతుష్టు నొనరించెనని చెప్పిన పిమ్మట నన్నయ అమూలకమైన యీ క్రింది పద్యమును వ్రాసెను. ఇది యన్యాపదేశముగా రాజరాజనరేంద్రుని వర్ణించు చున్నట్లున్నది.

"ఆయత కీర్తితో వివిధ యాగములన్ సురధారుణీసురా
మ్నాయము నాహితాహుతి సమంచిత దక్షిణలిచ్చి తన్పుచుం
జేయుచునుండె రాజ్యము విశిష్ట జనస్తుత వర్ధమాన ల
క్ష్మీయుతుఁ డుత్తముండు జనమేజయుఁ డాది నరేంద్రమార్గుఁడై"

(ఆది. ౧-89)

3. భృగుఁ డగ్నికి శాపమిచ్చినప్పు డగ్నితాను బ్రతిశాప మీయమికిఁ గారణ మిట్లు చెప్పెను.

"అడిచినఁ దిట్టినన్ మఱి మహా పరుషంబులు వల్కి-యల్క-తోఁ
బొడిచిన నుత్తమ ద్విజులు పూజ్యులు వారల కెగ్గుసేసినం
జెడు విహముం బరంబు విది సిద్ధము గావు పెఱింగి భక్తి నె
ప్పుడు ధరణీసురోత్తములఁ బూజలఁ దన్పుదు నల్గ నోడుదున్."

(ఆది. ౧-138)

దీనికి మూలమున నొక శ్లోకార్ధమున్నది.

శక్తోహమపి శప్తుం త్వాం మాన్యాస్తు బ్రాహ్మణా మమ (అధ్యా. 7-5)

4 పై సందర్భముననే అగ్ని భృగునితోఁ దాను సర్వభక్షకుఁడైనచోఁ గలుగుహాని తెలుపుచు.

"అట్టి యేను సర్వభక్షకుండనై యశుచినైనఁ గ్రియానివృత్తి యగుఁ గ్రియానివృత్తియైన లోకయాత్ర లేకుండు" నని పలికినట్లు నన్నయ భారతమున

నున్నది (ఆది. ౧-139). ఇది యమూలకమైన రచన. ఇందుఁ గ్రియా ప్రాధాన్యమును గ్రియావివృత్తి వలని హానియుఁ జెప్పఁబడినవి.

5. అగ్ని నిఖిలలోక వ్యాప్తమైన తన తేజోమూర్తి నుపసంహరింపఁగా మూలమున

"నిరోంకారవషట్కారాః స్వధాస్వాహా వివర్జితాః

వినాగ్నినాప్రజాః సర్వాస్తత ఆసన్సుదుఃఖితాః" (అధ్యా. 7-13)

అని ప్రజలు మిక్కిలి దుఃఖించిరని చెప్పఁబడినది. అగ్న్యభావము వలని నష్టమును నన్నయ యీ విధముగాఁ బెంచి వ్రాసియున్నాఁడు.

"త్రేతాగ్నులెల్లను దేజరిల్లమిఁ జేసి క్రతుకృత్యములు వినిర్గతము లయ్యె
నగ్నిహోత్రములందు నౌపాసనాది సాయంప్రాతరాహుతులంత నుడిగె
దేవతార్చనలందు దీపధూపాది సద్విధులు వర్తిల్లక విరతిఁ బొందెఁ
బితృకార్యములఁ బితృపిండయజ్ఞ క్రియ లడఁగె విచ్ఛిన్నంబులై ధరిత్రి"
(ఆది. ౧-140)

తరువాత బ్రహ్మ "నీవు సర్వ భక్షకుండ వయ్యును శుచులందెల్ల నగ్ర పూజ్యుండవై వేదచోదితవిధానములయందు విప్రసహాయుండవై భువనంబుల నడపు" మని యగ్నినిఁ బ్రార్థించినట్లు నన్నయ వ్రాసియుండెను. సంస్కృత భారతమున గీత గీసిన భాగమునకు మూలము కానరాదు.

6. • గరుడునికి వినత భక్షణవిషయంబున బ్రాహ్మణు నెఱుంగుట యెట్లో తెల్పి నిమ్మట

"కోపితుండైన విప్రుండు ఘోరశస్త్ర మగు మహా విషమగు వగ్నియగు వతండ
యర్చితుండైన జనులకు నభిమతార్థ సిద్ధికరుఁడగు గురుఁడగుఁ జేయుఁబ్రీతి." (ఆది. ౨-61)

అని బ్రాహ్మణుని యాగ్రహానుగ్రహముల ఫలితము వెఱింగించెను. ఈ విషయము సంస్కృత భారతములో లేదు.

గరుడుని కుత్తుకకు డిగక యొక బ్రాహ్మణుఁడు నిప్పువలె నేర్పుచుండ గరుడుఁ డాతని కంఠ బిలము వెలువడి రమ్మని ప్రార్థించెను. అంత నాతఁడు నిషాదీ మమ భార్యేయం నిర్గచ్ఛతు మయా సహ'యని వేఁడు కొనఁగాఁ గరుడుఁ

డాతని నామెతోఁ గూడ వెలువడి రమ్మని చెప్పుచు "విప్రులఁబొంది యున్న యపవిత్రులు పూజ్యులుగారె" యని విప్రుల యాధిక్యమును జెప్పినట్లు నన్నయ రచించెను. ఈ వాక్యము మూలమునఁ గానరాదు.

7. యయాతి చరిత్రమునకు మొదట జనమేజయుఁడు వైశం పాయనుని

"యయాతిః పూర్వజోఽస్మాకం దశమో యః ప్రజాపతేః
కథం స శుక్రతనయాం లేభే పరమ దుర్లభామ్". (అధ్యా. 76-1)

అని యడిగినట్లు మూలమందున్నది. నన్నయ దీనిని

"వర్ణధర్మముల్ కాచుచు వసుధ యెల్ల, ననఘచరితుఁడై యేలిన యయ్యయాతి భూసు
రోత్తమ భార్గవ పుత్త్రియైన, దేవయానిని దా నెట్లు దేవిఁజేసె-"
(ఆది. 3-97)

అని యనువదించెను. ఇందు జనమేజయునికిఁ గలిగిన సందేహము యుక్తియుక్తముగా నున్నది. వర్ణాశ్రమ ధర్మములు చెడకుండ భూమిని బాలించు యయాతి తద్విరుద్ధముగ బ్రాహ్మణ కన్య నెట్లు పెండ్లియాడఁ జాలెనని యాతనికిఁ గలిగిన సందేహము. ఈ ప్రశ్న వర్ణాశ్రమ ధర్మముల సంప్రదాయమును జక్కఁగా వెల్లడించుచున్నది.

8. బొంకినను బాపమురాని సమయములు తెల్పుచు శర్మిష్ఠ యయాతితోఁ జెప్పిన శ్లోకము మూలమున నిట్లున్నది.

"న నర్మయుక్తం వచనం హినస్తి - న స్త్రీషు రాజన్న వివాహకాలే
ప్రాణాత్యయే సర్వధనాపహారే - పంచానృతా న్యాహురపాతకాని"
(అధ్యా 76-16)

నన్నయ దీనిని

"చనుఁ బొంకగఁ బ్రాణాత్యయమున, నర్వధనాపహరణమున, వధగా వచ్చిన విప్రార్థమున, వధూజనసంగమమున, వివాహసమయములందున్"
(ఆది. 3-178)

అని అనువదించెను. 'ఇందలి వధగా వచ్చిన విప్రార్థ' మనునది యమూలక మైనది.

9. కణ్వాశ్రమ వర్ణన సందర్భమున నన్నయ వ్రాసిన "శ్రవణసుఖంబుగా" (ఆది. ४-23) అను సీసపద్యమునకు మూలము కానరాదు. ఇందు శుకములు శ్రవణసుఖముగా సామగానములు చదువుటయు భూసుర ప్రవరులు భూతబలులు తెచ్చిపెట్టుటయు నన్నయ వేద వైదిక కర్మాభి రతిని జాటుచున్నవి. పైపద్యమునకు ముందున్న వచనములోని "అవిచ్ఛిన్నహూయమానాగ్నిహోత్ర స్వాహాశబ్దము లనునది" మూలములో లేని వాక్యమే. ఈ సందర్భమున మూలమందు

"లోకాయతిక ముఖ్యైశ్చ సమంతాదనునాదితమ్" (ఆది. 71-'6) అని యా యాశ్రమమున లోకాయతికులు కూడ నుండినట్లు చెప్పఁబడినది. లోకాయతికులు చార్వాకానుయాయులు; నాస్తికులు; అందుచే నన్నయ యను వాదమున నా మాటను దొలఁగించివైచెను. నీలకంఠుఁ డిచ్చట లోకాయతిక శబ్దమునకు "లోకే ఏవ ఆయతంతే తే లోకాయతికాః - తేషు లోకరంజన పరేషు ముఖ్యైః" అని వ్యాఖ్యానముచేసెను. (పుట. 135) లోకాయతము విస్థాపావ్య మగుటచే ప్రాకృతజనులకు సులభరంజకముగా నుండెనను నుద్దేశమును వ్యక్తముచేయ నాతఁ డిట్లు వ్యాఖ్యానముచేసి యుండును. కాని లోకాయతికు లను పేరుగల నాస్తికమతానుయాయులు ప్రసిద్ధులై యుండఁగాఁ బై విధమున నర్థము చెప్పుట దూరానేయముగా (Far-fetched) నున్నది.

10. పురుషవృత్తము నెఱుంగు పదార్థములను జెప్పుచు శకుంతల మూలమున

"ఆదిత్య చంద్రావనిలానలౌచ ద్యౌర్భూమి రాపోహృదయం యమశ్చ
అహశ్చ రాత్రిశ్చ ఉభేచ సంధ్యే- ధర్మశ్చ జానాతి నరస్యవృత్తమ్-"
(74అధ్యా. 30)

అని చెప్పియుండెను. నన్నయ దీని ననువదించుచు.

"విమలయశో విధీ! పురుషవృత్త మెఱుంగుచునుందుఁ జూవె -వే
దములును బంచభూతములు ధర్మువు సంధ్యయు నంతరాత్మయున్
యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు...."(ఆది. ४-79)

అని వ్రాసి యందు వేదములను గూడఁ జేర్చెను. పూర్వ మీమాంసానుయాయులకు వేదముల కంటెఁ బరమ ప్రమాణ మింకొకటి యుండదు కదా!

11. దీర్ఘతమునిఁ గొడుకులు తల్లియానతి ననుసరించి యింధనము లతో బంధించి గంగలో విడిచిరి. అతఁ డట్లు ప్రవాహమునఁ గొట్టుకొని పోవుచు "ఉదాత్తానుదాత్త స్వరిత ప్రచయ స్వరభేదంబు లేర్పడ సలక్షణంబుగా వేదంబులఁ జదువుచుండె" నని నన్నయ వ్రాసి యుండెను. (ఆది. ४-230) ఇది మూలమునఁ గానరాదు.

12. శంతనుఁ డడవిలోఁ గనిపించిన శరద్వంతు నపత్యముల నింటికిఁ గొనివచ్చి పెంచుచుండ శరద్వంతుఁ డరుదెంచి వారు తన సంతానమని యతని కెఱింగించెను. పిమ్మట నాతఁడు కృపు నుపనీతుఁజేసి "వేదంబుల్ చదివించె భూసురులతో విఖ్యాతిగా నాత్మసంవేదిం జేసె" నని నన్నయ మూలమున లేని వేదాధ్యయన విషయమును దెనుఁగునఁ జేర్చెను.

13. దుర్యోధనుఁడు కర్ణుని జన్మమును సమర్థించుచు భీమునితో "క్షత్రియేభ్యశ్చ యే జాతాః బ్రాహ్మణా స్తే చ యే శ్రుతాః" (ఆది. 137-14) అని చెప్పినట్లు మూలమునఁ కలదు. ఇది బ్రాహ్మణులకు లాఘవ పాదక మగుటచే నన్నయ విడిచివైచెను.

14. బకవధ సందర్భమున బ్రాహ్మణుఁడు తన సంతానమునకుఁ గారణ మును గుంతి కెఱింగించుచు-

"అరి యని విప్రుల చేతను, ధరణీశులు రూకయును మొదలుగాఁ గొన రె
వ్వరు విప్రాపుఁడు మానిసి, నరి గొనియెడు భక్షణార్థియై విప్రులచేన్"
(ఆది. ६-268)

అని చెప్పినట్లు నన్నయ భారతమునఁ గలదు. బ్రాహ్మణాధిక్యమును సూచించు నీ వాక్యము మూలమున లేదు.

15. బ్రాహ్మణుని నిమిత్తమై తమకుఁ బరమోపకారియైన భీముని బకుని కడకుఁ బంప నిశ్చయించిన తల్లిని గని ధర్మరాజు దుఃఖాతిశయంబున మతి భ్రమణంబయ్యెం గాకేమి యని పలుకఁ గుంతి భీముని శక్తి విశేషము నెఱింగించి,

"యో బ్రాహ్మణస్య సాహాయ్యం కుర్యా దర్థేషు కర్హిచిత్
క్షత్రియస్స శుభాన్ లోకానాప్నుయా దితి మే మతిః" (అధ్యా. 162-22)

అని చెప్పినట్లు మూలమునఁ గలదు. నన్నయ యీ యభిప్రాయమును బెంచి

"....బ్రాహ్మణులకుఁ బ్రియము పాయక చేయంగఁ గావ్చు మావె పుణ్య
కర్మ ఫలము. (ఆది. ६-283)

"జననుత బ్రాహ్మణ కార్యము. నన్ఁ జేసిన బ్రాహ్మణ ప్రసాదంబున నీ
కును నీ తమ్ములకును నగు, ననవరత శ్రీసుఖాయు (రైశ్వర్యంబుల్)
రారోగ్యంబుల్" (ఆది. ౫-284)

అని వ్రాసి బ్రాహ్మణ ప్రభావమును బ్రతిపాదించెను.

16. ద్రౌపదీ స్వయంవర వృత్తాంతము బ్రాహ్మణుని వలన విన్న పిమ్మటఁ గుంతి కొడుకులతో,

"అడుగకయు విప్రవరులకు నడరఁగ నద్దేశమున గృహస్థులు భక్తిం
గుడువఁగఁ బెట్టుదు రెప్పుడుఁ గడు హృద్యములయిన మోదకంబుల
తోడన్" (ఆది. ౬-30)

అని దక్షిణ పాంచాలమున బ్రాహ్మణులకుఁ గల సౌకర్యము నెఱింగించి యచ్చటి కరుగుదమని సూచించెను. ఈ భావము మూలమునఁ గానరాదు.

17. అంగారపర్ణుఁడు పాండవులతోఁ బురోహితు నొకని గ్రహింపుఁడని చెప్పుచు,

"సురగరుడవిషోరగ యక్షరాక్షస పిశాచ భూత గంధర్వులు నో
పరు ధిక్కరింప బ్రాహ్మణ పురస్కృతులఁ బుణ్యమతుల భూతల
పతులన్" (ఆది. ౭-59)

అని పురోహిత గ్రహణము వలని లాభములు వివరించెను. ఇది మూలమున లేదు. దీని తరువాతి సీసమునఁ బురోహిత లక్షణములుగాఁ జెప్పఁబడిన గుణములు సరిగా నవతారికలోఁ జెప్పఁబడిన నన్నయ గుణ గణములతో సరిపోవుచున్నవి.

18. కల్మాషపాదుఁడు శక్తినిఁగని తెరువు తొలఁగు మని పలుక,
"ఋషిస్తు నాపచక్రామ తస్మిన్ ధర్మపథే స్థితః-" (అధ్యా. 176-10)

అని మూలమున నున్నది. నన్నయ బ్రాహ్మణాధిక్యమును సూచించుచు,

"ఎట్టి రాజులును మహీసురోత్తము లెదు రరుగుదెంచు నప్పు డధికభక్తి
వెరఁగి ప్రియము వలికి [illegible] దీనిఁ దలఁపవెట్టు"
(ఆది. ౭-111)

అని పల్కినట్లు వ్రాసి య[illegible]ను.



19. "అనంతసంతతవ్రత నియమ ప్రభావు లగు వారలఁ
. బొందునె దేహదుఃఖముల్" (ఆది. ౩-120)

అనునది నన్నయ యమూలకముగాఁ గల్పించిన అర్థాంతరన్యాసము.

20. కల్మాషపాదుఁడు వసిష్ఠు వలన శాపమోక్షంబు వడసి కృతాంజలియై నిలువ వసిష్ఠుఁ డతనికి బ్రాహ్మణ భక్తుఁడవై జీవింపుమని యుపదేశించి.

"బ్రాహ్మణులకవజ్ఞ సేయక శమత్వము సేకొను మింద్రుఁడైన బ్రా
హ్మణుల కవజ్ఞచేసి యవమానముఁ బొందుఁ బ్రతాపహీనుఁడై
(ఆది. ౩-128)

అని మూలమున లేని బ్రాహ్మణ మహత్త్వము ప్రకటించెను.

21. అర్జునుఁడు తీర్థయాత్ర సందర్భమున వేంగీ దేశమునకుఁ గూడ నరుదెంచె నని తెల్పుచు నన్నయ కావించిన తద్దేశ వర్ణన మిదివఱకుఁ దెలుపఁ బడినది.

22. మయుఁడు బిందుసరమునఁ గల వివిధ రత్నోపకరణములు గ్రహించి సభ నిర్మించుటకు ముందు-

"దేవబ్రాహ్మణులకు నానా విధపూజనములఁ దర్పణముచేసి ధరి
త్రీవనిత కపూర్వశ్రీ. గావింపఁ దొడంగె మయుఁడు గడు రమ్యముగాన్"
(సభా. ౧-10)

అని నన్నయ దేవ బ్రాహ్మణ పూజనమును వర్ణించెను.

ఇట్లే ధర్మరాజు సభాప్రవేశము కావించిన సందర్భమున,
"మంచిగ భూరిభూసుర సమాజము లెల్లను భక్తితోడఁ బూ
జించి యభీష్ట దానములుసేసి ధనార్థులఁ దన్పి దిక్కుల
న్నించె యశంబు................." (సభా. ౧-16)

అని తెలుగునఁ జెప్పఁబడినది.

23. అగ్ని మాహిష్మతీ నగరమున కరుగుటకు వేదాధ్యయనాభిలాష కారణ మని నన్నయ కల్పించెను.

24. ధర్మరాజు యజ్ఞ దీక్షితుఁడై యజ్ఞాయతనమున కరిగినఁ సందర్భమునఁ దెలుఁగున మూలమున లేని యీ క్రింది వర్ణన మున్నది.

"బ్రహ్మ విదులైన నిఖిల బ్రాహ్మణసత్తములచేతఁ బరివేష్టితుఁడై
బ్రహ్మఁబ్ము దొప్పెఁ గురుపతి బ్రహర్షి పరీతుఁడైన బ్రహ్మయ పోలెన్"
(సభా. ౧-290)

వేదవినాదము నాశీర్వాద వినాదము ననేక వాదిత్ర మహా
నాదంబుఁ జెలఁగె వన్య వినాదంబు జనంబులకు వినంబడకుండన్.
(సభా. ౧-291)

25 శౌనకుఁడు ధర్మరాజునకు ధర్మములు చెప్పి చివర "కావున నీవు నుపశమవంతుఁడవై తపంబు చేసి యోగార్థసిద్ధి వడసి బ్రాహ్మణులనుపచరించుచు నీ మనోరథంబు సఫలంబు సేయు"మని యుపదేశించెను. ఇందలి "బ్రాహ్మణుల నుపచరించుచు" అను మాటలు మూలమునఁ గానరావు.

26. అర్జునుఁడు పాశుపతాస్త్ర సంపాదనమునకై తప మొనరింప నరుగు నపుడు ద్రౌపది యాతని కడ కరిగి

అవమానాసహమగు నీయవమ క్షత్త్రియ కులంబునం దిం కిట పు
ట్టువు గాకుండెడు సత్తమమవు బ్రాహ్మణకులమునందయందయ్యెఁడు
నాకున్" (అ. ౧-28.)

అని పలికియుండెను. ఇందు గీతలు గల పదములు నన్నయ కల్పించి నట్టివే.

27. అర్జునుఁడు మందరనగము నీడ్కొని యమరావతి కరిగిన సందర్భమున నమరావతిని వర్ణించు సీసపద్య మొకటున్నది. (అర. ౧-349). అందలి రత్నహర్మ్య విమానసంహతులు "యజ్ఞవిధులఁజేసిసురలను వసు మతీసురులను దనిపిన ధర్మాత్ములకు మహాతాపసులకు" నిలయములైనవని నన్నయ వర్ణించుట యాతనికి యజ్ఞ విధుల మహత్త్వముపైఁ గల విశ్వాస మును దెలుపుచున్నది.

28. మంకణుఁడు తనచేతినుండి శాకరసము విస్రుతము కాఁగా మచ్చి గంతులు వేయుచుండ మునులును సురలును శివునికడ కరిగి యాతని వృత్త మును మాన్పుమని వేఁడిరి. శివుఁడు వృద్ధతాపసి వేషమున నతనిజేరి తన యంగుష్ఠంబున నంగుళీ తాడనంబు కావించెను. అప్పుడందుండి హిమసన్నిభం బైన భస్మము వెలువడెను. అది చూచి మంకణుఁడు లజ్జితుఁడై నీవు పరమేశ్వ

డుఁడవని శివునికి నమస్కరించె నని మూలము. నన్నయ నమస్కరించెనని చెప్పి యూరకుండక యాతఁడు శివుని వేదమంత్రముల స్తుతియించె ననికూడఁ జేర్చియుండెను.

29. నహుషుఁడు ధర్మజునకుఁ దన శాపవృత్తాంతము నెఱింగించుచు,
"చదివితినెల్ల వేదములు సత్క్రియఁ జేసితి నూఱుయజ్ఞముల్
విదితముగా సురేంద్ర పదవీస్థితిఁ బొందితి దుర్మదంబునన్
దుదిఁబెనుఁ బామనై యధిక దుఃఖితుఁడైతి .. ..." (అరణ్య ४-121)

అని చెప్పియుండెను. వేద పఠనమును, యజ్ఞాచరణమును దన మహత్త్వమునకుఁ గారణము లయ్యెనని యాతని భావము. ఈ విషయము సంస్కృత భారతములో లేదు.

30. ధర్మరాజు నహుషునకు బ్రాహ్మణధర్మము లెఱింగించిన పిమ్మట నహుషుఁడు "నీ చెప్పిన యగ్గుణములు క్రియ శూద్రునందుఁ గల్గిన నతం డుత్తమ ద్విజుఁడు గా నేర్చునే నిజము వివిచి" యని ప్రశ్నించి మరల "అట్లైన బ్రాహ్మణాది వర్ణవిభాగ మెట్లు గలుగు నయ్య. హీనులధికులను వివేక మది యపార్థకంబుగాదె" యని సందేహ మును బ్రకటించెను. ఈ సందేహమును సంస్కృతములో లేనట్టిదే.

ఈ విధముగా సంస్కృత భారతమున లేని చోట్ల నన్నయ యజ్ఞయాగా దులయు వేదములయు బ్రాహ్మణులయు మహత్త్వములను నుద్దేశ పూర్వక ముగా వర్ణించుట చూడ నతఁడు భారతాంధ్రీకరణముచే నాంధ్రభాషా వర్ధన మను ప్రయోజనమునే కాక వైదిక మతోద్ధరణ మను ప్రయోజనమును గూడ సాధింప నెంచె నని చెప్పక తప్పదు. ఆతఁ డాశ్వాసాద్యంత పద్యములలో రాజరాజును సంబోధించునపుడు వాడిన విశేషణముల స్వభావము కూడ నీ విషయమును బలపఱుచు చున్నది. అయినచో రాజరాజు భారతాంధ్రీకరణము చేయుమని నన్నయను గోరునప్పు డా విషయము నేల చెప్పియుండలేదని యెవ్వరైనఁ బ్రశ్నింప వచ్చును. ఆతఁ డా సందర్భమున వ్యక్తము చేసిన భావములలో నా యభిప్రాయము వాచ్యముగాఁ గానరాకపోయినను వ్యంగ్య ముగా నున్నదనియే భావింప వచ్చును. ఆతనికిఁ గరం బిష్టంబులై యుండు నైదు విషయములలో "భూదేవకులాభితర్పణమహీయఃప్రీతి" యొకటి.

భారత శ్రవణమున కాతఁడు చెప్పిన ఫలములు వేద విప్రులయు యాగాచరణములయు మహత్త్వములతో సంబద్ధములై యున్నవి. "కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత మహా భారత బద్ధ నిరూపి తార్థ మేర్పడఁ దెనుఁగున" భారతమును రచింపు మనుటలో నా యభిప్రాయ మభివ్యజ్యమాన మగుచునే యున్నది.

నన్నయ మూలమున లేనిచోట్ల నైతము వేద యజ్ఞాదుల ప్రశంస చేసియుఁ గొన్ని చోట్ల మూలముననే విస్తృతముగా నున్న యట్టి ప్రశంసను సంగ్రహించి వేయుట వింతగాఁ గానిపించును. అతఁ డట్లు చేయుట కేదో కారణ ముంికియుండును. లేదా యతఁడు చూచిన భారత ప్రతిలో నవి మృగ్యములై యుండవచ్చును. లేనిచో నుద్దేశ పూర్వకముగా లేనిచోట్లఁ గూడ నా ప్రశంసను దెచ్చిపెట్టిన యతఁ డున్న వానినే విడిచి వేయుట సంభవింపదు.

1. ఉదంకుఁడు నాగలోకమునఁ గుమారషట్కముచేఁ బరివర్త్యమానమగు ద్వాదశార చక్రమును, దివ్య పురుషునిఁగాంచి "తాన్ సర్వాంస్తుష్టావ ఏభిః మంత్రవదేవ శ్లోకైః" అని మూలమున నా శ్లోకములు కూడ నొసంగఁబడినవి. "మంత్రవత్- వేదగత ఋగ్భాగవత్, తత్త్వార్థ ప్రకాశకై రితిశేషః" అని "మంత్రవదేవ" అను దానికి నీలకంఠుఁడు కావించిన వ్యాఖ్య. నన్నయ యా శ్లోకముల ననువదింపక "విపులార్థవంతంబులైన మంత్రంబుల నతి భక్తియుక్తుండై స్తుతియించిన (1-108) అని మాత్రము వ్రాసి యూరకుండెను. ఋగ్భాగవంతములైన శ్లోకముల ననువదించుట యుచితము కాదను తలంపుతో నాతఁడు వానిని విసర్జించెనని తోఁచుచున్నది.

2. మందపాలుఁడు జరిత యందుఁ బుట్టిన కుమారుల నలువుర ఖాండవంబునఁ బెట్టి పూర్వ భార్యయైన లపితతో విహరించుచు ఖాండవ దహనోద్యతుఁడై వచ్చు నగ్ని భట్టారకునిం గాంచి యాతని స్తోత్రము చేసినట్లు మూలమున నేడు శ్లోకము లున్నవి. (అధ్యా 231; 23-30) నన్నయ వాని నన్నింటి ననువదింపక "యగ్నిభటారకుం గని యగ్ని సూక్తంబుల నిట్లని స్తుతియించె", నని చెప్పి యొక్క పద్యమును మాత్రము వ్రాసి యుండెను. (ఆది ౮-300). అందైనను "నీ వఖిల ధర్మమూర్తి" వను మాట తప్ప

వేఱుస్తోత్ర మేమియుఁ గానరాదు. నన్నయ స్వభావమును బట్టి యీ స్తోత్రమును విడువవలసిన వాఁడుకాడు. ఏల విడిచెనో తెలియదు.

3. ఇట్లే భృగువు శపించి నప్పు డగ్ని తన తేజోమూర్తి నుపసంహరించుటకు ముందు తా నశుచియు సర్వభక్షకుఁడు నగుట వలని ప్రమాదములను మూలమున వివరించి చెప్పెను. (అధ్యా. 7-5-12) నన్నయ తెలుఁగున దానిని సంగ్రహించెను. కాని మూలము నందలి సారాంశ మంతయు నాతఁడు వ్రాసిన వచనములో నిమిడి యున్నది. (ఆది. 1-139).

4. గరుడుని వీఁపున నున్న యురగులు సూర్య సంతాపముచే మూర్ఛితులైనప్పుడు కద్రువ యింద్రుని గూర్చి కావించిన స్తోత్రము మూలమున బహు దీర్ఘముగా నున్నది. (అధ్యా. 26-7-17). ఈ స్తోత్ర మతిశయోక్తిమయమై యుండుటచేఁ గాఁబోలు నన్నయ సంగ్రహించి యొక్క పద్యమును మాత్రమే వ్రాసి యుండెను. (ఆది. ౨- 46).

5. సహదేవుఁడు మాహిష్మతీ పురముపై దండెత్తినప్పు డగ్ని యాతని సేనలపై నెగసె నని విని మూలమున జనమేజయుఁడు,

"కిమర్థం భగవాన్ వహ్నిః ప్రత్యమిత్రో భవద్యుధి
సహదేవస్య యజ్ఞార్థం ఘటమానస్య వై ద్విజ (సభా. 31-26).

అని యడిగినట్లు వ్రాయఁబడి యున్నది. ఇందు "యజ్ఞార్థం ఘటమానస్య" యను మాట సాభిప్రాయమైనది. అగ్ని హూతవహుఁడు. యజ్ఞప్రియుడు. సహదేవుఁ డా పురముపై దండెత్తుట రాజసూయయాగ నిర్వహణమునకుఁ దోడ్పడు కార్యము. అందుచే నగ్ని యాతనికి సహాయుఁడు కావలెనే కాని విఘ్నకారి కాఁగూడదు. అతఁడట్లు చేయుట విపరీతముగాఁ దోఁచుట చేతనే జనమే జయు డట్లు ప్రశ్నించెను నన్నయ యీ సందర్భమున,

"కరఁగి యనలుఁ డేమి కారణంబున సహదేవు సేనపయి నతి ప్రచండ

శిఖలు గప్పె దీనిఁ జెప్పు మేర్పడ నాకు ననఘ వినఁగ వేడ్కయైనయదియు"
(స. 1-252)

అని జనమేజయు నడిగినట్లు వ్రాసెను. "యజ్ఞార్థం ఘటమానస్య" అను మాట నతఁడు తొలఁగించి వైచెను. అది కూడఁ జెప్పినచో దానికి సరియైన

యుత్తరము చెప్పుట దుర్లభ మగునని కాఁబోలు నాతఁడు దానిని మెల్లగాఁ జాఱవిడిచి యుండును.

ఇట్లు నన్నయ సంగ్రహించిన వైదిక మత ప్రతిపాదకములైన భాగములు కొన్ని యున్న మాట నిజమే యైనను అట్టివాని సంఖ్య చాల తక్కువ. మఱియు నాతఁడట్లు చేయుటకుఁ గారణ మూహించుటకు వీలగుచున్నది: అందుచే వీనిని బురస్కరించుకొని భారత రచనమున నాతనికి మతోద్ధరణో ద్దేశము కూడ లేదని చెప్పుటకు వీలులేదు. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారు రాజరాజనరేంద్ర సంచిక యందును (అధ్యక్ష వచనము) శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు మహా భారత కవితా విమర్శనము నందును (పుట 95-106) భారత రచనకును వైదిక మతోద్ధరణ ప్రయత్నమునకును గల సంబంధ మును వివరించి యున్నారు. నన్నయ రచనంలోఁ గన్పట్టు కొన్ని భాగ ములు- అందును అమూలకము లైనవి- అట్టి సంబంధ ముండెనని దృఢ ముగా రుజువుచేయుచున్నవి.

---

# 15. నన్నయ – ఆంధ్ర శబ్ద చింతామణి - ఆరణ్యపర్వశేషముల కర్తృత్వము.

నన్నయను గూర్చి వ్రాయునప్పు డాంధ్రశబ్ద చింతామణ్యరణ్యపర్వశేష కర్తృత్వముల ప్రసక్తి రాకతప్పదు. ఈ విషయమున బహు కాలమునుండి భిన్నాభిప్రాయములను దదనుగుణములైన వాదోపవాదములను జెలరేఁగు చున్నవి. ఉభయ పక్షములందును బలవత్తరములైన కొన్ని యుపపత్తులు కాన నగుచుండుటచే నీ విషయము విదమిత్థమని నిర్ణయించుట కవకాశము లేకున్నది. అందుచేఁ బక్షద్వయమునకును సంబంధించిన ముఖ్యములైన యా యుపపత్తులను మాత్రమిట సంగ్రహించెదను.

ప్రక్రియా కౌముది యను నామాంతరము గల యాంధ్రశబ్దచింతామణి సంస్కృతములో వ్రాయఁబడిన యాంధ్రవ్యాకరణము. ఇందు 82 (88 అని మతాంతరము) ఆర్యావృత్తము లున్నవి. కీర్తిశేషులు కందుకూరి వీరేశలింగము పంతులు, (క. చ. Vol. I. పుట 43), చిలుకూరి నారాయణరావు గార్లును (ఆం. భా. చ. 1582-83) అభినవ వాగనుశాసన శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రులు గారును, అది నన్నయభట్ట కృతము కాదను నభిప్రాయమును వెల్లడించి యున్నారు. ఆంధ్ర కవితరంగిణీ కారులైన శ్రీ చాగంటి శేషయ్య గారు కూడ వీరి యభిప్రాయముతోనే యేకీభవించి యున్నారు. కళాప్రపూర్ణ శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులు గారు "చింతామణి విషయ పరిశోధన"మను గ్రంథమున నీ విషయము విపులముగాఁ జర్చించి చింతామణి నన్నయ రచించినదే యని నిరూపించి యున్నారు. శ్రీ గంటి జోగి సోమయాజి గా రాంధ్ర భాషా వికాసమున (పుట 156-157). "సూక్ష్మముగాఁ బరిశీలించినచో చింతామణి భారతము లేక కర్తృక మనుట మాకును సమ్మతమే" యని శ్రీ శాస్త్రులు గారితో నేకీభావమును బ్రకటించి యున్నారు.

చింతామణి నన్నయ కృతము కాదనుటకు హేతువులు :

I. క్రి. శ. 16 వ. శతాబ్ది తుదను 17 వ శతాబ్ది యారంభముననుు నివసించిన బాల సరస్వతి టీక వ్రాయువఱకు అనఁగా సుమా రాఱు శతాబ్దుల కాలము చింతామణి నెవ్వరు నెఱుంగ కుండుట.

2. కేతనయుఁ బెద్దనయు నాంధ్రశబ్ద చింతామణిని బేర్కొన కుండుట. పైఁగా కేతన "మున్ను తెలుఁగునకు లక్షణ మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద" ననియు, "సంస్కృత ప్రాకృతాది లక్షణము చెప్పి తెలుఁగునకు లక్షణము చెప్పకునికి కవిజనంబుల నేరమి కాద" నియుఁ జెప్పియుండుట.

3. బాలసరస్వతి "పెక్కు సంవత్సరము లంతర్భూతమై యున్న యీ తెలుఁగున్ వ్యాకరణంబు నల సిద్ధుండు మదిష్టదేవత విరూపాక్షుండు టీక గావింపు మంచు నా కొసఁగె" నని చెప్పిన వృత్తాంతమును, "రాజరాజనరేంద్ర తనూజుఁ డార్యనఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు నన్నయ రచించు నెడఁ బఠన మొనర్చి", కాలు సేతులు నఱుకఁబడిన పిమ్మట సిద్ధుఁడై మతంగ గిరికడ బాలసరస్వతుల కిచ్చె ననియుఁ, దన యిష్ట దైవమైన గోపాల దేవుఁడు స్వప్నమునఁ గనఁబడి "ఆంధ్రశబ్ద చింతామణి మతంగ పర్వత విప్రుని వలన నీ యింటికి వచ్చును. దానిని నీ వాంధ్రీకరించి లోకోపకార మొనరింపు" మని పలికె ననియు, నా మఱునాఁడే మతంగ పర్వత నివాసి యైన బ్రాహ్మణుఁ డొకఁడు వచ్చి తన కా గ్రంథము నిచ్చె ననియు, నప్పకవి చెప్పిన వృత్తాంతమును నభూత కల్పనలై విశ్వసనీయములు కాకుండుట.

4. "నమ్యోతోహల్యథర్వణాచార్య మతాత్" అని చింతామణిలో నన్నయకుఁ దరువాతి వాఁడైన యథర్వణాచార్యుఁడు పేర్కొనఁ బడుట. అట్లే "కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు" అను సూత్రము నందుఁ గవిభల్లటులు పేర్కొనఁ బడుట.

5. "అన్యవ్యాకరణ, కేచిత్, విదుః, ఇష్యతే" మున్నగు చింతామణి యందలి పదము లంతకుఁ బూర్వము వ్యాకరణము లుండె నని తెల్పుచుండుట.

6. "అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః", "సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యత్ర ద్రుతప్రకృతికేభ్యః" అను సూత్రమునఁ బదాది యకార మంగీకరింపఁబడుట; ఇది భారతమున లేకుండుట.

7. నన్నయ ప్రథమ పురుషేకారమునకు వైకల్పికసంధి పాటింపఁగా "నిత్య మనుత్తమ పురుష క్రియాస్వితః" అని చింతామణి నిత్యసంధి విధించుట.

8. "వసతి రనుబంధ కస్యాత్ర్యద్యత్ర లదరో వివక్షిత స్త్రత్ర, అస్తిరను బంధక స్యాద్యత్ర ల్యదర్థో వివక్షితో ధాతోః" అను సూత్రములందు వర్తమా నార్థమున కున్నానుబంధమును, భవిష్యదర్థమునకు కలానుబంధమును విధింపఁబడుట.

9. నన్నయ భారత మందలి పెక్కు ప్రయోగములకుఁ జింతామణిలో గతి లేకుండుట. చింతామణి సూత్రముల వలన నిష్పన్నములగు పెక్కు రూపములు నన్నయ భారతమునఁ గాని తత్కాల శాసనములందుఁ గాని లేకుండుట. కూర్చి, గుఱించి, కొఱకు, పట్టి, యొక్క మున్నగు చింతా మణిలోఁ జెప్పఁబడిన విభక్తి ప్రత్యయములు భారతమునఁ గానరాకుండుట.

10. "చింతామణి సమగ్ర గ్రంథము కాకుండుట. దాని యందలి పరిభాష యందును సూత్రరచన యందును, భాషయందును, అనేకములగు లోపము" లుండుట. "అందుచే నది నన్నయ కృతము కాదన్నచో నాతని కీర్తిగౌరవములకు లోపము లేకుండుట" (చి. నా).

11. చింతామణి వలనఁ దత్సమాచ్ఛి కాంధ్ర భాషయందు సందేహ ములు లేకుండ నొక్క రూపము కూడ నేర్పడఁ జాలకుండుట.

12. శబ్ద శాసన బిరుదము నన్నయకు భారత రచన వలననే వచ్చినదని జక్కన విక్రమార్క చరిత్ర యందు వ్రాయుట.

"వేయి విధంబులందుఁ బదివేవురు పెద్దలు సుప్రబంధముల్
పాయక చెప్పి రట్లు రసబంధుర భావ భవాభిరామ ధౌ
రేయులు శబ్దశాసన వరేణ్యులు నాఁగఁ బ్రశస్తి కెక్కరే
యే యెడ నన్నపార్య గతి నిద్ధర నట్టి మహాత్ముఁ గొల్చెదన్"

పై హేతువులను ఖండించుచుఁ జింతామణి నన్నయ కృతమే యని నిరూ పించుటకు శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిలుగారు చూపిన యుప పత్తులు :—

1. సంస్కృత శబ్దములను దెలుఁగులోనికిఁ దెచ్చుకొను పద్ధతులను జూపుటకు మాత్రమే చింతామణి రచింపఁ బడుటచే నాంధ్ర వాఙ్మయము

ప్రబలిన వెనుక నది ప్రచారమునకు దూరమై చిరకాల మంతర్హితమగుట సంభవించినది.

2. చింతామణి తెలుఁగునకు లక్షణ మనపించుకొనదని తలంచి కేతన తనకుఁ బూర్వము తెనుఁగునకు లక్షణము నెవ్వరును జెప్పియుండలేదని వ్రాసి యుండును. అదిగాక చింతామణి కేతనకుఁ దెలియనంత మాత్రముచే నది యంతకు ముందు లేదనుట యుక్తము కాదు. ఆంధ్ర కౌముదీకారుఁడు కూడ నిట్లే వ్రాసికొని యుండెను. అందుచే నది సర్వ వ్యాకరణములకుఁ బూర్వ భావి యని యంగీకరింప వగునా?

3. బాలసర్వతి చేసిన సిద్ధుని కల్పనము విశ్వసనీయము కాకపోవుట నిజమే. అది తనకు హఠాత్తుగా లభించిన హేతువునఁ బ్రాచీనుల యలవాటు చొప్పున నాతఁడు సిద్ధుని కల్పనముచేసి యుండును. ఆ కల్పననే యప్పకవి పెంచి యుండును.

4. అథర్వణ కారికలు చింతామణికి వివరణగ్రంథ మగుటచేఁజింతామణి దానికన్నఁ బ్రాచీనతర మనుట నిర్వివాదము. "అథర్వణాచార్యమతాత్" అను అప్పకవీయ చింతామణిలోని యథర్వణ స్మరణ పాఠము ప్రక్షిప్తము. అప్పకవి ప్రతిలోని యాంధ్రలిప్యుద్ధారక శ్లోకములు చింతామణి నన్నయకృతమే యని స్థాపించుచున్నవి. కవిభల్లటుఁడు క్రీ. శ. 1230 సంవత్సరము వాఁడని భావించుట కాధారము లేదు.

5. "కేచిత్, విదుః, ఇష్యతే, అన్యే, వదంతి శాస్త్రారః, అన్యేషాం చ ప్రయోగ మహితానాం" మున్నగు పదములు నన్నయ తాను రచించిన చింతామణియందుఁ గూడఁ బండిత సంఘముల యభిప్రాయమును బ్రశంసించి యాదరించుచు వచ్చెనని తెలుపు చున్నవి. చింతామణికిఁ బూర్వ మాంధ్ర వ్యాకరణము లుండె ననుట విశ్వసనీయము కాదు.

6. "స్వస్థావ వేష భాషాభిమతాః సంతః"- "సిద్ధిర్లోకాద్దృశ్యా" మొదలగు కారికలు చింతామణి ప్రాథమికావస్థను బోధించుచున్నవి. చింతామణి సంస్కృతశబ్ద సాధన పరము. తరువాతి వ్యాకరణము లాచ్ఛికశబ్ద సాధన ప్రధానములై యున్నవి.

7 యేఁబది పోయెన్. (యాఁబది, పోయన్) మున్నగు శబ్దముల సాధ్వసాధుతా నిర్ణయము చేయుటకే నన్నయ "అద్యః" ఇత్యాది సూత్రము వ్రాసెను. ప్రకృతులగు శబ్దముల సిద్ధికి వ్యవహారము నాధారముగా గ్రహింప వలసిన యవస్థలోఁ జింతామణి రచింపఁబడ కున్నచోఁ దరువాతి వారెవ్వరు నంగీకరింపని పదాది యకారమును దత్కర్తయు నంగీకరించి యుండఁడు. కాఁగా పదాఁది యకారాంగీకారము చింతామణి ప్రాచీనతకుఁ బ్రబలాధారము పదాది యకార సందర్భము నన్నయ భారత ప్రయోగములకు విరుద్ధము కాదు. "సర్వత్రాజ్వత్కార్య" మ్మను సూత్రము భారత ప్రయోగములకు విరోధించునప్పుడు మఱి యే గ్రంథమునకు విరోధింపకుండును ? ఆ పక్షమున బాలసర్వతి మాత్రము చింతామణిని వ్రాసె నన్నమాట యెట్లు పొసగును ?" (చింతామణి విషయ పరిశోధన. 40 వ. పుట.)

ప్రథమ పురుషేకార సంధి నిత్యత్వము చింతామణి ప్రాథమికత్వమును సూచించుచున్నది. పాదాంతము లందుఁ దప్పఁ బ్రథమ పురుషేకార సంధ్య భావము నన్నయ భారతమునఁ గానరాదు.

8. "అస్తి రనుబంధక స్స్యాత్" "వసతి రనుబంధక స్స్యాత్" అను సూత్రములకు 'ఉండు' 'కలుగు' అను ధాతువు లనుబంధము లగుననియే కాని "ఉన్న" "కల" అనున వనుబంధములగు ననునర్థము లేదు. ఉన్నాఁడు, కలఁడు మున్నగు దేశ్య క్రియలను జింతామణి సాధింపఁ బూననే లేదు. భారతమున ఉన్నాఁడు, ఉన్నావు అను ప్రయోగము లెచ్చటను లేవు. 'ఉన్నవాఁడు,' 'ఉన్న వాఁడను' వంటి ప్రయోగములు మాత్రమే యున్నవి.

"అనుబంధ ప్రార్థన యోర్ణా వ్యతిరేకాదికేచ చోః పస్స్యాత్" అను సూత్రము వలన "నుతింపుచున్నాఁడు" అను వానియందు వలె చకారమునకు పత్వము రాదు. అట్టి ప్రయోగములు నన్నయ భారతములో లేవు.

9. చింతామణియు భారతము నేక కర్తృకము లనుటకుఁ బెక్కు సూచన లున్నవి. "స్వస్థాన వేష భాషాభిమతాస్సంతః -సత్సభాంతర సరసీ వనంబులు- విశ్వ శ్రేయః కావ్యమ్ - శ్రీ కంధరాః శ్రేయసే." అను చోట సత్, శ్రేయః శబ్దముల ప్రయోగము రెండింట సమానముగా మన్నది. భారత చింతామణులు రెండును బ్రసాద గుణమునే యాదరించుచున్నవి. చింతామణి

'త్రాడ్లు' మొదలగు రూపములు సాధించెను. నన్నయకుఁ గూడ 'ళ్లు' వర్ణాంతములు కాక 'డ్లు' వర్ణాంతములే సమ్మతములు. ఆంధ్రశబ్ద చింతామణి సాధించని తత్సమధాతు రూపములను నన్నయ వాడి యుండలేదు. ఎదగాగమ దుగాగమాంత రూపములకుఁ గాలనియమము లేదు. కాలవివక్ష లేని ధాత్వర్థ మాత్రమున నవి ప్రయోగింపఁబడును. సందర్భమును బట్టియే వాని కాలము స్ఫురించును.

10. నన్నయకు శబ్దశాసన బిరుద మాంధ్రశబ్ద చింతామణి రచన వలననే కలిగినది. భారతావతారికలోఁ "దనకుల బ్రాహ్మణు" నిత్యాది పద్యము వనే యా బిరుదము వాడఁబడినది. అందుచే భారత రచన వలననే యాతని కా బిరుదు వచ్చెననుట ప్రామాదికము

11. చింతామణి నన్నయ భట్టారక కృతమనుట పండితపరంపరా ప్రసిద్ధము.

పై యుపపత్తులను బరిశీలించి చూడఁ జింతామణి నన్నయ కృతమే యను వారి వాదమే బలవత్తరముగాఁ గానిపించుచున్నది. దీనికి వ్యతిరేకముగా నింతకంటె బలవత్తరమైన హేతువులు వొడసూపువఱకు మనమట్లే భావింప వలయును.

ఇట్లే అరణ్యపర్వ శేష రచన విషయమునఁ గూడ రెండు భిన్నమతములున్నవి. దానిని నన్నయయే రచింపఁగా శిథిలితములైన భాగములను మాత్రమే యెఱ్ఱాప్రెగ్గడ పూరించె ననుపక్ష మొకటి. నన్నయ "శారద రాత్రు" లను పద్యము వఱకును వ్రాసి దివంగతుఁడు కాఁగా నెఱ్ఱన యరణ్య పర్వ శేషము నంతను రచించె ననుపక్షమొకటి. ఈ రెండు పక్షములకును గల యుపపత్తుల నిట వివరించెదను

నన్నయయే వ్రాసె ననువారు చూపు హేతువులు :

1. అరణ్య పర్వము చివరఁ గల పద్యములలో నెఱ్ఱన "అరణ్యపర్వ శేషము పూరించె" నని వ్రాయఁబడినది. అరణ్య పర్వమును బూరించె ననఁగా నతఁడు శేష భాగమునంతను వ్రాసెనని చెప్ప వచ్చును. ఆ పర్వశేషమును

పూరించె నన్నప్పు డందలి శిథిల భాగములను మాత్రమే వ్రాసె నను నర్థము కలుగు చున్నది.

2. నన్నయ భట్టు సరస సారస్వతాంశ ప్రశస్తి తన్నుఁ జెందె ననఁగా నాతఁడు వ్రాసిన గ్రంథము (అరణ్యపర్వ శేషము) నందలి కొంత భాగము (అంశము) తనకు లభించె ననియు, లుప్తమైన దానిని దాను బూరించె ననియు భావము. తత్కవితారీతియుఁ గొంతదోఁప యను దానికిఁ గూడ నిదే యర్థము.

3. "అం దాది తొడంగి మూఁడు కృతు లాంధ్రకవిత్వ విశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయ భట్టు దక్షతన్" అని తిక్కన తాను మూఁడు పర్వములను జూచినట్లు చెప్పుచున్నాఁడు. అట్లు మూఁడు పర్వములు తననాఁటికిఁ బూర్తిగా నుండుట చేతనే యాతఁడు నాల్గవ పర్వము నారంభించెను. లేవిచోఁ బదునేను పర్వములు ముగించిన పిమ్మట నైన నరణ్యపర్వ శేషమును బూరించి యుండఁడా?

4. తిక్కనయే కాక యాతని శిష్యుఁడైన మారనయు "భారత సంహితన్ మును త్రిపర్వము లెవ్వఁ డొనర్చె నట్టి విద్యారమణీయు నాంధ్ర కవితాగురు నన్నయ భట్టుఁ గొల్చెదన్" అని నన్నయయే మూఁడు పర్వములను రచించినట్లు చెప్పెను. అప్పకవి "ఆ మూఁడు పర్వములలో నా మాన్యుఁడు నుడువు తెనుఁగు లరసికొన కృతుల్, తాము రచించిరి తిక్కసుధీమణి మొదలైన తొంటి తెనుఁగు కవీంద్రుల్" అని చెప్పుట కూడ నీ యర్థమునే సూచించుచున్నది.

5. ఎఱ్ఱన రెండుచోట్ల అరణ్య పర్వశేషోన్నయ మని "ఉన్నయ" శబ్దమును వాడెను. ఉన్నయ మనఁగాఁ బైకిఁ దీసికొని వచ్చుట. క్రిమిదష్టమై యుండుట చేతనో మ తే కారణము చేతనో యెడనెడ లుప్తమైన అరణ్యపర్వ శేషము నాతఁడు పూరించి వెలుంగునకుఁ గొనివచ్చె నని దీని యర్థము.

6. తిక్కన విరాటపర్వాదిని "వారల వనవాస సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె" నని పూర్వ కథతో యోజించినాఁడు. సవిస్తరంబుగా విని యనుమాట యరణ్యపర్వ కథ యప్పటికిఁ బూర్తిగా నున్నట్లు సూచించు చున్నది.

7. విరాటపర్వ ప్రథమాశ్వాసమున నజ్ఞాత వాసమునకు ముందు ధర్మజుఁడు :

"తండ్రి నీవు నాకు దయతోడ నిచ్చిన వరము చిత్తగింపవలయు తెలుఁగు
సమయసముచితముగ సమకట్టు మయ్య యీ రాచమారు లవిధిఁ
బోకయుండ" (విరా. ౧-181)

అని ధర్మదేవతను బ్రార్థించెను. ధర్మదేవత వరమిచ్చిన కథ యరణ్యపర్వ శేషాంత భాగమున నున్నది. అది తిక్కన చదివి యుండనిచో నా పూర్వ కథ ననుసరించుచు నిట్లు వ్రాయుట కవకాశము లేదు

8. అరణ్యపర్వ శేషము రచించినచో నన్నయకువలెఁ దనకుఁ గూడ నేదో యమంగళము చేకూరునను భీతిచేఁ దిక్కన దానిని విడిచె ననుట యసంగతము. యాదవ నిర్యాణము, యుద్ధపంచకము రచించిన మహ నీయున కిట్టి యమంగళ భయ భ్రాంతి నారోపించుట న్యాయము కాదు. అతఁడు ధీరోదాత్తుఁడు పిఱికివాఁడు కాదు.

9. శారద రాత్రులను పద్యము చివర "....లంబరపూరితంబులై" అని వ్రాసి నన్నయ అరణ్యపర్వ శేషమింకఁ బరపూరితమగు నని సూచించె ననుట పొరపాటు. అట్లు శబ్దమును విఱిచినచోఁ బద్యార్థము కుదురదు "....లం బరి పూరితంబులై" యనుట సరియైన పాఠము.

10. "కథ జగత్ ప్రసిద్ధి కావునఁ బూర్వ పర్వార్థయుక్తి సేయు నట్టి యెడల, యత్నమించుకంత యైనను వలవదు, వలసినట్లు చెప్పవచ్చి యుండు" అని విరాటపర్వావతారికలోఁ దిక్కన వ్రాసిన పద్యమునకు "కథ జగత్ప్రసిద్ధమైనది కావునఁ బూర్వ పర్వమునఁ గొంత భాగము లేకపోయినను దదర్థ యుక్తిసేయుటకై యత్నము చేయవలసిన యక్కఱ లే" దను నర్థము చెప్పరాదు. "వారల వనవాస సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా వివి" యనుమాట యిందుకు బాధకము. నిర్వచనోత్తర రామాయణమునఁ బూర్వ రామాయణ కథను సంగ్రహముగాఁ జెప్పినట్లిచ్చట జెప్ప నక్కఱలేదని యాతని భావము.

11. అరణ్యపర్వ శేషమున నన్నయ రచన, సమాసముల-కూర్పు పెక్కు చోట్లఁ గనఁబడుచున్నది. అరణ్యపర్వ శేషమునందలి కొన్ని

సీసములలో గీతములలో యతి విషయమున నన్నయ కావించు కొన్ని నియమములు గోచరించుచున్నవి. (అర. ౪-154; ౪-167; ౪-353; అటవెలఁది-అర. ౫-132; ౫-221; ౪-321; తేటఁగీతి. ౫-328, ౪-401 ౫-195).

12. నన్నయ తరువాత నెవ్వరును మధ్యాక్కరలను వాడియుండ లేదు. ఎఱ్ఱన కూడ వాడి యుండఁడు. నన్నయ రచించిన మధ్యాక్కరలే శిథిలములై యుండఁగా నెఱ్ఱన సవరించెను ఆ సవరించుటలో యతి భేద మేర్పడెను.

13. ఆశ్వాసాంత గద్యలలో స్పష్టముగా "సకల సుకవిజన వినుత నన్నయభట్ట ప్రణీత" మని కవఁబడు చుండఁగా నది యెఱ్ఱన రచియించినదని కొనుట యనుచితము.

"అరణ్యపర్వ శేషము నెఱ్ఱన పూరింప లేదు; అది యతని రచనయే" అనువారు చూపు హేతువులు :

1. వ్రాఁత ప్రతులలో శారద రాత్రు లను పద్యము తరువాత "ఇక్కడ మండి యెఱ్ఱాప్రెగ్గడ కవిత్వ" మనుమాట కానవచ్చుచున్నది.

2. ఎఱ్ఱాప్రెగడ యారణ్య పర్వాంతమున నన్నయ భట్ట మహా కవీంద్రు సరస సారస్వతాంశ ప్రశస్తి తన్నుఁ జెందుటయుఁ దా నరణ్య పర్వ శేషము పూరించితి నని స్వయముగాఁ జెప్పుకొని యున్నాఁడు. అక్కడనే కాక నృసింహ పురాణములోఁ గూడఁ దా నారణ్యపర్వశేషోన్నయమును నిర్వహించితి నని తెల్పుకొని యున్నాఁడు. స్వల్ప భాగము మాత్రమే వ్రాసిన తాను దానిని దనపేరు మీఁదుగనే ప్రకటించి యుండినచోఁ దన కీర్తి కాంత వెల్లడి యగునను భీతిచేతనో, తనకు నన్నయ మీఁదఁ గల భక్తి విశేషము చేతనో యతఁ డాశ్వాసాంతగద్యలయందు నన్నయ పేరే పేర్కొని యుండును.

3. చిరకాలమునుండి యెఱ్ఱనను గవిత్రయము వారిలో నొకనిగాఁ బరిగణించుట పరిపాటియై యున్నది. పలువురు కవు లతనిని గవిత్రయము వారిలో నొకనిఁగాఁ బేర్కొని స్తుతించి యున్నారు. అతని వంశముననే జనించిన చెదలువాడ మల్లయ యతఁ డారణ్యపర్వశేషమును రచించినట్లు వ్రాసి యున్నాఁడు.

4. తిక్కనాదులు నన్నయ మూఁడు కృతులు రచించె నని చెప్పుట 'సుమారు' గాఁ జెప్పినమాట. ఆ మాటలను యథాక్షరముగా గ్రహింప కూడదు. (తిక్కన నన్నయ భారతభాగమును చూడనే లేదనియు; నాతఁడు నన్నయ మూఁడు పర్వములు వ్రాసె నని విని నాలవ పర్వమును మొదలిడె ననియుఁ గొంద ఱభిప్రాయ పడుచున్నారు-(మహా భారత కవితా విమర్శనము. పుట 118).

5. తిక్కన తాను రచించు భాగమును హరిహరనాథదేవుని కంకితము చేయ నెంచెను. అరణ్య పర్వమునఁ గొంత భాగము రాజరాజున కంకితమై పోఁగా మిగిలిన భాగము నా దేవుని కంకితము చేయుట తన కిష్టము లేకయుఁ దా నొక మహాకార్యము నారంభించునప్పు డితరులు కొంత చేసి విడిచిన సగము భాగము నుండి యారంభించుట కిష్టము లేకయు నాతఁడు నాలవ పర్వము నారంభించి యుండును. అంతేకాని అరణ్య పర్వశేషమును రచించినచోఁ దాను గూడ నన్నయ వలె మృత్యువు వాతఁబడుదునేమో యను భయ మాతనికుండె ననుట యుచితముకాదు. అతఁడు మహనీయుఁడు. అట్టి మూఢ విశ్వాసములకుఁ దావిచ్చువాఁడు కాఁడు.

6. "కథ జగత్ప్రసిద్ధి కావునఁ బూర్వ పర్వార్థయుక్తి చేయునట్టి యెడల యత్న మించు కంత యైనను వలవ" దని చెప్పుట యాతని నాఁటి కారణ్య పర్వశేషము అసమగ్రముగానే యుండె నని తెలుపుచున్నది అతని తరువాత నెఱ్ఱాప్రెగ్గడ దాని పూరించి (రచించి) యుండెను.

7. అరణ్య పర్వము నందలి పెక్కు పీసములందును, ఆటవెలఁది తేట గీతులందును నన్నయ కావించుకొన్న నియమములు పూర్తిగాఁ గానవచ్చుట లేదు. మధ్యాక్కరలలో యతి విషయమున భేదము కనఁబడుచున్నది.

8. ఎఱ్ఱన నన్నయ కవితారీతి కొంత తోఁచునట్లుగాఁ, జదివినవారు నన్నయ రచన యే యనుకొనునట్లుగా, నారణ్య పర్వశేష రచన కావించి యుండుటచే నందు నన్నయ కవితా పద్ధతి కానవచ్చు చుండును. అంత మాత్రముచే నది నన్నయ రచనయే యని భ్రమింపరాదు.

9. ఎఱ్ఱన తన రచన నన్నయ రచన వలెనే యుండవలె నని యెంత యత్నించినను నైసర్గికమైన యాతని కవితారీతి అరణ్య పర్వశేషమునఁ గాన వచ్చుచునే యుండును. అతనిలోఁ దిక్కన కవితారీతి కూడఁగొంత కాని పించును.

10. నన్నయ రచించిన యారణ్య పర్వశేషము సుమారు రెండు శతాబ్దుల కాలము సురక్షితముగా నుండి తిక్కన తరువాత హఠాత్తుగా శిథిలమైన దనుటయు, నన్ని ప్రతులలో నొకచోట నుండియే శిథిలమై యుండుటయు విశ్వసనీయములు కావు.

ఈ విధముగా నెఱ్ఱన శేషభాగ రచన కావించె ననియు, శిథిలభాగ పూరణము నొనరించెననియు, విరు తెలుఁగుల వాడించుట కవకాశము కలదు కాని మధ్యాక్కరలలో యతి భేదము కానవచ్చుటయుఁ, గొన్ని సీసము లందు నన్నయ కావించుకొన్న నియమములు కానరాకుండుటయుఁ జూడ నరణ్య పర్వశేషము నెఱ్ఱనయే రచించె నని తోఁచు చున్నది. ఒకవేళ నన్నయయే యా భాగమును గూడ రచించె ననుకొన్న నన్ని ప్రతులలో నొకే భాగమొక చోటనుండియే శిథిలమై పోవుటయు, నా శిథిల భాగముననే యెఱ్ఱన యతిభేదము తోడ మధ్యాక్కరలను వ్రాసెననుకొనుటయు నుచితముగా నుండదు.

30 041

## ఈ గ్రంథము నందలి ముఖ్య పదముల అకారాద్యనుక్రమణిక.

అ



ఆ

గ



చ



ఛ



జ



డ



త



ద

## ధ



## న



## ప

బ



భ



మ

## య



## ర



## ల



## వ

